# గీతావాణి

**25**

మూడవ సంవత్సరము ★ మొదటి సంచిక.

ఆనరరీ ఎడిటర్ - స్వామి శ్రీ శంకరానంద
అసోసియేట్ ఎడిటర్ - స్వామి శ్రీ రామకృష్ణ

## శ్రీ గీతా సాహిత్య సేవాసమితి

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

★

**15 జులై 1953.**

# విషయసూచిక - జులై '53.





## గీతాసాహిత్య సేవాసమితి కార్యాలయ ప్రకటన.



★ గీతావాణి సంపాదకులగు శ్రీ యన్. శ్రీకంఠంగారు తమనివాసమును (గుళ్లదుర్తి) కోయిలకుంట్లనుంచి బనారస్‌నకు మార్చుకున్నారు. కాన గీతావాణిలో ప్రచురణకొరకు పంపేవ్యాసములు వగైరాలు సరాసరివారికే ఈ క్రింది చిరునామాకు పంపప్రార్థన.

N. SHRIKANTAM., EDITOR—GEETAVANI.
THE KASHI VIDYA PEETH, BANARAS-2.

చిరునామా ఇంగ్లీషుభాషలో వ్రాస్తే త్వరగాచేరటానికి వీలవుతుంది. ప్రతినెల మొదటి తేదీకే పంపాలి.

ఆళ్లగడ్డ. 15—7—1953.  — కార్యాలయకార్యదర్శి.




స్వస్తిశ్రీ విజయ – జ్యేష్ఠమ్

[illegible]

అయిదువేల సంవత్సరాలైనగాని,
వీసమంతైన నీ పస తీసిపోదు,
ఘనత నీదియొ కృష్ణువాక్శక్తియేమొ,
అదియుగాక వ్యాసుని హస్తవాసి యౌనొ॥ 1

ఏగె నొకయేడు రెండవయేడు గడిచె
కాలగమనంబులో కడగండ్ల మధ్య,
వారిజాక్షుని సందేశ వాహనముగ
చల్లగా యెల్లపుడు వర్ధిల్లు తల్లి! 2

అల తృతీయ వర్షారంభమందు నీకు
చంద్రునికి నూలుపోగన్న సామెతగను,
అప్పగించితి మిదె కవితాంక మెలమి
స్వీకరించి సేవకుల నాశీర్వదింపు ॥

అడుగుపే తరువాయి నిస్స్వార్థ సేవ
జేసి – పద్యాల పాటల వ్రాసి పంపి
నట్టి, కవిపుంగవులకు జోహారులిత్తు
మెల్లపుడు వారికృపకు దోసిళ్ల చాచి ॥

జ్ఞానయజ్ఞంబు గీతాప్రచారమందు
ధనసహాయంబు చేసిన ధన్యులకును,
ఆయురారోగ్య భోగభాగ్యాదికములు
సిరిమగండిచ్చునట్లుగా చెప్పుమమ్మ ॥

సారగీతార్థతత్త్వ ప్రసారమునను
కృష్ణుడును అర్జునుడు కూడికొంద్రుగాక !
తెలివియు బలంబు నొద్దిక మెలగుగాక !
గుణము ధనము సమశ్రుతి కుదురుగాక !

యుక్తియును శక్తి యొకమాట నుండుగాక !
శ్రేయమును ప్రేయమును జతచేరుగాక !
జ్ఞానవిజ్ఞానములు మైత్రిసలుపుగాక !
భారతావని స్వర్గమై బరగుగాక !!







( జూన్ నెల సంచిక 7-వ పేజి తరువాయి. )

"యజ్ఞో వై విష్ణుః" అనగా విష్ణుభగవంతుడు యజ్ఞరూపుడై యున్నాడు; అని శ్రుతి చెప్పినది, కాబట్టి యజ్ఞశబ్దము పరమేశ్వరునకు వాచకమనుట తగును. పరమేశ్వరార్థముగ చేసెడి నిత్యనైమిత్తికాది కర్మములు యజ్ఞార్థకర్మములనబడును. ఇట్టి నిష్కామకర్మములనువదలి స్వర్గాది ఫలముల నాశించి కామ్యకర్మములందు ప్రవర్తించెడి కర్మఠులు కర్మబంధములకు లోనగుచున్నారు. అంతియే కాని, భగవదారాధనకొఱకు చేయబడెడి నిష్కామకర్మములు బంధహేతువులు కాజాలవు. "కర్మణా బధ్యతే జంతుః" — ప్రాణులు కర్మముచేత బంధింపబడుచున్నారనెడి స్మృతివాక్యము సకామకర్మలనుగూర్చి చెప్పబడినదియే కాని నిష్కామకర్మలనుగూర్చి చెప్పినదిగాదు. సకామకర్మములె బంధకరములు గాని, నిష్కామకర్మములు గాదు. అందువలన ఓ అర్జునా! స్వర్గాది ఫలాపేక్షనువదలి కేవల పరమేశ్వరారాధనార్థముగ నీవు చేయదగు నిత్యనైమిత్తిక కర్మములను శ్రద్ధాభక్తి పూర్వకముగ ఆచరించుము.



ఇది యంతయు చిత్తశుద్ధికొఱకై కర్మముల నాచరించెడి కర్మాధికారుల దృష్టి ననుసరించి చెప్పిన

మాట. దీనినే జ్ఞాని యొక్క దృష్టి ననుసరించి చెప్పవలసి వచ్చినచో — ఆత్మస్వరూపము స్వభావముగ అకర్తయని, దాని యొక్క అకర్తృత్వమును గురు తించుటే "యజ్ఞము". మరొక్క విధమున చెప్పవలయునన్న — తన యొక్క అహంకారము మిథ్యయని, ఆ మిథ్యాహంకారముయొక్క ప్రతీతికి అధిష్ఠానమగు తన ఆత్మస్వరూపమును తెలిసికొనుటకే యజ్ఞమని చెప్పెదురు. ఇదియే నిజమగు యజ్ఞము. తాను అకర్తననెడి జ్ఞానము లేక, అజ్ఞానముతో తాను కర్తనని భావించి చేసెడి కర్మయెట్టిదేయైనను అది బంధమునకు కారణమగుచున్నది. కర్తృత్వబుద్ధియు, ఫలాసక్తియు బంధమును కల్గించుచున్నవి.

ఓ పార్థా! కర్తవ్యకర్మను వదలుట చాల తప్పు. అదియొక దుష్టకర్మమే. ఏదో వ్యామోహమునకు పాల్పడి నీ కర్తవ్యకర్మమును మానకుము. నీ ధర్మమగు యుద్ధమునొనర్పుము. కర్తవ్యపాలనమునకై కర్మములను చేయుటయే, మానవుడు కర్మబంధములనుండి విముక్తుడగుటకు తగిన ఉపాయము. భోగార్థమగు కర్మాచరణము కర్మ బంధమును కల్గించును. అజ్ఞానయుక్తమనస్సును పోషించుకర్మము బంధకరమనియు — జ్ఞానయుక్తమనస్సును పోషించెడి కర్మము మోక్షకరమనియు తెలియుము. నేను చేసెడి పనికి భౌతికముగ ప్రయోజనమేమి? అది యింద్రియములకు అనుకూలమా? ప్రతికూలమా? అనెడి విచారములను త్యజించి, పవిత్రము అపాపవిద్ధము నిర్వికారము ప్రభావాతీతమునగు ఆత్మయొక్క తుష్టిపుష్టులకొఱకు నీవు నీ యుద్ధమును చేసినచో బంధములనుండి దాటిపోగల్గుదువు. ఒక్కవేళ నీవు భౌతికపరిస్థితులకు బానిసవై కర్తవ్యకర్మమును నిష్కామముగ చేయుట మానినచో అదియె నిన్ను బంధించగలదు.

సంబంధము:— పై శ్లోకమునందు యజ్ఞముకొఱకు కర్మమును చేసెడి మనుష్యుడు బంధమునకు చిక్కడని చెప్పబడినది. అయితే యజ్ఞమనగనేమి? దానినాచరించుట యెట్లు? అనెడి విషయముల నిక ముందు వివరింపవలసియున్నది.

(శ్లో॥ 10) ఈ శ్లోకమందు ముఖ్యముగ "యజ్ఞము ప్రజలతో సహకలిసి ఉత్పన్నమైనది"—అనెడి విషయమును తెలిసికొనవలసి యు

న్నది. మనుష్యులతో డ్త మాత్రమే యజ్ఞముకల్గినదని యిచ్చటి అర్థము కాదు. ఈ సమస్త చరాచరములు, వృక్షాదులతో సహా కలిసియే సంభవించినదని తెలియవలయును. అయినను, మనుష్యుడు జ్ఞానజీవి కాబట్టి తన తోడుత యజ్ఞకర్మముద్భవించి యున్నదనియు, ఆ యజ్ఞము ను తాను ఆచరించవలెననియు తెలియగల్గుచున్నాడు. తెలిసి ఆచరించుచున్నాడు. పశు పక్షి వృక్ష వనస్పతులు మొదలగు పంచభూతములును మరియు ఆయా సజీవ నిర్జీవ ప్రాణులును తమతో డ్త యజ్ఞము సంభూతమైయున్నదని తెలియకనే స్వాభావపతితముగ యజ్ఞము నాచరించుచున్నవి. మనుష్యుడు మాత్రము ఈ యజ్ఞమును బుద్ధిపూర్వకముగ చేయవలసియున్నది. ఎందుకనిన — తాను జ్ఞానయుక్తప్రాణి కాబట్టి.

యజ్ఞముతోడ కలిసియే చరాచరప్రాణులు సంభవించియున్నవనుటకు ఋజువేమి? ఋజువుకలదు. ఈ చరస్థిరప్రాణులన్నియు యజ్ఞమును చేయుచునే యున్నవి. కాని అవి తాము యజ్ఞమును చేయుచున్నామని తెలియకనే చేయుచున్నవి. సూర్యుడు ఎడతెఱిపిలేక ప్రకాశించుచున్నాడు. ఆయన తనకుగల శక్తిని లోకహితార్థమై నిరంతరము సమర్పించుచున్నాడు. విశ్వరూపపరమాత్మకు తన కైంకర్యమును సదా చెల్లించుచున్నాడు. నిశాచరులగు దుష్టులకు భయమును కల్గించుచు సదాచారులగు సజ్జనుల కాహ్లాద మొనర్చుచు ప్రపంచమునకు జీవనశక్తిని ప్రసాదించుచున్నాడు. ఇవియన్నియును సూర్యుడు స్వాభావముగ చేసెడి యజ్ఞక్రియలు. అహంకారమును వదలి, యితరులను భగవత్స్వరూపులుగ భావించి వారికి తన శక్తి సంపదలను సమర్పించుటయే నిజముగ యజ్ఞము

సూర్యుని తర్వాత అంతరిక్ష నివాసియగు వాయువు యజ్ఞచక్రమును అనుసరించుచునే యున్నది. సర్వజీవరాశికి — వృక్షములకు సైతము ప్రాణదాన మొనరించుచున్నది. అది ఒక్క క్షణమాత్రము తన యజ్ఞసేవను మానినచో ప్రాణులన్నియు నిర్జీవములగును. అట్లే అంతరిక్షమునందు నివసించెడి మేఘముకూడ సూర్యునివలె వాయువువలె సర్వదా యజ్ఞమును నిర్వ

[ మిగత 9-వ పేజీలో చూడుడు. ]



ఓమ్

# విషాదయోగము

కవి: పూజ్యపాదస్వామి శ్రీకేశవతీర్థజీ

ఎడిటర్ — రామదర్శనము.

శ్రీ రామతీర్థ సేవాశ్రమము,

పిడుగురాళ్ల, గుంటూరు జిల్లా.

1

గీ॥ భయదజీవన రణరంగ భాగమందు
తనర నిలచితి విషయశాత్రవుల గెలువ.
కాని యెదలోనిధైర్యము కదలిపోయె
దీనదశ పొందినాడను దేవదేవ!

2

గీ॥ ధైర్యగాండీవ మిదెజారి ధరణి బడియె
నేను దేహరథంబున నిలువజాల.
ఈజగత్కర్త భూమికే నేల వచ్చి
నాడ? హరీ! యదునాథ! చెప్పుము.

3

గీ॥ విషయవాసనా శత్రుల పీచమణప—
నాకు లభియింపగలది శూన్యంబెకాద?
శత్రు లెవ్వరు నారక్త సన్నిహితులు!
వారి జంపుటలోవచ్చు భాగ్యమేమి?

4

గీ॥ ఆహవావనిలోన కోలాహలముగ
మ్రోయు శంఖధ్వనంబులు, మురవిదారి!
బంధుకాంతల రోదన ధ్వనుల బోలె.

భయద భేరీరవంబులు బంధుసతులు
గుండెలను బాదుకొని యేడ్చుచుండురీతి
శ్రవణముల బడుచున్నవి సారసాక్ష!

5

గీ॥ స్వార్థమునకయి హితులను బంధువులను
చంపనుండిన ననుజూచి సర్వజనులు
నవ్వుచుండిన తెఱగున నాథ! అవిగో
అశ్వహేషలు వినవిచ్చు, హరి! ముకుంద!

6

గీ॥ సర్వబంధు సంహారము సలుపుకొనుట
నన్ను నేను, చేజేతనణంచుకొనుటె!
దీన లభియింపగలదేమి? దేవదేవ!
చేయజాల సంగ్రామము చేయజాల.

7

గీ॥ ఆత్మదేవ! కృష్ణా! శరణార్థినోయి!
చేరి కర్తవ్య పథమును చెప్పవేమి?
శ్రీద గీతాప్రబోధము చేయవేమి?
ఓజగద్రథసారథీ! ఓకృపాబ్ధి!

---

[ శ్రీమద్భగవద్గీతా ప్రవచనము 7_వ పేజీ తరువాయి. ]

హించుచున్నది. మేఘము తన సర్వజీవనమును పరోపకారమునకై యే ధారపోయుచున్నది. మేఘమందలి జలకణములన్నియు యజ్ఞార్థముగనే వినియోగ మగుచున్నవి. తన సొత్తును రవ్వంతయు తాను వాడుకొనక సమస్తమును పరోపకారార్థముగ వినియోగించుటయందు మేఘమద్వితీయమైనది. పరోపకారరూపమగు యజ్ఞకర్మ నిర్వహణమునందు మేఘము చివరి కొనను ముట్టినది.



# ★ స్థితప్రజ్ఞుడు ★

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
కవిరాజ, కవిసార్వభౌమ, చెన్నరాష్ట్రప్రభుత్వ ఆంధ్ర ఆస్థానకవి
శ్రీ శ్రీ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులవారు.



పరసమాధిస్థుఁడై స్థితప్రజ్ఞుఁడైన
వాని నెట్లు పలుకవచ్చు వాని పలుకు
బడులు నెట్లుండు కేశవా ! వానిదైన
స్థితిగతులరీతి యెట్టిది చెప్పవయ్య.

అని అర్జునుండడిగిన భగవంతుండిట్లనియె.

ఎపుడును మనోగతములగు నెల్ల కామ
ములను విడనాడి ప్రత్యగాత్ముని నిజాత్మ
నరసి చూచుచుఁ బరితుష్టుఁడైన వాఁడు
చను స్థితప్రజ్ఞుఁడనఁగ నో సవ్యసాచి !

అనిశ దుఃఖమైన నడకల సుఖమైన
నలరఁ బోక మనమునందు రాగ
మును భయంబు క్రోధమును వీడుముని స్థిత
ప్రజ్ఞుఁడనఁగ నొప్పుఁ బాండుపుత్ర.

ఏయెడ ననభిస్నేహుం
డై యుండి శుభాశుభంబులం దానందం
బాయత దుఃఖము నొందని
ధీయుతునకుఁ బ్రజ్ఞ సుప్రతిష్ఠితమ యగున్.

కూర్మము నిజాంగములఁ బోలెఁ గోవిదుండె
వండు విషయ సమూహము వలన నుండి
సర్వదా ఇంద్రియంబుల సంహరించు
వాని ప్రజ్ఞ ప్రతిష్ఠితమౌను జుమ్మె.

రాగము దక్కఁగ విషయము
లేగు నిరాహారుఁడై నయేని ధరిత్రిన్
రాగమునేగును బరముం
దాఁగనుఁగొనఁ జాలియుండినన్ గురుముఖ్యా.

చదివి మేధావియై జతనించుచుండెడు
వాఁడైన పురుషుని వఱలుచున్న
యింద్రియంబులు కడున్ హెచ్చి బలాత్కార
ముగ హరించుఁ గలంచివుచ్చి మనము
నది గాన వాని సంయమనంబు గావించి
యోగి మత్పరుఁడయి యుండవలయు
వశ్యేంద్రియుండగువాని ప్రజ్ఞ వినిశ్చ
యాత్మకంబయి సత మలరుచుండు

విషయచింతవలన వెలయుసంగము దానఁ
గామమొనఁగు దానఁ గలుగుఁ గ్రోధ
మందువలన మోహమగు దాన స్మృతిచల
నంబు దాన బుద్ధి నాశమగును.

బుద్ధి నాశనంబునంజేసి పురుషుండు నశించు మఱియు రాగద్వేష విముక్తంబులై వశ్యంబులైన శ్రోత్రాదీంద్రియంబులు గలవాఁడై విషయంబులం జరించియు స్వాధీనాంతఃకరణుండైన పురుషుండు స్వస్థుండగునట్టివానికి సర్వదుఃఖములును సమసిపోవు వాని బుద్ధియు నిశ్చయంబై యుండునని చెండియు,

తెలియ శుద్ధాత్మ విషయబుద్ధియును భావ
నయు నయుక్తునకున్ లేనివయగు నాత్మ
నిష్ఠ లేకున్న శాంతిలేనిద యశాంతు
నకు సుఖంబెప్పటికి లేదనంగనొప్పు.

చలియించు నింద్రియంబుల
వలనంబడి మెలఁగుమనము వరయతిప్రజ్ఞా
బలము హరించున్ సాగర
జలమందున్నావ గాలి చందముఁదోఁపన్.

ఇంద్రియార్థంబులవలన నింద్రియముల
నెల్లయెడలను మరలింప నెవఁడు చాలి
యుండు నిమ్మహి నమ్మహాయోగి ప్రజ్ఞ
సుప్రతిష్ఠితమగునని చూడు మనఘ.

సర్వభూతములకు రాత్రిసరణి నప్ర
సన్నమగు బుద్ధి సంయమి జాగరూకుఁ
డగును భూతములకు విషయసుఖ మొసఁగు
బుద్ధి నిశవోలెనగుఁ జూచు మునికిఁ బార్థ.

అంతట నిండియుం జలనమందని నీరధినీరు సేరు న
ట్లింతయు నెల్ల కామములు నెవ్వనిఁ జొచ్చి విలీనమొందునో
శాంతినిఁబొందు నాపురుషసత్తముఁ డావిజితేంద్రియుండులో
నింతయు శాంతిలేక చెడు నెంతటివాఁడును గామకామియై.

ఏ పురుషుఁడు కామంబుల నెల్లఁ దెల్ల
ముగ విడిచి నిరహంకారుఁడుగను నిర్మ
ముఁడుగ నిస్పృహుఁడుగనుండు పురుషుఁడతఁడు
శాంతినొందెడునని నమ్ము సదమలాత్మ.

ఇదియే బ్రహ్మప్రాప్తికిఁ
బదమగు స్థితి దీనిఁబొంది పండితుఁడగువాఁ
డెద మోహమొందఁడీగతి
వదలక నిర్వాణమందు వర్ష్మము వోవన్.

— శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.



# ఆదిషట్క గీతాసారము.

విద్వాన్ కావ్యతీర్థ శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రులవారు.
కవితా సామ్రాజ్యము, నంద్యాల.



మ॥ మమతాబంధము దుఃఖకారణము, సమ్యగ్దర్శన ధ్వంసకం
బమితాజ్ఞాననిదాన మిట్లగుటఁ గాదా? వీరవిక్రాంతశీ
లము పెంపారెడువానికేనియును వైక్లబ్యంబు పైముట్టి శో
కముపాల్సేసెను నర్జునున్ గనుక వీఁగన్ బోలుఁ దద్బంధముల్.

శా॥ నిత్యుండై తగు జీవునిన్ గుఱిచి హానిన్, వృద్ధి శంకింపరా;
దత్యంత స్థితధీప్రయుక్తి మునియై యాత్మావబోధంబుతో
సత్యంబున్ గమనింపఁగావలయుఁ బ్రజ్ఞాయోగరూఢాత్ముఁడై
కృత్యంబుల్ నిరహంకృతిన్ నెఱపుచున్ గ్రీడింపనౌ నాత్మలోన్.

మ॥ ఒకటన్ జ్ఞానికి జ్ఞాననిష్ఠ తగ, వేఱొక్కంటఁ గర్మాధికా
రికిఁ గర్మంబె యవశ్యకార్య మగుఁ; తత్కృత్యంబు నిష్కామమై
సకలాదర్శముగాఁ బ్రవర్తిలవలెన్ స్వర్గంబు మర్త్యంబు కొం
డొకసంబంధముతోఁ బరస్పరము శ్రేయోవృద్ధులన్ వర్ధిలన్.

మ॥ ఎవ రేరీతిఁ దనున్ భజించినఁ దదీయేచ్ఛానురూపంబుగా
నవుదున్ దత్ఫలదాత నన్న భగవద్వ్యక్తిత్వమున్ గాంచి సం
భవమౌ కర్మఫలంబు సర్వమును దద్బ్రహ్మార్పణం బంచు య
జ్ఞవిధుల్ దీర్చుచు యోగనిష్ఠుఁ డయి యుండన్ బోలు నిర్లిప్తుఁడై.

మ॥ స్తిమితత్వంబున యోగయుక్తుఁ డయి కర్తృత్వాభిమానంబు లే
క, మనోబుద్ధుల నింద్రియంబుల నొగిన్ గావించు కార్యంబులన్
సమదర్శిత్వము గల్గి వెల్గి విగతేచ్ఛా సాధ్వసక్రోధుఁడై
విమలాంతర్ముఖుఁడై ప్రశాంతి గన నౌ విజ్ఞానసంపన్నతన్.

తే॥ ఫల మపేక్షింపకయ కర్మ సలుపవలయు
నద్దియే కర్మసన్యాస మనఁగవలయు.
నిత్య మాత్మానుసంధితో నెగడవలయు
ఆత్మ దర్శన లబ్ధితో నలరవలయు.

మ. వేం. సు. శాస్త్రి.

# "నిమిత్త మాత్రం భవ"

రచయిత:—స్వామి శ్రీ రామకృష్ణజీ,
అసోసియేట్ ఎడిటర్ - గీతావాణి





ఓరి జీవుడ! వినవోయి ఒక్క—మాట
నేను నేనంచు నూరక నిక్కి—చెడకు,
శివుని యనుమతిలేనిదే చీమకుట్ట
దాకు అల్లాడదనుట విన్నావొ లేదొ!!

గంటలదొ నిముషాలదొ సెకండ్లదో - యెది
యైన - ముల్లు, తనంతతా నాడలేదు,
ఆ మెయిన్ స్ప్రింగు శక్తిచే నాడుగాని,
అటులె నీవు నీయింద్రియాల నువిసరము,
స్వాయముగా నేమి చేయగా జాలవయ్య,
అన్నిటికి మూలమై హృదయాంతరమున
సర్వసంచాలకుండు యీశ్వరుడు గలడు,
ఈ యచంచల సత్యంబు నెఱుగుమోయి॥

రహిని యీ విశ్వనాటకరంగమునకు
సూత్రధారియతండీవు పాత్రధారి,
వన్న నీకేమి స్వాతంత్ర్యమున్నదొ చెపు
విడుమహంకృతి హెచ్చుపోకడల బోక॥

ఇది జగన్నాథునిరథంబు యిందొకండు
తక్కువేమి? యెక్కువయేమి?—తరలిపోవు,

చేయిమోపి నీ వంతును చెల్లజేసి,
హాయిగా పాల్గొనుము రథయాత్రలోన॥ 4

విశ్వరూపగోపాలుడు వేడ్కతోడ
నిన్ను పిల్లనగ్రోవిగా నిలిపి, మధుర
గాన మాలాపనము సేయ గడగినాడు,
తెలివిమాలి అపశ్రుతి పలుకకోయి!! 5

విశ్వమొకపూర్ణవారాశి యిందు నీవు
ఒక్క జలబిందువంతెపో! యెక్కువేమి
తక్కువేమయ్య! మాను నీ నిక్కునీటు
ధన్యుడవుకమ్ము చేసి స్వాత్మార్పణమ్ము॥ 6

నరుడ! సర్వకర్త నారాయణుడె సుమీ
మధ్యలో నిమిత్తమాత్రమీవు,
యెండుటాకు గాలి కెగిరిపోయెడి భంగి
మెలగు మతని ప్రేరణలకు లొంగి॥ 7

శ్రీరామకృష్ణ బ్రహ్మచారి.



రచనలు పంపునపుడు తమ పూర్తిచిరునామాలు వ్రాయటం చాలా అవసరం. క్రొత్త రచయితలు ముఖ్యముగా దీనిని గుర్తుంచుకో ప్రార్థన. పోస్టల్ చిరునామాలు లేని కొన్ని రచనలు మాకువస్తున్నాయి. వారికి ఏ విషయముగానీ తెలుపుటకు మేమసమర్థులమౌతున్నాం. దయతో గమనించండి. కాగితానికి ఒకేప్రక్క వ్రాయండి.

— N. S. నందీశ్వర్,

గీతావాణి, కోయిలకుంట్ల. పి. ఎ. టు ది ఎడిటర్.

# "అనన్యాశ్చిన్తయన్తో మాం"

రచయిత — శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారు



చ॥ అదిరొక పుణ్యకాలము మ
హామహిమాన్విత భక్తితత్పరుల్
బొదలుచు భారతావనిని
పూతమొనర్చుచు నుండిర త్తరిన్
సదమలభావ సంయుతుడు
శాంతుడు విష్ణుపదానుభక్తి సం
పదగల సద్విజోత్తముడు
వాసము చేయుచునుండె నొక్కచోన్.

తే॥గీ॥ ఆతడుండిన దొకపట్నమందు నున్న
బాలకులు నిత్యమునువచ్చి పాఠములను
చదువుచుందురు విద్యను శ్రద్ధతోడ
గఱపు నాతడు ప్రతిఫలకాంక్షలేక.

తే॥గీ॥ బుడుతలకు పాఠములజెప్పి భక్తితొఱకు
బొక, గీతను చేబూని బుద్ధినందె
యంకితముజేసి చదువును యన్నవాంఛ
జేయడదియేమి దృఢమైన స్థిమితమబ్బ.

తే॥గీ॥ ఆతడట్లుండ యింటిలో యన్నమునకు
నూకలుండవు నిత్యము పాకముండ
దందుచే భోజనమునకు యమ్మ బిలువ
బోవునేకాని లేకున్న లేవడతడు.

తే॥గీ॥ పిన్నవారలు గురునిపై ప్రేమతోడ
పప్పుబియ్యము గొనివచ్చి యప్పుడప్పుడు
తల్లిచెంగట యర్పించి తరలిపోదు
రదియె జీవించవారి కాహారమపుడు.

సీ॥ ఈవిధంబుగ కాల మేగుచునుండగా
వరుసగా నొక పరిపాకమునకు
సంభారములులేక సాగెను మున్నాళ్ళు
సహజోపవాసంబు జరిగె వారి
కంత నాల్గవరోజు యర్భకులకు విద్య
జెప్పి గీతనుదీసి చేతబూని
భావయుక్తంబుగా పఠియింప మొదలిడె
నాతని కనుదమ్ము లట్టె నిలిచె.

తే॥గీ॥ పొంగిజాల్వారె భాష్పముల్ బుద్ధియందు
దోచె యాశ్చర్య చింతలు దుర్భరముగ
మూర్ఛవనధిలో క్షణమట్లె మునిగియుండి
తేలి మెల్లగ కలమును దీసికొనియె. 6

వ॥ అట్లు కలంబు కేలంబూని తా జదువుచున్న గీతయందలి నవ మాధ్యాయంబున జపమాలయందుండు మేరుపూసకై వడి యల రారు "అనన్యా చింతో మాం" యను శ్లోకంబున కిరువైపుల గీటులం గీకి విచారజలధిం మునిగియుండెనప్పుడు. 7

చ॥ నవనవలాడు కాయమును
నవ్యసరోజముబోలు మోము మా
నివర మనోకాంక్షిత వి
నిర్మల సుందరమూర్తి బాలుడై
సవినయభావ మేర్పడగ
సర్వపదార్థము లొక్కతట్టలో
వివిరముగాగ నుంచి కడు
వేడుకజేర్చెను తల్లి చెంగటన్ 8

తే॥గీ॥ ఆమె బాలకుని వదనం బట్టెచూచి
భీతమానసయై కడుప్రేమ పొంగ
తండ్రి యేమిది నీమోము దమ్మియందు
కారుచున్నది రక్త మేకారణమున

ఆ॥ సద్గుణంబులెల్ల సమకూర్చుకొని యిట్లు
మూ ర్తి దాల్చినావు ముద్దుబిడ్డ
రాచకొడుకు వీవు రమణీయరూపమే
చేతు లెవరికాడె చేయనిటుల .10

చ॥ అని యిటులామె యాతురత
నందుచుఁ బల్కఁగ బాలుడిట్లనున్
అనినటువంటి వాక్యమును
యమ్మరొ పాలనజేయనై తి నీ
తనయుడు దాని కీపగిది
దండనజేసెను న్యాయమేకదా?
ఘనులగువారి శిక్షణము
కౌశలప్రజ్ఞను బొందజేసెడిన్ 11

తే॥గీ॥ బిడ్డడిట్లని నేఁబోదు దొడ్డతల్లి
అన్నమును జేసిపెట్టు మాయయ్యగారు
కడుపుమంటతో నున్నారుగాదె? మీరు
వ్యసనమొందగ నేటికం చరిగెనట్లు. 12

తే॥గీ॥ బాలుడటు మాయమైపోవ పరవశత్వ
మంది నెమ్మదిగా స్మృతినంది మఱల
పాకవస్తువు లచ్చటవదలి వేగ
తనయుడున్నట్టి బడికేగె తల్లడిలుచు. 13

తే॥గీ॥ చూచి పుత్రుని యచ్చోట శోకముబ్బ
"తనయ! రాకొమరునటుల దయను వీడి
చీల్చినాడవె రక్తము చిందునట్లు
చిన్నబిడ్డని నీవిట్లు చేయదగునె. 14

చ॥ జనపతి జూచెనేని తగు
చర్చను దీసుకరాడె నీవయిన్
ఘనలగువారి బిడ్డనిటు
కారియబెట్టిన మోనమంచు నీ

మనమున దోపదాయె" అను
మానముబోవిడి రాజుచెంగటన్
వినయముతోడ జెప్పకొని
వేడుము తండ్రి క్షమించునట్లుగాన్ 15

క॥ అని యిట్లు తల్లి బల్కగ
మనమున యాశ్చర్య శోకమగ్నుండగుచున్
జననీ నాకేది తెలియదు
ఘనుఁడగు శ్రీకృష్ణదేవు కరుణామహిమే. 16

క॥ చదువుచునుండితి గీతను
యదియేమొ యన్యచింతలన్నియు విడినన్
మది దలచువారి యోగము
కుదరగ క్షేమంబు నేను గోరి వహింతున్. 17

క॥ అను యర్థముండు శ్లోకము
గనబడె నాకండ్లయెదుట కలవరపడి నే
మనమున నేమిది కృష్ణుఁడు
కనఁడా తను నమ్మినాని కరుణేరాదే! 18

క॥ ఇది యెవ్వరైన గీతలా
పొదవించిర యేమి యనుచు పొరిపొరి మదిలో
కదనము జరుగగ తుదకే
నెదియును నూహించజాల కిటులనుకొంటిన్ 19

తే॥గీ॥ సత్యమనునది గూఢిగా స్పష్టపడదు
గీట్లనుంచెదనని దలచి గీకినాడ
శ్లోకమున కిరువైపుల చోద్యమివివె
కృష్ణదేవుని చెంపల గీటులాయె. 20

తే॥గీ॥ అహాహా శ్రీకృష్ణదేవుడే యమ్మ నీకు
సకలసంభారములనిచ్చి జనెనుగాని
కాడు మనరాచకొమరుడు కన్నతల్లి
ధన్యవైతివి యాదేవు దర్శనమున. 21

తే॥గీ॥ అనుచు యాదేవు సద్దయ నాత్మదలచి
గద్గదంబగు స్వరముతో కనులనుండి
భాష్పములురాల నుతిసల్పి పరవశుడయి
తేలి గీతాఘనంబును దెలిపెనిటుల. 22

తే॥గీ॥ శంకగల్పింప గీతలో స్థలములేదు
దివ్యవాక్యోపదేశ సందీప్తితోడ
వెలయు శాస్త్రము గీతయే విశ్వమందు
దీనిమించిన గ్రంథంబు తెలియబడదు. 23

తే॥గీ॥ అనుకొనుచు దాను తల్లియు ననవరతము
కృష్ణదేవుని మహిమను కీర్తనముల
పాడుకొనుచు గీతను భక్తిపఠనచేసి
మోక్షపదమును జేరిరి మోదమలర. 24

*

జూన్ సంచికతోనే చందాలు ముగిసినవారికి విజ్ఞాపన.

★

**ఆత్మీయా!** గతసంచికతోనే మీచందా ముగిసినదనియు, చందా **మొత్తము**ను నాలుగు రూపాయలను మణియార్డర్ ద్వారా పంపి సహాకరించవలసినదనియు విజ్ఞాపన చేసియుంటిమి. మీనుంచు చందాధనము ఇంత వరకురాలేదు. పత్రిక అవసరములేదను విషయమైనా మీరు తెలుపలేదు. అయినాగానీ సహాకరించగలరను విశ్వాసముతో ఈసంచికనుగూడా మీకు పంపుచున్నాము. వెంటనే చందామొత్తమును మణియార్డర్ చేసిగీతామాత సేవలో తోడ్పడగలరను పరిపూర్ణ విశ్వాసముతో మరొకవరి అర్థించుచున్నాము. మీ మిత్రులనుగూడా చందాదారులుగా చేర్చ ప్రార్థన.

గీతావాణి, — స్వామి శివానంద,
ఆళ్ళగడ్డ. మేనేజర్. 15-7-53

సీసమాలిక

# భగవద్గీతారత్నమాలిక.



[భగవాన్ శ్రీ రమణ మహర్షులవారు తక్కువ మాటలతో (రచనలతో) ఎక్కువ భావాలను అందించుటలో సర్వశ్రేష్ఠులు. గీతలోనుంచి నిత్యపారాయణకు నలుబది రెండు అమూల్య శ్లోకాలను ఎన్నుకొని ఉండినారు. ఇందులో జ్ఞానపరమైన గీతలోని ముఖ్యవిషయాలన్నీ వరుసక్రమంలో జత పరచి ఉంచినారు. శ్రీ రమణాశ్రమ భక్తులు ముఖ్యంగా ఆ నలుబది రెండు శ్లోకాలనే పారాయణ చేస్తుంటారు. ఆ శ్లోకాలను సీసమాలిక రూపంలో శ్రీ గుర్రం వేంకటసుబ్బరామయ్యగారు ఆంధ్రీకరించారు.

—సంపాదకుడు.]



అనియె సంజయుఁ: డట్టు లతికృపావిష్టుఁడై కన్నీరు మున్నీరుగాఁగ నేడ్చు
నరునితో నిబ్భంగి నారాయణుఁడు పల్కె: గాత్ర మిది, దర్జునా, క్షేత్ర మండ్రు;
గాత్రమ్మెఱుంగువాఁడు క్షేత్రజ్ఞుఁడండ్రు; సర్వక్షేత్రములను క్షేత్రజ్ఞుఁడేనె;
క్షేత్రమున్ దద్భిన్న క్షేత్రజ్ఞుఁ దెలియు జ్ఞానమ్మె జ్ఞానమ్మని నా మతమ్ము;
సర్వభూతాశయసంస్థితాత్మను నేనె; యఖిలభూతాదిమధ్యాంత మేనె;
పుట్టఁ దప్పదు చావు, గిట్టఁ దప్పదు పుట్టు; తప్పనిదానికై తగదు వగపు;
పుట్టఁడు గిట్టఁ డెప్పుడు నాత్మ; యీతండు లేక కలుగఁ, డుండి లేకపోఁడు;
అజుఁడుఁ బురాణుండు నవికారి నిత్యుఁడై; చావఁగా దేహమ్ము చావఁడితఁడు;
చీల్పఁ గాల్పఁగఁ దడిచేయ నెండింపఁగా దితఁడు నిత్యుఁడు సర్వగతుఁ డచలుఁడు,
స్థాణుఁ డీతఁడు సనాతనుఁడు; సర్వవ్యాపి యవినాశి హతమార్ప నలవికాఁడు;
ఉన్నది లేకపో, దుండదు లేనిది; యీ రెంటి గతి జ్ఞాను లెఱిఁగినారు;
సర్వగతమ్ము సూక్ష్మత నింగి యంటన, ట్లఖిలదేహగతాత్మ యంటువడఁడు;

దేని వెల్గింపరో భానుచంద్రాగ్నులు, నవ్యక్త మక్షర మంద్రో దేనిఁ,
బరమగతిని దేనిఁ బ్రాపించి మరలరో యదె నా పరంధామ మని యెఱుంగు;
ఆ యవ్యయపదమ్ము నందెడువారలు సంగదోషములపై జయముఁ గాంచి,
మానమోహమ్ముల మని, మౌఢ్యముఁ బాసి, సుఖదుఃఖము లటన్న జోడు వీడి,
కామధాటిని గడుగండు దవ్వున మరల్చి, నిత్యాత్మనిష్ఠులై నెగడు జనులు;
మఱి శాస్త్రవిధి నెల్ల మంటలోఁ గలుపుచుఁ గామపరాధీనగతిని మెలఁగు
నే నరుం, డాతండు గాఁడు సిద్ధిని, గనఁడు సౌఖ్యముఁ బరగతిని గనఁడు;
సర్వభూతమ్ముల సమముగా నెలకొని యవి నశింపఁగ నాశమందనట్టి
పరమేశ్వరునిస్వరూప మెవండు చూచునో యాతఁడే చూపు గలట్టివాఁడు;
ఇట్లు తత్త్వమున నన్నెఱుఁగ జూడఁగఁ జేర, ననితరభక్తిచే నలవియగును;
అందఱిశ్రద్ధ సత్త్వానురూపమ్మగు; దానఁ బురుషుఁడు శ్రద్ధామయుండు;
ఎవఁడెట్టిదగుశ్రద్ధ నెనయునో యాతండు తదనురూపుఁడె యౌచుఁ దనరు, నయ్య,
శ్రద్ధాళువై తత్పరత్వము గల్గి, యింద్రియనిగ్రహమ్ము సాధించు నెవఁడొ
ఆతఁడు జ్ఞానమ్ము నంది వెన్వెంటనే పరమమౌ శాంతిని బడయుఁజుమ్ము;
సతతమ్ము నాపయి మతి నిల్పి ప్రీతి పూర్వకముగ భజియించువారి కేను
నను వారు పొంద సాధనరాజ మగు బుద్ధి యోగమ్ము వేగమ్మ యొసఁగువాఁడ;
వారికే యనుకంప వహియించి నే నాత్మ భావస్థితుండనై ప్రజ్వరిల్లు
జ్ఞానదీపమున నజ్ఞానసంభూతమౌ చీఁకటి నాశమ్ము సేయువాఁడ;
జ్ఞానముచేత నజ్ఞాన మెవ్వారికి నాశమౌ వారి కనంతరమ్ము
జ్ఞాన మయ్యది చండభానునికైవడిఁ దానె వెలుగఁజేయుఁ దత్పరమును;
పరఁగు నింద్రియములు పరము, లింద్రియముల కన్నను మానసం బెన్నఁ బరము,
మనసుకన్నను బరమ్మని యెన్నఁబడు బుద్ధి, బుద్ధికన్నఁ బరుండు పో యతండు;
ఇట్లు బుద్ధికిఁ బరుం డెవఁడొ వాని నెఱింగి స్తంభనం బొనరించి తననె తాను,
దుర్జయుండైన శత్రునిఁ గామరూపుని హతమార్పవయ్య, మహాభుజుండ;
మంట కట్టెలను భస్మమొనర్చుగతిఁ గర్మముల నెల్ల జ్ఞానాగ్ని బూదిసేయుఁ;
ఎవ్వానికర్మమ్ము లెల్లను గామసంకల్పవర్జితములై, జ్ఞానమనెడు
నగ్నిచే దగ్ధమ్ములైనవో, యాతనిఁ బండితుం డనెదరు ప్రాజ్ఞులవని,
తలఁగి కామక్రోధములను, మానస మరి కట్టి, యాత్మ నెఱింగినట్టి యతుల
కుర్వి నెల్లెడ బ్రహ్మనిర్వాణ మమరి వర్తిలుచుండుఁ, గ్రొత్తగాఁ గలుగఁబోదు,
చెదరనిధైర్యమ్ముఁ జేకొన్నబుద్ధిచే నుపరతి మెలమెల్ల నొందవలయుఁ;
తనయందె తిరముగా మనమును నెలకొల్పి యొకటియుఁ జింతింప కుండవలయుఁ;
ఎందెందు వెడలునో యెపుడును నిలుకడఁ గానని చంచలమానసమ్ము

అందందునుండి యొయ్యన దీని నియమించి తనయందె వశముగాఁ గొనఁగవలయుఁ;
పూని యింద్రియమనోబుద్ధుల నియమించి మోక్షమందే డెందముఁ దగిల్చి,
యిచ్ఛాభయక్రోధవిచ్ఛేదన మొనర్చు ముని యెవ్వఁడో సదా ముక్తుఁడతఁడె;
అన్నిభూతమ్ములం దున్నవానిఁగఁ దన్ను, నన్నియుఁ దనయందె యున్నవిగను,
సర్వస్థలములందు సమదర్శనుండగు యోగయుక్తాత్ముండు తాఁగనుగొను;
నాకన్న వేఱు గానని యోజనుల్ నన్నె చింతించు చెద నుపాసించువారొ,
నిత్యమ్ము నాయందె నిలుచు నవ్వారి యోగక్షేమనిర్వాహకర్త నేనె;
లోకభక్తజనాళి నేకభక్తిని సదా నన్నె కూడినజ్ఞాని మిన్నయగును;
జ్ఞాని కెంతేనియు నేనె ప్రియుండను, నాకు నతండు నెంతయును బ్రియుఁడు;
భువి నెన్నియో జన్మముల యంతమున జ్ఞానవంతుండు ననుభజింపంగ నేర్చు
వాసుదేవుండె సర్వమ్మని; యా మహాత్ముండు కనుంగడు దుర్లభుండు;
మనసులోఁ గలుగు కామముల నన్నింటిని తుదముట్ట నెవ్వండు వదలి యెపుడు
తనలోనె తనచేతఁ దనివిని గాంచునో యపుడు స్థితప్రజ్ఞుఁడందు రతని;
దేనినిం గోరక 'నేను' 'నా' దనుకొనకుండు నెవ్వఁడో, శాంతి నొందు నతఁడు;
లోక మెవ్వనిచేత వ్యాకులపడదొ, లోకముచే నెవఁడు వ్యాకులముపడండొ,
తలఁగి హర్షామర్షములు భయోద్వేగమ్ము లెవఁడొ, నా కాతఁ డెంతేని బ్రియుఁడు;
సముఁడు మానావమానముల మిత్రారిపక్షములందు సైతము సముఁడెవండొ,
తలఁగి సర్వారంభములను దా నెవ్వఁడో యతఁడు గుణాతీతుఁ డనఁగఁబడును;
తనయందె రతియును తనయందె తృప్తియుఁ దనయందె సంతుష్టియును వహించు
నే మానవుఁడు, వాని కెద్దియుఁ జేయంగవలసిన కర్మమ్ము గలుగఁబోదు;
చేయుటచేఁగాని, చేయమిచేఁగాని, యతనికి లేదెట్టి యర్థమిందు;
అఖిలభూతమ్ముల నాశ్రయించి యతండు సాధింపఁదగు ప్రయోజనము లేదు;
తనయంత లభియించు దానితోఁ దనియుచు, ద్వంద్వముల్ దాఁటి, మత్సరము వీడి,
సంసిద్ధి నపసిద్ధి సముఁడైన యాతఁడు కర్మ మొనర్చియుఁ గట్టువడఁడు;
ఎల్లభూతమ్ముల హృది నిల్చి యీశుండు మాయఁ గీల్బొమ్మల మాడ్కిఁ ద్రిప్పు;
అతనినే శరణొందు మన్ని విధమ్ముల; నతని ప్రసాదమ్ము కతన నీవు
భారతా, తప్పక పడయఁ గల్గుదువయ్య పరమమౌ శాంతిశాశ్వతపదమ్ము.

గీ॥ సార మిది గీతపద్యషట్సప్తకముల,
సంగృహీతమ్ము రమణర్షి చంద్రుచేత,
భక్తకృతసీసమాలికాభాసితమ్ము,
శ్రద్ధతో దీనిఁ జదువు; చిత్సౌఖ్య మొందవు.

— గు॥ వేం॥ సు॥ రామయ్య.





# గీతాంజలి

విశ్వకవీంద్రుడైన రవీంద్రుని
గీతాంజలికి శ్రీ కొప్పరపు డి. వి. ఆర్.
మల్లికార్జునరావుగారి పద్యానువాదము.



"కళాశ్రీ" (ఏప్రిల్ 53 సంచిక తరువాయి)

మ॥ నను గానంబును సేయ నానతిడుచో నామానసం బంతుపొం
తును లేనట్టిదు గర్వభారమున సంతోషంబునం జీవికై
చనునెన్నానిగ, నంత నీమొకము వీక్షింజేయుఁ, గండామరల్
దోనలై, నీరము జారఁగా విడుచునిల్వోన్, నీరమానట్లుగన్.

ఉ॥ నాభవమందుఁ గష్టఘటనంబులునుం బ్రతిబంధమెల్ల కేం
ద్రీభవమై మనోహరవితీర్ణమునౌ మధుగాననాదమై
శోభిలె — నంత సంతసముఁ జుబ్బన చూరగనబ్ధిపైఁ జనం
గా భృశమైన మోదమునుఁగాంచెడు పక్షిగ ఱెక్క విప్పితిన్.

ఆ॥ వె॥ నేను పాటపాడ నీమది కదిలించి
ముదముఁ బొదలునంచు నెదనెఱుఁగుదు;
ఒక్కపాటకుఁడుగ నూహించి నీకండ్ల
కుఱుఁగటకును రాగఁ గోరినాను.

చ॥ విరతమునైన ఱెక్కనిడివిందగు పాటకు గట్టునైన యు
క్కరమునుఁ దాఁకనేర్తు, సరిగాని; భవత్పదపద్మజాలమున్
దరిసెనముం బొనర్చి, సుమనంబున నెంచినయట్లు సేవనున్
జరుపఁగఁజేరు నాసఁగొనఁజాలను నీకృపలేక యీశ్వరా!

తే॥ గీ॥ గానమధురామృతంబు నుత్కంఠఁ ద్రావఁ
దన్మయతనంది మఱచితి తనువు, నన్ను;
నాకు సర్వేశుఁ డవును ననాథనాథుఁ
డయిన నిన్నుఁ బిల్చెదను స్నేహాప్తునట్లు.



# హారతి పాట



సాధుమాత శ్రీ సుబ్బలక్ష్మమ్మగారు

శ్రీ శివరామానందాశ్రమము, చాగలమర్రి.



మాతా జయాహారతీ సకలలోక
భగవద్గీతా జయా హారతీ॥

పాతక హారిణి పంకజరూపిణి
శీతాంశు మౌళీధరీ గైకొనుమా ॥మా॥

నిన్నే నమ్మినాము మముకృపజూడుము
మన్నించు మాతల్లి మాదేవి సరస్వతి ॥మా॥

వేదములన్నీ వెదకి నినుగాంచిన
సాధూ మూర్తులకెల్ల సంతోష మొసగిన ॥మా॥

అల పార్థునకు వేగ ఆయుద్ధభూమిలో
తెలిపీన నీతత్వ దేవీస్వరూపము ॥మా॥

ధరణీలో భక్తుల దయతోడనేలాను
కరుణాతో వేగామె కాపాడగా రమ్మ ॥మా॥



— సుబ్బలక్ష్మమ్మ

శ్లో॥ మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణీ విహారిణే।
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్॥

— శ్రీ రామకృష్ణ బ్రహ్మచారి.

# దైవ విశ్వాసము.

కవిచక్రవర్తి, శతావధాని,
విద్వాన్ దోమా వెంకటస్వామిగుప్తగారు.



"అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్" (భగ. 9_22)

గీ॥ "ఎవ్వరనన్యంబు నెంచక _ యెపుడుఁదనను
నెంత్రో _ వారియోగక్షేమమెలమి నెపుడుఁ।
దానరయుదు"నని పరమాత్మయనె నని యొ
కఁడు పురాణశ్రవణమునఁ గడఁగి వినియె॥ 1

గీ॥ దానిభావము మదిలోన వాని పూర్వ
పుణ్యవశమున గట్టిగాఁ బొనరి నాటు।
కొనఁగ _ నలనాఁటినుండి యేపనికిఁబోక
బీఁదవాఁడాతఁడూరక పీటనుండె॥ 2

గీ॥ కూలినాలికేఁగక _ యేదిగొనియురాక
యింటఁగూర్చున్నవాని వీక్షించి _ భార్య।
యాగ్రహోదగ్రియై "పనికరుగు" మనఁగ
నతఁడు చల్లచల్లగ నామె నట్టెకాంచి॥

గీ॥ తనను గాఢముగా నమ్ముజనుల మంచి
చెడ్డలను దా నరయుచుండుఁ జెలఁగియనుచు।
దేవుఁడానతిచ్చె భగవద్గీతయందుఁ
గనుక _ నతనినెంతును _ నాకుఁ బని యిఁకేల॥

గీ॥ అందుకయ్యింతి కనలుచు నతనిగాంచి
"తెల్లవారి నట్లుండె నీ తేఁట మాట"।
యనుచు రోసముఁబెట్టఁగా _ నాత్మనులుక
కతఁడు మిన్నకయేయుండె నాలయమున॥

గీ॥ గింజగిట్టలబయట కేఁగియు మగండు
తీసికొనిరాఁ - వెఱివాని దీఱున నిలుఁ ।
బట్టియుండె - గతియెది? దైవము? యని వని
కేఁగి - యే దుంపలో త్రవ్వియేరి తెత్తు ॥ 6

గీ॥ అనుచు నలచేడె యడవికి నరిగియొకటఁ
ద్రవ్వుచుండఁగ - బిందెలం ద్రవ్యమరరె ।
పసిఁడినాణెములెన్నొ కన్పడఁగఁ - గనులు
చెదరి - యాయమ్మయింటికేఁ జెలఁగి - వాని ।
గొనియు రా యత్నపడి మోయఁగనెటే బల్మి
మెసఁగమిని నిల్లుచేరి - ప్రాణేశుఁ గాంచి
యీ రహస్యముఁదెల్పి త్వరించి యడవి
కరిగి లిబ్బిని గొనిరమ్మ! యట్టి" యనఁగ ॥ 7

క॥ ఆ మాట కెదియునన కే
యా మనుజుండుండ - నామె యత్యంతంబు
ద్దామ రుషనడుగ నతఁ "డో
రామా! నా మదిని నీ వరయవే" యనియెన్ ॥ 8

గీ॥ అందుకామె కనలి యనున్ డెందమందు
దేవునెంతువు నీ గతిన్ దేవుఁడకసి ।
లిబ్బిఁజూపించె నదియుఁ దేలేవె నీ? వ
నంగ - నీతఁ "డాసిరి తన చెంగటకును
జేర్చుభారము దేవుఁడే చెందు" నంచు
ననియు మిన్నకుండిన నామె యట్టినెత్తి
నోరు గొట్టుకొంచునునుండ నొగినినపుడు
కొంతమందిదొంగలు పొంచుకొని యటవిని
యీ తెఱఁగునల సిరి యున్నయెడను దెలిసి
వెంటనే కానలో నటన్ వెడలివెదకి
చూడఁగా బిందెలచ్చటఁ జొప్పడె - నవి
తెఱచి కన నందుఁ బాములుఁ దేళ్లునుండె ॥ 9

గీ॥ గుండెలవిసిన దొంగలు కొంతవడిని
దలఁచి "పాముల తేళ్ల బిందెలివియున్న
యెడకుఁ దమునంపఁ - దమ పొంచుటెఱిఁగినయల
యాలుమగల మాయవుటెత్తొ" యని రుషమెయి ॥
వారికపకారముం గూర్పవలె నని యల
బిందెలను గొనిపోయి యవ్వీటి కున్న
మిద్దెపై గవాక్షమునుండి తద్దయువడి
బిందెలను గ్రుమ్మరింపఁగా వీరిదశేన ॥
వెల్లబంగారుబిళ్లలై యింటఁబడియె
నింటియాతఁడు భార్యతో నిట్టులనియె
"మనల నరయు దేవుఁడెయివి మనగృహమున
కేఁగుదెంచునట్టులఁ జల్లెనింతి!" యనుచు ॥ 10

# గీతాభక్తి

రచయిత:
బాలబ్రహ్మచారి
శ్రీ సింహాద్రి శత్రుఘ్నులుశ్రేష్ఠిగారు.



ఉ॥ శ్రీయుత కృష్ణపాదయుగ సేవితచిత్తుని నన్నుఁ జేసినా
పాయనిదుఃఖపుంజములు చాయగఁ ద్రోవను జూపుచున్మహా
ధ్యేయమొనర్చుబోధనలు దెల్పెడి గీతకు నెల్లవేళలన్
శ్రేయముగూర్చుపాత్రమని చేతులుమోడ్చి నమస్కరించెదన్. 1

ఉ॥ అద్దిరరాగమోహముల నంతమొనర్చియు ద్వేషమీర్ష్యము
ల్లద్దయు రూపుమాపినను ధన్యునిజేసెడి ముక్తిసూక్తులన్
బెద్దగనేర్పజాలునన బేర్మివహించిన గీతబట్టి ము
ప్రొద్దుల జూచుచుండెదను ముద్దుగ నందలి యంతరార్థముల్. 2

ఉ॥ ఏలనునట్టి గ్రంథముల నెన్నియొగాథ లెఱుంగజెప్పిన
న్నేలనుగీతయుండగని కేలనునాకితరప్రసంగముల్
జాలవెమోక్షమీయ ఘనసారముగల్గెడి కృష్ణువాక్యము
ల్పాలనజేసి నేనిక శుభావహమైనపదంబు బొందెదన్. 3

# శ్రీగీతాసాహిత్యసేవాసమితి - పోషక వర్గము.



## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర పంచమరాధ్యత్త జగద్గురు శ్రీ వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదుర్తి, కోయిలకుంట్ల తాలూకా. - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీతొమ్మండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీ ఊప్పలపాటి నారాయణరెడ్డిగారు, నై. కృష్ణాపురము. శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10 డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. ♦♦♦ కడపజిల్లా. 12. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణగారు, రామిరెడ్డిపల్లె, పులివెందల తాలూకా. - 13. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. - 14. శ్రీ పోలేపల్లి రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు. ♦♦♦ చిత్తూరుజిల్లా: 15. శ్రీ మదళ్ళపల్లె మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్‌వీధి, చిత్తూరు. - 16. శ్రీ యస్. రామలింగం పిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు. ♦♦♦ అనంతపురంజిల్లా: 17. పూజ్యపాద శ్రీ చిదగనానంద మహర్షులవారు, శ్రీభవనాశి ఆశ్రమం. - 18. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. ♦♦♦ బళ్లారిజిల్లా: 19. శ్రీ పెండుకూరు గోవిందప్ప అండ్ సన్స్, హాస్పెట్. 20. శ్రీసుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్. - 21. శ్రీగంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. ♦♦♦ కోలారుజిల్లా: 22. శ్రీఎం. వి. రామలింగంశ్రేష్ఠిగారు, బంగారుపేట. మైసూరుస్టేట్: 23. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటీ. ♦♦♦ ఉత్తర ఆర్కాట్ జిల్లా. 24. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటునూరు, కణ్ణమంగళంపోస్టు. ♦♦♦ నెల్లూరుజిల్లా: 25. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు - 26. శ్రీ వేమారెడ్డి బలరామిరెడ్డిగారి ధర్మపత్ని యశోధరమ్మగారు, ఇనమడుగు. ♦♦♦ హైదరాబాద్ స్టేట్ 27. శ్రీడి.పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. ♦♦♦ గుంటూరుజిల్లా: 28. శ్రీశ్రద్ధానంద స్వాములవారు. శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, తెనాలి తాలూకా.

## రాజపోషకులు రు. 54.

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మృతిచిహ్నముగ శ్రీ యన్. అయ్యపురాజుగారు, గోసుపాడు. - 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. - 3. శ్రీ చాటకొండ ఓబుళేశ్వరంశ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. - 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. - 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. - 6. శ్రీ బైసాని రామదాసుగారు,

ఆళ్లగడ్డ. - 7. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. - 8. శ్రీ యర్ర. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. - 9. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. - 10. జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. - 11. శ్రీ బొల్లుపల్లి చిన్న ఓబయ్యగారు, పడకండ్ల, శిరివెళ్లతాలూకా. - 12. శ్రీమతి ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు, వంట్లవీధి, నంద్యాల. - 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. - 14. శ్రీ పాణ్యాం రామనాథ శాస్త్రిగారు, కోయిలకుంట్ల. - 15 శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం ♦♦♦ కడపజిల్లా: 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 17. శ్రీ ఎస్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనీవారు, ప్రొద్దుటూరు. - 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. - 19. శ్రీ పి. నారాయణశ్రేష్ఠి గారి కుమారుడు శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. - 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. - 21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డి గారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా. ♦♦♦ చిత్తూరు జిల్లా: 22. శ్రీ. కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. - 23. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె - 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. - 25. శ్రీ నటుకల రామ నాథంశ్రేష్ఠిగారు, బజారువీధి, చిత్తూరు. ♦♦♦ అనంతపురంజిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి.-27. శ్రీ బుశెట్టి వన్నప్పగారు, ఉరవకొండ-28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. - 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. - 30. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకసగుర్తి 31. ఆముదాల వెంకట రెడ్డిగారు, రాగలపాడు పోస్టు ♦♦♦ బళ్లారిజిల్లా: 32. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్, - 33. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు - 34. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు. - 35. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరిపోస్టు. - 36. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు కుందనగుర్తి - 37. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి -38. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. - 39. శ్రీ సాధు శివలింగప్ప గారు, కుందనగుర్తి. - 40. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి - 41. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 42. శ్రీ శావాల ఆంజనేయులు గారు, కుందనగుర్తి - 43. పాటిల్ పెద్దబళిరెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి - ♦♦♦ మైసూర్ స్టేట్:- 44. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట - 45. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. - 46. శ్రీ కె. నంజప్ప శ్రేష్ఠిగారు, బంగారుపేట. - 47. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్. - 48. శ్రీ నారాయణమూర్తిగారు, c/o శ్రీ నూరా విరూపాక్షయ్య

గారు, తొండేభావి, కోలారుజిల్లా. ◆◆◆ నార్తుఆర్కాడుజిల్లా: 49. శ్రీశంకరనాయుడు గారు, కార్యాకారు. ◆◆◆ హైదరాబాదుస్టేట్. 50. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీల, నల్గొండ.—51. శ్రీదేశముఖ్ వేసేపల్లి కొండలరావుగారు, నల్గొండ ◆◆◆ నెల్లూరుజిల్లా: 52. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు—16. — 2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. బళ్లారి జిల్లా.

## కుందనగుర్తి శ్రీ శివలింగాశ్రమ గీతోపన్యాస కార్యక్రమంలో పూజ్యపాద శ్రీ శంకరానందస్వాములవారికి సమర్పించుకొన్న పద్యపుష్పములు.



నిగమ నిర్గుణరూపుడై నలరుచున్న
ఆదిమధ్యాంత రహితుడై అమరియున్న
సగుణరూపము ధరియించి సలలితముగ
ఒప్పుచున్నట్టి గురునకు వందనములు.

లోకాలోకపరీత మానవమహా లోకోపకారంబుగా
శ్రీకృష్ణః ప్రవచంబుల్ వినుటకున్ సిద్ధంబుగావించు సు
శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై శోభిల్లుచున్నట్టి మా
లోకాచార్యుడవైన నిన్నెపుడు నాలోజూతు శ్రీశంకరా.

సతతాచారము సూనృతంబు కృపయున్ సత్యంబునున్ శీలమున్
నతిశాంతత్వము చిత్తశుద్ధికరమున్ నధ్యాత్మయున్ ధ్యానమున్
ధృతియున్ ధర్మము సర్వజీవహితమున్ దూరంబుగాకుండ స
ద్గతియున్ జెందెదరంచు సూక్ష్మముగబోధించెన్ శ్రీమూర్తియున్.

శివలింగాశ్రమం, మా. చిన్నకదిరప్ప
12-6-53. కుందనగుర్తి.

आह्लगङ्गा — गीता साहित्य सेवा समिति की तरफ से संपादित तथा प्रकाशित.
मेनेजिंग एडिटर—यन० श्रीकण्ठम्, गुळ्ळदूर्ती, कोइलकुण्ट्ला, (कर्नूल)

# వార్తలు.

సందనగుర్తి శ్రీ శివలింగాశ్రమమునందు శ్రీ శంకరానందగిరిగారి అధ్యక్షత క్రింద గీతోపన్యాస సప్తాహ మహోత్సవములు జూన్ 1 నుంచి 12-వ తేదీ వరకు జరుపబడినవి. పూజ్యపాద శ్రీ శంకరానంద స్వాములవారు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం పైన గీతాప్రవచనములు సాగించారు. ప్రతి దినం ఉదయం శ్రీ శంకరానందగిరి గారు దక్షిణామూర్తి స్తోత్ర వివరణ గావించారు.

జూన్ 13, 14, 15 తేదీలు ప్రొద్దుటూరు శ్రీ కృష్ణగీతాశ్రమ వార్షిక సభలు శ్రీ శంకరానంద స్వాములవారి ఆధ్వర్యమున మూడుదినాలు నిర్వహింపబడినవి. అష్టమాధ్యాయమును గూర్చి శ్రీ స్వాములవారు ఉపన్యాసములు గావించారు.

జూన్ 17-వ తేదీ నుంచి 12 రోజుల వరకు హూస్పేట గీతా సేవాశ్రమములో శ్రీ స్వాములవారు గీతోపన్యాసములు నిర్వహించారు.

అనివార్య కారణాలతో నెల్లూరు కార్యక్రమము రద్దు గావింపబడినది. బెంగుళూరు కార్యక్రమమును ముగించుకొని శ్రీవారు జులై 9-వ తేదికి చాగలమర్రి శ్రీ శివరామానందాశ్రమము చేరినారు.

* * *

గీతావాణి సంపాదకులగు శ్రీ యన్. శ్రీకంఠమ్ గారు ఉన్నత విద్యాభ్యాసము కొరకు కాశీ విద్యాపీఠమునకు జులై 12-వ తేదికి చేరినారు. సంపాదకీయ శాఖకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములు సరాసరి వారికే శ్రీ యన్. శ్రీకంఠమ్, ఎడిటర్, గీతావాణి, శ్రీ కాశీవిద్యాపీఠ్, బనారస్-2 అనే చిరునామాకు వ్రాయండి.

* * *

గీతాతాత్పర్యప్రదీపము ముద్రణ పూర్తి కావచ్చినది. పోస్టేజికాక పుస్తకము వెల రూపాయిన్నర నిర్ణయించబడింది. బహు గ్రంథ పరిశోధకులగు శ్రీ రామకృష్ణబ్రహ్మచారిగారు తాత్పర్యాన్ని బహుచక్కగా రచించారు. మీ కాపీని రిజర్వు చేసికోండి.

★

# స్వీకృతి.

## 1. పాండవగీత

ఆంధ్రతాత్పర్యసహితము

వెల నాలుగణాలు.

* * *

## 2. శ్రీరామ చరితమానసము

(తులసీదాస కృతరామాయణము)

ప్రతులకు:- శ్రీ నోముల అప్పారావు గారు,
కాకినాడ.

* * *

## 3. శ్రీ రామతీర్థ నృసింహ శతకం.

వెల ఎనిమిదణాలు.

రచయిత – 'జీవకళ' భార్గవనృసింహశర్మ
ఆర్. కృపాపురం, ఆలమూరుపోస్టు

# గీతావాణి



మూడవ సంవత్సరము ★ రెండవ సంచిక.

[illegible] ఎడిటర్ - స్వామి శ్రీ శంకరానంద

అసోసియేట్ ఎడిటర్ - స్వామి శ్రీ రామకృష్ణ

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 ఆగస్టు 1953.

# విషయసూచిక - ఆగస్టు '53.





## రచయితలకు విజ్ఞాపన.

★ గీతావాణి సంపాదక కార్యాలయం కాశీ క్షేత్రమునకు మార్చబడింది. ప్రచురణకొరకు పంపే వ్యాసములను ఈ క్రింది చిరునామాకు పంప ప్రార్థన.

N. SHRIKANTAM,
EDITOR – GEETAVANI.
THE KASHI VIDYA PEETH, BANARAS – 2

చందాలు - విరాళాలు యథారీతిగా శ్రీ స్వామి శివానంద, మేనేజర్, గీతావాణి, ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా. అనే చిరునామాకే పంపండి.

# "గీతావాణి" 26

శ్రీమద్భగవద్గీతా తత్త్వసందేశమును ప్రకటించు మాసపత్రిక.







ఎడిటర్. [illegible]

శ్రీ కాశీ విద్యాపీఠము, బనారస్ - 2.



మేనేజర్—స్వామి శివానంద, గీతావాణి—ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.



| చందాలు ఆళ్లగడ్డకు, వ్యాసాలు బనారస్‌కు పంపవలెను. |
|---|

సంవత్సరచందా నాలుగురూపాయలు.

కవిత

## శ్రీ భగవద్గీతా సారము.

బాలకవి శ్రీ ఓ. నారాయణప్ప గారు

### అష్టమాధ్యాయము — అక్షరపరబ్రహ్మయోగము. 8



సీ॥ సచ్చిదానందాత్మ సదమలాక్షర పర
  బ్రహ్మమందురు బుధుల్ ప్రణవ మెదను
చింతించినరుడు దానంతబ్రహ్మం బగు
  నగ్ని తేజంబున; నహము, శుక్ల,
పక్షోత్తరాయణ భవ్యకాలంబున
  మరణించుయోగి సత్పరముగనును
దక్షిణాయనమున; దగ గృష్ణపక్షాన
  ధూమమందున, రాత్రి తొలగు తనువు

గీ॥ యోగిబుట్టుచుగిట్టుచు నొందుజింత
లోకపదవులు నరునకు శోకమిచ్చు
ననెను కృష్ణుండు పార్థునకనుచుదెలుపు
సకలజనమాత ! శ్రీదాత !! సత్యగీత !!!

## తురీయాశ్రమదీక్ష-స్వీకరణోత్సవం



★ పూజ్య శ్రీ రామకృష్ణ బ్రహ్మచారిగారు ఆగస్టు 14-వ తేదీన (శ్రావణ శు. ౫ లు శుక్రవారం) హంపిక్షేత్రంలో తురీయాశ్రమ దీక్షను స్వీకరిస్తారు.




సంపుటి 3 ★ స్వస్తిశ్రీ విజయ – ఆషాఢమ్ ★ సంచిక 2

# కాశీక్షేత్రం నుంచి



గీతావాణి సంపాదక కార్యాలయం కోయిలకుంట్ల నుంచి కాశీక్షేత్రానికి మార్చామని పాఠకులకు తెలియజేయటానికి నిజంగా ఎంతోసంతోషిస్తున్నాం. పావన క్షేత్రం నుంచి పవిత్ర గీతాసందేశం ప్రసారంకావింపబడుతుంది.

భారతదేశంలోని మూలమూలలలోని సభ్యత సంస్కృతిని చూడాలంటే – తెలుసుకోవాలంటే ఒక్క కాశీక్షేత్రాన్ని చూస్తే చాలు. కాశ్మీర్ మొదలుకొని కన్యాకుమారివరకు, కరాచి మొదలుకొని మణిపూర్ వరకు ఉండే వివిధరాష్ట్రాల్లోని జాతులు, మతాలు, సాంప్ర దాయాలవారీగా ప్రజాసమూహం కాశీక్షేత్రంలో అనుక్షణం మన

కళ్లకు కనపడుతూ వివిధరంగుల కలయికతోగూడిన ఇంద్రధనుస్సు లుగా ఆకర్షవంతంగా ఉంటుంది. విజ్ఞానంలో పాండిత్య ప్రతిభలో ఇది భారతావనికి మకుటం. మత, ఆచార, సాంప్రదాయాల విష యంలో ఏదైనతీర్పు జరుగవలసివస్తే ఆ హక్కు కాశీపండితులదే– వారి నిర్ణయాలపై మరి ఏ నిర్ణయంలేదు.

ఈ పావన క్షేత్రంనుంచి గీతపై ఎన్ని వ్యాఖ్యానాలు రచింప బడినాయో, హైందవ మతప్రచారానికి ఎన్ని మఠాలు నిర్మించబడి నాయో లెక్కకు మిక్కుటం. తొమ్మిదవ శతాబ్దంలో శ్రీ శంకరా చార్యులవారు స్థాపించిన మఠం ఈనాటికికూడ తగిన కట్టుదిట్టాలతో నిర్వహింపబడుతూవుంది. భరతవర్షం భరతవర్షంగా ఉన్నంతవరకు ఎన్నివందల శతాబ్దాలు గడిచినాగానీ కాశీక్షేత్రం తన సహజసంప దను కోల్పోదు.

మా గీతావాణి తన సహజ సందేశాన్ని సకాలంలో ఈ పవిత్ర పుణ్యభూమి నుంచి తమకందిస్తూ ఉంటుందని విన్న విస్తున్నాం.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః



# గీతాగానము.

## ( సాంఖ్యయోగము )

కవిరాజ్ శ్రీ రంగా చిన్నచలమయ్యాగారు, ఐ. యం. పి. చాగిలమఱ్ఱి.

( మార్చిసంచిక 2వ పేజీ తరువాయి )

13. అందువల్లనె యింద్రియసుఖముల — జ్ఞానియె గోరకయుండునయా
ఆ వాసనవెంబడి దిరుగడయా — సుజ్ఞానము గలిగియుండునయా
చంచలమైనా బుద్ధిని వీడి — చక్కగ దిరుగుచు నుండునయా అత... (శ్లో. 68)

14. విషయవాంఛలను విడువని పగలు — నిద్రను జెందును జ్ఞానియయా
బల్ యింద్రియనిగ్రహత జేయునయా — ఆ అజ్ఞానంబును వదలునయా
అంధకారమే పగలే యనుచు — ఆతడె దిరుగుచునుండునయా అత... (శ్లో. 69)

15. పూర్ణ బలముచే నిండిన సంద్రము — పొంగలు జూపక నుండునయా
బహునీటిచె సంద్రము పొంగదయా, తన — వడ్డునుదాటిపోవదయా
కామములన్నియు గ్రహించుచున్నను కన్నులనైనా జూడడయా అత... (శ్లో. 70)

16. నేను నాదను భావములేకను — సర్వవాంఛలను జంపునయా
తన — మమకారము నే వదలునయా — తన — అహంకారమును జూపడయా
మోక్షముబొందును మోదముతోడ శాంతిని బొందుచు సరసుడయా అత... (శ్లో. 71)

17. బ్రహ్మనిష్ఠ నే దెలిపితి ఫల్గుణ — బాగుగ వింటివి నీవయ్యా
ఇది బ్రాహ్మీస్థితియె దెలియుమయా — అది మోహామునందున బోవదయా
మరణకాలమునందున యీస్థితి — మానకయుండిన మోక్షమయా అత... (శ్లో. 72)



## 3. కర్మయోగము.

( "టిక్కు టిక్కు టక్కులాడి" అను వరుస )

అర్జునుడు:—

దేవదేవ వాసుదేవ, దేవకీనందనా
నందనంద నందనా, నందకుమారా — ఆనందకుమారా ॥దే॥

జ్ఞానయోగమార్గమే, జ్ఞానమంచు దెల్పినావు
ఘోరమైనయుద్ధకర్మ, ఏలచేయుమందువు — నన్నేలచేయుమందువు
జ్ఞాన కర్మ రెంటిలో, యెక్కువైనదానిని
చక్కగాను దెల్పినాను, సంశయంబు దీర్పుమ ॥పా॥ (శ్లో. 1-2)

కృష్ణుడు:—

పాపరహిత ఫల్గుణా, భయము నీకదేలనూ — జ్ఞానకర్మయోగముల, గట్టిగాను దెల్పెద

1. బ్రహ్మచర్యవాసులకే, జ్ఞానయోగమార్గము
గృహచర్యవాసులకే, కర్మయోగమార్గము — సుకర్మయోగమార్గము
తారతమ్యమెఱిగియుండి, తత్త్వములను దెలిసికొని
దారి నడచుచుండినను ధన్యుడగును పార్థివ ॥పా॥ (శ్లో. 3)



[సశేషము.]



★

( జూలై నెల సంచిక 9వ పేజీ తరువాయి. )

ద్యులోకమునందును అంతరిక్ష లోకమునందును నివసించెడి దేవతల వలన స్వాభావముగ నెరవేర్పబడెడి యజ్ఞక్రియను పరికించిన మీదట, భూలోకమువైపు దృష్టిని సారించినచో అదే విషయము గోచరింపగలదు. మొట్టమొదట భూదేవతను చూచెదము గాక! ఆమె అన్నింటికి ఆధారమైయున్నది. చరాచర ప్రాణులన్నిటిని ధరించి భరించుటయె ఆమె జీవన వ్రతము. ఆ మాతృదేవత యొక్క సహనశీలమును భావించినచో అక్కజము పొడమును. మనమా భూమాతపై త్రొక్కి నడచెదము. ఆమెపై మలమూత్రములను వదలెదము; ఉమియుదుము. అయినను, ఆమె మనల కోపించదు. సరిగదా; పై పెచ్చు సహించి మనకు అపారమగు ఉపకారము చేయుచున్నది. "పరోపకారార్థమిదం శరీర" మనెడి సూక్తికి యింతకంటె ప్రత్యక్షనిదర్శనము మరొక్కటి వని లేదు. ఆయా ఋతువులయందు ఆయా సస్యముల వెలయించి, ప్రాణికోట్లు బ్రతుకుటకు పరమాధారమగు ఆహారమును భూదేవియె మనకు ప్రసాదించుచున్నది.



నీటి విషయముకూడ నింతే. అదియు తన జీవితము సర్వమును పరులకై ధారపోయుచున్నది. దాని యజ్ఞమయ జీవితము ప్రపంచమునకు ఆదర్శపాతము. ఆ విధముననే వృక్షములును వనస్పతులును స్వాభావముగనె యజ్ఞమొనర్చుట

స్పష్టముగ కాంచుచున్నాము. చెట్టు తన తియ్యని ఫలములను తాను తినక యితరులకు సమర్పించు చున్నది. నీరుపోసి సాకినవానికి వలెనే, గొడ్డలిపట్టి తెగనరికినవానికి గూడ ఉపకరించుచునె యున్నది.

విశ్వజగత్తు మొత్తము స్థిరమై నిలిచియుండుటకు యీ యజ్ఞమే కారణము. యజ్ఞమనిన ఆహుతి యనియు త్యాగమనియు యీవి యనియు పరోపకారమనియు భావించుట దగును. యజ్ఞకర్మను వీడినచో జగచ్చక్రమె స్తంభించిపోవును. మనుష్యుడు బ్రతుకుటయె అసాధ్యము.

జగత్తేకాదు; ఈ శరీరము సైతము యజ్ఞము నొనర్చుచున్నది. పరోపకారరూపమగు యజ్ఞకర్మను మానినచో శరీర మొక్కగడియ సేపుకూడ జీవించి యుండబోదు. తనకుగల దర్శనశక్తిని కన్ను, దేహమంతటికిగా నుపయోగపడుచుచున్నది. అట్లగిదియె, చెవి తన శ్రవణ శక్తిని, ముక్కు ఆఘ్రాణశక్తిని, మరియు తక్కిన ఆయా యింద్రియములు తమకుగల ఆయాశక్తియుక్తులను శరీరహితమునకై వెచ్చించుచున్నవి. తాను దిని తాను త్రేపి తక్కిన నుద్దిముట్టక తనపట్టునకె చూచుకొనెడి స్వార్థబుద్ధి యీశ్వర సృష్టియందేవస్తువునకును లేదు. ఈ కరణి విమర్శించుచు పోయినచో ప్రజాపతిబ్రహ్మ ప్రజలను యజ్ఞసహితముగ సృష్టించి యున్నాడనుమాట తేటతెల్లము. సృష్టియైన ప్రజలను చూచి ప్రజాపతి దేవుడు "మీరు పూర్ణత్వమును సాధించుటకును, యిష్టార్థములను బొందుటకును ఈ యజ్ఞములె మీకు శరణ్యము"లని యానతిచ్చిమరియు నిట్లనియె.

(శ్లో. 11) ఓ ప్రజలారా! సమర్పణరూపమగు యీ యజ్ఞకర్మమూలమున మీరు యింద్రాది దేవతలను, ఆచార్యులను,పితరులను ఆరాధించి సంతృప్తుల నొనర్చుడు. ప్రతిఫలముగ వారును వర్షము — సస్యోత్పత్తి మొదలగు కృత్యముల తో మిమ్ము తృప్తినొందింపగలరు. ఇట్లు పరస్పర సహకారమున సంతృప్తులై పరమసుఖమును పొందగల్గుదురు. వెయ్యేల! ఈప్రపంచమే సుసంబద్ధమగు నొక పరస్పర సహకార సంఘమని గుర్తింపుడు.

అర్జునా! ఈ విధమున ప్రజాపతి యగు చతుర్ముఖ బ్రహ్మ ప్రజా కోటికి హితమానతిచ్చెను. ఈయజ్ఞ కర్మవలన కేవలము పారలౌకికమగు స్వర్గాది ఫలములెగాదు; ఐహిక

మగు సుఖసామగ్రులుకూడ లభించ గలవని ఆయన ఉపదేశించి మరియు నిట్లనియె.

ఓ నా సంతనములారా! మీ వలన సంతుష్టులైన దేవతలు ప్రసాదించిన వస్తుభోగములను అనుభవించుచు వారికి ప్రత్యర్పణము చేయుట మానినచో మీరు ఋణగ్రస్తులు కాగలరు. ఆ భోగములను అనుభవించుటకు నిజమునకు మీకు హక్కులేదు. తనదిగాని సొత్తును అనుభవించెడివాడు దొంగ యనబడును.' విశ్వహితకారులగు దేవతలయొక్క దయాధర్మములవలన సంప్రాప్తించిన సంపద్భోగములతో — దేవతల నారాధింపక, అగ్నియం దాహుతినిడక, అతిథుల సత్కరింపక, గురువులసేవింపక, సమాజమున కుపకరింపక, ఐశ్వర్యమదమున ధర్మకర్మముల విడనాడిన పురుషుడు కృతఘ్నుడనియు చోరుడనియు చెప్పబడును.

అని బ్రహ్మదేవుడు ప్రజల నను శాసించి చెప్పెను. ఇట్టి యజ్ఞచక్రము ననుసరించి వర్తించువాడు సద్గతిని బొందగలడు. దానికి ప్రతికూలముగ జీవించువాడు దుర్గతిని బొందగలడు.

అర్జునా! మనుష్యుడు ప్రతి నిత్యము పరిశ్రమించి వస్తువులను సంపాదించుకొనుచున్నాడు. ఆసంపాదన క్రియయందేదో యొక దోషము ఉండియె యుండును. తానొక వస్తువును సంపాదించి యనుభవించవలెనన్న—ఆవస్తువును మరియొక్కరి అనుభవమునకు దూరముచేసిగాని తాను అనుభవించ వీలులేదు. తాను సంపాదించునదంతయు యితరుల కడుపుగొట్టి సంపాదించినదియె యగుచున్నది. తాను చేసెడి ప్రతిపని యందును యేదో ఒకవిధమగు హింస జతకూడియెయున్నది. అడుగడుగునను మానవుడు హింసను—పాపమును చేయుచున్నాడు. తప్పనిసరియై పాలిటబడెడి పాపములనుండి మనుష్యుడు విముక్తి బొందుట కొఱకై ప్రజాపతిదేవుడు యజ్ఞమును సృష్టించి విధించెను. కిరీటీ! శిష్టుడగువాడు యజ్ఞసేవకై వినియోగించినమీదట మిగిలిన వస్తువులను తాను నిష్కామముగ ననుభవించును. ఆ సత్పురుషుడు తానొనర్చెడి వస్తుసంపాదనయందును భోగానుభవమునందును సహజముగ ఘటిల్లెడి పాపదోషములను ప్రక్షాళనమొనర్చి పరిశుద్ధుడు కాగలడు. అటుగాక, కేవలము తన

పొట్టను నింపుకొనువాడు—యజ్ఞార్థముగ యితరులకు వితరణచూపనివాడు, తినునదంతయు పాపమెగాని అన్నముగాదు.

ఈ విషయమున స్మృతి యిట్లు చెప్పుచున్నది:

"ఖండినీ పేషిణీ చుల్లీ
ఉదకుంభీ చ మార్జనీ ।
పంచసూనా గృహస్థస్య
తాభిః స్వర్గం న విందతి ।
పంచసూనకృతం పాపం
పంచయజ్ఞైర్ వ్యపోహతి ॥"

గృహస్థునకు అయిదుచోట్ల అనివార్యముగ పాపము తటస్థించుచున్నది. 1. కత్తిపీట, 2. తిరుగలి (విసురుడురాయి), 3. పొయ్యి, 4. నీటిబాన, 5. చీపురు — అనెడి యీఅయిదు పరికరములను వాడుకొనునప్పుడు అప్రయత్నముగనె కొన్నిజీవులు మడియగలవు. గృహస్థులీ ఉపకరణములను వాడుకొనక తప్పదు. ఈ పంచస్థానముల మూలమున నేర్పడెడి పాపములను పంచసూనములందురు. ఆ పంచసూనముల నివృత్తికొరకు పంచ యజ్ఞములు శాస్త్రములందు విధింపబడినవి. అవి శతపథ బ్రాహ్మణమున క్రమముగ ఋషియజ్ఞము, దేవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము అనెడి పేరులతో ప్రసిద్ధమై యున్నవి. ఈ యజ్ఞములనుగూర్చి విచారించు సందర్భమున పరాశరస్మృతి క్రిందివిధముగ హెచ్చరిక చేసినది.

"వైశ్వదేవవిహీనా యే
ఆతిథ్యేన వివర్జితాః ।
సర్వే తే నరకం యాంతి
కాకయోనిం వ్రజంతి తే ॥
కాష్ఠభార సహస్రేణ
ఘృతకుంభశతేన చ ।
అతిథిర్యస్య భగ్నాశ
స్తస్య హోమో నిరర్థకః ॥"

వైశ్వదేవమును చేయని — అతిథిని సత్కరింపని గృహస్థుడు మరణానంతరము నరకమునకుబోయి పెక్కువెత లనుభవించి ఆపిదప కాకయోనియందు జన్మింపగలడు. అట్టివాడు కాష్ఠపర్వతములను ఘృతసముద్రములనువ్రేల్చి పెద్దయెత్తున యజ్ఞములు చేసిననుకూడ అదంతయు వట్టిదండగ.

అన్నము ఆజ్యము తిలలుకుశలు అగ్నియందు వ్రేల్చుటయె యజ్ఞము కాదు. స్వర్గప్రాప్తికై చేయునది మాత్రమె యజ్ఞము కాదు. జగత్తు యొక్క ధారణపోషణములకు అత్యావసరమగు సాధనము యజ్ఞము. జగచ్చక్రము కుంటువడక సలీసుగ నడచుటకై యజ్ఞక్రియ సృజింపబడినది.

తానెవ్వడో తెలియగోరి తన స్వరూప విచారమునకుపూని మనుష్యుడు ప్రయత్నించినపుడు వానికి ప్రథమ కత్యయందె యీ స్థూల శరీరము యెదురగుచున్నది. "ఇది ఆత్మకాదు" అని వివేచించి దానిని వైదొలగించినంతట ఆశరీరమునకు కారణమేమనెడి ప్రశ్న ఉదయించుచున్నది. శరీరమునకు అన్నమే కారణము. అందుకు శ్రుతి ప్రమాణముకూడ గలదు.

"అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। అన్నేన జాతాని జీవంతి। అన్నం ప్రయంత్యభిసంవిశంతీతి"

తినిన అన్నమువలననె రసరక్తాది సప్తధాతువులు ఏర్పడి శరీరమును పెంచినవి; పోషించినవి. ధాతుపుష్టివలన శరీరము నిలిచినది. ధాతుక్షయమున శరీరము కూలిపోవుచున్నది. అన్న వికారమగు వీర్యము పురుషునినుండి స్త్రీ గర్భమునప్రవేశించి శరీరోత్పత్తికి కారణమగుచున్నది. అట్టియన్నము వర్షమువలన సంభవమగుచున్నది. వర్షములేనిచో అన్నాహారములు ఉత్పత్తి కాజాలవు. వర్షపాతము యజ్ఞముపై ఆధారపడియున్నది. యజ్ఞాగ్నియందువదలిన ఆహుతిసూర్యుని చేరి మేఘముగ తయారగుచున్నది. మేఘమునుండి వానలుపడుచున్నవి. మరొక్క విధమున విచారించినచో అగ్ని యను మాటకు జఠరాగ్నిని చెప్పవచ్చును. సమస్త ప్రాణుల యొక్క ఉదరమధ్యమున నుండెడి జాఠరాగ్నియందు అన్నమును ఆహుతి యిడినచో, అచ్చోట వైశ్వానరరూపమున నుండెడి పరమేశ్వరుడు తృప్తుడుకాగలడు. అతడు సంతుష్టుడైనచో ఆయనకు అంగభూత దివ్యశక్తులగు దేవతలు ప్రసన్నులై వర్షములను ప్రసాదింతురు.

యజ్ఞము కర్మవలన కల్గుచున్నది. యజమాన ఋత్విగ్గణాది సంభారముతో ప్రవర్తింపబడుచున్నది. లేదా — అర్పణరూపమగు త్యాగరూపమగు కర్మమువలన యజ్ఞము సంభవించు చున్నదని కూడ చెప్పవచ్చును. ఆదాన ప్రదానములు — త్యాగభోగములు — ఇచ్చుట పుచ్చుకొనుటలవలననే యీ జగచ్చక్రము నిరంతరాయముగ సాగిపోవుచున్నది. అర్పించుట యనునది విలక్షణమగు నొక కర్మము. ఇదియె యజ్ఞచక్రమునకు కారణము. ఈ విషయమున మనుస్మృతి ప్రమాణముకూడ గలదు.

"అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్య
గాదిత్య ముపతిష్ఠతే।
ఆదిత్యాజ్జాయతే వృష్టిః
వృష్టేరన్నం తతః ప్రజాః॥"

వైదికాగ్నియందు యిరుపూటలను శ్రద్ధాభక్తి పూర్వకముగ ఘృతాది పదార్థములను అర్పించినచో అది సూక్ష్మరూపమున సూర్యునిచేరి నిలుచుచున్నది. ఆ సూర్యునివలన మేఘము లుత్పన్నమగుచున్నవి. మేఘములనుండి వృష్టి సంభవించుచున్నది. వర్షమువలన అన్నమును, అన్నముద్వారా ప్రజాసృష్టియు సంభవించుచున్నది. ఈ యజ్ఞరూపమగు కర్మము బ్రహ్మమునుండి కల్గినది. ఇచ్చట కర్మమను మాటకు ఋత్విగ్యజమాన రూపమగు క్రియావ్యాపారమనిగాని, పరోపకారరూపమగు సేవయనిగాని అర్థమూహింపవచ్చును. బ్రహ్మమను మాటకు ప్రకృతియు వేదమును బ్రహ్మదేవుడును సజీవ శరీరములును అర్థములు. అట్టిబ్రహ్మము అక్షరమునుండి సముద్భూతమైనది. కర్మము ప్రకటమగుటకు తగుతావులైన ప్రకృతి వేదము ప్రజాపతి సజీవ శరీరములు, అక్షరము అవినాశియగు ఆత్మనుండి సముత్పన్నములైనవని అర్థము. కాబట్టి సర్వవ్యాపకమగు బ్రహ్మము యజ్ఞమునందు ప్రతిష్ఠితమైయున్నది. లేదా — పరమాత్మని నిఃశ్వాసమని చెప్పబడుచు — సర్వార్థములను ప్రకాశింపజేయుచు — యజ్ఞకర్మములను ఉత్పాదించుచుండెడి వేదబ్రహ్మము యజ్ఞమునందు నిత్యస్థితమై యున్నది. ఎందుకననిన — యజ్ఞక్రియయందు వేదమంత్రములు తప్పనిసరి వుండవలసియె యున్నవి గదా! మరియు వేదరూపబ్రహ్మమునకు అతీతమై, వేదమే నిశ్వాసముగా గల్గిన ఆత్మ సర్వదా యజ్ఞమునందు ప్రతిష్ఠితమైయున్నది. కర్మకాండ కంతటికిని తన నిశ్వాసరూపములగు వేదములే ఆధారముగదా! దివ్యశక్తులన్నిటికిని — వాటి అర్పణ క్రియలకును ఆధారమును అధిష్ఠానమునై యుండెడి ప్రజాపతి బ్రహ్మము వ్యాపకమై నిత్యమును యజ్ఞమున నెలకొనియున్నది. అదియె అన్ని కర్మములకును ప్రతిష్ఠమై వెలసినది. ఇట్లు కర్మనియమమును దాని విస్తారమును సాక్షాత్తు వరబ్రహ్మమువలన ప్రకటమైనవి. ఓ అర్జునా! ఈ ఈశ్వరరూప సృష్టిక్రమము ననుసరించి నీవును నడువుము.

(సంతకం)

# భగవద్గీత - మాహాత్మ్యము

లేఖకుడు: "కథనకళాప్రపూర్ణ" నోముల అప్పారావు, కాకినాడ.



ప్రశ్న: భగవద్గీత చదువునపుడు వరాహపురాణాంతర్గతమగు గీతామాహాత్మ్యము చదువుటవసరమా? కాదా?

**ఉత్తరము:** వరాహపురాణాంతర్గతమగు గీతా మాహాత్మ్యము చదువనక్కరలేదు. గీతాపఠనము వలనఁ గలుగు ఫలము గీతాశాస్త్రమందే చెప్పఁబడియున్నది. అంతకంటే హెచ్చగు మాహాత్మ్య మందు కానరానందున నది చదువవలసిన పనిలేదు.

ప్ర: "గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ । వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః ॥" అని వ్రాయఁబడియుండుటచే మాహాత్మ్యము చదువనిచో గీతాపఠనమునకు ఫలమే లేదని స్పష్టమగుచున్నదే. దానిని చదువ నక్కరలేదనుటకు గారణమేమి?

**ఉ:** ఈ శ్లోకము మాహాత్మ్యమునందలి చదువుటకొఱకు వరాహపురాణమున వ్రాయబడినది. "రోచనార్థా ఫలశ్రుతిః" అను వాక్యము చొప్పున మాహాత్మ్యమందు రుచ్యుత్పాదనము కొఱకు అతిశయముగ చెప్పబడినది. ఈ శ్లోకము మూలమగు భగవద్గీతకు న్యూనత నాపాదించుచున్నది. ఎటులనగా:- మాహాత్మ్యము చదువక గీతను జదివినయెడల గీతా పాఠము వ్యర్థమగుననుటచేత గీతకంటె మాహాత్మ్యమే శ్రేష్ఠమని స్పష్టమగుచున్నది. గీతయొక్క గొప్ప



దనమును చెప్పుటకు వెలువడిన యీ మాహాత్మ్యము గీతనే ధిక్కరించుచుండుటవలన పఠనార్హము కానేరదనుటలో దోషములేదు. విశేషించి యీ "గీతాయాః పఠనంకృత్వా...." అను శ్లోకము గీతను పూర్ణముగ విరోధించుచున్నది.

ప్ర: ఈ శ్లోకములో నట్టి దోషముండినను మాహాత్మ్యమందలి మిగిలిన శ్లోకములు గీతయొక్క మహిమను చెప్పుచున్నవి కదా; వానినేల చదువరాదు? ఒక్క శ్లోకము కొఱకు పెక్కు శ్లోకములను విడుచుట వివేకమా?

ఉ: మాహాత్మ్యమందలి చాల శ్లోకములు గీత చదివినచో చంద్రలోక గోలోకాదులు వచ్చునని యు, మరల మనుష్యత్వము లభింపఁగలదనియు నేమేమో వర్ణించినవి. భగవద్గీత మానవులకు వినిర్మల జ్ఞానమును గలిగింపవెలువడినది. తదభిన్నముగ భక్తి నిరూపింపబడినది. ఫలాసక్తి రహితమగు కర్మల నాచరించుటవలన నాఫలోదయమగునని వక్కాణించినది. అంతియు కాదు 'మా ఫలేషు కదాచన' అని కర్మఫలాపేక్షను నిరసించినది. కర్మఫల వాంఛ బంధహేతువని ముక్తకంఠముగ వాకొనినది. అట్టి నిష్కామకర్మ ప్రబోధకమగు విశిష్ట గ్రంథముయొక్క మహత్తర మాహాత్మ్యము చంద్రలోకప్రాప్తి గోదానఫలప్రాప్తి మొదలగునవి కలుగునని చెప్పుటలచేత న్యూనత చెందునేకాని ఘనత చెందనేరదు. కర్మ ఫలాపేక్షను బోగొట్టు మహత్తర గ్రంథమును జదువువారలు కర్మఫలముల నొసంగుటను బోధించు రుచ్యుత్పాదక వాక్యములను జదువుటయు, నట్లుచదువనిచో ఫలమే లేదని నమ్ముటయు, తమకు గలిగిన యాభావముల నితరులకు బోధించుటయు, వానినే ధ్రువపరచుటకు వాదములొనర్చుటయు సమంజసము కానేరదు.

(సశేషము)

— నో. అప్పారావు.



# ★ గీతాతత్త్వము ★

## రచయిత: శ్రీ దివాన్‌చంద్, M. A., Ph. D.,

## అనువాదకులు: శ్రీ చారాల నరసింహమూర్తిగారు.

★

[శ్రీ దివాన్‌చంద్‌గారు కాన్పూర్ శ్రీ దయానంద కాలేజికి ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు. వీరు ఆంగ్లంలో "The Short Studies in the Bhagavad Gita" అనే గ్రంథాన్ని వ్రాశారు. దాని సరియైన అనువాదాన్ని శ్రీ చారాల నరసింహమూర్తిగారు 'గీతాతత్త్వము' అను పేర ఆంధ్రీకరించారు. — సంపాదకుడు.]



## 1. భగవద్గీత — విశ్వవ్యాపకము.

మానవలోకమునుద్ధరించుటకు యదుకులస్వామి ఒసంగిన దివ్యసందేశమే భగవద్గీత. సంస్కృత వాఙ్మయమున బహుళ వ్యాప్తమై సర్వజన ప్రియమైన గ్రంథరాజము ఒక్క భగవద్గీతయే. భారతీయులు బహుమంది భక్తిశ్రద్ధలతో ప్రతిదినము భగవద్గీతను పారాయణమొనర్చెదరు.

భగవద్గీతకు లభించిన ఇట్టి అసామాన్యమగు కీర్తి ప్రతిష్ఠలకు కారణమేమి?

భగవద్గీత వేదాంతమును వెల్లడించు పద్యములబోలెడి శ్లోకముల సముదాయము. పద్యకావ్యము సామాన్యముగ లౌకిక జ్ఞానమునకు, పంచేంద్రియ పారవశ్యమునకు, సహజ జ్ఞాన గ్రహణశక్తికి ఆశ్రయస్థానము. తర్కమునకు వేదాంతము అటుపట్టు. వేదాంతము మానవునకు విజ్ఞానవికాసము కలిగించి వేదాంతవిషయములను సులభగ్రాహ్యమొనర్చును. వేదాంతమును ప్రతిపాదించు పద్యము లేక శ్లోకసముదాయము విషయమును సులభగ్రాహ్యమొనర్చుటతోబాటు ఉత్సాహమును రేకెత్తించును. ఈ విషయమున భగవద్గీత ప్రాశస్త్యమేమిటనితోచును. భగవద్గీత సంగీతమునకు స్థానమొసగు పద్యకావ్యముకాదు. సంగీతమునకు ఆశ్రయమొసగు కీర్తనలేక గీతముత్కంఠోద్రేకమును కలిగించును. భావప్రవాహమున అస్థిరమగు అలలనెప్పుడును భగవద్గీత నిర్మింపదు. మానవుని బలహీనమొనర్చు అతి ముఖ్యమయిన జీవిత సమస్యను భగవద్గీత చర్చించును. ముఖ్యసమస్యకు సమాధానమొసగుచు పెక్కు ఇతర విషయములనుగూర్చిగూడ భగవద్గీత పలుకుచుండును. మహాభారత ఇతిహాసమున భగవద్గీత అంతర్భాగమయినను అందు కథావస్తువు ఏమియులేదు. యుద్ధమునకు సిద్ధమయిన కురుపాండవ యోధుల నభివర్ణించి తాను యుద్ధమొనర్పవలయునా? మానవలయునా? యని అర్జునుడడిగిన ప్రశ్నకు భగవద్గీత సమాధానమొసగును.

ఒక రమణీయ భావమే పద్యముగ రూపొందును. కవియు, పాఠకుడును వాస్తవ లోకమునకు దూరముగ నుందురు. అట్టి కావ్య పఠన అనంతరము వరకు పాఠకుడు భావ ప్రపంచమునకది వెంటబడి చివరకు కన్నులు నులుముకొనుచు సుఖ స్వప్నముగాంచిన విధమున తలపోయును. మానవునకు మత్తెక్కించుటకు ఎట్టి అభూతకల్పనలను భగవద్గీత సృష్టించదు. మానవునిపట్ల కర్కశత్వము వహించు జగత్తునందలి యథార్థవిషయముల

గూర్చి మాత్రమే భగవద్గీత ప్రశాంతముగ పలుకుచుండును. ఆసాంతమువరకు మనము జాగ్రదవస్థయందే యుందుముకాని మైమరచి నిద్రపోము. ఇంద్రియములకు మత్తెక్కించు భావములు ప్రోవుకాకున్నను భగవద్గీత మనలను ముగ్ధులగావించును. కారణము భగవద్గీత నేర్పుతో, సొంపుతో సృష్టించుకొనిన స్వరయుతమయిన కవితాశక్తియే. మధుర ధ్వనుల గావించుచు ప్రతిపంక్తియు అసాధారణమగు ఆనందమున మనలముంచును. ప్రతి సంగతిని భగవద్గీత అతిసొంపుగకూర్చి ఆబాలగోపాలమున కర్థమగునటుల అందించును కనుక పాఠకులు పరవశులగుదురు. ఏ వేదాంతమునుగూర్చి భగవద్గీత ప్రబోధించునని పాఠకులు ప్రశ్నింపక పోరు. చదివి పరిశీలించుకొనుమని భగవద్గీత సమాధానమొసగును. జీవితనడతను గూర్చియే గీత విశదీకరించును. శ్రీకృష్ణభగవానునకుకొన్ని నిశ్చితాభిప్రాయములీవిషయమున గలవు. విషయమును విపులమొనర్చుటకు శ్రీకృష్ణపరమాత్మ అనేక వాదోపవాదములను పొందుపరచును. నడతనుగూర్చియే గాక అనేక ఇతర విషయములనుగూడ భగవద్గీత వివరించును. ఈ విషయములను సులభగ్రాహ్యమొనర్చుటకు శ్రీకృష్ణభగవానులనుసరించిన మార్గము వేరువిధము. ఎటులయిన పాఠకుని ఒప్పించు పద్ధతికాక ప్రోత్సహించు పద్ధతిని గీతాచార్యులనుసరించెను. వాదోపవాదములకన్న శాస్త్రీయమైన ప్రమాణవచనములే ప్రోత్సాహము పురిగొల్పుట కుపకరించును. తర్కవాదనమునకన్న ప్రమాణవచన ప్రవచనమే సామాన్యుల నెక్కువ నాకర్షించును. భారతీయులు విమర్శక దృష్టితో గాక భక్తితో తాము తరించుటకు మాత్రమే గీతాపారాయణమొనర్చెదరు. భగవద్గీతకూడ ఇట్టి దృక్పథమునే ప్రశంసించుచున్నది.

నీతిశాస్త్ర మభ్యసించువారికి భగవద్గీత నిర్దుష్టమయిన నీతి సముదాయమునే ప్రసాదించును. సామాన్యులకు సన్మార్గమున కవసరమగు భక్తిశ్రద్ధల ప్రబోధించును. మానసిక తత్వశాస్త్రమునకు (Meta Physics) సంబంధించిన మూలసిద్ధాంతములనుగూడ గీత ఇముడ్చుకొని మానవుని మనస్సు నిర్మాణ, కార్యవిధానములను వివరించును. కష్టనష్టములకులోనై మానసిక జుగుప్సనుపొందు నిర్భాగ్య జీవులను భగవద్గీత ఓదార్చి రక్షణ కల్పించును. ఈ కారణముననే భగవద్గీత విశ్వమంతయు వ్యాపించెను.

## 2. గ్రంథ నిర్మాణ విధానము.

భగవద్గీతయందు 18 అధ్యాయములు, 701 శ్లోకములుగలవు. చివర అధ్యాయమైన 'మోక్షసన్న్యాసయోగము' 78 శ్లోకములుకలిగి కొంచెము పెద్దదిగనుండును. రెండవదగు 'సాంఖ్యయోగము' తరువాత స్థానమాక్రమించి 72 శ్లోకములను కలిగియున్నది. ధర్మక్షేత్రమందు యుద్ధసన్నద్ధులయిన మనవారును పాండుపుత్రులును ఎట్లు మెలగిరని ధృతరాష్ట్రుడు రథసారథియగు సంజయునడిగిన ప్రశ్నతో భగవద్గీత ఆరంభించును. రణరంగమున జరిగిన యావద్వృత్తాంతమును సంజయుడు వినిపించును. ప్రారంభశ్లోకమున అడిగిన ప్రశ్నకుమించి ధృతరాష్ట్రుడేమియు మాటలాడడు. యుద్ధభూమియందు జరిగిన శ్రీకృష్ణార్జున సంవాదమును యథారీతిగ నివేదించుట మినహా సంజయుడుగూడ మరేమియు దీర్ఘో

పన్యాసమొనర్చి కౌరవ పక్షపాతియయిన పాండురాజు సోదరుని ఇంగితములను గ్రహింప ప్రయత్నింపడు. మొదటి అధ్యాయమున అర్జునుడు మనోక్లేశమును వెలిబుచ్చును. అపుడు గీతాచార్యుని వాదమిళితమైన ప్రోత్సాహము ప్రారంభమగును. శ్రీ కృష్ణభగవానులిటుల అర్జునుని విషాదమును నివారించి ధర్మయుద్ధమునకు పురిగొల్పును. మిగిలిన గ్రంథ ఆసాంతము వరకు వాదరహితమైన ప్రోత్సాహ పద్ధతినే శ్రీ కృష్ణపరమాత్మ అనుసరించెను. గీతను పఠన మొనర్చునపుడు కృష్ణార్జునుల సంభాషణయనిగాని సంజయుని నివేదికయని గాని పాఠకులకు తోచదు. ఒక యుద్ధగ్రంథమును పఠించునటులుండును.

ముఖ్యవిషయమునకు స్వల్పప్రాధాన్యమే గ్రంథమున నీయబడినది. 'అర్జునునెదురొక్కొను సమస్య యుద్ధమొనర్పవలయునా? యనునది. సమాధానపూర్వకముగ శ్రీ కృష్ణభగవానులు సందేహ నివృత్తిగావించును. ఇదియే గ్రంథమున ముఖ్యవిషయము. ముఖ్యవిషయమునకు సంబంధించని పలువిషయములు మనకు కానవచ్చును. ఈ భాగములను చదువునపుడు అర్జునునకు పొడసూపిన సందేహము, అట్టి సందేహ నివృత్తి విషయమే పాఠకులకు మరపునకు వచ్చును. మానసిక తత్వశాస్త్ర విచారమే **(Meta Physical Speculation)** గ్రంథమున ప్రముఖముగ కనుపించును. ముఖ్యవిషయమునకు దూరమయిన ఇట్టి వివిధ విషయములు విజయమున నుపదేశింపబడెను. చదువరులకవి ఉత్సాహపూరితముగను సుబోధకరముగ నుండును. ఈ భాగములు కాలముగతించిన కొలది గ్రంథమున జొప్పింపబడెనని ఊహించు విమర్శకులును లేకపోలేదు. ఇట్టి విమర్శలెటులున్నను యావత్తు గీతయు శ్రీకృష్ణప్రబోధయేయనుటకు పెక్కు ఆధారములుగూడ లేకపోలేదు.

ప్రతిమానవుని సుఖమయమై ప్రశాంతముగ గడచు జీవితమున కలుగు అంతరాయమే భగవద్గీతయందుచర్చింపబడిన ముఖ్యసమస్య. అట్టి అంతరాయమే జీవిత సమస్య. ఇట్టి జీవితసమస్యలు దుర్ఘట సమయములందు ఆసన్నమగును. అత్యంత విషాదకరమైన అవస్థయందు భగవద్గీతయను ఔషధము అర్జునునకొసంగబడెను. అర్జును డెదురొక్కొనినది జీవన్మరణసమస్య. అర్జునుడు పరాక్రమింపకున్న రణరంగమున అర్జునునకు మరణమేప్రాప్తి. లేకున్న పారిపోయి అడవుల తలదాచుకొని నీచజీవన మొనర్పవలయును. ఇట్టి క్లిష్ట సమయమున శ్రీకృష్ణపరమాత్మ సమాధానపరచి అర్జునుని రణమునకు పురిగొల్పును. ఇందులకు సాంఘిక ధర్మసూత్రములను మానసిక తత్వశాస్త్ర సిద్ధాంతములను నీతిశాస్త్ర సంబంధములను శ్రీకృష్ణపరమాత్మ పార్థునకుపదేశించును. రెండవ అధ్యాయముతో భగవద్గీతయందలి ముఖ్యసమస్య సమసిపోవును. తరువాత అధ్యాయములందు మానవునకుపకరించు పెక్కు విషయములు ప్రబోధింపబడెను. గీతోపదేశము పూర్తియయినతరువాత 18_వ అధ్యాయము 72_వ శ్లోకమున మానసికఆందోళన అంతరించినదా యని శ్రీకృష్ణభగవానుడర్జునుని ప్రశ్నించును. 73_వ శ్లోకమున సందేహములన్నియు సమసిపోయినవనియు శ్రీ కృష్ణభగవానుడాదేశించినటుల యుద్ధమొనర్చెదనని అర్జునుడు వచించును. (సశేషము)



# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము

శ్రీ. కీళాత్తూరు - శ్రీనివాసాచార్యులు.

( మే సంచిక 20_వ పేజీ తరువాయి. )



శ్లో॥ పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ।

.....................................................

సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥
స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥ 15_19



భాష్యం:_ తతో యుధిష్ఠిరో వృకోదరాదయశ్చ స్వకీయాన్ శంఖాన్ పృథక్ పృథక్ ప్రదధ్మతుః. స ఘోషో దుర్యోధనప్రముఖాణాం సర్వేషామేవ భవత్పుత్రాణాం హృదయాని బిభేద. 'అద్యైవ నష్టం కురూణాం బలం' ఇతి ధార్తరాష్ట్రా మేనిరే. ఏవం తద్విజయాభికాంక్షిణే ధృతరాష్ట్రాయ సంజయః అకథయత్ ॥

అను:_ తరువాత ధర్మపుత్రుడును, భీమసేనాదులును తమ తమ శంఖముల వేర్వేరుగా పూరించిరి. ఆ ఘోషము దుర్యోధన ప్రముఖులైన మీ కుమారులందరి హృదయములను బ్రద్దలు చేసినది. "ఇప్పుడే కౌరవుల బలము (సైన్యము) నశించిపోయినది" అని ధార్తరాష్ట్రులు తలంచిరి. ఇట్లని దుర్యోధనాదుల విజయలాభిలాషియగు ధృతరాష్ట్రునకు (అనుత్సాహకరముగా) సంజయుడు చెప్పెను.

విశే:_ "శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్" ప్రతి యొకరు, తమ ప్రత్యేక శంఖధ్వనిచేతనే ధార్తరాష్ట్రుల హృదయములు బ్రద్దలయిపోవునంతటి గట్టిగా పూరించిరని భావము. "వ్యదారయత్" హృదయములు ఎట్లు బ్రద్దలైనవనగా:_ తన సైన్యమే జయింపగలదని నిశ్చయించి యున్న వారికి, అది నశించిపోవునని యెరుంగుటయే హృదయములు బ్రద్దలైనవనుదాని భావము.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।

..............................................................

ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ 20—23

భాష్యం:— అథ యుయుత్సూనవస్థితాన్ ధార్తరాష్ట్రాన్ దృష్ట్వా, లంకాదహన వానర ధ్వజః పాండుతనయః జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజసాం నిధిం స్వసంకల్పకృత జగదుదయ విభవలయలీలం హృషీకేశం, పరావర నిఖిలజనాన్తరబాహ్య కరణానాం సర్వప్రకారనియమనే అవస్థితం, ఆశ్రితవాత్సల్య వివశతయా స్వసారథ్యే అవస్థితం, యుయుత్సూన్ యథావదవేక్షితుం "తదీక్షణక్షమే స్థానే రథం స్థాపయ" ఇత్యచోదయత్ ॥

అను:— తరువాత, యుద్ధేచ్ఛకలవారై నిలబడియున్న ధార్తరాష్ట్రులఁజూచి, లంకాదాహక హనుమద్ధ్వజుండగు పాండుతనయుండు (అర్జునుడు), జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులకు నిధియు, తన సంకల్పమాత్రము చేతనే విరచితమగు జగత్తు యొక్క సృష్టిస్థితిలయములను లీలగాఁగలవాడును, సమస్తమానవుల ఆంతరబాహ్య కరణ సమూహములను అన్నివిధముల నియమించుటకై యున్నవాడును, ఆశ్రిత వాత్సల్యవివశుండు కనుక తనకు సారథ్యము వహించినవాడునగు హృషీకేశుని జూచి "యుద్ధసన్నద్ధులందరిని చూచుటకనుకూలమగు స్థానమునరథమునునిలుపుము" అని ఆజ్ఞాపించెను.

విశే:— "హృషీకేశం" = సమస్త మానవుల సమస్తకరణ కళేబర సారథ్యధారియగు శ్రీ కృష్ణపరమాత్మకు, అర్జున రథసారథ్యము ఎంతమాత్రము? అని భావము. మఱియు— సమస్త మానవ కరణకళేబరసారథ్యమును అటవుంచి, ఆశ్రిత వాత్సల్య జలధియైనందున అర్జున రథసారథ్యమును పరిగ్రహించెననియు సూచితమగుచున్నది. "రథంస్థాపయ" = రథమును నిలుపుము. (అని ఆజ్ఞ). అందరిని ఆజ్ఞాపించు పరమాత్మ, అర్జునుని ఆజ్ఞకు కట్టుబడెనుకదా ! ఆశ్చర్యము !

సంజయ ఉవాచ:—

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।

..............................................................

ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 24_25

భాష్యం:— స చ తేన చోదిత స్తత్క్షణాదేవ భీష్మద్రోణాదీనాం సర్వేషామేవ మహీక్షితాం పశ్యతాం యథాచోదిత మకరోత్. "ఈదృశీ భవదీయానాం విజయస్థితిరి"తి చ అవోచత్ ॥

అను - ఆ శ్రీకృష్ణుడు అర్జునునిచే ఆజ్ఞాపింపబడినవాడై ఆ క్షణములోనే భీష్మద్రోణ ప్రముఖులైన సమస్త మహీపతులు చూచుచుండగనే, అర్జునిని ఆజ్ఞప్రకారము చేసెను. "ఇట్టిది మీవారి విజయస్థితి" అనియు చెప్పెను.

విశే:- ఏవముక్తః = ఇట్లు చెప్పబడిన వెంటనే, అనగా అర్జునుని అజ్ఞావచనము పూర్తి యగుటయు రథము యిరుసేనలమధ్య నిలబడుటయు ఏకకాలములోనే జరిగిపోయి నది. ఈ రెంటికి వ్యవధానము లేదని భావము.

"ఏతాన్ సమవేతాన్ కురూన్ పశ్య" ఈ చేరియున్న కౌరవులను చూడుము అనగా వీరినే నీవు జయించవలసియున్నది. అథవా - ఈ ధార్తరాష్ట్రులు నిన్ను జయించుటకు వచ్చిరికదా! అని అలక్ష్యతయు సూచితమగుచున్నది.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ [సఖీంస్తథా ।
.................................................
కృపయా పరయావిష్టో విషీదన్నిద మబ్రవీత్ ॥ 26_27

అర్జున ఉవాచ:—

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం ।
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ॥
.................................................
యది మామప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్ 28_46

సంజయ ఉవాచ:-

ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47

భాష్యం:- స తు పార్థో, మహామనాః, పరమకారుణికో, దీర్ఘబంధుః, పరమధార్మికః, సభ్రాతృకో, భవద్భిః అతిఘోరైః మారకైః జతుగృహదాహాదిభిః అసకృద్వంచి-తోఽపి పరమపురుషసహాయేన - ఆత్మనా హనిష్యమాణాన్ భవదీయాన్ విలోక్య, బంధుస్నేహేన, పరయా కృపయా, ధర్మాధర్మభయేన చ అతిమాత్ర సన్నసర్వగాత్రః "సర్వథా - అహం న యోత్స్యామి" ఇత్యుక్త్వా, బంధువిశ్లేష జనిత శోకసంవిగ్నమానసః, సశరం చాపం విసృజ్య, రథోపస్థే ఉపావిశత్ ।

అను:- విశాలమనస్కుడును, పరమకారుణికుడును, దీర్ఘబంధువును, పరమధార్మికుడును, ఆ పార్థుడన్ననో, సహోదరసహితుడుగ మీవలన - అతిఘోర మారణోపాయములగు లాక్షాగృహదహనాదులచే యనేక పర్యాయములు వంచితుడయ్యు, పరమపురుష సహాయముగల తనచే చంపబడబోయెడి మీ వారిని (దుర్యోధనాదులను) జూచి, బంధుస్నేహముచేతను, గొప్పదయచేతను, ధర్మాధర్మభయముచేతనుగల్గిన వణకుచే మిక్కిలిశిథిలమైనసర్వగాత్రముగలవాడై, సర్వథా నేను యుద్ధము జేయబోనని జెప్పి, బంధువియోగమువలన గలిగిన శోకముచే వ్యథచెందిన మనస్సుగలవాడై బాణసహితముగ ధనుస్సునువిడచిబెట్టి, రథోపస్థభాగమున కూర్చొనెను.

విశే:- స కౌంతేయః = "ఆ అర్జునుడన్ననో". నీ కుమారుడు యింతవరకే పాండవులకు అనేక కష్టములనిచ్చి, యిప్పుడున్ను వారినిచంపుటకు సిద్ధమైనాడు. ఆ అర్జునుడన్ననో - బంధువు అను పేరుపెట్టుకొన్న మాత్రంచేతనే వానిని చంప నిచ్ఛగించనివాడై, త్రైలోక్యరాజ్యపర్యంతమైన విజయమునుకూడా తృణముగా దలంచెను కదా! ఇంతేకాదు. శత్రువులకుకూడా దుఃఖము సంభవించుటను సహింపడు కదా! ఆ పరమకారుణికుడు.

"పితౄనథ పితామహాన్" "ఆచార్యాః పితరః పుత్రాః" ఆతతాయులను జంపుటలో యెట్టిపాపమున్ను లేదు. కౌరవులు ఆతతాయులు. పాండవుల లాక్షాగృహములో నుంచి నిప్పంటించిరిగదా! "ఆతతాయి నమాయాంతంహన్యాదేవాఽవిచారయన్" అని ధర్మశాస్త్రముద్ఘోషించు చుండినను, అర్జునుడు పరమధార్మికుడు కమక, ఆచార్యులు, బంధువులు, వీనికంటే వ్యతిరిక్తులైన ఆతతాయులను అని వ్యాఖ్యానించుకొన్నాడు.

"అస్మాన్, నః, వయం, అస్మాభిః" = అర్జునుడు తనయొక్కనికి అపకారము చేసినవారినిమాత్రం ఉపేక్షించలేదు. తన గౌరవస్నేహ పాత్రులగు ధర్మరాజ ద్రౌపద్యాదులకు అపకారము చేసినవారినికూడమన్నించి ఉపేక్షించుచున్నాడు. అంతేకాదు. వారిని వధించేపాపమును, ధర్మాదుల కెందుల కంటకట్టవలెననియు భావించుచున్నాడు.

అర్జునుని నిశ్చితాభిప్రాయ మేమనః- దుర్యోధనాదులు గడచినకాలములో అనేక అపకారములుచేసి ఆతతాయులైనప్పటికిన్ని, యిప్పుడు నన్ను చంపను దేశించినప్పటికిన్ని, యుద్ధమును మానుకొనుట అధర్మ, అకీర్తులకు హేతువయినప్పటికిన్ని, యుద్ధమనునది త్రైలోక్యరాజ్య ప్రాప్తికి వుపాయమైనప్పటికిన్ని, వేయేల, సర్వేశ్వరేశ్వరుడును, నాకు హితతమోపదేష్టయునగు మీరే చెప్పినప్పటికి న్ని నేను యుద్ధముచేయను. అనునదియే.

ఇతి శ్రీభగవద్రామానుజభాష్యానువాద సహిత
శ్రీ భగవద్గీతాయాం ప్రథమోఽధ్యాయః ।



# భగవద్గీతా సిద్ధాంతము

శ్రీ రామశరణ్ కుంచమర్తి వేంకటనరసయ్యగారు.

సంపాదకుఁడు "మోక్షసాధని" గుంటూరు.



శ్రీ మద్భగవద్గీత కలియుగ ప్రారంభమందు భారత యుద్ధము జరుగఁబోవుసమయమున నుద్భవించినది. ఇంత వఱకు అర్జునుఁడు వారిని జయించెదను, వీరినిజయించెదనని అనేక బీరములు పలికెను. కాని రథమును ఉభయ సేనల మధ్యను నిలుపఁగానే ఎదిరి సేననుజూచి మోహామును జెందితాను వారిని జాలితలఁచినట్లుగను, తానుధర్మమును విచారించుచున్నట్లును భావించుచు "అయ్యో! నేనెట్టిపాపకార్యమును జేయుచున్నాను. వీరందఱును నాకు తాతలు, తండ్రులు, అన్నలు, తమ్ములు, కొడుకులు, మనుమలు, మామలు, అల్లుండ్రు, సంబంధులు, గురువులు మొదలగువారై యున్నారు. వీరినెట్లు చంపఁగలను. వీరిని చంపుటకంటె భిక్షమెత్తుకొని తినుట మంచిది. వీరినందఱను జంపిన వీరి పితరులకు పిండోదకముల నిచ్చు వారుండఁజాలరు." అని యిట్లనేక విధముల పరితపించి రథమును వెనుకకుఁ ద్రిప్పుమనెను. ఈతనికి గలిగిన యీ మోహమును బోఁగొట్టుటకు శ్రీ కృష్ణ భగవానుఁడు గీతా ధర్మము నుపదేశించెను. ఇది సర్వోపనిషత్సార భూతమైనట్టిది. గీతవిషయము లోనిది ప్రసిద్ధమే.



శ్లో॥ సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సస్సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్ ॥

ఉపనిషత్తులన్నియు ఆవుగాను, గోపాలుఁడు పాలు పితుకువాఁడుగాను, అర్జునుఁడు దూడగాను, బుద్ధిమంతులు పాలను ద్రాగువారుగను, గీతామృతమే పాలుగను ఇచ్చుట వర్ణింపఁబడినది.

ఈగీత సర్వోపనిషత్సారమగుట చేతనే ప్రపంచములోని మతమతాంతర సిద్ధాంతములన్నిటికిని సిద్ధాంత

గ్రంథముగ నెన్నఁబడుచున్నది. కారణమేమియని యాలోచించిన చో గోపాలకృష్ణుఁడు తన మధుర మోహాన మురళీనినాదమును గీతా రూపమునఁ బ్రవర్తింపఁజేసి ఒక్క గోపికలనే కాక మిగిలిన లోకుల నందఱి నాకర్షించుచున్నాఁడాయని తోఁచుచుండును. లోకమంతయు దీనినాశ్రయించుటయే యీ యూహకు ప్రమాణమగుచున్నది. ఒక జర్మను వేదాంతిని ఒక్కఁడిట్లడిగి నాఁడట: ఏమయ్యా! మీరిట్లూరక మాటిమాటికి యుద్ధములకు కాలు దువ్వుచుండు రెందుకు' అని అడుగఁగా "మేము ఆర్యజాతివారము మా చిహ్నము స్వస్తిక. మాది గీతాసిద్ధాంతము. గీతాసిద్ధాంతము ననుసరించియే మేము యుద్ధము చేయుచున్నా"మని జవాబు చెప్పెనట. అంత నాతఁడాశ్చర్యపడి ఇట్లనెను: "గీతాసిద్ధాంతము యుద్ధము చేసి, సర్వజననాశముచేయుటయా" అనఁగానావేదాంతియిట్లనెను:"గీతా సిద్ధాంతము యుద్ధమే. యుద్ధము చేయనను అర్జునునిచే యుద్ధము చేయించుటయే గీతయొక్క ప్రయోజనము. కృష్ణుడనేక స్థలములందు లేచి యుద్ధము చేయుమని ప్రబోధించెను. "తస్మాద్యుధ్యస్వభారత" గీతాసిద్ధాంతము Get up and fight లెమ్ము, యుద్ధముచేయుము" ఇట్లు యుద్ధోన్మాదులుకూడ గీతాసిద్ధాంతమునే తీసుకొనుచున్నారు. కాని గీతాసిద్ధాంతము యుద్ధముచేయుట కాదు. స్వధర్మమును నెరవేర్చుట. అర్జునునకుమ స్వధర్మ యుద్ధము. కావున "తస్మాద్యుధ్యస్వభారత" యని ప్రబోధించెను. గీతలో సర్వ సిద్ధాంతముల సమావేశము సమన్వయముకలదు. అందువలననే విశ్వవ్యాపకమై సుమారు 1725 వ్యాఖ్యానములను వివిధ భాషలలోను, వివిధమతానుయాయులచే వ్రాయించుకొన్నది. వారు తమతమ సిద్ధాంతముల ననుసరించి గీతకు వ్యాఖ్యానములు వ్రాసికొనిరి. ఇన్ని మతములకు, ఇన్ని సంప్రదాయములకు అనుకూలముగనున్న గీతలోని సిద్ధాంతమును నిర్ణయించుటకష్టమే అయినను నేదైన నిర్ణయముచేయవలసివచ్చినప్పుడు పదమూఁడు ప్రమాణములద్వారా నిర్ణయము చేయవలసియుండును.

శ్లో॥ ఉపక్రమోపసంహారా
వభ్యాసోఽపూర్వతా ఫలమ్।
అర్థవాదోపపత్తీ చ
లింగం తాత్పర్యనిర్ణయే॥

శ్రుతిలింగ సమాఖ్యా చ
వాక్యం ప్రకరణం తథా।
పూర్వం పూర్వం బలీయః స్యా
దేవమాగమనిర్ణయే॥

పై పదమూఁడు ప్రమాణములను బట్టి సమన్వయము చేయవలసి వచ్చుచో గ్రంథము పెరుగఁగలదు.

అయినను పైనఁ జెప్పఁబడినట్లు మొదట అర్జునునకు ఉపక్రమములో మోహము కలిగినది. ఉపసంహార ములో అర్జునుఁడిట్లు మోహము వదలినదని చెప్పెను.

శ్లో॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।
స్థితోఽస్మి గతసందేహః
కరిష్యే వచనం తవ॥

అచ్యుతా! (సత్యమునుండి చ్యుతముకానివాఁడవు) నీ ప్రసాద ముచే నామోహము నశించినది. నాకు నిర్మల జ్ఞానము కలిగినది. ఇఁక నిప్పుడు నాకు సందేహము లేదు. నీ ఆదేశానుసారముగ ధర్మ యుద్ధము చేయుటకు సిద్ధముగ నున్నాను.

ఇందులో "కరిష్యే వచనంతవ" నేను నీ ఆదేశము ప్రకారము నడు చుకొందును అనునదే ఆదేశము యొక్క ఫలము. ఇదియే సిద్ధాంత ము. అనఁగా శ్రీకృష్ణుఁడు ఆరంభ ములో నిట్లు చెప్పెను.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజైర్గుణైః॥

ప్రకృతివలనఁ గలిగిన సత్త్వ రజస్త మోగుణములకు వశులై మానవులు కర్మ చేసితీరవలెను. కర్మచేయక ఆతఁడొక్క క్షణమైనను నుండలేఁడు.

అట్లుండకపోయినచో ఆ చేయు కర్మ యెట్లుండవలసినదియు, అట్లు చేయకపోయినచో కలుగు ఫలమును గూర్చియు శ్రీకృష్ణుఁడిట్లనెను:

శ్లో॥ యః శాస్త్రవిధిముత్సృజ్య
వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి
న సుఖం న పరాంగతిమ్॥

అథ చేత్త్వమిమం ధర్మ్యం
సంగ్రామం న కరిష్యసి।
తతః స్వధర్మం కీర్తిం చ
హిత్వా పాపమవాప్స్యసి॥

శాస్త్రమార్గమును వదలి యిష్టము వచ్చినట్లు వర్తించువానికి సిద్ధియును గలుగదు, సుఖమును లేదు. ఉత్తమ గతియును లేదు.

నీవు నీ క్షత్రియ ధర్మమును వదలి యుద్ధము నొనర్పకపోతివా స్వధర్మమును, కీర్తిని నాశము చేసి కొని పాపమును బొందఁగలవు.

(సశేషం)





# నా సందేశము

[ కడప జిల్లా తిప్పరాజుపల్లె గ్రామంలో 29-6-53 నుంచి 1-7-53 వరకు జరిగిన గీతాప్రచారసంఘవార్షికోత్సవ సందర్భంలో రామదర్శనం సంపాదకులును, శ్రీ రామతీర్థ సేవాశ్రమ స్థాపకులునునగు శ్రీ పూజ్యపాద కేశవతీర్థస్వాములవారు పంపిన సందేశము.

సంపాదకుడు.]



★

ఇక్కడచేరిన మహాభక్త జనులందరిలో ప్రకాశిస్తున్న పరమాత్మ జ్యోతికి వినమ్ర పూర్వకంగా నమస్కరిస్తున్నాను. మీ అందరిలోగల దైవచైతన్యమును ప్రబుద్ధ పరచడానికై ఏర్పడిన ఈ గీతాప్రచార భజనసంఘ ధర్మోత్సవ కార్యకలాపాలను హృత్పూర్వకంగా అభినందిస్తున్నాను. కలికల్లోలితమైన ఈసమయంలో, ఇట్టి ధర్మసంఘాలు ఎంతో అవసరం. తమ తమ శక్తి కొలది, ఇట్టి సమాజాలు సేవచేయడం హర్షదాయకం. గీతాప్రచార రూపకమైన దైవభజనం ఈ సమాజాశయం. ఎంత ఘనతరాశయం! ఈఆశయాన్ని ఈసంఘంనిర్వక్రంగా నిర్వర్తించగల చైతన్య శక్తులను పరమాత్మ అనుగ్రహిస్తాడు గాక.

గీత యొక్క పరమాశయం అహంకార పరిత్యాగం, బ్రహ్మైక్య జీవనము. ఈ స్థితిని అలంకరించినప్పుడే మానవుడు శాంతిని అనుభవించగలుగుతాడు. మనకర్మలన్నీ పరమాత్మైక్యతకు దారితీయాలె. అనుకూలించాలె. పరమేశ్వర ప్రీతికరమైన నిష్కామకర్మవిధానంలో మనం నడవాలె. అహంకారం మాయమై, బ్రహ్మైక్యత సిద్ధిస్తుంది. మనందరిలో పరమాత్మ, జ్ఞానజ్యోతి, భగవత్తేజం ఉన్నది. పశుప్రవృత్తులు వున్నాయి. పశుప్రవృత్తులను, అహంభావాలను మనం విడదీసి లోనగల దైవతేజంలో విలీనంగావాలె. పశుప్రవృత్తులు ప్రపంచంవైపు లాగుతుంటాయి. దైవప్రవృత్తి సత్యంవైపు లాగుతుంటుంది. దైవప్రవృత్తిని, జ్ఞానతేజాన్ని సముద్ధృతపరచి, పశుతత్వాన్ని వినాశనంచేసి, అహంకారాతీతులమై, సత్య స్వాతంత్ర్యోద్దీపితులమై, దైవమయ జీవనులమై ప్రకాశించగలం. ఇట్టి దైవైక్యసిద్ధికోసం చేసే

పరిశ్రమంతా, కృషంతా దైవభజనమే. అహంకార వినాశనం చేయడానికి మీరు భగవంతుని అనేక మార్గాల్లో భజించవలసివుంది. కుమారుడు తండ్రిని సేవించడం ఎలాచేస్తున్నాడు? కాళ్లు కడుగుతున్నాడు. స్నానం చేయిస్తున్నాడు? అన్నం పెట్టుతున్నాడు. పక్కవేస్తూన్నాడు. ప్రియాలాపాలు మాట్లాడుతున్నాడు. ఎన్నోరకాల సేవలతో తండ్రిని ఉపలాలనంచేసి, పితృకృపాసిద్ధిని నిజమైనకుమారుడు పొందగలుగుతున్నాడు. అలాగే మనమూ,జగత్పితయైన జనార్దనుని, పరమాత్మను ఆరాధించాలె. అనేక విధానాల్లో ఆ జగన్నాధుని, ఆ సర్వాంతరాత్మను, నిస్స్వరూప బ్రహ్మమును భజించాలె. అప్పుడు ఆత్మకృపాసిద్ధికలుగుతుంది. బ్రహ్మైక్యసిద్ధి కలుగుతుంది. నిర్వాణశాంతి లభిస్తుంది. అహంభావం నశిస్తుంది. శివోహంభావం ప్రజ్వలిస్తుంది. దీనభావంపోతుంది. దైవభావం ప్రకాశిస్తుంది. మన జీవనాన్ని ఈశ్వర భజనంగా మార్చివేయాలె! సమగ్ర దైవభజనం చేయడమెలామరి?

పరమాత్మను గూర్చి శ్రవణం చెయ్యి, ఇది శ్రవణభజనం. పరమాత్మనుగూర్చి అనుదినం ధ్యానం చెయ్యి. ఇది ధ్యానభజనం. నామసంకీర్తనంచెయ్యి. ఇదినామభజనం. మహాపురుషులను, దీనులను, దుఃఖితులను, పేదలను, సహాయార్థులను, భూతకోట్లను, హరిస్వరూపులుగా గ్రహించి సేవచెయ్యి. ఇది సేవాభజనం. పరమాత్మనుగూర్చిన ప్రతికర్మా, ప్రతి విధానమూ భజనమే. ఇట్టి దైవ భజనంద్వారా మనకు దైవైక్యశ్రీ లభిస్తుంది. గీత, మనకిట్టి దైవ భజనముద్వారా, పరమాత్మనుచేరే పథాన్ని చూపిస్తువుంది. అహంకార పంజరవిముక్తిని పొందే మార్గాన్ని చూపిస్తూవుంది.

ఈ త్రయాహ్నిక సమాజోత్సవాల ఆశయం మనందరినీ, ఇట్టి దైవభజనాపథంలో నడిపించ ప్రేరణ చేయడానికే.గీతాశయాచ్చాయల్లో నడపించి ధన్యతపొందించనే. ప్రియ సహోదరులారా! కాలంగడచిపోతున్నది. కర్తవ్యమును గ్రహించారు కదా? పడిపోయిన వైరాగ్యధైర్య గాండీవాన్ని తిరిగి చేతధరించండి. ఓంకారశంఖాన్ని ఏదీ పూరించండి. వాసుదేవునికి, భగవంతుడికి, పరమాత్మకు, ఇంద్రియాశ్వాలకళ్లాలు ఒప్పగించండి. లేచి, శరీరరథాన్ని కదలనివ్వండి. జీవిత కురుక్షేత్ర సంగ్రామంలో మీరే విజయులు!


[ మిగత 30_వ పేజీలో చూడుడు. ]

# 'త్రివిధా భవతి శ్రద్ధా'

శ్రీ వసంతరావు వేంకటరావుగారు, M. Sc.

[ శ్రీ వేంకటరావుగారు విజయనగరం మహారాజావారి కళాశాలలో పదార్థ విజ్ఞానాధ్యాపకులుగా పనిచేస్తున్నారు. వైజ్ఞానికంగా వీరు చాలా పుస్తకాలు, వ్యాసాలు వ్రాశారు. ఆధునిక భౌతిక విజ్ఞానం మన ప్రాచీన వేదవేదాంత తత్త్వాలతో సంఘర్షించదనే విషయాన్ని ప్రచారంచేయటమే వీరి పరమ లక్ష్యం. వారి రచనలన్నిటిలోనూ అది ప్రతిఫలిస్తూనే ఉంటుంది.

సంపాదకుడు. ]

"అప్పుడేఅయిపోయిందండీ గీతా పారాయణం ?"

"ఎంతసేపు! గంటన్నరకాలేదూ?"

"కొన్నినిమిషాలు తక్కువే కాని ఎక్కువ కాలేదు. కొన్ని వందలు శ్లోకాలున్నాయి కదండీ?"

"ఏడువందలు శ్లోకాలు. బాగా నలిగిన శ్లోకాలైతే గంటకు 500 దాకా చదువవచ్చు; అదేమంత కష్టమైన పనికాదు."

"అంతస్వచ్ఛంగా చదివినప్పటికి గంటన్నరలో పూర్తికావడం ఆశ్చర్యమేనుమండీ !"

"ఏమీలేదు. అభ్యాసంయొక్క విశేషమే! అది ఎంత కష్టంగా కనిపించే పనైనప్పటికి అభ్యాసంవల్ల సులభంగా సాధించవచ్చును. అందుచేతనే 'అభ్యాసయోగేన తతోమామిచ్ఛాప్తుం ధనంజయ' అని భగవానుని వచనము. నిజంగా యోచించినట్లైతే అభ్యాసంచేత సాధింపరానిదిలేదు."

"మీరెప్పుడో చెప్పేరు పురాణ పురుషుల అంతరార్థంగురించిఏకలవ్యుడు,వాల్మీకి, మార్కండేయుడు మొదలైనవారు అత్యుత్తమ భావాలకి మూర్తిమత్త్వ మీయగా జన్మించినవారని మీరుచెప్పిన విశేషం హృదయానికి హత్తుకొనిపోయిందంటే నమ్మండి. కాని, ఈ నాటికి వారికి పురాణాలలో బూతులుతప్ప కనిపించడం లేదు. ఎంత అఘాయిత్యం?......"



"అన్వేషకునికి ఆవిష్కృతమయేల విషయాలు వాని మనస్థితినిబట్టి ఉంటాయన్నది సామాన్యజ్ఞానం. మన ప్రతిబింబమే మనకు ప్రపంచంలో గోచరించేది. ప్రకృతి సౌందర్యాన్నిచూచి పుష్పసౌరభాన్ని ఆఘ్రాణించి ఆనందపరవశులయే సాత్త్వికులూ ఉన్నారు; ప్రపంచంలో దైన్యం విషాదం

తప్ప సుఖాన్ని చూడలేక వాపోయే తామసులూ ఉన్నారు. అంతేకాదు. ప్రపంచంలో సంభవిస్తుండే సంఘటనల ప్రాబల్యం మానవ యోచనాక్రమంపై నుండకపోదు. ఒక దేశంయొక్క వాతావరణాన్ని బట్టి ఆ దేశకవుల రచనలు వెల్లివిరుస్తాయి. రెండవ ప్రపంచయుద్ధం తరువాత యూరప్, ఇంగ్లాండువంటి పాశ్చాత్యదేశాలలో చాలజుగుప్సాకరమైన సాహిత్యం బయలుదేరింది. ఆ దేశాలు యుద్ధంలో బాగా దెబ్బతిన్నాయి. అమితమైన ప్రాణనష్టం ధననష్టం కలిగింది. ఇనుపగజ్జలతల్లి తాండవమాడ మొదలుపెట్టింది. జీవితంలో ఆశారేఖలు గోచరించే సదవకాశంలేక, చాలమంది పౌరులు తీవ్రదుఃఖాగ్నిలో క్రుగ్గవలసి వచ్చింది. అందుచేత పాశ్చాత్యసాహిత్యంలో తదనుగుణంగా మార్పువచ్చింది. కాని, మనదేశంలో కార్మికకర్షకుల జీవితాలను ఇతివృత్తంగా గ్రహించడం ఒక ఫాషన్ (fashion) అయిపోయింది. వారిస్థితి నిజంగా యెట్లున్నప్పటికి పూరిగుడిసెలు, బక్కచిక్కినశరీరాలు, నగ్నదేహాలు మొదలగు ప్రత్యేకపదజాలంతో అర్థంలేని గేయరచనకు పూనుకొనువారి సంఖ్యాపెరిగింది. వారు వర్ణించే దైన్యానికి రచయితల హృదయాలు దురపిల్లుతున్నాయనుకోను. నిజంగా వారికంత సానుభూతి ఉంటే ఆ దైన్యాన్ని ఉపసంహరించే కార్యకలాపంలో వారు నిమగ్నులై యుండవలసింది. కార్యాచరణానికి ఓపిక లేదు. ఈ విధంగా ఏర్పడిన దొకనవీనసంఘం; దానిసభ్యులు ఆత్మవంచకులు. పెదవిసాయంకంటె వారెక్కువ చేయలేరు.”

“ఈ మధ్యపత్రికలలో కొన్ని గేయాలు చదువుతుంటే చాలావిచారంకలుగుతూందండీ! వాటిలో గేయానికి సహజమైన నడక కనిపించదు. పదజాలంలో గాంభీర్యంలేదు; భావాలలో ఔన్నత్యంలేదు.

“నిజమేకాని ఇట్టి రచనలకు సైతం ప్రయోజనం లేకపోలేదు. సారస్వత చరిత్రలో ఇవన్నీ అనివార్యమైన ఘట్టాలు. శతాబ్దాలతరబడి భావదాస్యానికి చిక్కి మాతృభాషా మాధుర్యాన్ని మరచిపోయిన స్థితిలో దాస్యశృంఖలాలను తెంపుకొని స్వాతంత్ర్య వాతావరణంలో ప్రవేశించినప్పుడు మానవహృదయం స్వేచ్ఛావిహారంచేస్తుంది; సర్వతోముఖ వికాసానికి ప్రయత్నిస్తుంది. అట్టి సందర్భంలో పరిసరసాహిత్యప్రభావం కనిపించకపోదు. అంతర్వాహినిగానున్న సాహిత్యసరస్వతి నిరాఘాటంగా బహిర్గమించి వెల్లువలై ప్రవహిస్తుంది. ఆ వరదనీటిలో బురద అపారంగానుంటుంది. కాలక్రమేణ సాహిత్యజలం విశుద్ధమాతుంది.”

“జీవజాలమంతటిలోను ప్రకృతిని ప్రతిఘటించినవాడు మానవుడొక్కడే. హృదయం, మనస్సు, బుద్ధి సృజనాత్మకంగా మానవునిలో పనిచేయడం మొదలుపెట్టేయి. ప్రకృతి ననుసరించడమేకాక, కొన్ని విషయాలలో ప్రకృతిని తలదన్నినట్లు సృష్టించగల సామర్థ్యాన్ని, క్రమశః, పెంపొందించుకొన్నాడు. జ్ఞానియైనాడు; విశ్వశక్తుల ప్రభావాన్ని మనశ్శక్తితో గుర్తించేడు. ఆధ్యాత్మప్రపంచంలో మహోన్నతశిఖరాల నారోహించేడు. కళారాధకుడయేడు. జీవంతో తొణికిసలాడుతున్నట్లు భ్రమింపజేయు కళాఖండాలను నిర్జీవ జడ ద్రవ్యంనుండి సృష్టించేడు. సప్తస్వరసమ్మేళనంతో రాణరగించు మనోహరగానాన్ని ఆలపించేడు. భౌతికవిజ్ఞాన పథాన్ని ఆశ్రయించి, మూలమూలల ప్రకృతిని శోధించి, పరీక్షించి, విశ్లేషించి, ప్రకృతి రహస్యాన్వేషణలో సిద్ధహస్తుడైనాడు ...”

"ఈ విధంగా పురోగమిస్తున్న మానవుడే ప్రపంచాన్ని క్షామజ్వాలలతో మంట పెట్టేస్తున్నాడు. అదేం కర్మమండీ?"

"పైని వివరించిన మూడు తెగలకు చెందిన వారెవ్వరూ అట్టి ఘోరకార్యానికి ఒడికట్టుకోలేదు. ఆత్మజ్ఞానవేత్తలు, కళారాధకులు, భౌతికవిజ్ఞానులు వారివారి కర్మక్షేత్రాలలో ఫలాపేక్షారహితులై ఏకాగ్రతతో శ్రమిస్తున్నారు. ప్రపంచంనుండి వారు స్వీకరించేదానికి సహస్రాధికంగా ప్రపంచానికిస్తున్నారు. అంతశ్శక్తి ప్రచోదితమైనవారి మానసికావస్థను సామాన్యులూహించుకోలేరు. వారిపనికి నియతకాలముండదు. ఉషఃకాలం, మధ్యాహ్నం, సాయంసమయం, అర్ధరాత్రి అను విభాగాలనేవారు పాటించరు. వారిమనస్సు సంకుల యంత్రశాలవంటిది; అందులో చక్రాలు నిర్విరామంగా భ్రమిస్తూనే ఉంటాయి. నూతనయోచనా వస్తుసంచయమశ్రాంతం అవిచ్ఛిన్నంగా ఉత్పన్నమౌతూనే ఉంటుంది. దాని ప్రయోజనం విశ్వశ్రేయస్సు. కాని, రాజ్యాంగం వీరిచేతులలో లేదు. రాజ్యాంగ తంత్రాన్ని నడిపించేవారు తామసులు. వారిది సంస్కృతాత్మ కాదు. వారి దృష్టిలో మానవజీవితానికి విలువలేదు. బహురక్షకపరివేష్టితులై సువిశాల సౌధాలలో నిరపాయంగా వారు జీవిస్తూ 'దేశభక్తి' 'మాతృసేవ'వంటి మత్తుమందులను ప్రజలపైజల్లుతారు. మేకలవంటి, పౌరులు వివశులై తండోపతండాలుగా సైన్యంలోచేరి ఘాతుకయంత్రాలకు ఆహుతులై పోతారు."

"అనాదిగా యుద్ధాలు జరుగుతునే ఉన్నాయికదండీ! సాంస్కృతికంగా మానవుడెంత పురోగమిస్తున్నా ఈ ఘారణ హోమాలు తగ్గడంలేదే?"

"నిజమే. మానవుడీ ప్రపంచంలో కాలు పెట్టినప్పుడే మూడురకాలయుద్ధాలను తనతో తీసికొనివచ్చేడు. మొదటిది బాహ్యప్రకృతితో చేసేయుద్ధం. అది అత్యంతావశ్యకమైనది. దానిలో విజయం సాధిస్తేకాని మానవజాతి జీవించలేదు. భౌతికరంగంలో మానవుడింత వికాసంపొందియుండకపోతే, ఇప్పటికంతరించిన అనేక మృగపక్షిజాతులవలె మానవజాతిసైతం ఏనాడో అంతరించియుండేది. ఇక రెండవరకపుయుద్ధం మానవుడు తోడిమానవులతో సాగించేది. మానవ హృదయాంతరాళంలో పొంచియున్న పశుత్వంయొక్క ఆవిర్భావమే అది. పశుపక్ష్యాదులు ప్రకృతినిజయించలేక పోయినప్పటికి తమలోతాము తీవ్రంగా పోరాడి ఆత్మవిధ్వంసం చేసికొంటున్నాయి. పరులను నాశనంచేస్తేకాని తను సుఖంగా జీవించలేనన్నది ప్రధానంగా పశుభావం. అదింకా మానవహృదయాన్ని బలవత్తరంగా ఆశ్రయించిఉంది. మానవుడెంత త్వరగా దానిని నిర్మూలిస్తే సంఘజీవనాన్ని అంతత్వరగా పోషింపగలుగుతాడు. మూడవరకపుయుద్ధం మానవుడు తన అంతరంగలో తనతో తను చేసికొనేది. ఈ యుద్ధం అవిచ్ఛిన్నంగా సాగుతూంటుంది. మానవునిలోనున్న, దైవత్వ మానవ పశుత్వాంశల పరస్పర పోరాటమది; అది సత్త్వరజస్తమోగుణాల అంతర్యుద్ధం. అది అదృశ్యంగా జరుగుతుంది. ఈ పోరాటంలో మానవుని కుపకరించే బాహ్యయంత్రాలుగాని, భౌతికోపకరణాలుగాని లేవు. అంతర్యుద్ధంలో జయించడానికి నిరంతరసాధనతప్ప వేరుమార్గంలేదు. తామసప్రవృత్తి భయంకరరాక్షసివలె సర్వసంహారం చేయడానికనుక్షణం ప్రయత్నిస్తుంది. దానిని బంధించడం చాలకష్టం."

"అయితే ఈ మూడుయుగాలలో ఏది ముఖ్యమైనదండీ ? అందులో, శాంతి యుతంగా సహకారంతో జీవించడానికేది తోడ్పడుతుందంటారు? "

"చారిత్రాత్మకంగా చూచినట్లయితే ఆకలిదప్పులను తీర్చుకొని సుఖంగా జీవించ నేర్చిన మానవులలో మూడవదైన అంతర్యుద్ధమే ప్రాధాన్యం వహించినట్లు కనిపిస్తుంది. ఈజిప్టు, బాబిలోనియా, గ్రీస్, చైనా, ఇండియా మొదలగు దేశాలన్నిటిలోను మొదట ఆత్మవిచారం ప్రారంభమైంది. జగద్విషయం మానవునికి జగత్తుకిగల సంబంధం, మరణరహస్యం మొదలైనవి తెలిసికోవాలని, మానవులన్ని దేశాలవారు, తీవ్రంగా యోచించేరు. వారి తర్జన భర్జనలన్నీ మత గ్రంథాలుగా రూపొందేయి. వాటిలో మన ప్రాచీనవిజ్ఞానం మహోత్కృష్టమైంది. పాశ్చాత్యదేశాలలో మతానికి ఆధునిక విజ్ఞానానికిగల సంఘర్షణ మన ప్రాచీన విజ్ఞానానికి ఆధునిక భౌతిక విజ్ఞానానికి లేదు.

"పురాణేతిహాసాలను వింటూ వేదామృతాన్ని గ్రోలుతూ, తత్త్వాన్ని పాటలుగా పాడుకొంటూ భారతీయ పౌరుడు జీవించడాని కలవాటు పడ్డాడు. కాని, హృదయ వికాసం పొందిన మేధావంతులనే కాని ఆధ్యాత్మజ్ఞానం ఆకర్షించ లేకపోయింది. దాని అంతరార్థాన్ని సామాన్యజనులు గ్రహించలేకపోతున్నారు. శ్రవణంతో ఆగిపోతున్నారేకాని, ఆ జ్ఞానాన్ని కార్య రూపంలోనికి అనువదించలేకపోతున్నారు. దానికి ముఖ్యకారణం అంతర్యుద్ధంయొక్క ప్రాముఖ్యాన్ని తెలిసికోలేక పోవడమే. తామసాన్ని రూపుమాపి రాజసాన్ని అవలంబిస్తూ సాత్వికాన్ని అలయంగా పెట్టు కొనకపోతే మానవుడు మృగప్రాయుడౌతాడు."

"ఇప్పటికే అయేడేమో అనుకొంటాను. ఆటంబాంబులతో లయకాల రుద్రునివలె సంహారంచేయడం అభ్యుదయసూచకమా?" అని సుధ అంటూంటే రేడియోలో గేయం వినవచ్చింది.

"వినండి, వినండి, మన ప్రస్తుత సంభాషణకు సంబంధించిన గేయంలాగ నేవుంది."

"అంబరచుంబిత వాయుయాన మా
హాత్మ్యము వ్యర్థము కావలెనా !
మత్స్యసన్నిభ జలాంతర్గమనము
మత్సరాగ్ని కింధనమగునా !
సృష్టి రహస్యాన్వేషణమంతయు
నష్టము భ్రష్టము కావలెనా !
కష్టార్జిత విజ్ఞానము యావద
రిష్ట దాయకము కావలెనా !
కాలాకాశాతీతత్వము హే
లాలీలానుగతిం జనునా !
సౌఖ్యవర్ధక విశిష్ట సృష్టియు
స్వప్నప్రాయంబై చనునా !

*　　*　　*　　*

అణుసంయోగ విధాన మెరింగియు,
అణునిర్మాణ రహస్య మెరింగియు,
మూలతత్త్వముల మూలమెరింగియు,
ద్రవ్యశక్తి సంబంధమెరింగియు,
సౌరశక్తి కాధార మెరింగియు,
ఉడుపరిణామ చరిత్ర మెరింగియు,
విద్యుదయస్కాంతత్వ మెరింగియు
రుజసంహారప్రక్రియ లెరిగియు,
మానవాభ్యుదయ మార్గ మెరింగియు,
తుట్టతుదకు సూక్ష్మాతిసూక్ష్మమగు
మట్టికణములో నిమిడిన శక్తికి
పట్టుపడెదవా? పడి ప్రపంచమే
మట్టిం చెదవా మానవుడా ?

॥సీ విశ్వాణనమ॥

పల్లవి:

[ నీ నిర్మాణము నీ చేతులతో
నే నిర్మూలము జేసెదవా ?
స్వార్థపరత్వపిశాచప్రేరిత
సర్వధ్వంస మొనర్చెదవా? ]

జీవులు కలకలలాడేలోకం,
జీవాభ్యున్నతి కనువగులోకం,
జీవనదుల కాస్పదమగులోకం,
జీవశక్తులకు నాట్యరంగమగు
లోకములందే కైకలోక మీ
లోకమునొక సూక్ష్మాణు శక్తిచే
భీకరాగ్ని కీలావృత మానక
ప్లేకవిపత్తులోమంట బెట్టెదో

॥ నీ నిర్మాణము ॥

పరవిధ్వంసమె ఆత్మరక్షణో
పాయమందువా మానవుడా !
బ్రతుకనిచ్చి మరి బ్రతికెడు తెరువె
ప్పటికి నేర్తువో మానవుడా !

మారణాస్త్ర నిర్మాణమె శాంతికి
మార్గమందు వా మానవుడా !
మారణహోమం ప్రారంభించిన
ఆరవునమ్మోహహోమాగ్నులే ॥

॥ నీనిర్మాణము

"అదేసుధా! సాత్విక ప్రవృత్తి ప్రపంచంలో ప్రబలితేనేకాని ఈపోరాటాల కంతు కనిపించదు. అంతర్యుద్ధంలో జయించు వారిసంఖ్య ఎంత అధికంగా పెరిగితే బాహ్యయుద్ధాలంత త్వరగా అంతరిస్తాయి. ప్రకృతితోయుద్ధం ఎన్నడూ ఆగదు. ఆసందేశాన్ని యావత్ ప్రపంచానికి భారతదేశమే అందీయాలి."

ఇంతటిలో రేడియోవార్తల సమయం వచ్చింది. వారి సంభాషణకు తాత్కాలికంగా అంతరాయం కలిగింది.

— వసంతరావు వేంకటరావు.



[ 25_వ పేజి తరువాయి ]

ఇదిగో ఇంకొకసారి వినండి కేశవ సందేశాన్ని:

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాంనమస్కురు ।
మామేవైష్యసి సత్యంతే
ప్రతిజానే ప్రియోఽసి మే॥

తా॥ నీవుమనస్సును నాయందు నిలుపు. నాభక్తుడవుగా నన్ను అర్చించు. (సేవించు). నాకు నమస్కరించు. (నాకు విధేయుడవై వర్తించు). నన్నే పొందుతావు. నేను నీకు యథార్థాన్ని ప్రతిజ్ఞాపూర్వకంగా చెపుతున్నాను. ఎందుకంటే, నీవు నాకు ప్రియుడవు కాబట్టే.

శ్రీ కేశవతీర్థస్వామి.

# శ్రీగీతాసాహిత్యసేవాసమితి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర పంచమఠాధ్యక్ష జగద్గురు శ్రీ వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తాలూకా. — 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. — 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. — 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ — 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ — 7. శ్రీతొమ్మండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. — 8. శ్రీ ఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము. శిరివెళ్ళ తాలూకా. — 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. — 10 డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. — 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. — 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్య గారు, పడకండ్ల, శిరివెళ్లతాలూకా. — ♦ ♦ ♦ కడప జిల్లా. 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణగారు, రామిరెడ్డిపల్లె, పులివెందల తాలూకా. — 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. — 15. శ్రీ పోలేపల్లి రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు. ♦ ♦ ♦ చిత్తూరుజిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లె మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్‌వీధి, చిత్తూరు. — 17. శ్రీ యస్. రామలింగం పిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు. ♦ ♦ ♦ అనంతపురంజిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్ఘనానంద మహర్షులవారు, శ్రీభవనాశి ఆశ్రమం. — 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రొగ్గలపాడు. ♦♦♦ బళ్లారిజిల్లా: 20. శ్రీ పెండుకూరు గోవిందప్ప అండ్ సన్స్, హాస్పెట్. 21. శ్రీసుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్. — 22. శ్రీగంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. ♦♦♦ కోలారుజిల్లా: 23. శ్రీఎం. వి. రామలింగంశ్రేష్ఠిగారు, బంగారుపేట. మైసూరుస్టేట్: 24. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి. ♦♦♦ ఉత్తర ఆర్కాట్ జిల్లా. 25. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటునూరు, కణ్ణమంగళంపోస్టు. ♦♦♦ నెల్లూరుజిల్లా: 26. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు — 27. శ్రీ వేమారెడ్డి బంగారామిరెడ్డిగారి ధర్మపత్ని యశోధరమ్మగారు, ఇనమడుగు. ♦♦♦ హైదరాబాద్ స్టేట్ 29. శ్రీడి.పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. ♦♦♦ గుంటూరుజిల్లా: 28. శ్రీశ్రద్ధానంద స్వాములవారు. శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, తెనాలి తాలూకా.

## రాజపోషకులు రు. 54.

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మృతిచిహ్నముగ శ్రీ యన్. అయ్యప్పరాజుగారు, గోనుపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండ ఓబులేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీసోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 6. శ్రీ బైసాని రామదాసుగారు,

ఆళ్లగడ్డ. – 7. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 8. శ్రీ యస్. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తా॥ – 9. శ్రీ మాపెళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 10 జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గురువయ్య శ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 11. శ్రీమతి ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు, నంద్యాల. – 12. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీల, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామనాథ శాస్త్రిగారు, కోయిలకుంట్ల. – 14 శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం ♦♦♦ కడపజిల్లా: 15. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 16. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. – 17. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 18. శ్రీ పి. నారాయణశ్రేష్ఠి గారి కుమారుడు శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 29. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 20. శ్రీ ఉమ్మిడి పెద్ద సుబ్బారెడ్డి గారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా. ♦♦♦ చిత్తూరు జిల్లా: 21. శ్రీ. కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 22. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తగపల్లె. – 23. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. – 24. శ్రీ నటుకల రామ నాథంశ్రేష్ఠిగారు, బజారువీధి, చిత్తూరు. ♦♦♦ అనంతపురంజిల్లా: 25. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 26. శ్రీ బుశెట్టి వన్నప్పగారు, ఉరవకొండ – 27. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 28. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 29. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకనగుర్తి 30. ఆనుదాల వెంకట రెడ్డిగారు, రాగలపాడు పోస్టు ♦♦♦ బళ్లారిజిల్లా: 31. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్, – 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు – 33. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు. – 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరిపోస్టు. – 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి – 36. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి – 37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. – 38. శ్రీ సాధు శివలింగప్ప గారు, కుందనగుర్తి. – 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 41. శ్రీ శాకల ఆంజనేయులు గారు, కుందనగుర్తి – 42. పాటిల్ పెద్దబళిరెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి – ♦♦♦ మైసూర్ స్టేట్:– 43. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 44. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 45. శ్రీ కె. నంజప్ప శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 46. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్. – 47. శ్రీ నారాయణమూర్తిగారు, c/o శ్రీ నూరా విరూపాక్షయ్య

గారు, తొండేభావి, కోలారుజిల్లా. ♦♦♦ నార్తుఆర్కాడుజిల్లా: 48. శ్రీశంకరనాయుడు గారు, కార్వేటినగరు. ♦♦♦ హైదరాబాదుస్టేట్. 49. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీల, నల్గొండ. _ 50. శ్రీదేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ ♦♦♦ నెల్లూరుజిల్లా: 51. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు_16. — 2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వంకవాగలి, ఆలూరుతాలూకా. బళ్లారి జిల్లా.



## వార్తలు.

శ్రీశంకరానందస్వాములవారి పర్యటన క్రమాలు జూన్ నెల సంచికలో ప్రకటింప బడినవి. అప్పుట ప్రకటించిన నెల్లూరు — మదరాసు కార్యక్రమాలు కొన్ని అవాంతర కారణాలతో రద్దుచేయ బడినవి.

* * *

శ్రీవారు 9_7_53 నుండి 15_7_53 వరకు చాగలమర్రి శ్రీ శివరామానందాశ్రమ మునందు ఈశోపనిషత్తు — భగవద్గీతలను గూర్చి ఉపన్యసించినారు. అచ్చటినుండి వారు మైసూరుస్టేట్ అజ్జంపూరు శ్రీ శివా నందాశ్రమమునందలి ఉపన్యాసకార్యక్రమ మున పాల్గొని హాస్పేటకు వచ్చినారు.

* * *

శ్రీ రామకృష్ణ బ్రహ్మచారిగారు మదన పల్లెలో 26_7_53 నుండి 9_8_53 వరకు శ్రీమద్ భాగవత తత్త్వమునుగూర్చి ఉప న్యసించినారు. అంతట వారు 10_వ తేదీ హంపి చేరుకొన్నారు.

* * *

14_8_53 నుండి వారము దినములు శ్రీ హంపి క్షేత్రమునందు శ్రీవారి ఆధ్వర్య మున గీతా పురశ్చరణ యజ్ఞము జరుగును. ఆ సందర్భమున శ్రీరామకృష్ణ బ్రహ్మచారి గారు సంన్యాసాశ్రమదీక్షను స్వీకరింతురు. తర్వాత శ్రీ స్వాములవారు శ్రీ కృష్ణ జన్మాష్టమీ ప్రయుక్త సప్తాహమును జరిపిం చుటకు చాగలమర్రి వెళ్లెదరు.

* * *

శ్లో॥ మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణీ విహారిణే।
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥

आह्लगङ्गा — गीता साहित्य सेवा समिति की तरफ से संपादित तथा प्रकाशित.
मेनेजिंग एडिटर—यन० श्रीकण्ठम्, गुळदूर्ती, कोइलकुण्ट्ला, (आंध्रा)

# గీతావాణి

27





మూడవ సంవత్సరము  మూడవ సంచిక.

ఆనరరీ ఎడిటర్ - స్వామి శ్రీ శంకరానంద

అసోసియేట్ ఎడిటర్ - స్వామి శ్రీ రామకృష్ణ

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 సెప్టెంబర్ 1953.

# విషయసూచిక - సెప్టెంబర్ '53.

# "గీతావాణి" 27

శ్రీ గీతాసాహిత్యసేవా సమితి పక్షమున ప్రకటింపబడు
గీతాశాస్త్ర సందేశ మాస పత్రిక.





ఎడిటర్


శ్రీ కాశీవిద్యాపీఠము, బనారస్ — 2.



మేనేజర్—శ్రీ స్వామి శివానంద, గీతావాణి—ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా నాలుగు రూపాయలు.



SEPTEMBER' 53.

# మా అభినందనలు.



అయోధ్య సంస్కృత సంఘము వారు ప్రతిసంవత్సరం సాహిత్య ధర్మ సమాజాలకు సేవజేసిన వారలకు శ్రీ పూరీ గోవర్ధనమఠాధ్యక్షులగు శ్రీశంకరాచార్యులవారి యాజమాన్యాన బిరుదములను ఇవ్వటం పరిపాటి. ఈసంవత్సరం పై సమాజమువారు "సాహిత్యరత్న" అనే బిరుదాన్ని శ్రీ క్రొత్త సచ్చిదానంద మూర్తి, ఎం.ఏ. పి.హెచ్.డి., వారికి ప్రీతి పురస్సరంగా ఇచ్చి సన్మానించారు. శ్రీ సచ్చిదానందమూర్తిగారు గీతావాణిపాఠకులకు పరిచితులే. ప్రస్తుతంవారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తత్వశాస్త్రోపన్యాసకులుగా ఉన్నారు. హైందవమతానికి శ్రీ మూర్తిగారు గావించిన గ్రంథరచనా వ్యాఖ్యానాదులకు శ్రీ గోవర్ధన పీఠాధ్యక్షులు హర్షిస్తు అభినందిస్తూ ఒసగిన సత్కారమే ఈ "సాహిత్యరత్న" బిరుదము. శ్రీ మచ్ఛంకర భగవత్పాదుల వారు ఏడవ శతాబ్దములో స్థాపించిన చతుర్మఠములలో శ్రీ పూరీ గోవర్ధనపీఠము ఒకటి కావడంతో ఈసత్కారానికి ఎంతోవిలువవుంది.

ఆధ్యాత్మిక సాహిత్యరంగంలో వీరుపొందిన ఈ ఘనతర సన్మానానికి మేము హృదయపూర్వకముగా శ్రీ మూర్తిగారిని అభినందిస్తున్నాం. మున్ముందుకూడా శ్రీమూర్తిగారు తమ అమూల్య రచనలను, వ్యాఖ్యలను విరివిగా అందిస్తారని ఆశిస్తున్నాం. ఓం.

శ్రీగీతాసాహిత్య సేవాసమితి,

మకాం: బనారస్—2.

15—8—53.

[signature]

కార్యదర్శి.



సంపుటి ౧ ★ స్వస్తిశ్రీ విజయ — శ్రావణమ్ ★ సంచిక ౭

# అభ్యాసేనైవ

అభ్యాసంచేతనే ఏ కార్యమైనా సాధించటానికి వీలవుతుంది. అది పఠనంకానివ్వండి; పారాయణం కానివ్వండి — శ్రవణం కానివ్వండి; మననంకానివ్వండి. — జపం కానివ్వండి; ధ్యానం కానివ్వండి. ఏదైనాసరే. క్రమంగా — అభ్యాసబలంతో సాధించవలసి ఉంటుంది. ఉదాహరణకు చూద్దాం. అభ్యాసంచేయటానికి ముందుగూడా మనస్సు మనకు భాగా స్వాధీనంలో ఉన్నట్లు కనపడుతుంది. కానీ అందులో నిజం చాలాతక్కువ. మనమేదైనా ఒక విషయాన్నిగూర్చి మననం చేయటానికి ప్రారంభించామంటే మనకు తెలియకుండానే తమస్సు మన మనస్సుతో జతపడి మనల పెడదార్లు త్రొక్కించటానికి మెల్లగా ప్రయాణమౌతుంది. ఈ తమోగుణాన్ని సమూలంగా నాశనంచేయటం అంత సులభంగాదు. ఒకరూపంతో దాన్ని నాశనం చేస్తుంటే మరొక రూపంతో మరల ప్రవేశిస్తూ ఉంటుంది.

అంతరాయాలనే భావంతో కర్మకలాపాలను తగ్గించుకొని ఏకాంతవాసంచేసేవారిలోనైతం కొందరిలో సత్వశుద్ధి శూన్యంగా ఉంటుంది. వారివద్ద తమోగుణం ఏకచ్ఛత్రాధిపత్యం చేస్తూనే ఉంటుంది. ధ్యానం, జపం -- నెపంమాత్రమే. నిద్ర, కునుకు, మబ్బు వారిమనోరాజ్యంలో తండోపతండాలు. పఠనం, శ్రవణం సాగుతూనే ఉంటుంది – పేజీలు గంటలు గడిచిపోతూనే ఉంటాయి. ఫలితం శూన్యం. బాడీప్రెజెంట్; మైండ్ ఆబ్సెంట్. తమస్సును, మనస్సును నిగ్రహించుకోలేక సెంట్ పర్సంట్ సోమరి అవుతాడు. వాని ప్రయత్నమంతా "అడుగులో అడుగువేస్తూ కవాతునేర్చుకునే సైనికునిమాదిరి" నిలిచినచోటనే ఉండిపోతుంది. గానుగ ఎద్దు ఎంత తిరిగిన, ఎంతనడిచినా గానుగకు గజందూరంలోనే ఉంటుంది గదా? ఇటు ప్రపంచంలోనికి రాలేక అటు పరమార్థానికి ఎగురలేక వాడు త్రిశంకుస్వర్గాన్ని అనుభవిస్తాడు. అంతఃకరణలో ఊదరబెట్టి నట్లు ఉక్కిరిబిక్కిరౌతాడు.

నిత్యమూ, నియమితమైన సాధనతో క్రమంగా, యుక్తిగా మనస్సుకు తరిబీతుయివ్వాలి. ధ్యానాదులకు కొంతకాలం ప్రత్యేకించి ఎక్కువకాలం కర్మయందే గడుపాలి. జనతాజనార్దనుని సేవలో ఎక్కువ కృషిచేయాలి. సంకటసమయాల్లో సాయపడమని సర్వేశ్వరుని వేడుకోవాలి. క్రమక్రమంగా ధ్యానకాలాన్ని హెచ్చిస్తూ రావాలి.

సాధకునకు అభ్యాసయోగం చేతిదీపం. దానిసాయంతో కల్యాణపథంలో చొచ్చుకొని పోగల్గుతాడు. ఆ వెలుగులో అంధకారాన్ని ఆవలకు తరిమేస్తాడు. జీవితసంగ్రామంలో సఫలుడు కావటానికి అది శ్రీరామరక్ష. మనస్సమాధానాన్ని చేకూర్చుకోటానికి అది శాంతిమంత్రం. ఇహలోకసుఖాన్ని పరలోక ఆనందాన్ని ప్రసాదించటానికి అది ఉభయతారకం.

"అభ్యాసేనైవ సర్వాణి కార్యాణి సిద్ధ్యంతి"

కవిత

# అర్జున ప్రసాదయోగం.

పూజ్యపాద శ్రీరామకృష్ణానందగిరిస్వాములవారు.

★

[ శ్రీ రామకృష్ణానందగిరిస్వాములవారంటే గీతావాణి పాఠకులకు చిరపరిచితులగు శ్రీరామకృష్ణ బ్రహ్మచారిగారే. 14-8-53 వ తేదీన శ్రీ బ్రహ్మచారిగారు తురీయాశ్రమ దీక్షను స్వీకరించారు. గీతాప్రబోధాన్నంతా విన్నతర్వాత పార్థుడుగావించిన సింహగర్జనాన్ని చక్కటిశైలిలో శ్రీ స్వాములవారు తమ కవితద్వారా మనకందిస్తున్నారు. — సంపాదకుడు. ]

ఉ॥ నీదయచేత నా హృదయ నీరజమందలి భ్రాంతులెల్ల, దా
మోదర! తీరిపోయెను సమూలముగా, తెలివొందినాడ, నీ
వేది యొనర్పుమన్న 'రెడి' యైతినొనర్పగ — వీరవిక్రమో
న్మాదముతోడ చెండెద ప్రమాథిరిపుప్రచయంబు నొక్కటన్.

ఉ॥ కాదిదినోటిమాట యిదె గాండివమెత్తితి చే నెడందలో
నూదరబెట్టుచున్నది సముజ్జ్వలధర్మజిగీష, యింక నీ
పాదములాన, భూభరము బాపి జగంబెగజూడ, కేసరీ
నాదము చేయుటో; త్రిదశనాథుని చేతిలొ చేయిగల్పుటో.

ఉ॥ కారులు; బేల సూ! ప్రణవగాండివముక్తశిలీముఖాల న
వ్వారిగ నూకి దుర్విషయవైరికులుగ్రహరాశిః కుప్పలుం
గూరలు నేయకున్న — యిదిగో! మరియొక్కదఫావచింతు నా
పేరు కిరీటియే? నినదభీషణ శంఖము దేవదత్తమే!!

## శ్రద్ధాంజలి.

పండిత ప్రకాండులును, గీతాతత్త్వ ప్రచారకులునగు శ్రీశ్రీశ్రీ బోధానంద మహర్షులవారు గత జులై నెలలో నిర్యాణమొందినారు. గీతా సేవలో వీరుగావించిన బహుళ ప్రచారమునకు మా భక్తిపూర్వక శ్రద్ధాంజలి.

బనారస్, సంపాదకుడు.




( ఆగస్టు నెల సంచిక 11వ పేజీ తరువాయి. )

★

(శ్లో 16) ఈ శ్లోకము యింద్రియారాముడగు పామరుని గూర్చి చెప్పబడినది. ఆ మీదటి శ్లోకము ఆత్మారాముని ఉద్దేశించి చెప్పబడియున్నది.



ఓ యర్జునా! సర్వార్థములను ప్రకటింపజాలెడి వేదము సర్వజ్ఞుడగు పరమేశ్వరునినుండి తొలుత నె ఆవిర్భవించినది. అనంతరము వేదమందు ప్రతిపాదించిన కర్మముల యొక్క పరిజ్ఞానము వ్యక్తమైనది. ఆ జ్ఞానము కలిగినపిదప వాటిని అనుష్ఠించుటచే అపూర్వమనెడి ధర్మముత్పన్నమైనది. ఆ ధర్మోత్పత్తి యనంతరము ఆ ధర్మాచరణము వలన వర్షము సంభవించుచున్నది. వర్షమువలన అన్నము కలుగుచున్నది. ఆ అన్నమువలన మనుష్యాదిసమస్తభూతములును ఆవిర్భవించుచున్నవి. వెండియు ఆ మనుష్యాదులకు కర్మమునందు ప్రవర్తించుట ఏర్పడుచున్నది. ఈ విధముగ పరమేశ్వరునిచే నియంత్రితమై ప్రవర్తించుచున్న యీ జగచ్చక్రమును అనుసరింపనివాడు వ్యర్థజీవియగుచున్నాడు. వాని బ్రతుకు దండగ. అట్టివాడు బ్రతుకుటకంటె చచ్చుటయె మేలు. ఎందుకనిన — ఈశరీరమునువీడి మరొక్క శరీరమును ధరించినంతట వానికి ధర్మము నాచరించుటకు తగిన అవకాశము బహుశా సంభవింపవచ్చును. బ్రదికి పాపమును మూటగట్టుటకంటె, ఆ పాపమునకు దూరుడై మరణించుటయె వానిపాలిటికి లెస్స.

ఈ చోటనొక శంకకల్గవచ్చును. ఈజగచ్చక్ర నియమమునకు కట్టు బడని బ్రహ్మవేత్తలయొక్క జీవిత మునైతము వ్యర్థమని చెప్పవలసిన దేనా? కొందరు బ్రహ్మజ్ఞానులు లోకసంగ్రహదృష్టి ననుసరించి జగచ్చక్రమును అనుసరించుటయుగలదు. మరికొందరు అనుసరింపకుండుటయు గలదు. అట్టియెడ సంభవించు యీ శంకను నిరసించుటకై భగవంతుడగు గీతాచార్యుడు, ఈ శ్లోకమునందు యింద్రియారాముడను శబ్దమును సాభిప్రాయముగ చెప్పియున్నాడు. శ్రోత్రాది యింద్రియములగుండా శబ్దాది విషయములను పొంది రమించు వానిని యింద్రియారాముడందురు. ఇట్టి విషయలంపటుడు కేవల కర్మాధికారి యగుటబట్టి అట్టివాడు ఈ సృష్టిచక్రమును అనుసరించియె తీరవలెను. అందువలన వాడు కర్మమును చేయవలసియెయుండును. అటు తప్పినచో, విహితకర్మములను పరిత్యజించిన పాపమునకు గుఱియై వ్యర్థముగజీవించువాడగుచున్నాడు. జీవన్ముక్తుడగు జ్ఞాని యింద్రియారాముడుకాడు; కావునను ఆత్మారాముడగుటబట్టియు, అట్టివాడు జగచ్చక్రమును అనుసరింపకున్నను కర్మమునందు ప్రవర్తింపకున్నను ప్రత్యవాయదోషమునకు పాల్పడడు.

(శ్లో. 17) ఇచ్చట ఆత్మారాముని విషయమే చెప్పబడుచున్నది. ఈ శ్లోకమునందు భగవంతుడు "మానవ" అనెడి పదమును ప్రయోగించియున్నాడు. ఆ శబ్దప్రయోగమునందలి స్వారస్యమేమనిన-కృతకృత్యుడు కావలెనను యిచ్ఛకలుగు యెవ్వడైనను, మనుష్యుడైనచాలును. బ్రాహ్మణత్వాది విశేషాధికారములు అనివార్యములు కావు. మానవుడెవ్వడైనను సరియె — ఆత్మరతుడు, ఆత్మతృప్తుడు ఆత్మసంతుష్టుడగుటకు అవకాశము వున్నదని భావము.

అర్జునా! ఇంద్రియారాముడగు పురుషుడు స్రక్చందన వనితాది విషయములయందె రమించును. రుచ్యములగు ఆహారములను పొందినపుడుమాత్రమె సంతుష్టుడు కాగలడు. వాని కామ్యపదార్థములు లభించనిచో అశాంతియు, అతృప్తియు, అసంతోషమునుబొంది వ్యాకుల మొందుచున్నాడు.

ఈ శ్లోకమునందు చెప్పినది రతి-తృప్తి-తుష్టి శబ్దములు మనోవృత్తి విశేషములను సూచించునవి. సాధ

రూప అనుభవమువలననవి సిద్ధమగు చున్నవి.

పరమానందస్వరూపుడగు పరమాత్మదేవుడు తానేయనెడి అపరోక్షానుభవముగల మహాపురుషునకుద్వైతదృష్టియెతొలగియుండుటబట్టి అట్టి మహానుభావుడు తుచ్ఛములుగ తలంచి విషయములందు మరులుగొనడు. ఈ విషయము రెండవ అధ్యాయమునందలి నలుబదియారవ శ్లోకమునందు (యావానర్థ ఉదపానే) ప్రతిపాదింపబడినది. అట్టి వాడు ఆత్మారాముడయ్యెమెలగును; కాని, స్త్రీచందనాది విషయములందు రమించుటకు భ్రమించడు.

శంక—సర్వప్రాణులకును ఆనందస్వరూపమగు ఆత్మయందె నిరుపాధికమగు ప్రీతిగలదు. ప్రాణులకు స్త్రీపుత్రాదులయందు ప్రీతియున్నదనిన, అయ్యది ఆత్మార్థమయ్యెయున్నది. అట్టియెడ ఆత్మరతియని చెప్పబడు జ్ఞానికిని సామాన్యుడగు అజ్ఞానికిని భేదమేమి?

సమాధానము — ఆత్మతృప్తుడనాబడు జ్ఞాని పరమానంద స్వరూపమగు ఆత్మయెందె తృప్తుడై యుండును. బ్రహ్మలోకపర్యంతములగు విషయసుఖములు అనిత్యములును సాతిశయములును కాబట్టి జ్ఞాని వాటిని అపేక్షింపడు. ఆతని తృప్తి నిరంకుశమైనది. అజ్ఞానియగువాడు మనోహరములగు స్త్రీలతోడను, మృష్టాన్నములతోడను తృప్తిబొందుచున్నాడు. ఆతృప్తిసాపేక్షమును సాతిశయమును, సాంకుశమునునైనది.

శంక—రోగాదులవలన జఠరాగ్ని నశించినవాడును, ధాతుక్షయమును బొందినవాడును, విషయసుఖములందు నిరపేక్షుడే యగుచున్నాడు. వానికిమృష్టాన్నములందిష్టములేదు. మనోరమస్త్రీలందు ఆకాంక్షలేదు; అట్టియెడ వాడును జ్ఞానిని పోలినవాడెయగుచున్నాడు. జ్ఞానికినివానికిని వ్యత్యాసమేమి?

సమాధానము—జ్ఞాని"ఆత్మన్యేవచ సంతుష్టః" కేవల ఆనందస్వరూపమగు ఆత్మయందె సంతోషమొందుచున్నాడు. ఆతడు పొందెడి సుఖము పదార్థముల నాశ్రయించి వచ్చినదికాదు. అత్యంతపూర్ణత్వమును పొందిసంతుష్టుడై యుండును. అంతంతకు ప్రియములై యగపడు, ధనమిత్రగృహభూమి గ్రామరాజ్య సార్వభౌమ రసాధిపత్య యోగసిద్ధులు మొదలిడి బ్రహ్మలోక పర్యంతమైన యిష్టభోగములకు హేతువు

లైన భోగ్యస్థానములై నిత్యమని భావించి మురిసిపడుట అజ్ఞానికి తగినది. కాని జ్ఞాని ఆపద్ధతికి విలక్షణుడు. ఇహాముత్రములందలి భోగములకు వినాశము తప్పదనియు, ఆత్మలాభమునకంటె మించిన లాభములేదనియు వానికి చొక్కముగ తెలియును. అట్టివాడె కృతకృత్యుడు. ఆతడు ఆత్మయందే సంతుష్టుడై యుండును.

జఠరాగ్ని మందగించినవాడును, ధాతుక్షయమును పొందినవాడును రోగి, మరియు జఠరాగ్నిని ప్రజ్వలితము చేసికొనవలెననియు, ధాతువృద్ధిని పొందవలెననియు తహతహపొందుచుండునెగాని ఆనందస్వరూపమగు ఆత్మయందు వానికి నిలకడ సంభవింపజాలదు. జ్ఞానికిగల యీ విశిష్టతను సూచించుటకై "యస్త్వాత్మరతిరేవ" యని ప్రయోగింపబడినది. ఇదేవిషయమును శ్రుతిసైతము, "ఆత్మక్రీడా, ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాంవరిష్ఠః" అనివచించినది. బ్రహ్మవేత్తలయందు శ్రేష్ఠుడగు పురుషుడు ఆనందస్వరూపమగు ఆత్మయందే క్రీడింపగలడు; ఆత్మయందె రమించగలడు, ఆత్మయందె ప్రవృత్తికలవాడగుచున్నాడని దాని అర్థము.

బ్రహ్మవేత్తయగు యిట్టి మహాపురుషునియందు కర్మాధికారము ప్రవర్తింపజాలదు. వానికి లౌకిక వైదిక కార్యములందు కర్తృత్వముండుటలేదు. ఆతడు కృతకృత్యుడు. ఇహపరలోక భోగములందును, వాటి సాధనములందును, మోక్షమందును తత్సాధన సిద్ధియందును వానికి కర్తవ్యతాబుద్ధిలేదు. కృతకృత్యుడై పడయవలసినది పడసియుండుటబట్టి సర్వకామప్రాప్తియు సర్వదుఃఖ నివృత్తియు జ్ఞానికి చేకూరియె యున్నది.

ఆత్మసాక్షాత్కారమును బొందిన జ్ఞాని, స్వర్గాది సుఖములకై గాని మోక్షమునకై గాని, లేదా ప్రత్యవాయ నివృత్తికై గాని కర్మములను చేయవలసియె యున్నదా? అనెడి శంకను నిరసించుటకై ముందటి శ్లోకము చెప్పబడుచున్నది.

(శ్లో. 18) ఓ అర్జునా! ఆత్మరతియు ఆత్మతృప్తుడును ఆత్మసంతుష్టుడునునగు ఆ తత్త్వజ్ఞానికి నిత్యనైమిత్తిక కర్మములవలన అభ్యుదయ రూపమగు ప్రయోజనముకాని నిశ్శ్రేయసరూపమగు ప్రయోజనముకాని లేనేలేదు. ఆతనికట్టి యిచ్ఛలె వుండవు. ఉండినచో జ్ఞాని యెట్లుకాగలడు? నిశ్శ్రేయస

రూపమగు మోక్షము కర్మము వలన లభించునదికాదు.

ఈ విషయమున శ్రుతిసైతము "పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్య కృతః కృతేన"_అని చెప్పినది. అధికారి యగువాడు పుణ్యకర్మములవలన సంభవించు స్వర్గాదిలోకములను అనిత్యములనియు సాతిశయములనియు భావించి విరక్తుడగుచున్నాడు. తనస్వరూపమగు మోక్షము నిత్యనైమిత్తికాది కర్మములవలన సాధింపదగునది కాదనియును యెఱుంగుచున్నాడు.

ఈ శ్లోకమునందలి "నైవతస్య" యనుచోటి "ఏవ" శబ్దముచేత నిత్య ముక్తస్వరూపమగు తన ఆత్మ, జ్ఞానసాధ్యమనెడి భావనయు కూడ నిరాకరింపబడుచున్నది. నిత్యమగు మోక్షము కర్మసాధ్యము కానట్లె జ్ఞానసాధ్యముకూడ కాదని అర్థము. ఎందుకనిన, స్వరూపమే అయివుండెడి మోక్షము జీవులకు వాస్తవముగ నిత్యప్రాప్తమయ్యే ఉన్నది. అయినను అజ్ఞానముచేత దూరమైనట్లు తోచుచున్నది. తత్త్వజ్ఞానమువలన అజ్ఞాన నివృత్తియైనంతట, ఆతనికి కర్మవలనను తత్త్వజ్ఞానమువలనను చేకూరవలసిన ప్రయోజనమెద్దియులేదు.

ఇంకాఉంది



# ఆత్మలాభాన్నపరం విద్యతే

శ్రీ భూమానందభారతీస్వాములవారు,
శ్రీ అనంతాశ్రమం, కొత్తచెరువు, అనంతపురంజిల్లా.



బహుజన్మార్జిత పుణ్యాపుణ్యములవలన సమర్థమగు బుద్ధీంద్రియాది సాధనసంపత్తిగల మానవశరీరమనెడి యోడ లభించినది. ఈ యోడ భిన్నముగాక ముందే_అనగా, నీశరీరము మృత్యుగ్రస్తము గాకమునుపే దుఃఖబహుళమగు సంసారసాగరమునుదాటుటకు ప్రతియొకరును యత్నించవలెను. బుద్ధ్యాది సాధనములులేని పశ్వాదిజన్మము లెత్తినచో కలిగెడి కష్టనష్టములు వర్ణనాతీతము. "నచేదిహావేదీన్మహతీవినష్టిః" నీమానవ జన్మమునందే ఆత్మలాభమును పొందప్రయత్నించని అవివేకిపురుషుడు నిత్యజీవితములో తాపత్రయతప్తుడగుటయే గాక, ప్రత్యక్ష మోక్షసామ్రాజ్య సింహాసనాధిష్ఠుడగుటకు నోచుకొనకపోవుటచే గొప్పనష్టవంతుడగుచున్నాడని కేనశ్రుతి చాటిచెప్పుచున్నది.

ఇటీవల దేశవిదేశములయందు ఆధ్యాత్మిక విజ్ఞానమునకు బదులు ఆధిభౌతిక విజ్ఞానశాస్త్రము మిక్కిలి యభివృద్ధిచెంది యున్నది. అందువలన ఆధిభౌతికవాదులు బాహ్యపదార్థముల నభివృద్ధి పరచుటలోను, వానిగుణపరీక్ష జేసిబహువిధ నూతనయంత్రములను కనిపెట్టుటలోను, సర్వత్ర కర్మాగారములను స్థాపించుటలోను, దినదినమునకుఒకరికంటె యింకొకరు ముందంజ వేయుచు "నిత్యసుఖ" మనెడి గమ్యమును చేరుటకై పరుగులిడుచున్నారు. అనగా వారి యాయువునంతను భౌతిక విజ్ఞాన సంపాదనములోనే గడిపివేయుచు బాహ్య పదార్థములయందు నిత్యసుఖాన్వేషణ చేయుచున్నారనిఅర్థము. ఆధునిక కాల నవీన విజ్ఞానము శరీరయాత్రకు సౌలభ్యమేర్పరచుననియు, భౌతికవస్తు సంపాదనము దేహధారుల కత్యవసరమనియు, వారు చెప్పుదురు. "శరీరయాత్రాపిచతే న ప్రసిద్ధ్యేదకర్మణః" అని గీతకూడ అదేవిషయమును నిష్కామకర్మ పరముగానంగీకరించి, ఆత్యంతిక సుఖనిరూపణ విషయములోమాత్రం కుక్షింభరత్వసాధన సదుపాయములే జీవితచరమలక్ష్యములు కావని నొక్కి చెప్పుచున్నది. చీకటింటిలోపోయిన సూది నిమిత్తము, నడివీధిలోనుండు మునిసిపాలిటీ

దీపసమీపమున వెదకిన సూదిలభించునా? చివఱకుస్వప్నలబ్ధపదార్థమువలె వాంఛితఫలము నాస్తి. ఎక్కడ సూదియున్నదో, వుండియు చీకటి దోషముచే నెక్కడ కాన్పించకున్నదో, అక్కడ దీపసహాయమున వెదకినచో నది తప్పకలభించును. అట్లే నిజమైన ఆత్మసుఖము ప్రాపంచికవస్తువులవలన కలుగదనియు, అదితనయందుతానుసుప్రతిష్ఠుడగునప్డుమాత్రమే సిద్ధించుననియు ఆధ్యాత్మిక విజ్ఞానశాస్త్రప్రఖ్యాతమగుసిద్ధాంతము. తానుపరుగెత్తుకొలది తననీడ తనకుచిక్కక, తనకంటెముందే సాగిపోవునట్లు, అత్యంత శ్రమసాధ్యములగు దృశ్యవస్తువుల యందు సుఖబుద్ధిచేసి, బాహ్యపదార్థ విజ్ఞానపరిశ్రమ చేయుటవలన తానుకోరెడి నిత్యసుఖము తనకు లభించకున్నది. ఒకవేళ ఇంద్రియములకు విషయములతో సంబంధమేర్పడినప్డు తాత్కాలిక క్షణికసుఖము తనకుతోచినను ఎండమావులయందలి జలమువలె వియోగకాలముననదిమిథ్యాభూతమే కాని అక్షయసుఖములభ్యమగుటలేదు. కారణము—తననీడ తనకన్యమగుటయే. అనఁగా దృశ్యపదార్థములు దృక్స్వరూపుడగు తనకు భిన్నములగుటయే.

“అర్కేచేన్మధువిందేత కిమర్థంపర్వతం వ్రజేత్” కూర్చున్న ప్రదేశముననే తేనె దొరకుచుండ, తేనెపట్టును వెదకుటకై గుట్టలకు వెళ్లుటవలను కలుగులాభమేమి? పిపీలికాది బ్రహ్మపర్యంతమునుగల సకల శరీరములయందును కూటస్థుడుగానుండి— తానేబుద్ధియందు ప్రతిఫలించి జీవనామకుడై దేహాది సర్వప్రపంచమును నడిపించు సూత్రధారుడు సర్వవ్యాపియగు పరమాత్మయే. అట్టిపరమాత్మకు కేవలసుఖమే స్వరూపము. అది “అహం” పదలక్ష్యార్థమై సకల హృదయముల నధిష్ఠించి ఈశ్వరుడై వెలుగొందుచున్నది. సూర్యునియందు చీకటిలేని విధమున సుఖస్వరూపమగు ఆత్మరూపపరమాత్మయందు దుఃఖములేశమైనను లేదు. ఒకవేళ ప్రాపంచిక విషయములందు సహితము తాత్కాలిక సుఖముకలదని భౌతికవాదులు చెప్పబూనినను, అది ఆయావిషయములకు సంబంధించినదికాదు. ఇష్టవస్తు సంప్రాప్తి సమయమున మనస్సు తనసహజ చపలతనువీడి హృదయమునజేరిస్వస్థతనొందును. అట్టిసమయమున కేవల సుఖస్వరూపమగు ఆత్మయొక్క ప్రతిబింబము అంతఃకరణమున వ్యాపింపలోపల తనకు సుఖము తోచుచున్నది. ఈ రహస్యమునువిచారించి తెలియకపోవుటవలననే భౌతిక పదార్థములలో సుఖమున్నట్లు భ్రాంతిజీవులు పొరబడుచున్నారు. సూర్యునకెదురుగానుంచిన దర్పణమున సూర్యుడు ప్రతిబింబింపఅందుసూర్యునివెలుగు కానబడుచున్నది. అదిసూర్యుని సహజసిద్ధమగువెలుగే కాని, అద్దపువెలుగుకాదు. అట్లే విషయముల యందుదోచు క్షణికసుఖముకూడ ఆత్మయొక్క ప్రతిబింబసుఖమేకాని తదన్యము కాదు.

అగ్నితోకూడిన యినుమునకు అగ్నిధర్మమగు ఉష్ణత్వము కలిగినట్లు కూటస్థసహిత చిదాభాసునితో గూడిన అంతఃకరణమునందు ప్రత్యగాత్మ ధర్మమగు కేవలసుఖము

తోచుచున్నది. అట్టి సుఖస్వరూపమగు ఆత్మ ప్రపంచమునందలి సకలపదార్థముల కంటెను ఆంతరమైనది. "తదేతత్ ప్రేయః పుత్రాత్ ప్రేయోవిత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాదంతరతరం యదయమాత్మ" పుత్రుని కంటెను, ధనమునకంటెను, లోకమునందలి భౌతికవస్తువు లన్నింటికంటెను ప్రియమైనది ఆత్మయే. ఆత్మవినా ప్రియతమపదార్థము లోకమునకానము. ఆత్మాశ్రయమువలన నే బాహ్యవస్తువులు ప్రియములగుచున్నవి. "ఆత్మనస్తుకామాయసర్వం ప్రియంభవతి" అనగా ఆత్మకొఱకే సమస్తవస్తువులును ప్రియములగుచున్నవి. అట్టి ఆత్మను తానుగా తన యనుభవమున గుర్తెఱుంగుటయే సాక్షాన్మోక్షము. తదితర కర్మోపాసనలు చిత్తశుద్ధి మూలమున సకలదుఃఖ నివృత్తి పరమానంద ప్రాప్తిరూప మోక్షమునకు పరంపరాసాధనములు.

లోకులు "ఆత్మ" యనగా శరీరము నందు బంధింపబడిన యొకపరిమిత వస్తువని యు, శరీరనాశనముతో ఆత్మయు నశించు ననియు తలంతురు. కాని అదినిజముకాదు. ఆత్మలక్షణావృత్తివలన బ్రహ్మమునకంటె వేఱుకాదు. కాన పరిచ్ఛిన్న పదార్థముకాదు — అది అపరిచ్ఛిన్నము. అనగా బృహత్తమ మయిన ఏకైక బ్రహ్మవస్తువు. దేశకాలవస్తువులచేత అంతములేనిది కాననది అనంతమన బడును. ఘటమునశించినను ఘటాకాశమునకు నాశనములేనివిధమున శరీరము నశించినను ఆత్మ అవినాశి. ఈ ఆత్మను ఆయుధములు ఛేదింపలేవు. అగ్ని కాల్పజాలదు. నీరుతడుప లేను. పవనమెండింపజాలదు. దేహ లక్షణములగు పొడుగు, పొట్టి, లావు, సన్నము, వృద్ధి, క్షయము లాయాత్మకు లేవని గీతా ప్రబోధము.

[సశేషము.]

భూమానందస్వామి.

ప్రభూ ! విశ్వేశా ! వెయ్యేల? నీ అపారమహిమా సాగరమందలి ఒక బిందువునందె చరాచర వ్యాప్తమగు ఈ విశ్వప్రపంచమంతయు నెలకొని యున్నది.

గీత 10—42.



# భగవద్గీత ఆత్మవికాసానికి కామధేనువు.

## మూలం: శ్రీ అరవిందులు.

అనువాదం: శ్రీ కె. వి. నారాయణ్, శ్రీకాశీవిద్యాపీఠము, బనారస్.



[భారతీయుల విచారధార పరంపరల కన్నింటికీ భగవద్గీతే మూల ప్రేరకం. ఆత్మను గురించి అనవరతం అధ్యయనాన్ని సాగించే జ్ఞానులకే గాక ఉరికంబాలను కౌగలించు కోవటానికి వెనుదీయని అకుంఠిత దేశభక్తులకు సైతం గీతామాతనుండే ప్రేరణ లభించింది-మున్ముందుగూడా లభిస్తుంది.

లోకమాన్య తిలక్, మహాత్మా గాంధీజీ ప్రభృతులమాదిరే శ్రీ అరవిందులు గూడా గీతాసాగరంలో ఓలలాడి సరిక్రొత్త స్ఫూర్తిని గ్రహించారు. వారు రచించిన గీతాభాష్యాన్నిగూర్చి చెప్పాలంటే అది స్వయంగా మహనీయమయిందనడం అతిశయోక్తి కాదు.

ఆగష్టు 15-వ తేదీ శ్రీ అరవిందుల జయంతీదినం. ఈ పుణ్యస్మృతి సందర్భంలో శ్రీ వారి గీతాభాష్య సంక్షిప్తసారాన్ని "నవనీతహిందీ డైజెస్ట్" మాసపత్రికలో ప్రకటించారు. ఆ విషయాన్ని మా మిత్రులు శ్రీ కె. వి. నారాయణ్ గారు ఆంధ్రీకరించి గీతావాణి పాఠకుల కందిస్తున్నారు. ఇక చదవండి.

— సంపాదకుడు.]



"సంపూర్ణ జీవితము, జగత్తుయొక్క రహస్యమే కర్మయొక్క రహస్యము" అనునదే గీతాచార్యుని గీతాసందేశ సంగ్రహ సారము. కర్మయొక్క ఉపయోగమేమన ఆత్మానుసంధానము, ఆత్మ పూర్ణత్వము, ఆత్మసిద్ధి.-లౌకిక పారలౌకిక ఫలితము కాదుసుమా! తన ఉత్కృష్ట అంత స్సమశక్తిని అనుసంధానించుట, దానిలో లీనమగుట. ఇదియే కర్మయొక్క మహోన్నత పరమవిధానము. ఈవిధానము అమలుజరుగనంత వరకు జీవితము అపూర్ణత్వమేగాక జటిల సమస్యగగూడా యుండగలదు.



తన సదాత్మనుపొంది సర్వులయందున్న ఈశ్వరుని తెలిసికొనుట సామాన్య విషయముకాదు. సాధారణముగ మానవుడు

తననుప్రకృతిద్వారా నిర్మించబడిన ప్రత్యేక ప్రాణిగా భావించుకొనుచుండును. ఇది ఒకవిధమగు ప్రత్యేక అహంభావము. మానవుడు ప్రకృతికి నియమబద్ధుడై తనసంబంధములను కల్పించుకొనుచుండును. ఇట్లు చేయుట ప్రకృతి ధర్మముకూడా. కానీ మానవుని చేతనత్వమునందొక ప్రత్యేకత యున్నది. ఈప్రత్యేకతను ప్రకృతి తన గుప్పిటియందు బంధించలేదు. ఇదియే ఆత్మశక్తియొక్క ఆంతరిక సత్యత్వము. దీనియందు మానవునకు ప్రత్యేకశ్రద్ధయున్నది. ఇది జీవభావముయొక్క ఉత్కర్షననుసరించి పెరుగుచుండును. ఈ ఆంతరికశక్తియొక్క సత్యత్వముప్రకృతికాదు, పురుషుడు. ప్రకృతి స్వయముగ పురుషునియొక్కశక్తి. ఆదిలో ఒక ఆత్మ, ఒక పురుషుడు, ఒక ఆత్మస్వరూపము ఉండినది. ఇది అందరియందు ఒకటిగా ఉన్నది. ఈ పురుషుడే జగత్తునకు స్వామి. ఈ జగత్తంతయు అతనియొక్క అంశమాత్రమే. అతని అనుమతివలననే ఈ ప్రకృతియొక్క చట్టములు చెల్లుబడియగుచున్నవి. ప్రకృతియొక్కశక్తి వివిధమార్గములద్వారా తన కార్యక్రమమును సాగించుచున్నది. ప్రకృతియందున్న పురుషుడే తెలుసుకొనతగినవాడు. అతడే ప్రకృతికి ప్రకాశమును ప్రసాదించుచున్నాడు. ఆ ప్రకాశముచేతనే మనయందు చైతన్యమును కల్గించుచున్నాడు. మానవమాత్ర పురుషుడుకూడా ఈ భగవంతుని అంశమే. అందుకనియే అతనివలెనే స్వభావము కలవాడుగా అగుచున్నాడు.

వస్తుతః మన నిజమగు అంతరాత్మ, ఆత్మపురుషుడు మనయొక్క బుద్ధిచేత ఆవరింపబడియున్నాడు. ఎందుకనగా మనబుద్ధికి అంతర్జగత్తునుగూర్చిన జ్ఞానములేదు – అది మిథ్యాజ్ఞానముతో తాదాత్మ్యమైయున్నది. మనస్సు, ప్రాణము శరీరముయొక్క బాహ్యయాంత్రిక జీవనముతో మిళితమైపోయినది. కానీ వ్యావహారిక దేహధారణ పురుషుడైన మానవుడు ఒకసారి ఈప్రాకృతిక తాదాత్మ్యమునుండి తనను వెనుకకు లాగుకొన్నట్లయిన జీవితము, జగత్తుయొక్క రెండవ రూపము గోచరింపగలదు. అదియే మహాపరివర్తనము అగును. దీనిసాధనావిధానావిధానమే నరునిలోని నారాయణస్వరూపుడగు శ్రీకృష్ణభగవంతుని సందేశము. "నేను అర్హులగువారందరనూ ఆహ్వానించుచున్నాను. తమ మనస్సులను ప్రాకృత జ్ఞానేంద్రియములనుండి మరలించి ఆంతరిక విషయ జ్ఞానేశ్వరునితో సంబంధమును కల్పించుకొనగలువారందరూ అర్హులు అగుదురు" – ఈ పరివర్తనము సామాన్యమైనది గాదు. దీనికి గొప్ప రూపాంతరము గలదు. ప్రాథమికదశలో ఈ జ్ఞానమునుకూడా బుద్ధిద్వారానే గ్రహించవలసియున్నది. కానీ కాలాంతరముగా ఇదే మానవునికి చైతన్యముగా మారి దీనియందే వ్యక్తియొక్క సంపూర్ణకర్మ ద్రవించి ప్రవహించగలదు. అభ్యస్త ప్రవృత్తిగల మానవుడు స్వయముగా పరాభాగవతీ బ్రహ్మప్రకృతిగా పరివర్తనము కావలెను. మరొకవిధముగా చెప్పవలయునంటే పరమేశ్వరుడు, పరబ్రహ్మముయొక్క ఏకత్వము–సమగ్రత్వముయొక్క జ్ఞానమే యథార్థమైనజ్ఞానము.

మానవుడు అహంమమతల కలిగియున్నంత వరకు వ్యష్టిబంధనమునుంచి తనను ముక్తుని చేసుకొనుట అసంభవము. కోరిక - దాని వల్ల జనించు క్రోధాదిగుణములు అహంకారముయొక్క నిఖరమైన చిహ్నములు. సహజముగ ఈ కోరికలే మానవునికి సంతోషము, అసంతోషము - రాగము, విరాగము - ఆశ, నిరాశ - సుఖము, దుఃఖము - ద్వేషము క్రోధము - సిద్ధి - విజయము - సంతాపము మొదలగు వికారములకు అధీనము చేయించుచుండును. ఎంతవరకు మానవుడు కోరికలను పోషించుకొనుచుండునో అంతవరకు శాశ్వతమగు నిష్కళంక శాంతినిపొందుట అసంభవము.

ఈస్థితి అనంతరముకూడా కర్మ జరుగుచునే ఉండును. కాని ఈ స్థితిలో మానవుడు కర్మయొక్క కర్తగాగాకుండ సాక్షిమాత్రుడుగా ఉండును. సాక్షిరూపముతోనే అతడు ప్రకృతియొక్క వింతపోకడలను పర్యవేక్షించుచుండును. అయితే యోగముయొక్క సంపూర్ణతత్త్వసారమిదేకాదు, మానవుడు యంత్రమువలె కర్మద్రష్టగా ఉండవలయునని అపేక్షించరాదు. అతడు పరిపూర్ణమైన దివ్యకర్మలను చేయుచూ ఉండవలెను. ఈ కర్మలు ప్రారంభదశలో ఆత్మసిద్ధికి సాధనారూపములో ఉండవచ్చును. దానితోపాటు పరమసిద్ధికి దోహదము కాగలవు కర్మ భగవానునియొక్క సమగ్ర జ్ఞానమునకు, గుహ్యాతిర రహస్యమునకు, స్వభావములతో ఆయనయందు ఐక్యము కాగలుటకు ఒక ప్రధానాంగము. ఈ విధానముగా సంసిద్ధి, ముక్తిలాభము పొందినతరువాతకూడా కర్మ ఉండగలదు. ఉండవలసిన అవసరంకూడా ఉన్నది.

మరొకవిషయం:- జ్ఞానసాధనమైన బుద్ధి, కర్మసాధనమైన మనస్సు ఈ రెండే సర్వస్వముకాదు. మానవునిలో ఆనందమును అనవరతము ఆశించేహృదయము ఉన్నది. హృదయతృప్తికొరకు మానవీయ ప్రకృతిని భగవంతునివైపు మరల్చవలసియున్నది. ఈ క్రియనే మనము "భక్తి" అని అనుచున్నాము. ఈ స్థితినిపొందుటయే ఆత్మయొక్క విశుద్ధకైవల్యానందము. కానీ సమగ్రజ్ఞానము వలన ప్రాప్తించగల త్రివిధానందము దీనికన్నను ఉత్కృష్టమైనది. త్రివిధానంద ప్రాప్తిద్వారా పరమపురుషుని పరమానంద ద్వారములు తెరువబడగలవు. కనుక జ్ఞాన కర్మలలో త్రివిధ సనాతన పరమానందమును ఐక్యపరచుట అత్యావసరము. వాస్తవముగ పరమసిద్ధికి అదియే చరమ స్థితి కాగలదు.

భక్తికూడా రెండురకములుగనున్నది. ఒకటి సహాయము, ఆపద్విముక్తికొరకు భగవానుని అర్థించుచుండును. రెండవది - తేజస్సుకొరకు, జ్ఞానముకొరకు భగవంతుని వైపు మ్రొగ్గుచుండును. ఈ రెండును మధ్యస్థితులు. భగవద్భక్తుడు భగవత్ జ్ఞాతకూడా కాగలడు. ఇది ఉన్నతస్థితి. అప్పుడు భక్తునకు, భగవంతునకు భేదములేదు. భక్తుడూ, భగవంతుడూ ఒకటే అగుదురు. ఇట్టిభక్తుడే పరమపురుషుని పరమానుగ్రహీతుడు.

ఈ త్రివిధ మార్గములద్వారా మానవుడు తన నిమ్నప్రకృతినుండి మహోన్నత ఆధ్యాత్మిక ప్రకృతిలోనికి ప్రవేశించగలడు. ఈ ప్రకృతియే గుప్తపరుపబడియున్న చిన్మయ చిరాప్రకృతి. యోగియొక్క ఈ పరిపూర్ణస్థితి ఈ కర్మసమస్యను సమూలముగా నాశనము చేయగలదు.

Sri Aurobindo

# జీవేశ్వర బ్రహ్మలలోని అంతరత్వము.

మూలం: శ్రీ జయదయాల్ గోయంద్ కా జీ.

అనువాదం: విశ్వామిత్ర "శ్రీరమణ్" కాశీక్షేత్రము.



శ్లో॥ ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥

"వాస్తవముగ పురుషుఁడు దేహమునందు స్థితుడైనప్పటికి పరుఁడు. (త్రిగుణాత్మకమైన మాయకు అతీతుఁడు.) కేవలము సాక్షియగుటవలన ఉపద్రష్టయనియు, యథార్థపు సలహా ఇచ్చువాఁడు గాన అనుమంతయనియు, సర్వులను భరించువాఁడు గాన భర్తయనియు జీవరూపుఁడు గాన భోక్తయనియు, బ్రహ్మాదులకు ప్రభువైనందున పరమేశ్వరుఁడనియు, విశుద్ధ సచ్చిదానందుఁడగుటవలన పరమాత్మయనియూ యనఁబడుచున్నాడు."

గీతోక్త సిద్ధాంతముల ననుసరించి బ్రహ్మ, ఈశ్వరుఁడు జీవునియందు భేదము లేదని గీతాతత్త్వజ్ఞులు చెప్పుచున్నారు. ఈ పరపురుషుఁడైన పరమాత్మయే భోగించునపుడు జీవుఁడనియు, సృష్టియొక్క జనన, పోషణ, నాశనములొనర్చునపుడు ఈశ్వరుఁడనియు, నిర్వికారావస్థలో నిమగ్నుఁడైనపుడు బ్రహ్మయనియూ అనబడుచున్నాడనియు పైనుదహరింప బడిన శ్లోకమువలన స్పష్టమగుచున్నది. ఈ శ్లోకమున భోక్తయను శబ్దము జీవునకునూ, ఉపద్రష్ట - అనుమంత - భర్త - మహేశ్వర శబ్దములు ఈశ్వరునకునూ, పరమాత్మయను శబ్దము విశుద్ధ మూర్తియైన బ్రహ్మకునూ పర్యాయ పదములు. ఇవి యన్నియూ పరపురుషునకు విశేషగుణములైనందున ఆతని రూపములేయైయున్నవి. ఈ త్రివిధరూపముల గురించిన వర్ణన అష్టమాధ్యాయారంభమున పార్థుఁడు ప్రశ్నించిన ఏడు ప్రశ్నలందు మూడుప్రశ్నల సమాధానముగ కన్పడుచున్నది. (కింతద్బ్రహ్మ) - "బ్రహ్మ ఏమిటి?" యను పార్థుని ప్రశ్నకు (అక్షరం బ్రహ్మపరమం) - "అవినాశియగు సచ్చిదానందమూర్తియే బ్రహ్మ" యని భగవానుఁడు సమాధానము చెప్పియున్నాడు. (కిమధ్యాత్మం) - "అధ్యాత్మమేమిటి?" అను ప్రశ్నకు సమాధానముగ (స్వభావోఽధ్యాత్మముచ్యతే) - 'జీవసంజ్ఞగల ప్రత్యగాత్మభావము అధ్యాత్మ'మని చెప్పియున్నాడు. (కః అధియజ్ఞః) - "అధియజ్ఞుఁడెవరు?" అను ప్రశ్నకు సమాధానముగ (అధియజ్ఞోఽహమేవాత్ర) - ఈ దేహమునందు అధియజ్ఞుఁడను నే నేనని వ్రాక్రుచ్చియున్నాడు. ఈ విషయమునే భగవానుఁడవతార కారణములు తెలియజేయు శ్లోకమునకు పూర్వశ్లోకముననే (iv - 6.) చెప్పియున్నాడు.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా..............................

"నేను జన్మరహితుడను, నాశరహితుడను సర్వభూతంబులకు ఈశ్వరుఁడనై నప్పటికీ నా ప్రకృతిని స్వాధీనము చేసికొని యోగమాయారూపమునఁ బ్రకటితమగుచున్నాను! నేను సాధారణ మానవునివలె శ్రీకృష్ణుని రూపమునఁ గనఁబడుచున్నను. యథార్థమట్లు గాదు. నేనసాధారణ శక్తివంతమైన ఈశ్వరుఁడను. సర్వభూతములకు ఈశ్వరరూపమైన నాపరమశక్తిని తెలిసికొనలేని మూఢులందరూ మానవరూపము దాల్చిన నా పరమాత్మరూపమును జుల్కనగ చూచుచున్నారు. అనగా నా యోగమాయ వలన ప్రపంచము నుద్ధరించుటకు మనుష్యరూపమున చరించుచున్న నన్ను సామాన్యమానవుఁడని తలంతురు." అని శ్రీకృష్ణుఁడు స్వయముగా నవమాధ్యాయమునం దేకాదశశ్లోకమున వివరించియున్నాడు. భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు, బ్రహ్మ — భేదరహితులని గీతలో పలుచోట్ల చెప్పఁబడియున్నది.

"ఓ పార్థా! నేనే, నాశరహితుఁడగు పరబ్రహ్మమునకు, అమృతమునకు, నిత్యధామమునకు, అఖండనీయమైన ఏకైకరసమగు ఆనందమునకు ఆధారభూతుఁడను. అనగా బ్రహ్మ, అమృతము, అవ్యయము, శాశ్వతధర్మము, ఐకాంతిక సుఖము — ఇవన్నియు నా నామములే. ఇందువలన నేను వీటికి ఆశ్రయభూతుఁడను" అని చతుర్దశాధ్యాయాంతమున వివరించియున్నాడు. జీవేశ్వరులలో అంతరత్వము లేదని గీతలోని కొన్ని శ్లోకముల వలన విశదమగు చున్నది.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ........................(x–20)
,, క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి ....................(xiii–2)

"ఓ అర్జునా! నేను సర్వభూతములలో నివసించు ఆత్మను. సర్వభూతములయొక్క ఆదిమధ్యాంతములు గూడా నేనే. అన్ని క్షేత్రములలోని క్షేత్రజ్ఞుఁడను గూడా నేనేనని తెలిసికొనుము........." మొదలగునవి.

ఇంతియేగాక ఒకసచ్చిదానంద మూర్తియైన పరమాత్మ తప్ప వేరేమియూ లేదని ఘోషించు పదములు గూడా గీతయందు కొన్ని గలవు.

శ్లో॥ మత్తః పరతరం.................................(vii–7)
,, తపామ్యహ మహం వర్షం...........................(ix–19)
,, ..............వాసుదేవ స్సర్వమితి............. (vii–19)

"ఓ ధనంజయా! నేను తప్ప అన్యమగు వస్తువు కించిన్మాత్రము గూడ లేదు. సూత్రమూ, సూత్రములోని మణులవలె నా లోనే ఈ సంపూర్ణ ప్రపంచము ఇమిడియున్నది. నేనే సూర్యుఁడనై ప్రజ్వలించుచున్నాను. నేనే వర్షము నాకర్షించి వర్షింపజేయుచున్నాను. అమృతము — మృత్యువు, సత్యము, అసత్యము అన్నియు నేనే. ఇదంతా వాసుదేవుడే." ఈ విధముగా గీత జీవేశ్వర బ్రహ్మలలోని అభేదమును దృఢపరచుచున్నది.

(ఇంకా వుంది). — శ్రీ జయదయాల్.

# గీతను కంఠస్థం చేయండి.

## మూలం: పూజ్య బాపూజీ.

### అనువాదం: సాహిత్యవేదాంతాచార్య శ్రీ కృష్ణచరణమ్, టేకరామఠ్, కాశీ.

[ 1932 జులై 31 తేదీన ఆశ్రమవాసులకు ఇచ్చిన సందేశం నుండి ]

గీతను కంఠస్థంచేసే విషయంపై నేను అనేకసార్లు వ్యాసాలు వ్రాశాను. ఉపన్యాసాలిచ్చానుగూడ. కాని నేనుమాత్రం కంఠస్థం చేయలేకపోయాను. కాబట్టి మీతోమాత్రం "కంఠస్థం చేయండి" అని చెప్పటంనాకంత ఉచితంగాలేదు. అయినా మాటిమాటికి "గీతను కంఠస్థం చేయండి" అని మీతో చెప్తూ ఉన్నా నాకుసిగ్గు గలగటంలేదు. ఎందుకంటే దాని పవిత్రం నాకు బాగా తెలును. ఒకసారి నేను పదమూడో అధ్యాయంవరకు కంఠస్థంచేసాను. మననం మాత్రం యెన్నో సంవత్సరాలనుంచి చేస్తున్నా. కాబట్టి గీతయొక్క ఛత్రచ్ఛాయక్రింద నేను కొద్ది ఫలితాన్ని పొందానని చెప్పవచ్చు. కాని నేను పూర్తిగ కంఠస్థం చేసేవుంటే, మరి యిప్పటికైనా యింకా యెక్కువలోతుకు దిగివుంటే యింతకన్నా అధికంగా ఫలితాన్ని పొంది ఉండేవాణ్ణి. ఏదోగడిచిందేదో గడిచిపోయింది. నాతరం అయిపోవచ్చింది. అయినా యిప్పటికైనా అటిసదవకాశం నాకులభిస్తే గీతనుకంఠస్థం చేయటానికై యత్నిస్తా.

ఇక్కడ గీతార్థాన్ని కొద్ది విస్తారంగా చెప్పవలసివుంది. గీత—అంటే మనజీవితానికి ఆధారభూతమైనగ్రంథమన్నమాట. మనలో యెంతోమందికి గీత జీవనాధారము. కాబట్టి నేనీ గీతను యిచట పేర్కొన్నా. కాని మహమ్మదీయులు గీతకుబదులు ఖురాను షరీఫ్‌ను పూర్తిగాగాని కొంతభాగాన్నిగాని కంఠస్థంచేయవచ్చు. సంస్కృతంరానివారు నేర్చుకోశక్తి లేనివారు గూడ గుజరాతీ, తెలుగు హిందీ మొదలగు దేశభాషల్లోకి అనువదింపబడిన గీతను కంఠస్థంచేయండి. గీతపై శ్రద్ధాసక్తులు లేకపోతే మీమీ ధర్మగ్రంథాలను కంఠస్థంచేయండి.

ఇక కంఠస్థంచేయటం అంటే యేమిటో గమనించాలి. దేనినైతే మనం కంఠస్థం చేస్తున్నామో దాని ఆజ్ఞానుసారం ఆచరించాలనే పట్టుదలగలిగి ఉండాలి. ఈ పట్టుదల చివరకు మూలసిద్ధాంతాలకు హానిగలుగజేసేదిగా ఉండగూడదు. దీని అర్థాన్ని బాగా తెలుసుకోవాలి.

అర్థజ్ఞానంవల్ల మంచిఫలం కలుగుతుంది. ఒకపుడు మనవద్దపుస్తకం ఉండకపోవచ్చు, దొంగతనం జరుగవచ్చు, మరిపుస్తకం చినిగిపోయినా—యెక్కడైనా మరచిపోయినా, లేక మనకళ్లేపోయి అంధులమైనా, నోరు పడిపోయినా, దైవయోగంవల్ల యింకా యేలాటివిపత్తులు సంభవించినా గూడా— అర్థజ్ఞానంమాత్రం ఉంటే, లేక ప్రియమైన ఆధారభూతమైన గీతకంఠస్థమైవుంటే అది మనకెంతోశాంతినికలుగజేస్తుంది. దుఃఖాల్లో గూడమనకుతోడై, మార్గదర్శకం అవుతుంది.

ప్రపంచానుభవంగూడ యిదే. మనపూర్వులు హిందువులు, ముసల్మానులు, పార్సీలు క్రైస్తవులు, వారి వారి ధర్మగ్రంథాలను కంఠస్థంచేసేవారు. ఇపుడుగూడ యెంతో మంది కంఠస్థంచేస్తూ ఉంటారు. వారి అందరి అమూల్య అనుభవాన్ని మనంత్రోసి పుచ్చరాదు. మనశ్రద్ధా భక్తులకు యిదే పరీక్ష....

బాపూ.జీ

★

# ★ గీతా తత్త్వము ★

రచయిత: శ్రీ దివాన్‌చంద్, M. A., Ph. D.,

అనువాదకులు: శ్రీ చారాల నరసింహామూర్తిగారు.



( ఆగస్టునెల సంచిక 16_వ పేజీ తరువాయి. )

## 3. భగవద్గీతయందలి ఇతర విషయములు.

మూడవ అధ్యాయమైన "కర్మయోగ మును" దాటుచున్న కొలది కురుక్షేత్ర సంగ్రామము విషయమే క్రమేణ మరపునకు వచ్చి యుద్ధకోలాహలముతో భయంకరముగ తోచు కురుక్షేత్ర రణభూమి విషయమును మనమపుడపుడు జ్ఞప్తికి తెచ్చుకొనవలసి యుండును. ఎందుకనగ కురుక్షేత్రముననే గీతోపదేశ మొనర్పబడెను. గనుక, మూడవ అధ్యాయమునుండియు అనేక ఇతరవిషయ ములు సందర్భానుసారముగ, శ్రీ కృష్ణపర మాత్మ బోధించెను. అందు ముఖ్యమయినవి 9 విషయములు.

(1) మానవుడొనర్పు పనికిని (కర్మ), పనికి ప్రతిబింబమయిన ఫలమునకుగల సామీ ప్యసంబంధము. (3_వ అధ్యాయమున 1_వ శ్లోకము, 5 అధ్యాయమున 1_వ శ్లోకము.)

(2) మానవుడు పాపమొనర్చుటకు గల కారణము ( 3_వ అధ్యాయమున 36_వ శ్లోకము.)

(3) మనసును స్వాధీనపరచుకొనుపద్ధతి (6_వ అధ్యాయమున 33, 34 శ్లోకములు.)

(4) బ్రహ్మమన నేమి? సృష్టినిర్మాణ మెట్టిది? సృష్టిపరిణామ మెట్టిది? (8వ అధ్యా యమున 1, 2 వ శ్లోకములు.)

(5) శ్రీ కృష్ణుని అనంతశక్తులు (10_వ అధ్యాయమున 16, 17 శ్లోకములు.)

(6) సగుణ, నిర్గుణ ఉపాసనలు రెంటికి గల భేదము (12_వ అధ్యాయమున 1వ శ్లోకము.)

(7) మానవుని నైతిక అభివృద్ధికి మార్గ ము. దానిప్రకృతి (14_వ అధ్యాయమున 21 శ్లోకములు.)

(8) వివిధగుణములుకల మానవసముదా య విభజన, మానవుల లక్షణములు (17_వ అధ్యాయమున 1 వ శ్లోకము.)

(9) సన్యాసముయొక్క సారము, కర్మ లను సన్యసించుట, ఫలమును సన్యసించు విధము (18 అధ్యాయమున 1 వ శ్లోకము.)

భగవద్గీత గ్రంథమునంతయు మూడు భా గములుగ విభజింపవచ్చును. మొదటిభాగము కేవలము నైతిక సమస్యకు సంబంధించినది. పార్థుని మనసునందు మొలకెత్తిన విషాద మును వర్ణించునది మొదటి అధ్యాయము. 2 వ అధ్యాయము అర్జునుని దౌర్బల్యమును పోగొట్టుటకు శ్రీ కృష్ణపరమాత్మ ఒసగిన సమాధానమునకు సంబంధించినది. భగవద్గీత సారమంతయు 2వ అధ్యాయమైన సాంఖ్య యోగమునకలదు. ఈకారణమున గీతావృక్ష మునకు సాంఖ్యయోగాధ్యాయమును బీజము

వంటిదిగపరిగణించెదరు. కర్మయోగము నుండి భక్తియోగము వరకుగల భాగమందు సనాతన బ్రహ్మపదార్థము (Vedantic Monism)ను గూర్చి బోధింపబడెను. ఈ అధ్యాయములందు సృష్టి, స్థితి, లయములకు కారణము పరబ్రహ్మయయిన శ్రీ కృష్ణపరమాత్మయే యని ఉద్ఘాటింపబడినది. మూడవ భాగమందుగల క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగ యోగమునుండి మోక్షసన్యాస యోగము వరకుగల అధ్యాయములందు సాంఖ్యమునను సరించి సనాతన పదార్థములగు ప్రకృతిపురుషుల గూర్చిన (Sankhya Dualism) వృత్తాంతమే విపులముగ వర్ణింపబడెను. ప్రకృతి సంబంధమయిన త్రిగుణములు, మానవునిపై వాటికిగల ప్రాబల్యమును గూడ వివరింపబడినది.

## 4. భగవద్గీతయందలి మానసిక తత్వశాస్త్రము.
## (Mata physics)

'మెటాఫజిక్సు' (Meta physics) అన "భౌతికశాస్త్రము తరువాతవచ్చునది" (After physics) అని అర్థము. దీనిని సామాన్య వేదాంతమనిగూడ అనెదరు. 'ఏరిస్టోటిల్'(Aristotle)అనుమహానీ యుడురచించిన పెక్కు గ్రంథములలో భౌతికశాస్త్రము, సామాన్య వేదాంతశాస్త్రములుగూడగలవు. సామాన్య వేదాంతశాస్త్రమునకు గ్రంథకర్త 'ఉన్నది ఉన్నటుల'(Being as Being) అనుపేరుపెట్టెను. ఏరిస్టోటుల్ (Aristotle తరువాత సంపాదకులొకరు భౌతికశాస్త్రము తరువాత సామాన్య వేదాంతశాస్త్ర గ్రంథముంచెను. అందువలన దీనికి మెటాఫిజిక్సు (Meta physics) అను పేరు వచ్చెను.

భౌతికశాస్త్రము దృష్టికి గోచరమగు సృష్టియందలి పదార్థములను గూర్చి విచారించును భౌతికశాస్త్రమునకు మెటాఫిజిక్సునకు రెండు ముఖ్య భేదములుకలవు.

(1) మెటాఫిజిక్సునందు జగత్తునకు సంబంధించిన ప్రతివిషయము చర్చించబడును. (2) ఈ శాస్త్రము సర్వజగత్తునకు కారణమగు ఒక శాశ్వత పదార్థమును గూర్చి యన్వేషించును.

ఇట్టి అన్వేషణకు ఆధారములు సృష్టియందలి పదార్థములు, మన స్వానుభవము లున్నూ. పదార్థములకు మూలమేమిటో తెలిసికొనుటకొనర్చు విచారణను(Phenomenalism) పదార్థశాస్త్రము అనెదరు. పదార్థముల సృష్టికి వేరు హేతువుఉన్నటుల ఈసిద్ధాంతమంగీకరించదు.వాస్తవిక వాదము (Realism) ననుసరించి భౌతిక పదార్థము ఒక సూక్ష్మపదార్థముయొక్క మారురూపము. సృష్టియందలి సర్వపదార్థములకు హేతువు సూక్ష్మపదార్థమని అంగీకరించిన ఆట్టిపదార్థము ఒకటియా లేక రెండాయను ప్రశ్నవచ్చును.సజాతీయమై, ఏకరూపముగ నుండి సృష్టికికారణమగుపదార్థము ఒక్కటి మాత్రమని ఏకైక వాదము (Monism) యొక్క సిద్ధాంతమైయున్నది. సృష్టికి కారణమగు సూక్ష్మపదార్థము రెండువిధములని "ద్వివాదసిద్ధాంతము" (Dualism) ఈ సిద్ధాంతము ననుసరించి (1) మానసికమైన పదార్థము (2) భౌతికమైన పదార్థము అను రెండును జగత్తునకు కారణములు

(సశేషం.)

శ్రీ రామకృష్ణ బ్రహ్మచారిగారికి మదనపల్లె పురజనులు
9—8—53 తేదీన సమర్పించిన

# అభినందన పత్రము.

దృష్టి గోచరమగా బాహ్యసృష్టి యెల్ల!
నిత్యమను హేతువాదము నిండిపోవు।
జగతి కాధ్యాత్మ విద్యాప్రచారములను।
శాంతినిడు, స్వామి! మానమస్కార మిదిగో!

ఉ॥ చీకటి క్రమ్ముకొన్నది; మలీకృతమైనది, ధర్మదేవతా
నేకవిహారముల్ విరిగి నీరసమయ్యెను, దేవుడన్నమా
టే కరవై, యహంకరణ తీవ్రుల రేగు జగంబుకో ప్రభూ!
మీకృతి శాంతి దీపికల మేలొనగూర్చు జగద్ధితంబుగన్॥

ఉ॥ భాగవతంబు నాయమృత భాండము, ముద్దులమూట గట్టగా
యోగకళా తపస్వి! మహిమోజ్జ్వలమూర్తి సుధాప్రవాహమం
దాగమ తత్త్వమున్ విరియ ఆంధ్రులభాగ్యము పండిపోయె మీ!
రాగ కళాస్రవంతికల ప్రాణముపోయుడు తెల్గుజాతికిన్॥

తే॥ గీ॥ నిర్వికల్ప సమాధిలో నిశ్చలమగు
ఆత్మకానంద తత్త్వమే అనుభవమగు।
అమృత గీతాస్రవంతి యధ్యాత్మవిద్య।
తెలిసి పలికెడు మిముగొల్వగలమె మేము॥

చ॥ మదనపురంబులో హృదయ మార్దవమూర్తులు భక్తిగీతకా
మృదు మధుర ప్రపంచమున మేలొనగూర్చెడివారు, నేడు మీ
పదముల తత్త్వమున్ తెలియ, భాగవతంబును దెల్పుడంచు మీ
హృదయపుపోకడల్ గనగ యెంతటి పుణ్యమొనర్చిరో గదా॥

మదనపల్లె,
9—8—53.

ఆర్యవైశ్య
పురజన సంఘం.

కవిః— బాడాల రామమూర్తి.

# ముక్తి మార్గములు.

శ్రీమతి ఐ. పార్వతీ నారాయణమూర్తిగారు.

★

పరమాత్మయందు లీనమగుట, ఏకోఽహం లేక నిర్వాణమనునది యోగసాధకు లందరికిని ఏకైక గమ్యమైనను దాని సాధనయందు మాత్రము వేరువేరు పథముల నడచుచున్నారు. ఐనను యోగి అనబడు వానియొక్క ముఖ్యలక్షణ మేమన తన మనస్సును తాను స్వాధీన పఱచుకొనుట. కనుక మన స్సును స్వాధీన మందుంచుకొని తన సర్వస్వమును పరమాత్మున కర్పించు వాడేయోగి. అట్టి గమ్యస్థానము చేరినవానిని ప్రాపంచిక తుపాను లెన్ని చెలరేగినను అతని స్థానము చలింపజేయలేవు. అట్టివాడు,

> "దుఃఖేష్వనుద్విగ్నమనాః
> సుఖేషు విగతస్పృహః।
> వీతరాగ భయక్రోధః
> స్థితధీ ర్మునిరుచ్యతే॥

దుఃఖము వచ్చినను తపించని మనస్సుగలవాడుగను, సుఖము వచ్చినను దానియందాసక్తి లేని వాడుగను, కోరిక భయము, కోప ము ఇవిలేక మునియైనవాడు గనుక స్థిరమైన జ్ఞానిగ చెప్పబడుచున్నాడు. ఇదియే అర్జునుడు కృష్ణపరమాత్మ నుద్దేశించి 'స్థితప్రజ్ఞస్య కాభాషా సమాధిస్థస్య కేశవ!' 'ఓ కేశవా! సమాధియందున్న స్థిరజ్ఞానమును పొందినవానిని జెప్పుటయెట్లు?' అన్న ప్రశ్నకు సమాధానము.



యోగియొక్క లక్షణములు వ్యక్తపఱచి నప్పుడు అట్టి లక్షణ ములు అలవఱచుకొనుట యెట్లు? దుస్సాధ్యమైన బలవద్దృఢమైనట్టి మనస్సును జయించుట అనునది సాధ్యమా అను దిగులు సాధకు నావరించుట సహజము. శిష్యాగ్ర గణ్యుడగు అర్జునుడే ఆభయమును వెల్లడించి తరణోపాయముకొరకు మొఱబెట్టుకొనెను. దానికి సమా ధానముగ భగవంతుడు —

"యతో యతో నిశ్చరతి
మనశ్చంచల మస్థిరం।
తత స్తతో నియమ్యై త
దాత్మన్యేవ వశం నయేత్ ॥

మిక్కిలి చంచలమైనదియు కావున నవే స్థిరము కానిదియునైన మనస్సు ఏ యే విషయముల నిమిత్తమై తిరుగునో ఆ యా కారణమైన విషయములనుండియు ఈ మనస్సు త్రిప్పి ఆత్మయెడనే వశముగ నున్నట్లు చేసికొనవలెను' అని మార్గము చూపెను. ఇందులకై నిత్యసాధన, ఎడతెగని ఓర్పు అవసరము. నిత్యసాధనచేత నిత్యజీవితమును, దానివలన స్వభావలక్షణములును మార్పులు చెందును. ఈ పరిణామములు నిత్యజీవితమున అమలు పఱచుట అందరికిని ఒకే మార్గమున సాధ్యముకానిది. అందుకొఱకే ముఖ్యమైన త్రివిధములగు యోగమార్గములు స్పష్టీకరించబడినవి. ఇవియే లోకవిదితములగు 'కర్మసన్న్యాసయోగము, జ్ఞానయోగము, భక్తియోగము. ఇట్టి స్పష్టీకరణయోగసాధకునకేగాని పరిపక్వమొందిన వానికి అంతయు బ్రహ్మమయమై కనుపట్టును.

ఇక ప్రవృత్తి, నివృత్తి మార్గముల పరిశీలించుటకు లోకమున దైవమనియు, అసురమనియు రెండు విధములుగలవు. ప్రవృత్తి మార్గమున జీవి ప్రకృతినుండి సంభవమైన సత్త్వ రజ స్తమోగుణముల చేత ఆవరించబడినవాడై, భయ, లోభ, మోహాములచేత బంధింపబడుచున్నాడు. ఆశ అను మాయ చేత మోహితుడు కాబట్టి ఆతడు తన కోరిక నెఱవేర్చుకొనుటకొఱకు సర్వేశ్వరుని ప్రార్థించుటకు పూనుకొనును. చిట్టచివరకు వాని పురాకృత సుకృతమువలన నివృత్తి మార్గమున దైవగుణము ప్రధానముగలవాడగును. ప్రవృత్తి మార్గమున తాను వాంఛించిన ప్రాపంచిక కోరికలనుండి ఆతడు విముఖుడగును. అట్టి విముఖత్వము పొందినపిమ్మటనే ఆతడు భగవంతుని గ్రహించి భక్తి అను అనిర్వార్యమగు సాధనము చేత పరమాత్మునియందు మరల జన్మరాహిత్యము పొందుటకు ప్రయత్నించును.

నివృత్తిమార్గముననడచు భక్తుని కింకను ఆశ అనునది వెన్నంటియే యుండును. ఆతడు ఎల్లప్పుడు పరమాత్మునియెడ ధ్యానము అను గొడ్డలిచేత ఆ ఆశను జయించి మనస్సును నిలబెట్టుకొనవలెను.

[ మిగత 26-వ పేజీలో ]

# [illegible]పాద శంకర భాష్య సమలంకృతము
## శ్రీమద్భగవద్గీత
అనువాదకులు
## శ్రీ స్వామి శుద్ధచైతన్య జీ.

( ఏప్రెల్ సంచిక 20_వ పేజీ తరువాయి. )

భా:- తథాచ భగవతా విభక్తే ద్వే బుద్ధీ నిర్దిష్టే "ఏషాతేఽభిహితాసాఙ్ఖ్యే బుద్ధిర్యోగే త్విమాంశృణు" ఇతి.

**అను:- "అర్జునా! యింతకుముందు నీకు దెలిపినట్టిది సాంఖ్యబుద్ధి. ఇక దెలుపబోవు యోగబుద్ధిని గుఱించి విను" మని భగవానుడిట్లే రెండు బుద్ధులను విభజించి తెలిపియున్నాడు.**



భా:- తయోశ్చ సాఙ్ఖ్యబుద్ధ్యాశ్రయాం జ్ఞానయోగేన నిష్ఠాం సాఙ్ఖ్యానాం విభక్తాం వక్ష్యతి "పురావేదాత్మనా మయాప్రోక్తా" ఇతి.

**అను:- ఈ రెండింటిలో "వేదరూపుండనైన నేను మున్ను దీనిం దెలిపియుంటి" ననుచు సాంఖ్యబుద్ధి నాశ్రయించిన నిష్ఠను జ్ఞానయోగముచేత సాంఖ్యులకు విభజించి వచించును.**

భా:- తథాచ యోగబుద్ధ్యాశ్రయాం కర్మయోగేన నిష్ఠాం యోగినాం విభక్తాం వక్ష్యతి "కర్మయోగేన యోగినా" మితి.

**అను:- అట్లే "కర్మయోగేన యోగినా" మనుచు గర్మయోగముచే యోగబుద్ధి నాశ్రయించిన నిష్ఠను యోగులకు విభజించి వచించును.**

భా:- ఏవం సాఙ్ఖ్యబుద్ధిం యోగబుద్ధిం చాశ్రిత్య ద్వేనిష్ఠే విభక్తే భగవతోక్తే జ్ఞానకర్మణోః కర్తృత్వా కర్తృత్వానేకతైకత్వబుద్ధ్యాశ్రయయోర్యుగప దేకపురుషాశ్రయత్వా సమ్భవం పశ్యతా.

**అను:- ఇట్లు సాంఖ్యబుద్ధిని యోగబుద్ధిని నాశ్రయించి భగవంతుడు రెండు నిష్ఠలను విభజన పూర్వకముగా విశదము చేసియున్నాడు.**

"కర్తృత్వంబకర్తృత్వం బేకత్వంబనేకత్వం బను నిట్టి పరస్పర విరుద్ధ బుద్ధుల నాశ్రయించిన జ్ఞానకర్మయోగంబు లేకకాలంబున నొక్కపురుషు నాశ్రయించియుండుట యసంభవం"బని.

భా:- యత్త్వైత ద్విభాగవచనం తద్వైవ దర్శితం శాతపథీయే బ్రాహ్మణే "ఏతమేవ లోక మిచ్ఛన్తః ప్రవ్రాజినః ప్రవ్రజన్తి" ఇతి సర్వకర్మ సంన్యాసం విధాయ తచ్ఛేషేణ "కిం ప్రజయా కరిష్యామో యేషాంనోఽయ మాత్మాఽయం లోకః" ఇతి

అను:- వెనుక దెలిపిన విధముననే "ఈ యాత్మలోకంబు నభిలషించు వారై యతులు సంన్యసించుచున్నారు." అని యీరీతిని సర్వకర్మ సంన్యాసంబును విధించి యీ మంత్రమున కంగంబుగానున్న వాక్యంబుచేత "మాకీయాత్మలోకం బె యభిలషితము; అట్టిమేము సంతతిచే సాధింపవలసిన దేమిగలదు?" అనునిట్టి విభజనంబుగల వాక్యంబు శతపథ బ్రాహ్మణమునందును గనబఱచబడియున్నది.

భా:- తత్రచ "ప్రాగ్దారపరిగ్రహా త్పురుష ఆత్మా ప్రాకృతో ధర్మజిజ్ఞాసోత్తరకాలం లోకత్రయసాధనం పుత్రం ద్విప్రకారంచ విత్తం మానుషం దైవంచ. తత్ర మానుషం విత్తం కర్మరూపం పితృలోకప్రాప్తి సాధనం విద్యాంచ దైవం విత్తం దేవలోకప్రాప్తి సాధనం సోఽకామయత" (సశేషం)

---

[ 23_వ పేజీ తరువాయి ]

కామక్రోధ వియుక్తానాం
యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మనిర్వాణం
వర్తతే విదితాత్మనాం॥

ఆశ, క్రోధములులేని వారై మనస్సునణచి ఆత్మతత్త్వము నెరింగియు సకల కర్మల వీడిపోయిన వార్లగనున్న బ్రహ్మనిష్ఠులైన యతులకు బ్రహ్మానందము, మోక్షము అంతటనున్నది. అందులకే భగవంతుడు:-

మన్మనాభవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ
మాత్మానం మత్పరాయణః॥

'నాయెడ మనస్సునుంచిన వాడుగను, నాయెడ భక్తిగలవాడుగను, నన్ను పూజించు స్వభావముగల వాడుగను అగుదువుగాక, నన్నునమస్కారముజేయుము' అని మహత్తర రహస్యమును వెల్లడించెను.

— ఐ. పార్వతీదేవి.



# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము
శ్రీ.కీళాత్తూరు - శ్రీనివాసాచార్యులు.

శ్రీమతే రామానుజాయ నమః.

## ద్వితీయోఽధ్యాయః.

సంజయ ఉవాచ:—

★

శ్లో॥ తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణం ।
విషీదన్త మిదం వాక్యమువాచ మధుసూదనః ॥ 1

శ్రీ భగవానువాచ:—

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥ 2

శ్లో॥ క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ 3



భాష్య:—ఏవముపవిష్టే పార్థే "కుతః అయం అస్థానే సముపస్థితః శోకః" ఇతి ఆక్షిప్య, తం ఇమం విషమస్థం శోకం అవిద్వత్సేవితం, పరలోక విరోధినం, అకీర్తికరం, అతిక్షుద్రం, హృదయ దౌర్బల్యకృతం పరిత్యజ్య యుద్ధాయ ఉత్తిష్ఠ ఇతి శ్రీ భగవానువాచ.

అను:—ఈ విధముగ పార్థుడు కూర్చొన్న వాడుకాగా, ఎందులకు యీ అస్థానమున శోకము సంభవించినదని ఆక్షేపించి "అవిద్వాంసులచే యాశ్రయింపబడినదియు, పరలోకవిరోధియు, అపకీర్తికరమును, అతి క్షుద్రమును, హృదయ దౌర్బల్యజన్యమునగు యీ విషమస్థమగు శోకమును త్యజించి యుద్ధమునకై లెమ్ము" అని భగవంతుడు పలికెను.

విశే:— "అర్జున, కౌంతేయ, త్వా, త్వయి, పరంతప" యీ శబ్దములు కాకుగర్భములు. అనగా ప్రఖ్యాతిగాంచిన వంశములో జనించి, అతి పరాక్రమశాలియని పేరుబడసి, సకల విద్యాపారంగతుడైన అర్జునా! నీకు యీ శోక మోహాదులు తగునా? అనే భావము యీ శబ్దములచే సూచితమగుచున్నది.

"అనార్యజుష్టం"అతత్త్వేభ్యః ఆరాత్—దూరాత్-యాతాబుద్ధిః యేషాంతే=ఆర్యాః. తదన్యే అనార్యాః — అనగా అతత్త్వములనుండి దూరములోనున్న బుద్ధికలవారలు ఆర్యులు. ఇతరులు అనార్యులు. నీవనగా తత్త్వమునకు(పరమాత్ముడగునాకు) సమీపములో నున్నప్పుడు అనార్యుల ఆచరణయగు శోకమోహముల పొందవచ్చునా? అని భావము.

"పరంతప!" శత్రువులను తపింపజేయుటయే స్వభావముగాగల నీవు, శత్రువులైనవారు నీయెదుట నిలబడియుండగా శస్త్రముల మానుటతగునా!



## సోదర పత్రికాసంపాదకులకు మా శ్రద్ధాంజలి.

'గృహలక్ష్మి' సంపాదకులగు శ్రీ కె. యన్. కేసరిగారు మహిళల ఆరోగ్యానికి, వారి ఆత్మవికాసానికి ఔషధములద్వారా - పత్రికద్వారా చేసినసేవ కొలతకు అందనిది. శ్రీ కేసరిగారి నిర్యాణము ఆంధ్రమహిళలకు తీరనిలోటు. ఆంధ్రమహిళలేగాదు; ఆంధ్రులంతావారిని, వారిసేవను మరువలేరు. వారిలోని దివ్యవిభూతికి మా జోహార్లు.

గీతావాణి-(బనారస్ ఆఫీసు) — సంపాదకుడు.

# శ్రీ రామకృష్ణ బ్రహ్మచారిగారి తురీయాశ్రమ దీక్షా స్వీకరణోత్సవము.



మాచిరకాల పూజ్యమిత్రులగు శ్రీ రామకృష్ణబ్రహ్మచారి గారు (శ్రీ హిమకుంతల రామకృష్ణయ్యగారు, రామిరెడ్డిపల్లె పులివెందల తాలూకా, కడపజిల్లా.) గండిక్షేత్ర మందలి శ్రీ భూమానందాశ్రమవాసులు, వయసున చిన్నవారైనా స్వయంకృషిచేత ఆంధ్ర, సంస్కృత, కర్ణాటక, హిందీ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, పాలీ భాషల్లో చక్కటి పరిచయాన్ని సంపాదించుకున్నదిట్లు. అంతేగాదు-మధురకవులు, సొంపగు రచయితలు, ఇంపగువక్తలు, సాహిత్యారాధకులు, గత ఆగష్టు 14-వ తేదీన చారిత్రాత్మకంగా ప్రసిద్ధిజెందిన హంపిక్షేత్రంలో శాస్త్రోక్తంగా సంన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. ఆ మహోత్సవసంగ్రహ వార్తలను ఇందుపొందుపరుస్తున్నాం. ఇక చదవండి.

— సంపాదకుడు.]



ఆగష్టు 13-వ తేదీకే ఆంధ్రకర్ణాటక ప్రాంతాలనుంచి జిజ్ఞాసువులు శ్రీ రామకృష్ణబ్రహ్మచారిగారి తురీయాశ్రమ దీక్షా స్వీకరణ మహోత్సవంలో పాల్గొనటానికి హంపీక్షేత్రం చేరుకొన్నారు. శ్రావణశుద్ధ పంచమీ (14-8-53) శుక్రవారం బ్రహ్మీముహూర్తంలో కార్యక్రమం ప్రారంభింపబడింది. పూజ్యశ్రీ అభేదానంద సరస్వతీ స్వాములవారు శ్రీ రామకృష్ణబ్రహ్మచారిగారిచేత శాస్త్రీయవైదిక విధిననుసరించి విరజాహోమము చేయించారు. ఆ మీదట ప్రసిద్ధమగు చక్రతీర్థానికి పోయి పావన తుంగభద్రానదియందు శిఖాయజ్ఞోపవీత విసర్జనం చేయించారు. శ్రీ అభేదానందస్వాములవారు 'మహావాక్యాలను' శ్రీ శంకరానందస్వాములవారు "ప్రణవ" మంత్రాన్ని ఉపదేశించారు. ఈ సందర్భంలో శ్రీ రామకృష్ణబ్రహ్మచారిగారికి "శ్రీ రామకృష్ణానందగిరిస్వామి" అని నామకరణం చేశారు. అచటచేరిన పెద్దలంతా అభినందించారు. తదితరులంతా నమస్కరించారు. (అదృశ్యరూపులగు పరమ ఋషులంతా సనాతన ధర్మవ్యాప్తికై సమర్థుడైన సచ్ఛీలంగల పండితుడు సంన్యాసి అయ్యాడని ఆనందించి ఆశీర్వదించి ఉంటారు. [సం.]

తర్వాత శ్రీరామకృష్ణానందగిరిస్వాముల వారు భక్తసమూహము జయజయధ్వానులను, ప్రణవనినాదములను చేస్తూ వెంటరాగా శ్రీ కోదండరాముల మందిరానికి వేంచేసి అర్చనాదులు పూరించుకొని శ్రీవిరూపాక్షేశ్వరుని దర్శించి హారతులు స్వీకరించి భజనలతో - సంకీర్తనలతో యథాస్థానాన్ని చేరుకున్నారు.

ఈ మహోత్సవ దృశ్యాలను హాస్పేట శ్రీగీతా సేవాశ్రమ భక్తులగు గుత్తిత్రోటప్పగారు దాదాపు యాభై ఫోటోలు తీశారు. అందులో ముఖ్యదృశ్యాలను గీతాజయంతీ సంచికలో పాఠకులకు అందిస్తాం.

బోలో ఆది శంకరులకు జై!
బోలో స్వామి శ్రీ రామకృష్ణానందులకు జై!

---

## గీతావాణి చందాదారులకు విజ్ఞప్తి.

ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాసేటపుడు, చందాపైకాన్ని పంపేటపుడు తప్పనిసరి మీ చందాదారునెంబరు సూచిస్తూండాలి.

—స్వామి శివానంద, మేనేజర్-గీతావాణి.

# వార్తలు.



మదరాసు మహామంత్రభజన మండలి వారి 20-వ షోడశనామ అఖండసంకీర్తన సప్తాహ మహోత్సవము జులై 26-వ తేదీ నుంచి వారందినాలు పూజ్యపాద శ్రీనిత్యానందస్వాములవారి యాజమాన్యాన జయప్రదంగా నిర్వహింపబడింది. శ్రీ రామకృష్ణమఠం విద్యార్థులు గీతాపారాయణ గావించారు. శ్రీ నోముల అప్పారావు, శ్రీ లవంగ భారతీస్వామి, శ్రీ చిన్మయానందస్వామి, యం. యస్. సి. శ్రీ రాజగోపాలరావు, బి.ఏ. శ్రీ వి. కె. పంతులు, శ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండిత ప్రభృతులు ప్రసంగించారు. కార్యనిర్వహణ సమర్థులగు శ్రీ నిత్యానంకులవారి ఆధ్యక్షతన ఏడురోజుల కార్యక్రమం ఏడుతుణాల్లో ముగిసినట్లుండింది.

*　*　*

బనారస్:- శ్రీ కాశీవిద్యాపీఠమునందు 1-8-53 వ తేదీన ప్రొఫెసర్ శ్రీ చతుర్వేదిగారి అధ్యక్షతక్రింద లోకమాన్యుని స్మారకదినోత్సవం జరుపబడింది. "గీతకు సమానమైన ఉత్కృష్టమగు గ్రంథం సంస్కృత సాహిత్యంలోనేగాదు విశ్వసాహిత్యంలోడా లేదంటూ" గీతారహస్యాన్ని ప్రపంచాని కందించిన శ్రీ బాల గంగాధర్ తిలక్ గారినిగూర్చి వారిదేశసేవ సాహిత్యసేవల గూర్చి శ్రీ భగవతీప్రసాద్ పాంథరీ, శ్రీ చంద్రశేఖర్ ఆస్థానా, శ్రీ ముసాఫిర్ సింహాప్రభృతులుప్రసంగించారు

*　*　*

యోగిసామ్రాట్ శ్రీ అరవిందుల 82-వ జన్మదినోత్సవం ఆగష్టు 15 వ తేదీన భారతదేశంలోని వివిధప్రదేశాల్లో నిర్వహింపబడింది.

*　*　*

కాకినాడ:- 23-8-53 నుంచిమూడు రోజులు శ్రీ వేణుగోపాల స్వాములవారి దేవాలయములో భజనసమాజముయొక్క ఆరవవార్షికోత్సవం జరుపబడింది. గీతాపారాయణ, ఉపన్యాసాది కార్యకలాపాలు విజయవంతంగా నిర్వహింపబడినాయి. శ్రీ నోముల అప్పారావు ప్రభృతులు పాల్గొన్నారు.

*　*　*

హంపి:- ఆగష్టు 14 నుంచి 20 వ తేదీ వరకు శ్రీ విద్యారణ్య విజ్ఞానసమతి యందు గీతాపురశ్చరణయజ్ఞం పూజ్యపాద శ్రీ శంకరానందులవారి యాజమాన్యమననిర్వహింపబడింది. ఈపవిత్ర సందర్భంలోనే శ్రీ రామకృష్ణబ్రహ్మచారిగారు తురీయాశ్రమ దీక్షను స్వీకరించారు, గీతావాణి మేనేజర్ గారగు శ్రీ శివానంద, స్వామి శ్రీ రాంపురి ప్రభృతులు పాల్గొన్నారు.

21-వ తేదీన హంపినుండి శ్రీ శంకరానంద శ్రీ రామకృష్ణానందస్వాములవారలు బయలుదేరి చాగలమర్రిలో జరుగబోవు శ్రీ కృష్ణజయంతీ సప్తాహంలో పాల్గొని గండిక్షేత్రం మీదుగా 8-9-53 తేదీ నాటికి నూజ్వీరుపేట కార్యక్రమంలో పాల్గొనటానికి బయల్దేరారు.

5-8-53 నుండి 17-8-53 వరకు హంపిక్షేత్రంలో జరిగిన గీతాపురశ్చరణ యజ్ఞంలో ఎక్కువ ఆవృత్తులు పురశ్చరణాన్ని జరిపిన ఈ క్రిందిముగ్గురికి గీతాగ్రంథాలను పురస్కారం యిచ్చుట జరిగింది.

ప్రథమబహుమతి-కుందనగు రిశివలింగప్ప, ద్వితీయబహుమతి - అజంపూరు హాలయ్యస్వామి, తృతీయబహుమతి - చంద్రాచారి తృతీయబహుమతి - సౌ. కల్యాణమ్మగారు

# శ్రీగీతాసాహిత్యసేవాసమితి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర పంచమతాధ్యక్ష జగద్గురు శ్రీ వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్ళదుర్తి, కోయిలకుంట్ల తాలూకా. - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీతోమ్మంద్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీ ఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము. శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10 డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్య గారు, పడకండ్ల, శిరివెళ్లతాలూకా. - ♦ ♦ ♦ కడప జిల్లా. 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణగారు, రామిరెడ్డిపల్లె, పులివెందల తాలూకా. — 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. - 15. శ్రీ పోలేపల్లి రాజా వెంగన్నశ్రేష్ఠి గారు, వల్లూరు. ♦ ♦ ♦ చిత్తూరుజిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లె మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్‌వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగం పిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు. ♦ ♦ ♦ అనంతపురంజిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహర్షులవారు, శ్రీభవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు రాగలపాడు. ♦♦♦ బళ్లారిజిల్లా: 20. శ్రీ పెండుకూరు గోవిందప్ప అండ్‌సన్స్, హాస్పెట్. 21. శ్రీసుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్. - 22. శ్రీగంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. ♦♦♦ కోలారుజిల్లా: 23. శ్రీఎం. వి. రామలింగంశ్రేష్ఠిగారు, బంగారుపేట. మైసూరుస్టేట్: 24. శ్రీజి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటీ. ♦♦♦ ఉత్తర ఆర్కాట్ జిల్లా. 25. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటునూరు, కణ్ణమంగళంపోస్టు. ♦♦♦ నెల్లూరుజిల్లా: 26. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్ పేట, నెల్లూరు - 27. శ్రీ వేమారెడ్డి బా॥రామిరెడ్డిగారి ధర్మపత్ని యశోధరమ్మగారు, ఇనమడుగు. ♦♦♦ హైదరాబాద్ స్టేట్ 28. శ్రీడి.పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. ♦♦♦ గుంటూరుజిల్లా: 29. శ్రీశ్రద్ధానంద స్వాములవారు. శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, తెనాలి తాలూకా.

## రాజపోషకులు రు. 54.

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మృతిచిహ్నముగ శ్రీ యన్. అయ్యపురాజుగారు, గోసుపాడు. - 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. - 3. శ్రీ చాటకొండ ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. - 4. శ్రీ జె.ఆర్.ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. - 5. శ్రీసోముల పెదసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. - 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. - 7. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్లతాలూకా. - 8. శ్రీయజ్. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తా॥ - 9. శ్రీమదళ్లపల్లె

రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 10 జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్య శ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 11. శ్రీమతి ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు, నంద్యాల. – 12. శ్రీపాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామనాథ శాస్త్రిగారు, కోయిలకుంట్ల. – 14 శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చెంట్, పాణ్యాం ♦♦♦ కడపజిల్లా: 15. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 16. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. – 17. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 18. శ్రీ పి. నారాయణశ్రేష్ఠి గారి కుమారుడు శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 29. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 20. శ్రీ ఉమ్మిడి పెద్ద సుబ్బారెడ్డి గారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 21. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 23. శ్రీబల్లా తెప్పల నాయుడుగారు, ముత్తరపల్లె – 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం.ఎల్.ఎ., పెరియంబాడి. 25. శ్రీనటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు. అనంతపురంజిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 27. శ్రీ బుశెట్టి పన్నప్పగారు, ఉరవకొండ – 28. శ్రీకాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 30. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకనగుర్తి – 31. ఆముదాల వెంకట రెడ్డిగారు, రాగలపాడు పోస్టు ♦♦♦ బళ్లారిజిల్లా: 32. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్, – 33 శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు – 34. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు. – 35. శ్రీ కందుకూరువెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరిపోస్టు. – 36. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి – 37. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి – 38. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. – 39. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. – 40. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 41. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 42. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి – 43. పాటీల్ పెద్దబళిరెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి – ♦♦♦ మైసూర్ స్టేట్: – 44. శ్రీ వి. ఆర్. రాజగోపాల్శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 45. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 46. శ్రీ కె. నంజప్ప శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 47. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్. – 48 శ్రీ నారాయణమూర్తిగారు, c/o శ్రీ నూరా విరూపాక్షయ్య గారు, తొండేభావి, కోలారుజిల్లా. ♦♦♦ నార్త్ఆర్కాడుజిల్లా: 49. శ్రీశంకరనాయుడు గారు, కార్వేరు. ♦♦♦ హైదరాబాదుస్టేట్. 50. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. – 51. శ్రీదేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. ♦♦♦ నెల్లూరుజిల్లా: 52. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16. – 2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. బళ్లారి జిల్లా.

# మౌనదీక్షా విరమణ.

★



శ్రీ అనంతాశ్రమాధ్యక్షులును, పూజ్యపాద శ్రీ చిద్గగనానందమహర్షుల వారి ప్రియశిష్యులును, మాపూజ్య మిత్రులునునగు శ్రీభూమానందభారతీస్వాముల వారు మౌనదీక్షలో 6–2–52 నుంచి ఉండిన విషయం గీతావాణి పాఠకులకు విదితమే. మౌనగంభీరమగు ఆత్మశక్తిప్రభావంతో అవ్యక్తంగా దేశకల్యాణాన్ని సాధించటమే తమదీక్షలోని అంతరార్థమంటూ—మూడుసంవత్సరాలు తమ దీక్షను కొనసాగిస్తామంటూ ఆ నాడు సెలవిచ్చారు.

పలు ప్రాంతాలనుంచి భక్తులు వేదాంతోపన్యాసాలకై విరివిగా ఆహ్వానాలు పంపటంచేతను, దేశకాల పరిస్థితులనుగుర్తించి గుర్వాజ్ఞాబద్ధులై, అంతరాత్మప్రేరణ ననుసరించి శ్రీవారు తమదీక్షను 21–8–53 నాటికి విరమించారు.

తీవ్రవైరాగ్య యోగసాధనాసహిత సహజసమాధి నిష్ఠను తమ దీక్షాకాలంలో పొందిన శ్రీ భూమానందస్వాములవారు తమ సంచార కార్యక్రమాల్లో ప్రగాఢ అద్వైతసిద్ధాంతాన్ని అవిచ్ఛిన్నంగా ప్రచారం చేస్తారని, గీతాసందేశవ్యాప్తికి విరివిగా దోహదం గల్గిస్తారని శ్రీవారికి విజ్ఞప్తి చేస్తున్నాం.

గీతాసాహిత్యసేవాసమితి,

1—9—1953.

సమితి కార్యదర్శి.

आल्लगड्डा — गीता साहित्य सेवा समिति की तरफ से संपादित तथा प्रकाशित.
मेनेजिंग एडिटर—यन० श्रीकण्ठम्, गुल्लदूर्ती, कोइलकुण्ट्ला, (आंध्रा)

## రచయితలకు సంపాదకుని సవినయ విజ్ఞప్తి



ఆత్మీయులారా !

నమస్తే. గీతావాణి ఎడిటోరియల్ ఆఫీసును బనారస్‌నకుమార్చామన్న సంగతి జులై; ఆగస్టు సంచికలద్వారా తమకు తెలిసిన విషయమే. ప్రింటింగ్ చిత్తూరులో, మేనేజింగ్ ఆళ్లగడ్డలో, ఎడిటింగ్ (పదునాలుగువందల మైళ్లదూరములోనున్న) బనారస్‌లో కావటంతో – వ్యాసాలు సకాలంలో నాకుచేరటంలోనయితేనేమి, నేను వాటినితిరుగా సకాలంలో ముద్రణాలయానికి పంపటంలోనయితేనేమి ఇబ్బందులు కలుగగలవనే విషయాన్ని ఈ మూడుమాసాల అనుభవంలోనే గుర్తించాను. అంతేగాక నా అధ్యయనానికికూడా ఇబ్బందిగానే ఉంటుందనే కారణంతో నా అధ్యయనం ముగియువరకు (అంటే నాలుగైదు సంవత్సరాలన్నమాట) మేనేజింగ్ ఎడిటర్‌గావుండి పనులునిర్వహించవలసినదిగా పూజ్యపాద శ్రీ రామకృష్ణానందగిరిస్వాములవారిని అర్థించాను. వారు ప్రేమతో అంగీకరించారు. ఇకమీదట గీతావాణికి సంబంధించిన రచనలు, వ్యాఖ్యలు, విమర్శలు, కవితలు మొదలగు సంపాదకీయశాఖకు సంబంధించినవన్నీ "శ్రీరామకృష్ణానందగిరి స్వాములవారు, మేనేజింగ్ ఎడిటర్, గీతావాణి, ఆళ్లగడ్డ కర్నూలుజిల్లా" అనే చిరునామాకు పంపుతూ సహకరిస్తారని సవినయంగా రచయితల నందరునూ అర్థిస్తున్నాను. పత్రికాభివృద్ధికేవైనా సలహావుంటేమాత్రం నాకు తెల్పుతూ ఉండండి. మిగత టపాల్ సరాసరి ఆళ్లగడ్డకేపంప ప్రార్థన. ఓం. గీతాసేవలో తమ విధేయుడు,

మకాం:
శ్రీ కాశీవిద్యాపీఠము బనారస్,-2.
(శ్రీ విజయ వినాయకచవితి)
12-9-1953

యస్. శ్రీకంఠమ్., ఎడిటర్-గీతావాణి.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు. కా. 1250.

# గీతావాణి

28




మూడవ సంవత్సరము  నాల్గవ సంచిక.

ఆనరరీ ఎడిటర్ - స్వామి శ్రీ శంకరానంద

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 అక్టోబర్ 1953.

# విషయసూచిక - అక్టోబర్ '53.



## రచయితలకు విజ్ఞాపన.

మీ రచనలను యీ క్రింది చిరునామాకు పంప ప్రార్థితులు.

స్వామి శ్రీరామకృష్ణ.

మేనేజింగ్ ఎడిటర్ — గీతావాణి.

ఆళ్లగడ్డ — కర్నూలుజిల్లా.

# "గీతావాణి" 28

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక,





మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ



మేనేజర్:

శ్రీ స్వామి శివానంద,

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

---

సంవత్సరచందా నాలుగు రూపాయలు.

---

**OCTOBER '53.**

# గీతాగానము.

కవిరాజ్ శ్రీ డా॥ రంగా చిన్నచలమయ్యగారు, I. M. P. చాగలమఱ్ఱి.

[ ఆగస్టు సంచిక 5-వ పేజీ తరువాయి. ]

2. కర్మచేయకుండినను, కర్మలను జేయుచున్
సన్యసించుచుండువాడు, సిద్ధిబొందలేడయ — సుబుద్ధివాడుకాదయ
కర్మలను జేయుచును, కామముల వీడుచును
కర్మక్రియా రహితుడైన, సిద్ధిబొందు స్థిరముగ ॥పా॥ (శ్లో॥ 4)

3. ఎట్టి మనుజుడైనను, యెట్టిప్రాణియైనను
ఊరకుండజాలడూ, కర్మజేయకుండగ — గుణకర్మజేయకుండగ
ప్రకృతిధర్మ మిదియెగా, ప్రాణిధర్మ మిదియెగా
కర్మచేయకుండ దేహ, కర్మయుండజాలదు ॥పా॥ (శ్లో॥ 5)

4. కర్మయింద్రియంబులను, కట్టివేయుచుండినను
మనసునందు దలచునయ్య, మాయమనుజుడు — మటు మాయమనుజుడు
జ్ఞానయింద్రియంబులను, మనసునందు నిగ్రహించి
కర్మచేయుచుండినను, కర్మయోగియానయ ॥పా॥ (శ్లో॥ 6, 7)

5. శాస్త్రవిహిత కర్మలను, చక్కగను జేసినను
వారివారి దేహయాత్ర, భద్రముగ జరుగును — సుభద్రముగజరుగును
స్వప్రయోజనాలకై, చేయుచుండు కర్మలచె
లోకముబంధించునయ్య, మోక్షమబ్బదు ॥పా॥ (శ్లో॥ 8, 9)

6. యజ్ఞములను మానవులను, బ్రహ్మయె సృష్టించెను
యజ్ఞములను జేయుమంచు, ప్రజలకాజ్ఞనొసగెను — భువిప్రజలకాజ్ఞనొసగెను
యజ్ఞములాచేతనే, దైవములను మొక్కుచును
నిష్ఠగలిగియుండువారి — కిష్టకామమొసగును ॥పా॥ (శ్లో॥ 10, 11)

7. పరలోకస్వర్గమే, పట్టుగానె దొఱుకును
ప్రజలుచేయు యజ్ఞములకు, పాపములు యుండవు — పలుపాపములుయుండవు
దేవతలే యిచ్చినా, దివ్యమైన వస్తుల
దేవతలకు అర్పించి, తీర్చవలెను ఋణమును ॥పా॥ (శ్లో॥ 11, 12)

8. దేవతలకు అర్పించి, తినెడివారికందరికిని
పాపములు అంటవయ్య, పుణ్యమూర్తులు — వారు పుణ్యమూర్తులు
ఎవరికొఱకు వారలే, వంటజేసి తిన్ననూ
పాపములను తినుచునూ, పాపులగుచు నుందురు ॥పా॥ (శ్లో॥ 13)

9. యజ్ఞములె మేఘములు, మేఘములే యన్నము —
కర్మముచె యజ్ఞములు, గలుగుచున్నవి — అవి గలుగుచున్నవి
అన్నముచె ప్రాణములు, ఉద్భవించుచున్నవి
ప్రాణులచె లోకమూ, ప్రబలుచున్నది ॥పా॥ (శ్లో॥ 14)

(సశేషము.)

★ స్వస్తిశ్రీ విజయ – భాద్రపదమ్ ★



గీత కల్పవృక్షము. "గీతాకల్పతరుం భజే" అనెడి ప్రసిద్ధమగు ధ్యానశ్లోకము గీతాభక్తులకు అపరిచితముకాదు. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని – అధ్యాత్మవిదులు వేదాంతమనియు" – అని చెప్పిన మహాభారత లక్షణములన్నియు రమారమి భగవద్గీతకు సైతమన్వయింపగలవు. జ్ఞానులకు భక్తులకు యోగులకు నిష్కామ కర్మయోగులకు – వెయ్యేల సకామభక్తులకుకూడ తన దయాదానము ను ప్రసాదించుట కామె నిరంతరము ముక్తహస్తయైయున్నది, స్త్రీలు శూద్రులు పతితులు పామరులు పాపులు కడగొట్టు పాపులు చండాలాదులను సైతము కన్నతల్లివలె ఆదరించుట కామె వెనుకాడదు. ఆర్తులు కానిండు; అర్థార్థులు కానిండు; రారండని చేతులు జాచునెగాని, ధూత్కారముచేసి చీదరపడదు.

గీతకు నిష్కామబుద్ధియెడ మక్కువ యెక్కువ. నిష్కామ బుద్ధియొక్క దీటున సకామబుద్ధి వాస్తవముగ తుచ్ఛమే. ఆ ఆశయముతో గీతయందు సకామభావన పలుచోట్ల నిందింపబడినది. రాగమే చిత్తమాలిన్యము. వైరాగ్యమే చిత్తశుద్ధి. చిత్తశుద్ధిని పొందినవాడు, జ్ఞానాధికారియైనవాడు, వైరాగ్యశీలుడు మాత్రమె కోరికలను తుదముట్ట వదలిపెట్టగలుగుట. అయినను, తక్కినవారు భగవద్గీతకు దూరమై యుండవలసినదేనా? లేదు.

మనుష్యుడు దుఃఖమును వద్దనును; సుఖము కావలెనను౦. వారికే ఆర్తుడని అర్థార్థియని గీత పేర్లు పెట్టినది. "మానవుడా! కోరికలను కోరుట నీకు త్రోసిపుచ్చరాని దౌర్బల్యమై యున్నచో — పోనిమ్ము — కానీ, సాటి మానవుల పంచలబడి దేబరించుటమాత్రము శోభాకరముగాదు. "రక్షించెదననుచు చక్రి రాజై యున్నాడు. అతని కడ నీకోర్కెలను దాఖలుచేసికొనుము. నీవు ధన్యుడవు కాగల్గుదు" వని గీత బుద్ధిచెప్పుచున్నది. పశువే యగుగాక; శివుని కభిముఖముగ నుండుట బట్టి — నంది, మనకు పూజ్యమై వెలసినది. "కామ్యబుద్ధి హీనమైనది; నీచమైనది. నిజమే. కానిమ్ము. మరి — ఏమిచేయవలెను? కోర్కెలతోనైనను సరే; భగవంతునివైపు ముఖము మళ్లించిరో; అంతే చాలు, అంతమట్టుకైనను మేలే. మార్గాంతరము మీదట చూచుకొనవచ్చును" — అనెడి ఉదారభావముతో గీత మానవమాత్రులనందరిని తన ఒడిలోనికి రారమ్మనుచున్నది.

భగవద్గీతను అనుకరించుచు పురాణ వాఙ్మయమునందు పెక్కులు గీతలు వెలసినవి. ప్రత్యేకముగ గీతలను పేరుతో ఒక ప్రభూతవాఙ్మయమె విస్తరించినది. దాని కంతటికిని కారణము భగవద్గీతయొక్క అద్భుత ప్రభావమే. అంతేకాదు; భగవద్గీత

యొక్క మహత్త్వమును ప్రశంసించుచు గీతామాహాత్మ్య ములను పేర కొన్ని ప్రకరణఘట్టములు పురాణములందు రచింప బడినని. స్వయముగ మహాభారతముననే నాలుగు శ్లోకములతో నొక గీతా మాహాత్మ్యము కలదు. వైష్ణవీయ తంత్రసారమునను స్కందపురాణమునను వరాహపురాణమునను పద్మపురాణమునను కూడ గీతామాహాత్మ్యములు చెప్పబడియున్నవి. చాలమట్టుకు దాక్షి ణాత్యులు వరాహపురాణాంతర్గతమగు గీతామాహాత్మ్యమునె పఠించు చుండుట శిష్టసంప్రదాయమైయున్నది. గోరఖపూరు గీతాప్రెస్సువారు విభిన్నరూప సంస్కరణములతో ప్రకటించిన తమ గీతాగ్రంథము లందు కొన్నింటిలో వరాహ పురాణోక్త గీతామాహాత్మ్యమును, మరి కొన్నింట భారతోక్త గీతామాహాత్మ్యమును చేర్చియున్నారు. వారు ప్రకటించిన గీతాతత్త్వాంకము మన యీప్రస్తుత విషయమునకు అనువగు సంగతుల నెన్నింటినో తెలియజేయునదియైయున్నది. ఆ గ్రంథమునందు, సకామభక్తులకును నిష్కామభక్తులకును ఉపక రించునట్లు మంత్రశాస్త్ర ఫక్కి ననుసరించి, ఏ ఏ శ్లోకముల నెట్లెట్లు పఠించినచో యే యే ప్రయోజనములు కల్గునో – ఆ గీతానుష్ఠాన విధానమొక పెద్ద ప్రకరణముగ వ్రాసి చేర్చియున్నారు.

కథనకళాప్రపూర్ణ – పండిత నోముల అప్పారావుగారు, ఆగష్టు – అక్టోబరు గీతావాణి సంచికలలో గీతామాహాత్మ్య పఠన మునుగూర్చి తమవిచారధోరిణిని వెలువరించియున్నారు. వారు వ్యక్తి గతముగ మాకెంతో సమ్మాన్యులు. వారి పాండిత్య దృష్టికోణము కూడ ప్రశంసార్హము. అయినను వారి యీ అభిప్రాయముతో మేము పూర్తిగ యేకీభవింపజాలము.

సాత్త్వికులకు వున్నమట్టుకు నిజముచెప్పిన చాలును. కథలను కారణములను రోచకముగ చెప్పినగాని రాజసికులు ఆలకించి వినరు. తామసికులకు భయోత్పాతములను ప్రదర్శించియె మార్గమునకు తేవలెను. ఈ మూడు పద్ధతులను లక్ష్యమందుంచుకొని పురాణరచన

సాగినది. ఈనాడు పురాణములందలి కొన్ని పద్ధతులు – పోకడలు మనకు నచ్చక పోవచ్చును గాక! ఆకాలమునకు ఆపద్ధతులు అంద ముగను ఆవశ్యకముగను వుండియుండును. ఇన్ని విషయములను అవగాహన చేసికొనిన తప్ప – ఊరక పార చూచినచో, మన దృష్టి అపసవ్య మార్గమునబడి పురాణములందలి సత్యాంశములను గ్రహించుటకు అసమర్థమై పోవును.

తత్త్వజ్ఞానాపేక్షతో గీతను చదువువారు మాహాత్మ్యపఠన మును వదలినను వదలవచ్చును. గీతను మంత్రశాస్త్ర దృష్టితో స్వాధ్యాయముచేయువారు విధానము ననుసరించి మాహాత్మ్యమును గూడ పఠించుట తగును. అది భారత ప్రోక్తమగుగాక! వరాహ పురాణాంతర్గతమగుగాక! 'గీతా' యని కలవరించుచు వచ్చిన కూడ సద్గతి లభించునని అంత పెద్దగాచెప్పిన గీతామాహాత్మ్యము, తన్ను గొప్పగా చెప్పుకొని గీతను చులకన చేసినదని చప్పున చెప్పుట అంత గంభీర విషయముకాదు. గీతాపారాయణమునకు అనివార్యమైన అంగము కాబట్టి, మాహాత్మ్యమునుకూడ విధిగా పఠింపవలెనని మాటమార్పుతో సకామ భక్తులైనవారిని ఆ శ్లోకము ముద్దుగ బెద రించినది,

గీతా పారాయణముతో పుణ్యములభించును; గీతాతత్త్వవిచార ముతో జ్ఞానముకల్గును. శ్రేయఃప్రేయముల నీరెంటిని, గీతాచార్యు డగు శ్రీ కృష్ణుడు – జగన్మాత గీత, ఆంధ్రజాతికి సదా ప్రసాదిం తురుగాక! నూతనాంధ్రరాష్ట్రము పటిష్ఠమై వర్ధిల్లునుగాక! సద్విద్యయు సద్బుద్ధియు గల్గి ఆంధ్ర సంతానము ఆదర్శప్రాయమై అలరారును గాక!

సర్వేషాం సన్మతి దే భగవన్!






( సెప్టెంబరు సంచిక 10_వ పేజీ తరువాయి. )



శంక — నిత్యనైమిత్తికాది కర్మములనుచేయనిచో శాస్త్రమునందు ప్రత్యవాయదోషము చెప్పబడియుండుటబట్టి జ్ఞానినైతము ప్రత్యవాయదోష నివృత్తికొరకై నిత్యనైమిత్తికాది కర్మములను చేయవలసియె యుండునుగదా?

సమాధానము — "నాకృతే నేహకశ్చన" అనెడి వచనమునుబట్టి నిత్యనైమిత్తికాది కర్మములను దొరగుటవలన బ్రహ్మజ్ఞాని యైనవానికి దూషణమును లేదు; ప్రత్యవాయదోషమును లేదు.

పూర్వార్థమందు ప్రతిపాదించిన సర్వార్థమును బలపరచుటకై ఉత్తరార్థమున "నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః" అని చెప్పబడినది. బ్రహ్మాది స్థావరపర్యంతము లగు సర్వభూతముల యందును బ్రహ్మజ్ఞానికి యెట్టి ప్రయోజనాపేక్షయు లేదు కావున, ఆతడు నిత్యనైమిత్తికాది కర్మములను చేయుటయు చేయకుండుటయు రెండు నిష్ప్రయోజనమే. "నైనంకృతాకృతే తపతః" అనెడి శ్రుతియు, చేసినను చేయకున్నను కర్మములు బ్రహ్మవేత్తకు తాపమును కల్గింపజాలవని చెప్పినది.

శంక — బ్రహ్మజ్ఞానికి మోక్షప్రాప్తియందు యింద్రాది దేవతలు కల్గించెడి విఘ్నములను నివృత్తిచేసుకొనుటకొరకు, ఆదేవతాప్రీత్యర్థమై బ్రహ్మజ్ఞానియు కర్మములను చేయవలసియుండునుగదా!

సమాధానము — ఆత్మజ్ఞానప్రాప్తికి ముందటనే యింద్రాది దేవతలు విఘ్నములను ఆపాదించగల్గి యుందురు. కాని, జ్ఞానము కల్గిన మీదట యెట్టి విఘ్నమును కల్గించుటకును వారికి సమర్థత లేదు. "తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశత ఆత్మా హ్యేషాం స భవతి" అని శ్రుతికూడ చెప్పినది. దేవతలు సైతము బ్రహ్మజ్ఞానియొక్క-

స్వాత్మరూపులే అయియుండుట బట్టి వారాతని మోక్షప్రాప్తికి ఆటంక మొనర్చలేరు. కాబట్టి బ్రహ్మజ్ఞాని యేవిధముననుకూడ కర్మములను చేయవలయునసెడి నియమములేదు.

ఈ విధముగ కర్మములను మాని యుండుటబట్టి ఆత్మానుభవసంప న్నుడైన పురుషుడు జడునివలె మూగవలె సోమరియై మెలగునని భావించరాదు. అట్టిజ్ఞాని మరణ పర్యంతము ప్రారబ్ధ భోగానుసార ముగ యేదో ఒక కర్మములను చేయుచునేయుండును. అయినను వాడొనర్చు కర్మమునందు స్వార్థ బుద్ధిలేదు. అది సహజకర్మము. ఇంతవరకు ఆత్మారామాది పదవుల రహస్యమునుగూర్చి నుడివి ప్రస్తు తము దానిసాధనములను భగవం తుడు పేర్కొనుచున్నాడు.

(19 శ్లో) అర్జునా! ఆత్మసాక్షా త్కార మగునంతవరకు మనస్సు అట్టిటు చలించుచునె యుండును. కర్మములను మాని అది వుండుటకు సాధ్యమెకాదు. అది నిశ్చలమై ఆత్మ స్వరూపమునందు నెలకొనువరకు సాధనను అవలంబించియె తీరవలెను. నీవును ఆత్మస్వరూప సాక్షాత్కా రమునందు ఆసక్తిగలవానివికాబట్టి, చేయుదగిన కర్తవ్యకర్మలను ఫలా సక్తినిమాని, కర్తృత్వబుద్ధిని వదలి చేయుట మంచిది. తాను కర్తననెడి అభిమానమునువీడి నిష్కామచిత్త మున చేయదగిన కర్మములను చేసెడి పురుషుడు కర్మాతీతావస్థను — నైష్కర్మ్యస్థితిని పొందగల్గు చున్నాడు. పరమానందస్వరూప మగు ఆత్మానుభవమును పడయ గల్గుచున్నాడు. ఇదియె కైవల్య ప్రాప్తి. అట్టివాడు విధిగ చేయ దగినదెద్దియు లేక కృతకృత్యు డన బడుచున్నాడు. కర్తవ్యాకర్తవ్య ములందు వానికి పట్టుదలలేదు.

ముక్తపురుషుడుకూడ లోక సంగ్రహార్థమై కర్మములను చేయ వలసి యుండునని ముందటి శ్లోక మున భగవంతుడు ప్రతిపాదించు చున్నాడు.

(20 శ్లో) కర్మములను అగ త్యము చేయవలెననుట బహువిధ ప్రమాణములతో నిరూపించిన మీదట కర్మములను యజ్ఞార్థముగ — భగవత్ప్రీతికరముగ నొనర్చినచో అయ్యవి బంధకారణములు కాద నియు, పరమ పురుషార్థమునకు హేతుభూతములు కాజాలుననియు ప్రతిపాదించియున్నాడు. జ్ఞాననిష్ఠకు యోగ్యులగు ముముక్షువులకు కర్మమే తగినదనియుకూడ నిష్కర్ష

చేసియున్నాడు. కృతకృత్యులగు జ్ఞానులునై తము కర్మాచరణమునకు యోగ్యమగు ఆశ్రమమందున్న వారైనచో వారు కర్మములను విడువక ఆచరించుటచేత లోకమునకు మేలేకల్గునని ప్రతిపాదించుచున్నాడు.

"కర్మణైవ హి సంసిద్ధిం ఆస్థితా జనకాదయః" — జనకాదులు కర్మమువలననె సింసిద్ధిని పొందియున్నారు. ప్రసిద్ధులగు పూర్వీక రాజఋషులు పర్యాలోచనచేసి కర్మసంన్యాసమును అపేక్షింపక కర్మయోగమునె ఆచరించుచు క్రమక్రమముగ జ్ఞాననిష్ఠను సంపాదించుకొనిరి.

మమత్వమును — ఆసక్తినివదలి కేవల పరమాత్మ ప్రీతికొరకై కర్మములను ఆచరించుచువచ్చిన అశ్వపతి ఇక్ష్వాకు ప్రహ్లాద అంబరీషాదుల నందరిని "జనకాదయః" అనెడి పదముతో భగవంతుడు సూచించియున్నాడు. ఆసక్తిలేక కర్తవ్యకర్మములనుచేయు మనుష్యుడు పరమపురుషుని పడయగల్గుచున్నాడని వెనుక శ్లోకమునందు చెప్పిన విషయమును సిద్ధాంతమొనర్చుచు జనకాదుల ప్రసక్తివచ్చినది. శ్రీకృష్ణుడుపదేశించిన నిష్కామ కర్మయోగము క్రొంగ్రొత్తవిషయము కాదు. ఇది అనాదికాలమునుండి రూఢియైవచ్చినది. ఇట్టి దీనియందు సందేహముంచరాదు.

శంక — పరమాత్ముని ప్రాప్తికి తత్త్వజ్ఞానమె సాధనమని సర్వశాస్త్రములును చాటుచున్నవి. అట్టియెడ, ఆసక్తిరహిత కర్మాచరణమువలన పరమాత్మునిప్రాప్తి సంభవించుట యెట్లు?

సమాధానము — ఆసక్తిరహిత కర్మాచరణమువలన అంతఃకరణము పరిశుద్ధమై పరమాత్ముని అనుగ్రహము సిద్ధించి తనంతకుతానుగా తత్త్వజ్ఞాన ముత్పన్నమగుచున్నది. ఐదవ అధ్యాయముయొక్క ఆరవ శ్లోకమునందు కర్మయోగయుక్తుడగు మునికి శీఘ్రముగ పరమాత్మ ప్రాప్తి కల్గుచున్నదని చెప్పబడినది. కావున యీ విషయమునందు సందేహములేదు.

లోకసంగ్రహమనిన నేమిటో విచారింతము. సృష్టివ్యాపారమును సురక్షితమొనర్చునట్టియు, దాని వ్యవస్థయందేర్పడెడి ఆటంకములను నివారించునట్టియు ఉద్యమమునకు లోకసంగ్రహమని పేరు. సమస్తప్రాణులను పోషించి అభివృద్ధినొందించెడి జవాబ్దారి మను

ష్యనిపై నున్నది. కాబట్టి తన వర్ణాశ్రమ స్వభావములకు అనుగుణ్యమైన కర్తవ్య కర్మములను చక్కగ ఆచరించి తన ఆదర్శప్రభావముచే అక్రమ మార్గముల బడిపోయెడి వారిని సక్రమ మార్గమున మరలించుటయె లోకసంగ్రహము.

భగవత్ప్రాప్తియనెడి శ్రేయస్సును కోరెడివాడు ఆసక్తిరహితముగ కర్మములను ఆచరించియే తీరవలసియున్నది; కాబట్టి నీవుకూడ లోకసంగ్రహ దృష్టి నవలంబించి కర్మముల నాచరింపుమని భగవంతు డర్జునునకు ఆదేశించియున్నాడు.

అర్జునా! నేనే కర్మశూన్యుడనై కూర్చొన్నచో నన్ను చూచి తక్కినవారుకూడ నా జాడలనె త్రొక్కుదురు. జనులు కర్మహీనులైనచో సృష్టియందు అవ్యవస్థత వ్యాపించగలదు. ఈ చెడుగు వాటిల్లకుండుట కొరకై లోకసంగ్రహ దృష్ట్యా నేను ఆయా పనులను చేయుచున్నాను.

జ్ఞానుల దృష్టియందు వారికెట్టి కర్తవ్యమునులేదు. అయినను వారు చేసెడి పనులన్నియు లోకసంగ్రహమునకయ్యే జరుగుచున్నవి. ఇది లోకసంగ్రహ కర్మమనియు యిది కాదనియు జ్ఞానికి పక్షపాతబుద్ధి లేదు. కృతకృత్యుడగు ఆతనివలన జరిగిపోవు కర్మలన్నియు లోకోపకారార్థమయ్యే ప్రవర్తించును.

సామాన్య లోకప్రజలు దొడ్డవారిని అనుసరించి ప్రవర్తించెదరని ముందటి శ్లోకమున వర్ణించుచున్నారు.

లోకసంగ్రహదృష్టి ననుసరించియైనను కర్మమును చేసియేతీరవలెనని భగవంతు డింతవరకు ప్రతిపాదించెను. ఇప్పుడా లోకసంగ్రహమును గూర్చియె మరింత నొక్కి చెప్పుచున్నాడు. (శ్లో॥ 21) పుట్టిన ప్రతిమనుష్యుడును యేదో ఒక బాధ్యతను — మహత్కార్యమును శిరమునందిడుకొని ప్రపంచమునకు వచ్చియున్నాడు. ముందు పుట్టిన వారికి తమ్ముడైన, వెనుక పుట్టెడి వారికి అన్నయై పీడున్నాడు. తనకు పూర్వజులైనవారివలన తాను తెలియదగినది తెలుసుకొని తనకు తర్వాత వచ్చెడివారికి ఆ అనుభవమును అందజేయవలసి యున్నది. ఈ అభిప్రాయమును హృదయమునందిడుకొని "పెద్దవారిజాడను తక్కినవారు అనుసరింతు"రని భగవంతుడు చెప్పియున్నాడు.

ఓ అర్జునా! ఆత్మవేత్తయగు మహాపురుషునకు కర్తవ్యమెద్దియు

లేకపోయినను, తన్ను అనుకరించి సామాన్యజనులు కర్మభ్రష్టులు కాకుండుట కొరకై, తానుకూడ కర్మములందు ప్రవర్తించుచున్నాడు. సామాన్యలోకులకు స్వబుద్ధికంటె పరబుద్ధి యెక్కువ. స్వకృతికంటె అనుకృతి యెండు. 'అకలు'కంటె 'నకలు' జాస్తి. అందువలన తత్త్వవేత్తలగువారు పరోపకారార్థబుద్ధిచేతను, ధర్మమర్యాదను ప్రతిష్ఠించుకొరకును కర్మములను చేయుచుందురు. శ్రేష్ఠులగువారు అనుసరించిన మార్గము తదితరులకు ప్రమాణభూతమై యుండును. పెద్దలవాక్కు లోకమునకు వేదముతో సమానము. పార్థా! నేను జ్ఞానినని నీవు నిన్ను తలంచియున్ననుకూడ జనకాది శ్రేష్ఠపురుషులవలె కర్మమాచరింపక తప్పదు. నిన్ను చూచి యితరులు భ్రష్టులై పోకుండునట్లు లోకమునకు అంతమట్టుకైన ఉపకారము చేయుము.

ఈ విషయమును మరింత బలపఱచుటకై భగవంతుడు మూడు శ్లోకములతో తన్నే దృష్టాంతముగ చెప్పుచున్నాడు.

(శ్లో॥ 22) శ్రీకృష్ణుడు సామాన్యులవలె బ్రహ్మజ్ఞానిమాత్రమె కాదు. అతడు సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడు. ఇట్లు తాను బ్రహ్మస్వరూపుడై అయియుండియు కర్మములను స్వయముగ తాను ఆచరించి లోకమునకు మార్గమును చూపుచున్నాడు. ఇంటి యజమానికి యింటియందలి పదార్థములన్నియు యెల్లప్పుడు అధీనములై అబ్బియుండునట్లు అఖిల బ్రహ్మాండనాథుడగు శ్రీకృష్ణునకు సమస్తపదార్థములును నిరంతరము లభ్యములయ్యే యున్నవి. ఆతనికి కొఱతయనున దెప్పుడునులేదు. లభించని వస్తువును లభింపజేసుకొనుటకై ప్రతివాడును యేదో ఒక ప్రయత్నము చేయుచున్నాడు.

అర్జునా! ముల్లోకములందలి యే వస్తువునుకూడ పొందవలెననెడి ఆకాంక్ష నాకు లేదు. ఏదో ఒక కోర్కెతో నేను కర్మమును చేయుట లేదు. ప్రయోజనము లేదు గదా యని కర్మములను మాని యుండలేదు. నిర్విరామముగ కర్మయోగమున ప్రవర్తించుచున్నాను. నీవు చూచుచునె యున్నావు. నన్ను అనుసరించ గోరెడి నీవుకూడ తప్పక కర్మములను ఆచరించియె తీరవలెను.

(సశేషము.)

[signature]

—:0:—

# భగవద్గీతా సిద్ధాంతము

"శ్రీ రామశరణ్" శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు.
సంపాదకుఁడు – "మోక్షసాధని" – గుంటూరు.



(ఆగస్టు సంచిక 23 వ పేజీ తరువాయి.)

శ్లో॥ స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః ॥

మానవుఁడు వర్ణాశ్రమానుకూల మగు కర్మములద్వారా ఆతనిని బూజించి సిద్ధిని బొందును.

శ్లో॥ స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః॥

స్వధర్మమునందు మరణించుట యైనను శ్రేయమే కాని పరధర్మాచరణ మొనర్చుట భయావహము.

పై ఆధారములనుబట్టి గీత స్వధర్మమునే బోధించుచున్నది. అర్జునునకు స్వధర్మము యుద్ధము. "స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః" మానవుఁడు తన వర్ణాశ్రమ విహిత కర్మములం దభిరతుఁడగుటచే నుత్తమసిద్ధినిబొందఁగలఁడు. ఇట్లు స్వధర్మము నాచరించుటచే నెవరైనను దరించిరా? యను ప్రశ్నకు సమాధానముగా శ్రీకృష్ణుఁడిట్లు చెప్పెను.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి
మాస్థితా జనకాదయః॥

కర్మద్వారముననే జనకాది పరమజ్ఞానులు పరమసిద్ధిని బొందఁగలిగిరి.

అయితే స్వకర్మయందు అభిరుచి యెట్లు కలుగఁగలదు? అనుదానికి ప్రత్యుత్తరముగ శ్రీకృష్ణుఁ డిట్లనెను:—

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే
కార్యాకార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం
కర్మ కర్తుమిహార్హసి॥

ఈ పని చేయవలయును, ఈ పని చేయరాదు అనఁగా విధి నిషేధ కార్యములను దెలిసికొనుటకు ప్రమాణము శాస్త్రమే. శాస్త్రవిధిని బాగుగాఁ దెలిసికొని కర్మలొనర్పవలయును.

పై భగవద్వచనమును బట్టి శాస్త్రవిధి నాకు తెలియలేదని యూరకుండరాదు. ఒకానొక రాజశాసనము నాకు తెలియలేదని యెవఁడైన నుల్లంఘించిన శిక్షార్హుఁడు కాకపోవునా? రాజు శిక్షింపకుండునా? రాజశాసనమును దెలిసికొని వర్తించుట ప్రతిపౌరుని విధి. అట్లే శాస్త్రవచనమును దెలిసికొనుట, దాని ననుసరించి వర్తించుట ప్రతిమానవునకును విధి. కాని యిచ్చట నొక్కవిషయము

జ్ఞాపకముంచుకొనవలయును. విధ్యుక్త కర్మలొనర్చుటకే ప్రతిమానికిని అధికారముకాని దానిఫలమును కోరుటయం దధికారము లేదు.

శ్లో॥ కర్మణ్యేవాధికార స్తే
మా ఫలేషు కదాచన॥

దీని అర్థము పైనఁ జెప్పఁబడినది.

కర్మఫలమును గోరినను దాని నిచ్చునదెవరు? భగవంతుఁడేకదా! నీ కర్మనుజూచి దానికీయవలసిన ఫలమును భగవంతుఁడిచ్చియే తీరును. దానిని గోరుటెందులకు? ఫలమునుగోరిన కర్మబంధము కాఁగలదు. వైద్యుఁడేదిచెప్పిన రోగి దానినిఁ జేయవలెను. అట్లుగాక నాకీ వంకాయ కావలెను, గోంగూర కావలయునని అపథ్యాపథ్య పదార్థములను గోరుచుండిన రోగ నివారణ బాధ్యత వైద్యునిపై నుండఁజాలదు. అపథ్యఫలమును దానే అనుభవించి చివరకు తననే నిందించుకొనును. అయితే యే యుద్దేశ్యమును మనస్సులోలేక కర్మ చేయుట సంభవించునా? యను సందేహమును బురస్కరించుకొని ఆ కర్మలిట్లు చేయవలెనని అనఁగా భగవత్ప్రీత్యర్థముగ నిష్కామ భావముతోఁ జేయవలెనని చెప్పెను.

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమః
మద్భక్తః సంగవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు
యః స మామేతి పాండవ॥

ఏ మానవుఁడు సర్వభూతములందును వైరభావమును వదలి, నా కర్మలను జేయుచు, నాయందు రతిచెందుచు, నన్ను అనాసక్త భావముతోఁ బ్రేమించుచు భక్తుఁడగునో అట్టివాఁడు నన్ను బొందును. అందఱు నొకేకర్మలను జేయఁగలరా? చేయలేరు. వారివారి పూర్వజన్మ సంస్కారముల ననుసరించి ఆయా జన్మకర్మలేర్పడును. వాటిని బురస్కరించుకొని భగవంతుఁడిట్లు చెప్పెను:—

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ
తత్కురుష్వ మదర్పణమ్॥

ఓ అర్జునా! నీవేదిచేయుదువో, దేనిని తినెదవో, దేనిని హోమము చేయుదువో, ఏ దానముచేయుదువో, ఏ తపస్సును జేసెదవో దానినంతను నాకర్పణ చేయవలెను.

ఇట్లు చేసినచో నదృష్టమగు సంస్కారము కర్మచేయు సాధకుని బాధింపదు. సాధకుఁడు భగవంతుని చేతిలో నొక ఉపకరణముమాత్రము కావలయును. కర్త భగవంతుఁడే కావలయును. సాధ

కుఁడు కర్తృత్వము వహింపరాదు. ఫలాఫలములు కర్తవియే కాఁ గలవు. కావున నిరహంకారముతో భగవంతుఁడే కర్తయనుకొని, తా నుపకరణమనుకొని కర్మలు చేయ వలయును. ఒకనిచేతిలోని కలము దానపత్రము వ్రాసినది; ఘోర్జరీ చేసినది. దానముచేసిన పుణ్య మును కలమునకు లేదు; ఘోర్జరీ చేసిన పాపమును దానికి లేదు. కర్తకాఫలము.

ఈ సమయమున అర్జునునకొక సందేహము కలిగినది. "ఏదైన మంచి కర్మలుచేసి భగవదర్పణము చేయవలయునుగాని పాపకర్మములు చేసి భగవదర్పణము చేయుట పాడి గాదుగదా! మానవుఁడు పుణ్యపాప కర్మములను రెంటిని జేయునుగదా! పోనిండు పుణ్యకర్మములనే భగవ దర్పణముచేసిన సాధకుని పాపకర్మ ములు బాధించునుగదా! దానికేమి చేయవలయుననగా—

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః॥

సమస్త ధర్మములను వదలి నన్నొ క్కనినే శరణు వేఁడుము. నేను నా శక్తిద్వారా నీ పాపముల నన్నిటి నుండియు ముక్తుని గావించెదను. భయపడకుము. అని శరణాగతి యోగమును చరమశ్లోకముగఁ జెప్పెను. పై విషయమునుబట్టి గీత, దేహములు నశించునవి యనియు ఆత్మ నశింపదనియు దెలిసికొనుటచే జ్ఞానమును, విధ్యుక్తకర్మమును వర్ణా శ్రమానుసారముగ ననాసక్తితోఁ జేయవలయు ననుటచేఁ గర్మయోగ మును, 'మామనుస్మర యుద్ధ్య చ' అని యాదేశించి తన్ను స్మరించుచు భగవదర్పణ బుద్ధితోఁ గర్మలను జేయవలయుననుటచే భక్తియోగ మును, స్వధర్మములనువదలి భరన్యా సము కావింపుమని చరమశ్లోకమున నాదేశించుటచేఁ బ్రపత్తియోగ మునుబోధించినది. ఈ నాల్గుయోగ ముల సమావేశము భగవత్సాధ నలోఁగలదు. అయితే పూర్వజన్మ సంస్కారము ననుసరించి ఒక్కొక్కరు ఒక్కొక్క యోగమును ప్రధాన ముగఁ దీసికొందురు. జనకాదులు కర్మయోగమును, సనకాదులు జ్ఞానయోగమును, నారదాదులు భక్తియోగమును, బలిచక్రవర్తి మొదలగువారు ప్రపత్తియోగ మును ప్రధానముగఁ దీసికొని తరించిరి.

కావున గీతను ప్రతిదినమును సర్వులు చదువుచుందురుగాక!



# భగవద్గీత మాహాత్మ్యము

"కథనకళాప్రపూర్ణ" పండిత నోముల అప్పారావుగారు.

(ఆగస్టునెల సంచిక 13_వ పేజి తర్వాత)

ప్ర: భగవద్గీతతో కొంత పరిచయము గలిగి నిష్కామకర్మయోగమును గ్రహించిన వారికి గీతామాహాత్మ్యము చదువ నవసరము లేకపోవచ్చును. కాని గీతతో పరిచయము లేనివారికి, ప్రారంభ దశలోనుండు వారికీ మాహాత్మ్యము తోడ్పడును కదా? వారేల చదువరాదు? వారికిది యుపయోగమే కదా?

ఉ: గీతాపరిచయము లేనివారికి గీతలోనున్న మాహాత్మ్యము చదివిన చాలును. చూడుము:

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర
మిదముక్తం మయాఽనఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా
త్కృతకృత్యశ్చ భారత॥ అ.15 శ్లో.20

" య ఇమం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః॥

" న చ తస్మాన్మనుష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మా
దన్యః ప్రియతరో భువి॥

" అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహ
మిష్టః స్యామితి మే మతిః॥

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపి యో నరః।
సోఽపి ముక్తః శుభాన్ లోకాన్
ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥
అ. 18, శ్లో. 68_71

ఈ గీతాశ్లోకములలో చెప్పఁబడిన మాహాత్మ్యముకంటె వరాహపురాణాంతర్గత గీతామాహాత్మ్యమునఁ జెప్పఁబడిన విషయము లుత్కృష్టములై నవని యూహింపఁగలమా? అదియునుగాక "కామాత్మానః స్వర్గపరా ......... భోగైశ్వర్య ప్రసక్తానాం ... వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే" అను గీతావాక్యమునకిది విరుద్ధముకాబట్టి రుచ్యుత్పాదనముకై చెప్పఁబడిన వరాహపురాణోక్త మాహాత్మ్యమును జదువనిచో గీతాపఠనఫలమే యుండదను భ్రమకులోనుగాక, కర్మఫలాపేక్ష నొదవించు నా ప్రకరణమును విడిచి సముచిత మాహాత్మ్య

మును దెలుపు భగవద్గీతను మాత్రము చదువుట లెస్సయగును.

ప్ర: చిరకాలమునుండి గీతనుజదువగనే మాహాత్మ్యమును జదువుట ఆచారమయియున్నదే దానిని మానవచ్చునా? మానినచో దోషమగునుగదా?

ఉ: సద్బుద్ధితో వివేకముతో విమర్శించినపిదప సత్యమని నిర్ణయమైనదాని నాచరించుటలో దోషమేమికలదు? ఎవరో ఆచరించుచున్నారు,మనముగూడనట్లే చేయుదమని విపరీతముగ నడుచుట తగునా? గీతకంటే తానే శ్రేష్ఠమని చెప్పుకొను వరాహపురాణ మాహాత్మ్యమును చదువుచు నిది మన పూర్వాచారమనుట యుక్తమగునా? లోపమున్నపుడు సవరించుకొనుటగుణమేకదా? మద్యాది నీచ వస్తువులను దేవునకర్పించు నాచారముగల కొన్ని సంఘములవా రది తప్పని తెలిసికొని దానినివిసర్జించుట దోషమగునా? కానేరదు. అటులే యేదో కారణమున నెవరిచేతనో నెలకొలుపబడిన యీ మాహాత్మ్యము చదివి తీరవలసినదే యను నాచారమును మాని యీమాహాత్మ్యమునుజదువుకాలమునుగూడ పవిత్రమగుభగవద్గీత పఠించుటలో గడపుట శ్రేయోదాయకమగును.

ప్ర: కొన్నిసంఘములవారు, కొందఱు గీతా ప్రచారకులు, కొన్ని యాశ్రమముల వారు వరాహపురాణోక్త మాహాత్మ్యమునకు మిక్కిలి ప్రాధాన్యమిచ్చుచున్నారే; వారికీ సత్యము తెలియదా?

ఉ: వారికీ సత్యము తెలియును. కాని చిరకాలమునుండి వచ్చుచున్న యాచారమును ధిక్కరించిన నెవరేమనుకొందురోయని వారు శంకించుచుందురు. సత్యాన్వేషకులును ప్రసిద్ధ గీతాప్రచారకులును నగు శ్రీ గీతాప్రెస్సు మొదలగు వారు కొందరుమాత్రము భగవద్గీతలను ముద్రించునపుడు వరాహపురాణోక్త మాహాత్మ్యమును ముద్రించుట మానివైచిరి. అంతియగాదు సత్యాన్వేషకులగు ప్రతివారును నట్లే చేయుదురు.

ప్ర: ఈ వాదమును విపరీతవాదమని భావించువారు కొందఱున్నారని మీకు తెలియునా?

ఉ: తఱచుగా క్రొత్తవిషయమును ప్రతిపాదించునపు డందఱు దాని నంగీకరింపరు. ప్రాతవాసనలు వారిని వెనుకకు లాగుచుండును.

(మిగత 19వ పేజీలో )

# సానువాద శంకర భాష్య సమలంకృతము
★
## శ్రీమద్భగవద్గీత
అనువాదకులు
### శ్రీ స్వామి శుద్ధచైతన్య జీ.

( సెప్టెంబరు సంచిక 26_వ పేజీ తరువాయి. )



అను:— మఱియు నా శ్రుతియందు "వివాహమాడకముందు తత్త్వవిదుండుగాని పురుషుండు వేదాధ్యయనము, 'అథాతో ధర్మ జిజ్ఞాసా' అని ధర్మవిచారణంబును గావించి పిదప ముల్లోకంబులు ప్రాపించుటకు సాధనంబులుగానుండెడి పుత్రుని దైవ మానుషంబులనెడి రెండువిధంబులైన విత్తంబులను నభిలషించె" నని చెప్పంబడియెను; అందు పితృలోకప్రాప్తి సాధన రూపంబైన కర్మంబు మానుష విత్తమనంబడును; దేవలోక ప్రాప్తి సాధనరూపంబైన విద్య* దైవవిత్తమనంబడును.

భా:— ఇతి అవిద్యాకామవత ఏవ సర్వాణి కర్మాణి శ్రౌతాదీని దర్శితాని.

అను:— ఇట్లవిద్యయు గామంబును గలవానికే శ్రౌతాదిరూపంబులగు సమస్త కర్మంబులును గనబఱచబడియున్నవి.

భా:— "తేభ్యో వ్యుత్థాయ ప్రవ్రజన్తి" ఇతి వ్యుత్థానమాత్మానమేవ లోకమిచ్ఛతోఽకామస్యాభిహితమ్.

అను:— "అట్టి సర్వకర్మంబులనుండి నివృత్తులై సంన్యాసంబును గ్రహించుచున్నారు" అని యీ రీతిని ఆత్మలోకంబె యభిలషించెడి విరక్తునకు సంన్యాసంబు విధింపబడినది.

భా:— తదేతద్విభాగవచన మనుపపన్నం స్యాద్యది శ్రౌతకర్మజ్ఞానయోః సముచ్చయోఽభిప్రేతః.

అను:— ఒకవేళ శ్రౌతకర్మలకును, జ్ఞానంబునకును సముచ్చయము♦ భగవంతునకు సమ్మతంబగునేని ఇట్టి విభజనవాక్యంబు లన్నియు నసంగతంబులగును.

---

* దేవతాజ్ఞానము, లేక యుపాసనము. ♦ ఏకాధికరణ్యము, లేక పరస్పర విరుద్ధంబులగు రెండువిషయంబు లొక్కచోట నుండుట.

భా:—నచార్జునస్య ప్రశ్న ఉపపన్నః "జ్యాయసీ చేత్కర్మణస్తే" ఇత్యాదిః.

అను:– అదియునుంగాక "కర్మకంటె జ్ఞానంబె శ్రేష్ఠంబైనచో" అను మొదలగు నర్జునుని ప్రశ్నయు నసంగతంబె యగు.

భా:—ఏకపురుషానుష్ఠేయత్వాసమ్భవం బుద్ధికర్మణోః భగవతా పూర్వముక్తం కథమర్జునః అశ్రుతం బుద్ధేశ్చ కర్మణో జ్యాయస్త్వం భగవత్యధ్యారోపయేత్ మృషైవ "జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధి"రితి.

అను:– జ్ఞానము, కర్మ యివిరెండు నొక్క పురుషుండనుష్ఠింప నసంభవంబని వెనుక దెలిపియుండని పక్షంబున "కర్మకంటె జ్ఞానంబె శ్రేష్ఠంబని నీయభిప్రాయంబైనచో" అను నిట్టి యసత్యంబును వినని దాని నర్జునుండు భగవంతునిపై నేల యారోపించును?

భా:—కించ యది బుద్ధికర్మణోః సర్వేషాం సముచ్చయః ఉక్తః స్యాత్ అర్జునస్యాపి స ఉక్త ఏవేతి "యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చిత" మితి కథముభయోః ఉపదేశే సతి అన్యతరవిషయ ఏవ ప్రశ్నః స్యాత్.

అను:– మఱియు జ్ఞానకర్మ సముచ్చయంబె యెల్లరకును జెప్పియుండినచో అర్జునునకును నదియె చెప్పంబడియుండును. అపుడు "ఈ రెండింట నెద్ది శ్రేయంబని నీవు నిశ్చయింతు వదియె నాకుపదేశింపు"మని రెండింట నొక్కదానినింగూర్చిన ప్రశ్నంబర్జునుం డేల చేయును?

భా:—న హి పిత్తప్రశమనార్థినః వైద్యేన మధురం శీతం చ భోక్తవ్య మిత్యుపదిష్టే ఏతయోరన్యతర త్పిత్తప్రశమనకారణం బ్రూహీతి ప్రశ్నో భవతి.

అను:– పిత్తశాంతిని గోరినవారికి వైద్యుండు మధురంబును శీతంబునును భుజింపుమని చెప్పగా నీ రెండింట నేది పిత్తమును శాంతింపజేయు నది సెప్పుమని ప్రశ్నించుట సంభవింపదుగదా?

భా:—అథాప్యర్జునస్య భగవదుక్తవచనార్థవివేకానవధారణనిమిత్తః ప్రశ్నః కల్ప్యేత తథాఽపి భగవతా ప్రశ్నానురూపం ప్రతివచనం దేయం "మయా బుద్ధికర్మణోః సముచ్చయ ఉక్తః కిమర్థ మిత్థం త్వం భ్రాన్తోఽసి" ఇతి; న తు పునః ప్రతివచనమననురూపం పృష్టాదన్యదేవ "ద్వే నిష్ఠే మయా పురా ప్రోక్తే" ఇతి వక్తుం యుక్తమ్.

అను:– ఒకవేళ నర్జునుండు, భగవంతుడు దెలిపిన వాక్యార్థంబును నిర్ధారణచేసికొనలేక యిట్లు ప్రశ్నించియుండునని కల్పన చేసినను భగవానుడు ప్రశ్నకుందగిన విధంబుననే "నేను జ్ఞానకర్మల సము

చ్చయంబు దెలిపితిని; ఏల నీవిట్లు భ్రమపడితివి?" అని సమాధానంబు చెప్పవలసియుండును. అట్లుగాక మరల ప్రశ్నకు విరుద్ధంబుగా "రెండు నిష్ఠలను నేను వెనుక దెలిపియుంటిని" అని (యడిగినదానికి వ్యతిరేకంబుగనే) సమాధానంబిచ్చుట యెట్లు పొసగును?

భా:— నాపి స్మార్తేనైవ కర్మణా బుద్ధిసముచ్చయేఽభిప్రేతే విభాగవచనాది సర్వముపపన్నం స్యాత్.

అను:— అథవా స్మార్తకర్మలతో జ్ఞానంబునకు సముచ్చయంబు నెప్పుట సమ్మతంబైనను నిట్టి విభజనవాక్యంబంతయు నసమంజసంబె యగును.

భా:- కించ క్షత్రియస్య యుద్ధం స్మార్తం కర్మ స్వధర్మ ఇతి జానతః "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి" ఇత్యుపాలమ్భోఽనుపపన్నః.

అను:— అదియునుంగాక క్షత్రియునకు స్మృతివిహితంబైన యుద్ధంబు స్వధర్మంబని యెఱింగి యర్జునుండు "ఘోరమైన యీ యుద్ధకర్మంబునందు నన్ను నీవేల నియోగించుచున్నా"వని యాక్షేపించుటయు నసంగతంబె యగు.

భా:— తస్మాత్ గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేన వా కర్మణా ఆత్మజ్ఞానస్య న కేనచిద్దర్శయితుం శక్యః.

అను:— ఇట్టి హేతువులచేత లేశంబైనను శ్రౌతకర్మలతోగాని, స్మార్తకర్మలతోగాని యాత్మజ్ఞాన సముచ్చయంబును బ్రదర్శించుట కెవనికిని శక్యంబుగాదని సిద్ధించినది. (సశేషము.)

---

(16-వ పేజి తరువాయి)

దానిననుసరించియే వారు భాషించుచుందురు. కొన్నాళ్లకు సత్యము గోచరించును. అప్పుడు వారంగీకరించితీరుదురు. అంతవరకట్టివారల కోపతాపములు సోఢవ్యములు. భగవంతుఁడెల్లవారికి వివేకము ననుగ్రహించి సత్పథమున నడుచునట్లుచేయుగాక. గీతామాహాత్మ్య పఠనమునకు వెచ్చించిన కాలమును గూడ గీతాపఠనమందు వినియోగించునట్లు కరుణించుగాక.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ
బుద్ధియోగాద్ధనంజయ!
బుద్ధౌ శరణమన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః॥

భగ. అ. 2-శ్లో. 49.

— నో. అప్పారావు.

# గీతాతత్త్వము

రచయిత: శ్రీ దివాన్‌చంద్, M.A., Ph.D.,
అనువాదకులు: శ్రీ చారాల నరసింహమూర్తిగారు.

(సెప్టెంబర్ నెల సంచిక 21వ పేజీ తరువాయి)

ఈ 'ఏకైకవాదము' (Monism) మూడువిధములు. (1) 'ప్రాపంచికవాదము' (Meterialism) ఈ వాదము ననుసరించి భౌతికపదార్థము సనాతనము. (2) 'బ్రహ్మవాదము' (Idealism) ఈ వాదము ననుసరించి బ్రహ్మపదార్థము సనాతనము. (3) 'స్పైనోజిస్టిక్' ఏకైకవాదము (Spinozistic Monism) ఈవాదము ననుసరించి ఒకేపదార్థము వివిధరూపముల గోచరించుచున్నది. ఇట్టి వివిధరూపము లందు మనస్సు, భూతములవరకే మానవ విజ్ఞానము వ్యాప్తిగాంచినది.

'ద్వివాద సిద్ధాంతము'న (Dualism) మనస్సు, పదార్థములు రెండును విభిన్న స్వతంత్ర సనాతన పదార్థములు. 'సంయోగ విధానము'(Interactionism) ననుసరించి ఈరెండు పదార్థములు ఒకదానితో నొకటి సంయోగము చెందును. 'విముఖ విధానము' (Parallelism) ననుసరించి రెండును భిన్నమార్గములచరించును గాని సంయోగము చెందవు. భౌతిక మార్పులుమాత్రము కాకతాళీయముగ కలియును. అటులనే మానసిక మార్పులనుగూడ. ఇట్టి మానసిక, భౌతిక పదార్థ మార్పులందుగల సామీప్యమువలన భ్రాంతి యేర్పడును.

భారతీయ వేదాంత దర్శనములందు జగద్గురువు శ్రీ శంకరాచార్యుని వేదాంత విచారణ ఏకైకవాదము (Monism) ననుసరించును. సాంఖ్యవేదాంతము ద్వివాద సిద్ధాంతము (Dualism) ననుసరించును. బౌద్ధసిద్ధాంతము పదార్థవాదము (Phenomenalism) ననుసరించును. భగవద్గీతయందలి మెటాఫిజిక్సు (Meta Physics) ను తెలుసుకొనుటకు సాంఖ్య వేదాంత సిద్ధాంతములకు భగవద్గీతకుగల సంబంధమును గుర్తింపవలయును. బౌద్ధ ధర్మమునుగూడ భగవద్గీత కొంత ఇముడ్చుకొనినది.

భగవద్గీతయందలి వేదాంతము ఏకైకవాదము (Monism) నకు సంబంధించినది. గ్రంథమున మధ్యగల 7 మొదలు 12 వ అధ్యాయమువరకు గల భాగమందు ఏకైకవాదము గోచరించును. ఏకైకవాదమేగాక ద్వివాదము (Dualism), ఆధ్యాత్మిక అసంఖ్యాక వాదము (Spiritual Pluralism) గూడకలవు. విజ్ఞానయోగమందలి మూడవ శ్లోకమున 'మనుష్యాణాం సహస్రేషు' యనుచు శ్రీకృష్ణపరమాత్మ అసంఖ్యాక వాదమును (Spiritual Pluralism) ప్రబోధించెను. కాని 4, 5, 6, శ్లోకములు

ఏకైకవాదమును (Monism) సూచించును.

భగవద్గీతయందు సాంఖ్యముగూడ కలదు.

ఈక్రిందివి సాంఖ్యమునందలి ముఖ్య సిద్ధాంతములు. (1) జీవుడు, ప్రకృతి రెండును శాశ్వత సనాతన పదార్థములు. దృష్టికి గోచరించునదంతయు త్రికాలములందును కలదు. (2) జీవులు అసంఖ్యాకులు. సాంఖ్యము ఆధ్యాత్మిక అసంఖ్యాక వాదమును ప్రబోధించును. సాంఖ్యము బ్రహ్మవాదమునకు (Idealism), ఆత్మీయవాదమునకు (Solipsism) విరుద్ధము. బ్రహ్మవాదమున బ్రహ్మమే సనాతనము. జీవులు పరిణామరూపములు. ఆత్మీయవాదమున నేను సత్యము. ప్రపంచమంతయు భ్రాంతి మాత్రము. (3) జీవునకు, పదార్థములకు ఏ మాత్రము సంబంధము లేదు. జీవునకు పదార్థమునకు సమాశ్రయము (Association) మాత్ర మేర్పడును. ఈ సమాశ్రయమువలన రెంటియందును మార్పులు కలుగును. (4) సత్వ, రజ, తమోగుణములవలననే ప్రకృతి పరిణామము జెందును. జీవుని దృక్పథముననే ఈ మార్పిడియంతయు జరుగును. జీవుడు లేకున్నను లేక జీవుడు ప్రకృతిని పరికింపకున్నను ప్రకృతియందు జరుగు పరిణామమే అసంభవము. (5) ప్రకృతి సంబంధమువలన జీవుడు భ్రాంతి జెందును. భ్రాంతియే బంధము. (6) జీవుని బంధించు ప్రకృతియే జీవునకు విముక్తి కలిగించును. భ్రాంతి కేవలము అవిద్యయని గుర్తించిన జీవుడు బంధవిముక్తుడగును. ఇక భగవద్గీతయందలి సాంఖ్యమును విచారింతము. (1) పదమూడవ అధ్యాయమందలి 20 శ్లోకమున పురుషుడు, ప్రకృతి రెండును సనాతనులను ద్వివాద సిద్ధాంతము (Dualism) కలదు. (2) వర్ణాశ్రమ ధర్మమును శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధించినందున ఆధ్యాత్మిక అసంఖ్యాక వాదమును (Spiritual Pluralism) భగవద్గీత అంగీకరించెను. (3) ప్రకృతివలన కర్మలు (Actions) కలుగునని భగవద్గీత వచనము. ఇచట ప్రకృతి, జీవుల సమాశ్రయము (Association) ధ్వనించుచున్నది. (4) ప్రకృతి పరిణామక్రమమును భగవద్గీత అంగీకరించును. ఈ పరిణామము భగవద్గీత 13 వ అధ్యాయము 6, 7 శ్లోకముల వర్ణింపబడెను. (5) ప్రకృతి జీవుని బంధించునని గుణత్రయ విభాగయోగమునందలి 5 వ శ్లోకమున చెప్పబడినది. (6) ప్రకృతియే జీవుని బంధవిముక్తుని గావించునని 13 వ అధ్యాయము 35 వ శ్లోకమున కలదు. భగవద్గీత ఇటుల సాంఖ్యశాస్త్రమును లీనమొనర్చుకొనినది. భగవద్గీత సాంఖ్యము, యోగము, బ్రహ్మసూత్రముల సమన్వయమొనర్చుకొనినదిగాని బౌద్ధ సాంప్రదాయమును సంపూర్ణముగ జీర్ణమొనర్చుకొనలేదు. గౌతమబుద్ధుడు గీతోపదేశమనంతరము జన్మించినవాడయినను చార్వాక, నాస్తికాది వాదములవలె బౌద్ధసాంప్రదాయముగూడ భారతదేశమున అనాది సిద్ధమయినది. ఈ బౌద్ధ సాంప్రదాయమును గూడ భగవద్గీత త్రోసివేయలేదు.

**భగవద్గీతయందలి బౌద్ధ ధర్మము.** సాంఖిక వ్యవస్థయందు బ్రాహ్మణ ధర్మావలంబకుల ఆధిక్యతను, పశుహింసాత్మక మయిన యజ్ఞయాగాదులను బౌద్ధధర్మము నిరసించును. ఈశ్వరవాదము జీవుని సనాతనాది సిద్ధాంతములను భగవద్గీత ఉద్ఘాటించి వేద ధర్మమును పోషించుచు వర్ణాశ్రమధర్మము యజ్ఞయాగాదుల విషయమున అది విశాల భావమును ప్రకటించెను. వర్ణాశ్రమధర్మము సామాన్యులకు మాత్రమేగాని సమ్యగ్ జ్ఞానులకు వర్తించదనియు, సమ్యగ్జ్ఞానులు వర్ణవ్యవస్థకతీతముగనుందురని భగవద్గీత ప్రవచనము. అట్టివారు కడకొట్టువాడయిన పంచముని, వేదవేత్తయయిన బ్రాహ్మణుని గౌరవభావమున పూజించుటయేగాక శునకమును గోవునుగూడ సమానదృష్టితో చూడగలరని "కర్మసన్యాసయోగము" 18 వ శ్లోకమున భగవద్గీత ఉద్ఘాటించెను. అనగా పరమావధియయిన సమ్యగ్ జ్ఞత్వమును సంఘముచేరినంతనే వర్గరహిత సమాజము(Classless Society) ఏర్పడును. వర్గరహిత సమాజనిర్మాణమే భగవద్గీత పరమావధి. ఈస్థాయిని మానవసంఘ మందుకొనుటకు ఆచరణ యోగ్యమయిన సుస్థిర సోపానపంక్తులను గీతాచార్యులు నిర్మించెను. భగవద్గీత యజ్ఞకర్మకు ప్రాధాన్యమిచ్చినను అహింసాత్మకమయిన జ్ఞానయజ్ఞములే ఆచరింపతగునని మానవకోటి కాదేశించెను. 4 వ అధ్యాయమగు "జ్ఞానయోగము" 25 వ శ్లోకమునుండి 32 శ్లోకమువరకు వివిధములగు అహింసాత్మక యజ్ఞకర్మలపేర్కొని 33 వ శ్లోకమున భౌతిక పదార్థములనేమియు హవిర్ద్రవ్యముగ నుపయోగింపక జ్ఞానలభ్యమగు యజ్ఞము లోనర్చుట మోక్షమునకు మార్గమని శ్రీ కృష్ణపరమాత్మ వచించెను. జ్ఞానయజ్ఞమయమయిన నిష్కామకర్మ లొనర్పమని శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీతయందుపదేశించెను. 4 వ అధ్యాయమగు జ్ఞానయోగము 32 వ శ్లోకమున యజ్ఞము కర్మము (Action) చేత జనించెననియు, అట్టియజ్ఞార్థకర్మమును ఫలమునుకోరక ఆచరింపదగునని "కర్మయోగము" 9 వ శ్లోకమున బోధింపబడెను. యజ్ఞరూపమయిన ఈ నిష్కామ కర్మాచరణ బౌద్ధధర్మమయిన స్వార్థరహితసేవకు సన్నిహితముగ నుండును.

నిర్వాణస్థితిని (Nirvana) పొందుటయే బౌద్ధధర్మ పరమాదర్శము. ఈ నిర్వాణపదము మోక్షపరమున వేదములందుగాని, ఉపనిషత్తులందుగాని గోచరింపదు. మోక్షపరమున "నిర్వాణ" పదమును భగవద్గీత పెక్కుసందర్భముల నుపయోగించెను. సామాన్యనిర్వాణముగాక 'బ్రహ్మనిర్వాణ' మును పరమావధిగ భగవద్గీత ప్రబోధించెను. ఆత్మసౌఖ్యము, ఆత్మానందము, ఆత్మజ్ఞానముల కలిగిన మానవుడు జీవించియుండగనే బ్రహ్మనిర్వాణమును పొందునని 5 వ అధ్యాయమగు "కర్మ సన్యాసయోగము" 24 వ శ్లోకమున చెప్పబడెను. బౌద్ధధర్మము ననుసరించి భూతదయాపరులు నిర్వాణస్థితినొందుదురు. సర్వభూతహితులయినవారు బ్రహ్మనిర్వాణమందుకొనెదరని "కర్మసన్యాసయోగము" 25వ శ్లోకమునకలదు. 24 నుండి 26 వ శ్లోకము వరకు బ్రహ్మనిర్వాణ స్థితినిగూర్చి భగవద్గీత వివరించెను. ఇటుల బౌద్ధధర్మమందలి ముఖ్య సిద్ధాంతముల నన్నిటిని భగవద్గీత జీర్ణించుకొనెను.

(సశేషము.)

# గీతా సముద్రము

## మొదటి భాగము.

### రచన: పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ స్వామి ఓంకార్ జీ.

### శాంతిమిషన్, కైలాసాశ్రమం, వాల్తేరు.

*

[శ్రీ ఓంకారస్వాములవారు శాంతిసందేశాన్ని ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ (ఆంధ్ర, హిందీ, ఆంగ్ల) భాషల్లో 'శాంతి' – 'शांतिः' – 'PEACE' మాస పత్రికలద్వారా ప్రపంచానికి ప్రసారం చేస్తూన్న మహానుభావులు. పలుతూర్లు పాశ్చాత్య దేశాలలో పర్యటించి 'శాంతి ఆశ్రమ' శాఖలను విరివిగా స్థాపించిన శాంతి దూత.

కళాశాలలో విద్యాభ్యాసం చేసే సందర్భంలోనే శ్రీ స్వాములవారి మనస్సు భగవంతునివైపు మరల్పబడింది. సర్వసన్న్యాసం గావించి హిమవత్పర్వతాల్లో కొన్ని సంవత్సరాలు తపస్సు చేశారు. వారందుకొన్న అమరసందేశాన్ని ప్రజానీకానికి అందించటానికి ప్రప్రథమంగా 1917 లో తూర్పుగోదావరిజిల్లా తోటపల్లి కొండలో శాంతి ఆశ్రమాన్ని స్థాపించారు. దాంతర్వాత శ్రీవారు ప్రపంచయాత్రకు బయలుదేరి అమెరికా, జర్మనీ, చైనా, ఆస్ట్రేలియా, మలయా మొదలగు దేశాల్లో సంచారాలు సాగించి శాంతి సందేశాలు వినిపించారు. ప్రస్తుతం శ్రీవారు వాల్తేరువద్ద వుండే కైలాసపర్వతంపైన ఆశ్రమాన్ని స్థాపించి అక్కడే నివసిస్తున్నారు. వివిధమత సాంప్రదాయాల్లోని ఏకత్వాన్ని, శాంతి సందేశాన్ని ప్రచారం చేయటమే వీరి ప్రధానాశయం. — సంపాదకుడు]

---

శ్రీ రామకృష్ణ పరమహంసవారు ఈ లోకములో అందరును పిచ్చివారేయని చెప్పియుండిరి. "మనిషికొక పిచ్చి మహిలో వేమా" అని శ్రీ వేమనకూడ నుడివియుండెను. ఈ పిచ్చి మనుజుని అంతఃకరణస్థితిని అనుసరించి అనేకరీతులుగా వివిధమైన నామరూపములతో వుండును.

ఈ రోజులలో నేను సముద్రతీరముననే వసించుటచేతను, కైలాస ఆశ్రమమునుండి సముద్రమును మూడుప్రక్కలను గాంచుచుండుటచేతను, 'పిడుగునకు బియ్యమునకు ఒకే మంత్రము' అన్నట్లు ప్రతిదానికిని, సముద్రమునే వుదాహరణగా తీసుకొనుచుందును. ఈ పిచ్చి నాకు ఆనందమునిచ్చుచుండును. ఎవ్వనిపిచ్చి వానికి ఆనందము గదా!

"గీత" అఖండమైన మహాసముద్రము వంటిది.

ప్రశ్న: గీతలో వున్న పదునెనిమిది అధ్యాయములో?

ఉత్తరము: ఈ అధ్యాయములన్నియు ప్రపంచములో వున్న ఇండియన్ సముద్రము, పసిఫిక్ సముద్రము, అట్లాంటిక్ సముద్రము, ఆర్కిటిక్కు సముద్రము, చైనాసముద్రము, జపానుసముద్రము, అరేబియాసముద్రము, మెడిటరేనియను సముద్రము, ఎర్రసముద్రము, నల్ల సముద్రము మొదలైన వివిధ సముద్రముల వంటివి.

ప్ర: ఇక గీతా శ్లోకములో?

ఉ: ఈ శ్లోకములన్నియు సముద్రములో నున్న కెరటములవంటివి. ఒకొక్కక్క

కెరటము గీతా సముద్రము యొక్క గాంభీర్యమైన భావములనే వ్యక్తపరచుచున్నది.

సముద్రజలములో నదులన్నియు ఇమిడియున్నట్లు, గీతలో అన్నిశాస్త్రములును, అన్నిబోధలును, అన్ని విధములగు అభ్యాస విధానములును యిమిడియున్నవి. సముద్ర గర్భములోనున్న మహా రహస్యములను గ్రహించుట దుర్లభమైనట్లు గీతాగర్భమున నున్న అంతర్భావములను, గూఢార్థములను గ్రహించుటకూడ కడుదుర్లభమే. ప్రపంచము జన్మించినదిమొదలు జడప్రపంచము నందలి రహస్యములను తెలుసుకొనుటకే, శాస్త్రపరిశోధకులు నిరంతరము ప్రయత్నించుచున్నారు. ఎంత పరిశీలించినను, ఇంకను కనిపెట్టవలసినదే హెచ్చుగా మిగిలియున్నట్లు కన్పట్టుచున్నది. అటులనే భగవద్గీతవిషయములోగూడ పండితోత్తములు, శాస్త్రవేత్తలు, జ్ఞానులు, భక్తులు, పెద్దలు, పిన్నలు, గీత చెప్పబడినప్పటి నుండియు, దాని తత్త్వమును విమర్శించి తెలుసుకొనుటకు ప్రయత్నము జేయుచునే యున్నారు. ఎంతశోధించినను, ఇంతవరకు తెలుసుకొనగలిగినదానికంటె ఇక ముందు తెలుసుకొనవలసినదే హెచ్చుగా దయున్నట్లు కనిపించుచున్నది.

అనేకమైన దేశములలో పండితోత్తములు కొందరు భగవద్గీతను వివిధభాషల లోనికి తర్జుమాజేసియున్నారు. మరికొందరు గీతాధ్యాయములన్నింటిని నిత్యము పఠించుకొనుచున్నారు. మరికొందరు ఈ గ్రంథమును చిన్నపుస్తకములుగా అంగుళము సైజులోగూడ అచ్చువేయించుకొని తమ కోటు జేబులలో హృదయములకు దగ్గరగా నిరంతరము వుంచుకొనుచున్నారు.

సామాన్యభక్తులందరు దేశమంతట నిత్యము గీతాపారాయణ జేయుచుండుట మనము ప్రతిచోటను జూచుచునే యున్నాము. కొందరు ప్రతిదినము గీత నంతయు పారాయణ జేయుచుందురు. మరి కొందరు ఒక్క అధ్యాయమైన గీతలో పారాయణ జేయకుండ భోజనము జేయరు. అనేకమైన పనితొందరలలో వున్నవారును వుద్యోగములు జేయుచున్నవారును గూడ చివరకు ఒక్క గీతాశ్లోకమైనను పారాయణ జేసినగాని దినచర్యను ప్రారంభించరు.

(గీతాశాస్త్రములో లేని రహస్యములు ఎచ్చటను లేవు. అది భక్తులకు భక్తినిబోధించుచున్నది. యోగులకు యోగమును నేర్పుచున్నది. గృహస్థులకు గృహస్థధర్మములను జెప్పుచున్నది. జ్ఞానులకు జ్ఞానమును బోధించుచున్నది. భయపడువారలకు నిర్భయత్వమును, ధీరత్వమును ఇచ్చుచున్నది. ముముక్షువులకు మోక్షమునొసంగుచున్నది. బాల బాలికలకు ఒకవిధమైన కథవలెను, యౌవనులకు వారి జీవితయాత్రలను ఆదర్శ మార్గములలో నడపుటకు జ్యోతిగా మార్గదర్శియై వెలుగుచుండును. ముసలివారికి తత్త్వోపదేశము నొసంగుచున్నది. మానవుని జీవన్ముక్తునిగా జేయుటకు దివ్యమైన మార్గమును చూపుచున్నది.)

ప్ర: ఇక మనకు కావలసినదేమియున్నది?

ఉ: దానిననుభవించుటయే! గీతాసారమును, గీతామృతమును గ్రోలుటయే! దాని,

గీతాసారమును అనుభవించుట వ్రాయు నంత, జెప్పునంత సులభముగానుండదు.

గీతను గురించి విననివారు ఏ దేశము లోను వుండరనియే చెప్పవచ్చును. సముద్రమును గురించి విననివారు, చూడనివారుందురా? ఏ మారుమూలలలోనో, ఎటులనో ఉండిన ఉండవచ్చును; గాని, ఆనందదాయకమగు విషయమేమన, ఈ గీతాసముద్రమున ఈదులాడువారు భారతదేశములోనే గాక, అన్ని దేశములలోను, హిందూమతస్థులలోనే గాక, సర్వమతస్థులలోను పెక్కుమందిగలరనెడి శుభవార్తయే. సముద్రము గురించి చదువుటవేరు, సముద్రమును చూచుటవేరు. సముద్రము గురించి వినుటవేరు, సముద్రములో దిగి ఆనందముగా స్నానము జేయుట వేరు. అఖండమైన సచ్చిదానంద సముద్రములో ఖండమైన మనస్సులను లీనముజేయుట అన్నిటికంటెను కష్టము. అటులనే గీతను గురించి విన్నవారుగలరు. భగవద్గీత పుస్తకమును జూచినవారును గలరు. ఇట్టివారందరిలో గీతను నిత్యము పారాయణ జేయుచున్నవారే ధన్యులు. అందలి ధర్మములను నిత్యము అనుష్ఠానములో పెట్టుకొనువారు అంతకంటె ధన్యులు. గీతాసముద్రములో అహర్నిశములు మునిగితేలుచు గీతాసారమును గ్రోలుచూ, ఆదర్శజీవితములను గడుపుచున్నవారికే నిత్యశాంతి చేకూరును. అట్టివారికే బ్రహ్మానందసుఖము చవిచూచు భాగ్యము కలదు.

అనుభవములో పెట్టజాలని శాస్త్రములన్నియు, దినచర్యలో ఉపయోగింపజాలని బోధలన్నియు చదువునకు బరువేగాని, శాంతిని, ఆనందమును ఒసంగజాలవు. సర్వవిద్యలలో బాగుగ పాండిత్యమును సంపాదించియు, అనుభవములో పెట్టజాలని మనుజుని, మంచి గంధముచెక్కలయొక్క వాసనను గ్రహింపజాలక వాటి బరువును మాత్రమే మోయుచున్న గార్ధభమునకు బ్రహ్మవిదులు చక్కగా పోల్చి చెప్పియుండిరి.

గీతాసారమగు శాంతిని దినచర్యలో అహర్నిశములు అనుభవించుట మనయందరకును ముఖ్యకర్తవ్యము. మనహృదయముల లోను, గృహములలోను యున్న శాంతియుతమగు ప్రేమ సర్వజాతులందు, సర్వదేశములందు సామరస్యమును అభివృద్ధిని గలిగించుగాక! (సశేషము.)

---

# విలేఖరులు కావలయును.

“దేవాలయం” అను మాసపత్రికకు ముఖ్యపట్టణాల్లో విలేఖరుల నియమించనున్నాం. దరఖాస్తుకొఱకు నాలుగు అణాల పోష్టు బిళ్లలతో,

ఎడిటర్,

“దేవాలయం.”

చాగలమర్రి పోస్టు, కర్నూలుజిల్లా.

---




యజుర్వేది శ్రీ కాశ్యప.



[ మే సంచిక 22వ పేజి తరువాయి. ]

తమ్ముడూ !

సరే. అటు వారూ యిటు మేమూ యుద్ధానికి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నామని చెప్పానుగదూ? యుద్ధం జరుగవలసిన ప్రదేశం 'కురుక్షేత్ర' మైదానమనికూడా నిశ్చయించుకున్నాం. కురుక్షేత్ర మైదానమంటే ఎంతప్రసిద్ధికెక్కిందనుకున్నావ్? ఆ ప్రదేశాన్ని "ధర్మక్షేత్రం" అనికూడా అంటారు. ఎందుకంటే చాలాకాలంనుండి ఆ పవిత్ర ప్రదేశంలో యజ్ఞయాగాది తపోధ్యాన నిష్ఠలు అనేకం సాగించారు. అక్కడవుండే ప్రతి అణువు కూడా ధార్మిక సంస్కారంతో మిళితమై వుంటుందనటానికి సందేహమే లేదు. అలాంటి పావనస్థలాన్ని భీకర రణరంగంగా ఉపయోగించటానికి ఇరువర్గాలవారం అంగీకరించాం. ముందుగా నేను, మా బావగారు ఆప్రదేశానికి పరిశీలించటానికి వెళ్ళాం. సైనిక శిబిరాలకు, రక్షణలకు, విశ్రాంతులకు, క్షతగాత్రులకు, ఆయుధాగారాలకు, భోజన సదుపాయాలకు, ధ్యానానుష్ఠానాలకు విడివిడిగా ఏర్పాట్లన్నీ చేయించాం. ఇక అన్నీ సిద్ధమైనట్లే. ఇరుపక్షాల్లోవుండే సైనికులు; యోధులు — యోధాగ్రేసరులు; అతిరథులు; మహారథులు అందరం కలిసి ఆప్రదేశాన్ని మహాసంతోషంగా చేరుకున్నాం. ఇది గో తమ్ముడూ! అతిరథులూ — మహారథులూ అంటే నీకర్థం అవటం లేదా? అతిరథుడంటే వందలకొలది యోధులతో వంటరిగా యుద్ధం చేయడానికి తగిన సాహసం కలవాడని అర్థం. ఇక మహారథుడంటే ఇటు శస్త్రంలోనూ, అటు శాస్త్రంలోనూ ప్రావీణ్యతకల్గి పదివేల మంది యోధులతో ఒకేసారి పోరాడే సామర్థ్యంకలవాడని అర్థం. చూశావా! ఆకాలంలో వీరాగ్రేసరుల బాహుబలం. అసలు నీతో చెప్పటం మరచాను. కురుక్షేత్ర యుద్ధారంభానికి నా వయస్సెంతో

తెలుసా? (ఎనభై ఎనిమిది సంవత్స రాలా తొమ్మిదినెలలు!) మా బావ గారు నాకంటే మూడుమాసాలేగా పెద్ద.) నీ దృష్టిలో ఎనభై తొమ్మిది ఏండ్లంటే ముసలితొక్కు అనుకుం టావుగదూ? అవున్లే. ఈనాటి పరి స్థితుల్ను పట్టి నీ వట్లే అనుకుంటావు. కానీ మా కాలంలో మా కది మంచి నడివయస్సన్నమాట. సరే. మార్గశిర శుద్ధ ఏకాదశినాటి సూర్యోదయానికి అందరం రణ రంగంలో ప్రవేశించాం. బహుశా అది ప్లవనామసంవత్సర మనుకుం టాను. అంటే మొన్నమొన్న మీ తాతగారి కాలంలో గడిచిపోయిన ప్లవనామసంవత్సర మనుకున్నా వేమో? ఊహూఁ — ఇది కలి యుగంగదూ; గడచిన ద్వాపర యుగంలో 863155 సంవత్సరాలు గడచింతర్వాత వచ్చిన ప్లవనామ సంవత్సరమన్నమాట. సరే. మార్గ శిర శు. ౧౧ ల నాటికి ఇరుసేనలూ యుద్ధరంగంలో నిలువబడినాయి.)

కౌరవ సైన్యానికి సర్వసైన్యా ధిపతిగా శ్రీ భీష్మాచార్యులవారిని దుర్యోధనుడు నామినేట్ చేశాడు. భీష్మాచార్యులవారంటే యేమను కున్నావ్? సాక్షాత్ ప్రచండశక్తి స్వరూపుడన్నమాట. రాజాధిరాజు లపై ఇరవై ఒక్కసారి దండయాత్ర లు సాగించి దిగ్విజయాన్ని సాధిం చిన పరశురామునంతటివానిని శృంగ భంగంజేసిన దిట్ట. మృత్యుదేవతను గుప్పిట్లోకి తెచ్చుకున్న ప్రతిభాశాలి. తండ్రిసుఖానికి తనసుఖాలను బలి బెట్టి శాశ్వత బ్రహ్మచారిగా ఉండి పోయిన త్యాగమూర్తి. అటువంటి మహానుభావుడు కౌరవ సైన్యానికి కమేండర్-ఇన్-చీఫ్. ఆయన తనక్రింది సేనాధిపతులను, సైనికు లను సంబోధిస్తూ యుద్ధారంభానికి ముందుగా చక్కటి సందేశాన్ని బ్రాడ్‌కాస్ట్ చేశారు. ఆసందేశం యొక్క పూర్తిపాఠం యిది.

"ఓ క్షత్రియవీరుల్లారా! వీరు లకు స్వర్గద్వారాలు తెరువబడి నాయి. ఈమార్గం మీపూర్వులు, వారికిపూర్వులు నిర్ణయించిన సుప్ర సిద్ధమైనమార్గం. మీరు కలతబారని గుండెలతో, దిగులులేని మనస్సుతో, వెరపులేని జీవితో ఆ మార్గాన్నే అనుసరించాలి. అప్పుడే మీకు స్వర్గద్వారాల్లో స్వాగత వచనాలు పల్కుతారు. మీరు భీరువులై యుద్ధరంగనుండి పారిపోయి ఇంట రోగాలతో మృతిజెందారంటేమీకు శాశ్వతంగాస్వర్గద్వారాలు మూయ బడతాయి. జాగ్రత!"

(యింకావుంది)



# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము
### శ్రీ. కిళాత్తూరు - శ్రీనివాసాచార్యులు.

( సెప్టెంబరు సంచిక 28-వ పేజీ తరువాయి. )

అర్జున ఉవాచ:—



శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన ॥ 4

,, గురూనహత్వా హి మహానుభావా౯
శ్రేయశ్చర్తుం భైక్షమపీహ లోకే ।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధా౯ ॥ 5

భాష్యం:—పునరపి పార్థః స్నేహకారుణ్య ధర్మాధర్మభయాకులో భగవదుక్తం హితతమ మజానన్ ఇదమువాచ:— "భీష్మద్రోణాదికాన్ గురూన్ బహుమన్తవ్యాన్ కథమహం హనిష్యామి? కథంతరాం భోగేష్వతిమాత్రప్రసక్తాన్ తాన్ హత్వా తైర్భుజ్యమానాన్ తానేవ భోగాన్ తద్రుధిరేణ ఉపసిచ్య తేష్వాసనేషు ఉపవిశ్య భుంజీయ?"

అను:— మరల పార్థుడు స్నేహకారుణ్య ధర్మ అధర్మభయములచే వ్యాకులత చెందినవాడై భగవంతుడుపదేశించిన హితతమమైన విషయమును ఎరుంగనివాడై యీ విధముగ పల్కెను: "గౌరవనీయులగు భీష్మద్రోణాదులగు గురువులను యెట్లునేను చంపగలను? అదియుగాక, భోగములలో నత్యధికముగా ఆసక్తిగల్గిన, వారలనువధించి, వారు భుజించుచున్న ఆ భోగములనే, వారి రక్తముతోనే తడపి వారి యాసనములయందే కూర్చొని ఎట్లు భుజించగలను?"

విశే:— "కథంప్రతియోత్స్యామి" — పుష్పాదులచే పూజింపదగినవారిని పూజింపకుండుట సాహసమైనకార్యము. వారిని వధింపబూనుట

అతిసాహసమైన కార్యమనిభావము. మఱియు గురుభక్తికలవాడైనచో, గురువులకు విరోధులైనవారితో యుద్ధముచేయవలెను. అట్లుగాక గురువులతోడనే యుద్ధముచేయుట నీతివిరుద్ధముకాదా?

"అహం". సాధారణకులములో జనించిన పామరుడు గుర్వాది వధములో ప్రవర్తించుగాక; ప్రఖ్యాతవంశములో జనించిన "నాకు" యీ పని తగునా? అనిభావము.

"మధుసూదన !" నీవు శత్రువైన మధువను రాక్షసుని చంపితివికాని, నీ విద్యాగురువైన సాందీపిని మహర్షిని ఎన్నడైన చంప బూనితివా? అను భావము సూచితము.

"భైక్షంచర్తుం శ్రేయః" జీవించుటకై ఏదైన ఒకవృత్తిని అవలంబించవలసియున్నది. కాని గురువధమువలన లభించుభోగమునకన్న పరధర్మమైన భిక్షాటనముకూడ గొప్పదే. ఎట్లనగా:— మహాప్రభావసంపన్నులగు గురువుల వధించుటవలన కలుగు నరకాది దుఃఖము అన్నిపాపములకన్న గొప్పదగుటవలన అని భావము.

"అర్థకామాన్" 'అర్థేషు కామః యేషాం తే' — అర్థములలో కోరికకలవారు. దీని భావమేమనగా:— వారలు కోరికలు నశించినవారైనచో వారి భోగములను హరించుటతగును. కాని, వారు అర్థకాములు. ఆకలిగొన్నవాని అన్నమును పెఱికిన అతనికి యెంతదుఃఖముకల్గునో అట్లే అర్థకాములైన వీరిభోగముల నపహరించిన వీరికి దుఃఖముకల్గును కదా?

"రుధిరప్రదిగ్ధాన్" రక్తముతో తడపిన. వధముకంటె అతిక్రూరతను చూపుటకై యీ ప్రయోగము, గురువధమువలన లభించిన భోగముల ననుభవించునపుడు, రక్తసిక్తులగు గురువుల స్మరణము రాగా, ఆభోగములుకూడ రక్తసిక్తములువలె కనుబడి అభోజ్యములు కాగలవని భావము. (సశేషము)



# శ్రీగీతాసాహిత్యసేవాసమితి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర పంచమాచార్యశ్రీ జగద్గురు శ్రీ వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదుర్తి, కోయిలకుంట్ల తాలూకా. – 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. – 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. – 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ – 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ – 7. శ్రీతోమ్మండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. – 8. శ్రీ ఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము. శిరివెళ్ళ తాలూకా. – 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. – 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. – 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. – 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, శిరివెళ్లతాలూకా. – ♦ ♦ ♦ కడప జిల్లా. 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణగారు, రామిరెడ్డిపల్లె, పులివెందల తాలూకా. —— 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. – 15. శ్రీ పోతేపల్లి రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు. ♦ ♦ ♦ చిత్తూరుజిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లె మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్‌వీధి, చిత్తూరు. – 17. శ్రీ యస్. రామలింగం పిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు. ♦ ♦ ♦ అనంతపురంజిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్ఘనానంద మహర్షులవారు, శ్రీభవనాశి ఆశ్రమం. – 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. ♦♦♦ బళ్లారిజిల్లా: 20. శ్రీ పెండుకూరు గోవిందప్ప అండ్ సన్స్, హాస్పెట్, 21. శ్రీసుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్. – 22. శ్రీగంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. ♦♦♦ కోలారుజిల్లా: 23 శ్రీవి. వి. రామలింగంశ్రేష్ఠిగారు, బంగారుపేట. మైసూరుస్టేట్: 24. శ్రీ జి. ఎన్. శంకరనారాయ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి. ♦♦♦ ఉత్తర ఆర్కాట్ జిల్లా. 25. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటునూరు, కణ్ణమంగళంపోస్టు. ♦♦♦ నెల్లూరుజిల్లా. 26. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు – 27. శ్రీ వేమారెడ్డి బాలరామిరెడ్డిగారి ధర్మపత్ని యశోధరమ్మగారు, ఇనమడుగు. ♦♦♦ హైదరాబాద్ స్టేట్ 28. శ్రీడి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. ♦♦♦ గుంటూరుజిల్లా: 29. శ్రీశ్రద్ధానంద స్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, తెనాలి తాలూకా.

## రాజపోషకులు రు. 54.

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మృతిచిహ్నముగ శ్రీ యస్ అయ్యపురాజుగారు, గోసుపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండ ఓబులేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీసోముల పెదసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 8. శ్రీయస్. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తా॥ – 9. శ్రీమదళ్లపల్లె

రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. - 10 జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్య శ్రేష్ఠిగారలు, చాగలమర్రి. - 11. శ్రీమతి ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ . ఉద్యాల రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. - 13. శ్రీపాణ్యం రామనాథ శాస్త్రిగారు, కోయిలకుంట్ల. - 14 శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చెంట్, పాణ్యం ◆◆◆ కడపజిల్లా: 15. శ్రీ పెసరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్ములమడుగు తా॥ 16. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. - 17. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెదజూటూరు. - 18. శ్రీ పి. నారాయణశ్రేష్ఠి గారి కుమారుడు శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. - 29. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. - 20. శ్రీ ఉమ్మిడి పెద్ద సుబ్బారెడ్డి గారు, పాలూరు, జమ్ములమడుగు తా॥ - 21. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. - 23. శ్రీబల్లా తెప్పల నాయుడుగారు, ముత్తరపల్లె - 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం.ఎల్.ఎ., పెరియంబాడి. 25. శ్రీనటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు. అనంతపురంజిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. - 27. శ్రీ బుశెట్టి పన్నప్పగారు, ఉరవకొండ - 28. శ్రీకాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. - 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. - 30. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకసిర - 31. ఆముదాల వెంకట రెడ్డిగారు, రాగలపాడు పోస్టు. ◆◆◆ బళ్లారిజిల్లా: 32. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్, - 33 శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు - 34. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు. - 35. శ్రీ కందుకూరువెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరిపోస్టు. - 36. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. 37. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి - 38. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. - 39. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. - 40. శ్రీ శావాలు గోవిందప్పగారు, కుందనగుర్తి - 41. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 42. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి - 43. పాటేల్ పెదబళరెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి - ◆◆◆ మైసూర్ స్టేట్:- 44. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. - 45. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. - 46. శ్రీ కె. నంజప్ప శ్రేష్ఠిగారు, బంగారుపేట. - 47 శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్. - 48 శ్రీ నారాయణమూర్తిగారు, C/O శ్రీ సూరా విరూపాక్షయ్య గారు, తొండెభావి, కోలారుజిల్లా. ◆◆◆ నార్త్ ఆర్కాడుజిల్లా: 49. శ్రీశంకరనాయుడు గారు, కార్వేటినగరం. ◆◆◆ హైదరాబాదుస్టేట్. 50. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. - 51. శ్రీదేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. ◆◆◆ నెల్లూరుజిల్లా: 52. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు - 16. - 2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగళ్లి, ఆలూరుతాలూకా. బళ్లారి జిల్లా.

# వార్తలు.

శ్రీ రామకృష్ణస్వామిగారు 1-9-53 గండిక్షేత్రం చేరుకొన్నారు. 6-9-53 శ్రావణ బ 14 ఆదివారం శ్రీభూమానందాశ్రమమునందు శ్రీ శ్రీ శ్రీ సద్గురు సాధు రామయ్యగారి చతుర్దశవార్షిక ఆరాధన జరిగినది. 7-9-53 సాయంత్రమునకు శ్రీరామకృష్ణగారు నూళూరుపేట చేరుకొన్నారు.

నూళూరుపేట దివ్యజీవన సంఘశాఖా ద్వితీయ వార్షికోత్సవము సెప్టెంబరు 8, 9, 10 తేదీలలో అత్యంత వైభవోపేతముగ జరిగినది. శ్రీ శ్రీ శ్రీ పూజ్యపాద విద్యాప్రకాశానంద స్వాములవారు సభాధ్యక్షపదవి నలంకరించినారు. శ్రీశంకరానంద, శ్రీరామకృష్ణ, శ్రీనిత్యానంద, శ్రీ అశేషానంద, శ్రీ దిగవల్లి శేషగిరిరావు, శ్రీయుత పి. సుబ్బరామానాయుడుగార్ల ఉపన్యాసములు జరిగినవి. గీతాభినయకేసరి రుద్రారెడ్డిగారి గీతాభినయము జరిగినది. శ్రీ వి. రామకృష్ణమాచార్యులవారియు, వారి అనుయాయులయొక్కయు, అత్యంత శ్రద్ధాసక్తులతో కార్యక్రమము సంపన్నముగ నెరవేరినది.

ఆ సందర్భమున సభాసదులద్వారాను సంఘముద్వారాను గోదావరి వరదబాధితులకు సహాయముగా రూ. 101-0-0 లు సమర్పింపబడినది.

శ్రీశంకరానంద, శ్రీరామకృష్ణ, రుద్రారెడ్డిగారలు మద్రాసుమీదుగా 12-9-53 సాయంకాలమునకు కోలారుజిల్లా అగరం శ్రీనివాసాశ్రమమునకు చేరుకొన్నారు. 17-వ వార్షిక భాగవత సప్తాహము శ్రీనివాసాశ్రమమునందు 13-9-53 తేది బ్రహ్మముహూర్తమునుండి ఆరంభింపబడింది. శ్రీ శంకరానందస్వామిగారి హిందీ ఉపన్యాసమును యిరుపూటలును శ్రీ వేణుగోపాలగుప్తగారు అనువదించారు. శ్రీ రామకృష్ణగారు భాగవత ప్రవచనము కావించినారు. శ్రీరుద్రారెడ్డిగారి గీతాభినయముసహా జరిగినది. శ్రీ నేగు సంజీవనారాయణదాసు-కృష్ణదాసుగారి అత్యంత శ్రద్ధాహృదయములతో కార్యక్రమము అన్నివిధముల మిగుల రాణించినది.

శ్రీశంకరానంద-రామకృష్ణులు 20-9-53 సాయంకాలమునకు కోలారుజిల్లా ములబాగల గ్రామం చేరుకొన్నారు. అచ్చటి శ్రీ బాలకృష్ణాశ్రమమునందు మూడు రోజులు భగవద్గీతోపన్యాసములు జరిగినవి.

19-10-53 నుండి చిత్తూరు జీవకారుణ్య అన్నదానసమాజ భవనమునందు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శాంతానందస్వాములవారి అధ్యక్షతతో పూజ్యపాద శ్రీ శంకరానంద స్వాములవారి గీతోపన్యాసములు నిశ్చయింపబడినవి.

---

## గీతావాణి చందాదారులకు విజ్ఞప్తి.

ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాసేటపుడు, చందాపైకాన్ని పంపేటపుడు తప్పనిసరి మీ చందానెంబరు సూచిస్తూండాలి.

— స్వామి శివానంద, మేనేజర్-గీతావాణి.

---

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi - Allagadda - Kurnool Dt.

# గీతభజన

రచయిత:
డాక్టర్ రంగా చిన్నచలమయ్యగారు,
చాగలమర్రి, కర్నూలుజిల్లా.

గోపాల గీతా
మాపాలి గీతా
మాధవుని గీతా - యాదవుని యీ గీత
రాధకృష్ణ గీతా
రత్నాల గీతా
ఆనందగీతా - అందరికి యీ గీత
శ్రీకృష్ణ గీతా
స్థిరమైన గీతా
చిత్తుసత్తుగీతా - చిక్కాని యీ గీత
మురళికృష్ణ గీతా
ముచ్చటైన గీతా
మధురంబు గీతా - మంత్రంబు యీ గీత
శ్రీధరుని గీతా
సిద్ధమైన గీతా
మూలమైనగీతా - మోక్షానికీ గీత

దేవదేవ గీతా
దివ్యమైన గీతా
దాసులకు గీతా - దాటిజూపు గీత
పరమాత్మగీతా
పరబ్రహ్మ గీతా
సాధువుల గీతా - సారమైనదీ గీత
కృష్ణ కృష్ణ గీతా
కృపజూపు గీతా
వేదంబు గీతా - వేద్యంబు యీగీత
దివ్యపురుష గీతా
దిట్టమైన గీతా
మట్టమైన గీతా - మంగళంబు యీగీత
భగవాను గీతా
భద్రమైన గీతా
భక్తులకుగీతా - ముక్తినిచ్చు యీ గీత

## గ్రంథ స్వీకారము.

1. సూక్తి ప్రసూనాలు 0—8—0
2. పూజాపుష్పాలు 1—0—0

కవులు: తెలకపల్లి రమణమణిశర్మలు,
శ్రీ నవకవితా కావ్యమాల, పెసరవాయి, B. ఆత్మకూరుపోస్టు, (Via) Nandyal.

3. గీతాసుధ 1—0—0

గ్రంథకర్త: చిట్టా రామకృష్ణరావు, B. A., B. Ed., గుత్తిపోస్టు, అనంతపురం జిల్లా.

శ్లో॥ మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణీ విహారిణే।
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥

# గీత కల్పవృక్షము

శ్లో॥ గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాసవివర్ధితం శ్రుతిశిరో బీజం ప్రబోధాంకురం।
నానాశాస్త్రరహస్యశాఖమరతిక్షాంతిప్రవాళాంకితం
కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభిం మోక్షప్రదంజ్ఞానినాం॥

భావార్థము:— గీతను కల్పవృక్షముగ వర్ణించడమైనది. కల్పవృక్ష సమీపమునకువెళ్లి యేది మనస్సులో సంకల్పింతురో, అది లభించెడిశక్తి దానియందు గలదు. ఆలాగున గీతను భక్తిశ్రద్ధలుగలిగి పఠించుచు దానియందున్నట్లు ఆచరించువారికి, కామ్యకర్మములైనచో కర్మఫలమున్ను, నిష్కామకర్మములైనచో మోక్షమున్ను కలుగును. ఈ కల్పవృక్ష బీజమును శ్రీకృష్ణభగవానుడే సుస్థిరముగ ప్రపంచములో నాటెను. ఆ బీజమే మన ఉపనిషత్సారము. దీనిని శ్రీవ్యాసభగవానుడు ఛందోబద్ధ శ్లోకములుగ చేసినందుచే వృద్ధిపొందించినవాడయ్యెను. అనగా శ్రీకృష్ణభగవానుని వాక్యములను ఛందోబద్ధముగ రచించెను. ఇది భక్తి కర్మ యోగ జ్ఞానములనెడి అనేక శాస్త్రముల సారములగు శాఖలతో కూడినది. విరక్తియు సహనమును దీనియొక్క చిగుళ్ళు. శ్రీకృష్ణ పదారవింద భక్తియే దీనియందలి పుష్పసౌగంధ్యము. మోక్షము దీనియొక్క ఫలము. జ్ఞానులు దీనిని అనుభవించి జన్మసాఫల్యమును బొందుదురు.

— శ్రీ మలయాళస్వామి.

శ్రీవేదవ్యాస ప్రెస్, చిత్తూరు. కా. 1000.

# గీతావాణి

29





[illegible] సంవత్సరము  ఐదవ సంచిక.

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.


## శ్రీగీతామహాత్మ్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

**15 నవంబర్ 1953.**

# విషయసూచిక - నవంబర్ '53.

# "గీతావాణి" 29



మేనేజింగ్ ఎడిటర్:



మేనేజర్:

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సర చందా నాలుగు రూపాయలు.

# శ్రీ భగవద్గీతా సారము.

బాలకవి శ్రీ ఓ. నారాయణప్పగారు.

★

## వవమాధ్యాయము — రాజవిద్యారాజగుహ్యాయోగము.

సీ॥ అతిరహస్యంబైన యాత్మజ్ఞానమ్మును
విజ్ఞానయుతముగ బ్రజ్ఞ నెఱుగు
నామాయభూతముల్ నాశముద్భవమొందు
ప్రళయకల్పాదుల దలపమదిని
భక్తి, జ్ఞానంబుల, ముక్తులౌదురు నరుల్
క్రతు, యజ్ఞములునేన గతులునేన
కల్పింతు నేరీతిగాంక్షించువారికి
నారీతివరుడ నాచార్యుడైన

గీ॥ స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, చెలిగి భక్తి
దలచి ననుబొందెదరు మది తెలియుమయ్య!
యనె నరునకా హరియనుచు దెల్పు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!

## రచయితలకు ప్రత్యేక విజ్ఞప్తి.

డిశంబరు నెలలో వెలువడే గీతావాణి "ప్రత్యేక సంచిక"కు దయతో తమ వ్యాసాలను నవంబరు 20-వ తేదీకే చేరునట్లు పంప ప్రార్థన.

మేనేజింగ్ ఎడిటర్ — గీతావాణి, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.




సంపుటి 3 ★ స్వస్తిశ్రీ విజయ — ఆశ్వయుజమ్ ★ సంచిక 5

# యజ్ఞకర్మము.

ప్రపంచ మొక ఆదానప్రదానశాల. అన్యోన్య వినిమయమున జగత్తు సుసంఘటితమై యున్నది. ఈ యీశ్వరీయ నియమమునకు అనుకూలుడై మెలగుటయె యజ్ఞవిధానము. జగత్తు యీశ్వరుని సొత్తు. మీద మీదటికి తనకు కావలెనని సమకూర్చి దాచిపెట్టుకొనుట యీశ్వరుని అస్తిత్వముపై అవిశ్వాస తీర్మానము.

దేవతలు ఈశ్వరుని సంస్థాన పరివారము. లోకమందలి సర్వకార్యములకు సంచాలకులు వారే. గ్రహింపగలరు; అనుగ్రహింపగలరు. ఆ దేవతలకును యీ మనుష్యులకును పరస్పర సంబంధమును కల్గింపజేసెడి అనుసంధాన సూత్రము యజ్ఞకర్మము. యజ్ఞముయొక్క ఆ చివరియందు దేవతలున్నారు; ఈ చివరియందు మనుష్యులున్నారు. యజ్ఞమువలన యిద్దరికిని సంబంధ గ్రంధి యేర్పడును. దేవతలకడ నుండు పదార్థములను — అవ్యక్తముగ నుండు పదార్థములను వ్యక్త మొనర్చి సంపాదింప జేయుటకు యజ్ఞము సాధనమై యున్నది.

యజ్ఞములను ప్రజలను పొత్తుకలిపియె ఒక్కుమ్మడి ప్రజా పతి బ్రహ్మ సృష్టించియున్నాడు. "ఈయజ్ఞము మీపాలిటి కామ ధేనువు. దీని నాశ్రయించి మీరు మీ యిష్టార్థములను సాధించుడు" అని బ్రహ్మదేవుడు ప్రజాకోటికి హితము నాదేశించినాడు. దేవతలకు మానవు లొసగుటయు, మానవులకు దేవతు లొసగుటయు యిదియె యజ్ఞ ప్రక్రియ. ఒక విధమున మానవులకంటె దేవతలు గొప్పవారు. కావున వారు ముందొసగెదరు. వారికి మరియు నొసగుట యజ్ఞము. ఇట్లు వ్యవహరించి యజ్ఞశేషము ననుభవించువారికి పాపములేదు. అటుదప్పి, యిచ్చినవారికి ప్రతిగ యిచ్చుట మాని లుబ్ధుడై అనుభ వించువాడు భోగరూపమునసుండు పాపములనె తినుచున్నాడు.

యజ్ఞమును చేయుటతో పుణ్యమును, మానుటతో పాపమును కల్గును. ఫలము తనకు రావలెనని చేసినవాడు బంధమునకు లోను కాగలడు. అసలె చేయనివాని మాటయే వేరు. ఫలాపేక్షను వదలి చేసినపుడె యజ్ఞము పూర్ణత్వము చెందుచున్నది. అయ్యెడ లోభము నిర్నామమైనది. లోభరహితముగ చేసినపని ప్రశస్తమగుయజ్ఞము.

యజ్ఞకర్మ మనిన నిష్కామకర్మము. నిష్కామ కర్మము గీతలోని గుట్టు. కర్మప్రవృత్తి సంకల్పమునకు ఆరంభమూలమును బట్టుకొని, అది యెందుండి వచ్చుచున్నదో గ్రహించి దాని కారణ కార్యక్షేత్రమును కలయజూచి, ఆ చోట తానుతానై నిండియుండెడి శక్తిని సంభావించి, తన కర్మముల నన్నిటిని దానికి సమర్పించుట యజ్ఞమనబడును. ఈ స్థానమందుండి చేసినకర్మలన్నియు సిద్ధిని పొందగలవు. ఇదే అధియజ్ఞము. నిష్కామ కర్మము: కర్మ యోగము.

"యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥

అన్నింటి క్రియాచేష్టలకు యేది కారణమో; యేది అంతటను వ్యాపించియున్నదో; ఆ పరమతత్త్వమును తనపాలిటి పవిపాటల తో — కర్మధర్మములతో పూజించి మానవుడు సిద్ధిని బొందుచున్నాడు. ఇదియె అధియజ్ఞమందలి సొగసు.

నీరు ఎక్కడ కురిసినను పారిపోవును. సముద్రమున కురిసినచో ప్రవహించుటలేదు. అట్లే కర్మము యేరూపమున చేసినను యిష్టానిష్టఫలముల నొసంగగలదు. యజ్ఞరూపముగ చేయబడినచో అది పరమావధిని ముట్టుచున్నది.

తన్నుతాను కొంచుట యనునది సిద్ధులందు పరమసిద్ధి. ఈ మాటను భారతేతర దేశములుకూడ ఒప్పినవి. దాదాపు మూడు వేల సంవత్సరముల క్రితము గ్రీసుదేశమునందు సోక్రటీసు అనెడి దార్శనికుడుండెను. ఆతడు మహావిచారవంతుడు. ఎవ్వరేమి యనినను అట్లనిననేమిః యని యెదురు ప్రశ్నవైచి వారికిని అంతర్ముఖ విచారమును కల్గించువాడు. "అన్నిటికంటె ఉత్తమమగు తెలివి యేది" — అని ప్రశ్నించినపుడు "నిన్నునీవు తెలుసుకొ"మ్మని ఆతడిచ్చిన సమాధానము. అదే ఆత్మజ్ఞానము. అదే అధ్యాత్మము. అదియె యజ్ఞకర్మమునకు పర్యవసాన ఫలము.

### గీ తా ప్ర సా ద క బ ళ ం.

సముద్రం తన నీటిని ఆకాశానికి పంపింది. ఆకాశం ఆ జలాన్ని కొండలపై గుమ్మరించింది. కొండలు వాటిని నదులకు సప్లయి చేశాయి. నదులు సముద్రానికి యిచ్చివేశాయి. "పరస్పరం భావయంతః" ఇది గీతలోని యజ్ఞచక్రం.




( అక్టోబరు సంచిక 11-వ పేజీ తరువాయి. )

చేసి పనిపాటలు మానియు
న్నచో, కర్మాధికారులగు యితరులు
సోమరులై పోగలరని చెప్పుచు
న్నాడు.

(శ్లో 23) ఫల్గునా! నేను కృత
కృత్యుడను. పనిపాటలుచేసి పాటు
పడి నేను సంపాదించవలసిన పురు
షార్థమెద్దియులేదు. సరిగదా! యిక
నాకేల యీగొడవ యని ఊరక
కూర్చొనక కర్మరంగమున వ్యవహ
రించుచునె యున్నాను. అటులేని
చో, నన్నుచూచి నావలెనె మరగి
కర్మములను చేయుట మానుకొని
లోకమానవులు చెడిపోయెదరు.
పెద్దలననుసరించిన జాడయె సర్వోత్త
మమని వారి అభిప్రాయము.

(శ్లో 24) మరియు వారిట్లు
తలంతురు. "శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు.
పనులుచేయుట మంచిదైయున్న
చో ఆయన తప్పక చేయుచుండెడి
వాడు. ఆయనఅభిప్రాయమె మనకు
ప్రమాణము" అని తలంచి లోకులు
ప్రవర్తింతురు. తద్ద్వారా వారు కర్మ
భ్రష్టులై పోయెదరు. నాలోని
ఆంతర్యమును వారు చక్కగ
గుర్తించలేక, పైటి నడవడికను
చూచి ఆత్మద్రోహము చేసికొం
దురు. కర్మహీను డెట్టి పురుషార్థ
మును పొందలేడు. పైపెచ్చు అధో
గతికి పాల్పడగలడు. ఇంతటి దూర
దృష్టి నవలంబించి నేను కర్మము
లాచరించుచున్నాను.

లోకవ్యవస్థకు కారణమగు
కర్మము లోపించినచో ధర్మము
క్షీణించును. తోడ్తోడ దర్పము
రాజరికముచేయును. దురాచారము
పెచ్చుపెరిగి పోవును. వర్ణసంకర
ముప్పతిల్లును. లోకమిన్ని అనర్థ
ములకు ఆలవాలముకాకుండ, అంద
రికిని ఆదర్శప్రాయముగ నేను
మెలగవలసి యున్నది. లోకోద్ధర

ణముకొరకు— ధర్మోద్ధారముకొరకు అవతరించిన నాకింతకంటె మించిన ముఖ్య కర్తవ్య మేమిగలదు?

కర్మము ప్రపంచ వ్యవస్థకు ఆధారశిల. మానవసమాజము కర్మ వలననె పురోభివృద్ధి కాంచును. సృష్ట్యాదియందె యీవిషయమును ప్రజాపతిబ్రహ్మ స్పష్టముగ చెప్పి యున్నాడు. శ్రీకృష్ణుని తాత్పర్యముకూడ యిదియే. సామాన్య పురుషులకంటె, హెచ్చు తరగతి పురుషులకు కర్తవ్యభారమధికము. లోకసామాన్య మానవుల మంచి చెడ్డలు, పెద్దవారి ప్రవర్తనపై ఆధారపడియున్నవి. కాబట్టే ఆత్మజ్ఞానిసైతము కర్మములను చేయుటె మంచిదని భగవంతుని తీర్మానము.

అర్జునుడు మొదటి అధ్యాయమునందు యుద్ధము చేయుట వలన వర్ణసంకరమేర్పడగలదని పలికెను. ఆ అభిప్రాయము తప్పనియు, యుద్ధమును మాని కర్మహీనుడగుటవల్లనే వర్ణసంకరము సంభవించగలదనియు భగవంతుడు ప్రదర్శించినాడు.

ఏ యుక్తి నాశ్రయించి చేసినచో లోకసంగ్రహార్థమై చేయదగిన కర్మములు నిర్దోషములై రాణింప గలవో—అట్టిప్రక్రియ మీాదటి శ్లోకమునందు చెప్పబడుచున్నది.

(శ్లో. 25) జ్ఞానియైనను అజ్ఞానియైనను కర్మములను మాని బ్రతుకుటయె సాధ్యముకాదని వెనుకనె చెప్పియున్నారు. అట్టియెడ, జ్ఞానియగువాడు అవలంబించెడి కర్మనీతి యేది?— ఆ విషయమే యీా శ్లోకమున చెప్పబడినది. అజ్ఞానిఫలాసక్తి గలవాడై కర్మములను ప్రేమించుచున్నాడు. జ్ఞానియో ఆసక్తిని వదలి కర్మములయందు ప్రవర్తించుచున్నాడు. కర్తృత్వాభిమానమును వదలి— అకర్త్రాత్మస్థితియందు నిలిచి జ్ఞాని కర్మముల నాచరించుచున్నాడు. జ్ఞానియొక్క కర్మల యందు అనుస్యూతమై యుండెడి నీతిసూత్రము అకర్త్రాత్మ భావనయే

చక్కగవిచారించినచో, కర్మమే లోకసంగ్రహమనికూడ తెలియుచున్నది. లోకమును ధారణచేయుటకు తగిన సామర్థ్యము కలదై యున్నది. జగత్తును ధరించుట కొరకై పరమేశ్వరుడు కర్మరూపమున వెలసియున్నాడు. కర్మరూపియగు పరమాత్ముడే లోకసంగ్రహమును కూడ చేయగల్గువాడు; కాబట్టి కర్తృత్వాభిమానమును

వీడి జ్ఞాని సృష్టి వ్యవస్థకొరకు సంప్రాప్తించిన కర్మముల నొనర్చు చుండును.

అజ్ఞానియగువాడు గ్రుడ్డివాని వలె యితర అజ్ఞానులను అనుకరించి పోవుచుండును. జ్ఞానదృష్టిగల జ్ఞాని తనకు తగిన మార్గమునందు జీవితమును ప్రవర్తింపజేయును. మార్గదర్శకమగు వివేకనేత్రము కలవాడు కాబట్టి జ్ఞాని సూటిమార్గము ననుసరించుచూ, లోకసంగ్రహ తత్పరుడై మెలగును. అజ్ఞానియొక్క కర్మములు లోకభక్షణ మొనర్చునవియై యున్నవి. సృష్టివ్యవస్థను కాపాడుటయందు జ్ఞానికి మిగుల శ్రద్ధ. ఈ ప్రపంచమును తన భోగాగ్నికి యింధనముగ చేసికొనవలె ననెడి దురాశ వానికుండదు. దైవీ స్వభావము వికసించుకొలది వానికి భోగేచ్ఛ క్రమముగ క్షీణించి పోవును. ప్రపంచముతోడి భోగ సంబంధము తొలగి త్యాగసంబంధ మేర్పడగలదు.

అర్జునా! ఈ ప్రపంచమును నీకు భోగ్యవస్తువుగ చేసికొన తలంచి యున్నావా? భోగేచ్ఛకలవాడు ప్రపంచమునకును తనకునుగల కర్తవ్యసంబంధమును మరచిపోవుచున్నాడు. భోగేచ్ఛను దూర మొనర్చినచో, సృష్టివ్యవస్థను సంరక్షించెడి కర్మమార్గము నీకు సులభము కాగలదు. అట్టియెడ, కర్మ ఫలమునందు గాక కర్మమునందె నీకు రుచి యేర్పడగలదు.

జ్ఞాని లోకసంగ్రహార్థమై కర్మల నాచరింపవలెనని యింతవరకు చెప్పబడినది. మరొక్క కారణముకూడ గలదు. కర్మాసక్తులగు అజ్ఞానులకు ప్రోత్సాహము కల్గించుటకై తాను వారికి ఆదర్శముగ నుండవలెను. ఆ సిద్ధాంతమును యీ క్రింది శ్లోకముతో ప్రతిపాదించుచున్నాడు.

(శ్లో. 26) జగచ్చక్రదృష్టి ననుసరించియూ, లోకసంగ్రహదృష్టి ననుసరించియూ, యీ రెండుకారణములనుబట్టి కర్మములను తప్పక ఆచరింపవలెనని యిందాక భగవంతుడు చెప్పెను. మరొక్క మూడవ కారణమును చెప్పుచున్నాడు.

ఓ అర్జునా! కర్తృత్వాభిమానులై స్వర్గాదిఫలముల నాశించి అజ్ఞానులగువారు యజ్ఞాదికర్మములందు పట్టుదల కలిగియుందురు. నేనీపనిని చేయుచున్నాను; దీనివలన లభించెడి ఫలముల ననుభవించెదను; అనెడి కామ్యబుద్ధి కలవారై యుందురు. అట్టివారికి జ్ఞాని బుద్ధి చలనము కల్గించరాదు. భేదభావ

మును పుట్టించరాదు. ఆత్మవగు నీవు అకర్తవు; అభోక్తవు; అని వారికి ఉపదేశించి సత్కర్మముల యందు వారికిగల పట్టుదలను భంగముచేయరాదు. లోకసంగ్రహాపేక్షగల తానును శ్రద్ధాభక్తులచే సత్కర్మముల నాచరించుచు వారిని కూడ మరింత శ్రద్ధావంతులగునట్లొనర్పవలెను. సత్కర్మముల నాచరించి అంతఃకరణ శుద్ధిని సంపాదించినవాడే అకర్త్రాత్మ జ్ఞానమును పడయుట కర్హుడగుచున్నాడు. అంతఃకరణశుద్ధి లేనివానికా ఉపదేశమున అధికారమే లేదు. అధికారము లేనివారికి అకర్త్రాత్మ జ్ఞానమును ఉపదేశించి సత్కర్మముల యందు వారికిగల శ్రద్ధను కూలద్రోయుట తప్పు. అటుల చేసినచో, కర్మగతియు జ్ఞానగతియు లేక వారు ఉభయభ్రష్టులై చెడిపోగలరు.

"అజ్ఞస్యార్ధప్రబుద్ధస్య
సర్వం బ్రహ్మేతి యో వదేత్ ।
మహానిరయజాలేషు
స తేన వినియోజితః ॥ "

తా॥ అంతఃకరణశుద్ధిలేక విషయములందు ప్రీతివహించి తెలిసి తెలియని తెలివితో కర్మాధికారియైయుండు అజ్ఞానికి "సమస్తమును బ్రహ్మస్వరూప"మని బోధించినచో, బుద్ధిపూర్వకముగ వానిని నరకకూపము నందు కూల్చినట్లగుచున్నది.

ఆ కారణమునుబట్టి వివేకియగు వాడు సత్కర్మములయందు తానును ప్రవర్తించుచూ, అజ్ఞానులను సైతము ప్రవర్తింపజేయవలెను. తదనంతరము అంతఃకరణశుద్ధి గల్గిన మీదట అఖండ బ్రహ్మోపదేశ మొనర్చినచో వారికి మహోపకారము చేసినట్లగుచున్నది.

కర్మములను చేయుటలో జ్ఞానియు అజ్ఞానియు సమానులె యైనను, జ్ఞానియందు కర్తృత్వాభిమానముండదు. అజ్ఞానియందా అభిమానముండును. వారిరువురికిగల విలక్షణత యిదియే.

(శ్లో. 27) ఓ అర్జునా! సత్వరజస్తమోగుణములే రూపముగా కలదియూ, మిథ్యాజ్ఞాన స్వరూపిణియూ, "దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం" అని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పినట్లైవడి పరమేశ్వరుని శక్తియై యుండునదియునగు మాయకు ప్రకృతియని పేరు గలదు. "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం" అని మరొక శ్రుతి చెప్పినది. "మాయయె జగత్తుకు మూల

ప్రకృతి; మాయోపాధి గలవాడు మహేశ్వరుడు" అని దానియర్థము. మాయాప్రకృతియొక్క వికారము లగు దేహేంద్రియాంతఃకరణములు కార్యకారణరూపమున పరిణమించి లౌకిక వైదిక కర్మములను ఆచరించుచున్నవి. ఇదియంతయు గుణ నాటకము. అంతియెకాని, అసంగ మగు ఆత్మ దేనికిని అంటుకొనుట లేదు; ఏ పనిని చేయుటలేదు. అట్లుండినను, అంతఃకరణమున వివేక శక్తి లేనివాడు కార్యకారణ సంఘాతమునందు ఆత్మత్వబుద్ధి నుంచును. వాడు అహంకార విమూఢాత్ముడు. ఆ అజ్ఞాని దేహాదులయందలి అధ్యాసవశమున కర్మములకు తానె కర్తనని భావించును. వానికి వివేకజ్ఞానము లేదు.

కానీ, యిందుకు ప్రత్యక్ష విలక్షణముగ జ్ఞాని అలరారును. ఆ విషయమే చెప్పుచున్నారు.

(శ్లో. 28) ఈ శ్లోకమునందు "తత్త్వవిత్తు" అనెడి పదము ప్రయోగింపబడినది. ఇందులోని "తు" అను పదము వెనుక చెప్పిన అజ్ఞాని పరిస్థితిని ప్రత్యేకించునదై యున్నది.

నేననెడి అభిమానమునకు విషయమైయుండెడి దేహ, యింద్రియ, అంతఃకరణములకు గుణములని పేరు. నావియనెడి అభిమానమునకు సంబంధించియుండు దేహేంద్రియాంతఃకరణ వ్యాపారములకు కర్మములని పేరు. ఈ నానాజడవస్తు వికారములకు విలక్షణమై, వాటిని ప్రకాశింపజేయునదై యుండు వస్తువును ఆత్మయందురు. అది స్వప్రకాశజ్ఞానరూపము; అసంగము. గుణసముదాయమును, కర్మసముదాయమును భాస్యములై జడములై వికారవంతములై యున్నవి. ఆత్మయో భాసకుడు; చేతనుడు; నిర్వికారుడు. ఇదియె గుణకర్మవిభాగము.

ఈ విభాగ వివేకముకల్గి స్వరూపము నెఱిగిన జ్ఞాని, వికారవంతములగు యీ దేహేంద్రియాది కరణములు తమతమ రూపాదివిషయములందు ప్రవర్తించుచున్నవె, కాని, నిర్వికారమగు ఆత్మ వాటియందు ప్రవర్తించుటలేదని చొక్కముగ తెలిసికొని కర్తృత్వాభిమానమును రోసినవాడగుచున్నాడు. ఇంద్రియములె గుణములు; వాటి వ్యాపారములె కర్మలు. ఆ గుణములకును ఆ కర్మములకును లంకె. దర్శనశ్రవణాది క్రియలు చక్షురాది యింద్రియములకును, వచనాదిక్రియలు

వాగాది యింద్రియములకును, సంకల్పక్రియ మనస్సునకును సంబంధించి యున్నదె; కాని ఆత్మకు యెద్దియు సంబంధించదు. ఈ ఆత్మ దేవుడు సదా కూటస్థుడై అసంగుడై చిద్రూపుడై యున్నాడు. ఇట్లు గుణవిభాగమును కర్మ విభాగమును నొనర్చి ఆత్మయొక్క యథార్థస్వరూపమును గుర్తించి తెలుసుకొన్నవానికి తత్త్వవిత్తని పేరు. తత్త్వవేత్తయగు జ్ఞాని గుణ వికారములగు ఆయా యింద్రియములు గుణవికారములై యగు ఆయా కర్మములందు ప్రవర్తించుచున్నవె; కాని, కూటస్థుడును — అసంగుడును — చేతనుడును నగు ఆత్మ ఆకనుట వినుట అనుట తినుట యనెడి క్రియలకు దేనికి సంబంధించక తూష్ణీంభావమున నుండువాడనియు నిశ్చయించి, నేను నాది యనెడి మిథ్యాభిమానములను పరిత్యజించి తాను శాన్తి స్థిమితముగ నుండును. ఈ స్వరూప జ్ఞానముకల్గి కర్మము నాచరించు వాడె కర్మయోగి.

కర్మసంగులగువారి బుద్ధికి వైకల్యమును కల్గించరాదని చెప్పిన విషయమును ప్రస్తుతముప సంహరించుచున్నారు.

(శ్లో.29) అర్జునా! ప్రకృతి గుణములకు మోహితులై అవిద్యాగ్రస్తులైన పురుషులు కర్మముల యందును వాటిఫలములయందును ఆసక్తులగుచున్నారు. వారు దేహాదులందు ఆత్మబుద్ధినుంచి స్వర్గాదిఫలములకొరకై కర్మములు చేయుచుందురు. తద్ద్వారా వారలు కర్మబంధమున చిక్కొనుచున్నారు. అల్పజ్ఞులును అల్పబుద్ధులునునగు అట్టి వారిని వారినిశ్చయమునుండి చలింపజేయుట జ్ఞానికి తగదు. తగిన సమర్థత కలుగువరకు వారు సకామ కర్మలయందే అభిరుచికల్గి ప్రవర్తించునట్లు సర్వవేత్తయగు జ్ఞాని ప్రచోదించుచుండవలెను.

(సశేషము)

[signature]

★



( అక్టోబరు సంచిక 19వ పేజీ తరువాయి. )

భా:— యస్య తు అజ్ఞానాత్ రాగాదిదోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన దానేన తపసా వా విశుద్ధసత్త్వస్య జ్ఞానముత్పన్నం పరమార్థతత్త్వవిషయం ఏకమేవ ఇదం సర్వం బ్రహ్మ అకర్తృ చ ఇతి తస్య కర్మణి కర్మప్రయోజనే చ నివృత్తే అపి లోకసంగ్రహార్థం యత్నపూర్వం యథా ప్రవృత్తిః తథా ఏవ కర్మణి ప్రవృత్తస్య యత్ ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్ కర్మ యేన బుద్ధేః సముచ్చయః స్యాత్.

అను:— అజ్ఞానంబుచేత, లేక రాగాదిదోషంబులవలన గర్మయందు బ్రవర్తించినవాడై యజ్ఞంబులచేత దానంబులచేత, లేక తపంబుచేత చిత్తశుద్ధియేర్పడి 'ఇదియంతయు (సమస్తప్రపంచము) నిష్క్రియము అద్వితీయమునగు పరబ్రహ్మమే' యనెడి పారమార్థిక జ్ఞానము ఎవ్వనికేర్పడినదో అట్టివానికి గర్మయు గర్మప్రయోజనంబును నివర్తించిన (పూర్తియైన) వగుచున్నవి; ఐనను ప్రారబ్ధవశంబున నొకవేళ లోకసంగ్రహంబు సేయుటకై ప్రయత్నపూర్వకంబుగా వెనుకటివలెనే కర్మయందు బ్రవర్తించినవానియందు ప్రవృత్తిరూపంబగు నే కర్మయైతే కన్పట్టుచున్నదో అయ్యది జ్ఞానంబుతోడి సముచ్చయంబుగలది గాజాలదు.

భా:— యథా భగవతో వాసుదేవస్య క్షాత్రకర్మచేష్టితం జ్ఞానేన సముచ్చీయతే పురుషార్థసిద్ధయే తద్వత్ ఫలాభిసన్ధ్యహంకారాభావస్య తుల్యత్వాత్ విదుషః.

అను:— భగవంతుడైన వాసుదేవుండు చేసిన క్షత్రియోచితంబైన కర్మ పురుషార్థసిద్ధికొఱకు జ్ఞానముతోబాటు కలిపిచేసినట్టిది యెట్లు కాజాలదో అట్లే జ్ఞానియైనవాని కర్మయు జ్ఞానసముచ్చయముగలది కాదు; ఏలన, ఫలేచ్ఛారాహిత్యము, అహంకారములేమియును ఉభయత్ర (భగవంతునియందును జ్ఞానియందును) సమానములు.

భా:—తత్త్వవిత్తు న అహంకరోమి ఇతి మన్యతే న చ తత్ఫలం అభిసన్ధత్తే.

అను:—జ్ఞానియైనవాడు 'నేను చేయుచున్నా'నని తలంపడు. (కర్తృత్వ బుద్ధి గలవాడు కాడు); కర్మఫలము నభిలషించెడివాడునుగాడు.

భా:—యథా చ స్వర్గాది కామార్థినః అగ్నిహోత్రాదికామసాధనానుష్ఠానాయ అహి తాగ్నేః కామ్యే ఏవ అగ్నిహోత్రాదౌ ప్రవృత్తస్య సామికృతే వినష్టే అపి కామే తత్ ఏవ అగ్నిహోత్రాది అనుతిష్ఠతః అపి న తత్ కామ్యం అగ్నిహోత్రాది భవతి.

అను:—మఱియు స్వర్గము మున్నగువాని రూపంబగు ఫలంబున కోరిక గలిగి అగ్నిహోత్రాదిరూపంబగు కామసాధనంబుల ననుష్ఠించుటకై అట్టి సకామకర్మలయందు ప్రవర్తించినవాడైన అగ్నిహోత్రికి సగముకర్మచేసిన వెనుక నట్టికోరిక (జ్ఞానమునందు కోరికకలిగి స్వర్గము నందలి కోరిక) నశించినను అదియే కర్మ అనుష్ఠించినను అగ్ని హోత్రాదిరూపంబగు నా కర్మ కామ్యకర్మ కాజాలదుగదా?

భా:—తథా చ దర్శయతి భగవాన్ 'కుర్వన్నపి' 'న కరోతి న లిప్యతే' ఇతి తత్ర తత్ర.

అను:—'చేయుచున్నను కర్మచే స్పృశింపబడడు' 'కర్తయగుటయులేదు; లిప్తుడగుటయులేదు' అని యిట్లే భగవానుడుగూడ అక్కడక్కడ విశదపఱచియున్నాడు.

భా:—యచ్చ 'పూర్వైః పూర్వతరం కృతమ్' 'కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకా దయః' ఇతి తత్తు ప్రవిభజ్య విజ్ఞేయమ్.

అను:—ఒక్క విశేషంబునుగలదు — 'పూర్వులు — పెద్దలు — కర్మ ననుష్ఠించిరి' 'జనకుడు మున్నగువారు కర్మచేతనే సిద్ధిని బడసిరి' అనునట్టి వాక్యంబును విడమర్చి యెఱుంగదగును.

భా:—తత్కథం, యది తావత్ పూర్వే జనకాదయః తత్త్వవిదః అపి ప్రవృత్తకర్మాణః స్యుః తే లోకసంగ్రహార్థం 'గుణాగుణేషు వర్తన్తే' ఇతి జ్ఞానేన ఏవ సంసిద్ధిం ఆస్థితాః, కర్మసంన్యాసే ప్రాప్తే అపి కర్మణా సహ ఏవ సంసిద్ధిం ఆస్థితాః న కర్మసంన్యాసం కృతవన్తః ఇతి ఏష అర్థః.

అను:—అది యెట్లన, పూర్వులు జనకాదులు తత్త్వవిదులుగా నుండియును గర్మననుష్ఠించిరను పక్షమున లోకసంగ్రహామునకై 'గుణాగుణేషు

వర్తన్తే' 'గుణంబులే గుణంబులయందు (గుణకార్యంబులైన ఆయాయి విషయంబులయందు) ప్రవర్తించుచున్న' వనెడి జ్ఞానంబు చేతనే సిద్ధింబడసిరి. అనగా గర్మసంన్యాసంబుసేయు యోగ్యత యుండియు గర్మననుష్ఠించుచునే (జీవితంబుగడపి) ముక్తినిబొందిరి; కర్మసంన్యాసమును మాత్రము చేసినవారుగారని యీవాక్యంబున కర్థంబుగా గ్రహింపదగును.

భా:—అథ న తే తత్త్వవిదః, ఈశ్వరసమర్పితేన కర్మణా సాధనభూతేన సంసిద్ధిం సత్త్వశుద్ధిం జ్ఞానోత్పత్తిలక్షణాం వా సంసిద్ధిం ఆస్థితాః జనకాదయః ఇతి వ్యాఖ్యేయమ్.

అను:—ఒకవేళ ఆ జనకాదులు తత్త్వవిదులయి యుండనిపక్షమున (తత్త్వవిదులు గాకముందు) సాధనరూపంబుగా నుండునదియు బరమేశ్వరార్పితమైనదియు నయిన కర్మచేత జిత్తశుద్ధిరూపమైనసిద్ధిని, అథవా జ్ఞానోత్పత్తిరూపమైన సిద్ధిని బడసియుండిరని యీ వాక్యంబును వ్యాఖ్యానింపదగును.

భా:—ఏతం ఏవ అర్థం వక్ష్యతి భగవాన్ 'సత్త్వశుద్ధయే కర్మ కుర్వన్తి' ఇతి.

అను:—'చిత్తశుద్ధికై కర్మననుష్ఠింతు'రనుచు నిదియే అర్థము భగవానుడు గూడ ముందు వచించును.

భా:—'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' ఇతి ఉక్త్వా సిద్ధిం ప్రాప్తస్య చ పునః జ్ఞాననిష్ఠాం వక్ష్యతి. 'సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ' ఇత్యాదినా.

అను:— 'తనకు విహితంబైన కర్మచే బరమేశ్వరునారాధించి మానవుడు సిద్ధిం (చిత్తశుద్ధిం) బడయునని పలికి సిద్ధినిబడసిన యతని నుద్దేశించి యీమీద 'సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ' ఇత్యాదిరూపంబగు వాక్యంబుచే జ్ఞాననిష్ఠ నుపదేశించును.

భా:—తస్మాత్ గీతాసు కేవలాత్ ఏవ తత్త్వజ్ఞానాత్ మోక్షప్రాప్తిః న కర్మసముచ్చితాత్ ఇతి నిశ్చితః అర్థః.

అను:—అందువలన అచ్ఛమగు జ్ఞానముచేతనే మోక్షప్రాప్తియగుగాని కర్మసముచ్చయంబుగల జ్ఞానంబుచేమాత్రము గాదని గీతలయందు నిర్ధారితమైన యర్థము.

భా:-యథా చ అయమర్థః తథా ప్రకరణశో విభజ్య తత్ర తత్ర దర్శయిష్యామః.

**అను:**-ఈ యర్థంబు ననుసరించి ప్రకరణసందర్భానుసారంబుగా నటనట నీ సంగతి విడమర్చి తెలియజేసెదము.

భా:-తత్ర ఏవం ధర్మసంమూఢచేతసః మహతి శోకసాగరే నిమగ్నస్య అర్జునస్య అన్యత్ర ఆత్మజ్ఞానాత్ ఉద్ధరణం అపశ్యన్ భగవాన్ వాసుదేవః తతః అర్జునం ఉద్దిధారయిషుః ఆత్మజ్ఞానాయ అవతారయన్ ఆహ.

**అను:**-ఇట్లు స్వధర్మంబునందు జిత్తవ్యామోహంబునొంది మిగుల దుఃఖసముద్రంబున మునింగియున్న యర్జునుని ఆత్మజ్ఞానంబుచే దక్క-తక్కి-న పద్ధతిచే నుద్ధరింప వీలులేని స్థితినెఱింగి భగవంతుండగు వాసుదేవుండు దుఃఖసముద్రంబునుండి యర్జును నుద్ధరింపదలంచి ఆత్మజ్ఞానముంగూర్చి ప్రస్తావించువాడై ఇటుల పలికెను.

శ్రీ భగవానువాచ:—

అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ నానుశోచ న్తి పణ్డితాః ॥

## గీతా భక్తులకు విజ్ఞప్తి.

మార్గశిర శుద్ధ ఏకాదశీ బుధవారం (16-12-53) శ్రీ గీతా జయంతి పర్వదినము. ఆ పవిత్రదినమున గీతాభక్తులెల్లరును భగవద్గీతా పారాయణము - గీతాచార్యునియొక్క-యు, శ్రీ వేదవ్యాసులయొక్క-యు అర్చనలు - గీతాప్రవచనములు - గీతోపన్యాసములు - గీతోత్సవములును జరిపి చిత్తశుద్ధిని సంపాదించి నిత్యానందమును బడయగల్గుదురని ప్రార్థించుచున్నాము.

గమనిక:— గీతాజయంతిని నిర్వహించిన అనంతరం వివరములను సంగ్రహంగా మేనేజింగ్ ఎడిటర్ - గీతావాణి, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా అనే చిరునామాకు తెలియజేయండి. గీతావాణి వార్తల్లో ప్రకటిస్తాం.

—గీతాసమితి కార్యదర్శి.

# గీతాతత్త్వము

రచయిత: శ్రీ దివాన్‌చంద్, M.A., Ph.D.,

అనువాదకులు: శ్రీ చాగాల నరసింహమూర్తిగారు.



(అక్టోబరు సంచిక 22-వ పేజి తర్వాత.)

సర్వ ఉపనిషత్తుల సారమును భగవద్గీత గ్రహించెను. అందువలననే ప్రతిఅధ్యాయాంతమున "ఉపనిషద్రూపమును, బ్రహ్మవిద్యయు"నని వచింపబడెను.

మహాభారతకాలము నాటికి ఆధ్యాత్మిక జీవితమున వేదోపనిషత్తులు, సాంఖ్యము, బౌద్ధచార్వాకాది సాంప్రదాయముల మధ్య నిత్య సంఘర్షణ ఏర్పడి భారతీయుడు నలుగుడు పడుచుండెను. ప్రాపంచిక, ఆధ్యాత్మిక సంయోగ జీవనవిధానమున కొటపట్టయిన వర్ణాశ్రమ ధర్మము సాంఖ్యబౌద్ధాది విపరీత వాదములవలన భ్రష్టమగుచున్నందున ఆర్యజాతీయులమధ్య తరచు తుపానులు రేగుచుండెడివి. ఇట్టి భీభత్సముల నివారించి భారతీయుడు ఇహపరలోక ఫలములను బడయుచు ప్రశాంతముగ జీవించుటకుగాను దేవకీ సుకుమారుడు శ్రీ కృష్ణపరమాత్మ వైదిక, సాంఖ్య, బౌద్ధ, చార్వాకాది విభిన్న సాంప్రదాయములను మిళితమొనర్చి గీతా సందేశమును నిమిత్తమాత్రుడగు పార్థుని ద్వార సర్వలోక సంరక్షణార్థము కురుక్షేత్ర సంగ్రామరంగమున ఉపదేశించెను. శ్రీ కృష్ణసందేశము త్రికాలములకు వర్తించును.

## 5. భగవద్గీతయందలి నీతిశాస్త్రము.

చాలకాలమువరకు భౌతికశాస్త్రము (Physics), మానసికశాస్త్రము (Psychology), నీతిశాస్త్రము (Ethics)లను వేదాంతమునందు అంతర్భాగములుగ పరిగణించిరి. ప్రస్తుతము వీటిని శాస్త్రములుగ శాస్త్రజ్ఞులు పరిగణించుచున్నారు కాని వేదాంతముతోగల సన్నిహిత సంబంధము నంగీకరించుటలేదు.

ప్రతిశాస్త్రము కొన్నిభావముల లేక సంకల్పముల (Postulates) ఆధారమున నభివృద్ధిచెందును. ఇట్టి భావముల శాస్త్రము ఆధారముగగొనుట సమంజసమగునా? యను విచారణ ఒక్కవేదాంతము (Philosophy) మాత్రమొనర్చును. నీతిశాస్త్ర మీ క్రిందిభావముల నాధారముగగొనును:

(1) మంచి, చెడుగులు రెండును ఉత్తర దక్షిణ ధృవములవంటివి. రెంటికి ఏమాత్రము పోలికలేదు. గమ్యస్థానము (Ideal) మనసు మెచ్చుటపడుటకు నిర్మించుకొనిన ఆదర్శము కాదు. గమ్యస్థానముయొక్క యునికి యథార్థమయినది. (2) నైతిక గమ్యస్థానము మానవుని తర్కమున కందుబాటులో

నుండును. మూలమునుగూర్చిన ఈ జ్ఞానము పరమజ్ఞానము కాకున్నను అసంపూర్ణ విజ్ఞానమనవచ్చును. (3) గమ్యస్థానపు లక్షణముల నెరిగినంతనే దానిని సాధించి అనుభవించుటకు మానవునందు సహజప్రేరణ శక్తికలదు. నైతికగమ్యమును కొంతవరకయిన మానవుడు చేరగలడు. నైతిక పరమావధి సనాతనమనియు, అట్టిస్థానమును మానవుడు గ్రహించగలడనియు, అట్టిమూల వస్తువును మానవుడు కొంతవరకయిన అనుభవింపగలడని నీతిశాస్త్రిమండలిమూలసిద్ధాంతము. ఈ మూడుభావములను మానసిక తత్వశాస్త్రము (Metaphysics) అంగీకరింపదు. ఈ శాస్త్రము ననుసరించి (1) గమ్యస్థానము కేవలము సంకల్పమాత్రము. మంచి, చెడుగు లనునవి యథార్థము కాదు. వానియునికి మనసునందుమాత్రమే. దీనిని నైతికదాస్య (Ethical subjuctivity) మందురు. (2) గమ్యస్థానము యథార్థము. దానిసంపూర్ణ తత్వమును గ్రహించుశక్తి మనకు లేదు. మూలమును గూర్చి ప్రచారమందున్న విభిన్నవాదములే మానవుడసమర్థుడగుటకు కారణము. ఈ సిద్ధాంతమును నైతిక అవిశ్వాస (Ethical Scepticism) మందురు. (3) మూలపదార్థము వాస్తవమయినను దాని తత్వమును మానవుడు పూర్తిగ గ్రహింపలేడు. కారణము బుద్ధి మూలమును గ్రహించునంతటి సామర్థ్యము కలిగియుండక పోవుటే. నిజమాలోచించిన బుద్ధియను పదార్థమేలేదు. ప్రపంచమునందలి వివిధపదార్థములందు మానవుడుకూడ ఒక పదార్థము. దీనిని నియతివాద (Determinism) మందురు.

మెటాఫిజిక్సువలె భగవద్గీతపై మూడు నైతికభావముల (Postulates) గూర్చి స్పష్టముగ జెప్పకున్నను వాటినిమాత్ర మంగీకరించును. నైతిక గమ్యస్థానమును గూర్చిగాని, నైతికప్రమాణమును గూర్చిగాని భగవద్గీత సక్రమ వాదోపవాదపూర్వకముగ వక్కాణింపదు. శ్రీ కృష్ణపరమాత్మ నీతినిగూర్చిన తన యభిప్రాయములను మాత్రమే వచించును. నైతికాదర్శమును గూర్చి వివరించుటకు నీతికి మూర్తిమంతమగు యోగిపురుషునిగూర్చియు, యోగి లక్షణములగూర్చియు గీతాచార్యులు 14 అధ్యాయమగు 'గుణత్రయ విభాగ యోగము'న 21 శ్లోకమునుండి 25 శ్లోకము వరకును, 12_వ అధ్యాయమగు 'భక్తియోగము'న 13 శ్లోకమునుండి 19 శ్లోకము వరకును, 5 అధ్యాయమగు 'కర్మసంన్యాస యోగము'న 18 శ్లోకమునుండి 29_వ శ్లోకము వరకును, 6 వ అధ్యాయమగు 'ఆత్మసంయమ యోగము'న 2 వ శ్లోకము నుండి 9 వ శ్లోకము వరకును వర్ణించెను. పదియవ శ్లోకమునుండి 28 వ శ్లోకము వరకు శ్రీ కృష్ణపరమాత్మ యోగమార్గమును ప్రబోధించి, యోగమార్గావలంబియై పరమయోగి యయినవాని స్థితిని 29 వ శ్లోకమునుండి 32 వ శ్లోకము వరకు వర్ణించెను. ఇచట శ్రీ కృష్ణపరమాత్మ నైతిక ప్రవక్తవలె విషయమును సుబోధకమొనర్చెను గాని వేదాంతివలె వచింపడు.

మానవుని మానసిక ప్రపంచము మూడు విధములు. (1) తెలుసుకొనుట (Knowing), (2) స్పృశించుట లేక యనుభవించుట

(Feeling), (3) అనుసరించుట(Acting). సనాతన పదార్థమును ఈ మూడుదశల ద్వార గ్రహించవచ్చును. బ్రహ్మపదార్థమును కొందరు జ్ఞానముగను, కొందరు పరవశత్వముగను, మరికొందరు చలనశక్తిగను పరిగణించెదరు. పరిపూర్ణతత్వమును చెందుటకు భగవద్గీతగూడ జ్ఞానయోగము, భక్తియోగము, కర్మయోగముల నాదేశించెను. పరిపూర్ణతత్వమును గ్రహించి మానవుడు సమ్యగ్జ్ఞానియగుట అంత సులభ విషయము కాదు. గీతాశాస్త్రము ననుసరించి సమ్యగ్జ్ఞత్వసిద్ధినొందుటే మానవపరమావధి. ఇట్టి సిద్ధినొందు మార్గమున మనమందరము మొదటి మెట్టునందే యుండియుందుము. సమ్యగ్జ్ఞానిస్థితి మనల నబ్బురపరచినను మన శీల సాంప్రదాయముల సరిదిద్దుకొనుట కంతగ నుపకరింపదు. సామాన్య మానవుని నైతిక ప్రవర్తన రూపొందుటకు గీతాచార్యులు 16 అధ్యాయమగు 'దైవాసుర సంపద్విభాగయోగమున 3 వ శ్లోకము వరకు సన్మార్గ లక్షణములను, 4 వ శ్లోకమున దుర్మార్గలక్షణములను సంక్షేపముగ వచించి 8 వ శ్లోకమునుండి 20 శ్లోకమువరకు దుర్మార్గలక్షణములను విపులముగ వివరించి చెప్పెను. 21వ శ్లోకమున దుర్గతికలిగించు లక్షణముల వచించి వాటిని విసర్జింపవలయునని 22 వ శ్లోకమున శ్రేయస్సుకు సాధనములైన మార్గములనుగూడ వివరించి మోక్షము బొందుటకవి ఆచరింపవలయునని శ్రీకృష్ణ పరమాత్మ మానవకోటికి దివ్యసందేశమొసంగెను. ఈ శ్లోకములందలి విషయము 'దంతే' (Dante) అను ఐరోపీయ వేదాంతి రచించిన 'డివైన్ కామెడి' (Divine Comedy) అను గ్రంథమునగూడ కలదు. సన్మార్గ దుర్మార్గ లక్షణముల విషయమున రెండు గ్రంథములు ఏకాభిప్రాయము కలిగియున్నవి.

మంచిగాని చెడుగాని మనసునందు పుట్టును. తీయగా తీయగా గాని రాగము కానటుల చేయగా చేయగాగాని ఈ పని మంచిది, ఈ పని చెడ్డది యని తెలియదు. మనము నిత్యము చేయు పనులందు ఏది మంచిది, యేది చెడ్డది యని తెలుసుకొనుటెట్లు?

'ఉపయోగితావాదము' (Utilitaria-nism) ననుసరించి ఏ పనియైన సుఖమయమైనఫలితముతో ముగిసిననది మంచికార్యము. ఈ సిద్ధాంతము ననుసరించి సుఖభోగాదులొసగునవియె సత్కార్యములు. దుఃఖమయమైనవి దుష్కార్యములు. ఒకకార్యమొసంగు ఫలితము కార్యమున కవలంబించిన పద్ధతిని సమర్థించునను సిద్ధాంతము (End Justifies the Means) ననుసరించి కార్యసానుకూల్యమున కనుసరించు పద్ధతి దుర్మార్గమయినను ఫలితము సంతోషదాయకముగ నున్న నది సన్మార్గమేయగును. మరియొక వాదము ననుసరించి మార్గము నీతిమంతముగ నున్నయెడల ఫలితము దుఃఖమయముగ నున్నను అది సత్కార్యమే యగును. (సశేషము.)

# గీతా సముద్రము

రచన: పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ స్వామి ఓంకార్ జీ.
శాంతిమిషన్, కైలాసాశ్రమం, వాల్తేరు.

★

( అక్టోబరు సంచిక 25-వ పేజీ తరువాయి. )

గీతలో అన్ని అధ్యాయములను కంఠస్థముగా వల్లించగలిగినంత మాత్రముచే ఎవరును తృప్తిజెందరాదు. "భగవద్గీతయందు జెప్పబడిన గూఢమైన బోధలను, మహోపదేశములను ఎంతవరకు నా దినచర్యలో, పనులలో, మాటలలో, ఆలోచనలలో అనుష్ఠించుచున్నాను?" అనియే ప్రతివ్యక్తియు తఱచు ఆత్మపరీక్ష చేసుకొనుచు, ప్రశ్నించుకొనుచుండవలెను.

శ్రీ రామకృష్ణ పరమహంస గీతాసారము నంతయుం ఒక చిన్నమాటలో నుడివియుండిరి. "గీత, గీత, గీత" అని సాధకులు నిరంతరము జపము జేయుచున్న 'గీత' అనెడి మాటయే "త్యాగి, త్యాగి, త్యాగి" గామారి గీతాసారమును బోధించుచున్నదనిరి. ధనమును, దైవమునుకూడా ఒకేసారి యెవ్వరును కొలువజాలరనియు, ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుటకంటె, సూదిబెజ్జములో ఒంటెదూరుట తేలికయని శ్రీ ఏసుక్రీస్తు నుడివియుండిరి. గీతాసారమైన 'త్యాగమే' భక్తులకైనను, యోగులకైనను, జ్ఞానులకైనను మూలాధారముగను పునాదిగాను యున్నది.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం
ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ
స్తస్మాదేత త్త్రయంత్యజేత్॥

నరకమునకు కామ, క్రోధ, లోభములను మూడుదారులు గలవని శ్రీకృష్ణభగవానులు గీతలో పై శ్లోకమునందు నుడివియుండిరి. ఇవి ఆత్మను అధోగతికి సర్వదా ఈడ్చుచున్నవి. ఈ ద్వారములను ప్రవేశించిన మనుజుడు అధోగతిని తప్పక చేరును. కనుక ఈమూడింటిని త్యజించుటకు నిరంతరము సాధనచేసి, కృషిజేయుటముఖ్యకర్తవ్యము.

ఏ మనుజుడు తన హృదయములో కోరికల నన్నింటిని వదలి నిజతత్వమును గుర్తెరిగి దానిలోనేతృప్తి బొందుచుండునో, ఎవ్వని హృదయములోనికి, నదులన్నియు సముద్రములోనికి ప్రవహించునట్లు కోరికలన్నియు ప్రవేశించినను స్థిరచిత్తుడై లేశమైన చలనములేక సముద్రమువలె పరిపూర్ణుడై యుండునో, అట్టి ఆత్మవిదుడే స్థితప్రజ్ఞుడని భగవద్గీతలోని సాంఖ్యయోగమునందు యీ క్రింది శ్లోకములో చెప్పబడియున్నది:

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్।
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
స శాన్తిమాప్నోతి నకామకామీ॥

కాన, నిష్కామముగా ఎవరికి విధించబడిన పనులను వారి స్వధర్మమాననుసరించి, హృదయ పూర్వకముగా స్వలాభముకొరక, మనః పూర్వకముగా ఈశ్వరార్పణ బుద్ధితో జేయువారే శాంతిని పొందుదురు.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజైర్గుణైః ॥

,, కర్మణ్యకర్మ యః పశ్యే
దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

ఏదో ఒకకర్మ చేయకుండ ఎవ్వరును ఒక క్షణమైనను ఉండజాలరు. గాన, వారు జేయుకర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూచువారు మనుష్యులలో బుద్ధిమంతులని శ్రీ కృష్ణభగవానులు పైన వ్రాయబడిన శ్లోకములో నుడివియుండిరి.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః
సమదుఃఖసుఖః క్షమీ ।

,, సంతుష్టః సతతం యోగీ
యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధి
ర్యోమద్భక్తః స మే ప్రియః॥

సుఖదుఃఖములలో, కలిమిలేములలో, శీతోష్ణములలో, మానావమానములలో, సమచిత్తముతో, అచంచలమైన మనస్సుగలిగియుండువాడే శ్రీ కృష్ణ పరమాత్మకు అత్యంత ప్రియుడని పైన వ్రాయబడిన శ్లోకములలో గీత స్పష్టముగా బోధించుచున్నది. ఇటులనే గీతాశ్లోకములను ఒక్కొక్కదానిని మనము విమర్శించిన, గీతా సముద్రమునకు అంతు, ఆదియు కనిపించక దరిలేకుండ యీవ్యాసము పెరుగును. గావ మనము గీతాసారమునే గ్రోలుచు తృప్తిని పొందెదము గాక!

గీతనంతను నిత్యము పారాయణజేయుట సులభము గాని, క్లిష్ట పరిస్థితులలో సమత్వమును, శాంతిని వ్యక్త పఱచుట బహు కష్టము. ఏ పరీక్షలులేనియెడల అందరును వేదాంతులే. ఈపరీక్షలవలననే మనకు శమదమాదులు యున్నదీ లేనిదీ, అందరిలో దైవమును గాంచగలిగినదీ లేనిదీ నిర్ధారణ యగును. ఉపకారికి అపకారము జేయువారిలో దైవమును గాంచుటకును, వారిని ప్రేమించుటకును గీతా తత్వమును అనుభవింపవలెను.

సర్వములో, అన్ని నామరూపములలో, దైవమునే దర్శించవలెనని పఠించుట సులభముగాని, ఒక విషసర్పము చెంతను జేరినప్పుడు భయముతో వణకుచు దానిని కఱ్ఱతో చంపుటకు బదులు విషపురుగులో గూడ నిత్యమైన సత్ పదార్థమునే గాంచుటకు గీతానుభవము ముఖ్యావసరము. అటులనే గీతాపరాయణులు గీతామృతమును వారి మనో వాక్కాయ కర్మలలో వ్యక్తపరుచుచు, తాము అట్లు జీవించుచుంటిమో లేదో యని ఎవరి జీవితములను వారు స్వీయపరీక్ష జేసుకొనుచుండవలెను.

(సశేషము)



# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము

శ్రీ కిళాత్తూరు - శ్రీనివాసాచార్యులు.

( అక్టోబరు సంచిక 29-వ పేజీ తరువాయి. )

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6

,, కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7

భాష్యం:- ఏవం యుద్ధమారభ్య నివృత్తవ్యాపారాన్ భవతో ధార్తరాష్ట్రాః ప్రసహ్య హన్యురితి చేత్, అస్తు। తద్వధలబ్ధవిజయాత్ అధర్మ్యాత్, అస్మాకం ధర్మాధర్మౌ అజానద్భిః తైః హననమేవ గరీయ ఇతి మే ప్రతిభాతీత్యుక్త్వా "యత్ మహ్యం శ్రేయ ఇతి నిశ్చితం తత్ శరణాగతాయ తవ శిష్యాయ మే బ్రూహి" ఇతి అతిమాత్రకృపణో భగవత్పాదా ఉపససాద ॥

అను:- "ఈ విధముగ యుద్ధమునుప్రారంభించి మానుకొనిన మిమ్ములను ధార్తరాష్ట్రులు బలాత్కారముగా చంపుదురనిన - అగుగాక. వారి (దుర్యోధనాదుల) వధమువలన లభించు అధర్మమైన విజయమునకన్న ధర్మాధర్మముల నెరుంగకయున్న వారివలన మేము చంపబడుటయేగొప్పదని నాకు తోచుచున్నది." అనిచెప్పి "ఏయ్యది నాకు శ్రేయస్కరమని నిశ్చయింపబడినదో అద్దానిని శరణాగతుడైన - నీశిష్యుడైన - నాకు చెప్పు" మని మిక్కిలి కృపణుడై భగవంతుని పాదములకడ కేగెను.

వి శే:- "కార్పణ్యదోషోపహతస్వభావః" కార్పణ్యమనెడి దోషము చేత తిరస్కరింపబడిన స్వభావముకలవాడై. కార్పణ్యం = కృపణ ధర్మము. కృపణుడనగా త్యాగము చేయవలసినవానిని త్యాగము చేయనివాడు. ప్రకృతమున అర్జునుడు శోకమోహములను త్యజింపవలసినవాడు. అట్లుగాక, వానిని తనవద్దనే వుంచుకొన్నం దున అతను కృపణుడాయెను. అనగా అతనియందు కార్పణ్య మనెడి దోష మున్నది. ఆ దోషమువలన అతని స్వభావమైన ధైర్యము దిగజారినది.

కొందరు కార్పణ్యమనగా=దయను కల్గించెడి దీనవృత్తియని వ్యాఖ్యానించుచున్నారు.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్ ।
అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యం ॥ 8

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ॥ 9

భాష్యం:- ఏవం అస్థానసముపస్థితస్నేహకారుణ్యాభ్యాం అప్రకృతిం గతం, క్షత్రియాణాం యుద్ధం పరమధర్మమపి అధర్మం మన్వానం, ధర్మబుభుత్సయా చ శరణాగతం పార్థముద్దిశ్య, ఆత్మయాథాత్మ్య జ్ఞానేన, యుద్ధస్య ఫలాభిసంధిరహితస్య ఆత్మప్రాప్త్యుపాయతాజ్ఞానేన చ వినా అస్య మోహో న శామ్యతీతి మత్వా, భగవతా పరమపురుషేణ అధ్యాత్మశాస్త్రావతరణం కృతమ్। తదుక్తం:-

* శ్లో॥ అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియాకులమ్ ॥
పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్ ॥

---

* ఈ శ్లోకము శ్రీమద్ యామునముని ప్రణీతమైన గీతార్థ సంగ్రహములోని 5-వ శ్లోకము.

అను:— ఇట్లు అస్థానమున సముద్భవించిన స్నేహమువలనను కారుణ్యము వలనను వ్యాకులత చెందినవాడును, క్షత్రియులకు యుద్ధము పరమధర్మమైనప్పటికిని అధర్మమని తలంచినవాడును, ధర్మము నెఱుంగగోరి శరణుపొందినవాడునగు పార్థునిజూచి, ఆత్మయాథాత్మ్యజ్ఞానమున్ను, ఫలాపేక్షను వదలి చేయబడు యుద్ధము ఆత్మప్రాప్తికి ఉపాయమను జ్ఞానమున్ను కలుగనిచో వీని (అర్జునుని) మోహము శమింపదని తలంచి, భగవంతుడైన పరమపురుషునిచే అధ్యాత్మశాస్త్రము అవతరింపజేయబడెను. అదియె పూర్వాచార్యులవలన "అస్థాన స్నేహకారుణ్యా" అను శ్లోకముచే నిరూపింపబడినది.

విశే:— 'ఆత్మయాథాత్మ్యజ్ఞానం=అనగా ఆత్మ నిత్యుడనియు, భగవంతునికి అధీనుడనియు తెలియుట. ఈ భగవదధీనత్వమునే "భగవచ్ఛేషత" యని విశిష్టాద్వైత సంప్రదాయమున పల్కుదురు.

అధ్యాత్మశాస్త్రం = (ఆత్మని ఇతి=అధ్యాత్మం) ఆత్మనుగురించిన శాస్త్రమునకు అధ్యాత్మశాస్త్రమనిపేరు. శ్రీభగవద్గీత అధ్యాత్మశాస్త్రమెట్లుకాగలదను విషయమున ఆక్షేప సమాధానము లీతీరున నున్నవి:

ఆక్షేపము:— అర్జునుడు యుద్ధరంగమున స్నేహకారుణ్య ధర్మాధర్మబుద్ధిచే వ్యాకులతచెంది, తనకు శ్రేయస్కరమైనదానిని చెప్పమని శ్రీకృష్ణుని శరణుపొందెను. అట్టితరి శ్రీకృష్ణుడు యుద్ధముచేయ తగునా చేయతగదాయను విషయమున ఒక్క నిశ్చితాభిప్రాయమును అర్జునునికి తెలుపుట సమంజసమేకాని, రాగల అధ్యాయములలో చెప్పినటుల కర్మజ్ఞానభక్తియోగాది విషయముగు శాస్త్రము నుపదేశించుట పొసగదు; అది అపృష్టోత్తరము. అర్జునుడు

వానిని ఉపదేశింపమని కోరలేదుగదా! ముఖ్యముగా రహస్య — రహస్యతర — రహస్యతమమైన విషయములను శిష్యునియోగ్యత నెరుంగక, త్వరపడి ఉపదేశించుటయు అయుక్తము. అదియును గాక "తస్మాద్యుధ్యస్వభారత=అందువలన యుద్ధము చేయుము" "యుద్ధ్యచ = యుద్ధముచేయుము" అని రాగల వచనములచే ప్రకరణమునుబట్టి యుద్ధమునేప్రోత్సహించునట్లు తెలియుచున్నది. కనుక పై కారణములచే "భగవద్గీత" అధ్యాత్మశాస్త్రము కానేరదు.

సమాధానము:— "యచ్ఛ్రేయః స్యాత్ =ఏది నాకు శ్రేయస్కరమో" అను మాటలో అర్జునుడు యుద్ధమునే శ్రేయస్సని తలంచెనని చెప్పుటకువీలులేదు. పరమ ఆస్తికుడైన అర్జునునికి, భగవంతుడు సమీపమున నున్నప్పుడు, ప్రస్తుత యుద్ధవ్యాజముతో పరమ నిశ్శ్రేయస పర్యంతము జిజ్ఞాస కల్గుటకు వీలున్నది. లేదా,అతనికి యుద్ధవిషయ జిజ్ఞాసమాత్రమున్నదందురా — అగుగాక. భగవంతుడు పరమ కారుణికుడగుటంబట్టి, పార్థుడు సామాన్యముగా పల్కిన "యచ్ఛ్రేయః" అనుపదము నవలంబించి అర్జునునికి పరమ హితము నుపదేశించెననియే భావించుట తగియున్నది. "యుధ్యస్వ" మొదలగువానిచే యుద్ధము పరమనిశ్శ్రేయస్సునకు సాధనమని అచ్చటచ్చట స్పష్టీకరింపబడియున్నది. కనుక భగవద్గీత "అధ్యాత్మశాస్త్ర"మను విషయము సిద్ధము.

"గుడాకేశః" — గుడాకములనగా = నిద్రాలస్యములు — వానిని జయించినవాడు గుడాకేశుడు — అర్జునుడు.

"గోవిందం" — గాః = వాక్కులను, విందతే = పొందినవాడు, అర్జునుని శోకమోహముల తొలగునట్లు చేయుగల వాక్సామర్థ్యము కలవాడను భావముతో ఈ శబ్ద ప్రయోగము.

ఓమ్.

# శ్రీ త్రైతసిద్ధాంత భగవద్గీత

## 14. గుణత్రయ విభాగయోగము.

రచన: శ్రీ మహర్షి మలయాళస్వాములవారు

శ్లో॥ భగవద్గీతా కించిదధీతా గంగాజల లవకణికా పీతా ।
సకృదపి యేన మురారిసమర్చా క్రియతే తస్య యమోఽపి న చర్చామ్॥

తా॥ ఎవఁడు భగవద్గీతను కొంచముగానైనను యధ్యయనముచేసియున్నాఁడో, గంగానదిలోని యొకనీటి బిందువునైన త్రాగియున్నాఁడో, ఒకసారియైనా భగవంతుని యర్చించియున్నాఁడో యట్టివాని విచారమును యముఁడుకూడా చేయఁడు (యముఁడు గూడ దరిఁజేరఁడు).

మూఁడు గుణములచే జీవుండెట్లు బద్ధుండగునో ఆ విషయమునుగూర్చి చెప్పినదగుటచే నీ యధ్యాయమునకు గుణత్రయవిభాగయోగమని పేరువచ్చినది. గీతయందంత ప్రాముఖ్యతగల యధ్యాయము మరియొకటిలేదు. ఇది జ్ఞానయోగమునఁజేరినది. చాల మేధాసంపత్తిగలవారికి మాత్రమే యిది యర్థమగును. చిత్తశుద్ధియు, ఏకాగ్రతయు గలవారలకు విద్య లేనప్పటికిన్ని యిది యర్థమగును. మహాపండితులైనను అంతఃకరణ శుద్ధియు, చిత్తైకాగ్రతయు, సంయమమున్ను లేనిచో నిది యర్థముకాదు. నేత్రముగలవారు విద్యలేనివారైనను, నేలాగున సూర్యునిఁజూడఁగల్గుదురో, నేత్రహీనులైనవారు నెంత శాస్త్రపాండిత్యము గల్గినవారైనను నేలాగున చూడఁజాలరో, బ్రహ్మవిద్య యొక్క రహస్యమున్ను నిట్టిదే. ఇది కఠినభాగమగుటచే మొదటి శ్లోకములో శ్రీభగవానులు ఇది జ్ఞానములన్నిఁటిలోను ఉత్తమజ్ఞానమనియు, ఋషులందరును నిట్టి జ్ఞానముగలవారగుటచే నా జన్మలోనే ముక్తినిబొందిరనియు చెప్పుటకు కారణము. ఈశ్వరస్వరూపమగు ఆత్మకు మాలిన్య మెవ్విధమునఁగలిగినది, దేనివలన ప్రకృతియందు బంధింపబడినది, మరల నెట్లు నీ మాయామాలిన్యమునుండి తొలగును, యేలాగున దానికి ప్రకృతిబంధమునుండి విముక్తిగల్గును, ప్రకృతిదోషము నశించి విముక్తినొందిన జీవుఁడేలాగున నుండును, ప్రకృతిదోషము నశించుటకు ముఖ్యసాధన మెద్ది, ఎవరెవరు నేయేగుణములతో గూడియుండిరో యెట్లు తెలియును, ఏయేగుణము గల్గియుండునపుడు దేహమును వీడిన నేయేలోకమును జెందును, మరల నతనికి నేజన్మముగలుగును, జీవన్ముక్తుని లక్షణమెటువంటిది మున్నగువిషయములన్నియు నిందు విశదముగా తెలుపఁబడినవి. స్వయముగఁ దెలిసికొన సమర్థతలేనివారు గొప్ప మేధాసంపత్తిగలవారును, ఆత్మజ్ఞానులును నగువారి

యొద్ద నీ యధ్యాయమునం దెలిసికొనుటయే మేలు. దీనియందు శుష్కవేదాంతమునకు తావు లేదు. ఏలన, గుణములు యింద్రియములకు స్వభావములనియు 'నీవు సాక్షిగా నున్నట్లు తలంచిన చాలు'ననియు, అట్లైన నేకార్యము చేసినను బంధములేదనియు చెప్పెడు వాక్య మసత్యప్రలాపమని యీ యధ్యాయము భేరీనాద మొనర్చి చెప్పుచున్నది. ఇది సత్యవేదముయొక్క నిజార్థము. గుణములు నింద్రియములకు స్వాభావికములు గావనియు, యవి కర్మ సంస్కారము ననుసరించి ఆగంతుకముగ వచ్చి చేరినవనియు, నట్టిదోషములు రహితములు కావలయుననియు శ్రీ భగవాను లుపదేశించిరి. ఈ విషయము రెండవ యధ్యాయములోఁగల — "మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ" అను శ్లోకమున వ్యక్తీకరింపఁ బడినది. ఆగంతుకమనఁగా మధ్యవచ్చిచేరునది. ఎట్లన, వస్త్రముయొక్క నిజరూపము తెలుపైనను, రంగులచే ననేకవర్ణములుగ గన్పించును. అది, యసలు వస్త్రముయొక్క స్వభావము గాదనియు, రంగులచే గల్గినదనియు నెట్లు గ్రహించుచున్నామో, ఆలాగున జీవునియొక్క స్థితినిగూర్చియు ముముక్షువులు తెలిసికొనవలెను. ఎటువంటి రంగు వస్త్రమైనను ద్రావకములోవేసి, ఉడుకబెట్టి, ఉడికిన, రంగులన్నియు వదలిపోయి తెలుపువర్ణము తేలునట్లు, దైవచింతనలో మగ్నులై, ధ్యానములోమునిగి, భవదోషము గలుగనీయక చూడవలెనని నీ యధ్యాయముపదేశించుచున్నది. ఇందు మూఁడుగుణములు మాత్రమే చెప్పిరేగాని విశుద్ధగుణమును చెప్పలేదని కొందరు తలంపవచ్చు. గుణత్రయాతీతుని లక్షణము నీ యధ్యాయమునఁ జెప్పియుండుటచే నట్టిసందేహము కలుగుటకు నవకాశములేదు. భగవద్భక్తియను ద్రావకములో జీవుని శుద్ధమొనర్పవలెనని నీయధ్యాయమున, సాఖరున భగవానులుపదేశించిరి. కావున నిర్మలమైనభక్తి యొక్కదానివలననే ప్రకృతిదోషములన్నియు తొలఁగి జీవకోట్లు భగవత్ప్రాప్తిని బడయఁగలవు. కావున ముముక్షువులందరున్ను, భక్తులందరున్ను, తక్కినవారందరున్ను, నీప్రకృతిగుణములో నేవి తమయందుగలవో విచారించుచు, వానిని కనిపెట్టి యట్టిదోషములు తమయందు లేకుండునట్లు చూడవలెను. ఈ యధ్యాయమున నీశ్లోకము ముఖ్యము:

**శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

దేహము గలుగుటకు కారణభూతమైన సత్త్వరజస్తమోగుణములను దేహి యెప్పుడతిక్రమించునో, అప్పుడతఁడు జన్మమృత్యుజరాదుఃఖములచే విడువఁబడి మోక్షము నొందును.

ఓం తత్ సత్.

# యజ్ఞరహస్యము.

దూరంగా అగపడే ప్రాచీనకాలంనుండీ యజ్ఞాలు ప్రచారంలోకి వచ్చాయి; వ్యాప్తిలోకి వచ్చాయి. యజ్ఞాలు చేయుట - వాటి ఫలాలను అనుభవించుట, యిది ఒక పరిపాటి. యజ్ఞము చేసినవానికి యిష్టార్థఫలసిద్ధి లభించిందన్నమాటే. విధివ్యతిక్రమం జరిగితేనో, సాధనశుద్ధి లేకపోతేనో, మంత్రోచ్చారణ విపర్యస్తమైతేనో, యజమానుడును అధ్వర్యుడును ఆచార భ్రష్టులైతేనో తప్ప యజ్ఞము తప్పక ఫలించే తీరుతుంది. "యజ్ఞో వై విష్ణుః" - యజ్ఞమనిన సాక్షాత్తు విష్ణుస్వరూపమే. యజ్ఞంలో వేల్చిన హవిస్సు, అగ్నిముఖంగా దేవతలను చేరుతుంది. కాబట్టే, అగ్నిహోత్రునికి హవ్యవాహుడనికూడ పేరు. ఈ యజ్ఞభాగంకోసం - హవిర్భాగం కోసం, పూర్వకాలంలో దేవలోకమందు యుద్ధాలుకూడ జరిగినవి. ప్రసిద్ధమగు దక్షాధ్వర ధ్వంసము ఆ విషయానికి సంబంధించినదే.

ద్రవ్యయజ్ఞము:- ద్రవ్యము - దేవత - మంత్రము; యీ మూడింటి సమీకరణంతో జరిగే యజ్ఞము ద్రవ్యయజ్ఞము. ద్రవ్యమంటే సామగ్రి; మంత్రమునిన వైదికమంత్రాలు. ఎవరిని ఉద్దేశించి యజ్ఞం చేయబడ్తుందో, అది దేవత. విష్ణుయాగము, రుద్రయాగము; ఈలాంటివన్నియు ద్రవ్యయజ్ఞాలు. వ్యక్తిగతముగను, సమష్టిగనుకూడ యీ యజ్ఞాలు శుభంకరాలు. యజ్ఞకర్త స్వర్గాది లోకాలను పొంది, పుణ్యసంచయము క్షీణించినంత మర్త్యలోకానికి దిగివస్తాడు.

తపోయజ్ఞము:- ధర్మసాధనకొఱకై మనోవాక్కాయములను తపింపజేస్తే తపోయజ్ఞమంటారు. తన్ను తాను దండించుకొనుటేకాని యిది పరహింసకాదు. మనోవాక్కాయాలకు అప్రయత్నంగా వచ్చిన కష్టాలను అధివ్యాధులంటారు. అవి పాపఫలాలు. పాపాన్ని నిమిత్తంగా చేసుకొని ప్రకృతి, మానవునికి వ్యాధులను కల్గిస్తుంది. ప్రయత్నపూర్వకంగా శరీరేంద్రియాలకు యిచ్చే కష్టము తపస్సు. కాని, సాంసారిక కార్యాలకొఱకు పడే అగచాట్లు తపస్సు కాదు. దృష్ట (ప్రత్యక్ష) ఫలాన్ని ఆశించక, ధర్మమే ప్రధానలక్ష్యంగాపెట్టి, శరీరేంద్రియ మనస్సులకు యిచ్చే కష్టాన్ని తపస్సంటారు. అదే తపోయజ్ఞము. శివరాత్రి వేళల్లో, కృష్ణాష్టమినాడు, ఏకాదశిపూట నిరాహారియై ఉపవసించి శరీరాన్ని తపింపజేయుట తపోయజ్ఞము. అంతేకాని, ఫలాహారమనే సాకుతో డబుల్ నేరు పాలను స్వాహాచేయడం, డజను అరటిపండ్లు దిగమ్రింగి కూర్చోడం, ఉపవాసంకాదు; తపస్సు అసలేకాదు.

అన్నము దొరకక పస్తుండుట తపస్సు కాలేదు. అందుకు అన్నాభావమె కారణము కానిధర్మముకాదు. శరీరానికి కల్గే కష్టానికి ధర్మము హేతువైనపుడే తపోయజ్ఞం కాగల్గుతుంది. వ్యాధిబాధవలన వెనుకటి పాపముమాత్రము క్షయిస్తుంది. తపస్సువలన పాపముక్షయించి పుణ్యమూ సిద్ధిస్తుంది.

మంచిచెడ్డ జన్మలకూ, శ్వాసోచ్ఛ్వాస రూపమగు ఆయుస్సుకూ, సుఖదుఃఖ భోగానుభవమునకూ పాపపుణ్యాలే కారణాలు. పుణ్యమెంతో సుఖమంతే; పాపమెంతో దుఃఖమంత. సుఖదుఃఖాలు పుణ్యపాపాలవల్ల ఏర్పడ్డవి. ఆ ఏర్పాటుకు ఆధారం వానివాని ఉద్దేశాన్ని బట్టి వుంటుంది. మంచివలనకూడ దుఃఖాన్ని పొందొచ్చు. ధర్మంకోసం పొందే దుఃఖం, పుణ్యోత్పత్తికి సాధనంగా వుంటుంది. ఆ పుణ్యంవలన ఆత్మోన్నతి సిద్ధిస్తుంది.

పుణ్యంవల్ల కల్గేసుఖాన్ని అనుభవించుటలో కూడ రెండుమార్గాలున్నాయి మద్యపానంచేసి, వ్యభిచరించి పొందేసుఖం, మీదట పాపాన్ని సంభవింపచేస్తుంది. ధర్మానుకూలమైన సుఖానుభవంవలన ఉత్తరోత్తరాకూడ పుణ్యము కూడివస్తుంది.

పాపఫలితాలై సిద్ధించిన దుఃఖాలను త్రికరణాలద్వారా అనుభవిస్తూ ధర్మానికి అనుకూలంగా చేసికోడం తపస్సంటారు. ఆ దుఃఖానుభవం ఉత్తమగతిని — ఊర్ధ్వగతిని కల్గిస్తుంది.

శరీరాన్నీ యింద్రియాలను మనస్సునూ శ్రమింపజేసి మనుష్యుడు యీ లోకానికి కావలసిన ఆస్తిని సంపాదిస్తూన్నాడు. పరలోకానికి పనికివచ్చేటట్లు సంపాదించవలసిన ఆస్తియేది? అదే తపస్సు.

యోగయజ్ఞము:— చిత్తవృత్తుల నిరోధాన్ని యోగమంటారు. మనస్సును పరమాత్మునియందు సంలగ్నము చేయుటే యోగము. మనస్సును వశము చేసుకొనుట దుర్ఘటమైనపని. ధారణాధ్యానసమాధులని మూడును యోగమందలి విభాగకర్తవ్యాలు. మొదటిది ధారణ. తర్వాత ధ్యానము; ఆపై సమాధి. అనేక సంయమనియమాల నవలంబించి మనస్సును ఏకాగ్రంచేసి ఈశ్వరునియందు పొందించిపెట్టుట ధారణ అంటారు.

ధారణకును ధ్యానమునకును మధ్య కొన్ని ప్రతిబంధవిఘ్నాలున్నాయి. మొదట తంద్రావస్థ వస్తుంది. ఆమీదట శూన్యావస్థ. ఆ రెంటిని జయించిన తర్వాతనే ధ్యానభూమిక సిద్ధించునది. ధ్యానానికి సమాధికి మధ్య, రసాస్వాదమనే విఘ్నం ఎదుర్కొంటుంది. ధ్యానానికి కూర్చొన్నవాని వృత్తినిరోధమైనంతటనే ఒక అపూర్వమైన ఆనందమేర్పడుతుంది. దాన్ని దాటిపోవాలనే యిష్టమే వుండదు. ఇది సమాధికి విఘ్నము. దాన్ని జయించాలంటే వైరాగ్యవృత్తి ప్రబలంగా వుండాలి. అప్పుడే సమాధి సిద్ధిస్తుంది. దాన్నే యోగయజ్ఞమంటారు. దృఢదీక్ష కల్గినవాడే యోగయజ్ఞాన్ని సాధించగల్గేవాడు. అట్టివాడు విఘ్నాలకు జడియరాదు.

జీవుడూ యీశ్వరుడూ యిద్దరును యీ శరీరరూప పంజరంలోనే వున్నారు. జీవుడున్నచోటే దేవుడును వున్నాడు. ఎచ్చటో దూరదూరంలోలేడు. నీధైర్యాన్ని పరీక్ష చేసేకోసం చాటుమాటైయున్నాడు. తెగబడి ముందడుగు వేసేవానికి చేయూతనిస్తాడు.

స్వాధ్యాయయజ్ఞము:— మోక్షశాస్త్రాలను శ్రద్ధాభక్తులతో చదువుట స్వాధ్యాయమంటారు. భగవంతుని పవిత్రనామాన్ని

నియమంతో జపించుటకూడా స్వాధ్యాయమే. ఆ దృష్ట్యా యీ యజ్ఞాన్ని జపయజ్ఞ మనికూడా అనొచ్చు.

"అనిత్యమసుఖంలోకం" - అని గీతాచార్యుని సందేశము. ప్రపంచము అస్థిరము. ఒకానొకరోజు వదిలేతీరాలి. సాంసారిక పదార్థాలు అశాశ్వతాలు. భోగించేటపుడు సుఖంగా అగపడినా యథార్థానికి సుఖరూపాలుకావు. సుఖాభాసాలు. వీటినినమ్మివుండరాదు. తన విశ్వాసం భగవంతునిపై పెట్టాలి. ఈ లోకంలో-యీ పదార్థాలలోవుండే నీవు నన్ను భజిస్తూండుమని శ్రీ కృష్ణుడు ఉపదేశించాడు. అప్పుడే యీ జీవితనౌక సంసారసముద్రానికి అద్దరి చేర్తుంది. ప్రపంచంలోవుండి భక్తినివదిత్తే, యీ ప్రపంచం సుఖాన్ని యివ్వలేదు. పైపెచ్చు జీవితాన్ని వ్యర్థంచేస్తుంది. కాబట్టి మానవజీవులు భగవంతుని భక్తి చేయాలి. భగవన్నామాన్ని జపంచేయాలి.

ఏ మంత్రాన్ని జపించాలి? ఎంత జపం చేయాలి? అనే విషయం వానివాని అభిరుచిని అధికారాన్ని శక్తిని అవలంబించి వుంటుంది. శక్తినిమించి జపంచేయుట మంచిదికాదు. రోగి పరిస్థితినిబట్టి పథ్యాన్నీ మందును వైద్యుడు వాడ్తాడు. అలాగే మీరు భవరోగులు. ప్రతివాడూ తగట్టు జపయజ్ఞాన్ని ఆచరించాలి. జన్మమరణ వ్యాధికి అది మందు. భక్తిచేస్తూ దురాచారియై మెలగుట ప్రయోజనకారి గాదు. నీమనస్సు నిర్విషయమైవుంటే ఓంకారాన్ని జపంచెయ్. భగవత్ప్రాప్తికి యింతకుమించిన సాధనం లేదు. మనస్సువిషయాసక్తమైవుంటే, యైశ్వర్యభోగాలపై అభిలాషవుంటే, దానితోడ్తోడ భగవద్భక్తి కలిసివుంటే ఓంకారాన్ని జపించొద్దు. ఓంకారంతో కలిసివుండే మంత్రాన్ని, ఓం నమశ్శివాయ - ఓం నమోభగవతే వాసుదేవాయ, ఈలాంటి మంత్రాలను జపించు. నీ మనస్సులో దుర్వాసనలు మరింతా అధికంగావుంటే ఆ ఓంకారాన్నికూడా వదలి కేవలమంత్రాన్ని, నమశ్శివాయ-నమోభగవతేవాసుదేవాయ, అనిమాత్రం జపించు. చిత్తనైర్మల్యం కలవారైవుంటే స్త్రీలుకూడ ఓంకారాన్ని జపించవచ్చు. బహుశా స్త్రీలలో విషయప్రవృత్తి - వాసనాప్రాబల్యం మిక్కుటం కాబట్టే, వారు ప్రణవోపాసనకు అనర్హులని చెప్పారు. ఉపనయన సంస్కారం కలవారే గాయత్రికి అధికారులు. సంన్యాసికూడ గాయత్రిని జపించే వీల్లేదు.

దుష్టాచారియగువాడు మంత్రాన్ని విలోమంగా జపించాలి. "రామ" అనుటకు బదులు "మరా" అని వాల్మీకి జపించాడు. ఆతడూ ఫలసిద్ధినిబొందాడు. ఈ మాటలన్నీ జపశాస్త్రానికి సంబంధించినవి.

జాగ్రదవస్థలోవలె స్వప్నావస్థలో సైతం జపం సాగిందంటే, అదే జపానుష్ఠానానికి సిద్ధి. అప్పుడు మంత్రంపై అధికారం చేజిక్కినట్లు. జపాన్ని ఆత్రంతో చేయరాదు. అదర బాదర జపంచేసేవాడు దరిద్రుడౌతాడు. మంత్రము యొక్క కడ అక్షరము, మొదటి అక్షరము ఒకటిగా కలిసిపోరాదు. స్వప్నంలో యిష్టదేవతాదర్శనం కల్గితే

జపసిద్ధికి అదొక్కటే గుర్తు. మరింత సిద్ధునికి, జాగ్రదవస్థయందే యిష్టదేవతా సల్లాపం లభిస్తుంది.

స్వాధ్యాయయజ్ఞంతో ఆత్మ జ్ఞానం లభిస్తుంది. ఆకస్మికంగా వచ్చిన ఆపదలు నివర్తించగలవు. స్వయంకృతంగా – బుద్ధిపూర్వకంగా తెచ్చుకొన్న ఆపదలను యీ మాట వర్తించదు. దొంగతనము చేసి శిక్ష తప్పిపోవలెనని ప్రార్థించుట లాభములేదు. ఆ ఆపద ఆకస్మికము కాదు. ఆపదలద్వారానే నీకు మేలు కలిగించుట యిష్టదేవత యొక్క ఉద్దేశ్యమైవుంటే – ఆయెడ కూడా ఆపదలు తొలగిపోవు. పరిణామంలో అవి మంచికి మార్గాలై వుంటవి.

ధర్మసంస్కారం, శాస్త్రాభ్యాసంలేక యీనాటి బాలకులు నీతిభ్రష్టులైనారు. భగవద్గీత – భాగవతంలాంటి ఆర్షసాహిత్యాన్ని చదివించి, వారిని నీతిమంతులుగ నొనర్చుట తల్లిదండ్రుల కర్తవ్యం; గురువుల బాధ్యత. పవిత్రమైన సంస్కారంతో మానవుడు ఉన్నతిని పొందగలడు. క్షుద్ర సంస్కారాలతో అధోగతి పాలౌతాడు.

స్వాధ్యాయ యజ్ఞంతో పుణ్యం లభిస్తుంది. ధర్మగ్రంథాలు రెండువిధాలు. అర్థాన్ని గ్రహిస్తూ చదివినపుడే ఫలితాన్ని యిచ్చేవి ఒకరకం. అర్థాన్ని తెలుసుకొన్నా తెలియకున్నా పఠించువానికి ఫలితాన్ని కలిగించేగ్రంథాలు రెండోరకం. వీటిని ప్రాసాదిక గ్రంథాలంటారు. అర్థాన్ని గ్రహిస్తూ వాటిని చదివితే మరింతా మేలు. ఉపనిషత్తులు, భగవద్గీత, భాగవతము యీ తరగతికి చెందినవి. వీటిని చదువుటతో వినుటతో పాపం నశిస్తుంది.

జ్ఞానయజ్ఞము: – ఆత్మవిచారాన్నే జ్ఞానయజ్ఞమంటారు. ఆత్మను గురించిన యథార్థజ్ఞానం మనకు లేదు. విపరీతంగా తలంచివున్నాము. ఒక్కొక్క శరీరానికి ఒక్కొక్క ఆత్మ కలదని భావించాము. పుణ్యాపాపకర్మలకు కర్తగా తలంచాము. సుఖదుఃఖాలకు భోక్త అని ఊహించాము. వాస్తవానికి ఆత్మ, కర్తగాదు; భోక్తగాదు; నానాకమూ కాదు. దానికి జన్మమరణాలు లేవు. చావు పుట్టుకలు శరీరానికిమాత్రం. సుఖదుఃఖాలను మనస్సు అనుభవిస్తుంది. బ్రహ్మాది కీటకపర్యంతము ఆత్మ ఒకటే ఒకటి. అది వ్యాపకవస్తువు. విద్యుచ్ఛక్తిలో చిన్న పెద్ద విభేదం లేకున్నా, బల్బును పట్టి ప్రకాశంలో వ్యత్యాసము కల్గినట్లు ఉపాధియగు బుద్ధినిబట్టి సంస్కారాలు భిన్నభిన్నాలయ్యాయి.

ఆత్మజ్ఞానాన్ని పొందుట ఒక్కటే మానవజన్మానికే హక్కు. అప్పుడే మనుష్యజన్మముయొక్క సార్థక్యమని వేదము చెప్పింది. విషయభోగాలతోనే కాలాన్ని వెళ్లించినచో మానవజన్మానికి మహానష్టము. ప్రాపంచికవ్యాసంగాలలో వయస్సునంతా గడిపి, కడకాలానికి దైవధ్యానాన్ని చేస్తాననడం – ఆత్మవిచారాన్ని ఆచరిస్తాననడం, అపలాపప్రసంగం; అర్థరహితమైన మాట. నదులకు సముద్రమువలె, జ్ఞానయజ్ఞము అన్నియజ్ఞాలకు పరమావధి.

"ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞాః యోగయజ్ఞాస్తథాఽపరే ।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః ॥
శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥"



# శ్రీగీతాసాహిత్యసేవాసమితి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర పంచమాచార్యత్వ జగద్గురు శ్రీ వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తాలూకా. – 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. – 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. – 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ – 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ – 7. శ్రీతొమ్మండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. – 8. శ్రీ ఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము. శిరివెళ్ళ తాలూకా. – 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. – 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. – 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. – 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, శిరివెళ్లతాలూకా. – ♦ ♦ ♦ కడప జిల్లా. 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణగారు, రామిరెడ్డిపల్లె, పులివెందల తాలూకా. — 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. – 15. శ్రీ పోతేపల్లి రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు. ♦ ♦ ♦ చిత్తూరుజిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లె మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్‌వీధి, చిత్తూరు. – 17. శ్రీ యస్. రామలింగం పిళ్లైగారు, జవిళివ్యాపారం, చిత్తూరు. ♦ ♦ ♦ అనంతపురంజిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహర్షులవారు, శ్రీభవనాశి ఆశ్రమం. – 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. ♦♦♦ బళ్లారిజిల్లా: 20. శ్రీ పెండుకూరు గోవిందప్ప అండ్‌సన్స్, హాస్పెట్, 21. శ్రీసుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్. – 22. శ్రీగంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. ♦♦♦ కోలారుజిల్లా: 23 శ్రీఎం. వి. రామలింగంశ్రేష్ఠిగారు, బంగారుపేట. మైసూరుస్టేట్: 24. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి. ♦♦♦ ఉత్తర ఆర్కాట్ జిల్లా. 25. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళంపోస్టు. ♦♦♦ నెల్లూరుజిల్లా. 26. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు – 27. శ్రీ వేమారెడ్డి బాలరామిరెడ్డిగారి ధర్మపత్ని యశోధమ్మగారు, ఇనమడుగు. ♦♦♦ హైదరాబాద్ స్టేట్ 28. శ్రీడి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. ♦♦♦ గుంటూరుజిల్లా: 29. శ్రీశ్రద్ధానంద స్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, తెనాలి తాలూకా.

## రాజపోషకులు రు. 54.

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మృతిచిహ్నముగ శ్రీ యస్. అయ్యపురాజుగారు, గోసుపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండ ఓబుళేశ్వరంశ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీసోముల పెదసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 8. శ్రీయజ్జల రామిరెడ్డిగారు, దుబ్బుల్లి. కొత్తపల్లె, కోయిలకుంట్ల తా॥ – 9. శ్రీమదళ్లపల్లె

రామసుబ్బయ్యగారు, చాగలమఱ్ఱి.— 10. జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమఱ్ఱి. — 11. శ్రీమతి ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు, నంద్యాల. — 12. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. — 14 శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం ◆◆◆ కడపజిల్లా: 15. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్ములమడుగు తా॥ 16. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. — 17. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 18. శ్రీ పి. నారాయణశ్రేష్ఠిగారి కుమారుడు శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. — 29. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 20. శ్రీ ఉమ్మిడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్ములమడుగు తా॥— 21. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 23. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె — 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం.ఎల్.ఎ., పెరియంబాడి. 25. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు. అనంతపురంజిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 27. శ్రీ బుశెట్టి వన్నప్పగారు, ఉరవకొండ — 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 30. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకసిర్తి — 31. ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు పోస్టు. ◆◆◆ బళ్లారిజిల్లా: 32. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్, — 33. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు — 34. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు. — 35. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి, చిప్పగిరిపోస్టు. — 36. శ్రీ పాటేల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి — 37. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి — 38. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. — 39. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 41. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 42. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి — 43. పాటేల్ పెద్దబళిరెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి — ◆◆◆ మైసూర్ స్టేట్:— 44. శ్రీ వి. ఆర్. రాజగోపాల్శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 45. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 46. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 47. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్. — 48 శ్రీ నారాయణమూర్తిగారు, C/O శ్రీ సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి, కోలారుజిల్లా. ◆◆◆ నార్త్ ఆర్కాడుజిల్లా: 49. శ్రీ శంకరనాయుడుగారు, కార్యాకురు. ◆◆◆ హైదరాబాదుస్టేట్. 50. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ.— 51. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ ◆◆◆ నెల్లూరుజిల్లా: 52. శ్రీ బ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు — 16. — 2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగల్లి, ఆలూరుతాలూకా. బళ్లారి జిల్లా.

# వార్తలు.

శ్రీ శంకరానందస్వామిగారును శ్రీ రామకృష్ణగారును 4-10-53 సాయంత్రం హిందూపురమునందు నూతనముగ నిర్మింపబడిన ఆశ్రమములో భగవద్గీతా తత్వాన్ని గూర్చి ఉపన్యసించినారు.

అనంతపురం జిల్లా కల్యాణదుర్గమునందు 6 వ తేది మొదలుకొని వారము దినములు శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయములో శ్రీ శంకరానందస్వాములవారి గీతోపన్యాసములు జరిగినవి. శ్రీవారు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమునుగూర్చి ఉపన్యసించినారు. శ్రీరామకృష్ణగారు అనువదించారు. ఆగ్రామమునందుండు శాంతి ఆశ్రమాధిపతులు శ్రీ మహాదేవ స్వామిగారు సభాధ్యక్ష పదవి నలంకరించినారు. ఆ సందర్భమున గీతాభినయసింహ శ్రీ గీతానంద (రుద్రారెడ్డి) గారు భగవద్గీతాభినయమును ప్రదర్శించినారు. శ్రీ ఎర్రప్పస్వామి యొక్కయు, ఆర్యవైశ్య సంఘముయొక్కయు అత్యంత శ్రద్ధాభక్తులతో కార్యక్రమము సుసంపన్నముగ నెరవేరినది.

14-10-53 నుండి మూడురోజులు మడకశిరా (అనంతపురంజిల్లా) గ్రామమునందు ఎం. సంజయ్యగారి ప్రోద్బలముతో శ్రీ శంకరానంద, రామకృష్ణుల గీతోపన్యాసములు జరిగినవి. ఆర్యవైశ్య సంఘము యొక్కయు - గ్రామవాసులయొక్కయు ప్రేమాదరములతో కార్యక్రమము వైభవోపేతముగ జరిగినది.

అక్టోబరు 18-వ తేది సాయంత్రం చిత్తూరు జీవకారుణ్య అన్నదాన సమాజ భవనమునందు శ్రీపూజ్యపాద శంకరానంద స్వాములవారియొక్క గీతోపన్యాసాలు ఆరంభమయ్యాయి. జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు డి. శ్రీనివాసఅయ్యంగారు ప్రథమంలో స్వాగత సంభాషణ చేశారు. జిల్లాజడ్జి K. V. L. నరసింహంగారు ప్రారంభోపన్యాస మొనర్చారు. యథాప్రకారం స్వామి శ్రీ రామకృష్ణగారు శ్రీ వారి ఉపన్యాసాన్ని సహజనైపుణ్యంతో తెలుగులో అనువదించారు. సాధుమూర్తులు సార్థక నామధేయులునగు శ్రీ శ్రీ శాంతానంద స్వాములవారు పదిరోజులూ అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని సరస సంపన్నం కావించారు. పూజ్యపాద శ్రీ నిత్యానంద స్వాములవారి ఆగమనంతో ఈ కార్యక్రమం మరింత రాణించింది. శబ్దవిస్తరణ యంత్రాలద్వారా వెదజల్లు గీతావర్ష ధారలను, వర్ష ధారలతోబాటు ఆస్వాదించి తనివిలేని హృదయాలతో చిత్తూరుపౌరులు ఆలకించి పులకించిపోయారు.

శ్రీరామకృష్ణగారు నవంబరు 1-వ తేదీ రామిరెడ్డిపల్లె జ్ఞానానందస్వామి (శ్రీగంగిరెడ్డి) గారి ఆరాధనయందు పాల్గొన్నారు.

నైజాం స్టేటు వరంగల్లుగ్రామమునందు శ్రీసాధు బుచ్చిలింగం గుప్తగారి ప్రోద్బలమువలన 20-11-53 నుండి 15 రోజులు శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారి గీతోపన్యాసములు జరుగగలవు. స్వామి శ్రీ రామకృష్ణగారుసహా తోడ ఉంటారు.

8-10-53 నుండి 17-10-53 వరకు పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి శ్రీ విశ్వనాథాశ్రమమునందు శ్రీ బోధానందపురి స్వాములవారి ఆధిపత్యమున నవరాత్రి ఉత్సవములు మహావైభవముగ జరుపబడినవి. శ్రీనిత్యానంద, శ్రీ ప్రణవానంద, శ్రీ అనుభవానంద, శ్రీ నిత్యబోధానంద స్వాములవారు భగవద్గీతాదిక తత్త్వసంబంధములగు మహోపన్యాసములు గావించినారు.

**Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.**
**Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,**
**Sri Gita Sahitya Sevasamithi - Allagadda - Kurnool Dt.**

# మోక్షగీత

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ (15-5)

తా॥ మానమోహాలను వదలివేసినవారు, [illegible]మగు సంగదోషాన్ని మాత్రమై విడచారు, నిరంతరము ఆత్మ యందే సంలగ్నమై యుండేవారు, విషయవాసనలను పెల్లార్చినవారు, సుఖదుఃఖాది ద్వంద్వాలనుండి విడివడిన వారు, రాగద్వేషాలను తొలగించినవారు, సమతాసమాధిని పొందినవారు యెవరో అట్టివారు, మోహశోకాలకు అతీతులై తత్పదవాచ్యమగు పరమపదాన్ని [illegible]స్తారు.

వివరణము:— "మీరు [illegible] ఆత్మస్వరూపులు" — ఈ దృఢసత్యాన్ని నిరంతరము [illegible] చెయ్యండి. ఈ భావనతో మనస్సు ఊర్ధ్వగతిని పొందుతుంది. జీవితముయొక్క ప్రతియొక్క కోణము ఉదాత్త మౌతుంది. ఈ ఆత్మజ్ఞప్తి సహాయంతో అజ్ఞాన జన్యము లగు మిథ్యాసక్తులు పలాయనమౌతవి. జీవిత మర్మాన్ని గ్రహించే — జన్మరాహిత్యాన్ని పడసే విశిష్టదృష్టిలభిస్తుంది. అవ్యక్తమూ అవినాశియునగు ఆత్మను సాక్షాత్కారం చేసు కొన్నవారు మళ్లీ జన్మానికి రావలసిన పనిలేదు. ఎందుకంటే వాసనాభండారమైన మనస్సులోని వారి కామనాదోషాలన్నీ సమూలము నశించాయి.

— భగవాన్ శ్రీ రమణమహర్షి.

# గీతావాణి

30





మూడవ సంవత్సరము  ఆఱవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

5 డిసెంబర్ 1953. ★ ఈ సంచిక వెల 12 అణాలు.

# *Message.*



*Gita shows several ways of self-realisation and helps men of action as well as men of devotion and of higher thinking. Its Mahavakya is Vasudeva Sarvam. Its chief practice is self-surrender and Nishkam method of service. It leads to right observation and right thinking.*

*May the Gita Sahitya Seva Samiti be able to spread the message of the Gita in India and other countries of the world.*

Vedanta Ashram,
Valad.
25—10—53.

Swami Madhavtirtha

## వ్యాస రచయితలకు ప్రత్యేకంగా మనవి.

గీతావాణియెడ మీకుగల ప్రగాఢ ప్రేమాదరములకు మా అనంతకృతజ్ఞతా ధన్యవాదాలు. తమయొక్క అవ్యాజానురాగంతో పత్రికయొక్క భావిదశ మహోజ్జ్వలంగా వర్ధిల్లగలదనికూడా మాకు గట్టినమ్మకము. మా అభ్యర్థనపై వెంటవెంట వ్యాసాలను పంపిన మీ అందరకూ మా జోహార్లు.

సంపాదకులకు సహజంగా యేర్పడే అనివార్య క్లిష్టపరిస్థితులతో కొందరి వ్యాసములను యీ గీతాజయంతి సంచికలో ప్రకటింపలేకపోయాము. భూరిభూరి క్షమాదానాన్ని ప్రసాదించండి. గీతాజయంతి అనుబంధ సంచికగా వెలువడే జనవరి పత్రిక నుండి క్రమముగా వాటిని ప్రకటిస్తాం.

ఇట్లు,
సంపాదకవర్గం.



## తోడి పత్రికాధిపతులకు విజ్ఞప్తి.

ఈ గీతాజయంతి విశేషసంచికను దయతో మీ పత్రికయందు సమీక్షింప ప్రార్థన.

Exchange గా పంపే మీ పత్రికలను క్రింది చిరునామాకు పంపండి.

మేనేజింగ్ ఎడిటర్ — గీతావాణి, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

# "గీతావాణి" 30

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



## గీతాజయంతి విశేష సంచిక



మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ



మేనేజర్:

స్వామి శ్రీశివానంద.



విశేష సంచికతోకలిపి సంవత్సర చందా నాలుగు రూపాయలు.

ప్రతినెల 15_వ తేదీ వెలువడును.

# సందేశములు.



**Vice-President's Secretariat.**
**New Delhi.**
**Camp: Madras,**
**23rd October, '53.**

The Secretary,
Shri Geeta Sahitya
Seva Samithi,
Allagadda P. O.



*Dear Sir,*

Thank you for your letter of the 20th inst. I am glad to know that your Samithi will celebrate Geeta Jayanthi on the 16th December, 1953, and that H. H. Swami Sri Shankarananda will participate in the function and deliver his message on Sri Bhagavadgita. I send you my best wishes for the success of your celebrations.

Yours faithfully,
[signature]
(S. Radhakrishnan)

---

*Beloved Ram,*

P. O. Anandashram,
(Via.) Kanhangad, S.I.Ry.

*Ramdas received your loving letter of the 20th instant. Glad to know that you are celebrating Gita Jayanti on the 16th December and that H. H. Sri Swami Shankarananda has kindly consented to take part in the function and deliver messages on Srimad Bhagavad Gita. Ramdas wishes with all his heart that the function should be crowned with every success. May all who attend the function be imbued with the pure spirit of devotion and may they realise the divine in their hearts.*

*Blessings be upon you all.*

*Ever yourself,*

23rd Oct. '53.

Ramdas

## నా సందేశము.

"గీతావాణి"యొక్క లక్ష్యము గీతలు – గీతల లక్ష్యము వేదసారమగు ఉపనిషత్తులు – ఉపనిషత్తులకు ఆనందమే లక్ష్యమైయున్నది. ఆనందము బ్రహ్మము. ఆ ఆనందమే గీతల రూపాన ప్రకాశించుచున్నది. ఆనందమునకు పుట్టుట గిట్టుట లేదు. గాన ఆనందము సత్యము. సత్యము లేకపోగలదన్నమాట వెఱ్ఱికూత. బ్రహ్మమే ఆనందము – ఆనందమే గీతలు – గీతలే గీతాతత్త్వములతో నిండి నిబిడీకృతమైయుండు "గీతావాణి". బ్రహ్మమునకు ఆది అంతము లేదంటారు. గీతావాణియు ఆది అంతము లేనిదే. ఆది అంతము లేని దాన్ని ఆశీర్వదించుట సాధ్యమా? బ్రహ్మము, సచ్చిదానందమైన గీతావాణియు సత్ – చిత్ – ఆనందమే. ఓమ్.

శ్రీ రమణ కుటీరము,<br>ప్రొద్దుటూరు. 28-10-53.

అభేదానందము.



Professor T. M. P. MAHADEVAN,<br>Professor of Philosophy.

University Buildings,<br>Chepauk, Madras-5.<br>Dated 12th November 1953.



I am glad to know that the Gita - Jayanti will be celebrated in December 1953, by the Gita Sahitya Seva Samiti, and that His Holiness Swami Shankarananda will deliver the Jayanti Address. I have been watching with admiration the good work that your Samiti is doing for broadcasting the universal message of the Bhagavadgita. May the Blessed Lord of the Gita make of us fit instruments in the working of his divine plan.

T. M. P. Mahadevan,<br>Professor of Philosophy.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

—♦♦♦ కర్నూల్ జిల్లా ♦♦♦—

1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీ శివాచార్య స్వాములవారు.
2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥
3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా.
4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల.
5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా.
6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా.
7. శ్రీ తోమండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి.
8. శ్రీ ఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా.
9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ.
10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ.
11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.
12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

—♦♦♦ కడప జిల్లా ♦♦♦—

13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు.
14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్.
15. శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

—♦♦♦ చిత్తూరు జిల్లా ♦♦♦—

16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు.
17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

—♦♦♦ అనంతపురం జిల్లా ♦♦♦—

18. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహర్షులవారు, శ్రీభవనాశి ఆశ్రమం.
19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

—♦♦♦ నెల్లూరుజిల్లా ♦♦♦—

20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్ పేట, నెల్లూరు.
21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

—♦♦♦ గుంటూరు జిల్లా ♦♦♦—

22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

—♦♦♦ ఉత్తర ఆర్కాట్ జిల్లా ♦♦♦—

23. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

—♦♦♦ మైసూరుస్టేట్ ♦♦♦—

24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా.
25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మ [గారు, హాస్పేట్.
26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె.

27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.
28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

—♦♦♦ నైజాం స్టేట్ ♦♦♦—

29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది.

## రాజపోషకులు రు. 54

—♦♦♦ కర్నూలు జిల్లా ♦♦♦—

1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీN. అయ్యాపురాజుగారు, గోసపాడు.
2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం.
3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ.
4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ.
5. శ్రీ సోముల పెదసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ.
6. శ్రీ జైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ.
7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ.
8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా.
9. శ్రీ యస్. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా.
10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి.
11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి.
12. శ్రీమతి ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు, నంద్యాల.
13. శ్రీ పాణ్యం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల.
14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల.
15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం

—♦♦♦ కడపజిల్లా ♦♦♦—

16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.
17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు.
18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు.
19. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి.
20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు.
21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

—♦♦♦ చిత్తూరు జిల్లా ♦♦♦—

22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట.
23. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె.
24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి.
25. శ్రీ నటుకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

—♦♦♦ అనంతపురం జిల్లా ♦♦♦—

26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి.
27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ.
28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు.
29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు.
30. శ్రీ ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు
31. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకనగుర్తి.
32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తాలూకా.
33. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. ,,
34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. ,,
35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. ,,
36. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. ,,
37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. ,,
38. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. ,,
39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి. ,,
40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. ,,
41. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. ,,
42. శ్రీ పాటిల్ పెద్దబశిరెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి. ,,

—♦♦♦ నెల్లూరు జిల్లా ♦♦♦—

43. శ్రీ బ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీ దత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

—♦♦♦ ఉత్తర ఆర్కాడు జిల్లా ♦♦♦—

44. శ్రీ శంకరనాయుడుగారు, కారుక్కూరు.

—♦♦♦ మైసూర్ స్టేట్ ♦♦♦—

45. శ్రీ కావుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్,
46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట.
47. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట.
48. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట.
49. శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరే విరూపాక్షయ్యగారు, తొండేభావి, [కోలారు
50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

—♦♦♦ హైదరాబాదు స్టేట్. ♦♦♦—

51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ.
52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు—16.
2. శ్రీ గజ్జహళ్ళి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

# మహారాజపోషకులు.



శ్రీ D. P. సదాశివరాజుగారు,
ఆనెగొంది, హైదరాబాద్ స్టేట్.



శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు,
పడకండ్ల, శిరివెళ్ళ తాలూకా.





శ్రీ వంకదార సుబ్బయ్యగారు,
దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥

# మహారాజ పోషకులు.



శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె, మైసూరుస్టేట్.



శ్రీ రాజా పోతేపల్లె వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు, కడపజిల్లా.
వీరి జ్యేష్ఠ ధర్మపత్ని స్వర్గీయ శ్రీమతి వెంకటసుబ్బమ్మగారి స్మృతిచిహ్నముగ.



# విషయసూచిక - డిసెంబర్ '53.

★





## కార్యాలయం నుంచి కృతజ్ఞతలు.

కరువు – కాటకాలను లెక్కించక "గీతావాణి" పత్రికను అభిమానించి, ఆర్థికంగా తోడ్పడుతూన్న పోషకవర్గంవారికిని, అభిమానులకు, చందాదార్లకు – గీతాజయంతీ సందర్భంలో ప్రత్యేక కృతజ్ఞతలు సమర్పిస్తూన్నాం. గీతాచార్యుడు వారిని అనుగ్రహించుగాక! ఎన్నెన్నివిధాల మార్పులు కావించినా, యెంతెంత దూరంలోవుండి సలహాలిచ్చినా, విసుగుకోనకుండా సర్వాంగసుందరంగా ముద్రించుచుండెడి శ్రీ వేదవ్యాసప్రెస్సువారికి హృత్పూర్వక కృతజ్ఞతలు. గీతామాత వారికి అభ్యుదయసిద్ధిని ప్రసాదించుగాక !

ఆవుల్లగడ్డ,
16-12-53.

స్వామి శివానంద,
మేనేజరు–గీతావాణి ఆఫీస్.

### 1. మహారాజ పోషకులు.

వీరు ఒకేతూరి నూటయెనిమిది రూపాయలు చెల్లించినవారు. గీతావాణియొక్క ప్రతిసంచికయందును వీరిపేరు ప్రకటింపబడును. ఒక్కపర్యాయము విశేష సంచికయందు వీరిఫోటో ముద్రింపబడును. గీతావాణి రెండేసి కాపీలవంతున వీరికి శాశ్వతముగ పంపబడును.

### 2. రాజపోషకులు.

వీరు ఒకేతూరి ఏబదినాల్గు రూపాయలను చెల్లించినవారు. వీరిపేరు ప్రతి గీతావాణిలో ప్రకటించుచూ ఒక్కొక్క కాపీవంతున శాశ్వతముగ పంపబడును.

### 3. అభిమానపోషకులు.

వీరు సంవత్సరమునకు ఇరువదియైదురూపాయలు చెల్లించవలెను. ఎన్ని సంవత్సరములు చెల్లించిన అన్నిసంవత్సరములు వారిపేరు పత్రికలో పతిమాసము ప్రకటింపబడుచూ, గీతావాణి ప్రతినెలా ఒక్కొక్కకాపీవంతున పంపబడును.

### 4. చందాదార్లు.

సంవత్సరమునకు నాల్గురూపాయలు చెల్లించువారు. గీతాజయంతి సందర్భమున ప్రకటించు విశేషసంచికతోకలిసి వీరికి 12 సంచికలు పంపబడును.

# గీతావాణి

సంపుటి 5 సంచిక 6


[illegible]

అధ్యాత్మజ్ఞానానికి - మనోవిజ్ఞానానికి - ఆచారకాండకు సంబంధించిన ఎన్నెన్నో గ్రంథాలు వేలేండ్ల తరబడి, యీశ్వరస్వరూపాన్నీ జీవస్వరూపాన్నీ మరీ యింకాయెన్నో గహనాతిగహనవిషయాలనూ విమర్శిస్తూవచ్చాయి; వస్తూన్నాయికూడా. అయినా ఆ సాహిత్యాన్ని నమలి మ్రింగి నెమరువేసి జీర్ణించుకునేశక్తి యేకొద్దిప్రకాండపండితులకుమాత్రమే సాధ్యమైఉంది. తక్కిన సామాన్య మానవవర్గానికి అందులోని విషయాలు మ్రింగరాని కబళాలుగా ఉన్నాయి. అందని పండ్లుగా భావించి వారాజోలికి పోడం మానుకొన్నారు. తీక్ష్ణమైన విద్యాబుద్ధులుగల ప్రతిభావంతులుమాత్రం కఠోరపరిశ్రమజేసి అందలి క్లిష్ట నిగూఢ దార్శనికసిద్ధాంతాలను వెలికిలాగి తమ హృదయాన్నీ, మస్తిష్కాన్నీ బలిష్ఠం చేసికొంటూన్నారు. మానవ జీవితానికి లక్ష్యభూతంగాఉండే శివజీవజగత్తుల విజ్ఞానాన్ని వారు ఆస్వాదిస్తూన్నారు. మంచిదే.

శాస్త్రజ్ఞానం లేకపోతే పోయింది. ఎవడైనా సరే — హృదయాన్ని అడిగి తెలిసికోండి. పైపై భేదాలు పాటించొద్దు. అన్ని భేదాలకు అట్టఅడుగున అందరి ఉద్దేశ్యాలూ సమానస్థాయిలోనే ఉన్నాయి. చిన్నచిన్న భేదాలపై దృష్టిపెడితే సాధకుడు వికలుడౌతాడు. మనలో ప్రతివాడూ మనసా వాచా కర్మణా చేసే ప్రతి పనియొక్క అంతరంగ అభిప్రాయం ముఖ్యమైన అయిదు ప్రయోజనాదులను అపేక్షించి ప్రవర్తిస్తూంది. వాడు వీడనకుండా ప్రతివాడూ యీ అయిదు ప్రేరణలకు వశుడయ్యే ఉన్నాడు. ఇది ఋజువైనమాట. "1. సదాబ్రతకాలి, 2. సర్వమూ తెలిసికోవాలి, 3. దుఃఖలేశములేని అఖండానందాన్ని పొందాలి, 4. బంధాలన్నిటినుండి విముక్తుడు కావాలి, 5. స్వేచ్ఛా స్వాతంత్రంగా పనులు చేయాలి." — ఈ అయిదు ప్రేరణలే మనుష్యుని జీవిత వ్యవహారానికంతా కీలక సూత్రాలు.

ప్రతి మానవుని కోరికా యీ అయిదింటినీ కబళించాలనే ఉంది. ఈ అపేక్ష లేనివాడు ఒకడూలేడు. అయినా యీ అయిదు ఒట్టుమొత్తం ఒక్కమానవునికి — వాడెంతమహామహానుభావుడైనాసరే — సిద్ధించి ఉండ లేదు. నిజానికి ఆలోచిస్తే, ప్రపంచంలోని ధర్మసంప్రదాయాలన్నీ యెవన్ని యీశ్వరుడని పిలుస్తూన్నాయో, వానియందు మాత్రమే యీ అయిదూ విశేషణాలుగా నిలిచి ఉన్నాయి. వాడుఆస్తికుడైనా, నాస్తికుడైనా,యీ శ్వరసత్తాను ఒప్పినా ఒప్పకున్నా, ప్రతివాని హృదయాలల్లో రాజరికంచేసే యీ భావాలను — యీ యిచ్ఛలను సూటిగా పరీక్షించండి. ప్రపంచం లోని మతగ్రంథాలన్నీ యీశ్వరునియొక్క గుణాలని వేటిని చెప్పియున్నారో, ఆ గుణాలనే తానూ తనకు తెలియకుండానే కోర్తూన్నాడన్నమాట. అనంతసత్తా — అపారజ్ఞానం — అఖండానందం — పరమస్వాతంత్ర్యం — సర్వోపరి యేకచ్ఛత్రాధిపత్యం, యీ అయిదింటినీ చిన్న — పెద్ద ప్రతివాడూ అపేక్షించే ఉన్నాడు. "నరో నారాయణో బుభూషతి" — నరుడు నారాయణుడు కాగోర్తూన్నాడనే శాస్త్రవాక్యం దీనివల్ల ఋజు వౌతూంది. ఇది మనోవైజ్ఞానిక సత్యసిద్ధాంతము.

లక్ష్యం ఫలానా అని తేలింది. ఇంతమట్టుకు సరే; కాని దాన్ని పొందేదానికై మనవద్ద సాధనాలు, ఉపాయాలు ఏమున్నాయి? మనము

ప్రయాణం యేచోటినుండీ చేయాలి? ప్రస్తుతం మనమెక్కడున్నాం? ఇదంతా యీమీదట ఆలోచింపదగిన విషయం. ప్రపంచంలో మనం సాధారణంగా చూస్తూనే ఉంటాం. ప్రొద్దస్తమానం రెక్కలల్లార్చి — కూలినాలిచేసి — గంజో అంబలో త్రాగి జోపానంగా కాలాన్ని వెళ్లబుచ్చే పాటకపుజనం ఒకవైపు వుంది. తెప్పలదేలే వైభోగాలతో కన్నుమిన్నుగానక కాలక్షేపంజేసే, రాజులు మహారాజులు — శ్రీమంతులు బలవంతులు ఒకవైపు వున్నారు. మొదటివర్గం దుఃఖసంతప్తంగా ఉందనీ, రెండోవర్గం ఆనందపరవశంగా ఉందనీ మనం యీ విభాగం చేశాము; కాని యిది స్థూలదృష్టితో చెప్పేమాట మాత్రం. గంభీరంగా లోతుకుదిగి విచారిస్తే పరిణామం వేరుగా ఉంటుంది. సామాన్యంగా దరిద్రుడు ధనవంతులనుజూచి మత్సరిస్తాడు. తాను దుఃఖాలల్లో నలిగిపోతూన్నాననీ, ధనికులు ఆనందడోలికల్లో తూగుతూన్నారనీ తలపోసి కంటగించుకొంటాడు. కానీ సన్నివేశంలభించి వాడు ధనవంతుల లోగుట్టును తెలిసికోగల్గితే విభ్రాంతుడై పోతాడు. ధనవంతులనుచూచి దరిద్రులు యేవిధంగా కుమిలిపోతూన్నారో అదేవిధంగానే దరిద్రుల ఉత్సాహజీవితాన్నిచూచి ధనవంతులు లోలోన కుళ్లిపోతూన్నారు. చీకు చింతలేక కలిగింది దిని హాయిగా కాలంగడిపే నిర్ధనుని జీవితసౌఖ్యం బహుశా భాగ్యవంతుల జాతకంలో దుర్లభం. ఇంతకూ, దుఃఖం యేదోవిధంగా యిద్దర్నీ నతాయిస్తూనే ఉంది. 'మనుష్యుడు యేడ్చేదానికే పుట్టినాడేమో' (Man was made to mourn) అని స్కాట్లెండ్ కవి రాబర్టు బర్నస్ చెప్పినాడు. ఈ మాటలను అక్షరాలా మనం ఒప్పినా ఒప్పకున్నా ఒక నిష్కర్షకు మాత్రం రావొచ్చు. మానవుడు యెంత ఉన్నతస్థాయికి పోయినా, ఎన్నెన్ని సుఖభోగసామగ్రులను రాసిపోసుకొన్నా, అంతోయింతో భయము — దుఃఖమూ, కష్టమూ యోచనా వానిపాలికి కూడా ఉండనే ఉంటుంది. నూటికి నూరుపాళ్లు సుఖవంతుడుగా ఉన్నాడనేమాట ప్రపంచంలో కనీకనీ లేదు. కాబట్టే ప్రతిజీవుడుగూడా కొరతలేనటువంటి,కల్తీలేనట్టి ఆనందాన్ని పొందేదానికై తహతహ పడ్తూన్నాడు.

మనం యేచోట ఉన్నామో తెలిసింది. ఎచ్చట పోవాలో తెలిసింది. ఇంతమాత్రంతోనే కథ పూర్తికాలేదు. ఈ చోటినుండీ ఆ చోటికి

చేర్చేమార్గాన్ని తెలిసికోవాలి. ఆ జాడ గుర్తెరిగినవాన్ని మార్గదర్శకునిగా మనం వరించాలి. ఒక మంత్రిని — ఒక మార్గదర్శకున్ని — లేదా ఒకసారథిని ఏర్పరుచ్చుకోవాలి. వాడు కూలివాడు గానీ, బండిమనిషి గానీ, డ్రైవరుగానీ గాక! అసలు, మనం పోవలసినచోటికి చేర్చేవాడుగా ఉండాలి. అట్టి దయామయుడు యెవ్వడు లభించునా అంటూ ప్రతి జీవుడూ దీనస్వరంతో మొఱపెట్టుకొంటూనే ఉన్నాడు. 'నరున్ని ఉద్ధరించేవాడు నారాయణుడే' — వాడే యథార్థమైన మార్గదర్శి, అనే జ్ఞానం కలిగేటంతవరకూ మన మొఱ దిక్కులేని మొఱే. దారి తెలియని వాడు సారథిగావస్తే, బండిలోనివారిని యేచోట కూలుస్తాడో మనం ప్రత్యేకంగా చెప్పుకోవలసిన పనిలేదు. "అంధేనైవ నీయమానా యథాంధాః" అని ఉపనిషత్తే చెప్పింది. 'కానని వాని నూఁత గొని కాననివాడు' యెక్కడ చేర్తాడు? నూతిలోనో — గోతిలోనో —.

మనం నిరంతరం అఖండానందాన్ని, అక్షయశాంతిని అపేక్షిస్తూన్నాం. మనకా రహస్యాన్ని చెప్పేవాడు, తాను స్వయంగా స్థిరశాంతిని, పరమానందాన్ని పొందినవాడై యుండాలి, ఆ విషయంలో అతడు అనుభవజ్ఞుడై ఉండాలన్నమాట. మానవునికి యిదొక్క అవసరమైన సమస్య. ఈ సమస్యను లోతుపాతుగా విచారించి ధర్మవేత్తలైన పెద్దలు 'పరమేశ్వరుడే మనుష్యరూపంతో అవతరించి మానవునకు కావలసిన బోధలు గఱపి చక్కని మార్గంగుండా వాని యభీష్టస్థానానికి వాన్ని గొంపోతాడంటూ అనుభవపూర్వకమైన ఒక తీర్మానాన్ని చెప్పారు. భగవంతుని అవతారవాదసిద్ధాంతానికి వీరీవిధంగా పాది కల్పించారు.

ప్రవక్త యని, పైగంబరని, దేవదూతని, యీశ్వర పుత్రుడని పేరుపెట్టి ప్రపంచంలోని ప్రతిమతమూ యేదో కొంతమార్పుతో యీ ధోరణినే అనుసరించింది. కానీ సనాతన ధర్మంలోని సర్వోత్తమ సారమేమంటే — ఈ ధర్మాన్ని స్వయంగా భగవంతుడే సృష్టికి ఆదికాలంలోనే స్థాపించాడు. కాబట్టి వక్రబుద్ధినివదలి, వలపఱాన్ని విడిచి సత్యశోధకుడు సనాతన ధర్మశాస్త్రాలనే — ఆర్ష వైదిక వాఙ్మయాన్నే శరణు బొందటం శ్రేయోదాయకమైన మార్గం.

అయితే యీచోట ఒక గండాంతరం ఉంది. సనాతన ధర్మ

శాస్త్రాలంటే — అవి ఆది అంతంలేని ఒక బ్రహ్మారణ్యం. సముద్రానికి లోతు, ఆకాశానికి యెత్తు, పోరాడి తేల్చవచ్చునేమో; కానీ సనాతన ధర్మశాస్త్రాలల్లో ఏదో కొంతభాగాన్నైనా తుదముట్టా తృప్తికరంగా అన్వేషించాలంటే ఒక్క జన్మంకాదు; వేలాది జన్మలుకూడా చాలీచాల నివే. కాబట్టి ఆ చిక్కులో పడకముందే సర్వతోముఖంగా మనకు ఉప యోగించే ఒక్క శాస్త్రాన్ని మనం ఏరికోవాలి. అది సనాతన శాస్త్రాలకు పడసారంగా ఉండాలి. జీవిత ఉద్దేశ్యాలనుగూర్చి 'ఓనమ' మొదలుపెట్టి పట్ట పరీక్షలో ప్రవీణుడయ్యేవరకూ క్షుణ్ణంగా మానవునికి బోధించే సమగ్ర గ్రంథంగా ఉండాలి. తనలో ఉండే ఉదారమూ, ఉన్నతమూ అయిన తత్త్వసిద్ధాంతాల ప్రభావంతో కేవలం తనవారినేగాకుండా, తదితర సంప్రదాయస్థులనుగూడా తలలు వంపించే మహోత్తమ గ్రంథం కావాలి. ఒక్కమాటలో చెప్పాలంటే — దానిపేరే భగవద్గీత.

ఇది తిరుగులేని తీర్మానం. పాశ్చాత్య ప్రపంచంలో దార్శనిక ప్రవరులైన 'గెటే, కార్లాయిల్, ఎమర్సన్, డాయ్‌సన్' ప్రభృతుల యొక్క, మరీనాటి నేటి ఆయా ధురంధర దర్శనకారులు అభిప్రాయాలను సూటిగాగ్రహిస్తే గీతపై మనంచెప్పిన యీ తీర్పుకు యేమాత్రం చలనం లేదు. నానాపురాణకర్తయైన వ్యాసదేవుని పక్షంనుండికూడా యీ సిద్ధాంతాన్ని బలపరచే ప్రమాణాలు కొల్లోకొల్లలు. కలియుగారంభంలో లీలాగోపాలుడు శ్రీకృష్ణుడు నరున్ని సమ్ముఖంలో పెట్టికొని నానా ఉపనిషత్తులనుండి యీ సారాన్ని పిండాడు. ముందటి మూడుయుగాల వారికి యీ ఫలంలేదు. ఇది కేవలం కలియుగమానవులకోసం పండినపంట.

ఏడునూర్ల శ్లోకాలల్లో కుదించి కుదించి కూరి కూరి కక్కుర్తిగ నింపిపెట్టిన తత్త్వరహస్యాలను క్షుణ్ణంగా ఆకలించుకోవాలంటే, ఆ పని కొన్ని జన్మాలకుకూడా సాధ్యంగాదు. కానీ ఆ పరిశ్రమనువదలి యేదో ఒక ఉపాయంతో నెట్టుకుంటూ మనము సరాసరి సూటిగా గీతచూపించే లక్ష్యబిందువు చేరుకోవచ్చు. అవసరాన్ని బట్టి అందులోని వ్యాపక రహస్యాలను అధ్యయనం చేసేదానికి ప్రయత్నం చెయ్యొచ్చు.

మనంకోరే ఆనందం, దాని అధిష్ఠానవస్తువూ, దాన్ని పొందే సాధనం కూడా 'భగవద్గీత'అనే పేరునందే సంకేతింపబడి మనదృష్టిని ఆకర్షిస్తూ

న్నాయి. గీతము అంటే సంగీతము అని అర్థం. ఆమాటలోనే లక్షణావృత్తి రీత్యా ఆనందము సూచింపబడి ఉంది. సంగీతమంటే పాట పాడడమనేవని మాత్రమే కాదు. అందులోనూ ఆ సంగీతం మానవ సంగీతం కాదు. అది భగవానుని సంగీతం. అందలి ఆనందంకూడా భగవత్సంబంధమైన ఆనందమే. ఇంతకూ అభిప్రాయమేమంటే — ఆనందాన్ని నిజంగా భగవంతుని నుండే పొందాలి. అన్యథా గతిలేదు.

మనుష్యుడు ప్రతివాడూ ఏదో ఒకవిధంగా దుఃఖంతో వేధింపబడ్తూనే ఉన్నాడు. అచ్ఛమైన స్వచ్ఛమైన ఆనందం వానికి కరువుగానే ఉంది. గీతయొక్క మొదటి అధ్యాయం — అర్జునవిషాదయోగం, యీ భావాన్నే సూచించింది. దుఃఖవ్యాకులుడైన మానవుడు సంపూర్ణానందాన్ని పొందే కోసం — వేరేమాటల్లో — యీశ్వరునిలో కలిసేటందుకొరకు వాంఛిస్తూనే ఉన్నాడు. మనలోని ఆంతరంగిక పరిస్థితికి ప్రతిబింబంగా విషాదయోగాన్ని భగవద్గీత చూపిస్తుంది. మనమున్నచోటి నుండీ, అనగా విషాదయోగంనుండీ — మనతో కలిసి ప్రయాణంచేస్తూ భగవద్గీత మనకు లక్ష్యవస్తువుగా ఉండే పరమానందాన్ని పొందించేటందుకోసం మార్గదర్శకమై నిలబడింది.

గడచిన విషయాన్నంతా ఒక్కసారి ఎగాదిగా చూడండి. ప్రపంచంలోని ప్రతినరుడూ నారాయణత్వాన్ని అపేక్షిస్తూన్నాడు. ఈ సంకల్పాన్ని సఫలం చేసికోవాలంటే అగత్యమైన కర్తవ్యమేమి? భగవద్గీతలోని నరుడు (అర్జునుడు) తన లక్ష్యసిద్ధికోసం నారాయణున్ని (శ్రీకృష్ణుని) యేవిధంగా అనుసరించాడు? కృష్ణార్జునులకు లోగడ ఉండిన సంబంధాలన్నీ తుడిచివైచి గీతోపదేశ సందర్భంలో నిలిచిన సంబంధాన్ని గుర్తించండి. అర్జునుడు రథికుడు. శ్రీకృష్ణుడు సారథి. నరుడు ప్రయాణికుడు. నారాయణుడు మార్గదర్శి.

వినండి — వెనుకటి విషయం. భారతయుద్ధం నిశ్చయమైంది. యుద్ధసహాయార్థం శ్రీకృష్ణున్ని కోరేటందుకు అర్జునుడూ దుర్యోధనుడూ ద్వారకానగరం పోయారు. సరే; కృష్ణుడంగీకరించాడు. శస్త్రాస్త్రసన్నద్ధులు — యుద్ధవిద్యావిశారదులు — తనవారు యాదవవీరులు పదివేలమందిని ఒక వాటాకు పెట్టినాడు. మరొక్క ఎత్తుకు

ఆయుధాన్ని ముట్టనంటూ యుద్ధం చేయనంటూ తాను నిలిచాడు. చెంపకు భాగాన్ని కోరుకొమ్మన్నాడు. ఖాళీచేతులతో దండగమారి కృష్ణుడు తనకు పనిలేదని దుర్యోధనుడు తలపోశాడు. వాని దృష్టి మన మాదిరిగానే గుంపులమీద, అంకెలమీద, ఎత్తుపొడుగులమీద, మెజార్టీ మీద పోయింది. దుర్యోధన మహారాజు గాలికిపోయే పొట్టుచెత్తను కుప్పబోసుకొన్నాడు. వాడు వద్దని పోద్రోచినవస్తువునే అర్జునుడు మహా ప్రసాదమని — అహోభాగ్యమని ఆదరబాదర కౌగిలించుకొన్నాడు. నిజానికతడు గుణాన్ని గ్రహించాడు. యోగ్యతను పసిబట్టాడు. సచరా చరానికంతా జీవనాడిగా — ఆయువుపట్టుగా ఉండే కీలకసూత్రాన్ని దక్కించుకొన్నాడు.

"కృష్ణా! నీవు నాకు గురుదేవునివి. నీకు నేను విధేయ శిష్యుణ్ణి. నాకు కావలసిన శ్రేయోమార్గంలో నన్ను నడిపించు. నీ అండజొచ్చాను." అని మనవిమాత్రం చేయడం కాకుండా తన తేరి పగ్గాలు ఆతని చేతిలో పెట్టాడు. నామకార్థం కాకుండా అక్షరాలా యథార్థమైన సారథిగా జేశాడు. నిరంకుశస్వాతంత్ర్యాన్ని గురువునకు నివేదించాడు. గురునాథుని పెత్తనంలో తనకు యిసుమంతైనా జోక్యంలేదు; జోలిలేదు. ఆతని చేతిలో తాను కీలుబొమ్మ. అర్జునుని ప్రపత్తి గిల్టుబంగారు గాదు. ఆతని భక్తి కౌంటరు రూపాయిగాదు. దేశీయ గవర్నమెంటులో కౌంటరు రూపాయలు చేసేవారు యెలా శిక్షార్హులో, అలాగే భగవంతుని రాజ్యంలో కపటభక్తి, కృత్రిమ వినయం చేసేవారు నిజంగా దండనీయులు.

గీతాభక్తులారా! మన తొలిసారి కర్తవ్యమేమో, ఊహించారా! రారండి. జగన్నాథుడూ, విశ్వసంచాలకుడూనైన శ్రీకృష్ణభగవంతుని కరకమలాలల్లో మన సర్వస్వం సమర్పిస్తాము. ఆతడు సర్వజ్ఞదేవుడు. మనకు కావలసిన పరమకల్యాణాన్ని — మహోత్తమ తారకాన్ని గుర్తించి యిస్తాడు. ఆయున సర్వశక్తి సంపన్నుడు. మన స్థితీ గతీ సుధా రించి జీవనరథాన్ని కడముట్టా లక్ష్యాన్ని చేర్చగల్గే ధురంధర నాయకుడు. ఆతడు భక్తవత్సలుడు మాత్రమేకాదు; భక్తపరాధీనుడుకూడా. భగవం తుడైతేమాత్రం—భక్తుని కోర్కెను ఉల్లంఘించి పోగల్గుతాడా? నస్మరంతి. పాపిష్ఠిప్రారబ్ధంబట్టి వల్లార్చకనేపోతే—సర్వజ్ఞుడూ సర్వశక్తుడూ భక్తపరా

ధీనుడూనైన భగవంతున్ని సారథిగా చేసికోడానికై — యింతగా నంజిలి పడడం — నీళ్లు నమలడం — తటపటాయించడంతో పనేముంది? భగవంతుని భక్తులన్నా, భగవద్గీతా భక్తులన్నా, ఒకటేమాట. గీతాబోధను తిరస్కరిస్తూ, గీతాచార్యుని భక్తులు కాగోరడం, అరెరే! కొడుకు బాగుండాలి. కోడలు ముండమోయాలి! అదెలా సాధ్యం?

నారాయణ భగవంతుని పాదపద్మాలనుముట్టి "కరిష్యే వచనం తవ" అని నరుడు శాబ్దీ పలుకాలి. నాడే శ్రీ లభిస్తుంది. విజయం వస్తుంది. భూతి చేకూర్తుంది. వెయ్యేల! తనకు పరమప్రాప్యంగా ఉండే నారాయణత్వంగూడా సిద్ధిస్తుంది.

లేలెండి! నడుములు బిగించండి. మన హృదయమందిరంలో గూళ్లుకట్టుకొన్న గబ్బిళాలను తరిమివేయండి. పై పై ముసిరిన గొంతెమ కోరికలను 'ఉఫ్' అని ఊదివేయండి. క్షుద్రమైన హృదయదౌర్బల్యాన్ని పెకలించి వేయండి. 'ఇది చేస్తే యేమొస్తు'ందనే నీచ స్వభావాన్ని ఉచ్చాటనంచేసి 'భగవంతునికోసమై యేమి సమర్పించాలి' అనే ఉదాత్త స్వభావాన్ని ఆవాహనం చెయ్యండి. మీ 'లేనాదేనా' వ్యాపారం భగవంతునివరకూ యెగుమతి చేయాకండి. భగవంతుని హృదయాన్ని కరిగించారంటే — భగవంతునికి కనికరం కల్గిందంటే బ్రహ్మాదిదేవతలకు దుర్లభంగా ఉండే — ఆశకూడా అందుకోలేనట్టి — అతీతపదవి సిద్ధిస్తుంది. మీ శక్తియుక్తులన్నీ ఆతని ప్రేమకై కోరుబెట్టండి. మీ సర్వసమస్తం ఆయన ఆరాధనలో ధారపోయండి. మీ రూప స్వరూపాలన్నీ ఆ పరాత్పరునిలో లవలీనం చేయండి. ఆ దేవదేవుని ఆజ్ఞలను తు.చ తప్పకుండా, అక్షరాలా శిరసావహించి పాలించేదానికై కంకణబద్ధులు కండి! అప్పుడే సత్యదేవుడు భగవంతుడు మాటదప్పకుండా, వీసం పొల్లుపోకుండా అసలు వడ్డీతోసహా, మీకు ఫలసిద్ధినిస్తాడు. వెయ్యేల! మీకు ఆజన్మప్రియంగా ఉండే, అనాదిహక్కుగా ఉండే స్వస్వరూప స్వత్వాన్ని — నారాయణ స్వరూపాన్ని - ప్రసాదిస్తాడు. ఇంతకుమించి కోరవలసిన పనిలేదు; కోరదగింది లేనూలేదు. "త్వమేవ సర్వం మమ దేవదేవ!!"

ఓమ్.



# పరమశాంతి లభించుటెట్లు?

## స్వామి సచ్చిదానందసరస్వతి

సంపాదకులు — "అధ్యాత్మ ప్రకాశ"

✶

[ శ్రీవారు, గీతావాణి పాఠకులకు అపరిచితులు కారు. ప్రతి గీతాజయంతి సంచిక యందును వీరి వ్యాసమును పాఠకులు చదువుచునే యున్నారు. శ్రీస్వామి వారు అనుగ్రహించి పంపిన కన్నడవ్యాసమునకు యిది అనువాదము. — సం॥ ]

శాంతికి ఉపాయమేద్ది? - లోకము నందు యీనాడు యెందెందు చూచినను అశాంతి తాండవించుచున్నది. వ్యక్తులు కాని, సంఘ సమాజములు కాని, వెయ్యేల, ప్రతివారును శాంతి సమాధానములకై మొగమువాచి దేబరించుచున్నారు. జనులు నానా విధములగు శాంత్యుపాయములను వెదకుచున్నారు; కాని వాటియం దొక్కటియు సరిగ ఫలించుటలేదు.

రాజ్యభారక్రమమును మార్చినచో శాంతి చిక్కునని కొందరి ఆశ; ఈనాడు రాజుల పాలనము ఏదో కొన్నిచోట్ల మాత్రమే యున్నది. తక్కుతావులందెల్లను, ప్రజాసత్తాక రాష్ట్రము లేర్పడినవి. కొన్ని యెడల కూలీల రాజ్యములు స్థాపింపబడినవి; కాని శాంతిమాత్రము సున్న.

విద్యాపద్ధతిని - ఆర్థికవ్యవస్థను సరిదిద్దినచో శాంతి లభించునని కొందరి ఆశ; ఇహలోక జీవనమునకు కావలసిన తెలివితేటలను బాల్యమునుండియు నేర్పుచున్నారు. భౌతికవిజ్ఞానమును మథించి జీవితావసరవస్తు సామగ్రులను చిత్రవిచిత్రోపాయములతో సంపాదించుచున్నారు. కాని శాంతి మాత్రము యెప్పటి చోటున అందకనే యున్నది.



ధనవంతులను పిండి వారి ధన ధాన్యభూ సంపదధికారములను లాగికొని బీదలకు పంచిపెట్టు చున్నారు. పలువిధములగు చట్టములను సృష్టించి సమాజ స్వరూపమును సంస్కరించుటకు ప్రయత్నించుచున్నారు. కాని, అదేమి మాయయో! శాంతి రానే రాలేదు.

రాష్ట్రములు రాష్ట్రములు ఒకరొకరు నామాలు వ్రాసుకొనుచున్నవి. కొన్ని

ఒప్పందములతో శాస్త్రముల ఏకీకరణము నకు పాటుపడుచున్నారు. మిత్రరాజ్య సమితియని భద్రతా సమితియని క్రొత్త సంస్థను సృష్టించుకొనియున్నారు. కాని, శాంతి అగుపించు జాడయే లేదు.

ఆత్మస్తుతి – పరనిందలను యథేష్టముగ ప్రచారము చేసి తమ తమ కీర్తిని వ్యాపింప జేసికొనుటకు వ్యక్తులును సంఘములును పోరాపోరి కృషిసల్పుచున్నవి. దేశదేశ ములందును సైనికసంఖ్యను హెచ్చించు చున్నారు, రక్షణభద్రతలకు స్వయంసేవక దళములను సమకూర్చుచున్నారు. వివిధ ములగు ఘాతుకాస్త్రములను నిర్మించు చున్నారు. తద్వారా యుద్ధభయము తీఱి భూమండలమున శాంతి నెలకొనునని ఉవ్విళ్ళూరుచున్నారు. వీరుచేయు ఉపా యములవలన మరింత అశాంతియే బలమగు చున్నది. అభూతపూర్వమగు విశ్వమహా యుద్ధమే ఆవిర్భవించుననెడి భీతియే అంద రిని ఆవరించుచున్నది.

గీతాచార్యుడగు భగవంతుడు ఒక శాంతి ఉపాయమును ఉపదేశించి యున్నాడు. మనకు తెలిసిన ఉపాయము లన్నియు వృథాయని గ్రహించిన పిదప నైనను ఆ ఉపాయమును యెందుకు అనుస రింపరాదు? ఇదో! మంగళకరమగు గీతా వాణిని ఆలకింపుడు.

“ఈశ్వరస్సర్వభూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా ॥
తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥”

ఈశ్వరుడు సర్వభూతముల హృదయ ములందును నున్నాడు. అయినను, జీవులెల్ల రును ఆతని మాయకు మోహితులై యెట్టెట్లో పరిభ్రమించుచున్నారు. బైట నుండెడి త్రిగుణాత్మకములగు వస్తువుల యొక్క బాహ్యరూపమునకు మోహించి వాటి వెంటబడి అంగలార్చుచున్నారు. “ఇదికావలెను – ఇదికావలె” నని ప్రతి వాడును వాపోవు చున్నాడు. యంత్రము నకు తగిలించిన కీలుబొమ్మలవలె, మాయ యనెడి కీలుకు చిక్కి కులుకుచు నానా సర్గములకు గురియగు చున్నారు. ఒకనిపై నొకనికి సంశయము. ఈ పరిస్థితిలో శాంతి యెట్లు లభించగలదు?

శాంతికి ఉపాయమేది యనుట దీనివలన స్పష్టము. ఎందుకనిన – మాయయనునది బైటితోరికమాత్రమే. మాయయొక్క బారికి చిక్కి మోసపోరాదు. మాయకు మూలమై యుండు మాయావిని శరణు బొందవలెను. బైట గోచరించునది నిజమునకు యీశ్వరుని విభూతియే. మనకు కాన్పించు సర్వప్రపంచకోటి హృదయములందు ఆ యీశ్వరుడే యున్నాడు. అందువలన, సంశయమునకు వశము కారాదు. మీయెదుట నగుపించు వారందరును యీశ్వరాంశ సంభూతు లనియు, వారందరి హృదయములందును ఆ యీశ్వరుడే ఉన్నాడనియు నమ్ముడు.

ఈశ్వరుడు అన్ని భూతములకును అంతరాత్మయై యున్నాడు. నీ హృద్దేశము నందు యీశ్వరుడు అంతరాత్మయై ఉన్నాడని మొదట గ్రహించుము. నీకు ఆత్మయై యుండెడి యీశ్వరుడే నీ చుట్టుముట్టును ఉండువారికి నైతము ఆత్మయయ్యే ఉన్నాడనెడి భావమును హృదయమున పదిల పరచుకొనుము. "అందరమును యీశ్వరునినుండియే వచ్చియున్నాము. మా అందరి హృదయములందును యీశ్వరుడే వెలసియున్నా"డని గట్టిగ భావించుడు. "సర్వాత్మ స్వరూపుడగు వాసుదేవ భగవంతుడే మనకుగతి. ఆతనినే అన్నివిధముల శరణుబొందుచున్నా"మనెడి ఉత్తమ భావనతోకూడి జీవితమును సాగించుటకు యత్నింపుడు. దీనివలన, మనకు పరస్పరము గల సంశయచిత్తము మటు మాయము కాగలదు. పరస్పరవిశ్వాసము హెచ్చగలదు. జీవకోటికి సంతోషమును కల్గించుటయె యీశ్వరుని పూజయనుట మరువకుడు. అట్టిరోజు మీచిత్తమందలి అశాంతి మాసిపోగలదు. శాంతి లభింపగలదు.

'శాంతం శివ మద్వైతం' అని యీశ్వరుని గురించి ఆధ్యాత్మ శాస్త్రములు ఘోషించు చున్నవి. ఈశ్వరుడు మనందరి హృదయములందున్నాడనుట సకలశాస్త్రముల యొక్క, సకలశాస్త్ర సారభూతమగు గీతయొక్క ఉత్తమోపదేశము. ఆ యీశ్వరుడు మన హృదయములందు ప్రతిష్ఠితుడై విలసిల్లవలెనని మొదట మాయ యొక్క ఆరాధనను మనము విడువవలసియున్నది. రాగద్వేషములకు చిక్కి ఒకరినొకరు సంశయచిత్తములతో చూచెడి స్వభావమునకు స్వస్తి చెప్పవలెను. మనకు కాన్పించు అతృప్తికిని అశాంతికిని అన్యజనులు కారణమనెడి క్షుద్ర భావనను నివృత్తి చేసుకొనుటకై, "ఓ భగవంతా! నీ మాయావిలాసమును ఉపసంహరించుకొమ్ము. నిన్నే శరణు జొచ్చుచున్నాను. పరమార్థమైన నీ శాంత శివరూపమును కృపతో చూపింపుము. నీ అంశభూతులై యున్న సకల జీవకోట్లయందును నిన్నే దర్శించి ఆరాధించెడి యోగ్యతను ప్రసాదించు" మని ఆర్తనాదమున మొఱలిడవలెను. ఆనాడే మనకు పరమశాంతి లభించగలదు.

---

विजयाश्रमम्,
मद्रास.

प्यारे आत्मीय !

गीता ग्रन्थ, वेद उपनिषद और सब शास्त्रों की निचोड है। आप आपके गीतावाणी में इसका प्रचार का कार्य कर रहे हैं। भगवान आपको धैर्य उत्साह और बल प्रदान करें।

अपका का आप में
—शाम

# ఓం తత్ సత్ ★ ఆచార్య వినోబాభావే.

[—పూర్తిపేరు శ్రీ వినాయక భావే. వీరి జన్మస్థానము బరోడా. మాతృభాష మరాఠీ. ధర్మశాస్త్రాలను సరహస్యంగా జీర్ణింపజేసుకొన్న మహనీయుడు. ప్రపంచమతాలన్నింటినీ సూక్ష్మంగా పరిశీలించిన ఉదారచిత్తుడు. వీరికి గీత అంటే యెనలేని పక్షపాతం. గీతను 'ఆయి' అని పిలిచేవాడు. ఆయి అంటే తల్లి. సహజజన్యమగు కవితాప్రతిభతో గీతాశ్లోకాలకు మరాఠీ పద్యానువాదం చేశారు. ఆ గ్రంథానికి 'గీతాయి' అని పేరు.

శ్రీ గాంధీగారు ఆరంభించిన వ్యష్టి సత్యాగ్రహంలో యీయన మొట్టమొదట యెన్నుకొన్న వ్యక్తి. విచారశక్తి, ఆచారశక్తి, ప్రచారశక్తి యీ మూడింటి సమరసమూర్తి కాబట్టి వీరికి 'ఆచార్య' బిరుదము అన్నివిధాల సార్థకము. 'జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ', అనే సూత్రము వీరిపట్ల చరితార్థము. వీరు వ్రాసిన 'స్థితప్రజ్ఞదర్శనం'లోని కొన్ని భాగాలను సంకలించి యీ వ్యాసం వ్రాయబడింది. —సం.]

## 1. స్థితప్రజ్ఞుడనగా—?




అన్ని వికారాలను గడచి, అన్ని ఉపాధులను అతిక్రమించిపోయిన బుద్ధికి స్థిరత్వం యేర్పడుతుంది; పృథక్త్వం సిద్ధిస్తుంది. అప్పుడు దాన్ని ప్రజ్ఞ అంటారు. ప్రజ్ఞ అనే మాటలో విశేషార్థం ఉంది. మనస్సు దాడిచేయగలేది బుద్ధిపైన మాత్రమే. అది తన వివిధవికారాలతో బుద్ధిని కల్లోలం చేస్తుంది. కానీ మానసిక వికారాలు ప్రజ్ఞపై దాడిచేయ లేవు. మానసిక వికారాల తాకిడికి తట్టుకొని దృఢంగా నిలువగల్గిన బుద్ధినే ప్రజ్ఞ అంటారు. దాన్ని కల్గినవాడు స్థితప్రజ్ఞుడు.

ఈ అపారవారమైన సృష్టి పరమేశ్వరునియొక్క బహిరంగ స్వరూపం; ప్రకటస్వరూపం. ఆ పరమేశ్వరుని తెలుసుకొనేకోసం ఒక్కొక సాధనం స్థితప్రజ్ఞుడు. అతడు యోగి; అతడు జ్ఞాని. గీతలో చెప్పిన స్థితప్రజ్ఞలక్షణాలు సాధకునియందూ, సిద్ధునియందుకూడా అన్వయించ కల్గియున్నట్లే ఆ లక్షణాలు పరమేశ్వరునిపట్ల సైతం అన్వయిస్తాయి.

## 2. పరమేశ్వరుని మొదటి స్వరూపము; కేవల శుభము.

ఈశ్వరుని మొదటి స్వరూపము కేవలము శుభము. మనుష్యుని ఆకాంక్షలన్నిటిలో శుభమే ఆవేశించి ఉంది. వాని అభిలాషలు, మంచివికానీ—చెడ్డవికానీ, వాటివల్ల శుభమే

కావాలని_మేలే రావాలని వాని ఆశ. మనుష్యుడు యెప్పుడూ శుభాన్నే ఆకాంక్షిస్తాడు. మోసగాడు యితరులను మోసగింపకోర్తాడే, కానీ _ తాను మోసపోవాలని తలంచడు. హింస చేసేవాడు సైతం తనతట్టు శుభమే ఉండాలనుకొంటాడు. మానవుని హృదయం శుభాన్నే ఆశిస్తుంది. మనుష్యుడు నిజానికి స్వతః మంచివాడే. "అయ్యా! నీవు దైవీ సంపదలో పుట్టావు" అన్న భగవంతుని ఊఱడింపు ఆ ఒక్క అర్జునునికి _ ఆ ఒక్క నరునికి మట్టుకు అన్వయించి నిలువదు. అది నరులందరికీ అన్వయించే ఓదార్పు. మానవునిలో అగపడే లోట్లూ పాట్లూ, తప్పులూ దోషాలూ, వానిలో యింకా మిగిలివుండే పశుత్వ చిహ్నాలు మాత్రం; పాశవిక స్వభావాలు మాత్రం. వాస్తవానికి మానవుని హృదయం శుభంతోనే నిర్మింపబడింది. శుభనిలయమయ్యే ఉంది; కాబట్టే ప్రతివాని హృదయదేశంలో భగవంతుడు (శుభస్వరూపుడై) కూచోనున్నాడని గీత (18_61) పల్కింది.

## 3. భగవంతుని రెండోస్వరూపము విశ్వరూపము.

ఈశ్వరుని రెండోస్వరూపము విశ్వరూపము. అది పరిపూర్ణమై ఉంది. అందులో శుభమూ ఉంది; అశుభమూ ఉంది. కమలాపండులో తీపూఉంది; వగరూ ఉంది; చేదూ ఉంది. ఇన్నీ కలిసే కమలాపండు. తినేవాన్ని అడుగుదాము. "అయ్యా! పండు యెలా ఉంది?". వాడంటాడు, "భేషుగ్గావుంది. మజాగావుంది". పైతోలుగాని, పిప్పిగాని, లోపల విత్తనాలుకాని వాని లక్ష్యంలో లేవు. వానిదృష్టిలో రసానికే విలువ. తక్కిన వాటికి స్థానమే లేదు. కానీ పండు అంటే అన్నీ కలిసేగదా పండు. ఇన్నీ వున్నా మొత్తానికి పండు రుచిగానే వుంది. తోలు_పిప్పి_విత్తనాలు, మానవుని లెక్కలో గౌణాలే కావొచ్చు. అయినా రసాన్ని పోషించేటందుకు అవి ఆవశ్యకాలయ్యాయి. అలాగే మొత్తం కలకలిపితే జగత్తు శుభమయ్యేవుంది. ఇందులో అశుభం లేకపోలేదు. వుంది. ఉన్నా, అది శుభాన్ని శోభింపజేసేకోసం. ఈ జగత్తును చూస్తే భయమూ కల్గుతుంది. ప్రేమా ఉదయిస్తుంది. సముద్రంవలె హిమాలయంవలె యిది భయానకమూ అయివుంది; రమణీయమూ ఐఉంది. కాబట్టే పరమేశ్వరున్ని రుద్రునిగను, సౌమ్యునిగను వర్ణించుట కద్దు.

## 4. పరమేశ్వరుని మూడోస్వరూపం; శుభాశుభాలకు అతీతం.

అది సృష్టికి ఆవలిది; బుద్ధికి ఆవలిది; ఊహాలకు ఆవలిది. అది పరమేశ్వరుని మూడో స్వరూపం. అది వాచామగోచరము. అది శుభమూకాదు; అశుభమూకాదు. దాన్ని చెప్పగలిగేది 'నేతి_నేతి' నకారాత్మక శబ్దము ఒకటే. వేదాంతులు దాన్ని బ్రహ్మమంటారు. అది అన్నింటికి అతీతమై ఉండికూడా అన్నింటికి ఆధారమై ఉంది.

## 5. పరమేశ్వరుని స్వరూపం:_గీతయొక్క పరిభాషననుసరించి;

ఇంతవరకూ చెప్పిన భగవంతుని మూడువిధాలైన స్వరూపాలు గీతలో అందందు నిర్దేశింపబడ్డాయి. మొదటిది శుభస్వరూపం. అది మానవీ ఆకాంక్షలకు కేంద్రరూపం.

దీన్నే మరోవిధంగా, చతుర్భుజస్వరూపమని భక్తులు భావిస్తారు. మానవుల అభిలాషలకు యిది ప్రతీకం. మనుష్యులు తమ ఆకాంక్షలకు అనురూపంగా ఆ చతుర్భుజరూపాన్ని పరి కల్పించారు. అది మానవజాతికి సంబంధించి ఉన్న పరమాత్ముని స్వరూపం. రెండు చేతులు గల మానవుడు తన ప్రత్యక్ష జీవితంలో పరమేశ్వరుని రూపాన్ని పూర్తిగా ప్రకటించు కొనుటకు అలవిగాదు, కాబట్టి, ఆ అతిశయత్వాన్ని నిరూపించేకోసం మరి రెండు చేతులు అతికించి భగవంతున్ని చతుర్భుజునిగా ప్రతిష్ఠించాడు. చతుర్భుజ భగవంతుని దర్శనాన్ని కోరుట అంటే-వేరేమాటల్లో-చొక్కమూ నికరమూ శుభమూ మంగళమూనైన పరమే శ్వర స్వరూపాన్ని అనుభవించాలని అపేక్షించుట అని అర్థం. ఆ స్వరూపానికి భగవద్గీత 'సత్' అని పేరు పెట్టింది. "ఓంతత్ సత్" లోని 'సత్' శబ్దము ఆ శుభస్వరూపాన్ని సూచించేదే. రెండోది విశ్వరూపము. కాలస్వరూపమంటూ, విరాట్ స్వరూపమంటూ దాని వర్ణన పదకొండో అధ్యాయంలో చెప్పబడింది. సమగ్రత్వమూ పరిపూర్ణత్వమూ ఆ స్వరూపములోని విశేషాలు. ఆ స్వరూపానికి 'సదసత్' అనే శాస్త్రీయనామం భగవద్గీత పెట్టింది. మూడోది గుణాతీతరూపము. అందులో ఆకారము లేదు; వికారము లేదు; ప్రకా రము లేదు. అయినా అది సర్వాధారము. గీతభాషలో 'నసత్తన్నాసత్' అని దానికి పేరు. అది బ్రహ్మస్వరూపం. దానివర్ణన పదుమూడు పదునాల్గు పద్దెదో అధ్యాయాల్లో చెప్ప బడింది.

## 6. స్థితప్రజ్ఞుడు పరమేశ్వరునికి ప్రతీకం.

పైన చెప్పిన పరమేశ్వరుని మూడు స్వరూపాలు స్థితప్రజ్ఞుని మూడు అవస్థల్లో గోచరిస్తవి. తర్కదృష్ట్యా చూస్తే యీసత్-అసత్తులను నాల్గురకాలుగా విభజించొచ్చు. 1. కేవలసత్తు, 2. కేవల అసత్తు, 3. సదసత్తు, 4. నసత్ నాసత్. వీటిలో రెండోదియగు కేవల అసత్తు దేవునికి అన్వయించదు. సైతానుపాలికి చెందుతుంది. తక్కిన మూడూ పరమేశ్వ రునకు సంబంధిస్తవి. ఈశ్వరునకు నాల్గవ స్వరూపం లేదు; స్థితప్రజ్ఞునికి నాల్గో అవస్థలేదు.

ఈ అర్థాన్ని సూచించే ఒకశ్లోకం నవమాధ్యాయంలో ఉంది. మహాభారతంలో వ్యాసఘట్టాలని పేర్పొందిన శ్లోకాల్లో యిది ఒకటి. భాష్యకారులు దీనికి వివిధ అర్థాలు వ్రాశారు. నాకు తోచిన అర్థాన్ని విశదీకరిస్తాను.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ (9-15)

ఇది శ్లోకము. జ్ఞానయజ్ఞముద్వారా ఎవరు నన్ను అర్చించుచున్నారో, వారు ఏక త్వమునను పృథక్త్వమునను బహురూపమునను నా వ్యాపకస్వరూపమును ఉపాసించువా రగుచున్నారు. ఏకత్వ పృథక్త్వ బహుత్వ స్వరూపముల పరమేశ్వరుని భజించువారు మూడురకములుగ జ్ఞానులు వేరువేరుగ ముగ్గురున్నారని కాదు. ఒక్క జ్ఞానియే తనయొక్క

ఆయా మూడు భూమికలందు పరమేశ్వరుని మూడు ప్రకారముల నుపాసించుచున్నాడు. 'నసత్ నాసత్' అని గీతచెప్పిన పరమేశ్వరస్వరూపాన్ని - అనగా - నిర్గుణ బ్రహ్మతత్త్వాన్ని జ్ఞానిపురుషుడు అద్వైతభూమికయందు అనుభవించును. అది ఏకత్వోపాసన. పరమేశ్వరుడు కేవలసత్తు; ఆయన అసత్తుకాదు, అనెడి అనుభవము పృథక్త్వోపాసనచే కల్గును. సత్తు అసత్తు అంతాకలిసి ఆతనికి ఒకే జీవనమనుట బహుధా ఉపాసన.

## 7. స్థితప్రజ్ఞుని మూడు భూమికలు.

ఈ మూడు భూమికలూ ఒకేజ్ఞానివే. ఆతడు క్రియావస్థలో పరమేశ్వరుని కేవల సత్‌స్వరూపునిగా దర్శిస్తాడు. అప్పుడు ఆతనిభూమిక పృథక్త్వమునకు చెందినది. అనగా, వివేకయుక్తమై ఉండునది. ఈ శ్లోకంలోని ప్రసంగము జ్ఞానయజ్ఞానికి సంబంధించినది కాబట్టి, పృథక్త్వముతో చేసే ఉపాసన అనేమాటకు అర్థము - సదసద్వివేకయుక్తమగు జ్ఞాన దృష్టియని చెప్పుకొనుట సబబు. బహుధా ఉపాసన అనగా, అనంతస్వరూపుడైన పరమేశ్వరుడు శుభ అశుభ స్వరూపముల రెంటిలోకూడ నుసజ్జుడైయున్నాడని చేసే ఉపాసన. ఇదొక్క భూమిక. ఇది స్థితప్రజ్ఞుని భావావస్థ. అన్నిటియందును సమన్వయమును సాధించెడి, వాని అవిరోధ చిత్తవృత్తి యీ భూమికయందు స్పష్టమై ఉండును.

ప్రతియొక్క స్థితప్రజ్ఞుని జీవితంలోను యీ మూడు భూమికలు మిళితమయ్యే ఉన్నాయి. కాని పైపైచూపుకు ఒక్కొక్కనియందు క్రియావస్థ ప్రధానముగ నగపడును. మరొకనియందు భావావస్థ ముఖ్యమై తోచును. వేరొక్కనియందు జ్ఞానావస్థ ప్రధానస్థానమునందుండును. బాహ్యదృష్టికి యెట్లున్నను లోపల యీ మూడు భూమికలును సమానములే. భావనయొక్క ప్రభావపరిణామము క్రియపైనను, క్రియయొక్క ప్రభావము భావనపైనను, జ్ఞానముయొక్క ప్రభావము ఆరెంటిపైనను పరిణామము చూపకపోదు. స్థితప్రజ్ఞుని జీవితంలో జ్ఞానమును భావమును ఏకరసమై ఉండగలవు.

## 8. 'ఓం తత్ సత్' మంత్రములోని భావన.

ఈ మంత్రము పదేడో అధ్యాయం చివర చెప్పబడింది. ఇది మూడు శబ్దాలతో కూడి ఉన్న మంత్రం. చిన్నదే అయినా విలక్షణమై సామర్థ్యంగల మంత్రం. తుపాకిగుండును మించినశక్తి మంత్రంలో ఉంటుంది. మంత్రప్రభావంతో మనుష్యుడు తన జీవితాన్ని చక్కదిద్దుకొంటాడు. మంత్రప్రేరణవల్ల మానవుని జీవితం మంత్రమయమూ మంత్రరూపమూ కాగల్గుతుంది.

ప్రతివాడూ స్థితప్రజ్ఞుడుగా తయారుకావాలని గీతకు అభిలాష. అదే ఆంతర్యంతో దయామయియైన గీతామాత చింతామణివంటి యీ మంత్రాన్ని ప్రసాదించి మన మార్గాన్ని సులభం చేసింది. ఈ మంత్రము వేదసారము; ఉపనిషత్ సారము.

## 9. 'ఓం'_భావావస్థను ప్రకటించేది.

'ఓం' అనునది యీ మంత్రంలో మొదటిపదం. ఓం_అనగా యీశ్వరతత్త్వము; విరాట్టు; వ్యాపకము; విశాలము; సమస్తాన్ని తనలోనికి ఆకళించుకొనే పరబ్రహ్మము యొక్క సగుణస్వరూపము. ఓం అనునది ఒకే అక్షరమూ కాగలదు; కొన్ని అక్షరాలతో కూడిన శబ్దమూకాగలదు. శబ్దమైనపుడు దాని అర్థము 'ఔ' అనే సమ్మతిని చూపును. పరమేశ్వరుని ఒప్పుటకు ఓంకారము సూచన.

"తుకాహ్మణే జేజే బోలా, తేతే సాజేయా విఠలా" అంటూ తుకారాముడు ఆస్త్యాత్మకంగా పరమేశ్వరుని వర్ణించాడు. ఈశ్వరుడు సాకారుడా? ఔ. నిరాకారుడా? ఔc. శుభరూపుడా? ఔ. అశుభరూపుడా? ఔ. సగుణుడా? ఔ. నిర్గుణుడా? ఔ. అణువా? ఔ. మహత్తా? ఔ. అన్నింటికి ఒకే జవాబు ఔ. అదే ఓం. అదీ పరమేశ్వరుడే. ఇదీ పరమేశ్వరుడే. మన ఊహాలకి అందేవీ_అందనివీ, అన్నీ ఆయనే. ఆతని ఆ విశాల వ్యాపక భవ్యస్వరూపాన్ని నిర్దేశించే సంకేతము ఓంకారము. కాబట్టి సాధకులు భావావస్థను సాధించేకోసం 'ఓం' శబ్దము భావనీయమై ఉంటుంది.

## 10. ఓం-అక్షరం అన్ని అక్షరాలకు ప్రతీకచిహ్నం.

'ఓం'_'అ' తో ఆరంభమై 'మ' తో ముగుస్తుంది. ఆ రెంటిని సంధించేటందుకై 'ఉ' మధ్యలో వచ్చింది. అక్షరమాల 'అ'తో ఆరంభమై 'మ'తో ముగుస్తుంది. వాటి ఉచ్చారణ కంఠంతో ఉపక్రమం: ఉపసంహారం పెదవులతో. ఆ పద్ధతిలోనే ఓంకారమందు మొదట ఉండే అకారం కంఠంతో ఉచ్చరింపబడింది. చివర ఉండే మకారం పెదవులతో పలుకబడింది. 'మ'ను ఉచ్చరించుటలో ముక్కును సహా ఉపయోగించవలసి ఉంది. శబ్దోచ్చారణకు అవసరమైన క్షేత్రానికి కడ అంచునచేరి 'మ' నిలిచింది. ఆ హద్దుకుపైగా ఉచ్చరింపబడే అక్షరమే లేదు. 'మ'కు మీదట 'యరలవ'లు వాడుకలో ఉన్నా వాటి ఉచ్చారణస్థానం పెదవులకూ కంఠానికీ మధ్య. పెదవులకూ కంఠానికీ మధ్య ఉచ్చరింపదగిన అక్షరాలన్నిటికీ ప్రతినిధిగా తానూ 'ఓం'కు మధ్యలో 'ఉ' కారము వచ్చిచేరింది. ఇట్లు సమస్తసారస్వతమూ ఓంలో సమావిష్టమై ఉన్నదన్నమాట. ఓంకు యీ చెప్పిన వ్యుత్పత్తి కల్పితమే కావొచ్చు. అయినా సమస్త వర్ణాలకు ప్రతీకంగా ఉండే ఓంకారాన్ని పరమేశ్వరుని చిహ్నంగా వాచకంగా భావించి చింతించుట సాధకులకు శ్రేయోదాయకము.

## 11. ఓం - ఒకధాతువు; దాని వ్యుత్పత్తి.

ఓంకారాన్నిగూర్చి నిగాతో పరికిస్తే అది ఒక ధాతుస్వరూపమంటూ నాకు తోస్తుంది. 'భూ_కృ_అస్' ధాతువులవలె ఓం కూడా ఒకధాతువే. 'అంతటా వ్యాపించి ఉండుట' అనే అర్థంలో ఈ ధాతువు వాడబడుతుంది: ఆ అర్థాన్ని ఆధారం చేసుకొని అది

పరమేశ్వరునికి వాచకమైంది. ఓం అనగా అన్ని భూతములలోను అనుస్యూతమై ఉండే స్వరూపము. ఉమా శబ్దమునకు గూడా అదే ధాతువు. దాని అర్థము విశ్వవ్యాపినియగు దేవి. ఆ 'ఓం' ధాతువునకు 'వి' అనే ఉపసర్గచేర్చి వ్యోమన్ శబ్దము నిర్మింపబడింది. దాని అర్థము విశాలవ్యాపకమగు ఆకాశము. లాటిన్ భాషలో అమ్నిస్ అనే శబ్దం ఉంది. సమస్తము - లేదా - విశ్వము, అని దాని అర్థము. అది 'ఓం'కు వికృతి. సర్వవ్యాపకమనే అర్థంలో ప్రయోగించే అమ్నిప్రజెంట్ అనే యింగ్లీషు శబ్దం యీ తెగకు చెందినదే.

ఈవిధంగా విచారిస్తూపోతే సకలవిశ్వాన్ని ఆలింగనం చేసుకోగల్గే స్థితప్రజ్ఞుని భావావస్థను సూచించే సంకేతంగా 'ఓం' మంత్రము ఉపకరిస్తుంది.

## 12. తత్ పదము జ్ఞానావస్థను ఉద్దేశించి –

మంత్రంలో రెండోపదము 'తత్' (అది). ఏది ఇదిగాదో - సమీపవస్తువుగాదో - కల్పనకు అతీతంగా ఉందో - ఏది సత్తూ అసత్తూగూడా కాదో - అది, 'తత్' పదంతో సూచింపబడ్తూంది. 'తత్' మంత్రాన్ని చింతనచేస్తే జ్ఞానదశ సిద్ధిస్తుంది. "తత్త్వమసి" (అది నీవు) — ఉపనిషత్తుల్లోని మహావాక్యము.

"ఈ దృశ్యము మిథ్య. ఈ త్రిగుణాత్మక జగత్తు కనువుగంప. ఇది నీవుగాదు. నీవు దీనికి ఆవల ఉన్నావు. నీవు అన్నింటిని అంటనివాడివి" - అని తత్త్వమసి బోధిస్తుంది.

## 13. సత్ పదము క్రియావస్థనుగూర్చి –

మూడోశబ్దము 'సత్'. అసత్యాన్నివదిలి సత్యాన్ని గ్రహించుట - అశుభాన్నివదలి శుభాన్ని గ్రహించుట, దీనిద్వారా సూచింపబడింది. ఇట్టి క్రియాభూమికకు 'సత్' శబ్దము సూచన. 'సత్' అనగా శుద్ధబ్రహ్మము.

## 14. శుద్ధజీవనాన్ని పూర్ణవిచారాన్ని నిరూపించేమంత్రం ఓం తత్ సత్

ఓం = వ్యాపకబ్రహ్మము. తత్ = నిర్గుణబ్రహ్మము. సత్ = శుద్ధబ్రహ్మము. ఈ మూడుపదాలూ జ్ఞానియొక్క మూడుదశలనూ, మూడు భూమికలను ప్రదర్శిస్తూన్నాయి. ఇవి అలాగా అలాగా అవస్థలుకావు. మూడూ కలిసి జ్ఞానియొక్క ఒకే జీవితప్రవాహం. క్రియావస్థలో 'సత్' ముఖ్యము. స్థూలజీవితానికి ముఖ్యభాగము క్రియేగదా! మహాపురుషుల చరిత్రలను వ్రాస్తే ముఖ్యంగా వారు చేసిన కార్యాలే అందు వర్ణింపబడ్డవి. ఆ ధోరిణిలో యీ మంత్రమందు 'సత్' శబ్దానికి ప్రాముఖ్యమివ్వబడింది. వ్యాకరణ పరిభాషలో యిది సంజ్ఞా (Noun) వాచకము. ఓం-తత్, యీ రెండూ దానికి విశేషణాలు. పూర్తి మంత్రము ఓం తత్సత్.

'ఓం = వ్యాపకము, తత్ = నిర్లిప్తమునగు, సత్ = పరిశుద్ధ జీవనము'. ఈ విధంగా ఈ మంత్రము పూర్ణజీవితాన్ని నిరూపిస్తూంది. మానవజీవితంలోని ప్రతి ఒక్క ఆచారవిచారాలపై యీ సూత్రాన్ని జారీచెయ్యొచ్చు. స్థితప్రజ్ఞుని మూడు అవస్థలైన జ్ఞానభావ క్రియలను నిగాలో పెట్టుకొని గీత యీ మంత్రాన్ని ప్రవచించింది.

ఓమ్

# శ్రీమద్భగవద్గీతాష్టోత్తర శతనామస్తోత్రమ్.


రచయిత: సాహిత్యవేదాన్తాచార్య, శ్రీ కృష్ణచరణమ్, కాశీ.

M. A. (Previous) B. H. U.






[ మా మిత్రులగు శ్రీ కృష్ణచరణమ్‌గారు హిందీ, సంస్కృతభాషలలో ఉన్నతపరీక్షలయం దారితేరిన ప్రతిభావంతులయిన నవయువకులు. వేదాంతాచార్య పరీక్షయందు (1952లో) సర్వప్రథమంగా ఉత్తీర్ణులయినందున ప్రభుత్వ సంస్కృత మహావిద్యాలయం (బనారస్) వారు వీరికి స్వర్ణపతకాన్ని బహూకరించారు. ఆంధ్రభాషలో కూడా చక్కటి రచనలు నడిపించగలరు.

శ్రీ మహర్షి మలయాళస్వాములవారి ఆదేశాన్ననుసరించి రచించిన వీరి అష్టోత్తర శతనామస్తోత్రం గీతామాతను ఇష్టదైవంగా ఆరాధించే భక్తగణానికి నిజంగా ఎంతో ఉపయోగవంతమైందని చెప్పటంలో అణుమాత్రంగూడా అతిశయోక్తి లేదు. జయంతీమహోత్సవ సంచికలో వీరి రచనను పాఠకలోకానికి అందీయటానికి మేమెంతో హర్షిస్తున్నాం -

— సంపాదకుడు.]



భారత ఆధ్యాత్మిక గ్రంథాల్లోనే కాక విశ్వసాహిత్యంలోనే సాటిలేని గ్రంథరాజం శ్రీ భగవద్గీత. విశ్వమత సమన్వయస్వరూపమే గీత. భారతీయుల ఆదరాన్నే గాక విశ్వమానవాళి గౌరవాన్నీ - సత్కారాన్నీ పొందిన ఉత్తమకృతి గీత. దేశీయభాషల్లోకే గాక ప్రపంచంలోగల అనేక భాషల్లోకి తర్జుమా చేయబడింది గీత.

మన ఆంధ్రదేశంలో దాదాపు ముప్పై యేళ్లనుంచి శ్రీ వ్యాసాశ్రమాధిపతులైన శ్రీ మహర్షి సద్గురు అసంగానందస్వాములవారు తమ విశాల దృక్పథంతో జాతిమత లింగభేదాన్ని పాటించక అమోఘమైన గీతాప్రచారాన్ని చేస్తూన్నారు. ఈనాడు మన విశాలాంధ్రలో ఊరూరా ఆబాలగోపాలం యెంతో భక్తిశ్రద్ధలతో గీతను పఠిస్తూ ఉన్నారంటే, శ్రీవారి చిర ప్రచార ప్రభావమే అనాలి. శ్రీవారి గీతాప్రచారానికి తోడు, ప్రస్తుతం శ్రీ గీతావాణి సంస్థాపకులైన శ్రీ శంకరానంద స్వాములవారు తమ సుమధుర సరళ గీతాప్రవచనాల్తో గీతను మరింత వ్యాప్తికి తెస్తున్నారు. నేడు మన విశాలాంధ్రలోని ప్రతియిల్లూ గీతామందిరమే.

మన ఆంధ్రప్రజానీకంలో రోజురోజుకూ అభివృద్ధి అవుతూన్న యీ గీతాభి

మానాన్ని, గీతాభిరుచిని, గీతాభక్తిని, గీతా ప్రచారాన్ని గుర్తించి శ్రీ సద్గురు స్వాముల వారు గీతాభక్తులు విశేష పర్వదినాల్లో గీతను పూజించుకోవటానికి "గీతాష్టోత్తర శతనామావళి" – ఉంటే బాగుంటుందని సంకల్పించి తద్రచనకై నన్ను ఆజ్ఞాపించారు.

నేను ఈ సంవత్సరం వేసవిలో బదరీ యాత్రకై వెళ్లి అక్కడ శ్రీ వ్యాసమహర్షి మహాభారతాన్ని రచించినపుణ్యప్రదేశాన్ని పర్వతగుహను దర్శించాను. ఆ పవిత్ర గుహాసందర్శనం నా హృదయంలో తత్‌క్షణమే నూత్నచైతన్యాన్ని స్ఫూర్తిప్రేరణను ఉత్సాహాన్ని కల్గించింది. ఆనాడే అర్ధ నిశీథంలో శ్రీ బదరీనాథ పవిత్ర సాన్నిధ్యాన వ్యాసగుహావైపునుండివచ్చే అలకనందా పుణ్యనదీ సముద్ఘోషాన్ని ఆలకిస్తూ యేకాగ్రచిత్తంతో ఆ అస్పష్ట నదీఘోష నుండే ఈ "గీతాష్టోత్తర శతనామ స్తోత్రా"న్ని అక్షరాంకితం చేయగలిగినానని చెప్పుటకు నా హృదయం ఉప్పొంగిపోతూవుంది. ఈపవిత్రకార్యనిర్వహణంలో శ్రీ వ్యాసమహర్షి యొక్కయు, అభినవ వ్యాసావతారులైన శ్రీ సద్గురు స్వాముల వారియొక్కయు అమోఘ ఆశీర్వాదం – అనుగ్రహమే కారణం. ప్రేరకులైన శ్రీ గురుదేవులు సంస్తుత్యులు.

---

1. గీతాదేవీ చ విమలా సుఖదా మునిసంస్తుతా ।
తత్త్వార్థబోధినీ పూజ్యా శ్రీకృష్ణముఖనిస్సృతా ॥

2. పాపఘ్నీ పుణ్యదా దేవీ నిష్ప్రీత్యాహ్యచిదాత్మికా ।
శోకమోహాపహా స్త్రీ చ మోక్షదా బ్రహ్మబోధినీ ॥

3. బ్రహ్మవిద్యా చిదానన్దా భవఘ్నీ భయనాశినీ ।
వేదత్రయాత్మికాఽనన్తా తత్త్వార్థజ్ఞానమఞ్జరీ ॥

4. వ్యాససంగ్రథితా పూతా సంసారమలమోచనీ ।
సర్వశాస్త్రమయీ మాతా సర్వతీర్థమయీ పునః ॥

5. తత్త్వమస్యాదివాక్యార్థబ్రహ్మతత్త్వావగాహినీ ।
శాన్తిప్రదా పరానన్దా బోధామృతతరంగిణీ ॥

6. విశ్వసంస్కృతిసమ్ఖ్యాతి ర్విశ్వధర్మప్రచారిణీ ।
విశ్వైకరచనా రమ్యా రమణీయార్థభాసితా ॥

7. విశ్వమానవసంపూజ్యా విశ్వమంగళకారిణీ ।
విశ్వసిద్ధాన్తసమ్మాన్యా విశ్వసమ్మోహనాశినీ ॥

8. విశ్వస్వరూపిణీ వన్ద్యా విశ్వతత్త్వప్రకాశినీ।
త్రిగుణాతీతతత్త్వార్థభాసినీ గ్రంథిభేదినీ॥

9. లోకోత్తరగుణోపేతా లోకోచితమతాన్వితా।
లోకోద్ధరణసంశీలా లోకామోదప్రవర్ధికా॥

10. నిహితాఖిలశాస్త్రార్థా శుభోజఃపదగుమ్ఫితా।
అనిర్వాచ్యా చ గంభీరా నిత్యా నిత్యసుఖప్రదా॥

11. నైకవ్యాఖ్యానసంభిన్నా నానాచార్యసమాదృతా।
స్వస్వానుకూలభావార్థశోభితా శాన్తిదా న్తిదా॥

12. నిత్యనూతనభావార్థదాయినీ లోకకామదా।
ప్రాచ్యపాశ్చాత్యఖండాన్తర్నివాసిజనమోదదా॥

13. అసురాఽద్వేషిణీ సర్వకాలధర్మప్రబోధినీ।
దైవీసమ్పత్సుసమ్పన్నాఽసురభావవినాశినీ॥

14. అష్టాదశమహాయోగభూషితా భ్రష్టతారిణీ।
స్త్రీశూద్రసముద్ధర్త్రీ సమభావవిశోభినీ॥

15. ఈర్ష్యాప్రసూతజాత్యాదిదురహంకారఘాతినీ।
చండాలద్విజశూద్రాదిసర్వోద్ధరణతత్పరా॥

16. మాయాపనోదినీ సత్యా ద్వన్ద్వభేదవినాశినీ।
అభేదభావపీయూషవర్షిణీ జ్ఞానభాసినీ॥

17. త్యాగరూపాఽనవద్యా చ విముక్తిఫలశాలినీ।
యథాధికారినిష్కామకర్మధ్యానాదిబోధినీ॥

18. భవమగ్నప్రజానౌకా బన్ధచ్ఛేదవిచక్షణా।
భగవద్భావసమ్పూర్ణా భవవారిధితారిణీ॥

19. ఆధ్యాత్మికమహాకాశలసత్సౌదామినీ శుభా।
నిష్కళా నిర్మలా శాన్తా సర్వతేజోమయీ పరా॥

20. తమోవిమూఢలోకాన్ధకారనోదనచన్ద్రికా।
శ్రుత్యన్తగతతత్త్వార్థబోధినీ బోధభాసురా॥

21. బోధామృతపయశ్శుక్లా పార్థవత్సతరాన్వితా ।
దోగ్ధృకృష్ణా చ గోరూపా కామధేను శ్శుగన్తికా ॥

22. క్లిన్నపార్థతమోహన్త్రీ క్షాత్రధర్మప్రవర్తికా ।
కర్తవ్యచ్యుతధీమూఢజనసత్పథదర్శికా ॥

23. సర్వసంన్యాససంలక్ష్యా పూర్ణబ్రహ్మప్రబోధినీ ।
కలిసన్త్రస్తసమ్మూఢలోకసంత్రాణ తత్పరా ॥

24. అష్టోత్తరశతం నామ్నాం గీతాయాః పూతభావనః ।
పఠమానో నరో నిత్యమాప్నుయాత్పరమం పదమ్ ॥

ఇతి శ్రీమద్భగవద్గీతాష్టోత్తరశతనామస్తోత్రం సంపూర్ణమ్.



## శ్రీమద్భగవద్గీతాష్టోత్తర శతనామావళిః

1 ఓం శ్రీగీతాదేవ్యైనమః
2 ,, విమలాయైనమః
3 ,, సుఖదాయైనమః
4 ,, మునిసంస్తుతాయైనమః
5 ,, తత్త్వార్థబోధిన్యైనమః
6 ,, పూజ్యాయైనమః
7 ,, శ్రీకృష్ణముఖనిస్సృతాయైనమః
8 ,, పాపఘ్న్యైనమః
9 ,, పుణ్యదాయైనమః
10 ,, దేవ్యైనమః
11 ,, నిష్ప్రత్యూహచిదాత్మికాయైనమః
12 ,, శోకమోహాపహన్త్ర్యైనమః
13 ,, మోక్షదాయైనమః
14 ,, బ్రహ్మబోధిన్యైనమః
15 ,, బ్రహ్మవిద్యాయైనమః
16 ,, చిదానన్దాయైనమః
17 ,, భవఘ్న్యైనమః
18 ఓం భయనాశిన్యైనమః
19 ,, వేదత్రయాత్మికాయైనమః
20 ,, అనన్తాయైనమః
21 ,, తత్త్వార్థజ్ఞానమఞ్జర్యైనమః
22 ,, వ్యాససంగ్రథితాయైనమః
23 ,, పూతాయైనమః
24 ,, సంసారమలమోచన్యైనమః
25 ,, సర్వశాస్త్రమయ్యైనమః
26 ,, మాత్రేనమః
27 ,, సర్వతీర్థమయ్యైనమః
28 ,, తత్త్వమస్యాదివాక్యోత్థబ్రహ్మ-
తత్త్వావగాహిన్యైనమః
29 ,, శాన్తిప్రదాయైనమః
30 ,, పరానన్దాయైనమః
31 ,, బోధామృతతరంగిణ్యైనమః
32 ,, విశ్వసంస్కృతిసమ్భూతయేనమః
33 ,, విశ్వధర్మప్రచారిణ్యైనమః

34 ఓం విశ్వైకరచనాయైనమః
35 ,, రహస్యాయైనమః
36 ,, రమణీయార్థభాసితాయైనమః
37 ,, విశ్వమానవ సంపూజ్యాయైనమః
38 ,, విశ్వమంగళకారిణ్యైనమః
39 ,, విశ్వసిద్ధాన్తసమ్మాన్యాయైనమః
40 ,, విశ్వసమ్మోహనాశిన్యైనమః
41 ,, విశ్వస్వరూపిణ్యైనమః
42 ,, వన్ద్యాయైనమః
43 ,, విశ్వతత్త్వప్రకాశిన్యైనమః
44 ,, త్రిగుణాతీతతత్త్వార్థభాసిన్యైనమః
45 ,, గ్రంథిభేదిన్యైనమః
46 ,, లోకోత్తరగుణోపేతాయైనమః
47 ,, లోకోచితమతాన్వితాయైనమః
48 ,, లోకోద్ధరణసంశీలాయైనమః
49 ,, లోకామోదప్రవర్ధికాయైనమః
50 ,, నిహితాఖిలశాస్త్రార్థాయైనమః
51 ,, శుభోజఃపదగుమ్ఫితాయైనమః
52 ,, అనిర్వాచ్యాయైనమః
53 ,, గంభీరాయైనమః
54 ,, నిత్యాయైనమః
55 ,, నిత్యసుఖప్రదాయైనమః
56 ,, నైకవ్యాఖ్యానసంభిన్నాయైనమః
57 ,, నానాచార్యసమాదృతాయైనమః
58 ,, స్వస్వానుకూలభావార్థశోభితాయై [నమః
59 ,, శాన్తిదాన్తిదాయైనమః
60 ,, నిత్యనూతనభావార్థదాయిన్యైనమః
61 ,, లోకకామదాయైనమః
62 ,, ప్రాచ్యపాశ్చాత్య ఖండాంత-
ర్నివాసిజనమోదదాయైనమః
63 ,, అక్షరాయైనమః
64 ,, అద్వేషిణ్యైనమః
65 ఓం సర్వకాలధర్మప్రబోధిన్యైనమః
66 ,, దైవీసంపత్సుసంపన్నాయైనమః
67 ,, అసురభావవినాశిన్యైనమః
68 ,, అష్టాదశమహాయోగభూషితాయై [నమః
69 ,, భ్రష్టతారిణ్యైనమః
70 ,, స్త్రీశూద్రసముద్ధర్త్ర్యైనమః
71 ,, సమభావవిశోభిన్యైనమః
72 ,, ఈర్ష్యాప్రసూతజాత్యాది-
దురహంకారఘాతిన్యైనమః
73 ,, చండాలద్విజశూద్రాదిసర్వోద్ధరణ-
తత్పరాయైనమః
74 ,, మాయాపనోదిన్యైనమః
75 ,, సత్యాయైనమః
76 ,, ద్వన్ద్వభేదవినాశిన్యైనమః
77 ,, అభేదభావపీయూషవర్షిణ్యైనమః
78 ,, జ్ఞానభాసిన్యైనమః
79 ,, త్యాగరూపాయైనమః
80 ,, అనవద్యాయైనమః
81 ,, విముక్తిఫలశాలిన్యైనమః
82 ,, యథాధికారినిష్కామకర్మధ్యానాది-
బోధిన్యైనమః
83 ,, భవమగ్నప్రజానౌకాయైనమః
84 ,, బన్ధచ్ఛేదవిచక్షణాయైనమః
85 ,, భగవద్భావసమ్పూర్ణాయైనమః
86 ,, భవవారిధితారిణ్యైనమః
87 ,, ఆధ్యాత్మికమహాకాశలస-
త్సౌదామిన్యైనమః
88 ,, శుభాయైనమః
89 ,, నిష్కళాయైనమః
90 ,, నిర్మలాయైనమః
91 ,, శాన్తాయైనమః
92 ,, సర్వతేజోమయ్యైనమః

93 ఓం శరాయైనమః
94 " తమోవిమూఢలోకానకార-
నోదనచన్ద్రికాయైనమః
95 " శ్రుత్యన్తగతతత్త్వార్థబోధిన్యై [నమః
96 " బోధభాసురాయైనమః
97 " బోధామృతపయశ్శ్కాయైనమః
98 " పార్థవత్సతరాన్వితాయైనమః
99 " దోగ్ధ్రీకృష్ణాయైనమః
100 " గోరూపాయైనమః
101 " కామధేనవేనమః
102 ఓం శుగన్తికాయైనమః
103 " క్లిన్నపార్థతమోహాన్యైనమః
104 " క్షాత్రధర్మప్రవర్తికాయైనమః
105 " కర్తవ్యచ్యుతధీమూఢజన
సత్పథదర్శికాయైనమః
106 " సర్వసన్న్యాసంలక్ష్యాయైనమః
107 " పూర్ణబ్రహ్మప్రబోధిన్యైనమః
108 " కలిసన్త్రస్తసమ్మూఢలోకసంత్రాణ-
తత్పరాయైనమః

ఇతి శ్రీమద్భగవద్గీతాష్టోత్తర శతనామావళి స్సమాప్తా.

— శ్రీకృష్ణచరణమ్.



## గీత — అద్వైతామృత వర్షిణి.

గీతను చెప్పినవాడు కృష్ణుడు. చెప్పినది విని విని ఆ ఉప దేశంలో కరిగి ఏకమైపోయి అర్జునుడుకూడా కృష్ణుడే అయ్యాడు. కాబట్టే అర్జునునికి కృష్ణసంజ్ఞ లభించింది. భగవంతుని భక్తుని సంవాదాన్ని వర్ణిస్తూవర్ణిస్తూ వ్యాసదేవుడుకూడా కృష్ణ (కృష్ణ ద్వైపాయన) నామంతో పిలువబడ్డాడు. చెప్పినవాడు కృష్ణుడు — విన్నవాడు కృష్ణుడు — వ్రాసినవాడు కృష్ణుడు. "పాండవా నాం ధనంజయః — మునీనామప్యహం వ్యాసః" — అని శ్రీకృష్ణుని ప్రమాణవాక్యం. చెప్పినవాడు తాను — విన్నవాడు తాను — వ్రాసినవాడూ తానే. "అద్వైతే త్రిపుటీ నాస్తి"

— వినోబా.

"తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహాభూతం......
— గీతాశాస్త్రార్థవిజ్ఞానేన సమస్త పురుషార్థసిద్ధిః.

— శ్రీశంకరాచార్య.



ఓం నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీ భగవద్గీతా విశ్వమత ప్రబోధము.


శ్రీ నిత్యానందగిరిస్వాములవారు,

గీతాప్రబోధ సంఘాధ్యక్షులు, కైలాసాశ్రమము, శ్రీకాళహస్తి,

చిత్తూరుజిల్లా - ఆంధ్రాస్టేట్.


★

శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా ॥

తే॥ గీ॥ ఇతరములు పెక్కు శాస్త్రములేల గీత
తప్పక పఠింపు మిపుడు కర్తవ్యమద్ది
స్వయముగా బద్మనాభుని వదనపద్మ
మందు జాల్వారునట్టి దివ్యామృతమ్ము ॥

నిత్యగీతాధ్యయన ధ్యాన నిష్ఠాగరిష్ఠులగు ఆత్మీయులారా! ఓం తత్సత్ నమస్తే !!



శ్రీ భగవద్గీతోపనిషత్తు శ్రీమన్నారాయణుని పరిపూర్ణ లీలావతారమగు శ్రీకృష్ణభగవానుని దివ్యముఖారవిందమునుండి వెలువడిన అమృత ప్రవాహమగుటచేతను, శ్రీవేదవ్యాస మహర్షి సత్తమునిచే శ్రీమహాభారత మధ్యమున సంగ్రథితము నగుటచేతను, సర్వవైదికమత సిద్ధాంత సమన్వయము కల్గియుండుటచేతను, ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములలో పరమ పురుషార్థమగు మోక్షఫలమును విపులముగ ప్రబోధించి యుండుటచేతను భారతీయులకెల్లరకు శ్రీభగవద్గీతోపనిషత్తు పరమప్రమాణము కావచ్చునుగాక! అన్యమతస్థులనుగూడ నాకర్షింపగల్గుటకు ఈ గీతోపనిషత్తు తన హృదయమునందు విశ్వమత సమన్వయ సిద్ధాంతమునుగూడ కల్గియున్నదనుట అతిశయోక్తి కానేరదు. ముస్ముందు సర్వ వైదికమతావలంబులకి గీతోపనిషత్తు యెట్లు పూజనీయమై, ఆదర్శమైనదో విచారించి, తదుపరి మతాంతరులనుగూడ నాకర్షింపగల మహిమాతిశయము ఈ గీతోపనిషత్తులో నేమున్నదో వివరించెద. సాంఖ్యమార్గీయులు, భక్తియోగులు, నిష్కామకర్మావలంబులు, యోగమార్గీయులు, వీరు వారననేల? వివిధ

వైదిక సాంప్రదాయ ధురీణులెల్లరు శ్రీ భగవద్గీతామృత మహోదధిని, తఱచి తఱచి తమ తమ మతసాంప్రదాయానుగుణ్యమగు బోధామృతమును బడయగల్గిరి.

"జ్ఞానాదేవ తు కైవల్యం" అనగా యథార్థాత్మ జ్ఞానమే ముక్తికారణము. ఈ వ్యావహారిక జగత్తంతయు మిథ్యామాత్రమేయనియు, తానే బ్రహ్మమనియు, తనకంటే రెండవవస్తువేదియు లేదనియు, అజ్ఞానకాలమున ఇంద్రియమనములకు సత్యముగను, నానా విధముగను గోచరించుచుండి, పారమార్థికదృష్టి కల్గినవెంటనే సర్వము మిథ్యయనియు అద్వైతులు గీతాతత్త్వమును గ్రహించిన విధమును సంగ్రహముగ వివరించెద- శ్రీ కృష్ణ భగవానుడు రెండవ అధ్యాయమగు సాంఖ్యయోగములోని పదనొకండు శ్లోకమునుండి గదా అర్జునునకు గీతోపదేశమును ప్రారంభించెను? ఆత్మ తత్త్వజ్ఞానమును గూర్చిన సాంఖ్యయోగము నేకదా? ఆత్మ-అజము, అమరము, నిత్యము, పరిణామరహితము, ఆత్మ లేనికాలమే లేదు. ఆత్మకు పుట్టుకలేదు. త్రికాలములందును ఆత్మ ఉండునదియే. ఇట్టి విజ్ఞానమును పొందుటకు వ్యవసాయాత్మక బుద్ధినేకదా సాధనమని చెప్పెను! బుద్ధి వ్యవసాయాత్మకమెట్లగును? అభ్యాసబలమువలనను, వైరాగ్యమువలనను కామాది విషయవాసనలనుండి బుద్ధిని మఱలించి ఆత్మయందే లెస్సగ నుంచవలయును. ఇట్టి యాత్మోపరతి ద్వారా నిత్యనిరంతరశాంతి, లేక బ్రాహ్మీస్థితిని పొందవలయునని ఉపదేశించి, తదుపరి అచ్చటచ్చట ఈ జ్ఞానమునకే ప్రాముఖ్యమిచ్చుచు, నిష్కామకర్మ మార్గీయులగు జనకాదులును, జ్ఞానసిద్ధిద్వారా జీవన్ముక్తులైనపిదప లోకసంగ్రహార్థము అనగా జగత్కళ్యాణము కొఱకు నిష్కామకర్మయోగము నాచరించుచుండిరను ఉపమానమును చూపుచు, ఆత్మ ధర్మములగు సత్యజ్ఞానానందములను లక్షణములే స్వధర్మానుష్ఠానపరుడగు జీవన్ముక్తుని లక్షణములనియు, ఇదియే ముక్తి, ఇదియే ఫలము, ఇదియే సర్వవేదాంతసారము, ఇదియే సాంఖ్యయోగములోని విశేషమనియు చెప్పుదురు. మఱియును శ్రీ కృష్ణభగవానుడు అ. 4 - శ్లో 23 "గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః" జ్ఞానమునందు ఆరూఢమైన చిత్తము గలవానియొక్క కర్మము సమగ్రమనియు, 4-38 "న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" ఈ లోకమున జ్ఞానముతో సమానమైన పవిత్రమైనది మఱొకటి లేదనియు, 4-39 "జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిం అచిరేణాధిగచ్ఛతి" జ్ఞానమునుపొంది శీఘ్రముగ శాశ్వతశాంతిని పొందుచున్నాడనియు, 4-36 "సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యతి" జ్ఞానమను తెప్ప (నావ) చేతనే సర్వసంసారమను పాపమును (సాగరమును) చక్కగా దాటగలవనియు, 5-16 "జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః" ఎవరి ఆత్మయందు ఆరోపింపబడిన అజ్ఞానము ఆత్మజ్ఞానముచేతనే నశింపచేయబడినదోయనియు, 5-17 "గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః" జ్ఞానముచే పోగొట్టబడిన కల్మషములు గలవారు తిరుగ జన్మించరనియు, 7-2 "జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః" విజ్ఞానముతో కూడిన ఆత్మజ్ఞానమును పూర్ణముగ నీకు

నేను చెప్పుచున్నాననియు, 7_18 "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" జ్ఞానియే నేనని అనగా జ్ఞానికిని నాకును భేదములేదనియు, 10_20 "అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః" ఓ యర్జునా ! సర్వభూతములయందుండు ఆత్మను నేనేయనియు, 13_2 "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అన్ని శరీరములందును క్షేత్రజ్ఞునిగా నన్ను తెలియుమనియు, 18_63 "ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా" రహస్యములలో అతిరహస్యమైన విజ్ఞానము నాచేత నీకు చెప్పబడినదనియు స్పష్టముగా మొదటనుండియు కడవఱకును జ్ఞానపదముచే ఆత్మజ్ఞానమునే బోధించియుండుటచే ఆత్మజ్ఞానమే కైవల్య ప్రాప్తికి సాక్షాత్ సాధనమనియు, కర్మయోగభక్తులు పరంపరా సాధనములనియు జ్ఞానయోగులు నిరూపించెదరు.

"మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" మోక్షసామ్రాజ్యమును జేర్చు మార్గములలో భక్తిమార్గమే ప్రధానస్థానము వహించినదని ప్రపన్నభక్తులు శ్రీ గీతోపనిషత్తును అన్వయించు క్రమమును చూడుడు:_

అర్జునుడు మొదటినుండియు శ్రీకృష్ణునకు భక్తుడై, సఖుడైయుండి, యుద్ధప్రారంభమున ధర్మసమ్మూఢ చేతస్కుడై గురుబంధువధాది మహాపాపభీరుడై, కర్తవ్యమును స్వయముగ నిర్ణయించు సామర్థ్యములేక "కృష్ణం వందే జగద్గురుమ్" త్రిజగద్గురువగు శ్రీకృష్ణభగవానునే గురువుగ స్వీకరించుచు, 2_7 "శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" నేను నీకు శిష్యుడను, అనన్యగతికుడను, ప్రపన్నుడనై నీ శరణు జొచ్చినాడను. నన్ననుగ్రహింపుము అనిదీనుడై ప్రార్థించెను. సఖ్యభావముతో ప్రపన్నుడయ్యెను. తన భావమును "త్వాం ప్రపన్నం" అని స్పష్టముగా వెల్లడించెను. ఇట్టి ప్రపన్నభక్తునికి బోధించిన మార్గము పరమేశ్వరునియందు సమస్త భరన్యాసముచేసి, భగవంతుని చేతియందలి కీల్బొమ్మవలె ఆతని యాజ్ఞారూపమగు ప్రపత్తిమార్గముగాక, వేఱొండుమార్గమెట్లు బోధించును? సర్వజ్ఞుడగు శ్రీకృష్ణభగవానుడు ప్రపన్నుడగు అర్జునుని నిమిత్తముగాగొని, గీతాముఖమున లోకమునకు భక్తిప్రపత్తిమార్గమునే ప్రధానమైనదిగా బోధించెనని భక్తిమార్గీయులు చెప్పుదురు.

7_14 "మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" ఎవరు నన్నేశరణు పొందుదురో అట్టివారు నా మాయను దాటుదురు. 9_22 "అనన్యాశ్చింతయంతో మాం" ఎల్లప్పుడు నన్నే చింతించుచు, దృఢవ్రతులై నన్నే పొందుటకు ప్రయత్నించుచు, నన్ను గూర్చియే భక్తితో ప్రణమిల్లుచు, అనన్యగతికులై నన్నే ఎవరు ప్రపత్తి చేయుచున్నారో అనగా శరణుపొందుచున్నారో అట్టి భక్తుల యోగక్షేమముల నేనే వహించుచున్నాననియు, 9_27 "యత్కరోషి యదశ్నాసి" ఏది చేసినను, ఏది తిన్నను, ఏది హోమము చేసినను, ఏది యిచ్చినను, ఏది తపస్సుచేసినను, వాని నన్నిటిని నాకర్పణము చేయవలెననియు, 9_31 "కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" ఓ యర్జునా ! నాభక్తుడు

ఎప్పుడును చెడిపోవడు అని ప్రతిజ్ఞ చేసి లోకమునకు వెల్లడిచేయుమనియు, 10_10 "తేషాం సతత యుక్తానాం" ఎవరు నన్నే అనన్యభక్తితో భజించుచుందురో అట్టి నా భక్తులకు నన్ను చేర్పగల బుద్ధియోగము నిచ్చుచున్నాననియు, 10_11 "తేషామేవానుకంపార్థ" మతియు అట్టి భక్తుల హృదయములోనుండు అజ్ఞానమను చీకటిని ప్రకాశమానమైన జ్ఞానమను దీపముచేత నశింపచేయుచున్నాననియు, 11_54 "భక్త్యా త్వనన్యయా శక్యమహమేవంవిధోఽర్జున" ఓ అర్జునా! ఇట్టి నా యద్భుతరూపమును (తత్త్వమును) చూచుటకుగాని, తెలియుటకుగాని, ప్రవేశించుటకుగాని అనన్యభక్తిచేతనే సాధ్యపడును గాని, ఇతరసాధనములు పనికిరావనియు, 11_55 "మత్కర్మకృన్మత్పరమః" నా యాజ్ఞను పాలించుచు, సంగరహితుడై, సర్వభూతహితుడైయుండు నా భక్తుడు నన్ను పొందుచున్నాడనియు, 12_7 "తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్" అట్టి నా భక్తులను మృత్యుసంసార సముద్రమునుండి ఉద్ధరించువాడను నేనేననియు, 18_66 "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను భక్తినిష్ఠకు బర్యవసానమగు ప్రపత్తినిష్ఠ, లేక చరమోపదేశమును భగవానుడు చేసెననియు, కావున గీతాచార్యుని నిశ్చితాభిప్రాయము ఈశ్వరునియందు సమస్తకర్మన్యాసపూర్వక ప్రపత్తినిష్ఠా మార్గమేనని వేఱుగ సిద్ధాంతీకరింప నవసరములేదనియు భక్తిమార్గీయులు ఘంటాపథముగ వక్కాణింతురు.

అర్జునుడు శత్రువిజయాభిలాషియై మున్నే పాశుపతాది దివ్యాస్త్ర లాభమును పొందియుండి, యుద్ధారంభమున గురు బంధు వధాది మహాపాపములు తన్నంటునేమో యను తాత్కాలికముగ గలిగిన భీతిచే, కర్తవ్యతా మూఢుడై, అట్టి పాపఫలము తన్నంటకుండు ఉపాయమును శ్రీకృష్ణభగవానుని మూలమున గ్రహించుసుద్దేశముతో ఆశ్రయించెను. శ్రీకృష్ణోపదేశానంతరమతడెట్లు నడచుకొనెను? యుద్ధమును మాని విరక్తుడై తపోవనములకేగెనా? లేక ప్రపన్నుడై భగవానుని నిత్యసేవతో తృప్తుడయ్యెనా? లేదు కదా? సర్వశత్రు సంహారము గావించి, విజయుడను సార్థకనాముడయ్యెగదా? అట్టిచో భగవానుని గీతోపదేశసార మేదిగనుండును? నిష్కామకర్మయోగమే కదా? కర్మలు చేయుచుండియు కర్మఫలము కర్తనంటకుండుటకై, సర్వకర్మములు భగవదాజ్ఞారూపము లేననియు, కర్మపరిత్యాగము చేయుట సర్వకర్మ ఫలప్రదాతయగు పరమేశ్వరాజ్ఞోల్లంఘనము చేయుటయగుననియు, మోక్షప్రతిబంధ హేతువుకూడ నగుననియు, కర్మ చేయుటకును, విడుచుటకును మానవునికి స్వాతంత్ర్యము లేమిచే, సర్వశక్తిమంతుడగు భగవానుడు మానవుని నిమిత్తమాత్రునిగ గ్రహించి సర్వమును చేయుచున్నాననుః భావముతో స్వధర్మమును అనుష్ఠించుచు, నీటిలోని తామరాకువలె కర్మఫలమునంటక, లోకసేవయే భగవత్సేవగా భావించి, కర్మఫలమును భగవదర్పణము చేయుచుండిన, పరమేశ్వరానుగ్రహమునకు పాత్రులై మానవులు ఇహపర సౌఖ్యసిద్ధి పొందగలరను భావమును గీతాచార్యుడు తేట

తెల్లము గావించెనని నిష్కామకర్మయోగులు చెప్పుదురు. "స్వధర్మే నిధనం శ్రేయః పర ధర్మో భయావహః" స్వధర్మాచరణమున చనిపోయినను మేలేకాని, తాత్కాలిక సుఖమును కల్గించు పరధర్మము సర్వానర్థకారణమనియు, అకర్మ = నిష్కామకర్మ, కర్మ = ఫలాపేక్షతో చేయుకర్మ, వికర్మ = శాస్త్రనిషిద్ధకర్మ, అను భేదములుకల్గి, కర్మమార్గము మహాగహనమై యున్నందున భగవదాజ్ఞారూపములగు వేదశాస్త్రములను ప్రమాణముగ గ్రహించి, శాస్త్రోక్త విధానమున నిష్కామ కర్మానుష్ఠానముచే బుద్ధిని సంస్కరించుకొన వలెననియు, "యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః । జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితంబుధాః" "కర్మసంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే" ఫలాపేక్షలేక చేయబడిన కర్మములన్నియు భగవదర్పణమగుటచే కర్మచేయనివాడే యగుననియు, కర్మత్యాగముకంటె, కర్మఫలత్యాగమే గొప్పదనియు, "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః" ఫలాపేక్షవిడిచి విహితకర్మము చేయువాడే సంన్యాసియు, యోగియు, భక్తుడునుకూడ అగుచున్నాడనియు, "ఓంతత్సదితి నిర్దేశః" ఓం, తత్, సత్ అను మూడు బ్రహ్మవాచకములద్వారా అనాదిగా బ్రహ్మవిదులెల్లరు నిష్కామకర్మానుష్ఠానము లోక కళ్యాణహేతువగుటచే బ్రహ్మవిదులకుకూడ విహితమేననియు, "ఏతాన్యపితు కర్మాణి" ఇదియే నా నిశ్చితాభిప్రాయమనియు, కట్టకడపట మోక్షసంన్యాసయోగములో "కరిష్యే వచనం తవ" అర్జునుడు భగవదుపదేశసారమును చక్కగ గ్రహించి సందేహమును విడిచినవాడై అనాసక్తితో నిమిత్తమాత్రముగ యుద్ధమును చేసి కృతార్థుడయ్యెనని సిద్ధాంతీకరించెదరు. ఇక పాతంజల యోగనిష్ఠుల యభిప్రాయమును వివరించెద.

గీతాచార్యుడు మహాయోగీశ్వరేశ్వరుడు. తనకు ప్రీతికరమగు యోగమార్గమును తన కత్యంత ప్రీతిపాత్రుడగు అర్జునునకుపదేశించెను. కర్మ, భక్తి, జ్ఞానయోగములకు ముఖ్య సాధనముగ దేనిని చెప్పెను? బుద్ధినే (అంతఃకరణమునే) కదా! ఇట్టి యంతఃకరణము ఇంద్రియములద్వారా బహిర్గతమై, విషయాదులకూడి, విషయాకారమును బొందుచు, అతి చంచలమై, నానారూపముల దాల్చుచున్నదికదా! ఇట్టి చంచలాంతఃకరణమును యోగాభ్యాసముద్వారా ఏకరూపమగునట్లుచేసి, ఆత్మయందు లెస్సగా లీనమగునట్లు చేయవలయును. ప్రాణాంతఃకరణములకు పరస్పరసంబంధము గలదు. ప్రాణస్పందమున్నంత వరకు అంతఃకరణము స్థిరముగ నియమింపబడును. అంతఃకరణము ఆత్మయందు సమాధి నందుటకు ప్రాణాయామముకంటె శీఘ్రఫలప్రదమును, సునిశ్చయమైనదియునగు మార్గము వేఱొండు లేదు. అనాదిగా వసిష్ఠాది మహర్షులచేతను, వామదేవ జడభరతాది సిద్ధులచేతను, పతంజల్యాది యోగులచేతను ఈ యష్టాంగయోగము ఆచరింపబడుచున్నది. "ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః" దేహపాతమునకు పూర్వమే ప్రాణేంద్రియాంతఃకరణ జయము కల్గియుండుటావశ్యకమనియు, "ప్రయాణకాలే మనసా చలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ। భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ సతతం పరం

పురుషముపైతి దివ్యం" మరణకాలమందు పూర్వాభ్యాసముచే వశీకరములైయుండు ప్రాణ మనస్సులను భ్రూమధ్యమునజేర్చి, ధ్యానసమాధిమగ్నుడై పరాత్పరుని బొందును.

"యోగినామపి సర్వేషాం" యోగాభ్యాసముద్వారా నాయందు అంతఃకరణలయముచేసి పొందునట్టి యోగియొక్కడే ఉత్తమోత్తముడని భగవానుడు అర్జునునిద్వారా లోకమునకు యోగమార్గమును బోధించెను. కావున ప్రతిమానవుడును పాతంజల యోగసాధనము ద్వారా చిత్తైకాగ్రతను సంపాదించుకొని, దేహావసానమున పరమపురుషుని జేరవలెననుటయే శ్రీకృష్ణభగవానుని ముఖ్యభావమని యోగనిష్ఠులు చెప్పుదురు.

ఇంతటితో వైదిక మతావలంబులకు గీతోపనిషత్తు యెట్లు పూజనీయమైనదో వివరించుటమాని, మతాంతరులను, ఖండాంతరులను శ్రీ గీతాభగవతి ఎట్లు ఆకర్షింపగలైనో వివరించెద.

న్యాయ, వైశేషిక, మీమాంస, యోగ, సాంఖ్య, వేదాంతములను షణ్మతములును ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతములను త్రివిధ సిద్ధాంతములతో నొప్పుచు, యోగ భక్తులను అంతర్భూతములుగా కల్గిన కర్మ, జ్ఞానములను రెండు నిష్ఠలతో వ్యవహారములో నున్నవి. ఆర్ష మతములన్నియు ప్రణవోపాసనమునే అత్యుత్కృష్టమైనదానినిగ గ్రహించియున్నవి.

శ్రుతి॥ "సర్వే వేదాః యత్పదమామనంతి తపాంసి సర్వాణి చ యద్వదంతి ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్॥"
గీత॥ "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" (అ. 8 - శ్లో 13.)

ఓంకారము, నాదబ్రహ్మము. మఱియు పరబ్రహ్మ వాచకము. నామరూపరహితమై, కేవల సన్మాత్రమైన నిర్గుణపరబ్రహ్మము ఉపాసనా సౌలభ్యముకొఱకు ఆదిమహర్షులచే సగుణసాకారముగ గ్రహింపబడి, తత్ప్రతీకముగ సర్వశబ్దముల ఉత్పత్తికి కారణభూతమైన ప్రణవమును ఏర్పాటుచేసిరి. నదులన్నియుః తమకుత్పత్తి కారణమగు సముద్రమును ప్రవేశించి, తమ తమ నామరూపముల నెట్లు విడుచుచున్నవో, అట్లే సర్వమంత్రములును, సర్వమత ప్రమాణగ్రంథములు, వేదవేదాంగములు, సర్వశబ్దములును ఓంకారమునందే అంతర్భూతములైపోవుటచేత హైందవసంఘములన్నియు వాక్కుతో ప్రణవానుసంధానము చేయుచున్నవని తెలుచున్నది. ఇక క్రైస్తవ, మహమ్మదీయ సంఘములు తమ తమ బైబిల్, కొరానులను మతగ్రంథముల ప్రమాణముగ గ్రహించి అందు చెప్పబడిన మంత్రములద్వారా లేక పద్ధతులద్వారా వాక్కుతో దైవోపాసనము చేయుచున్నవని గదా చెప్పుదురు. అట్లేకానిండు. వారి వారి భాషాసంబంధములగు మంత్రములు ప్రార్థనలు వాక్కుతో ఉచ్చరింపబడినప్పుడు శబ్దము, లేక ధ్వని కలుగునుగదా! శబ్దము మొదట కంఠమునుండి ప్రారంభించునపుడు 'అ' అను స్వరము (అక్షరము) తోడ ప్రారంభమగును

ఈ విషయములో ఎవరికైన సందేహము కల్గినచో, పశుపక్ష్యాదులు చేయు ధ్వనిని చక్కగ గమనించిన 'అ' అను స్వరముతోడనే అని తెలియగలదు. ఈ కారణమువలననే వ్యాకరణకారులు "అకుహవిసర్జనీయానాం కంఠః" అని సూత్రమును ఏర్పాటు చేసిరి. శ్రీభగవద్గీతోపనిషత్తులోను "అక్షరాణాం అకారోఽస్మి" అనుటలో అదివస్తువగు శ్రీమన్నారాయణుడు తన్ను అక్షరములకు ఆదియగు "అ" స్వరముతో పోల్చుకొనెను. శబ్దాంత్యము "మ్" తో మకారముతో అగుచున్నది. మధ్య పెదవులు మూయుసందర్భమున "ఉ" అను శబ్దము సహజముగ గలుగుచున్నది. ఇట్లు శబ్దము అకారముతో ప్రారంభమై, ఉకారమును మధ్యకలిగి "మ్" కారముతో అంత్యమగుచున్నది. ఇదియే అ + ఉ + మ్ = ఓమ్ శబ్దరూపము. ఇట్టి "ఓమ్" రూపశబ్దమేకదా మహమ్మదీయ, క్రైస్తవుల మంత్ర ప్రార్థనలకుకూడ మూలమైనది. మహమ్మదీయులు "లాయిలా హాయిల్లిల్లా" ఇత్యాది ప్రార్థనలు వాక్కుతో స్మరించినను, ఓ భగవంతుడా! స్వర్గలోకముననున్న పరమపితా! oh father in heaven; or oh God! ఇత్యాది వాక్కులతో క్రైస్తవులు ప్రార్థనలు చేసినను, మఱియు నితరులు మఱియేవిధమున కీర్తన, స్మరణ, ప్రార్థన, జప ధ్యానములు పరతత్త్వమునుగూర్చి సల్పినను ఈ సమస్త శబ్దములకు ప్రణవమే ఓంకారమే స్థానభూతమైనందున అందఱు నామరూపరహితమై, నిత్య, శుద్ధ, ముక్త, సత్య జ్ఞానానంద లక్షణములుగల యాపరబ్రహ్మమునే ఆయామతసాంప్రదాయ వాచకముల ద్వారా ధ్యానించినవార లగుచున్నారు.

ఇక సర్వమతస్థులును కాయికముగ చేయు సమస్తకర్మలు భగవత్ప్రీతికొఱకును, భగవత్ప్రాప్తికొఱకును స్వధర్మమును చేసినవారలగుచున్నారు. పరమాత్మనుగూర్చి వైదికులు సాష్టాంగ దండప్రణామము చేసిన, క్రైస్తవ, మునల్మానులు మోకారించి, రహీం, రామ్, కృష్ణ, కరీం, క్రైస్ట్, పరమపితా, యీలాటి భాషాభేదములు వ్యావహారికదృష్టికి తోచవచ్చునుగాని, పారమార్థిక దృష్టికి యేభేదమును లేదు. ఆయామతస్థులు మతముపేర నాచరించు జాతి, నీతి, కుల సంబంధములగు కట్టుబాట్లను, ఆచారములను, వాడుకలను మతముగ గ్రహించరాదు. ఆయాదేశకాలమందలి బుద్ధిమంతులద్వారా ధర్మశాస్త్రములను పురాణములను ఏర్పఱుపబడినవి. వీటికి వ్యావహారిక ధర్మములనిపేరు. కాని పారమార్థిక ధర్మము లేక సనాతనధర్మము శాశ్వతమైనది. మార్పులేనిది సర్వకాల, సర్వదేశ, సర్వ జనులకును చెందినది. ఇందు వాదభేదములకు తావులేదు. సర్వమానవ సమత్వము, అన్యోన్య ప్రేమ, సహకారము, సంపూర్ణస్వాతంత్ర్యము, యీలాటి దివ్యలక్షణములకే మతమనిపేరు. ఇట్టి సనాతన విశ్వమతము లేక భగవద్ధర్మము విశ్వమునకంతటికి ఒక్కటేయైనను, అనాదిగ రెండు తెగలుగ, హంసోహం, దాసోహం, జ్ఞానమతముగను, భక్తిమతముగను వారి వారి భావనాభేదము ననుసరించి వచ్చినవేగాని, యథార్థముగ విచారించిన భేదరహిత

మైనదనియే చెప్పవచ్చును. భగవానుడు వ్యావహారిక ధర్మములను లోకముయొక్క కట్టుబాట్లను బోధించు సందర్భమున "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" వారి వారి గుణకర్మముల ననుసరించి మానవులు నాల్గుజాతులుగ విభజించుచు "బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప" అని నాల్గుజాతులకు పేర్లు పెట్టెను. ఈ పేర్లు విన్నతోడనే కొందరు ఈ గీతాశాస్త్రమును వైదికులగు భారతీయులకుమాత్రము మత గ్రంథమని తలంచెదరు. కాని విశాలభావముతో ఆలోచించినచో విశ్వమునకే మత గ్రంథము. విశ్వమతప్రబోధక గ్రంథమే భగవద్గీత. ప్రపంచములోని మానవులెల్లరు నాల్గు విధములైన కర్మములను, స్వభావములను కల్గియున్నారు. విద్యా దైవ విషయములందు పాటుపడువారు బ్రాహ్మణులు. పరిపాలనా యుద్ధాది రాజకీయకర్మములందు పాల్గొను వారు క్షత్రియులు. కృషి గోరక్ష వ్యాపారాది కార్యములు చేయువారు వైశ్యులు. కూలి నాలిచే కాయకష్టపడి సేవా మొదలగు కార్యములు చేయువారు శూద్రులు, అనగా కార్మికులు. ఇదియే ప్రపంచములోగల సర్వమానవుల విభాగము. శ్రీగీతామాతయొక్క అనుంగుబిడ్డలారా! విశ్వమానవ కళ్యాణ సంధాయకమును, విశ్వమత ధర్మబోధకమును, పరమప్రేమైక నిధానమును, మోక్షధర్మ ప్రతిపాదకమును నగు శ్రీ గీతా విశ్వమత ప్రబోధమును భక్తిశ్రద్ధలతో నెల్లరు పఠించుచు, నిత్యనిరతిశయానందాబ్ధి నోలలాడుదురు గాక!

హరిః ఓం తత్సత్.

"I find a solace in the Bhagavadgita that I miss even in the Sermon on the Mount. When disappointment stares me in the face and all alone. I see not one ray of light. I go back to the Bhagavadgita, I find a verse here and a verse there and I immediately begin to smile in the midst of over whelming tragedies – and my life has been full of external tragedies – and if they have left no visible, no indelible scar on me, I owe it all to the teachings of the Bhagavadgita."

(M. K. Gandhi.)

# గీతాజయంతి.




స్వామి శ్రీ శంకరానంద.
గీతావాణి
గౌరవ సంపాదకులు.




"మాసములలో మార్గశిర మాసము నే" నని భగవంతుడు భగవద్గీతయందానతిచ్చియున్నాడు. తక్కిన నెలలకంటె మార్గశీర్షమునం దాధిక్యమేమనెడి విషయముపై పేరాళముగ సిద్ధాంతరాద్ధాంత ములను పలువురు పండితులొనర్చి యె యున్నారు. వారి అభిప్రాయ నిర్ణయము లెట్లుండినను, మార్గ శీర్షమాసమునందు భగవద్గీత ఉద యించినదనుటయం దెవ్వరికిని విరో ధములేదు. అర్జునుని మోహామును భంగించిన భగవంతుని ఉపదేశ గంగకు దేశవిదేశములు నివాళు లెత్తినవి. ఆసేతు శీతనగము, ఆసింధు బ్రహ్మపుత్రము, యావ ద్భారతమునను తాజయంతీ మహో త్సవములు మహావైభవముగ నిర్వర్తింపబడుచున్నవి. తానొనర్చిన దివ్యభవ్యోపదేశమునకొక మూర్తి మంతమగు చిరప్రతిష్ఠ నీరీతి నలరిం చుటకై భగవంతుడు మార్గశిరము తన విభూతియని పల్కెనేమో!

ఈనాడు గీతాజయంతి. ఉప నిషత్తుల సారసర్వస్వమగు జ్ఞాన మును, గీత తనదిగ చేసికొన్నది. ఏడునూర్ల శ్లోకములతో బహు ముఖముల ముఖరితమైన గీతా బోధలయం దేదొకటి రెండు విషయ ములనైనను చర్చించి హృదయం గమ మొనర్చికొనుట మనకీ సందర్భ మున నెంతయు నొప్పును. భగవ త్కృప వర్ధిల్లు గాక!



"గీత యొక గహనమగు వేదాంతగ్రంథము. ఈనాటి సంసారి మానవుడు దానిని చదివి పొందెడి లాభమేమి?" — అని కొందరు ప్రశ్నింతురు. "భగవద్గీతయు, దాని బోటి శాస్త్రములును బుద్ధివాదు లగు పండితులు చేసెడిమేవు;చేసెడి వ్యాయామము. మాబోంట్లకు దానివలన ప్రయోజనమేమి?" యని

సామాన్యజను లాడెడి ఆ క్షే ప ణ. "భగవద్గీత బ్రదుకు తెరువునకు సాయపడగలదా? దీనివలన ఆకలి దీరునా? దప్పిచల్లారునా? రాజకీయ సమస్యలు తెగిపోగలవా?" — అని మరికొందరి పృచ్ఛ.

అవును. నిజమే; గీతను చదువుటతో కడుపునిండదు; రాజకీయ రంగమున నది సాయపడదు; సంసార రథ యాత్ర క ది సాధకముగాదు; అయినను, వాటికన్నింటికిని మించిన మహోపకృతిని గీత ప్రసాదించుచున్నది. పైన చెప్పిన భౌతికశక్తులను పరిష్కరించి సమర్థములొనర్చెడి శక్తికేంద్రమును — ఆధ్యాత్మిక బలమును భగవద్గీత చేకూర్చుచున్నది; శాంతి నొడగూర్చుచున్నది; సుఖమును దయచేయుచున్నది; జ్ఞానమును కల్గించుచున్నది; కర్తవ్యరంగమున ముందడుగు వేసెడి సాహసోత్సాహములను సాధించి యిచ్చుచున్నది. ఈనాటి జగత్తుకు అత్యగత్యమైన వస్తువు శాంతి. శాంతిలేక సుఖము సున్న. ప్రచండముగ వీచెడి పడమటి గాలి దెబ్బకు ప్రపంచము భౌతికవస్తువ్యామోహమున తహతహలాడుచున్నది. నిజసుఖము కరువైనది. సత్యజ్ఞానము లోపించినది. ఆచారము వెర్రితలలువేసినది. ధర్మమునకు వెన్నెముక విరిగినది. రాష్ట్రశ్రేయస్సు రసాతలోన్ముఖమైనది. దరిద్రదేవత గజ్జెకట్టి ఆడినది. ఇది మరింత మెలకువతో మెలగదగిన సమయము. ఇందుకు అపారధైర్యముకూడ కావలసియున్నది. ఈ అనుకూల వసతులన్నియు గీత ఒదిగించి యివ్వగలదు. గీతయనిన వట్టివేదాంత గ్రంథము కాదు. వేదాంతమును వ్యవహారముతో జోడించెడి శాస్త్రము. వ్యవహారమును వేదాంతమువఱకు పైకెత్తెడి శాస్త్రము. తత్త్వజ్ఞానమును నిత్యాచరణయోగ్యముగ నొనర్చెడి శాస్త్రము. ఆచారము తత్త్వజ్ఞానముతో శ్రుతి కలుపునట్లొనర్చెడి శాస్త్రము. సంప్రదాయగతముగ వచ్చెడి మౌఢ్యములను తుడిచివైచెడి శాస్త్రము. ఆధునికుల స్వేచ్ఛాప్రవృత్తిని అరికట్టెడి శాస్త్రము. నేటికాలమున భగవద్గీతవలన ప్రయోజనము లేదనెడి పశుబుద్ధిని వదలుట లెస్స. గీత చెప్పెడి హితవును పెడచెవిని బెట్టినచో యీనాటి సంక్షుబ్ధజగత్తుకు సద్గతియె లేదు.

భగవద్గీతా ప్రచారమునకై ఎన్నెన్ని గ్రంథములు — యెన్నెన్ని

పత్రికలు వెలసినను, అది మరింత శ్రేయోదాయకమె గాని వచ్చిన లోటేమియును లేదు. దేనికైనను 'అతి' వున్నదేమోగాని, జ్ఞానమునకు 'అతి' లేదు. ఈ దృశ్యమాన జగత్తుయొక్క మూలకారణమును విమర్శించి నిరూపించి, భౌతిక జగత్తునకు తగినవెలను నిర్ణయించి కట్టి, మనస్సునకు అస్ఖలిత శాంతినిప్రసాదించి, మనుష్యునియందు దేవత్వమును నింపెడి శాస్త్రములలో భగవద్గీతకు అగ్రతాంబూలమివ్వవచ్చుననెడి విషయము అత్యుక్తి కాదు. ఈ పనిని ఉపనిషత్తులు చేసియున్నవనుట నిజమే. అయినను; విషయసుఖాతిరేకమున సత్యధర్మములను తిరస్కరించిన యీనాటి మనుష్యులకు ఉపనిషత్తులందలి గభీరవిషయములు వంటబట్టవు. గహనములును గంభీరములును సూక్ష్మములునునైన ఉపనిషద్రహస్యములను సులభ సరస సుబోధ శైలియందు నిత్యవ్యవహార యోగ్యమొనర్చెడి మహాశ్రేయస్సు భగవద్గీతకు దక్కినది. కావుననే భగవద్గీత ఉపనిషత్తులకు మేల్బంతియై యొప్పారినది. దాని నెంతెంత ప్రచారమొనర్చిననుకూడ తక్కువె యని చెప్పనొప్పును.

మరియును దీనియందుగల విశిష్టత యేమనిన — యే సంప్రదాయమునకైనను, యే మతమునకైనను భగవద్గీత విరోధించదు. గీతాహృదయ. మతివిశాలమును ఉదారమును; ఇది భారతీయుల పాలి నిక్షేపమైయున్నను, కోరినవారి కామధేనువై, లిపిబద్ధములగు భాషలందన్నిటియందును మూర్తీభవించి యన్నివిధముల ప్రశస్తి నార్జించినది. వ్యవహారరంగమున విహరించువారికేర్పడు క్లేశసంకటములను నివారించి వారికి సుగమమార్గమును గీత తోపించగలదు. నీతినియమములందు సందియమేర్పడినపుడు, నీతి యిదియని, అనీతి యిది యని విమర్శించి నిరూపించగలదు. జగత్కారణమగు మూలతత్త్వమెద్ది యనెడి విచికిత్స బయలుదేరినపుడు నిష్కృష్టమగు నిర్ణయమును కరతలామలకముగ నొనర్చుచున్నది. లోకమునందు సామాన్యముగ వేదాంతగోష్ఠియనిన పలువురకు రుచింపదు. అయినను, భగవద్గీత యనిన ప్రతివానికిని రుచించుచున్నది. కారణమేమనిన — దీనియందు ప్రతిపాదింపబడిన విషయములు ఉపనిషత్తులలోవలె కటువుగ లేవు. అర్జునునిపైగల అనుకంపాతి

శయమున శ్రీకృష్ణదేవుని హృదయమునుండి తనకుతానుగ ఉబికి వచ్చిన జ్ఞానామృతము భగవద్గీత. అందువలన సృష్టివిచారమును ఆత్మజ్ఞానియొక్క స్వభావలక్షణములును పదింబది చెప్పబడినవి. క్రైస్తవ ధర్మానుయాయులు తమ మతగ్రంథమగు బైబిలును నామమాత్రమగు వెలకుగాని లేదా ఉచితముగగాని పంచిపెట్టుచున్నను దాని ప్రాబల్యము అంతంత మట్టుకే యున్నది. క్రైస్తవమిషనరీలు బైబిలుప్రచారమునకై చేయు సన్నాహములు బ్రహ్మాండమంతటివి. ఇక మన భగవద్గీతవిషయమో —— పరమ వైరాగ్యముతో కన్నులు మూసికొని కరములు ముడిచికొని కాళ్ళు చాచుకొని మనమున్నాము. గీతాప్రచారమునకై కానుపీసము ఖర్చు చేయు సద్బుద్ధి, మన ధనవంతుల నొసట వ్రాయలేదు. అయినను తనకుతానుగా విశ్వక్షేత్రమును నర్తనశాలగ చేసికొని భగవద్గీత ప్రపంచ మానవకోటిపై మచ్చుమందు చల్లినది. విశాలభావనమన్వితములగు సిద్ధాంతములతో గీతాకల్పవృక్షము భూమండలమునంతటిని లోగొన్నది.

మరొక్కవిషయము. భగవద్గీత వైరాగ్యమును బోధించు గ్రంథమనియు, సంన్యాసమును ప్రతిపాదించు శాస్త్రమనియు భావించి, తమ బిడ్డలు దానిని చదివినచో, సంసారములను వదలి యెక్కడపారిపోయెదరోయని కొందరు వృద్ధులు వృథావ్యథ చెందుదురు. అది వారి దౌర్భాగ్యము. గీతాతత్త్వవిషయమున వారు పరమమూఢులు. పోనిండు. వారనుకొనినట్లు విరక్తియనిన సంన్యాసమనిన అంతటి అగ్గువసరుకు కాదు. ఒక్కవేళ భగవద్గీతనుచదివి వైరాగ్యమును పొందినాడనినచో వానిజన్మమె ధన్యము. విరక్తియనిన ప్రాపంచిక సుఖసాధనములను విడనాడి కాటికి కాళ్ళుచాచి నీరసమగు జీవితమును గడపుటయని పలువురు తలంతురు. ఇట్టి జీవచ్ఛవములకు గీతామృతరస మాస్వాదింప వలను కాదు. కామినీప్రముఖభోగము లెన్నిగల్గినను కన్నెత్తి చూడని వాసనారాహిత్యమునె వైరాగ్యమందురు. ఇహలోకభోగములకు మొగమువాచి వాటిని సంపాదింప శక్తిచాలని దద్దమ్మలకు ముక్తి లభించుననుట యెక్కడి మాట ? ఉట్టికెక్కలేనమ్మ స్వర్గమున కెక్కగల్గునా? ఈ లోకమున నెందుకు

కొంఱగానివాడు సంన్యాసియగు నను మాట అర్థమెఱుగక ఆడుమాట. ఈ విషయమును శ్రీ సమర్థరామ దాసులవారు తమ దాసబోధ యందు పెక్కుభంగుల నిరసించి యున్నారు. తన మనుష్యత్వము సార్థకము కావలెననిన, తనయొక్కయు తన కుటుంబము యొక్కయు జీవితావసరములను సంపాదించు కొనుటయె గాక, సార్వజనీన కార్యములందుగూడ అత్యంతమగు దక్షతను - నేర్పును నిరూపించవలసి యున్నది. అట్టి సర్వతోముఖసమర్థుడే బ్రహ్మవిద్యకు అధికారి కాగల్గును.

అయినను మరొక్క మాట. విస్తారమగు ఐశ్వర్యములతో తులతూగువారు అనేకులుండవచ్చును. అయినను వారందరును గీతకు అధికారులని చెప్పపోసగదు. ఇంద్రియ లోలత్వమున ఐహికభోగములను రాశిబోసుకొనువారిని — ఇంద్రియారాములగు పాపజీవులను, భగవద్గీత పెదవివిప్పి పల్కరించదు. నశ్వరములగు భౌతికవస్తువులకొఱకు గుటుకలు మ్రింగుచు దేబరించుచు చేతులు జాచుచు ఒడిపట్టు దీనజనుల తట్టు తనదృష్టిని సారించుటకు గీతాదేవి సంకోచించును. విషయదాస్యమునుండి విముక్తుడగు ధీరుడు మాత్రమే గీతాదేవియొక్క కృపాకటాక్షమునకు పాత్రుడు కాగల్గుట. గీతాతత్త్వమును అవధరింపవలెననిన అంతఃకరణము మలవిక్షేపరహితమై యుండవలెను; భోగవస్తువులయందు దోషదృష్టిగలిగి, నిత్యసుఖప్రాప్తికై తహతహ చెందవలెను. తుచ్ఛసుఖములపై ఉపేక్షవహించి నిత్యశాశ్వతసుఖమునకై దీక్ష వహించుటె వైరాగ్యముయొక్క అభిప్రాయము. అంతేగాని, సోమరిపోతై ప్రపంచమునకు బరువై యుండెడివాని లక్షణము వైరాగ్యము కాదు.

భగవద్గీత వార్ధక్యమున చదువుకొనవలసిన గ్రంథమని కొందరి తలంపు. పైనచెప్పినట్లు వైరాగ్యమునకు చేసిన అపార్థమె దీనికికూడ కారణము. భగవద్గీత వేదాంతశాస్త్రము కాబట్టి, వ్యవహార రంగమున దాని ప్రయోజనము లేదనెడి అపోహకూడ దానికి కారణమే. భగవద్గీత పరమార్థమును ప్రతిపాదించెడి వేదాంత గ్రంథమనుమాట నిజమే. అయినను వ్యవహారమున దాని ఉపయోగము లేదని భావించుటమాత్రము తప్పు. నిజమునకు ప్రపంచ మొక పెద్ద సముద్రము. మనమెల్లరమును

యీ మహాసముద్రమున జారి పడి యున్నాము. సముద్రమున పడికూడ నిరపాయముగ గట్టెక్కవలెననిన — అవశ్యము ఈతనేర్చి యుండవలెను. ఈతనేర్వనివాడు సముద్రమున బడి నచో ఉక్కిరిబిక్కిరియై నీరుత్రాగి జలజంతువులకు 'స్వాహా' కాగలడు. సంసార సముద్రమున ప్రవేశించెడి మానవకోటి సైతము గీతయందలి కర్మయోగమును బాల్యముననె అభ్యసించుట యొప్పును. బాల్యమున గీతాతత్త్వమును అలవరచుకొన్నచో యావజ్జీవము సుఖింపగలరు. ఈ దృష్టిననుసరించి చూచినచో వృద్ధులకంటె యువకులె గీతా తత్త్వమునకు అధికారులనుట స్పష్టము.

సామాన్యముగ గీతకు క్రొత్త వ్యాఖ్యానములందుకంటె సంప్రదాయమునందె పక్షపాతమెక్కువయని తోచుచున్నది. కారణమేమనిన — ఈ ఉపదేశమును పరమాత్ముడు వివస్వంతునికి బోధించినాడనియు, ఆతనినుండి పరంపరగ నిది సాగివచ్చినదనియు చెప్పుటనుబట్టిచూడ గీత, సంప్రదాయప్రేమియనుట స్పష్టము. ఇదియుగాక నాల్గవ అధ్యాయము పదైదవశ్లోకమునందు, "పూర్వైః పూర్వతరం కృతం" — అని చెప్పి, కర్మములను ఆచరింపగోరువారికి పూర్వీకులాచరించిన మార్గమె అనుసరణీయమని ఆదేశించబడినది. అయినను, పూర్వీకుల మార్గమును గ్రుడ్డిగ అనుసరించవలెనని గీత యొక్క అభిప్రాయముకాదు. గీత మూఢముగ సంప్రదాయమును శిరసావహించుమనలేదు — చిరకాలమునుండి ప్రతిభాశాలురగు మహాపురుషులు సంప్రదాయమును కాపాడి దానికి అపారమగు బలమును చేకూర్చియున్నారు. కాబట్టి, ఆ యథార్థమును గ్రహించి లోకాభిప్రాయమునకు అనుకూలముగ గీత ఆహితమును ఆదేశించినది. ఆచార్యుల విచార ప్రసంగములకంతటి తేజస్సు లభించుటకుగల కారణము, విశేషముగ వారు అనుభవమునకె ప్రాధాన్యము నిచ్చియుండుట. అనుభవము అన్ని ప్రమాణములకును రాజు. అనుభవమనెడి ప్రమాణము సంసిద్ధమైనచో దాని సేవచేయుటకు ప్రత్యక్ష—అనుమాన — శబ్దముల నెడి ప్రమాణములు నడుముగట్టి పని చేయును. భౌతిక వస్తువులు బైట నుండు రసాయనశాలయందు నిర్మాణములగును; ఆధ్యాత్మిక తత్త్వములు అంతరమునందలి అనుభవముద్వారా యేర్ప

డుచున్నవి. కావుననే ఆచార్యపురుషులు జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయముయొక్క అనుభవమును ఆధారముగ చేసికొని తత్త్వార్థమును నిర్ణయించియున్నారు. ఆ తత్త్వార్థముల వినిర్ణయము కొఱకు మరొక్క ప్రమాణము అనవసరము. ఆ ధైర్యమువలననే శ్రీ శంకర భగవత్పాదులవారు పదునెన్మిదవ అధ్యాయముయొక్క అరువదారవ శ్లోకముకడ భాష్యమువ్రాయుచు "అగ్ని చల్లనిది యని నూరారు శ్రుతులు పల్కినను అవి ప్రమాణ భూతములు కాజాలవు." — అని చెప్పియున్నారు. ఇట్లు చెప్పుటబట్టి, వారికి వేదములందు తిరస్కారబుద్ధి కలదని ఊహించరాదు. వేదములందు చెప్పిన విషయములన్నియు అనుభవమునకు పొంది పొసగియే తీరగలవనెడి బలమగు నమ్మికతో వారట్లనినారు. ఇదే దృఢమగు శ్రద్ధ. అంతేకాని, వేదము చెప్పినదని మిన్నక ఊకొట్టుట నిజమగు శ్రద్ధ కాజాలదు. వేదమునకంటె మన అనుభవమే బలవంతమై యున్నచో నిక వేదముతోడి పనియేమని అడుగవచ్చును. మన లౌకిక యింద్రియములకు గోచరించని అలౌకిక — అవ్యక్తవిషయములను మనకు తెలియజేయుటకు వేదము ఉపకరించును. అదియె దానియందలి విశేషము. వేదము తెలియజేయునంతవరకు మనకు మన అనుభవమే సరిగ తెలియుటలేదు. ఇదియె వేదముయొక్క అతిశయము.

దిక్ప్రదర్శనముగ కొన్ని విషయములను—అనుభవమునకు మాత్రమె హత్తుకొనగలుగువాటిని — యెత్తి చెప్పెదను.

"యేన భూతాన్యశేషేణ
ద్రక్ష్యస్యాత్మన్యథోమయి" (4_35)

సమస్తమును నీయందుజూచి తదుపరి నాయందు చూడుము.

"సర్వభూతస్థమాత్మానం
సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః॥" (6_29)

తాను సమస్త ప్రాణులయందున్నాననియు, తనయందు సర్వ చరాచర వస్తువులును యిమిడి యున్నవనియు సందర్శింపగలడు.

"న త్వహం తేషు తే మయి॥" (7_12)

నేను వాటియందు లేను. అవి నాయందున్నవి.

"యస్యాంతఃస్థాని భూతాని
యేన సర్వమిదం తతమ్॥" (8_22)

చరాచర జగత్తంతయు యెవనియందున్నదో, యెవడీ సమస్తమునందును వ్యాపించియున్నాడో —

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత!" (13_2)

అన్ని క్షేత్రములందును క్షేత్రజ్ఞుడను నేను.

"అవిభక్తం చ భూతేషు
విభక్తమివ చ స్థితం!" (13_16)

ప్రాణికోట్లు విధవిధముల ఖండఖండములై యున్నను నేను అఖండుడనై యున్నాను.

"యథా భూతపృథగ్భావం
ఏకస్థమనుపశ్యతి!" (13_30)

వేరె వేరె యగపడు స్థావరజంగమ వస్తువు లన్నియు ఒక్కని యందె యున్నవి.

ఈ అంశము లన్నియు అనుభవమె ప్రాధాన్యముగ గల విషయములు.

సంప్రదాయములను ధిక్కరించి స్వతంత్ర విచారసరణితో నూత్న పంథను స్థాపించుటకు యత్నించిన ఆధునిక విచారశీలురలో లోకమాన్యతిలక్‌గారు సుప్రసిద్ధులు. తమ వ్యాఖ్యానము స్వతంత్రమైనదని వారెంతెంతగ చెప్పుకొన్నను శాంకర సాంప్రదాయ చ్ఛాయలు దానిపై పడక తప్పలేదు. అయినను శ్రీ తిలకు గారు శంకర భగవత్పాదులపై విసరెడి ప్రధానమగు ఆక్షేపణ యేమనిన — వారు సంన్యాసప్రియుల నుట. ఆచార్యులు సన్న్యాసప్రియు లనుమాట నిజమే కాని, ఆ సన్న్యాసము లోకమాన్యులు అర్థము చేసినట్లు, తలలను బోడులొనర్చి కావిబట్టలను దాల్చి ప్రపంచమును రోసియుండు సన్న్యాసము కాదు. శ్రీ శంకరుల దృష్టియందీ ఆశ్రమ సన్న్యాసము గౌణసన్న్యాసమే. ఈ ఆశ్రమ సన్న్యాసమును వారెక్కువగ ప్రశంసించి యుండలేదు. ఆత్మ అకర్తయనియు — దానికి కర్మ సంబంధ మేవిధమునను లేదనియు తెలియు స్వానుభవజ్ఞానమె శంకరుల దృష్టియందు ముఖ్యసన్న్యాసము. అంతె కాని, వ్యవహారమును చేయవలెననెడి విడువవలెననెడి చర్చయె అందులేదు. ఈ వాస్తవమును లోకమాన్యులు గుర్తించి యున్నచో ఆచార్యులపై ఆగ్రహము చూపవలసిన కారణమెలేదు. ఆచార్యుల వారి భాష్యార్థమును లోతుగ విచారించి తెలుసుకొనుటకు ప్రయత్నింపక తమ నూతన వ్యాఖ్యాన ప్రాగల్భ్య ఆవేశమున శ్రీశంకరుల వారిని ఆక్షేపించిరి. శ్రీ శంకరుల వారు సన్న్యాసమునకు చేసిన నిజమైన అర్థమును గ్రహించినచో — ఆ అర్థము లోకమాన్యుల సిద్ధాంతమునకు సాధకమెగాని బాధకము

గాదు. ఆ విషయమును కొంత విచారింతము.

కర్మయోగమనిన ఫలమును సంగమును రెంటిని వదలుటెగాని ఒక్కఫలమునుమాత్రమె వదలుట గాదు. ఈ విషయమున భగవద్గీత "ఏతాన్యపి తు కర్మాణి — సంగం త్యక్త్వా ఫలాని చ" (18_6) — అనియు, 'సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగః సాత్త్వికో మతః'(18_9) అనియు ఉపదేశించియున్నది. కర్మయోగ రహస్యమును ప్రతిపాదించుటకు బయలుదేరిన లోకమాన్యుని వ్యాఖ్యానమునందు ఫలమును వీడుటను గురించి యథేష్టముగు చర్చ నడచినది. కాని సంగమును వదలుటనుగూర్చి అంతటి స్పష్టముగను — ముఖ్యముగను రాలేదు. సంగమును వీడుటయనిన ఆత్మకు కర్మతోడి సంగములేదని తెలియుటయే. ఫలాపేక్ష నెంత చక్కగ వదలినను, ఆత్మకుకర్మసంబంధము నితాంతము లేదనెడి జ్ఞానము కల్గిననెకాని ఫలాసక్తి పూర్తిగ నశించజాలదు. ఫలాసక్తి యనెడి బిడ్డను తుదముట్ట వదలించజాలెడి సాధనము ఆత్మకు కర్మసంబంధము సుతరాం లేదని తెలుసుకొనుటే. కాబట్టి కర్మము కర్మయోగము కావలెననిన ఫలాపేక్షను వదలుటకంటెకూడ ఆత్మ యొక్క అసంగత్వ విజ్ఞానమును పొందుటె అధిక ప్రముఖ విషయమనుట మరువరాదు. ఆత్మకు కర్మసంబంధము లేదని తెలిసినవాడు అపారమగు కర్మవ్యాసంగమున నుండియు దానికి లిప్తుడు కాడు. అట్టివాడు, వ్యవహార దృష్టితో సమస్త కర్మములను చేయుచున్నను పరమార్థ దృష్టియందు యెట్టి కర్మమును చేసినవాడు కాడు. కావున నిజముగ వాడు సర్వకర్మ సంన్యాసమును చేసినవాడు. ఈ అర్థమునె గ్రహించి శ్రీమచ్ఛంకరులవారు అకర్త్రాత్మ బుద్ధినె సన్న్యాసమని పేర్కొనిరి. నేను చేయువాడననెడి కర్తృత్వబుద్ధి యుండువరకు ఫలమునందలి ఆశయు, పాపపుణ్యముల సంసర్గమును తప్పిపోదు. అకర్త్రాత్మ బుద్ధి రూపమగు సన్న్యాసముతో కూడక, కేవలము ఫలత్యాగమును మాత్ర మాశ్రయించిన కర్మయోగము యేకాంగిమె కాగలదు. అకర్త్రాత్మ బుద్ధిరూపమగు సన్న్యాసము కర్మములను మానియుండు సోమరితనముకాదు. కర్మయందలి దోషమును దూరమొనర్చి అసదృశమగు వీర్యవంతముగ కర్మము నొనర్చుటకు అకర్త్రాత్మబుద్ధి సాయ

[ మిగత 50వ పేజీలో ]

భగవద్గీతలో —

# జీవేశ్వర విచారణ.

K. సచ్చిదానందమూర్తి, M. A., Ph. D.,

[శ్రీయుతులు కె. సచ్చిదానందమూర్తిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయ తత్త్వశాస్త్రోపన్యాసకులు. అసాధారణ సునిశిత ప్రజ్ఞాబలంతో తత్త్వశాస్త్రముయొక్క అంతరాంతరాలల్లోకి దిగి చికిత్సా, విచికిత్సా చేసేవారు. భాషను దాటిపోయే భావాలు; భావాలను నిగ్గదీసి నిలవేసే భాష, ఈ రెంటిపై పూర్ణాధికారం చలాయించే వీరికి వీరేసాటి. ఇట్టి విద్వత్సంతానాన్ని కన్న ఆంధ్రమాత ధన్యురాలు. — సం.]

ఆచార్య శంకరులు అద్వైత సాంప్రదాయ ప్రవర్తకులలో నొకరు. ఆయన అభిప్రాయము ప్రకారము భగవద్గీత, జీవేశ్వర సంబంధము నెట్లు నిర్ణయించినదో - కొంచెము సూచింతును.



నారాయణుడు మాయకు పరుడు; బ్రహ్మాండము మాయనుండి సంభవించినది; లోకములన్నియు యీ బ్రహ్మాండమందే యున్నవి. భగవంతుడీ జగత్తును సృజించి దానిని రక్షింపనెంచి మరీచ్యాది ప్రజాపతులను సృజించి వారికి ప్రవృత్తి లక్షణధర్మమును బోధించెను. తరువాత సనక సనందనాదులకు జ్ఞాన వైరాగ్య లక్షణోపేతమగు నివృత్తిధర్మమును బోధించెను. జ్ఞానైశ్వర్య శక్తి బలవీర్యతేజములచే నెల్లప్పుడు సంపన్నుడగు ఆ భగవంతుడు త్రిగుణాత్మకమగు తన వైష్ణవమాయను, - మూలప్రకృతిని - వశమందించుకొని, యెన్నడు పుట్టనివాడు, నాశరహితుడు, సమస్తప్రాణులకు యీశ్వరుడు, నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావుడు నయ్యు తన మాయచే దేహమున్నట్లు పుట్టినట్లు లోకమును అనుగ్రహించినట్లు కన్పడును. (భాష్యోపోద్ఘాతము).

మాయాసంవ్యవహారము చేతనే యీశ్వరుడు చాతుర్వర్ణ్యసర్గాదులకు కర్తగాని; పరమార్థముగ ఆయన అకర్త; కావుననే అవ్యయుడు; అసంసారి. (భాష్య. 4-13). క్రియాకారకాది సర్వ వ్యవహారము నా

అవిద్యావస్థయందే యుక్తము. (4-18) సత్యం జ్ఞాన మనంతం - విజ్ఞానమానందం- అని చెప్పబడి, క్షుత్పిపాసాది సర్వసాంసారిక ధర్మవర్జితము, నేతి నేతీత్యాదులచే సమస్తవిశేషణములకు అతీతమని చెప్పబడిన అశేషవిశేషరహితమగునదియే బ్రహ్మము. ఆత్మ (అనగా జీవాత్మ) పరమార్థముగ పరబ్రహ్మమే, గాని బుద్ధి మొదలగు ఉపాధులచే సంయుక్తమైనందున అందు ఉపాధిధర్మములన్నియు అధ్యస్తములు. సోపాధికమగు జీవాత్మను నిరుపాధికమగు పరబ్రహ్మస్వరూపముగ చూచుటయె బ్రహ్మయజ్ఞము (4-25). జీవేశ్వరుల (క్షేత్రజ్ఞేశ్వరుల) యేకత్వమే సర్వోపనిషత్తులయందు ప్రసిద్ధము (4-35). ఈశ్వరుని ప్రకృతి, అపరము-పరము నని ద్వివిధము. అపరప్రకృతి యన భౌతిక పదార్థములను-అహంకారమును ప్రవర్తింపజేయునది; ఇది అనర్థకారి; సంసారబంధనాత్మక. మాయయే ప్రకృతి. అనాత్మములగు అపరాప్రకృతి ధర్మములను తనయందారోపించుకొనినందున సుఖదుఃఖాది భోగముల ననుభవించుటకు జీవుడే హేతువు. అవిద్య, తద్గుణములందాసక్తి - ఇవే సంసారకారణములు. సుఖదుఃఖభోగమే సంసారము. ఎవడు తనను వాస్తవముగా ఆత్మభావముతో 'నేనే'నని తెలుసుకొనునో వాని అవిద్య నివృత్తినొందును (=లేకుండపోవును) (13-19, 23).

ఎన్నడును నశించదు కాబట్టియే పరమాత్మ అక్షరమనబడును. ప్రతిదేహమందు ఆ పరబ్రహ్మయొక్కయే ప్రత్యగాత్మభావము స్వభావము. అదియే అధ్యాత్మమనియు జీవుడనియు అనబడును. ఆత్మను (దేహమును) ఆశ్రయించి అంతరాత్మభావమునందుండునది కాబట్టియు, పరమార్థముగా బ్రహ్మమే అవసానముగాగలది కాబట్టియు, అది (అధి-ఆత్మ) అధ్యాత్మమనబడును (8-3). సమస్తప్రాణులును ఈశ్వరుడే ఆత్మగాకలిగియున్నవి. ఈశ్వరుడే సర్వభూతములకు ఆత్మ. సాకారమైన వస్తువులు ఉన్నట్లు యీశ్వరుడు లేడు. (అనగా ఒకబుట్టలో మల్లెపూలు ఉన్నట్లుగా భగవంతుడు ప్రాణులందు లేడు.) మరెట్లన, ఆకాశమువలె సంసర్గదోషరహితుడై యీశ్వరుడు సర్వవ్యాప్తుడు (9-4). సర్వస్రష్టయయ్యు యీశ్వరుడు ఉదాసీనుడు. ఎందుకనగా; అవిక్రియమగు ద్రష్టామాత్ర స్వరూపుడైన యీశ్వరునిచే ప్రేరితమై, అవిద్యా పరప్రకృతియన యీశ్వరుని ఆత్మభూతమగునట్టియు ప్రాణధారణ నిమిత్తభూతమగునట్టియు జీవుడు. ఈ పరాపరప్రకృతియే సమస్తభూతములకు యోని. (అనగా కారణము). ఈ ప్రకృతి ద్వయ ద్వారమున యీశ్వరుడు జగత్కారణము. కాన పరమేశ్వరుడుదక్క జగత్తుకు మరొక కారణము లేదు (4-4, 7). అపరప్రకృతియే సర్వకార్యకరణ విషయాకారమున మార్పొంది, పురుషుని భోగాపవర్గార్థము దేహేంద్రియాద్యాకారముగ మూర్తిమంతమగును. దానినే క్షేత్రమందురు. ఈ దేహమును యెఱిగి దీనిని 'నాది' అనుకొనువాడు జీవి. (13-1, ఇచ్చట మధుసూదనముని గూఢార్థదీపికను కూడా చూడుడు).

బ్రహ్మదేవునినుండి తృణము వఱకు అనేక శరీరములనెడి ఉపాధులందు భిన్నభిన్నముగానున్న జీవులందరును వాస్తవముగా అట్టి ఉపాధిభేదరహితుడైన, సదసదాది శబ్దప్రత్యయ (=ప్రతీతి)ములకు అగోచరుడైన పరమేశ్వరుడే. జీవునికి దేహాదులందు ఆత్మబుద్ధి కల్గినట్లే, అవిద్యారోపిత ఉపాధిభేదముచే యీశ్వరునికే సంసారిత్వము అబ్బినట్లున్నది (13-2). క్షేత్ర క్షేత్రజ్ఞులనే (జడజీవులనే) ప్రకృతి పురుషులందురు. ఈ రెండును యీశ్వరుని ప్రకృతులు (Prakriti=Nature; స్వభావములు). ఈశ్వరుడు నిత్యుడు కాన, ఆయన ప్రకృతులు నిత్యములు. వాటి ద్వారా ఈశ్వరుడు సృష్టి స్థితి లయ హేతువు. ఈశ్వరుని వికారకారణశక్తియగు త్రిగుణాత్మక లక్షణమును, త్రిగుణాత్మికమునగు మాయ చరాచర జగత్తును పుట్టించుచున్నది. సాక్షియగు చైతన్యమునకు జ్ఞానవిషయములు ప్రకృతి పరిణామములు. అవి తత్సాక్షియందు యేమార్పును తేలేవు. సర్వాధ్యక్షభూతుడును, ఏకమాత్ర చైతన్యరూపుడును, వాస్తవముగా యెట్టి భోగములతోడను సంబంధము లేనివాడును అగు దేవుడొక్కడు తప్ప చేతనాంతరుడు లేనిచో ఈసృష్టి యెందుకు? ఈ ప్రశ్నగాని దీని సమాధానముగాని అనుపపన్నములు. (విషయము అనిర్వచనీయమని తాత్పర్యము) (9-10). భిన్నస్వభావములుగల విషయి విషయములు, క్షేత్రక్షేత్రజ్ఞులు, ఒకదానిధర్మములు యింకొకదానియందు అధ్యస్తములగుటచే అధ్యాసరూపమగు మిథ్యాజ్ఞానము కల్గుచున్నది. శాస్త్రజ్ఞానముచే క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణభేదమును బాగుగా తెలిసికొని, క్షేత్రజ్ఞుని వేరుచేసి, సమస్తోపాధి శూన్యుడగు బ్రహ్మముగా తెలిసికొని, క్షేత్రమును (దృశ్యమాన జగత్తును), మాయా నిర్మితమగు యేనుగును వలెను, స్వప్నపదార్థమును వలెను, నిశ్చయపూర్వకముగా యెఱిగినంతనే ఈ సమ్యక్ జ్ఞానముచే మిథ్యాజ్ఞానము నశించును. జన్మహేతువగు మిథ్యాజ్ఞానము నశించుటచే విద్వాంసుడు తిరిగి పుట్టడు (13-26).

నాశమునుపొందు సమస్త పదార్థములు భగవంతుని మాయాశక్తిచే పుట్టినవి. ప్రకృతియొక్క వికారరూపమగు సర్వభూతములు క్షరుడనబడును. అవి, నాశవంతములు. ఈ క్షరరూపమగు సంసారమునకంతకు బీజముగనుండి, అనంతమగుటచే నాశము చెందనిదై, మాయను కల్గియుండునది అక్షరము. అవగా; నశ్వరపదార్థములను పుట్టించు మాయాశక్తిని యేది కల్గియున్నదో, నాశనములేని ఆ పదార్థము అక్షరము. కాని క్షరాక్షరముల కతీతమైన-ఉపాధిద్వయదోషరహితమైన-నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడు పరమాత్మ. అవిద్యాకృతములగు దేహాది ఆత్మలకు పరుడును, సర్వభూతములకు ప్రత్యక్ చేతనమును అగుటచే 'పరమాత్మ' యని వేదాంతవాక్యములందు ఉదహరింపబడినది. చైతన్యబలశక్తిచే త్రిలోకములను ప్రవేశించి స్వరూపసత్తామాత్రమున వాటిని ధరించి, నాశరహితుడై శాసించువాడుగా నున్నాడు; కాన ఈశ్వరుడని పిలువబడును. సంసార మాయావృక్ష

మునకు, ఆ వృక్షమునకు బీజభూతమైన అక్షరమునకు గూడ అతిక్రాంతుడగుటచే ఆయన పురుషోత్తముడనబడును (15_16, 18). పరమార్థమెరుంగనివాడు తన్ను యీశ్వరునికంటె భిన్నముగ నెంచి, యీశ్వరునియందు చిత్తము నిలుపుట యను యోగమును, ఆ యీశ్వరుని కొఱకు కర్మానుష్ఠానము మున్నగునవియు చేయ వచ్చును. కాని, ప్రమాణము ద్వారా తననే యీశ్వరునిగా తెలిసికొనినవాడు, యీశ్వరుడు మరొక్కడున్నాడనియెంచి సేవకభావమును పొందలేడు. సమ్యక్ దర్శనము లేనంతవఱకే కర్మయోగము. అభేదదర్శనముచే స్వయముగా ఈశ్వరాభేదబుద్ధి కలిగినవారికి, ఈశ్వరుడు_సేవకుడు, ఉద్ధరించువాడు_ఉద్ధరింపబడువాడు, అను భేదములుండవు (12_13).

బ్రహ్మము_ఈశ్వరుడు_జీవుడు, నను వానినిగూర్చి, వాటి పరస్పర సంబంధముల గూర్చి, భగవద్గీత పైవిధముగ తెల్పినదని శంకరాచార్యుల అభిప్రాయము. పైన నేను శంకరభాష్యస్థ వాక్యములనే యథాతథముగ అనువదించి, ఒకటి రెండు చోట్ల స్పష్టీకరించి సమన్వయ పూర్వకముగ (Systematically) వ్రాసినాను. విస్తరభీతిచే సంస్కృతమూలమును ఉదాహరించ లేదు. శంకరుల వాక్యార్థమును విశదీకరించనూ లేదు. భగవద్గీత శంకరుల వారు వ్యాఖ్యానించినట్లుగా బోధించలేదని రామానుజ మధ్వాచార్యులనినారు. భగవద్గీతను శంకరులు సరైనవ్యాఖ్యానము చేసిరా? ఆయన చేయకున్న _ మరెవరైన చేసిరా? ఇవి బ్రహ్మాండమంతటి ప్రశ్నలు. వాటిని గూర్చిన విచారణను అమూల్యమైన ఈ "గీతావాణి" పత్రికాముఖమున వీలైనచో మరొక్కసారి చేసెదను.

— కె. సచ్చిదానందమూర్తి.

[ 48_వ పేజి శేషము ]

వడగలదు. ఈ విషయమును తెలిసికొన్నచో ఆచార్యులవారి అభిప్రాయము లోకమాన్యుల సిద్ధాంతమునకు పూరకము కాగలదు.

పవిత్రమగు గీతాజయంతీ సందర్భమున గీతావాణి పాఠకులను ఉద్దేశించి గీతా సంబంధమగు కొన్ని విషయముల పేర్కొంటిని. వీలగునంతవరకు గీతాతత్త్వమును అనుసంధించుటకు వలయు శక్తి సమర్థతలను గీతాచార్యుడెల్లరికి ప్రసాదించుగాక యని ఆశించుచున్నాను.

ఓమ్.

# గీతచూపిన సర్వజనీన మహాపథము.

రచన: శ్రీ కేశవతీర్థస్వాములవారు.

★

ఆరుగురు గ్రుడ్డివాండ్లొకసారి ఏనుగనుగూర్చి తెలుసుకోవాలని వెళ్లారట. ఒకడు ఏనుగ చెంతకువెళ్ళి తవుళ్లాడేసరికి వానికి తొండంచిక్కిందట. దాన్ని ఆమూలాగ్రం తడివి శోధించాడు. ఓహో! ఏనుగంటే ఏమున్నది? అది ఒక పెద్ద నాగుబాములాగుంటుంది — అని తేల్చుకున్నాడు. రెండోవానికి చెవులు



చిక్కాయి. ఏనుగంటే పెద్ద చేటలాగుందనుకున్నాడు. మూడోవానికి పొట్టిదొరికింది. వాడనుకున్నాడు కదా, ఏనుగంటే సాక్షాత్ ఒక పెద్ద పీపాయే అనుకున్నాడు. నాల్గోమనిషికి తోక చిక్కింది. వానిభావానికి ఏనుగంటే చెండ్రకోల లాంటిదిగా తోచింది. అయిదోవ్యక్తికి కాళ్లు చిక్కాయి. ఏనుగంటే స్తంభంలాంటిదనుకున్నాడు. ఆరోవానికిదంతాలు చిక్కాయి. ఏనుగంటే మంచిబాకులాంటిదనుకున్నాడు. ఆఖరికి ఏనుగగూర్చి ఆరుగురూకలసి ప్రసంగానికి దిగారు. ఎవడి అనుభవాన్నివాడు వాదింపసాగాడు. ఒకడు ఏనుగంటే చేటలాంటిదంటాడు. ఒకడు స్తంభంలాంటిదని, ఇంకొకడు కాదు పీపాలాంటిదని, మరొకడు, కానేకాదు పాములాంటిదనీ, ఇలా తర్కించుకోసాగారు. చివరకు ఏనుగయొక్క పూర్ణదర్శనం గల ఒక నూతన వ్యక్తి వచ్చి, వాండ్లలోని పొరపాటు నిలా సవరించాడు:'మీ అందరిలో కొంతసత్యమున్నది. మీ అర్ధ సత్యానుభూతిని పూర్ణసత్యానుభూతిగా తలుస్తున్నారు. మీ అందరి అనుభవాలు కలిసి ఏనుగయొక్క పూర్ణానుభూతి అవుతుంది. పాములాంటి తొండం, చేటలవంటి

చెవులు, పీపావంటి కడుపు, చెండ్రి కోలవంటి తోక, బాకులవంటి దంతాలు, స్తంభాలవంటి కాళ్ళూ కలిగిన రూపముగలది ఏనుగ' — అని విశదీకరించాడు. ఆలాగే తమ తమ సాంప్రదాయ పంథాలకే సమగ్రత్వం ఇస్తూ సమగ్రసత్యతత్వమును విస్మరించిన మానవలోక మధ్యంలో ఒక మహావసర సమయంలో, జగద్గురు భగవానుడైన శ్రీ కృష్ణపరమాత్మ సర్వసమన్వయ మత సందేశమును ప్రసాదించాడు. ఆసందేశదర్పణంలో ప్రతివ్యక్తీ తన హృదయ సౌందర్యమును దిద్దుకోవలసియున్నది. పూర్ణ సందేశమును ఇవ్వడానికి పరిపూర్ణుడైన భగవంతుడే అర్హుడు. అన్ని మర్మాలు పరమాత్మకు తెలుసు. శ్రీ కృష్ణభగవానుడు సత్యమును పరమకృపతో మనకు వివృతం చేశాడు. ఆ గీతాబోధలో మనకు జీవిత పరిష్కృతి లభిస్తుంది.

శ్రీ కృష్ణగీత మనకు సర్వజనీన మహాపథాన్ని చూపుతున్నది. ప్రతి మానవునికి ఒక సమగ్రసంస్కృతిని ప్రసాదిస్తున్నది. సమగ్రమత పరిణతి గలమానవుని గీతచిత్రిస్తున్నది. సర్వకోణ సౌందర్యంతో ప్రకాశించే ఒక దివ్యమణిగా మానవుని తయారు చేయడానికి గీత ఒక మహా సమన్వయసందేశ మిస్తున్నది. అది కర్మభక్తిజ్ఞాన సమన్వయ పథం!

శ్రీ కృష్ణస్వామి, మహాబోధను చేసి చేసి, చివరకు తన ప్రబోధ సారాంశమును, గీతలో ఆఖరున ఇలా విశదీకరిస్తున్నాడు:

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోఽసి మే॥

గీత. 18 అ. 65.

తా॥ నా యందు మనస్సుంచు. నాకు భక్తుడవుగా నన్ను పూజించు. నాకు నమస్కరించు. ఇదిగో! ప్రేమాస్పదుడవైన నీతో ప్రతిజ్ఞ చేసి చెపుతున్నాను. సత్యముగ నీవునన్నే పొందగలవు. — ఇదీ మహాసందేశం. పరమాత్మయొక్క ఆంతర్యం! నిజంగా ఈ సందేశంలోని వైశాల్యత పరమాత్మకుతప్ప ఇంకొరికివుండదు. ఈ శ్లోకంలో జ్ఞానభక్తి కర్మల సమన్వయ పథమే తనను సమగ్రంగా వశంచేసుకొనే పథమని, భగవానుడు రహస్య విశదీకరణ చేస్తున్నాడు. 'మన్మనాభవ'అంటున్నాడు. అంటే నాయందు మనస్సుంచమని గదా. తనస్వస్వరూపమైన బ్రహ్మమునందు, పరమాత్మయందు, శ్రీ కృష్ణుని యందు, తన ఆత్మయందు మన

స్సును నిల్పాలన్నమాట. స్వస్వరూపజ్ఞానం, ఆత్మజ్ఞానం కలిగి ఉండాలని మనం బాగా గ్రహించవచ్చు. జ్ఞానం పునాదిగా కలిగి ఉండాలె. 'మద్భక్తః' అని రెండోమాట. అంటే నా భక్తుడవు గమ్మని. నిరంతరం, నీ స్వస్వరూపమైన భగవంతునియందు ఎడతెగని ప్రణయం కలిగిఉండాలని, ప్రేమ కలిగి ఉండాలని. ఇక మూడోవాక్యం, 'మద్యాజీ మాం నమస్కురు' — అని. అంటే, నన్ను పూజించు నాకు నమస్కరించుమని తాత్పర్యం. ఇది కర్మయోగపరమైన సందేశం. నన్ను పూజించు, నాకు నమస్కరించు — అంటే ధర్మస్వరూపుడైన ఆయనను సేవించడమనే. పూజించు, స్మరించు అనడంలో సేవయొక్క అవసరాన్ని పరమాత్మ నొక్కి చెపుతున్నాడు. దరిద్రజనులను, దీనులను, అనాథలను, ఆర్తులను, సాధుసజ్జనులను, భూతకోట్లను భగవత్స్వరూపములుగా గ్రహించి, వివిధ విధానాల్లో సేవచేయడమే, ఆయనకు పూజ. కోటిజీవులకు హితవర్తనుడై, వినమ్రగుణంతో ప్రకాశించడమే, పరమేశ్వరునికి చేసే నమస్కారం. సేవను సూచించే చిహ్నాలే పూజా, నమస్కారాలు. జ్ఞానమూ, భక్తి, నిష్కామకర్మ — కలిగినవాడైతే ఆతడు సమగ్రవికాసాన్ని పొందినవాడు. నిజానికి జ్ఞాన భక్తి కర్మలు అవినాభావసంబంధం కలవి. కాదామరి? ఒక మనిషిని ప్రేమించాలంటే, వాని సులక్షణజ్ఞానం కలిగితేనే, గాఢంగా ప్రేమిస్తాము. తమ్ముడనో, కులస్థుడనో, విద్యావంతుడనో, వానిగూర్చి జ్ఞానంకలిగినందున ఒకనిని ఒకడు ప్రేమించ గలుగుతున్నాడు. బ్రహ్మతత్వజ్ఞానే, పరబ్రహ్మమును ప్రగాఢంగా ప్రేమించ గలుగుతాడు. నరేకదా. మరి ప్రగాఢప్రేమ కర్మరూపంతో ప్రకటితమవుతున్నది. ఒకడు తన భార్యకోసం తన కుటుంబంకోసం, శ్రమిస్తున్నాడు. దేనికి? భార్యమీద ప్రేమచేతనే. ఈశ్వర ప్రణయావేగ వశుడు, వాని సేవాకర్మలో ఉద్విగ్నుడవుతాడు. ఆకర్మమనమనుకొనే విధానంలో కనపడకపోవచ్చు. విశ్వహితకర్మ వానిలోనుంచి, ఆ భగవత్ప్రేమికునిలోనుంచి వెల్లుబుకుతుంది. నిజమైన జ్ఞానమున్నప్పుడు, వానిలో భక్తి పొంగులు పారుతుంది. నిజమైన భక్తి ఉన్నప్పుడు నిజమైన సేవాపరాయణత్వం ఏదోరూపంలో ఉండి తీరుతుంది. ఆదర్శపురుషుల్లో, వివేచించుకుంటే, ఈ త్రివిధతత్వ సమీకరణారూపం సుస్పష్టంగా గో

చరిస్తుంది. భక్తి జ్ఞాన కర్మలు సంగమించినవాడు, ప్రయాగవంటివాడు. దత్తాత్రేయులవంటివాడు. ఆదర్శ పురుషుడు. భగవత్ప్రాణసముడు! పడవకు, తెడ్లూ తెరచాప, చుక్కానివలె, కర్మ, భక్తి, జ్ఞానములు మానవునికి ప్రాణావసరం. శ్రీకృష్ణైక్యతకు, పరమానంద నిమగ్నతకు, విముక్తికి, సర్వజనీనమహాపథం, ఈ భక్తి జ్ఞాన కర్మల సమాచరణమని మనం గ్రహించవలసి యున్నది. మన మిప్పుడు ఏమిచేయాలె? (1)సర్వదా మన మనస్సును ఆత్మనిష్ఠలో, స్వస్వరూపనిష్ఠలో, బ్రహ్మమయతలో ఉంచుకోవాలె. చిత్తమును, భగవదాయత్తంచెయ్యాలి. (2) నిరంతరం హృదయంలో, భగవంతుని యందు ఎడతెగని ప్రేమను కలిగి యుండాలె. (3) మనఇంద్రియాలను మన శరీరాన్ని ఆ పరమాత్మయొక్క సేవాకర్మలో నియోగించాలి. అంటే మనస్సును జ్ఞానమయంచెయ్యాలె. హృదయాన్ని భక్తిరసమయంచేసుకోవాలె. చేతులను వాని పాదసేవలో నియోగించాలె. ఇదే సమగ్రయోగం. ఈ కలిలో ప్రతిమానవుడికీ తరణోపాయం ఇదే! ఇదే సర్వజనీన మహామార్గం! ఓం! ఓం!! ఓం!!!



## "తత్ త్వం అసి – గీత."

సామవేదవాక్యమగు "తత్త్వమసి" అను మహావాక్యమును నిరూపించు మూడు భాగములు శ్రీమద్భగవద్గీతలో నున్నవి.

"తత్ త్వం అసి" – "నీవు అది అయి యున్నావు". మొదటి 6 అధ్యాయములు కర్మయోగమును కర్మమార్గమును గూర్చి, "నీవు" యొక్క స్వభావమును గూర్చి, "త్వం" పాదమును వివరించుచున్నవి.

తరువాత ఆరు అధ్యాయములు భక్తియోగమును భక్తిమార్గమునుగూర్చి, "అది" యొక్క స్వభావమునుగూర్చి, "తత్" పాదమును వివరించుచున్నవి.

చివర ఆరు అధ్యాయములు జ్ఞానయోగమును జ్ఞానమార్గమునుగూర్చి, "అయియున్నావు" – "అసి" పాదమును వివరించుచూ, జీవబ్రహ్మైక్యమును – జీవాత్మల పరమాత్మల ఏకత్వమును – నిరూపించుచున్నవి.

— పరిగె వెంకటరమణరావుగారు.



దండకము

# ఉత్తర గీత

అనువాదం:
శ్రీ కరణం అశ్వత్థరావు,
కలుగోడు, (రాయదుర్గం)



[ శోకము అజ్ఞానానికి చిహ్నం. అజ్ఞానం తొలగిందంటే శోకము వూడిందే గుర్తు. "ఆత్మవిచ్ఛోకం తరతి – తత్ర కో మోహః కశ్శోకః" – అని ఉపనిషత్తుల ఉద్ఘోష. ఉపనిషత్సారమైన గీతగూడ దాన్నే నొక్కి చెప్పింది. "అశోచ్యాన్" అని ఆరంభించి "మా శుచః" అంటూ ముగిసిన శ్రీభగవంతుని ఉపదేశానికి శోకనివృత్తే పరమలక్ష్యం.

గీతాసిద్ధాంతాన్ని నిత్యజీవితంలో జీర్ణింపజేసుకొన్న ఒక పవిత్ర కుటుంబ జీవులు, సాక్షాత్తు అర్జునునికే బుద్ధిచెప్పారు. కథ కాల్పనికమైనాగూడా చక్కటి గుణపాఠాన్ని బోధిస్తుంది. మా మిత్రులు పరమపవిత్రులు భక్తభూషణులు హాస్పేట (బళ్లారిజిల్లా) నివాసులు శ్రీ మైదూరి తిరుమలాచార్యులు బి. ఏ., పకీలుగారు సుమధుర శైలిలో దీనిని కన్నడంలో రచించారు. నా నిర్బంధానికి లొంగి, అనారోగ్యంతో వుండికూడా దండక రూపంలో అనువదించి గీతావాణికి కానుకగా పంపిన శ్రీ అశ్వత్థరావు గారికి మా అనంత ధన్యవాదాలు.

— సంపాదకుడు ]



(అర్జునుడు) – "శ్రీకృష్ణ! యేలీట్లు రాజ్యంబు రాజ్యంబటంచాస, మాకీవు గొల్పంగ? సద్బంధు మిత్రాళినిన్ నాశమున్ జేయుటన్ రక్తసిక్తంబులౌ స్వీయ హస్తంబులన్ గొన్న యీపాడు రాజ్యంబు త్యాజ్యంబు గాకెట్లు పూజ్యంబగున్? భోగభాజ్యంబగున్? మాధవా! సింహ కైశోరమో నా విరాజిల్లు నా వీర సౌభద్రుఁడో బోయె! మా వంశ పుంధాత మా తాత మా త్రాత మా నేత గాంగేయుఁడో కూలెఁ, గట్టా! ధనుష్మన్ మహాలోక వీరాది వీరుండు, లోకైక శూరుండు – విద్యాగురుండౌ ఘటోద్భూతుఁడౌ ద్రోణుఁడో లేఁడుగా; బంధులన్ మిత్రులన్ పుత్రులన్ మాన్యులన్ విప్రులన్ నీగికై కొన్న పింపౌ సనంబిద్ది పో; ఘోర కాంతార పుంక్రూర సత్త్వంబులన్ బోలు మేమే యధిష్ఠించి నన్ భూజ్యసామ్రాజ్య మిద్దానినిన్ – దిట్టదే లోక; మార్యుల్ మదిన్ మెత్తురే? పొట్టకై యేల యీరట్లు? నిఃస్వార్థతన్ వృక్షముల్ పండ్లు పర్ణంబులీవే? ఝరుల్ స్వాదు నీరంబులన్ గ్రోలఁగాఁ బెట్టవే? పండఁగా భూమిపై చోటులేదే? తలన్ దాచఁగా గహ్వరంబుల్ గుహల్ లేవె? ధన్యాత్ములౌ తాపసుల్ హాయిగా దేహమున్నంతకాలంబు యోగంబులన్ సల్పుచున్ మోక్షలక్ష్మీకరంబట్టి చేపట్టరే? చెల్లరే? ఒల్లనేనొల్ల!! నీవింక నిర్బంధమున్

జేయుటల్ మాను; నిక్కమిచ్చిగావిన్ననే-
నిట్టి తుచ్ఛంపు మీసాలపై తేనె లీసౌఖ్య
ముల్ దుఃఖదంబుల్; మహాఘోరమహాపాప
మూలంబులోఁగాదె?”యంచిట్లు పార్థుండు
శోకాకులాత్ముండునై దీనతన్ వేడుచున్
దన్నువెన్నాడ, వెన్నుండడదే చోటికో -
యేటికో పోవుచున్,

(కృష్ణుడు) - “నాడు గీతోపదేశంబుచేఁ
దేర్పఁగా నాత్మదౌర్బల్యమున్ బాసి, యు
ద్ధావనిన్ కాలరుద్రుండునై నిల్చి, వేదండ
తండంబులన్ దాఁకి దూఁకాడి పోకార్చు
నా కేసరీశాబకం బట్టులన్ వైరితండం
బులన్ జెండి, ముల్లోక వీరుండు నా పేరు
గన్నట్టి, యీగండఁ డీరీతికాఁ గారణం
బేమొ? యీ దైన్యపున్ మందు నెవ్వారు
త్రావించిరో? తానె విభ్రాంతుఁడౌచున్,
మహాజ్ఞానినా, నాకె వేదాంత తత్త్వంబు
బోధించెడిన్; నాఁటి గీతోపదేశంబహో!
బూడిదన్ బోయు నాజ్యంబుగా నిష్ఫలం
బై చనెన్ - కాని, యీ జాడ్యమున్
సత్వరన్ మాన్పలేకున్నచో, వ్యర్థమౌ నాదు
వ్యూహంబు, ధాత్రీస్థలీభారమున్ ద్రుంచ
సద్ధర్మమున్ బెంప, నిట్లైన నెల్లో” నటం
చెంచి విన్వచ్చు వీక్షించి, తానుత్తమాం
గంబు పంకించి, నెమ్మోమునన్ చిన్న
నవ్వొల్కఁగాఁబల్కె - “సత్యంబులే నీను
డుల్; వేసటన్ జేసి డెందంబు గాసిల్ల
నిల్లేసుమీ! వల్లకాడౌను; - కాంతారమే
శాంతికిన్ దావలంబంచు భావంబునన్
దోఁచుఁ నంచాడుచున్ ముందుబోవంగ
నందొక్కచో కాననంబొండు గన్పట్టె;
వారందునన్ జేరఁ బార్థుండు:—

(అర్జునుడు) - “ఓబావ! కన్గొంటివా
దీని సౌందర్య సౌభాగ్యమున్; చల్లనౌనీడ
లందిచ్చు వృక్షప్రకాండంబు పాంథాళికిన్;
దివ్యసౌరభ్యముల్ విచ్చు పుష్పావళుల్;
మందమందంబుగా వీచుచున్ నేదఁ
బోఁదీర్చి, బల్ హాయిఁ జేకూర్చుగాడ్పుల్;
ఫలాకీర్ణమై శాఖలన్ భూమి తాఁకించెడిన్
పాదపంబుల్; మరిన్ దివ్యమాధుర్య నీర
ప్రపూరంబు లీభవ్య కాసారముల్; కర్ణపే
యంబుగా సామగానంబుగాఁ బాడు నీపక్షి
జాతంబు; నీక్షించితే; యుల్లు కుళ్ళాయిగాఁ
జేసి యుల్లాసమేపార జీవించుఁగా! రాజ్య
పుంటూసలా? వ్యాజ్య పుంత్రాసలా?
చింతలా? వంతలా? లేని యారాటమా?
కాని పోరాటమా? లేదు లేదంచు నిల్లాలి
యార్భాటమా? లభ్యమౌ పండ్లు సేవించి,
పొంగారు పెన్నేఱులన్, సారకాసార
పున్ నీరులన్ గ్రోలి సయ్యాటలన్ సల్పు
చున్, హేళిమై గానముల్ సేయుచున్,
బాళిమై యుండు నొండొంటితోఁగూడు
చున్, లీల నీలాభ్రమే నర్తనాగారమై
మీఱఁగా, బారులన్ దీర స్వేచ్ఛావిహా
రంబులన్ గేరుచున్; ధారుణిన్ జేరు
చున్, బారుచున్ గూడి పాటాడుచున్;
రూఢిఁ గాల్ప్రవాహంబునన్ వ్రాలుచున్,
సోలుచున్, దేలుచున్; దివ నుయ్యాల
నూగాడుచున్; దాస్యమున్ సంకెలన్ ద్రెంచి,
స్వాతంత్ర్యసౌభాగ్యమున్ మించి, రంగా
రు పో!! పుట్టుచావన్న యామాట పాటింప
కాధ్యాసయేలేక వర్తించు నీజీవితం బెంత
ధన్యంబొ! మాన్యంబుఁ బుణ్యంబు గణ్యంబు
నౌఁ గాఁదె ? యీసౌఖ్యమీస్వేచ్ఛ

సామ్రాట్టుకేన్ గల్గునే" – యన్న నా పల్కులాలించి వెన్నుండు ——

(కృష్ణుడు) :– "నీబోధయే మేలు – తాపత్రయాభీల దావాగ్నిలోఁ ద్రేలు సంసారమోచాలు; నీకాననావాసమే మాకిఁకన్ బోలు; రారమ్ము వేవేగఁ బోబోద"మంచన్న

(అర్జునుడు) – "నోకృష్ణ! పేరాఁకటిన్ జిక్కితిన్, జాల దూరంబు విచ్చేసినామయ్య! దాహంబునున్ గూరె; యాయాసమో మీఱె; నున్నట్టు లుండిప్పుడేమో కదా? నేఁబురిన్ జేరఁగాఁ బోవఁగాజాల, ముందేమి కర్తవ్య" మంచన్న ——

(కృష్ణుడు) :— "భూజంబులందుండు పక్వంబులౌ పండ్ల గుచ్ఛంబులన్ గోసి తేఁబొమ్ము; నేనట్టులే డస్సినా" నన్న పార్థుండు వేపోయి విచ్చేసి యిట్లాడు ——

(అర్జునుడు) :– ఓకృష్ణ! వింతౌ వనం బిద్ది; యిందాక పక్వంబులౌ పండ్లు బౌద వృక్షాలందోఁచి బల్ భ్రాంతిఁగల్గించె; విచ్చేసి చూతున్ గదా! పండ్లునున్ గాయలున్ గూడ లేవయ్యె; కాసారమో రిక్తమైపోయె, నేమాయయో?" – యన్న –

(కృష్ణుడు) :– "కౌంతేయ! యేమాయయున్ గాదు; నీభ్రాంతియే కాని, ఆముందు వీక్షింపుమా! హోమధూమంబుఁ గాన్పించు; నేనైష్ఠికాచారుఁడౌ విప్రుగేహంబో, యందుండఁగావచ్చు! నందేగినన్ మాకు నాతిథ్యమాతండు నీవచ్చుఁగా? తిన్నఁగా రమ్మి నావెంట నచ్చోటికిన్ బోద" —— మంచాడి, శ్రీకృష్ణుఁ డాక్రీడితోఁ గూడి, ముందేఁగఁగా, మార్గమధ్యంబునం దొక్కడన్ – ఇధ్మములన్ దేరవిచ్చేసి యున్నట్టి విప్రార్భకున్ గాంచి, – "ఇందేగృహంబైన నొండున్నదే? అన్నపానీయములన్ గల్గునే? బల్ క్షుధన్ డస్సినామయ్య! ఆతిథ్య మాతాపునన్ లభ్యమౌనే" యటంచాడు కంసారి నట్టే నిరీక్షించి విప్రార్భకుండాడు :—

"నేనొక్క సంసారి, నాతల్లియున్ దండ్రి యిల్లాలునున్ గల్గువా; రల్ల దవ్వేగుచో వచ్చు నాయిల్లు; నే విప్రుఁడన్, వత్తు మీ వెంట – నే నిత్తు నాతిథ్యమున్, తాళుఁ డొక్కింత యిధ్మంబులన్ దెత్తు" —— నంచాడి, యాతండు, ఆపొంత నేయున్న యశ్వత్థవృక్షంబు పై నెక్కి యిధ్మంబులన్ గోయుచుండంగ కృష్ణాహి యొండౌ ద్విజోత్తంసు పాదంబు, దంష్ట్రింబునన్ గుట్టె – నాతండు "హా! శ్రీహరీ!" యంచు ధాత్రీస్థలిన్ గూలి ప్రాణంబులన్ దూలె – నాఘోరమున్ గాంచి పార్థుండు నిర్విణ్ణుఁడై పోలె; కృష్ణుండు,

"ఓపార్థ! స్వస్థానమున్ వీడి కాంతారమున్ జేరినన్ కష్టములన్ విచ్చునే? కర్మములన్ నచ్చునే? దాఁటఁగా రానికాలంబు పోఁబుచ్చునే? – విప్రుఁడిక్కైవడిన్ బ్రాణములన్ వాసెఁగా! వాని యిల్లాలికిన్ దల్లికిన్ దండ్రికిన్ దెల్పుటల్ మాకు ధర్మం" బటంచాడి, యాక్రీడితోఁ గూడి, యయ్యాశ్రమస్థానమున్ జేరి, యాముంగిటన్ – మౌనముద్రాన్వితుండై శౌరియున్నంత –

వీక్షించి యాగేస్తు విచ్చేసి, హస్తంబులన్ గొన్న అర్ఘ్యంబు పాద్యంబులిష్యంగి నుంకింపఁగా; నాపి, కృష్ణుండు – "నీపుత్రుఁడిధ్మంబులన్ గోయఁ గాంతార మధ్యంబునం దొక్క వృక్షంబు పైనెక్కి

దుష్టాహిదష్టుండునై చచ్చె; వీక్షించి నా
మాట నామాట తెల్పంగ విచ్చేసి నామంతె-
యీయర్ఘ్యపాద్యంబు లీయంగ నీకున్
గొన్న మాకుఁగాలంబు కాదింక మేమే
గఁగా నాజ్ఞయా?" యన్న - ఆ బ్రాహ్మ
ణుండాడు -

"ఎవ్వాఁడు మున్నిచ్చె నవ్వాఁడె కొం
పోయె; వైరుధ్యమేమిందు? కానిమ్ము!
తప్పేమి? యొప్పేయగున్ జుమ్ము; మీ
కేటి కాచింత! విచ్చేసి యాతిథ్యమున్
బూని, నా దేహమున్ గేహమున్ బూత
మున్ జేయుఁ" డంచన్న - విభ్రాంతుఁడై
పార్థుఁడల్లంత యోచించుచున్, "దండ్రియే
యీతఁడున్? బుత్రు చావెంచి దుఃఖిం
పఁడే? - అమ్మొ, ఆయో? కనన్
విప్రుఁడో బోయఁడో? వీని యాతిథ్యమా
మాకు? నయ్యారె! -" - యంచల్గి పోఁ
బోవ నాగేస్తునిల్లాలు విచ్చేసి హస్తంబు
లన్ మోడ్చి -

"పోఁబోకుఁడీ! యాఁకటన్ జిక్కి-
యున్నారుగా; యిష్టమృష్టాన్నమర్పింతు;
విచ్చేయరే!" - యన్న, "నో సోదరీ!
పన్నగం బొండు నీపుత్రునిన్ బట్టి
చంపెన్; గటా! యిద్ది యావేళ యాతిథ్య
మియ్యంగ? మీగోడు మీకుండె" - నంచన్న,
శ్రీకృష్ణునిన్ జూచి యాసాధ్వి -

"పుణ్యాత్ములారా! చనన్ బోకుఁ;
డాయుష్యమే తీరినన్ నిల్చునో యొక్కక్షణం
బేని ప్రాణంబు? నాపుత్రుఁడా విష్ణుపాదా
రవిందంబులన్ జెందెడున్, శాశ్వతానంద
మున్ బొందెడున్ గాత! - మేమెంత
దుఃఖించినన్ వాఁడు రాలేఁడుగా! మీర
లభ్యాగతుల్ విష్ణురూపుల్ సుఁడీ! వచ్చి
యాతిథ్యమున్ బూనకే పోవఁగాఁ గూడ
దిట్లూరకే; పాడిగాదట్లు పంపంగ, మా
యాశ్రమాచారరీతికే - ప్రాంజలిన్ వేడె
దన్, నన్ గృపన్ జూడుఁడీ! భోజనా
నంతరం బేగుఁడీ!" యన్న నన్నాతి
వాక్యంబు లాలించి శ్రీకృష్ణుఁడా పార్థునిన్
జూచె; -

"కన్నమ్మకున్ లేదు కారుణ్యలేశంబు;
విన్నంత నీచిత్ర చారిత్రమున్ నీరుగాఁ
బాఱుఁగాగుండె; వీక్షింప నీక్రూరులన్ పాప
మా; నిల్వరాదిందు" లెమ్మంచు పార్థుండు
లేవంగ నంతన్ మృతుండైన యావిప్రునర్ధాంగి
యే తెంచి - "మధ్యాహ్నమయ్యెన్ గదా!
మీరు పోనౌనె? సిద్ధాన్నమున్ ద్రోచి;-
ఉద్ధారమున్ జేయుఁడీ మమ్మ" టంచన్న -
"నీప్రాణనాథుండు వ్యాళంబుచేఁ బ్రాణ
ముల్ వాసె ఘోరాటవిన్; - తల్లి!
సత్కారముల్ సల్పఁగా వేళయా యిద్ది?
యీనాఁటికిన్ బోయి, ముందొక్క నాఁ
డేము విచ్చేసి మీచేత నాతిథ్యమున్
గొందు" మంచన్న నాసాధ్వి పల్కె
డిన్ -

"పుట్టినా గిట్టెడిన్ - గిట్టినా పుట్టె
డిన్; పుట్టుటల్ గిట్టుటల్ - నేఁటివా?
నాఁటివా? మాకు మాత్రంబునా, సర్వలో
దేహులా సూత్రసంబంధులే; దేహికిన్ దప్ప
వీన్యాయముల్; కర్మపాశంబునన్ జిక్కి
జీవుండు వచ్చున్, దరిన్ విచ్చు; ప్రజ్ఞా
న్వితుల్ మీకెఱింగింప నాకౌనె? స్త్రీఁ
గాన, ఆశ్చర్యమే? నిచ్చలున్ గాంచమే?
పుట్టుటల్ చచ్చుటల్ సృష్టికర్మంబగున్;

ఇచ్చి కొంపోవుటల్ దైవధర్మంబగుఁ,
మాప్రయత్నంబు లేఁ పోగ విధ్యానిలో;
ఈజగన్నాటకంబట్టి, దాఁగోలి పోనేల?
నే నాథుతోడఁ జితిఁ జేర నేగఁ
వలెఁ జుండి; అభ్యాగతాతిథ్యసత్కార
మెంచఁ గృహస్థాశ్రమంపుఁ మహాభా
గ్యమౌఁజుండి! లెండింకిటఁ రండి - యిష్ట
న్నపాకంబు స్వీకారముఁ జేయప్రార్థింతు-
మమ్మేలుఁ"డంచన్న - నాలించి యాక్రీడి
యాశ్చర్యమగ్నాత్ముఁడై నిల్చి శ్రీకృష్ణు
నీక్షించి -

"కన్నాడవే? మానవుల్ గారయా!
దానవుల్ వీరయా! నాథు చావెంచదే?
దాని నాలించియుఁ గందదే మోము?
లోఁగుందదే? డిందదే గుండె? యీనారి
యేమారియో? నిల్వఁగానౌనె యేమియ్యె
డఁ; రమ్మ రమ్మంచు గద్దించి శ్రీకృష్ణు
నిన్ గూడి యాక్రీడి పోవంగ యాయింటిదౌ
దాసి -

"అన్నయ్యలారా! మొగాల్ చెప్పు
మీరాఁకటఁ జిక్కినారంచు; మీడొక్క
లో బక్కలై లోనికిఁ నక్కినట్లుండె;-
ప్రొద్దల నన్నెత్తి పెకెక్కి;బోనేసిపోరాదె;
మాయమ్మ -మాగేస్తురాలమ్మ శాకంబులన్
మేలిపాకంబులఁ వండి వడ్డించెడిఁ;జున్ను
నేయ్ పాల్ పెరుంగుల్, మరిఁ దప్ప
ళాల్ అప్పడాల్ చారు సాంబారు కూర్గా
య లూర్గాయలుఁ - చెక్కిలాల్ పెక్కు
భక్ష్యాలు భోజ్యాలతో విందులఁ బెట్టు
రండయ్య! బోనేసి పొండయ్య; నామాట
నంతఁ వినుండయ్య;" యంచడ్డమై దారి
కానారి నిల్వంగ - వేసారి కంసారి;

"ఓ దాసి! మీయయ్యగారమ్మగారన్న
వాక్యంబులఁ వింటివా? చోద్యమైతోఁచె
నవ్వారి చిత్తంబు, వృత్తంబు!! కన్గొంటివే!
చచ్చెఁ బుత్రుండునాఁ లెక్కకే తేర;
శోకింపరే? యేటికాచింత భోంచేయ
లెండందురే? - నిక్కమై పొట్టలో మోసి
రో? పుత్రునే తల్లినిఁ బాపి కాఁజేసిరో?
యిస్సిరో! గుండెలో వట్టి చట్రాళులో
వీరికిఁ? పేగులో కాక పెఁనాగులో?
యిట్టివారింటనా, కూడునుఁ గొంటనా?
అన్నమో, అద్ది ప్రాణానికే తెమ్పు పాపా
ణమో? వీడొకో పొడొకో వల్లకాడో
తలంపంగ యీకొంప?ఓ చేటి! నీవున్న మా
వీడు మాదారి" నంచన్న -

"హా! తప్పు తప్పాడినా" రంచు,
ఆదాసి తాఁజెంపలఁ వేసికొంచిట్లు
భాషించె - "ఓయప్ప! మాయప్ప పల్కు
ర్థమైనట్లుగాలేదు మీకెన్నఁగా; జ్ఞాని
యాతండు - సద్భక్తి నిత్యంబు గీతఁ పఠిం
చుఁ - సదా గీతయే పాటగా, గీతయే
మాటగా, గీతయే బాటగాఁజేసి వర్తించు;
తానట్లు వర్తించుటే గాదు - బోధించి
శోధించి సాధించి, యాత్రోవలో దించి
మమ్మట్లుగావించె - యుద్ధంబులో మూర్ఖ
డై పేడియట్లేడ్చె వివ్యచ్చుఁడారీతి కారాదు
- వర్ణాశ్రమాచారధర్మంబులఁ వీడగారా
దటంచాతఁడా పార్థునిఁ సాక్షిగాఁ జెప్పు
చుఁ నవ్వి, గీతోపదేశంబు మాకెప్పు
డుఁ జేయు" - నంచాడఁగాఁ గృష్ణుఁడా
కట్టినిఁ గాంచి; "కౌంతేయ! ఆలించితే
దాసివాక్యాలు? మారుత్తరంబిమ్ము-నే నేర"
నంచన్న,

"ఓ దేవ ! చాలింక యీశృంగ భంగంబు, యీతొత్తుచే నాకు బోధింపఁగా నిట్టి లీనాటకంబల్లితే"? యంచు హస్తంబులన్ దొట్టి పాదాబ్జముల్ బట్టి తానట్టులేలేచి వీక్షింప –

కాంతారమూలేదు; విప్రుండు లేఁడిల్లు నిల్లాండ్రు లేరయ్యెడన్, దాసితే-దర్జునుం డచ్యుతుం డిర్వురున్ దప్ప వేరెవ్వరున్ లేరు; – సౌధంబునన్ మున్ను వారున్న యాచోటనే యుండుటన్ గాంచి నిర్విణ్ణుఁడై నిల్చి హస్తంబులన్ మోడ్చి,

(అర్జునుడు) – "జ్ఞానోదయంబయ్యె; యీధాత్రి సామ్రాజ్యమున్ మద్భుజాగ్రంబునన్ దాల్చి ధర్మంబు రక్షించెదన్, నీయనుజ్ఞన్ దలన్ బెట్టి కర్తవ్యమున్ జేసెదన్; మాధవా! యో జగన్నాటకాచార్య! నీమాయ దాఁటంగ సాధ్యంబె కా దొక్క నీపాదపద్మావధానంబునన్ దక్క; — సద్భక్తసంరక్షః దుష్టాళిశిక్షా! దయాపార లీలావతారా! హరే! కేశవా! మోక్షలక్ష్మీధవా! దేవదేవా! నమస్తేనమస్తే! నమః॥" –



## శ్రీ సాధు ఆరుమళ్ళ సుబ్బారెడ్డిగారి అధ్యక్షతను యోగానందాశ్రమములో జరిగిన భక్తమహాజనసభలో పరివ్రాజకాచార్య శ్రీ శ్రీరామకృష్ణానందగిరిస్వాములవారికి భక్తిపూర్వకముగా సమర్పించుకొన్న సన్మాన పత్రము.

విద్వచ్ఛిరోమణీ!

ఈ గ్రామముననే జన్మించి మాతోకలిసి తిరిగి మీరు అయిదారు భాషలలో పండితులై, కవులై, వక్తలై, రచయితలై, సర్వసంగ పరిత్యాగులై, స్వాములై, జగత్ప్రఖ్యాతిగాంచుచు మీతోపాటు మన గ్రామమునకుకూడా శాశ్వతకీర్తిని తెచ్చిపెట్టిన మీ ఆదర్శజీవితము, మమ్మెంత తన్మయాత్ములజేయుచున్నదో సర్వజ్ఞులైన మీరు తెలుసుకోవలసినదే గాని భాషావిహీనులమైన మేమెట్లు తెలియజేయగలము?

స్వామీజీ!

మీ రెల్లరకు పరివ్రాజకాచార్యులుగా కనిపించుచున్నను మాకుమాత్ర మిప్పటికిని మా రామప్పగానే కనిపించుచున్నారు. ఆబాల్యస్నేహకారణముగా మేము మిమ్మెట్లు భావించుకొనుచున్నను, శ్రీకృష్ణుడు గోపికల ననుగ్రహించినట్లు మీ ఆశీర్వాదదృష్టిని సదా మాపై అనుగ్రహింప జేయవలసినదిగా ప్రార్థించుచున్నాము.

దైవాత్మస్వరూపా!

బ్రహ్మచారిగా బయలుదేరిపోయి సంన్యాసిగా తిరిగి దర్శనమిచ్చిన తమ పాదసన్నిధిని, సన్మానపత్రరూపములో సమర్పించుకొనుచున్న మా ఆర్ద్రహృదయాలను దైవమందిరాలుగా మార్చవలసినదనిమాత్రము వినమ్రులమై పదే పదే నమస్కరింపుచున్నారము.

రామిరెడ్డిపల్లె,
1—11—53.

ఇట్లు,
భ క్త కో టి.

# గీతలో - పురుషకారమునకు స్థానము.

జటావల్లభుల పురుషోత్తం. M. A.,



[శ్రీ పురుషోత్తం పంతులుగారంటే నామట్టుకు నేను 'ఆంధ్రమాలవ్యా' గా భావిస్తాను. ఆంధ్రదేశంలో దిగ్గజంవంటి ఆ పండితుడు గీతావాణియొక్క ఆప్తకోటిలో ఒక్కడై యుండుట మా భాగ్యం.

ప్రస్తుతం యెందరినో ఆందోళనపరుస్తూండే, "పురుషప్రయత్నం - దైవవాదం" అనే సమస్యను చక్కగ పరిష్కరించి, సమన్వయించి ప్రతిపాదించిన యీ వ్యాసం జిజ్ఞాసువులకు యెంతో ఆప్యాయతను తృప్తిని కల్గించకలదని విశ్వసిస్తాను.

— సం.]

ఈ విచారములో మూడంశములు ముందుగా గుర్తింపవలసి యున్నవి. (1) 'కర్తను', 'భోక్తను' అని భావించుచున్న జీవుడు. (2) అనేకజన్మ వాసనావిశేషములచే వానికేర్పడియున్న ప్రకృతి. (3) సర్వ నియంతయైన పరమేశ్వరుడు. "కురు కర్మ త్వం" ఇత్యాదులలో పురుష కార సామర్థ్యమును, "ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి" ఇత్యాదులలో ప్రకృతి ప్రభావమును, "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామ యన్ సర్వభూతానాం యంత్రారూఢాని మాయయా" ఇత్యాదులలో ఈశ్వర సర్వసంచాలకత్వమును ప్రకటింపబడినవి. ప్రకృతి పరమేశ్వరుల కట్టిప్రాభవమే యున్నచో పురుషకారము వ్యర్థము కాలేదా యనునది ముఖ్యమైనప్రశ్న. అట్టిచో విధినిషేధాత్మకమైన ధర్మశాస్త్రమంతయు, ఆధ్యాత్మిక సాధన ప్రణాళికయంతయు వ్యర్థమే కావలసివచ్చును. కాని శాస్త్రవైయర్థ్యము గలుగకుండుటకై ప్రకృతి పరమేశ్వరుల శక్తిని తగ్గించుకొని భావింపవలయుననుటలో నేమి యౌచిత్యముండును?

ఈ ప్రశ్నకు తగినసమాధానము గీతలలో నుండనేయున్నది. ప్రకృతి నిన్ను నియమించుమాట వాస్తవమే. కాని యీ నియమనమును ధిక్క రించుశక్తి నీకుకలదు. ప్రకృతి నిన్నొకపాపకార్యములోని కీడ్చుట కుపక్ర మించును. నీవు మెలకువ తెచ్చుకొని సర్వశక్తిని నుపయోగించి దానిని ప్రతిఘటింపవచ్చును. ఇది సులువుగా తప్పించుకొనిపోవుటకు చెప్పిన

సమాధానమని కొందరికి తోచవచ్చును. అట్టివారు ప్రకృతియన నేమో యొక్కసారి యాలోచించుకొనవలయును. ఏ పురుషకారమునకీ శక్తి లేదని వారనుచున్నారో అట్టి పురుషకారములయొక్క పరంపరచేత నానాటికి పెరుగుచు గట్టిపడిన సంస్కారవిశేషమే ప్రకృతి. కావునప్రకృతికి గల బలమంతయు పురుషకారమునుండి వచ్చినదేయని గ్రహింపవలయును. పూర్వజన్మలలోను, ఈ జన్మలోను ఈ క్షణమువరకు జరిగిన పురుషకారముల సమష్టిఫలితము ప్రకృతి. అది యొకదారి కీడ్చునపుడు దానిని నిరోధించుటకును, మరొకదారిని పోవుటకును ప్రబలమైన ప్రస్తుత పురుషకారమునకు శక్తియుండుటలో అసంభవమేమియు లేదు. అనేక దినములుగా తినుచుండిన అనారోగ్యకర వస్తువుల ఫలితముగా నొకని కజీర్తి కల్గినది; బాధపడుచున్నాడు. ఈ క్షణములో ప్రబలమైన ఔషధమును భక్షించి యా బాధను తగ్గించుకొనుట యసాధ్యముకాదు. అట్లు తగ్గించుకొనినంతమాత్రముచేత నా యజీర్తి పూర్వాభక్షిత వస్తువిశేషములచే వచ్చినదని చెప్పుట పొరబాటు కాజాలదు.

ఈరీతిగా పురుషకారము ప్రకృతిప్రాబల్యమునతిక్రమించిపనిచేయుచో దాని కాశ్చర్యపడ నక్కరలేదు. ఈ పురుషకార ఫలితముగా నేర్పడిన సంస్కారము తత్క్షణములో ప్రకృతిలో కలసి యెనసి యేకమగుచున్నది. ఈ రీతిగానే మనప్రకృతి జన్మ జన్మలకు ప్రవాహనిత్యత్వమును కలిగియున్నను, పరిణామవిశేషము ననుభవించుచునేయున్నది. కావుననే భగవానుడు ప్రకృతి ప్రభావమును తెలుపు,

> "సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
> ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥"

అను శ్లోకమునకు వెంటనే "ఓ యర్జునా! నీవు నిగ్రహమును సంపాదించుకొని జ్ఞానవిజ్ఞానములకు శత్రువైన కామమును జయింపుము" అని యాదేశించుచున్నాడు.

> "తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
> పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం ॥"

ఇట్టి వచనములు గీతలో నెన్నియో యున్నవి.

ఇక పరమేశ్వరుని విషయము చూతము. "సర్వమును పరమేశ్వరుడే నడపుచున్నచో స్వీయప్రవర్తనమునుగూర్చి మనకు చింతయేల?" ఇది యాపాతరమణీయమైన ప్రశ్న. ఈశ్వరుని సర్వసంచాలకత్వమునందు దృఢభావమున్నవానికి చింతయుండదనుమాట వాస్తవమే. వాని విషయమై మీమాంసయే లేదు. "నేను పాపము చేసితిని; దీని నీశ్వరుడే చేయించె"నను వాని విషయముమాత్రమే మీమాంస. ఒకని చెంపపై కొట్టి "యీశ్వరుడే కొట్టినాడనుకొనుము" అనువానినిగూర్చియే విచారింపవలసియున్నది. దెబ్బతిన్నవాడు తిరిగి గట్టిగా చెంపపై కొట్టుచో "ఈశ్వరుడే నన్ను కొట్టినాడు; ఈశ్వరుని రూపముగానేనేననుభవించుచున్నా"నని వాడు భావించుచో వానివిషయమైకూడ చింతలేదు. కాని యెవడు తానితరుని కొట్టునప్పుడుమాత్రమే యీశ్వరుడు కొట్టినాడనియు, తన్నితరులు కొట్టునప్పుడు మరొకరీతిగాను భావించునో యట్టిదొంగను గురించిమాత్రమే మీమాంస యవసరము. ఇట్టి దొంగలకు భగవద్గీత యుద్దేశింపబడలేదు; యథార్థజిజ్ఞాసువులకుమాత్రమే యుద్దేశింపబడినది.

ఈశ్వరుని సర్వసంచాలకత్వమునకును, విధినిషేధరూప శాస్త్రమునకును వైరుధ్యము లేదు. ఈశ్వర లీలామాత్రముగ నడచుచున్న యీ సృష్టిలో సర్వశక్తి సంపన్నుడైన పరమేశ్వరుడొకింత స్వాతంత్ర్యమును జీవున కిచ్చినంతమాత్రమున యాయన యాధిపత్యమునకు లోపము వచ్చునా? భార్యపై సర్వాధిపత్యముగల భర్త యేదోయొక గృహకృత్యవిషయమున నీవు దీనిని స్వయముగా చూచుకొనుమని చెప్పినంత మాత్రమున నాతని యాధిపత్యము తొలగినట్లునా? ఆమె కప్పగింపబడిన యా పనిలోకూడ నాధిపత్యమాతనిదే. ఆతనికి సమ్మతిలేనిచో నేక్షణములోనైనను అడ్డగలడు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ॥"

ఇత్యాది వచనములను బట్టి కొందరు ఫలము నిచ్చుటలోనే యీశ్వరుని శక్తియనియు, కర్మనాచరించుటలో మనదే స్వాతంత్ర్యమనియు చెప్పుచున్నారు. ఇదియు పొరబాటే. ఫలప్రదానములోనే కాక, కర్మాచరణములో కూడ నీశ్వరుని హస్తము ప్రసరించిననేకాని మానవుడు

శక్తుడు కాడు. "దైవం చైవాత్ర పంచమం" అనుచోట భగవానుడు సమస్త కార్యములలోను తన హస్తవిన్యాసమును సూచించినాడు.

జీవుని విషయములో పరమేశ్వరుడు కలుగజేసికొనుట యే రీతిగా నుండునో కూడ గీతలలో సూచింపబడినది. నైర్ఘృణ్యావైషమ్యములులేని నిష్పక్షపాతాధికారిగా పరమేశ్వరుడు వర్తించుచున్నాడు.

"న మే ద్వేష్యోఽస్తి న ప్రియః"

అట్టిచో మానవుల సుఖదుఃఖములలో తారతమ్యము లేలవచ్చినవన: ఇదివర కేలవచ్చినదో విచారించుటకంటె, ఇప్పుడు నీకు దుఃఖమెట్లు నాశన మగునో చూచుకొనుమని భగవానుడు బోధించుచున్నాడు. ఇదివరకు జరిగినదానికి సమాధానము లేదనికాదు. ఆ సమాధానము విపులముగానే గీతలలో చెప్పబడినది. జీవులకెల్లరకును కర్మానుగుణమైన ఫలమునిచ్చుట లోనే పరమేశ్వరుని నైర్ఘృణ్యావైషమ్యవిదూరత యున్నది.

ప్రస్తుత దుఃఖబంధములనుండి జీవుడు బయటబడుటకు పరమేశ్వరుడు చేయుసహాయ మెట్టిదన: దేవతాపితృదేవతాద్యారాధనముచేయు వారేరీతిగా నాయాస్థానములను పొందుదురో యట్లే అనంత కల్యాణ గుణపరిపూర్ణుడును, కేవలానందస్వరూపుడును అగు పరమేశ్వరుని సేవించువారికి శాశ్వతకల్యాణమును, ఆనందప్రాప్తియు కల్గును. ఇక్కడకూడ పక్షపాతము లేదు. ఎట్టిపాపినైనను పరమేశ్వరుడు చేర్చుకొనును; కాని తనకెంత యనుగ్రహమేర్పడినను పాపి పాపిగానుండగా వానిని దరికి రానీయడు. పాపియొక్క పాపభావములు పోయి పవిత్రతయేర్పడిన పిమ్మటనే వాని నాతడు చేర్చుకొనును. తన్ను సేవించువానికా పవిత్రయేర్పడునట్లు చేయును. "అపి చేత్సుదురాచారః" "క్షిప్రం భవతి ధర్మాత్మా" మున్నగువాని భావమిద్దియే. సంస్కారము జీవునియంతఃకరణద్వారముననే రావలయును. ఆ సంస్కారము రాకుండ నెవనికిని ఈశ్వరసాన్నిధ్యము సిద్ధింపదు. ఎంత నిర్హేతుకజాయమాన కటాక్షమునకైనను వెనుక హేతు వుండనేయుండును. జీవుడు పరమేశ్వరునిచేరు చివరియవస్థలోకూడ పురుషకారమునకు ప్రతిఫలముగామాత్రమే పరమేశ్వరు డాతనికి జ్ఞానము ప్రసాదించును. [ మిగతా 68వ పేజీలో ]

ఓమ్.

# గీత — సామ్యవాదము.

శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు.

సంపాదకుఁడు: "మోక్షసాధని"





గీతాశాస్త్రమునందు అనేక స్థలములలో సమత్వమును గూర్చి చెప్పఁబడినది. ఆ సమత్వము జ్ఞానయోగమునందును, భక్తియోగమునందును, కర్మయోగమునందును, ద్వంద్వములందును, మానవులందును, మానవేతరులయందును, సమస్త జీవరాసులయందును, సర్వత్ర బ్రహ్మభావనచే సమదృష్టితోఁ జూచుటను గూర్చి పెచ్చుపెచ్చుగ చెప్పఁబడినది. ఏ మార్గమున నాధ్యాత్మిక సాధన చేసినను సమత్వములేనిది, అది సిద్ధించినట్లు చెప్పఁబడఁజాలదు. కావున గీతాసాధన సమత్వమునకుఁ గొనిపోవుటకే చెప్పఁబడినది. ఇట్టి స్థితిని బాగుగాఁ దెలిసికొని పొందినవారు చాల అరుదు.

కొందఱీసమత్వమును ప్రాకృతికమగు దేహములద్వారా పొందఁ జూచుచుందురు. ఈ స్థితి విషయములో సాధకులును, సిద్ధులును, సాధకులు సిద్ధులు కానివారును వారివారి భావముల కనుకూలముగ నీ క్రింద నుదాహరింపఁబోవు గీతాశ్లోకమును జెప్పుకొని తృప్తిపడుచుందురు.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః॥ గీత. ౫ అ. ౧౮ శ్లో.

విద్యావినయ సంపన్నుఁడగు బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, కుక్కను దిను చండాలునియందును జ్ఞానులు సమముగఁ జూతురు.

ఇందు మనుష్యులకును, పశువులకును సమత్వము చెప్పఁబడినది. అయితే ఈశ్లోకము ననుసరించి చాలమంది బాహ్యమగు వస్తువులు సమముగ నుండవలయునని అట్లు వర్తించుచున్నారు. అది చాల తప్పు. ప్రకృతిలో సమమగున దొక్కటియును లేదు. ప్రకృతి అంతయును భిన్నమే. ఈ భిన్నములో సమమగున దొక్కటికాదు. అది నిర్గుణ పరంబ్రహ్మ. ఆ విషయము ఈ శ్లోకము పైశ్లోకములో 'నిర్గుణం హి సమం బ్రహ్మ' అని చెప్పి

సర్వసందేహములను శ్రీకృష్ణుఁడు తీర్చివేసినాఁడు. సమముగఁ జూచుట యనఁగాఁ బ్రతిజీవిహృదయములో నాత్మరూపముననున్న బ్రహ్మపదార్థమును సమముగఁ జూడవలయు ననియే. అందుకనియే 'విద్యా వినయ సంపన్నే' అను పైశ్లోకమునఁ బ్రతిచోట సప్తమీ విభక్తిని 'అందు' అనుదానినిఁ బ్రయోగింపఁబడినది. విద్యావినయ సంపన్నుఁడగు బ్రాహ్మణునియందు, గోవునందు, ఏనుఁగునందు, కుక్కయందు, కుక్కనుదిను చండాలునియందు నేదో సమమగు పదార్థమున్నది కాని శరీరములు కావు, ఆ సమమగుదానిని సమముగ అనఁగా నిర్గుణపరబ్రహ్మగఁ జూడవలయునని 'దర్శనః' శబ్దము ప్రయోగింపఁబడినది. చూచుట అనఁగా భావించుటయేగాని వర్తించుటకాదు. 'సమవర్తినః' అని ప్రయోగింపఁబడలేదు. పైనఁ జెప్పఁబడినవానిలో నాకారమునఁగాని, వర్ణమునఁగాని, గుణమునఁగాని, స్వభావమునఁగాని యేవిధమునను నొక్కటిగ నుండఁజాలవు. గీతాకారుని యొక్క అభిప్రాయము ప్రకారము శరీరములుకాక ఆత్మలు సమములని, అది ఒక్కటేనని "సూత్రే మణిగణా ఇవ" అని చెప్పినారు.

మనుష్యులలోఁ బరస్పరము సమత్వమును బాటించవలయునని ఆదరణ విషయములోఁ జెప్పఁబడినది.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ గీత ౬_౯.

సుహృత్తు, మిత్రుఁడు, ఉదాసీనుఁడు, మధ్యస్థుఁడు, ద్వేష్యుఁడు, బంధువులు, సాధువులు, పాపులు వీరియందు సమానభావముంచవలయును. కేవలము వీరియందేకాక సమస్త జీవరాసులయందు సమముగాఁ జూడవలయుననియుఁ జెప్పఁబడినది.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ గీత ౬_౩౨.

ఓ అర్జునా! ఎవఁడు సమస్తభూతములందు సమముగఁ జూచునో, సుఖమునుగాని దుఃఖమునుగాని సమముగఁ జూచునో అతఁడు యోగులలోఁ బరమశ్రేష్ఠుఁడని నా యభిప్రాయము.

శ్లో॥ సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః ॥ గీత ౧౨_౧౮.

వ్యక్తులగు శత్రుమిత్రులయందును, పరకృత క్రియలగు మానావమానములందును, అనుభవములగు శీతోష్ణ సుఖదుఃఖాదులందును సంగములేక సమముగ నుండవలయును.

ఇట్లు సమముగనున్నవాఁడు గుణాతీతుఁడుగ నుండును. వానినడక యిట్లుండును.

శ్లో॥ సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః ॥ గీత ౧౪_౨౪.

నిరంతరము ఆత్మభావముననుండి సుఖదుఃఖములను సమానముగ భావించుచు, మట్టి రాయి బంగారము వీటిని సమానముగఁ జూచువాఁడును, ప్రియముననందును అప్రియముననందును, నిందాస్తుతులందును సమముగఁజూచు జ్ఞాని గుణాతీతుఁడు.

ఇట్టి సమత్వము కలిగినవాఁడు తప్పక మోక్షమును బొందునని చెప్పఁబడినది. జ్ఞానియు నిట్టి సమత్వము కలిగియుండవలయును.

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ గీత ౨-౧౫.

ఓ పురుషశ్రేష్ఠుఁడా! సుఖదుఃఖములను సమముగఁజూచు ధీరపురుషుని ఇంద్రియ, విషయసంయోగముల వ్యాకులముసు జెందఁడు. అట్టివాఁడు మోక్షమునకు యోగ్యుఁడగును.

యోగమనఁగాఁ గేవలము ముక్కు మూసికొనుటయే కాదు. సమత్వమే యోగ మని చెప్పఁబడినది.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥గీత౨-౪౮

ఓ అర్జునా! సంగమునువీడి యోగస్థుఁడవై, సిద్ధియందును, అసిద్ధియందును సమత్వముగనుండి కర్మలను జేయుము. యోగమనఁగా సమత్వమే.

ఇది కర్మలలోఁ గల సమత్వము. ఇఁక భక్తివిషయములోను సమత్వము అవసరమని చెప్పఁబడినది.

శ్లో॥ సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః॥
శ్లో॥ తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః॥ గీత౧౨-౧౮,౧౯.

శత్రుమిత్రులయందును మానావమానములందును సముఁడుగాను, శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములందు సముఁడుగా నున్నవాఁడును, ఆసక్తిరహితుఁడును, నిందాస్తుతులను సమముగ నెంచువాఁడును, మననశీలుఁడును, నేవిధముగనైనను శరీర నిర్వాహమునందు సదా సంతుష్టుఁడగువాఁడును, అనికేతనుఁడును, అసక్తిరహితుఁడగు నాస్థిర బుద్ధిగల పురుషుఁడు నాకు ప్రియుఁడు.

ఇట్లు గుణాతీతుని లక్షణములను జెప్పుచు భగవంతుఁడిట్లు చెప్పినాఁడు.

శ్లో॥ సమదుఃఖసుఖస్స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః॥
శ్లో॥ మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే॥ గీత ౧౪-౨౪,౨౫.

సుఖదుఃఖములందు సమముగనుండువాఁడును, మట్టి రాయి బంగారము వీని యందు సమానభావముంచువాఁడును, ప్రియులందును అప్రియులందును సమానముగనుండు వాఁడును, నిందాస్తుతులను సమానముగఁ జూచువాఁడును, మానావమానములందు సమ భావముంచువాఁడును, శత్రుమిత్రులందు సమానభావముంచువాఁడును, విషయాపేక్షలేక ఆత్మయందే యుండువాఁడు గుణాతీతుఁడు.

ఇది గీతాసామ్యవాదము. ఇప్పటి సామ్యవాదమునకును దీనికిని చాల భేదముకలదు.

| గీతా సామ్యవాదము. | ఇప్పటి సామ్యవాదము. |
|---|---|
| 1. ఆత్మ సమానమందురు. | 1. దేహములు సమానమందురు. |
| 2. అంతను స్వస్వరూపముగఁ జూతురు. | 2. అంతను భిన్నముగఁ జూతురు. |
| 3. దీనికి ప్రాతిపదిక అహింస. | 3. దీనికి ప్రాతిపదిక హింస. |
| 4. అందరయందు ప్రేమ. | 4. తనకు వ్యతిరేకమైనవారియం దసూయా ద్వేషములు. |
| 5. ఆత్మశాంతియే ఫలము. | 5. బాహ్యావస్తు సంపాదనమే ఫలము. |
| 6. వ్యక్తిలో మార్పును గోరును. | 6. సమష్టిలో మార్పును గోరును. |
| 7. ఆత్మదృష్టి. | 7. దేహదృష్టి. |
| 8. ఆస్తికము. | 8. నాస్తికము. |
| 9. క్రియాశూరత్వము. | 9. వాక్శూరత్వము. |
| 10. శాస్త్రము ననుసరించుట. | 10. శాస్త్రమును విసర్జించుట. |

[ 64-వ పేజీ శేషము ]

" దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే "

ఇట్టి ఫలమెవనికి గల్గుననగా: పురుషకారమునంతను పరమేశ్వ రునకై వినియోగించువానికే కల్గును. లోకములో ధనాదులకై చేయు నదే పురుషకారమని తలంపరాదు. అన్ని పురుషకారములలోను ఉత్తమ మైనది, శత్రువైన కామమును చంపుట, పరమేశ్వరునే కై కశరణ్యముగా నాశ్రయించుట.

" జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం "

అనుదానిలో నెంతటి వీరత్వస్ఫూర్తి కలదు! అంతకంటెను గొప్ప పురుష కారమేమున్నది? ఏదైన నున్నచో అది విడనివట్టుతో పరమేశ్వరు నాశ్ర యించుటతప్ప మరొకటికాదు.

" తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత "

ఇచ్చటనే దైవము పురుషకారము అనువానియొక్క సంపుటి యని గుర్తింపవలయును.

భగవద్గీతలో

# నాకు తోచిన భావాలు.

స్వామి సీతారామ్

★

[పాత క్రొత్త సంస్కృతులను పొందికగా మేళవింపజేసే నేర్పు, కార్యసాధనకు కావలసిన దూరదృష్టి, మనుష్యమూర్తుల ఉట్టిపడే ఆంధ్రత్వం ఒక్క స్వామి సీతారాం గారిలో చూడొచ్చు. వారి అంతస్స్వరూపానికి మూర్తిమంతమైన సంస్థ వినయాశ్రమం. ఆంధ్రరాష్ట్రోద్యమ చరిత్రలో వారి కథ ప్రత్యేకంగా ఒక ప్రకరణం. — అడిగినంతనే అవ్యాజక్షేమతో వ్యాసాన్ని పంపిన వారికి మా కృతజ్ఞతలు.

— సంపాదకుడు]

వేలకొలది సంవత్సరములనుండి యీ భగవద్గీత విమర్శింపబడుచూ ప్రశంసింపబడుచూ వచ్చుచున్నది. హిందూమతమునకు గీతయు, బౌద్ధమతమునకుదమ్మపదమును, క్రైస్తవమతమునకు ఏసునాథుని సందేశమును, ముస్లిం మతమునకు ఖురానును — ప్రమాణ గ్రంథములై వర్ధిల్లుచున్నవి. ఆయా భక్తిపరులు వాటిని పఠించి మథించి అందిన మటుకు అందలి అమృతమును గ్రోలుచూ, తరించుచున్నారు.

తక్కినమూటికి అసందిగ్ధముగా చారిత్రాత్మకముగా కాలనిర్ణయము చేయబడినది. గీతకు అట్లుగాక పౌరాణిక కథనములను బట్టియు జ్యోతిషశాస్త్రసంబంధమైన గ్రహకూటములబట్టియు కాలనిర్ణయము చేయుచున్నారు. అనుకూల ప్రతికూల వాదోపవాదములు అధికముగా జరిగిఉన్నవి. కాని దీనికెనినిరాక్షేపణీయమైన ఋజువు లేకపోలేదు. గ్రంథ అంతర్గతమైన సాక్ష్యమే దేనికైనను సర్వోత్కృష్టమైన సాక్ష్యము. దురభిప్రాయములకు లోనుకాక నిష్పాక్షికమైన దృష్టితో యీ క్రింద తెలిపిన పదజాలమును పరికించవచ్చును. (1) బ్రహ్మసూత్రపదైశ్చైవ 13 అ. 4 శ్లో. (2) బ్రహ్మనిర్వాణం 2 అ. 72 శ్లో. (3) బ్రహ్మనిర్వాణం 5 అ. 24 శ్లో. (4) బ్రహ్మనిర్వాణం 5 అ. 26 శ్లో. (5) నిర్వాణపరమాం 6 అ. 15 శ్లో. (6) జన్మమృత్యు......దోషాను దర్శనం 13 అ. 8 శ్లో. మొదట చెప్పబడిన బ్రహ్మసూత్రములు వేదాంతసూత్రములేననిలోకమాన్య తిలకు తన గీతారహస్యములో

సుమారు 40 ఏండ్లనాడు ధృవపర చెను. ఆ వేదాంత సూత్రములలో బౌద్ధమత సిద్ధాంతముల విమర్శ స్పష్టముగా చేయబడినది. 2-3-4 వాక్యములలో చెప్పబడిన బ్రహ్మ నిర్వాణం అనే సమాసం బౌద్ధులు బోధించు నిర్వాణమునకు భిన్నమగు లక్ష్యమును సూచించుటకేనని అర విందయోగి 30 ఏండ్లపై కాలము ననే తెలిపియుండిరి. 5 లో చెప్ప బడిన వాక్యము అదే అర్థమును స్ఫురింపచేయుచున్నది. 6 వ శ్లోక భాగము అచ్చగాబుద్ధదేవుడువాడిన వాక్యములను పోలియున్నది. ఆ శ్లోకమంతయుకూడ బుద్ధబోధకు కవలబిడ్డ.

వీటినన్నిటినిబట్టి చూడగా యి పుడు ఉన్న యీ గీతాస్వరూపము బౌద్ధానంతరములభించిన రూపకల్ప నయై యుండవచ్చును.

నామరూపములుగల జీవకోటి అంతులేని భిన్నత్వమును ప్రదర్శించు చున్నను వీటి అన్నిటిలో అంత ర్భూతమై యున్నది. ఒకటి ఆత్మ యనిగీత స్పష్టపఱచినది. 2అ.20శ్లో; 13 అ. 16 శ్లో; 13 అ. 27 శ్లో. ఈ మూడుగమనించినచో ఆత్మఒకటే, అవిభాజ్యము,అఖండము అయినను విభాజ్యమైనట్లుతోచుచున్నదనియు అట్లుకనపడినను అది అన్నిభూతము లయందు సమం తిష్ఠంతం సమాన ముగానే నిలిచియున్నదనియు నిస్సం దేహముగా తెలుపబడినది. సాత్విక జ్ఞానమునుగూర్చి వర్ణించిన 18 అ. 20 శ్లో. యీ భావము నిరాక్షేప ణీయముగా ఘంటాపథముగా ప్రక టించబడినది. విభక్తముగా కను పడు సర్వభూతములయందు అవి భక్తము అవ్యయమునగు ఏకమైన భావమును ఆవిష్కరణమును చేయుటయే జ్ఞానమని నిరూపింపబడి నది. అందుచేత భూతముల ఐక్యత పూర్తిగా ఋజువు అయింది.

మానవుని జీవితాదర్శమేదియో 11 అ. 55 శ్లో. "నిర్వైరః సర్వ భూతేషు" అనువాక్యము నిస్సంకో చముగా తెలుపుచున్నది. 2 అ. 45 శ్లో యీ గీతకంతా కీలకమని చెప్పవచ్చును. త్రైగుణ్యావిషయము లనుజూపు వేదములపొంతకు బోక నిస్త్రైగుణ్యో, నిర్ద్వన్ద్వో, నిత్య సత్త్వస్థో, నిర్యోగక్షేమ, ఆత్మ వాన్ అను పదములతో అర్జునుని సమ్ముఖమున ఉత్తమ మార్గమును జూపి ఆ త్రోవన బొమ్మని హెచ్చ రించెను. చివర 2 సమాసములు మిక్కిలి గమనార్హములు. లౌకిక వస్తు సంపాదనము వస్తు రక్షణము

(మిగత 72 వ పుటలో)

ఓం

# శరణాగతి.

కథన కళాప్రపూర్ణ — పండిత

శ్రీ సోముల అప్పారావుగారు, కాకినాడ (ఆంధ్ర).



లోకమునఁ బ్రతివ్యక్తియు సుఖప్రాప్తిని దుఃఖనివృత్తిని గోరుచుండును. గాని దానికి వ్యతిరేకముగ దుఃఖప్రాప్తియు సుఖనివృత్తియు లభించుచున్నవి. ఇందుకు కారణమేమని యోచించుచో సాధన వ్యత్యాసమని గోచరించుచున్నది. సుఖమును గోరుచున్న మానవుడు అనిత్యమును అసుఖమును నయిన లోకము నాశ్రయించుచున్నాఁడు. తజ్జనితమగు దేహ గేహ దారా తనయాదులయందు నిరంతరము నిమగ్నుఁడగుచున్నాడు. సత్యము జ్ఞానము ఆనందము స్వరూపముగా గల భగవంతు నాశ్రయింపకున్నాడు. ఇదియే అశాంతికి దుఃఖప్రాప్తికి కారణముగ గన్పడుచున్నది.

అటులయిన పాంచభౌతికమగు దేహము గల మానవుడు లోకమును దజ్జనితమగు దేహాదికమును విడచియుండఁగలడా? యని యోచించిన నుండలేడనియే చెప్పవచ్చును. క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమువలన విలసిల్లు వ్యక్తి ఆ రెండింటిలో నొక్కదానినిమాత్ర మాశ్రయించి యెట్లుండఁగల్గును? కావున దేహధారియగు జీవుడు తన కుపాధియగు దేహము దానని భ్రమచెందక ఆ దేహమునకు సంబంధించి యొకనాడు







వీడనున్న దారాగారతనయభవనాదులయందు గాఢమగు మమకారమును పొందక దేహాదులకు విలక్షణముగ చైతన్య రూపముగనున్న తనను దెలిసికొని సర్వకర్మముల యందు సాక్షిమాత్రుడయి మెలగుచుండవలెను. అంతియగాదు తన కధిష్ఠానముగ విరాజిల్లు సర్వాత్మక

మగు పరమాత్మతత్త్వమును శమదమాది సాధనములద్వారా వినిర్మలమగు నంతఃకరణమువలన దెలిసికొని ఆ పరమాత్మతత్త్వమే తనకు గమ్యస్థానమని నిశ్చయించుకొని సర్వకర్మములందును నా పరమతత్త్వము నేమఱకయుండవలయును. అదియే శరణాగతియగును. అట్టి శరణాగతియే మానవునకు ఆత్యంతిక శ్రేయ మొనగూర్పగలదు. సంగ్రహముగ జెప్పవలెననిన నీటిలో చేప మెలఁగునట్లు ప్రపంచమున నెల్లప్పుడు వర్తించు మనస్సును సర్వేశ్వరుడగు పరమాత్మునియందు నెలకొల్పి తానొనర్చు పనులయం దాపరమేశ్వరుని మరవక తనకుచితమగు వృత్తివలన శరీరయాత్ర నిర్వహించుచుండుటయే శరణాగతి యగును. అదియే మానవునకు నిత్యశాంతి ప్రసాదించగలదని గీతామాత పలుసారులు ప్రబోధించుచున్నది.

> "ఈశ్వరస్సర్వభూతానాం
> హృద్దేశేఽర్జున తిష్ఠతి।
> భ్రామయన్ సర్వభూతాని
> యంత్రారూఢాని మాయయా॥"
> (భగవద్గీత. 18 అ. 61 శ్లో.)

[ 70-వ పేజి శేషము. ]

నీ ధర్మము కాదనియు ఆత్మవంతుడగుటయే పరమోద్దేశ్యమని నిర్వచింపబడెను. 26 అ. 49 శ్లో. బాహ్యకర్మకన్న అంతర్గత మనోభావము ప్రధానమని అర్జునునకు బోధింపబడెను. విశుద్ధమైన సహృదయ సంకల్పమునుబట్టియే లౌకిక పారలౌకిక ధర్మాభిజ్ఞులు పాపపుణ్యములను నిర్ధారింతురు.

ఈగీత మహాసముద్రమువంటిది. కాన దేశ కాల పాత్రములను బట్టి అనేకమంది అనేక విధముల వ్యాఖ్యానించియున్నారు. అట్టి విమర్శనా స్వాతంత్ర్యమును గీత స్వయముగా ఎల్లరకు అనుగ్రహించుచున్నది. 18 అ. 63 శ్లో. 18 అ. 66 శ్లోకము యీ అద్వైతభావమునకు వ్యతిరేకముకాదు. ఆ పరమాత్మయు, యీ జీవాత్మయు, తత్వరీత్యా ఒక్కరేగాన యితడు అతనిలో పూర్ణముగా లీనమయ్యే అవకాశం అధికారం అదృష్టం కల్గియున్నాడు.

ఓం పూర్ణమదః పూర్ణమిదం అనే వాక్యంకూడా యీఏకత్వమునే అనాదినుండి వేనోళ్ళ ఉపదేశించుచున్నది. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. ( జై ఆంధ్ర! )

# తురీయాశ్రమదీక్షాచిత్రములు



## స్వామి శ్రీ రామకృష్ణజీ

క్రిందినుండి కుడివైపుగా:- 1. శ్రీరామకృష్ణానంద, 2. శ్రీ శంకరానంద - శ్రీ అభేదానంద - శ్రీరామకృష్ణగార్లు, 3. చక్రతీర్థం సోపానాలపై,4. శ్రీ అభేదానంద స్వామిగారి ఎదురుగా, 5. స్నానానంతరము, 6. శిఖాయజ్ఞోపవీత విసర్జన దృశ్యము, 7. కాషాయ వస్త్రధారణ దృశ్యము, 8. శ్రీకోదండరామస్వామి దేవస్థాన ముఖమండపంలో, 9. శ్రీ శంకరానందస్వాములవారిద్వారా ప్రణవమంత్రోపదేశము (మధ్యలో).

# మానవవిషాదయోగము.

శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు.

[శ్రీ రామకృష్ణశర్మగారు తెలంగాణాలో ప్రఖ్యాతులైన సాహిత్యారాధకులు. 'సుజాత' పత్రికాసంపాదకులు, సరసకవులు, సహృదయులు. చదివేవారిని చొక్కించి తన లోకంలోనికి తీసికొనిపోయే సిద్ధ లేఖకులు. — సం.]

ఇది యుద్ధసన్నద్ధములైన కౌరవ, పాండవ సేనలు కూడియున్న కురుక్షేత్రము. ఉభయసైన్యములనుండి రణకోలాహలము మిన్నుముట్టుచున్నది. ఇంకొక క్షణములో యిరువాగులవారు చేయి, చేయి తామకొననున్నారు. తాను పోరాడవలసిన శత్రుసైన్యము నొకసారి కన్నులార చూచు కౌతూహలముతో పార్థుడు తన రథమును రెండు సేనల నడుమ నిలిపించుకొన్నాడు. శత్రువులను చూడదలచిన అర్జునుని కన్నులు బాష్పాకులములై పోయినవి. అతని కెటు చూచినను తాతలు, తండ్రులు, గురువులు, తోబుట్టువులు తప్ప శత్రువులు కానరారు. అతని గుండెలు గుభేలుమన్నవి. ఒడలు కంపించినది. గాండీవము జారిపడిపోయినది. నోరెండినది. ఆలోచనా పరంపరలు మూగుచున్నవి. ఈ భయంకర యుద్ధము వలన జరుగబోవు అనర్థ సహస్రములతని కన్నుల యెదుట తాండవించుచున్నవి. క్షణము క్రిందనున్న విజయోత్సాహము పటాపంచలైనది. నిరుత్సాహము, ఔదాసీన్యము, భోగములపై నసూయ, కౌరవ సైన్యముపై కరుణ, పాపభీతి, ధర్మభీతి అతనిని చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి జేయుచున్నవి. ఇది అర్జున విషాదము.

ఈ విషాదము ఒక అర్జునునిదే కాదు. ఇది సకల మానవజాతికి కలుగు విషాదము. అటుకానిచో అర్జునవిషాదముతో మనకేమి పని? కృష్ణుడు యుద్ధమున కాతనిని ప్రోత్సహించి యుండవచ్చును. మనకు యుద్ధము లేదు, సన్నద్ధులముకాము. అట్టియెడ అర్జున విషాదమునుదీర్చు భగవద్గీతను మన మేల పఠింపవలెను? కావున నిది మానవ విషాదమనక తప్పదు. మానవునకు కలిగిన విషాదమునకు శ్రీకృష్ణుడు చెప్పిన సమాధానమే గీతయందున్నది.



అర్జునుడు తన సందేహమును గూర్చి ప్రశ్నించినమాట నిజము. కాని ఆ సందేహములే సకలమానవులకును కలుగునవి. అర్జునుడు తనకొఱకై దుఃఖింపలేదు. తన కృత్యముచే తన కులమునకు, తన సమాజమునకు హానికలుగునని చింతించినాడు. అట్టియెడ అది కేవలము వైయక్తిక ప్రశ్న కాదు.

ఇట్టి ప్రసంగములు అనేకసమయములలో అనేక విధములుగ ఉద్భవించును. అది యుద్ధము కావచ్చును; కుటుంబ మానరక్ష

ణకై ప్రాణత్యాగము చేయు సమయము కావచ్చును; దేశసేవకై కుటుంబత్యాగము చేయుసందర్భము కావచ్చును; ధర్మమునకై దేశసేవను వదలు ప్రసక్తి కావచ్చును. ఈ విధముగా మనుష్యునకు తన జీవితమునందు ఎన్నోసారు లెన్నోవిధములైన ప్రశ్నలు ఉదయించుచుండును. అప్పుడు మనుష్యుడు ఎట్లు ప్రవర్తించవలెనో నిర్ణయించు ఆధారములున్నవా? లేక యిష్టము వచ్చినట్లు వ్యవహరించవచ్చునా? అనునదే మహత్త్వపూర్ణమైన ప్రశ్న

ఆత్మబంధువులను చంపి సాధించిన రాజ్యమువలన ప్రయోజనమేమి? అనునదే అర్జునుని మొదటి ప్రశ్న తన సుఖమునకై తనవారిని నాశనము చేయవలసిన సందర్భములు అందరికిని తటస్థించును. ఆ పరిస్థితులలో మనుష్యుడేమి చేయవలయును? కులక్షయమా? దుష్టనిగ్రహమా? యుద్ధములో బంధువులను చంపుట పాతకము కాదా? అనునవన్నియు సార్వజనిక ప్రశ్నలే. వీనికి కృష్ణుడేమి సమాధానమిచ్చెనో తెలిసికొను కుతూహలము మనకు కలుగుట సహజము.

అర్జునుని ప్రశ్నకు మరొక విధముగా మహత్త్వమున్నది. మానవుడు ప్రపంచమునందు ఏ కర్మ చేసినను ఎవరికో ఒకరికి హాని రాక తప్పదు. సకల జనులకు సర్వకాలములలో సర్వవిధములుగ హితమైన కార్యము ఒక్కటియు నుండదు. రాష్ట్రమునకు హితము చేయదలచిన కుటుంబమునకు హాని కలుగును. కుటుంబ శ్రేయమును చూచిన వ్యక్తికి హానికలుగును. ఈ విధముగా సర్వథా కల్యాణకరమైన కార్యము లేదన్నప్పుడు ప్రపంచపు గొడవయే వదలి రామనామము జపించుకొనుచు అడవులలోనుండుటమంచిది కాదా? దీనినే యింకొక విధముగా చెప్పవలసివచ్చిన సకలమానవులు ఉత్కృష్టమైన శాంతిమయమైన సంన్యాసాశ్రమమును స్వీకరించి పరమాత్మచింతయందు మగ్నులెందుకు కారాదు? అన్నదే అర్జున సందేహములోని మూలప్రశ్న.

దీనికి శ్రీకృష్ణుడొసగిన సమాధానములో కూడా క్షత్రియ ధర్మోపదేశము గౌణమై యున్నది. గీతయందు మొదటినుండి చివరివరకు సామాన్యముగా ప్రతియొక్కడు కర్మ చేయవలెనా? వలదా? చేయవలసినచో ఎట్లు చేయవలయును? మొదలైన సర్వసామాన్యవిషయములే నిండియున్నవి. కర్మ చేయవలెను; కర్మను వదలరాదు అని చెప్పి, నడుమ నడుమ నీవు చేయవలసినది యుద్ధకర్మము; కావున దానిని విడువరాదు అని అర్జునుని హెచ్చరించియున్నాడు. సారాంశమేమనగా యుద్ధవివేచనము గౌణము. కర్మాచరణావశ్యకతను, తద్విధానమును దెలుపుటయే ముఖ్యము. అందువలననే మనకు భగవద్గీత పారాయణయోగ్యమైనది. అది మన జీవనసందేహములను దొలగించును. గీతానాటకమునందలి ప్రథమాంకమున మాత్రమే మనకు భయంకర యుద్ధదృశ్యము కానవచ్చును. వెంటనే ద్వితీయాంకమున నా దృశ్యము మాయమగును. శ్రీకృష్ణార్జునులిద్దరేకాంతచిత్తులై కూర్చుండి గురుశిష్యులవలె సంవాదములు చేయుచుందురు. ఆ ఘోరగర్జనలు, ఆ వాద్యవైభవములు, ఆ మహాభీషణాయుధములు, ఆ అసంఖ్యాక యోధులు రణాంగమునందు నిలిచియున్నప్పటికిని వారినందరిని పాఠకులు విస్మరింపవచ్చును. గీతకును, ఆ మహాసైన్యమునకును తర్వాత ఎట్టి సంబంధము లేదు. కావుననే గీత కేవలము లోకకల్యాణమునకై వ్రాయబడిన మహాగ్రంథమని మనము భావింపవచ్చును. ఈ ప్రశ్నకు శ్రీకృష్ణుడొసగిన సమాధానమే భగవద్గీత. వీలునుబట్టి ఆ సమాధానమును తెలిసికొందము గాక.

ఓం తత్ సత్.

— గడియారం రామకృష్ణశర్మ.



# గీతారాధన

భగవాన్ శ్రీ సత్యానంద మహర్షులవారు.



పూర్వము భగవద్గీతాగ్రంథము ను పూజామందిరమునందుంచి గంధ పుష్పాదులతో పూజించెడివారు. మరికొందరు నైష్ఠికులు గ్రంథము నభిషేకించెడివారేమో! ప్రస్తుతము గీతాప్రచారకుల ప్రబోధమువలనను పరిశోధనాత్మకమైన విజ్ఞాన మభి వృద్ధిచెందినందునను నా పవిత్రగ్రంథ ములోని యమూల్యోపదేశము లను గ్రహింప నుత్సాహము మెం డగుచున్నది. కొందరంతటితో నూరుకొనక నా ధర్మముల నను ష్ఠింప కృషి సల్పుచున్నారు. నిశీథ ముచే జీకట్లు నలుదిశల గ్రమ్ము కొనిన జీవితమహారణ్యములో వెలు గుజూపి, పథికుని సురక్షితముగ గొనిపోయి యభయస్థలమునకు జేర్చునది భగవద్గీతాశాస్త్రము. కర్తవ్యాకర్తవ్య నిర్ణయమున సందే హము కలిగినపుడు కర్తవ్యమును నిర్ణయించి ప్రబోధించునది భగవ ద్గీతాశాస్త్రము. పశుత్వమునుండి మానవత్వమునకు, మానవత్వము నుండి దేవత్వమునకు, దేవత్వము నుండి బ్రహ్మత్వమునకు గొంపోయి యాత్మసామ్రాజ్య పట్టాభిషిక్తుని జేయునది భగవద్గీతా శాస్త్రము.



ద్వైతాద్వైతవిశిష్టాద్వైత మతస్థు లకు ప్రమాణగ్రంథమై వారి వారి సిద్ధాంతముల ననుసరించి నానాభా వముల ప్రస్ఫురింపజేసి తృప్తాత్ముల జేయునది భగవద్గీతాశాస్త్రము. పదార్థముల యథార్థరూపములను ప్రదర్శింపజేసి వస్తునిర్ణయమున కవ కాశము నొసంగు దర్పణమువంటిది భగవద్గీతాశాస్త్రము. సంసారసము ద్రములో తుపానుచే పెడమార్గము ద్రొక్కింపబడిన భీభత్సస్థితియం దున్న నావకు గమ్యస్థానమును తెల్పు జ్యోతిస్స్వరూపము భగవద్గీతా శాస్త్రము. జీవన రణరంగమున భయంకరదృశ్యముల జూచి భీరువు

లైనవారి నర్జుననివంటి వీరులుగ దయారొనర్చునది గీతాశాస్త్రము.

ఆధ్యాత్మిక, నైతిక, సాంఘిక, రాజకీయాది రంగములయందు కృషిసల్పు సాధకుల కాయాధర్మముల బోధించి యెందరినో తన యమోఘ సమాధానములచే తృప్తి పఱచు కల్పవృక్షము భగవద్గీత. శ్రీకృష్ణు డర్జునునకు జెప్పినవి మాటలు కావు. అవి జ్ఞానరత్నములు. దుఃఖ సముద్రములో మునిగి యున్న యర్జునుని క్షణములో శ్రీకృష్ణు డుద్ధరించి తీరముజేర్చి కర్తవ్యనిష్ఠుని గావించెను. శ్రీకృష్ణుని దివ్యబోధ యర్జునుని హృదయసీమలో కాంతుల వెదజల్లి యజ్ఞానతిమిరమును దూరమొనర్చెను. గీతయందలి ప్రతి శ్లోకము భావగర్భితమై కర్తవ్యబోధకమై యున్నది. గీతయందలి శైలి సరళమై సామాన్య సంస్కృతభాషా పరిజ్ఞానము కలవారికిగూడ సుబోధకమైయున్నది. కర్మ దోషవంతమై జీవుని బంధమున జిక్కించి వెతల బెట్టును. కాని కర్మజేయక మానవు డొకక్షణమైన నుండజాలడు. కర్మ యందున్న దోషమును తీసివేసిన గాని యది యనుష్ఠానయోగ్యము కాజాలదు. దీని నాలోచింప మొదలిడినపుడు నాకొక యుదాహరణము స్మరణకు వచ్చుచున్నది. ఒక నదీతీరమున నొకగ్రామము కలదను కొందము. వర్షాకాలముననా నదీ జలము ప్రకృతిమయమై ప్రవహించుచుండును. ఆ గ్రామమున నూతులుగాని యితర జలాశయములు గాని లేవు. ఆ నదీజలమే వారికి ప్రాణాధారము. ఆ నీటియందలి దోషమును తొలగించినగాని యా నీరు పానయోగ్యము కాదు. చిల్లగింజ ఆ పంకిలము పోగొట్టి జలమును శుద్ధమొనర్చును. అటులే కర్మయందలి దోషమును పోగొట్టి దాని ననుష్ఠానయోగ్యముగ జేయునది జ్ఞానయోగము. జ్ఞానయుక్త కర్మయోగము గీతాచార్యుని బోధయందు తేటతెల్లమగుచుండును.

ఓ గీతారాధకుడా! ఈ ప్రపంచమే కురుక్షేత్రము. గీతయందుపదేశింపబడిన కర్మయోగమే గాండీవము. నీవే యర్జునుడవు. దుష్టగుణములే కౌరవులు. వారిని వధించి విజయభేరిని మ్రోయింపుము. నీ హృదయముననున్న ఆత్మను శ్రీకృష్ణునిగా భావింపుము. ఆతడెల్లపుడు నీకు గీతను బోధించుచునే యున్నాడు. ఆ "గీతావాణి" ని విని నీవావిధముగ ననుష్ఠించి జీవిత గమ్యమును చేరుము.






## 1. ప్రశ్నోత్తరి (కన్నడానువాద సహితం.):- వెల 0-2-0

శ్రీమచ్ఛంకరాచార్యులవారి ప్రశ్నోత్తరి అనే గ్రంథం అన్నిభాషల్లో బహుళ ప్రచారాన్ని పొందిన గ్రంథం. జిజ్ఞాసువులకు జ్ఞానులకు సైతం గైడ్‌వలె అవశ్యం దగ్గర వుంచుకోదగ్గ గ్రంథం. నిష్కళంక జీవితులు - త్యాగశపోధనులునగు శ్రీ శంకరానందగిరిస్వాములవారు మూలశ్లోకాలకు క్రింద సరళమగు కన్నడభాషలో తాత్పర్యం వ్రాశారు. సంవాదరూపంగా వుండుటబట్టి ఆబాల గోపాలానికి రోచకంగా వుంటుంది. శ్రీశుద్ధచైతన్యస్వాములవారి మున్నుడి గ్రంథముయొక్క ప్రశస్తిని యినుమడింప జేసింది.

## 2. శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రం:- వెల 0-1-3 మాత్రం

శ్రీ శాంకరభాష్య ఫక్కీననుసరించి యిదివరకే శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రానికి వివరణాన్ని వ్రాసి ప్రకటించిన శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు దేవీనవరాత్ర సందర్భంలో శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రానికి తమ సొంత ఉపజ్ఞతో తెలుగులో చక్కని వివరణాన్ని వ్రాసి భక్తలోకానికి మహోపకారం చేశారు. శ్రీవారు యెంతటి జ్ఞానులో అంతటి భక్తులు. ముగ్గులు మూటగట్టే అచ్చు, పండు వెన్నెలవంటి కాగితాలు, స్తోత్రము నామావళి - వివరణముతో సహా చేరియున్న గ్రంథానికి కేవలం అణా మూడు దమ్మిడీలు వెల నిర్ణయించి ఆదర్శమైన సాహిత్య జ్ఞానదానాన్ని ప్రసాదించుచున్న శ్రీవారి ఘనతను యెంత కొనియాడినను తక్కువే. వీరి భవిష్యత్ ఉద్యమాలకు భగవంతుడు సదా తోడ్పడుగాక. ప్యాకెట్ సైజు-పేజీలు 84.

ఈ రెండు గ్రంథాలకు - "చైతన్యగ్రంథమండలి, 135 వీరపిళ్లెవీధి - బెంగుళూరు1" అని వ్రాయండి.

## 3. అనుభవామృతము:- వెల 3-0-0.

దొరకుచోటు: కె. అశ్వత్థరావుగారు, కలుగోడుపోస్టు. రాయదుర్గం తాలూకా (ఆంధ్రదేశము.)

మహాలింగరంగకవి యను మహానుభావుడు కర్ణాటకభాషయందు అనుభవామృతమను గ్రంథమును వ్రాసియున్నాడు. ప్రస్థానత్రయములను ఆధారముగ చేసికొని స్వతంత్రముగ వ్రాసిన అద్వైతవేదాంతగ్రంథము. కన్నడదేశములో దీని ప్రఖ్యాతి అసామాన్యము. కన్నడములో వ్రాయబడిన మూలగ్రంథము సంస్కృతభాషలోనికిగూడ పరివర్తితమైనదన్నచో, దాని ప్రశస్తిని నిరూపించుటకు వేరొక్క ప్రమాణమవసరములేదు. కన్నడభాషలో అధిక ప్రియముగ వాడబడు భామినీషట్పదీ ఛందస్సులో యిది రచింపబడినది. అదే ఛందస్సులో శ్రీయుతులు అశ్వత్థరావుగారు తెలిగించినారు. రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ - విశ్వనాథ సత్యనారాయణ - వేలూరి శివరామశాస్త్రి - చిలుకూరి నారాయణరావుగార్ల అమూల్యములగు అభిప్రాయములతో గ్రంథగౌరవము మిన్నుముట్టినది. అందులోను శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి అభిప్రాయరచన గ్రంథతాత్పర్యమునకు అద్దము వంటిది.

ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భమున తొలికానుకగా వెలువడిన యీ ఉద్గ్రంథమును ఆంధ్రప్రజానీకము తప్పక ఆదరించవలసియున్నది.

**4. గీతా సంకీర్తనము:—** వెల. 0—2—0

దొరకేచోట్లు: (1) గీతావాణి కార్యాలయం, ఆళ్లగడ్డపోస్టు, కర్నూలు జిల్లా, (2) భూమానందాశ్రమం, వేంపల్లెపోస్టు, కడపజిల్లా, (3) విద్యారణ్య విజ్ఞానసమితి, హంపిపోస్టు, బళ్లారిజిల్లా.

గీతాభక్తులకు మిక్కిలి ఉపాదేయగ్రంథం. గీతకుసంబంధించిన ప్రార్థనలు – ధ్యాన కీర్తనలు – గీతార్థసార సంకీర్తనము – హారతి పాటలు మొదలైన వివిధవిషయాలతో కూడినవి. మూర్తి చిన్నది; కీర్తి గొప్పది. వెల స్వల్పం; ఫలమధికం.

---

# చందాదార్లకు విజ్ఞప్తి.

**1.** గీతావాణి మాసపత్రిక ప్రతినెల 15వ తేదీ ఆళ్లగడ్డ కార్యాలయమునుండి పోస్టు చేయబడును. సమర్థుడును విద్యావంతుడునగు నొక కార్యకర్ద ద్వారా చక్కగ పరిశీలించి ప్రతిచందాదారునకును పత్రిక పంపబడుచున్నది. 20వ తేదీ లోగా పత్రిక అందనిచో మీమీ పోస్టాఫీసువారి ప్రమాదమే దానికి కారణము. వారికి తగిన హెచ్చరిక నిచ్చి సమయమునకు పత్రికను అందుకొనవలెను. గీతావాణి కార్యాలయమువారి ప్రమాదము అగపడినచో, వెంటనే మేనేజరుగారికి కంప్లయింటు పంపునది రెండవదఫా పత్రిక పంపబడును.

**2.** పత్రికయొక్క సంవత్సర (సంపుట) ఆరంభము జూలై నెల 15వ తేదీతో మొదలై జూన్ నెలతో ముగియగలదు. కోరువారికి సంపుటారంభమునుండి పత్రికపంపబడును. పత్రికను సంవత్సరారంభమునుండి పంపవలెనో, చందాకట్టిన నెలనుండి పంపవలెనో, ఆ విషయము చందాదారులు మాకు తెలుపవలసియుండును.

**3.** చందాదారులు తమ ఉత్తర ప్రత్యుత్తరములన్నియు ఆళ్లగడ్డకే వ్రాయవలెను. వ్రాయునపుడు వారి చందా నెంబరును తప్పక నమూదు పరుచవలెను.

**4.** గీతావాణి సంవత్సర చందా రు 4—0—0 లు. ఆ మొత్తముతో 12 సంచికలు పంపబడును. సంవత్సరమునకు ఒకతూరి మార్గశిర శు ౧౧ లు గీతాజయంతీ సందర్భమున వెలువడు విశేషసంచిక యించుమించు నూరు పేజీలు కలిగియుండును. దానితో కలిసి సంవత్సరమునకు 12 సంచికలు చందాదార్లకు చేరగలవు. చందా పైకము మణియార్డరు చేయుటమంచిది. డబ్బు పంపునపుడు వారి చిరునామాను స్పష్టముగ పూరిగ మణియార్డరు కూపనునందు వ్రాసి పంపవలెను. తాము పాత చందాదార్లైనచో తమ నెంబరును సూచింపవలెను. క్రొత్త చందాదార్లైనచో ఆవిషయము వ్రాయవలెను. చందా సంపుటకు యిష్టపడనివారు తమ చందా ముగిసినవెంటనే ఆ అభిప్రాయమును ఒక కార్డు ద్వారా మాకు తెలియజేయవలెను. చందా పైకము – 'మేనేజరు' గీతావాణి కార్యాలయము, ఆళ్లగడ్డపోస్టు, కర్నూలుజిల్లా' అను అడ్రెస్సుకు పంపవలెను.

5. కోరినవారికిమాత్రమే పత్రిక వి. పి. గా పంపబడును. వి. పి. పంపినచో వ్యర్థముగ యెక్కువ ఖర్చు కాగలదు.

6. నమూనా కాపీ కోరువారు 0-6-0 పోస్టుబిళ్లలు పంపవలసియుండును.

7. పుస్తకములుగాని పత్రికలనుగాని స్వీకారమునకు పంపువారు ఒక్కొక్క ప్రతిని, సమీక్షకు పంపువారు రెండేసి ప్రతులను పంపవలెను.

8. ఆధ్యాత్మిక పత్రికను నిర్వహించుటయెంతో వ్యయప్రయాసలతో కూడినపని. మరియు గీతావాణి పత్రికయందు వ్యాపారప్రకటనలను చేర్చు పద్ధతిలేదు. చందాదార్లు పెరిగినకొద్ది పత్రికయొక్క జీవమానము పెరుగ గలదు. కాయపుష్టి చేకూరగలదు. అన్ని విధముల పత్రిక శోభించగలదు. పుణ్యాత్ములగువారు మాకు తోడ్పడి చందాదార్ల నెక్కువగ చేర్పింపవలెనని ప్రార్థించుచున్నాము. 12 మంది చందాదార్లను చేర్పించినవారికి ఒక సంవత్సరము పత్రిక ఉచితముగ పంపబడును. ఆ పుణ్యాత్ముని పేరు పత్రికయందు ప్రకటింతుము. మేనేజరు,

శ్రీ గీతావాణి కార్యాలయము, పోస్టు ఆళ్లగడ్డ, (కర్నూలు)

# వ్యాసకర్తలకు విన్నపము.

1. వ్యాసములను 'శ్రీ రామకృష్ణ, ప్రబంధ సంపాదకుడు, గీతావాణి ఆఫీసు - ఆళ్లగడ్డపోస్టు' అను అడ్రెసుకు పంపవలెను.

2. వ్యాసములను కాగితమునకు ఒక్కవైపు విడివిడిగ సిరాతో వ్రాసిపంపవలెను. వ్యాసములు గ్రాంథిక భాషయందైనను, వ్యావహారిక భాషయందైనను ఉండవచ్చును.

3. వ్యాసములు కేవలము భగవద్గీతా తత్త్వమునకు సంబంధించినవై యుండవలెను. ఏదో ఒక ముఖమున గీతతోడి సంబంధమును ముడిపెట్టుకొని యున్నకాని; లేనిచో ఆ వ్యాసములు అంగీకరింపబడవు.

4. వ్యాస రచయితల అభిప్రాయములనుగురించి సంపాదకునకు బాధ్యతలేదు.

5. వ్యాసలేఖకులు తమ పూర్తి చిరునామాను ప్రతిసారి వ్రాసి పంపుచుండవలెను. రచయితలు తమ ఫోటో పంపినచో కార్యాలయపక్షమున బ్లాకు చేయించి వీలైనపుడు పత్రికలో ముద్రింతుము. విశేషసంచికయందు నియతముగ వ్యాస కర్తయొక్క ఫోటో వారి వ్యాసముతోపాటు తప్పక ముద్రింపబడగలదు.

6. వ్యాసరచయితలకు పత్రిక రెండేసి ప్రతులు పంపబడును.

7. ముద్రింపబడని వ్యాసములను, వ్యాసకర్తలు కోరినచో వెనుకకు పంపబడును.

8. వ్యాసములను ప్రకటించుటకును, ప్రకటింపకుండుటకును, సంక్షేపించుటకును సంపాదకునకు పూర్తిగ స్వేచ్ఛకలదు.

— మేనేజింగ్ ఎడిటర్, గీతావాణి.

## వార్తలు.

3—11—53 నుండి వారంరోజులు శ్రీ శంకరానందస్వామివారు నంద్యాల పగిడి శాయమ్మగారి విశాల గృహమునందు యిరుపూటలును భగవద్గీతలోని అష్టమాధ్యాయము అక్షరపరబ్రహ్మ యోగమును ప్రవచించినారు. సాధు శివారెడ్డి గారు కార్యక్రమ వ్యవసయందు పాల్గొని సుసంపన్న మొనర్చినారు.

10—11—53 తేదీ శ్రీస్వామివారు గుళ్ళదుర్తి శ్రీసీతారామాశ్రమమును చేరుకొన్నారు. శ్రీ రామకృష్ణానంద, శ్రీ నిత్యానంద, శ్రీగీతానంద(రుద్రారెడ్డి), శ్రీనాగయ్యస్వామి ప్రభృతులు యీ కార్యక్రమంలో పాల్గొన్నారు. సాధుమాత చిన్నమ్మగారి అత్యంత ఆదరభక్తులతో కార్యక్రమము మహద్వైభవముగ జరిగినది. 18 వ తేదీ ద్వాదశి నాడు కుముద్వతీ నదియందు అవభృథ స్నానమాచరించి శ్రీ శంకరానంద రామకృష్ణులు 19 తేదీ వరంగల్లు చేరుకొన్నారు.

వరంగల్లునందు గీతోపన్యాస కార్యక్రమము 20—11—53 నుండి ప్రారంభమైంది. శ్రీ సాధు బుచ్చిలింగం గుప్తగారి మహత్కృషి పవిత్ర సంకల్పములతో శ్రీ రామలింగేశ్వర దేవాలయమునందు శబ్ద విస్తరణ యంత్రముల సహాయముతో యిరుపూటలను గీతోపన్యాసములు విజృంభణముగ 15 రోజులు జరిగినవి. శ్రీ స్వాముల వారికిని వారి అనుయాయులకును అతిథులకును తమ మేడపై వసతిని యేర్పరిచియిచ్చి ఆతిథ్యసత్కారములను అత్యంత శ్రద్ధాభక్తులతో నిర్వహించిన శ్రీ నాగబండి చిన్న క్రిష్ణయ్యగారి యొక్కయు, వారి పవిత్ర కుటుంబము యొక్కయు అపారసేవా పరిచర్యలను గురించి యెంత కొనియాడినను తక్కువే. వారియెడ శ్రీ గీతాచార్యుడు ప్రసన్నుడగుగాక! శ్రీ గీతానంద _ సాధు సుబ్బారెడ్డి (తేల్లప్రోలు) గార్లు సైతము యీ కార్యక్రమములో పాల్గొన్నారు.

శ్రీ రామకృష్ణగారు వరంగల్లు నుండి ఆళ్లగడ్డ చేరి గీతావాణికి సంబంధించిన పనులు సాగించుకొని డిసెంబరు 16 వ తేదీ గీతాజయంతి నాడు కోయిలకుంట్లతాలూకా చాకరాజవేముల చేరినారు.

శ్రీ శంకరానందస్వామివారు వరంగల్లు నుండి సరాసరి మైసూరుస్టేటు అజ్జంపూరునందలి తమ శ్రీ శివానందాశ్రమము చేరినారు. 16_12_53 తేదీనుండి ఆరంభమగు గీతాజయంతీ సప్తాహ మహోత్సవము శ్రీవారి ద్వారా అజ్జంపూరునందు నిర్వహింపబడును.

---

ర్పు. 54 యిచ్చి నూతనంగా రాజపోషకులుగా చేరినవార్లు:_

1. శ్రీ నాగబండి విశ్వనాథంగారు, వరంగల్లు, (C. Ry.)
2. శ్రీ లక్ష్మీనృసింహ భక్తమండలి పక్షమున, చిదిరాల వీరలక్ష్మమ్మగారు, గిర్మాజిపేట, వరంగల్లు.

---

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra).

# గీతాజయంతి ఉద్బోధ.

గీతాభక్తులగు సోదరీ సోదరులారా!



నేడు మార్గశిర శుద్ధ ఏకాదశి. దీన్ని మోక్షదా యేకాదశి అనికూడా అంటారు. ఉపనిషత్తులలోని సారసారం — భగవంతుని అమరగానం — అర్జునుని మోహాన్ని పటాపంచలు చేసిన దివ్యమంత్రం — భగవద్గీత, యీనాడే మానవలోకంలోనికి అవతరించిందని మనందరి విశ్వాసం. సంసారపథికులమైన మనకు గీతే చుక్కాని; గీతే దిక్సూచి; గీతే ధృవతార; గీతే మార్గదర్శి. అదే మనకు సాధనం; అదే సిద్ధి.

కాబట్టే, యేండ్లతరబడినుండీ యీనాడు గీతాజయంతీ మహోత్సవాన్ని మనం జరుపుకొంటూన్నాం. ఈ గీతాజయంతి మనకు రాష్ట్రీయ పర్వదినం. లోకమాన్య తిలక్ మహాశయుడు ఈ జయంతిని మనకు రాష్ట్రీయపర్వంగా నిర్ధరించాడు. ప్రాచీన భారతదేశం వైదిక కాలంనుండీ మార్గశిర మాసాన్ని బహుగా గౌరవించింది. ఋతుమానాన్నిబట్టికూడా యీ నెల స్ఫూర్తిదాయకమై వుంది.

రాండి. గీతామాతకు జోహార్లు యివ్వండి. ఆ మహామాయికి అనుంగుబిడ్డలమై మన విభేదాలను మరచి ఒకే త్రాటిపై నడుస్తాం. ఒకే గీతపై నిలుస్తాం. వికల శకలాలై చిందరవందరై పోయిన జాతిని, గీతాపటభూమికపై చేర్చి కూర్చి ఒకేరాష్ట్రం — ఒకే జాతి — ఒకే లక్ష్యం సాధిస్తాం.

జైహింద్.

16—12—53.

శ్రీ రామకృష్ణ

శ్లో॥ మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణీ విహారిణే ।
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥



GOVERNOR'S CAMP
ANDHRA

24th October 1953

*I am delighted to learn that Sri Swamy Ramakrishnananda, Managing Editor, "Gitanjali", Allagadda, (Kurnool District), is celebrating the "Gita Sahitya Seva Samithi" on the 16th December 1953. Perhaps, more than anything else, the Bhagavad Gita has moulded the lives and thoughts of millions of Hindus and there is perhaps no nobler and more inspiring message than that contained in the Gita. I wish the celebrations all success.*

C M Trivedi

(C. M Trivedi)
Governor of Andhra.

---

GOVERNMENT OF ANDHRA.

**N. SANJIVA REDDY,** *Kurnool.*
*Deputy Chief Minister.* *16—11—53.*

మిత్రులు రామకృష్ణానందగార్కి,

దేశంలో నాస్తికత్వం ప్రజ్వరించిన యీ రోజులలో గీతా సందేశ ప్రచారం అత్యవసరం. మీ ప్రయత్నం జయప్రదమగు గాక!

ఇట్లు,
నీలం సంజీవరెడ్డి.

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు. కా. 1200.

గీతాజయంతీ విశేషానుబంధ సంచిక.

# గీతావాణి

31



మూడవ సంవత్సరము  ఏడవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా

15 జనవరి 1954.

# విషయసూచిక - జనవరి '54.



# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వసందేశ మాసపత్రిక.






మేనేజింగ్ ఎడిటర్:



మేనేజర్:

స్వామి శ్రీ శివానంద,

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

---

సంవత్సరచందా నాలుగు రూపాయలు.

---

15th JANUARY 1954.

# గీతాగానము.

## శ్రీ డా॥ రంగా చిన్నచలమయ్యగారు, సంపాదకులు: "దేవాలయం"

(అక్టోబరు సంచిక 2 వ పేజీ తరువాయి.)

10. వేదముచె కర్మమూ, ఉద్భవించె ఫల్గుణా
వేదములు బుట్టగలిగె, దైవమందున – అవి దైవమందున
అందుచేత వేదమూ, సర్వవ్యాపితంబగుర్
వేదములె కర్మలు వి, వాదమేల నీకయ ॥పా॥ (శ్లో॥ 15)

11. కర్మచక్రమంబునూ, కాలదన్ని బోవుచు
విషయలోలుడైనవాడు, వెర్రివాడయ – బహువెర్రివాడయ
పాపములే ఆయువై, బ్రతుకుచున్నాడుగా
వ్యర్థమగునట్లుగ అ, నర్థమగునట్లుగ ॥పా॥ (శ్లో॥ 16)

12. ఆత్మతృప్తిచేతనే, ఆత్మయందు ఆనందం
ఆత్మయందె నోలలాడు, ఆత్మజ్ఞానియైయగ – అంత రాత్మజ్ఞానియైయగ
అతడు కర్మచేసిననూ, అతడు కర్మచేయకనూ,
ఆశ్రయింపవలసినా, అవసరంబె లేదిలర్ ॥పా॥ (శ్లో॥ 17, 18)

13. కాననీవు చేయుమా, కర్మనీకుయున్నదీ
ఆశలేనికర్మనూ, అవసరంబెచేయగ – అతి అవసరంబె చేయగ
కామబుద్ధిలేకనూ. కర్మచేయుచున్ననూ
బ్రహ్మజ్ఞానియగుచును బ్రహ్మలోకెజెందును ॥పా॥ (శ్లో॥ 19)

14. అశ్వపతి జనకులూ, అందుచేత సిద్ధులెరి
లోకముకొరకే యిహా, లోకముకొఱకై – పర లోకముకొఱకై
కామములను వీడుచూ, కర్మలనుజేయుచూ
నీతిమంతుడగుచు యిలను, నీవుచేయు ఫల్గుణా ॥పా॥ (శ్లో॥ 20)

15. జ్ఞానియేదిచేయగ న, జ్ఞాని నదియె చేయునూ
నీవుపార్యోదారినందె, నిన్నునమ్మినడతురు – వారునిన్నునమ్మినడతురు
చెడమారమైనచో, చెడును మారమంతయూ
నేనుకూడ కర్మనె, చేసిచూపవలెనుగ ॥పా॥ (శ్లో॥ 21)

("కలనిజమాయెగా – కోరికదీరగా" అను వరుస)

కృష్ణుడు:– కర్మనాకులేదుగా – కర్మనేను జేసెదా
మూడులోకాలందునా – ముదముతోనె దెల్పెదా ॥క॥ (శ్లో॥ 22)

1. లోకముకొఱకె కర్మలుజేయుదు – కర్మలుజేయకయున్ననూ
లోకముచెడును నాదుమార్గమును – అనుసరింతురు పార్థివా ॥క॥ (శ్లో॥ 23)

2. నేనెకర్మలుచేయకనున్నను – ప్రజలుచెడియెపోదురూ
వర్ణసంకరము వర్ధిల్లునుగ – లోకముచెడును నాతో ॥క॥ (శ్లో॥ 24



# హే గీతే! శరణం మమ.

సంసారేఽస్మిన్ కురుక్షేత్రే ధర్మాధర్మధియాఽఽకులం ।
త్రాహి మాం కృపయా దేవి! హే గీతే! శరణం మమ ॥ 1

తా॥ సంసారమనే కురుక్షేత్రంలో చిక్కి, ధర్మమేదో అధర్మమేదో తెల్సుకోలేకున్నాను. అమ్మా! గీతామాతా! దయతో కాపాడుము. నీవే నాకు గతి.

భువం విహాయ కృష్ణస్త్వాం దర్శయిత్వా దివం గతః ।
త్వమేవ సాక్షాత్ శ్రీకృష్ణః హే గీతే! శరణం మమ ॥ 2

తా॥ శ్రీకృష్ణుడీలోకాన్ని విడనాడి స్వధామానికి పోతూ నిన్ను చూపిపోయినాడు. నీవు నాపాలిటికి సాక్షాత్తు కృష్ణదేవుడివి. గీతామాతా! నిన్ను శరణు బొందుచున్నాను.

అహంకారగ్రహావిష్టః సంసారాహినిపీడితః ।
త్వయా వినా మే కా త్రాత్రీ హే గీతే! శరణం మమ ॥ 3

తా॥ అహంకారమనే దయ్యముపట్టి, సంసారమనే కాలసర్పము తో కాటుదిని అల్లాడిపోతూండే నాకు నీవుతప్ప రక్షకులు లేరు. అమ్మా! గీతా! నాకు నీవే దిక్కు.

దుశ్శాసనసమాకృష్టాం ద్రౌపదీం వృత్తినామికాం ।
జ్ఞానాకారవతీం కృత్వా భో గీతే! శరణం భవ ॥ 4

తా॥ దుశ్శాసనునిబారిబడి నా అంతఃకరణవృత్తి యనెడి ద్రౌపదీ దేవి విహ్వలించిపోతూ ఉంది. దాన్ని అఖండజ్ఞానాకారవృత్తిగామార్చి, ఓ గీతామాతా! అనుగ్రహింపుము.

లౌకికాన్ వైదికాన్ సర్వాన్ ధర్మాం స్త్యక్త్వా త్వదంతికం ।
సమాగతోఽస్మి నిర్భీకః హే గీతే! శరణం మమ॥ 5

తా॥ లౌకికధర్మాలను వైదికధర్మాలను ఒట్టుమొత్తం వదలి పెట్టి నిర్భయంగా నీదాపు చేరినాను. అమ్మా! నీవే నాకు ఆశ్రయము.

త్వయోద్ధృతశ్శంకరార్యః శ్రీరామానుజదేశికః ।
పూర్ణప్రజ్ఞ స్తథాఽన్యే చ హే గీతే! శరణం మమ॥ 6

తా॥ శ్రీ శంకరాచార్యులవారును, శ్రీ రామానుజాచార్యుల వారును, శ్రీ మధ్వాచార్యులవారును నిన్నే నమ్మి కడతేరినారు. ఆ నీవే నాకుగూడా దిక్కు.

పతితజనసమూహపాలయిత్రీం
భగవతి! సత్కరుణాంచితే! చ మాతః! ।
భవజలధినిపాతఘోరతాపం
శమయితుమక్షరమూర్తిమాశ్రయే త్వామ్ ॥ 7

తా॥ గీతాభగవతీ! సంసార సముద్రముయొక్క ఆటుపోటులకు వెఱచి నిన్ను ఆశ్రయిస్తూన్నాను. దీనజనులపాలిటి ఓ తల్లీ! దయ చూపుము.





[ నవంబరు సంచిక 11_వ పేజి తరువాయి. ]



కర్మవ్యవహారరంగమున పైపైకి జ్ఞానియు అజ్ఞానియు ఒకే విధముగ అగపడినను, కర్తృత్వాభిమానము కల్గియుండుట అజ్ఞానిలక్షణమనియు, అది లేకుండుట జ్ఞానిలక్షణమనియు గతప్రసంగమున చెప్పిన ముచ్చట. ఆ అజ్ఞానులుకూడ రెండువిధములు. ఒకటి పామరవర్గము. రెండవది ముముక్షువర్గము. ముక్తివాంఛలేక స్వర్గాదిఫలముల నాశించి కామ్య కర్మముల నాచరించి జననమరణ సంసారమునకు గురియగువారు మొదటివారు. ఇక మిగిలిన ముముక్షువర్గమువారు — అనగా మోక్షమును వాంఛించువారు కర్మముల నేవిధముగ నాచరింపవలె నను విషయమును భగవంతుడు ముందటి శ్లోకమున నిరూపించు చున్నాడు.

(శ్లో 30) అర్జునా! సర్వజ్ఞుడను సర్వజగన్నియంతను — సర్వాత్మ రూపిని — వాసుదేవ పరబ్రహ్మ మును నగు నాయందు అధ్యాత్మ చిత్తముతో నీసమస్త లౌకిక వైదిక కర్మములను సంపూర్ణ సమర్పణము చేయుము.



ఆత్మను తెలియజేయు శాస్త్ర మును "అధ్యాత్మశాస్త్ర" మం దురు. దీనినే ఉపనిషత్తనికూడ చెప్పుదురు. అట్టి అధ్యాత్మశాస్త్ర విచారముచే సుసంస్కృతమైన చిత్త మును అధ్యాత్మచేతస్సని చెప్పు

దురు. ఆత్మానాత్మ వివేకముగల చిత్తమె అధ్యాత్మ చిత్తము.

సర్వకర్త అంతర్యామియగు పరమేశ్వరుడె యనియు, అర్జునుడనైన నేను ఆయన అధీనమందున్నా ననియు, యజమానికొరకై సేవకుడు సర్వకర్మముల నాచరించుచుండు నట్లు నా కర్మములన్నియు పరమేశ్వరునకె నివేదితములనియు భావించి నేను నాది యనెడి అభిమానమును త్యజించి యీ లోకమందలి అపకీర్తికిని పరలోకమందలి నరకప్రాప్తికిని జడియక శోకజ్వర విముక్తుడవై యుద్ధమును చేయుము.

ఈ ఉపదేశమునందు శ్రద్ధనిడి ప్రవర్తించెడివారికి కల్గు ప్రయోజనమేమి? తద్వ్యతిరిక్తులగువారికి కల్గెడి నష్టమేమి? అనెడి విషయమును యిక నిరూపించుచున్నారు.

సమస్తకర్మములను భగవంతుని యందు సమర్పించి, నిరాశియు నిర్మముడునునై కర్తవ్య కర్మముల నొనర్పవలెను. కర్తృత్వభావనయు కర్మఫలాసక్తియు దూరీకరించవలయును. యంత్రమువలె—భృత్యునివలె కర్మముల నొర్పవలెనని యర్థము. "అంతయును భగవంతుని సొత్తు. నా పెత్తనమేదియు లే"దనెడి మంత్రమును నిరంతరాయముగ జపించుచుండదగును. ఇదియె కర్మయోగమునకు కీలకము. గడియారమందలి గంటలముల్లు నిముషముల ముల్లు, మరియు నా యా చిన్న పెద్ద చక్రములు తమంతకుతామే స్వయంశక్తితో తిరుగుచుండుటలేదు. వాటికి శక్తిప్రదాతయగు మెయిన్ స్ప్రింగులోపల అంతర్యామియైయుండి వాటినన్నింటి ప్రేరేపించుచున్నది. అట్లే సర్వసంచాలక శక్తి కేంద్రమగు పరమాత్మని ప్రేరణవలన నాయీ యింద్రియములు నడచుచున్నవి. ఆతని సన్నిధాన బలమున సమస్త విశ్వము ను కర్మచక్రమున భ్రమించుచున్నది. ఆయన యెద్దియు ను చేయనివాడయ్యు సర్వమును ప్రేరేపించుచున్నాడు. ఆతని ప్రేరణలేక ఆకు అల్లాడదు. ఆకాశమందలి గ్రహములు విధి విరామములేక పరిభ్రమించుచున్నవని జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. వాటికి 'కీ' యిచ్చినవాడెవడు? సర్వశక్తిబండారము భగవంతుడు. ఆతని అనుగ్రహ మొదగూడినచో గ్రహములన్నియు నేకాదశమందున్నట్లే. ఏకాదశ స్థానమందలి గ్రహములు శుభఫలముల నొసగునని ఫలజ్యోతిషము చెప్పునుగదా? ఇట్టి భావ

నతో కర్మముల నొనర్చినయెడ సమస్త కర్మములను భగవంతుని యందు సన్యసించినట్లగుచున్నది.

సంన్యాసమనిన చక్కగ నిడుట యని అర్థము. తన కర్మములను భగవంతునియందు చక్కగ సమర్పించవలెను. కర్మముల నభిమానించుటచే మనమిప్పుడు ఆయా కర్మఫలములకు గుఱియై ఉచ్చ నీచ జన్మముల బారినిబడి వెతలనొందు చున్నాము. "కర్మములను నీయందు 'అభ్యసించుట' మాని నా యందు 'సంన్యసించుట' నేర్చుకొమ్మని భగవంతుని హితబోధ. కర్మములు మనవె యనుకొని లేని పెత్తనమున నూగులాడుచు మన ము కర్మముల నొనర్చుచున్నాము. ఈ భ్రాంతిని పారద్రోలి సర్వ కర్మ ప్రేరకుడు భగవంతుడనెడి భావనతో ఆయనయందె నిష్ఠ గలిగి యుండవలెను.

ఇంతేకాదు; మనమిప్పుడు బహిర్ముఖులమైయున్నాము. బైటి విషయములనె చింతించుచున్నాము. గుణమయమగు బాహ్యనాటకము నందలి పాత్రలనె విలోకించుచు కాలక్షేపము చేయుచున్నాము. ఈ వెలిచూపు బోనాడి లోచూపు సంపాదించవలెను. బటాబయట తిరుగు చిత్తమును అంతర్ముఖము నకు అలవరచవలెను. ఈ గుణమయ నాటకమంతయు భగవంతుని లీలా విలాసమె యని భావించవలెను. నాడే మనకీ కర్మలయందు అభిమానము దొలగిపోవుట; కర్మఫల కాంక్ష సమసిపోవుట; వ్యవహార భారము దిగిపోవుట; అంతయు భగవంతుడె నెరవేర్చుచున్నాడనెడి భావనవలన నిశ్చింతులమై కోప తాపవ్యాకులతలనుడిగి శాంతముగ కర్మములను చేయగల్గుదుము.

ఇది నిత్యమతమనియు భగవన్మతమనియు యీ 31-వ శ్లోకము నందు భగవంతుడే స్వయముగ చెప్పియున్నాడు. నిత్యమని చెప్పుటకు రెండు కారణములు గలవు. నిత్యమగు వేదములచేత బోధింపబడియుండుటబట్టి యిది నిత్యమైనది. అదియునుగాక అధికారి పురుషులు అవశ్యముగ అనుష్ఠింపవలసినదై యుండుటబట్టి యిది నిత్యమైనది. విశ్వాసబుద్ధితోకూడి సంకోచములుడిగి యీ మతమును ఆచరింపవలెను. భగవంతునియందు తెరిపిలేని శ్రద్ధ వహించవలెను. అంధ శ్రద్ధయైనను చింతలేదు కాని; అసూయ వుండరాదు. "ఆనాడు ద్వాపరయుగమున శ్రీకృష్ణుడీబోధ

ను అర్జునునకు బోధించియున్నాడు. ఆనాటి బోధ యీనాటికెట్లు సరి పడును? ఈ నవీననాగరిక లోక మునకు ఫలానావిషయము సమం జసమై యొప్పునని ఆ కాలమున శ్రీకృష్ణునకు యెట్లు తెలిసివుండెడి” దని వితర్కించెడి కుచోద్యబుద్ధి పనికిరాదు. పెద్దలయందు అసూయ చూపుట భయంకర ప్రమాదము.

తొల్లిట నొక సాధువుండెడి వాడు. ఆయన సదా సర్వ బా గొంతెత్తి ఉచ్ఛస్వరముతో నోరు నొవ్వంగ హరిభజన చేసెడివాడు. అదిచూచి కుత్సితుడగు ఒకానొక వ్యక్తి ఆ సాధువును అపహాస్యము చేయుచు “అయ్యా! అంత గట్టిగ కేకలుబెట్టుట యేల? మీ దేవునికి చెవుడుబట్టినదా? ఏమి?” అని అడి గెను. “దేవునికి చెవుడు లేదు. నా హృదయావేశమును వెళ్ల గ్రక్కుటకును – ఆర్తస్థితిని వెల్లడించుటకునుమాత్రమే యిట్లు భజనచేయుచున్నా”నని ఆ సాధువు గారు బదులుచెప్పిరి. కాని ఆ చెనటి తన చేష్ట మానక మాటి మాటికి మరియు వెనుకటివలెనే గేలిసేయుచుండెను. వాని కుచోద్య స్వభావమునకు చిరాకుపడి ఒకా నొకనాడాసాధువుగారు “ఓ పిచ్చి వాడా! ఇక నోరుమూయుము. నీవు బాగుపడవలెనను కోర్కె యున్న భగవంతుని భజింపుము. లేనిచో నీ గతికొద్ది పడియుండు” మని కసరి చెప్పెను. ఆ మహాను భావుని హృదయమునకు నొప్పి కల్గించిన పాతకమువలననో అన్నట్లు కొన్నిదినముల కావ్యక్తికి పిచ్చియె పట్టినది. క్రొత్తజ్ఞానము వచ్చు మాట పోనిమ్ము. ఉన్న జ్ఞానము కూడ పోయినది. చూచితిరా! పెద్ద లకు అపచారమొనర్చిన నేరము నకు ఫలము.

ఇందిరా



ఓమ్

# శ్రీ భగవద్గీతా అష్టాదశోఽధ్యాయః

# మోక్ష సన్న్యాస యోగము.

## ( శ్రీ మలయాళస్వాములవారు. )

★

[మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు గీతావాణి విశేషసంచికకై యీ వ్యాసాన్ని అనుగ్రహించి పంపారు. అప్పటికే సమయము దాటిపోయి వుండుటచే ఆగత్యా ఆ డిసెంబరు సంచికలో ప్రకటింపలేకపోయాము. శ్రీవారు మన్నింప మావేడికోలు. ఈ మహాప్రసాదాన్ని జనవరి సంచిక ద్వారా గీతా భక్తులకు అందచేస్తూన్నాము.

— సంపాదకుడు.]

★



ఈ అధ్యాయమునకు మోక్షసన్న్యాస యోగమని పేరు. మోక్షముకొఱకు సన్న్యసించవలెనని సామాన్య అర్థము. మోక్షమునుగూడ సన్న్యసించవలయునని మరియొక అర్థము గలదు. విశేషార్థము, సంన్యసించుట యనగా సమస్తమును త్యాగము చేయుట యని సారము. దీనికి కర్మత్యాగము గాద నియు, కర్మ ఫలత్యాగమనియు కొందరు అర్థము చెప్పుదురు. సర్వసంగమునుత్యజించి త్యాగియై యుండుటయే నిజమైన యర్థమగును. కర్మఫలత్యాగమే అర్థమైనచో, శ్రీకృష్ణముఖారవిందమునుండి నేరులో యనగా సమక్షమున గీతాశ్రవణము జేసిన అర్జునుడున్ను, ధర్మరాజాదులున్ను జీవితాంతమువరకు గృహస్థాశ్రమమందుండి కర్మల చేయుచు ఫలత్యాగమును చేయవలసియుందురు. శ్రీ మహాభారతమున మహాప్రస్థానమునందు పాండవులైదుగురును, ద్రౌపదియు సమస్తమును త్యజించి, సాధువేషములను ధరించి యింద్రప్రస్థమును వదలిపోయినట్లు గనబడుచున్నది. ఇందువల్ల సర్వసంగ పరిత్యాగమే యథార్థమైన అర్థమగును. ఆత్మశుద్ధి గలుగువరకు సత్కర్మలాచరించి, ఫలత్యాగము, ఫలము యీశ్వరార్పణముగా చేయవలయుననియే శాస్త్రసిద్ధాంతము. అందువలన అంతఃకరణశుద్ధి గలుగును. అపుడు ప్రకృతిరహితమగు జీవన్ముక్తి గలుగుటకు సర్వసంగ త్యాగమున్ను, సర్వకర్మ త్యాగమున్ను చేసి యేకాంతమున తపమొనరించుచు, బ్రహ్మచింతనము జేయుచు, జీవన్ముక్తి పదమును పొందవలసి

యుండును. రెండవ విశేషార్థమేమనగా, మోక్షసన్న్యాసమనగ మోక్షమునుగూడ సన్న్యసి
సించుట. ఇదివరలో 17 వ అధ్యాయమువరకు నేను జెప్పినట్లు చేసినచో, మోక్షము
నిచ్చెదనని చెప్పుచువచ్చి, ఏ మోక్షము నిచ్చెదనని చెప్పితినో, దానినిగూడ విడిచి
పెట్టుము, యని యొక అర్థము గలదు. అనగా 17_వ అధ్యాయమువరకు చెప్పిన విధు
లన్నియు అనుష్ఠించుచువచ్చిన ముక్తుడగును. అందువల్ల మరల మోక్షము కావలెనను భావ
ముండదు. లేక పరమభక్తితోగూడిన ఉపాసనాపద్ధతి ననుసరించి చూచిన ఒక్కనికి
గొప్ప అధికారముగల ఒక పరమ ఆప్తుడుండెను పైజెప్పినవాని కొక యాపత్తు గలిగెను.
దానియొక్క నివృత్తికొరకు యున్నతోద్యోగియగు తన పరమాప్తుని దగ్గరకువెళ్ళి చెప్పగా
ఆ కార్యము నేను చక్కబరచెదను, మీకు యిక యాతలంపే యక్కరలేదని చెప్పినట్లు
17 అధ్యాయములవరకు చెప్పిన యనుష్ఠానములు చేయుచువచ్చినచో భగవంతుడు
తప్పక మోక్షమును గలుగజేయును. అందువల్లను మోక్షమునుగూడా త్యజింపుము యని
మిక్కిలి వాత్సల్యముతో జెప్పినదగును. ఇక ప్రతి అధ్యాయాంతమున భగవద్గీతాసు, ఉప
నిషత్సు అని వుండుటవలన ఉపనిషచ్ఛబ్దమునకు వేదాంతముయొక్క అంత్యామే అర్థ
మగును. ఆ యుపనిషత్తులు బ్రహ్మము గురించియే జెప్పుచున్నవి.

వానిలో గీతయందు రెండవాధ్యాయమున చెప్పినట్లు ఆత్మ యేకాలముననైనను
జన్మమెత్తుటగాని, కర్మజేయుటగాని, కర్మఫలము ననుభవించుటగాని లేదనియు, ఆ
యాత్మ యెల్లప్పుడు బ్రహ్మమయముగా నుంటున్నదనియు, ఈ జననాదికార్యములన్నియు
మాయవల్లనే తోచుచున్నవేగాని వాస్తవముగా లేవనియు బోధించుటవల్ల నీవు సదా
ముక్తుడవైయున్నావు. గావున మోక్షమును బొందవలయునని కోరుట భ్రాంతియే. గాన
యట్టి సంకల్పమునుగూడ విడిచిపెట్టుము అనియుగూడాగలదు. ఇదే యుపనిషత్తుయొక్క
నిజార్థమగును. రోగముతోగూడినవానికి రోగవిమోచనకార్యము చేయవలసియుండును.
ఋణస్థుడైనవానికి ఋణవిమోచనకార్యము చేయవలసియుండును. బంధింపబడినవానికి
బంధవిమోచనకార్యము చేయవలసియుండును. కారాగృహ నిబద్ధుడైనవానికి దానినుండి
విమోచనమార్గము చేయవలసియుండును. అట్లు యీ పైజెప్పిన రోగము, ఋణము,
బంధము, కారాగృహము లేనివానికి మరల వానినుండి విమోచనకోరిక యేల గలుగవల
యును? అయితే ఒకడు పైజెప్పిన యీ నాల్గు వాక్యములను బహుజనులచే వినిగాని,
లేక పత్రికలలో, పుస్తకములలో చదివిగాని యుండినందుచే పైజెప్పిన నాల్గుదోషములు
లేనివాడై యుండియు, కలలో నీ నాల్గు గుణములు తనకు గలిగినట్లు తోచెను. ఆ స్వప్న
దోషము జాగ్రదవస్థలోనికి వచ్చిన యెట్లు మిథ్యయని దృఢభావముగలుగునో, ఆత్మయొక్క
నిజావస్థయు అటువంటిదే. కావున మోక్షమునుకోరుట యనునదిగూడ పరమార్థదశయందు
లేదు. కావున మోక్షమునుగూడ సన్న్యసింపుమని అభయరూపమునగాని, లేక నిజతత్త్వార్థ
బోధకమునగాని శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించినట్లు గ్రహించవలెను.

"న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః ।
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా ॥"

తా॥ పరమార్థ దశలో నిరోధము ఉత్పత్తి బద్ధుడు సాధకుడు ముముక్షువు అనునవి లేవు. ఆత్మ నిత్యముక్త స్వరూపము గలది అని ఉపనిషత్. మరియు ఈ 18_వ అధ్యాయము యిదివరలో జెప్పినవాని యన్నిటియొక్క సంగ్రహాసార మగును. ఇంతేగాక నిదివరలో 17_వ అధ్యాయమువరకు యుపదేశించినవానిలో యెచట నేదేది కొరతపడియుండునో, దానిని యీ యధ్యాయమునందు పూర్తి చేయబడి యున్నది. గావున యీ యధ్యాయము గీతయొక్క సంగ్రహమగును. ఇది చాలా అగాధార్థముతో గూడినది. దీనియందు 66_వ శ్లోకమునందు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని చరమశ్లోకము గలిగియున్నది. దీనియందు ఋషి ఛందస్సులో జెప్పబడిన "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః" అనియు "అహం త్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ ఇతి కీలకం" అనియు గలదు.

అనగా గీతయొక్క సర్వశక్తియు, గీతాశాస్త్రముయొక్క కీలకము, అనగా రహస్యము యీ శ్లోకమునందు గలదు. "కీలకము" యనగా ఒక్కయంత్రము నడుపుటకు గల మర యనిపేరు. గీతారథముయొక్క యంత్రమునకు నీ శ్లోకమునందు చెప్పినదే కీలకమగును. యంత్రము నడుపుటకు యే మరను త్రిప్పవలయునో అది తెలియనివానికి మోటారుకారు, విమానము దొరికినను యెట్లు యుపయోగములేదో, అట్లే ఈశ్లోకములో జెప్పిన కీలకము తెలియకపోయిన జీవన్ముక్తిని, లేక భగవత్ప్రాప్తిని, లేక మోక్షమును పొందజాలడు. గావున కీలకమంతయును దీనియందే గలదు. ఇది గొప్ప అనుభవజ్ఞులును, బ్రహ్మనిష్ఠులును, మహనీయులగువారివల్లనే తెలిసికొనవలసియుండును. రెండవ అధ్యాయము 11_వ శ్లోకము గీతారత్నహారమునకు మొదటిదనియు, 9_వ అధ్యాయమున 22_వ శ్లోకము యీ హారమునకు మధ్యయుండు నాయకమణియనియు, యిప్పుడు 18_వ అధ్యాయమున 66_వ శ్లోకము ఈ గీతాభరణమునకు అంత్యమునయుండు మణియనియు గ్రహించుకొనవలయును. 18 అధ్యాయములలో 9_వ అధ్యాయము మధ్యయుండుటవల్ల 22_వ శ్లోకమును మధ్యయుండు నాయకమణిగా వర్ణించడమైనది. 2_వ అ. 11_వ శ్లోకము ఋష్యాదిన్యాసములో బీజముగా నిరూపించడమైనది. 9_వ అ. 22_వ శ్లోకము వచ్చునప్పటికి గీతాకల్పవృక్షము బాగుగా వృద్ధినొంది ఫల, పల్లవ, పుష్ప, లతాదులచే శోభాయమానమై వృద్ధినొందెను. ఇప్పుడు యీ యధ్యాయమున 66_వ శ్లోకము వచ్చునప్పటికి గీతాకల్పవృక్షములోని ఫలములు పరిపక్వములైనవి. అనగా పండినవి. ఈ ఫలములనే ముక్తులు బ్రహ్మానందరసముగా ననుభవించుచున్నారు. ఇక సర్వసంగ పరిత్యాగమే గీతయొక్క అంత్యోపదేశమని చెప్పినదానికి మహాభారతము మహాప్రస్థాన పర్వమందు చెప్పినది చూడుడు.

శ్లో॥ శిష్యం పరీక్షితం తస్మై దదౌ భరతసత్తమ ।
తతస్తు ప్రకృతీస్సర్వాః సమానాయ్య యుధిష్ఠిరః ॥
సర్వమాచష్ట రాజర్షిః చికీర్షితమథాత్మనః ।
తే శ్రుత్వైవ వచస్తస్య పౌరజానపదా జనాః ॥
భృశముద్విగ్నమనసో నాభ్యనందంత తద్వచః ।
నైవ కర్తవ్యమితి తే తదోచుస్తం నరాధిపమ్ ॥
న చ రాజా తథాకర్షీత్ కాలపర్యాయధర్మవిత్ ।
తతోఽనుమాన్య ధర్మాత్మా పౌరజానపదం జనమ్ ॥
గమనాయ మతిం చక్రే ... ... ... ...
తతస్స రాజా కౌరవ్యో ధర్మపుత్రో యుధిష్ఠిరః ॥
ఉత్సృజ్యాభరణాన్యంగాజ్జగృహే వల్కలాన్యుత ।
భీమార్జునయమాశ్చైవ ద్రౌపదీ చ యశస్వినీ ॥
తథైవ జగృహుః సర్వే వల్కలాని నరాధిప ।
విధివత్కారయిత్వేష్టిం నైష్ఠికీం భరతర్షభ ॥
సముత్సృజ్యాప్సు సర్వేఽగ్నీన్ ప్రతస్థుర్నరపుంగవాః ।
... ... ... ... ... ... ... ... ...
భ్రాతరః పంచకృష్ణా చ షష్ఠీ శ్వా చైవ సప్తమః ॥

వ॥ శేషించిన కాంచనరత్నాదుల లాక్షితిపతి పరీక్షితునకు బరమాదరంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యునిగా నప్పగించి పౌర జానపదప్రవర జనంబుల రావించి.

సీ॥ ఆపార్థ పౌత్రునిఁజూపి మాయేపుర
మాలుగా మీరిక్కుమారవరుని
గైకొని తగ నెల్లకార్యజాతంబును
నడపుచు ననురక్తి నాడునాటి,
కెక్కుడగుచునుండ, నీతని యుల్లంబు
రంజిల్ల సమ్యగారాధనంబు
నందు సంప్రవణుల రగుడయ్యాయని పల్కి,
తమ నిశ్చయంబు నుదాత్తభంగి.

[ మిగత 15-వ పేజీలో ]

# జ్ఞానముత్పద్యతే పుంసాం ★
# ★ క్షయాత్పాపస్య కర్మణః

విద్వాన్, కావ్యతీర్థ శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
(కవితాసామ్రాజ్యము) నంద్యాల.

---

జ్ఞానోదయమునకు పాపము ప్రతిబంధకముగాఁ జెప్పఁబడినది. కనుక పాపము లొనరింపకుండుటయు, సంచితపాపమునకు పరిహారము చేసికొనుటయు అవశ్య కర్తవ్యములై యున్నవి.

పాపసంపాదనమున కిష్టము లేకపోయినను అనివార్యములైన యవకాశములు కొన్ని తటస్థపడుచుండును. పుణ్యముల వలెనే పాపములును కాయిక వాచిక మానసికములని త్రివిధములు. అనఁగా శరీరముతోను, వాక్కుతోను, మనస్సుతోను సంపాదించునవని యర్థము. వీనిలో మానసిక - వాచికములను పాపభీతితో నరికట్టవచ్చును. కాయికపాపములనుగూడ కొంతవఱకు కరికట్ట వీలగును. కాని కొన్ని మాత్రము సాధ్యముగావు. దురూహలు, దురాలోచనలు, ద్రోహచింతనలు ఇత్యాదులు మానుకొని మానసిక పాపములను రానీయకుండఁ జేసికొనవచ్చును. వాగ్వ్యభిచారము మానుకొని వాచిక పాపములను నివారించుకొనవచ్చును. దుష్కార్యములను మానుకొని కొంతవఱకు కాయిక పాపములను తగ్గించుకొనవచ్చును. కాయికముగా సంఘటితము లయ్యెడు కొన్నింటిని మాత్రము తప్పించుకొన వలనుపడదు. గమన భోజన మజ్జనాదు లనివార్యములు. నడిచినప్పుడు కాళ్లక్రిందఁబడి యెన్నో జీవులు నశించుచున్నవి. భోజనవిషయ మాలోచించినచోఁ జెప్ప సాధ్యమేగాదు. అన్నము తినవచ్చుసరి కెంత జీవహింస జరుగుచున్నదో చూడనగును. వెసటిలోఁ బోయుటకుఁ దగినస్థితికి వచ్చిన బియ్యమును కడుగునప్పుడుగూడ కొన్ని జీవులు చచ్చుచున్నవి. ధాన్యమునుండి బియ్యమగునప్పటికి దంపకములోను, విసరుటలోను కొన్ని జీవులు నశించుచున్నవి. ఆ ధాన్యము కళ్లములో సిద్ధమగునప్పటికి కోఁతలోనేమి, త్రవ్వకములోనేమి, నీరుపెట్టినప్పుడేమి, చెలపవేసినప్పుడేమి, నాటినప్పుడేమి, అంతకుపూర్వము దున్నినప్పుడేమి, ఎఱువు వేసినప్పుడేమి మొత్తముమీఁద తినుపదార్థమేదేని యుత్పన్నమగునప్పటి కాద్యంతము హింసాకాండతోనే సంపాదితమగుచున్న దనుటలో సందేహములేదు. నడుచునప్పుడెంత జీవహింస కలుగుచున్నదో చెప్పశక్యము గాదు. మొత్తముమీఁద పాపసంపాదనమున కనివార్యములుగాఁ గొన్ని యవకాశము లున్నవనుట తథ్యము. కనుకనే వీనికి పరిహారమార్గములు బుద్ధిపూర్వకముగాఁ జేసికొనఁదగినవి కొన్ని గలవు.

ధాన్యము నుత్పత్తిచేయు రైతు తాను జేసిన పాపమునకు పరిహారముగా ఖల యజ్ఞము చేయవలయును. ఖల మనఁగా కళ్లము. కళ్లములో గింజలు రాశిచేయు నపుడు రాశిపాటున కొంత ధాన్యము ధర్మార్థముగాఁ బంచిపెట్టవలయును. ఇదియే కర్షకుఁడొనరింపవలసిన ఖల యజ్ఞము. ఇంతియేగాక తానుత్పత్తిచేయు ప్రతిపదార్థములోను ధర్మార్థముగా కొంత వినియోగించి ఆయాపాపమును పరిహారము చేసికొనవలయును. నారుపోసినప్పుడా నారులోఁ గొంత ధర్మముగా ఆసించిన వారి కీయవలయును. చేలలో గడ్డిగాదము ధర్మార్థము కోసికొని పోనీయవలయును. కోఁతకాలమున గింజలతోడి గడ్డి, కంకులు, చొప్ప ధర్మము చేయవలయును. ఇంత వఱకు కర్షకుఁడు చేసికొనవలసిన పాప ప్రాయశ్చిత్తము. ఈపైని గింజ యింటిలోఁ జేరినతర్వాత యజమానుఁడు వంటయై భోజనము చేయు వచ్చుసరికి సంప్రాప్త మయ్యెడి పాపమును పరిహారము చేసికొన వలయును. ఒక యన్నసంపాదనమున కింకను కొన్ని పాపములు సంభవమగు చున్నది. ఇల్లలికినపుడు, నీళ్లు తెచ్చునపుడు, దంచునపుడు, కూరగాయలు తఱుఁగు నపుడు, కట్టెలు కొట్టునపుడు, కొట్టిన కట్టెలు కాల్చునపుడు కొన్ని జీవరాసులు హతమగుచున్నవి. కాఁబట్టి యీవిధముగాఁ గొంతపాపము సంక్రమించుచున్నది. భోజన నిమిత్తముగా సంభవించెడి యైదువిధములైన పాపములను పంచసూనములని యందురు. పంచసూనాపనోదార్థమే వైశ్వదేవమను అన్నసంస్కారకర్మము నొనరింప వలెనని విధింపఁబడినది. వైశ్వదేవము చేయుటతో పంచమహాయజ్ఞములు నిర్వర్తింపఁబడుచున్నవి. కాన పంచ విధములైన పాపములు పరిహారము లగు చున్నవి.

దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూత యజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము ఇవి పంచమహాయజ్ఞములు. దేవతోద్దేశ పూర్వకముగా అగ్నిహోత్రాదు లొనరించుట దేవయజ్ఞము. పితృదేవతల నుద్దేశించి చేయునది పితృయజ్ఞము. కాకబలి, శ్వానబలి వేయుట భూతయజ్ఞము. అతిథులకు భోజనమిడుట మనుష్యయజ్ఞము, స్వాధ్యాయపఠనము బ్రహ్మయజ్ఞము.

వీనిలో ప్రతియొక్కటియు నందఱకు యథాతథముగా నొనరించుటకు వలనుపడక పోవచ్చును. కాని తత్తదుద్దేశపూర్వకముగా నేది యొనరించినను నద యెల్ల నాయాయి యజ్ఞమునకు సంబంధించినదిగానే యుండును. ఏరూపకముగాఁ జేసినను దేవతాసేవ యంతయు దేవయజ్ఞమే. అట్లే పితృయజ్ఞాదులును. బ్రహ్మయజ్ఞ మనునది కేవల వేదపాఠమే యైనను స్తోత్రపాఠా దులును, సద్గ్రంథపఠనాదులును, సత్కాలక్షేపాదులును ఇవి యెల్ల బ్రహ్మ యజ్ఞముక్రిందివే. కనుక ప్రతివ్యక్తికిని, ప్రతి గృహస్థునకును నివి సాధ్యపడనివి గావు. భూతయజ్ఞములో ఏభూతమునకేని అన్నాద్యాహార మొసఁగుట యెల్ల భూత

యజ్ఞము క్రిందికే కట్టనగును. సామాన్య వ్యక్తులును చద్ది కట్టుకొనిపోయి తినునపుడేవరేని వచ్చిన అందులోనే పట్టెడన్నము తీసిపెట్టుదురు. నీటియొడ్డునఁగూర్చుండి తినునపుడు తొలిముద్ద జలచరముల కని నీళ్లలో వేసి భుజింతురు. ఆసించుకొనివచ్చిన కుక్కకు కమికెఁడన్నము తీసి వేయుఁదురు. ఈ యైదువిధములైన యజ్ఞములను ఆచరించుచున్నచో అహరహః ప్రాప్తము లయ్యెడు పాతకములు పరిహారము లగును.

ఇందులో సాధ్యముకానిదే లేదు. యథాశక్తి సంభవముగా ఆచరింపవచ్చును. భోజన విషయములో అసాక్షిభోజనము మాత్రము చేయరాదని వేదము బోధించుచున్నది, 'కేవలాఘో భవతి కేవలాదీ' అని. అనఁగా ఒంటరిగా భుజించువాఁడు తాను భుజించునది అన్నముగాక పాపమే అని యభిప్రాయము. అన్న సంపాదనమునకయ్యెడు పాపమును పరిహారము చేయువాఁడతిథి. అట్టి యతిథి పంక్తిలో లేకపోయినచో ఆ పాప మన్నము నాశ్రయించియుండును గాన ఆ యన్నమును భుజించుట పాపమును భుజించినట్లే యగునని తాత్పర్యము. ఈ యర్థమునే భగవద్గీతగూడ 'భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్' అని చెప్పుచున్నది. ఎవడు తన నిమిత్తముగా వంటచేసికొని భుజించుచున్నాఁడో వాఁడు పాపమునే భుజించుచున్నాఁడని భావము.

కాఁబట్టి యనివార్యముగాఁ బ్రాప్తించెడి పాపమును పరిహారము చేసికొనుటకు సాక్షిభోజనము యథాశక్తి సంపన్నము కావచ్చును. కాన అనివార్యప్రాప్తమేయైనను జ్ఞానప్రతిబంధకమగు పాపమాచరణ పరిహార్యమగుటచే జ్ఞానసంపాదనపరులెల్లరు తత్ప్రతిబంధమును దొలఁగించుకొందురు గాక.

---

[ 12 వ పేజి శేషము ]

తే॥ జెప్పుటయు వారు మొగములు చిన్నబోవ
మము నుపేక్షించి యిటుసేత సముచితంబె,
నీదు చిత్తంబు కారుణ్యనిలయ! మేము
దదతరంబ యాశ్రితాలము ధర్మశీల!

వ॥ అని గద్గదకంఠులగుచు నాడినమాటలకు నమ్మనుజేంద్రుండు దగు తెఱంగున మఱుమాటలాడి తమ గమనంబునకు సజ్జనంబుల నియ్యకొల్పె నప్పు డందులోనం గొందఱు గొందఱనివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబుపుట్టిన సహదేవుండు గలియుగంబు ప్రవేశించుటం జేసి కాదే యిట్టివి పుట్టెడునని తలంచి, నవ్వి, నరనాథునకుం జెప్పిన నప్పౌరవోత్తముండు నవ్వుచు మనమనువులు సాలునని పలికి, సర్వాభరణంబులునూడ్చి వల్కలాజినంబులు ధరియించినందఱమ్ములు, ద్రౌపదియు నట్లుచేసి రందఱుం దత్కాలోచితంబులగు నిష్ఠావిధానంబు లాచరించి యగ్నుల నంబుగతంబులుఁ జేసి, మొగంబులం దెలివగలింప గృహంబు వెలువడిరప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠంబోవ సప్తమంబై యొక్క సారమేయంబు వారల వెనుకజనియె నప్పుడు.



# " న త్వం శోచితుమర్హసి "

## నిర్విషయానంద బ్రహ్మచారిగారు.

క॥ అల భారత భూరమణీ తిలకంబన కేరళాఖ్య దేశము వెలయున్
తులలేని శీలసంపద గల యొక కాంతాలలామ కల దా భువిలో. 1

తే॥ గీ॥ ఆమె శ్రీకృష్ణనామము ననవరతము జపము జేయును, గీతను చదువునియతి
చిత్తమందున కృష్ణునే చింతజేయు నితరయోచన లాతల్లి కెడము లెపుడు. 2

తే॥గీ॥ తనకు శంకలు హృదియందు దట్టినపుడు దేవతార్చన గృహమును యావుపేడ
బెట్టి చక్కగ యలికి సద్భక్తిమతోడ పూజగావించు కృష్ణుని బుద్ధి నిలిపి. 3

తే॥గీ॥ పిదప యచ్చట శయనించి నిదురజెంద స్వప్నమున కృష్ణుడపుడె సాక్షాత్కరించి
సందియంబులఁదీరిచి చక్కనరుగు కాలమీరీతిఁ నా యమ్మ గడుపుచుండె. 4

చ॥ కలదు వివేకభావయుత, కంజదళాక్షి, మహాపవిత్ర, కో
మలతను శోభనాఢ్య, యొక మానిని యామెకు పుత్రి యామె యా
లలితకళాప్రపూర్ణను విలాసవతిం గడు ప్రీతిభావనన్
గల ధనమిచ్చి సాకుచు, నఖండముదంబున నుండె నత్తటిన్. 5

శా॥ ఆ బాలామణి పూర్ణయౌవనముచే నాహ్లాదయైయుండగా,
నా బాలన్ దగువాని కీదలచి యుత్సాహంబుతో వస్తువుల్
తా బాహుళ్యము జేర్చె తల్లి, యపుడే తత్కన్య రోగంబుతో
దాబాధన్ బడసాగ, దైవమహిమన్ దర్కింపగా శక్యమే ! 6

సీ॥ అప్పుడా యమ దుఃఖ మాపగాజాలక పిలిపించె వైద్యుల పెద్దవారి
వారలాబిడ్డను పరికించి చక్కగ నొకదిన మీకన్య యున్నయెడల
నామీద జీవింప నడ్డేమియును లేదు తథ్య మీ విషయ మో తల్లియనిరి
యటుమీద నాయమ్మ, యాత్రమ్మతో బాలకేగతియున్నదో యెరుగుటకుగ.

తే॥గీ॥ పూర్వరీతిని కృష్ణుని పూజజేసి తనదు శంకను దీర్పగా వినుతి సలిపి
ధ్యాన పరతంత్రయై యట్లె ధరణిమీద బండుకొని గాఢనిద్రను బడసె నపుడు. 7

వ॥ నల్లకలువల నుల్లసంబాడు శరీరకాంతియు, కటకరాంచన్మైన్నజ కరంబులును, వికసిత ముఖారవిందంబును, నవరత్న ఖచిత కుండలమండిత శ్రోత్రంబులును, కరుణారసపూరిత నేత్రయుగ్మంబొప్ప శ్రీకృష్ణభగవానుడాయమ్మ స్వప్నంబున గోచరంబై "నత్వం శోచితుమర్హసి" యను భగవద్గీతా వాక్యంబును నుడివి యంతర్ధానుండయ్యె నంత నా సాధ్వీమణి మేల్కాంచి కృష్ణముఖారవిందంబునుండి వెలువడిన తద్వాక్యార్థంబునూహించి సంతోషభరితాంతఃకరణయై యీ రీతి నెంచె. 8

క॥ శోకము నొందగ దగదని యాకృష్ణుఁడు నాకు జెప్పె నాహాయిక నే
భీకరదుఃఖము వీడెదఁ సాకును నా పుత్రినతఁడు సత్కృపతోడన్. 9

వ॥ అని భావించి 10

తే॥గీ॥ ఆ పరాత్పరుఁడానందమందునట్లు సర్వులకు యన్నమును బెట్టి సంతసింతు
ననుచు సంతర్పణను జేసె నంతలోనె దినము ముగిసెను పుత్రిక దివము కేగె. 11

ఉ॥ పట్టగలేని మోద మెటుబాసెనొకాని, దురంతచింతలో
నట్టె మునింగిపోయె, నిక నాయము దుఃఖము తీరుటెట్టులో
కట్టా! యటంచు చుట్టు ప్రజ గందరగోళము జేయుచుండ, తా
నెట్టులొ మూర్ఛవీడి మది నిట్లు తలంచె వివేకయుక్తయై. 12

ఉ॥ పుట్టిన ప్రాణులెల్ల భువి పూర్తిగ నుండుట కల్ల దీనికై,
యిట్టుల శోకమొంద ఫలమేమియు లేదిక చింత వీడెదన్
గట్టుగ గానుపించి హరి గొప్పగ జెప్పెను ధైర్యవాక్య మే
దెట్టులబోయినన్ నదియు హీనము నొందుట దుఃఖమయ్యెడిన్. 13

చ॥ అని కడుదుఃఖమొంది మదినంత స్థిరం బొనరించి గీతలో
గనవలె నాకు జెప్పిన యఖండపదయూరస వాక్యమూలమం
చని వెదకంగబూనె, కడు యచ్చెరువొందగ గోచరించె దా
మును హరినుండి విన్నపద మూల మహత్తర శ్లోకమప్పుడే. 14

వ॥ ఆ శ్లోకం బెద్దియన "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥" యను రెండవయధ్యాయమందలి
యిరువదేడవశ్లోకం బాయమ దానియర్థం బిట్లు తలంచె. 15

తే॥గీ॥ పుట్టువాడెల్ల స్థిరముగ గిట్టుచుండు చచ్చువాడెల్ల ధ్రువముగ జన్మమొందు
కాని వారింప శక్యంబుకాని యట్టిదానికై నీవు శోకింప దగవనియెను. 16

తే॥గీ॥ కాన నే దుఃఖమొందుట దేనికింక దెలియలేనైతి నిందాక దేవదేవు
డతఁడు తెల్పిన సూక్ష్మభావార్థమేను మూఢమతినైతి తెలివియా మొనయదయ్యె 17

శా॥ మాయానాటకసూత్రధారి హరి సామాన్యుండె! తర్కింప నే
మాయాజాలముచేత లోకముల నేమంబొప్ప సృష్టించె, నా
మాయన్ నాపయి గప్పి యీ పగిది దా మానంబుతో నుండె ని
శ్శ్రేయంబబ్బగ నేమొ! యీ కరణి దా జేసెన్ విచిత్రంబహో! 18

తే॥ భక్తులైనట్టివారలు ముక్తినొంద వైరరాగంబు లిట్టుల వదలజేసి
పరమనిర్వాణ సామ్రాజ్యపదమునందు నిలిపి కాపాడు యాహరి నెనరుతోడ 19

తే॥ అతని మహిమల వర్ణింప నలవియగునె తెలివి కలిగెను యాహరి దివ్యకరుణ
నా స్త్రిపాస్తుల నాతని కర్పితంబు జేసి నిరతము తచ్చింత జేయుదాన. 20

తే॥ అనుచు నట్టులె గావించి యనవరతము దైవచింతానిమగ్నయై త్యాగగరిమ
జ్ఞాన విజ్ఞానములబొంది సంతసమున పరమకైవల్యసిద్ధిని బడసె కడకు. 21

# భగవద్గీత - దాని అమరత్వము.

శ్రీ కె. వి. నారాయణ్, శ్రీ కాశీవిద్యాపీఠము.



భారతీయ హైందవ ధర్మగ్రంథములలో భగవద్గీత ఉత్తమోత్తమ గ్రంథము. ఇందులోని తత్త్వవిచారము క్రమబద్ధముగను, ఆకర్షవంతముగను పొందుపరుపబడినది. అందులకనియే దీనిని పంచమవేదమని కొందరు దర్శనశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.



"గీయతే ఇతిగీతా" గానము చేయబడు దానిపేరు గీత. గానము శబ్దవిశేషములేకుండా చేయుటకు వీలుపడదు. తత్త్వజ్ఞానమును, వైదిక కర్మోపాసనములను వర్ణించు శబ్దసముదాయరూపము గ్రంథమే గీత. ధ్వనులయొక్క సాకారరూపమే అక్షరము. అక్షరములద్వారా శబ్దములు, శబ్దములద్వారా వాక్యములు తయారగుచున్నవి. ఈ వాక్యములద్వారానే పెద్ద పెద్దగ్రంథములు వ్రాయబడుచున్నవి. దీనినే ఒక్కశబ్దములో భాషయని చెప్పవచ్చును. భాష నిరర్థకము గాదు. భాష భావముల వ్యక్తపరచు సాధనముగూడా.

ప్రపంచ సాహిత్యములో ప్రాచీనకాలమున వ్రాయబడిన గ్రంథములన్నియు కావ్యములందే వ్రాయబడినవి. భగవద్గీతకూడా మృదుమధురమగు గీతములలో వ్రాయబడినది. శబ్దమునకు శబ్దార్థమే కాకుండా లక్షణ, వ్యంజన అను అర్థములుకూడా గలవు. గీత కావ్యశైలిలో వ్రాయబడినది గనుక అలంకారముల ప్రయోగమువచ్చుట సహజమే. పదునొకండవ అధ్యాయములో అలంకారముల ప్రయోగము సుస్పష్టముగ కనుపించుచున్నది.

శబ్దార్థములు కాలక్రమమున మారుచుండును. గీతాకారుడగు వ్యాసమహర్షి ప్రయోగించిన శబ్దార్థమునే నేటి గీతావ్యాఖ్యాతలు చెప్పుచున్నారనుట సరిగాదు. గీతకు నేటివరకువ్రాయబడినవ్యాఖ్యలువివిధతనుములుగనున్నవి.గీత కొందరకుభక్తియోగ ప్రధాన గ్రంథముగ కనిపించిన మరికొందరికి కర్మయోగప్రధానముగ కనుపించుచున్నది ఒక్కమాటలో చెప్పవలయుననిన గీతఅద్దము వంటిది. ప్రతివారికినీ వారివారి మనః ప్రతిబింబము అందులో కనుపించుచుండును. భగవద్గీత భాష, భావార్థములరీత్యా అమరమై

నది గాదని దీనివలన బుజువగుచున్నది. ఉదాహరణ:- సత్య, అహింస, ప్రేమ మొదలగు శబ్దములకు భిన్న భిన్న సమయములలో భిన్న భిన్న అర్థములు చేయబడినవి. బుద్ధుని సత్యాహింస ప్రేమ శబ్దముల పరిభాష వేరు. గాంధీజీ సత్యాహింస ప్రేమ శబ్దముల పరిభాష వేరు. ఇది సహజము కూడాను. మానవుడు సమాజప్రాణిగనుక తన ప్రస్తుతపరిస్థితుల కనుకూలముగా శబ్దార్థమును వ్యాఖ్యానించుచుండును.

గీత రచించబడిన సమయమును గురించి విద్వాంసులు వివిధాభిప్రాయములను వెలిబుచ్చినారు. ద్వాపరయుగాంతమున రచింపబడినదని బహుజనుల అభిప్రాయము. కానీ విమర్శనాదృష్టితో గీతయందలి శ్లోకముల పద్ధతి, భాష, శైలి క్రమములను పరిశీలించిన పిమ్మట ఉపనిషత్తుల తర్వాత, షడ్దర్శనములకు ముందు గీతారచన జరిగినదని పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయము. పదునారవ అధ్యాయములో నాస్తికమతచర్చను పరికించిన పిమ్మట, బౌద్ధధర్మ ప్రచారము తర్వాత గీతరచింపబడినదని కొందరి అభిప్రాయము. సుప్రసిద్ధ చరిత్రకారుడు, మహాభారత మీమాంస రచయితయగు శ్రీచింతామణి వైద్యగారు ప్రస్తుత భగవద్గీత వ్యాసమహర్షిద్వారానే సంపూర్తిగా వ్రాయబడినదిగాదని విమర్శించినారు.

వేద పురాణేతిహాసములు, తామ్రపత్రములు, తాటి ఆకులు, స్తూపములపైన వ్రాయబడినవే మనకు లభించినవి. వీటికి ముందు కంఠస్థ పద్ధతి అమలులో ఉన్నట్లు చరిత్ర చెప్పుచున్నది. నాటిరోజులలో ముద్రణాయంత్రములులేవు. కనుక మూలభగవద్గీత ప్రస్తుత భగవద్గీతలో భేదము ఉండవచ్చు కూడా. గీతా మాహాత్మ్యము తర్వాత చేర్చబడినదనే విషయమును ప్రతి విద్వాంసుడు సమ్మతించు చున్నాడు. పైకారణములవలన భగవద్గీత భావార్థరచనరీత్యా అమరకృతియని చెప్పుట నిజముగా అభూత కల్పనయే కాగలదు.

గీతా ధ్యానమునందు ఈ క్రిందివిధముగా వర్ణింపబడినది.

శ్లో॥ సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సస్సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్ ॥

ఉపనిషత్తులన్నియూ గోవులనియు, శ్రీకృష్ణుడు పాలుపితుకు గొల్లవాడనియు, బుద్ధిమంతుడగు అర్జునుడు పాలుత్రాగు దూడవంటివాడనియు, పిదుకబడిన పాలు మధురమైన గీతామృతమనియు దీనిభావము.

సాహిత్యము సమాజముయొక్క ప్రతిబింబము. ప్రతిసాహిత్య వేత్త సమాజప్రాణి గనుక సమాజపరిస్థితుల ప్రభావము రచయితలపైబడుటసహజము. వ్యాసమహర్షిగూడా సమాజప్రాణియే. వ్యాసుడు ఆనాటి సమాజములో ఉత్తమోత్తమ ఆదర్శవంతమైన తత్త్వవేత్త. కనుకనే నాటి సమస్త తత్త్వ విచారములను ఒక్క భగవద్గీతయందు జొప్పింపగల్గినాడు. ప్రతి కర్మకు ఒక లక్ష్యము ఉండును. ఆ లక్ష్యపూర్తి కను

గుణ్యాముగ సాహిత్యము సృష్టించబడుచుం డును. వ్యాసమహర్షి తనకాలపు సమాజ ఆవశ్యకతననుసరించి భగవద్గీతను సృష్టించి నాడు. నేడు సమాజస్థితులు వేరు; సమాజ లక్ష్యాలువేరు. ప్రాచీన సమయమున 'యశస్సు' అను పదమునకు భావార్థము వేరు. ఆధునిక సమయమున "యశస్సు" అను పదమునకు భావార్థము వేరు.

సాహిత్యము రెండువిధములు. తాత్కాలిక సాహిత్యము, స్థాయీ సాహిత్యము. గీతయందు మానవుని జీవితదర్శనముయొక్క అత్యంత నిగూఢమైన తత్త్వవిచారము చర్చించబడినది. గనుగ దానిమహత్వము తాత్కాలికముగాగాకుండా కొంత స్థిర ముగనున్నది. కానీ భగవద్గీత రచింపబడిన సమయమున ఉన్నంత మహత్వము నేడు కూడా ఉన్నదని అనుట అతిశయోక్తి కాగలదు.

భగవద్గీతలో సాంఖ్య - యోగములు (జ్ఞాన - కర్మలు) సమానస్థాయిగా భావించ బడినవి. నేడు సాంఖ్యము నాస్తిక దర్శనముగాను, యోగము ఆస్తిక దర్శన ముగానూ భావించుచున్నారు. ఈ విధము గా గీతలో చర్చించబడిన అనేక భావము లను ఆధునిక తత్త్వవేత్తలు వ్యతిరేకించు చున్నారు. కనుకనే పలువిధములగు వ్యాఖ్యలు వెలువడినవి; ఇంకనూ వెలువడు చున్నవి; ముందుగూడా వెలువడ నున్నవి.

అవిద్యను పారద్రోలి కర్తవ్య పరాయ ణునిగా చేయుటకే గీతోపదేశము చేయ బడినది. మానవవికాసమునకు చరిత్ర అధ్య యన అత్యంత అవసరము. భగవద్గీత మానవ తత్త్వవిచారముయొక్క అత్యంత అమూ ల్యమైన గ్రంథము. అర్జునుని కర్తవ్య పరా యణునిగా చేయుటను గీతోపదేశమును కృష్ణుడు ఒక సాధనముగా ఉపయోగించు కున్నట్లు వ్యాసమహర్షి వర్ణించినాడు. కనుక నేడుగూడా మనము మన జీవిత సమస్యలను పరిష్కరించుకొనుటకు గీతనుంచి సరియైన సమాధానమును పొందప్రయత్నిం చవలయును. గీతోపదేశములసారము జీవిత మునకు సాధనము మాత్రమేకానీ సాధ్య ముగాదు. గీత చదివి, తర్కించి, మథించి సారమును గ్రహించవలసిన గ్రంథము. అంతే గానీ అనుదిన అర్చన పారాయణాదులతో పూజింపవలసిన గ్రంథముగాదు.

— కె. వి. నారాయణ్.



# ★ అభయము ★

## (శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు.)

[శ్రీకాళహస్తి శ్రీశుకబ్రహ్మాశ్రమాధిపతులు, శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు ఆంధ్రజాతికి గౌరవాన్ని తెచ్చిన ఆధ్యాత్మిక వేత్తలు. సశాస్త్రీయంగా పండ్రెండు సంవత్సరాలు గురుకులవాసం చేసి బ్రహ్మచర్యంనుండి సంన్యాసాన్ని గ్రహించి శ్రీమలయాళస్వాములవారికి సాక్షాత్తు ప్రతిబింబమనే పేరు వాసిగన్నవారు. గీతావిద్యార్థికి ప్రథమనుగుణంగా వుండదగిన అభయాన్నిగూర్చి శ్రీవారు చక్కటి సందేశాన్ని పంపారు. గీతావాణియెడ వారికిగల అభిమానానికి మా విధేయ కృతజ్ఞతలు. — సంపాదకుడు.]

జీవన్ముక్తుడైన జ్ఞానితప్ప తక్కిన సమస్తజీవులను ఏదోయొక విధమైన భయము ఆవరించి బాధించుచున్నది. కొందఱికి రోగము వచ్చునేమోయను భయము, కొందఱికి ధనము పోవునేమోయను భయము, కొందరికి అధికారులు దండింతురేమోయనుభయము, కొందరికి శత్రువులు కీడుచేయుదురేమోయను భయము, మరికొందరికి మరణము గలుగునే మోయను భయము. — ఈ ప్రకారముగ అనేక విధములైన భయములు మనుజుని పట్టి బాధించుచున్నవి. ఈ భయము లన్నిటికిని మూలకారణము దేహాహంభావమే. తన యథార్థస్వరూపము దేహవిలక్షణమగు సచ్చిదానందమని తెలియకపోవుటయే.

పైనదెల్పిన భయములన్నింటిలోను మరణమునుగూర్చిన భయమే జీవునకు అధిక సంకటమును కలుగజేయుచున్నది మహాబలశాలియు, శూరాతిశూరుడునైన అర్జునునకుగూడ 'అయ్యో! నా బంధువులు యుద్ధమున చనిపోవుచున్నారే' అను భీతి యుదయించినది. ఆత్మజ్ఞానుల కట్టి భీతియుండనేరదు. గనుక, మృత్యువు వారికి తృణప్రాయముగనుండును. కనుకనే యుద్ధారంభమున బంధువియోగమునకు దురపిల్లుచు, త్రైలోక్యరాజ్యమునుగూడ లెక్కచేయని అర్జునుని జూచి ఆత్మజ్ఞానియు, దేహాహంభావ రహితుడునగు శ్రీకృష్ణుడు కడుపుబ్బునట్లు నవ్వెను.

### "తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత" (గీత అ. 2 శ్లో. 10)

'హసన్' అనగా 'నవ్వుచు' అనియు, 'ప్రహసన్' అనగా 'మిక్కుటముగ నవ్వుచు' అనియు అర్థము. భగవద్గీత మొత్తములో శ్రీకృష్ణుడు ఇంత నవ్వునవ్విన సందర్భము మఱెక్కడను కానరాదు. కారణమేమి? అత్తఱి అర్జునుని అజ్ఞానము హద్దుదాటిపోయినది గనుక. వివేకములేనివారలకు ఏదిమహాగొప్పగా కనిపించునో, అదిజ్ఞానుల దృష్టికి గడ్డిపోచ వలె నుండును. స్వప్నమందేదేని ఒకానొక వస్తువునుగూర్చి భయపడి తల్లడిల్లుచుండు వ్యక్తిని జూచినచో మేల్కొనినవానికి నవ్వురాకుండునా? అమృతత్వమే స్వరూపముగా గలిగియు, మిథ్యావస్తువుయొక్క వినాశమునుగూర్చి క్లేశమొందువారు విజ్ఞులదృష్టిలో హాస్యాస్పదులుగాక మఱియెవరు?

కావున భయము కలిగినపుడు ప్రతివారు తమలో ఈ ప్రకారముగ వితర్కించుకొనవలెను. — దేనినిగూర్చి భయము? దృశ్యవస్తువునుగూర్చియా, లేక దేహమునుగూర్చియా, లేక ఆత్మనుగూర్చియా? అందు మొదటిదియగు దృశ్యవస్తువైనచో, అది మిథ్యాభూతమై ఏదోయొక కాలమున నశించునది యగుటచే దానినిగూర్చిన భయమనవసరము. రెండవది యగు దేహమైనచో, అది యేకాలమందును తాను గాదుగనుక, దానినిగూర్చిన క్లేశమున్ను వ్యర్థము. ఇక మూడవదియగు ఆత్మయైనచో, అది స్వతః తానే ఎల్లకాలములందును అయియుండుటవలన, ఇక దానినిగూర్చిన చింతయున్ను అనవసరము.

ఈ రీతిగ, విచారించి చూచినచో ప్రపంచమున భయమునకు తావేలేదు. ఆత్మ యొకటితప్ప దృశ్యము ఏకొంచము కలదని నమ్మినను వెంటనే భయము ఆవహించును. కనుకనే ఉపనిషత్తులు

"ద్వితీయాద్వై భయం భవతి"

'ఆత్మేతరముగ మఱియొక వస్తువున్నచో భయము కలుగును.' అని ఘోషించుచున్నవి. భయమున్నచో మనస్సునకు శాంతియుండదు. శాంతిలేనిచో సుఖముండదు (అశాంతస్య కుతస్సుఖమ్). కనుకనే గీతయందు 16 వ అధ్యాయమున దైవగుణములను పేర్కొనునపుడు మొట్టమొదట 'అభయం' అని నుడివినారు. దీనికి కారణమేమి? ఇరువదియారు సుగుణములను అర్జునునకు బోధింపదలంచిన శ్రీకృష్ణుడు తన ముఖారవిందములచే తొలుదొల్తనే 'అభయం' అను పదమును బల్కవలసిన అగత్యమేమి? కర్మ, భక్తి, యోగ, ధ్యాన, జ్ఞానములను పదునెనిమిది అధ్యాయములద్వారా అఖండముగ అర్జునునకు ప్రబోధమొనర్ప నెంచిన శ్రీ కృష్ణుడు ఓం ప్రథమములోనే —

"క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప"

అను నిర్భయత్వ, ధైర్యోత్సాహసూచక మహామంత్రమును ఉపదేశింపనేల? శ్రీ కృష్ణుడు బాగుగ ఊహించియే లోకమునకు అట్టి ప్రబోధము గావించినారు. ఏలయనిన, శాంతిసౌధమునకు భయరాహిత్యమే కవాటము. భయరాహిత్యమునకు ఆత్మజ్ఞానమే శరణ్యము. ఆత్మజ్ఞానమునకు ఉపనిషదాది సచ్ఛాస్త్రములే ఆధారభూతములు. అట్టి ఉపనిషదాదుల సారమే శ్రీ భగవద్గీత. కాబట్టి సచ్ఛాస్త్రకుసుమ గుచ్ఛములనుండి ఉద్భవిల్లిన దివ్యమకరందమై, బ్రహ్మవిద్యకు ఆలవాలమైనట్టి భగవద్గీత నాశ్రయించి, అందు ప్రబోధింపబడిన నిర్భయత్వ ("Be fearless")మంత్రమును సర్వదా జపించుచు శాంత్యానందముల నెల్లరును అనుభవింతురు గాక !!

ఓం తత్ సత్.



# * జ్ఞానయోగసారము *

( ఐ. పార్వతీనారాయణమూర్తి. )



**శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః॥**

భగవంతునిచేత అర్జునుని ఓదార్చుటకై వినియోగింపబడిన ఈ శ్లోకము తాను చెప్పబోవు గీతకంతకును ప్రాతిపదికము. ఇదియే గీతకు బీజాక్షరము. "దుఃఖింపదగని వార్లనుగూర్చి దుఃఖించుచున్నావు" అనుట లోనే, బ్రహ్మాండమైన వృక్షమంతయు విత్తనములో నిమిడియున్నట్లు, మొత్తము గీతాసారమంతయు ఇమిడియున్నది. ఇక తాను చెప్పబోవు జ్ఞానబోధను సూచనగ వెంటనే "ఆత్మజ్ఞానముగలవారు మరణించిన వార్లనుగూర్చియు, బ్రదికియున్న వార్లను గూర్చియు దుఃఖింపరు" అని చెప్పెను. చనిపోయినవార్లనుగూర్చి దుఃఖింపదగదు! ఎందుచేత? పరమాత్మని అంశమైన ఆత్మకు చావుపుట్టుకలు చెందవు గనుక అందువలననే 'అందరిదేహము చంపబడినను ఈ దేహములోగల ఆత్మ ఒకప్పుడున్ను చంపబడ దగినవాడు కాడు' (2 అ. 30 శ్లో.) అనియు, 'నిత్యమైనట్టి ఆత్మను ఏ ఆయుధ ములు ఛేదించలేవు. ఎట్టి అపాయములు అంటనేరవు' (2 అ. 23, 24 శ్లో.) అనియు ఆత్మయొక్క లక్షణములు విశదీకరించబడి నవి. కనుక చనిపోయిన వారిని గూర్చి దుఃఖింపదగదు. సమస్తప్రాణుల కాధార భూతుడును, మూలపురుషుడు ఐనట్టి భగ వంతుని తత్త్వమును గ్రహించి, అట్టివానిని పొందుటను ఏకైక లక్ష్యముగ ఎంచవలెను.

ఇక భగవత్సాన్నిధ్యము పొందుటకు తత్త్వజ్ఞాన మెంతవరకు సాయపడగలదు? అట్టి జ్ఞాని శ్రేష్ఠుడా? లేక భక్తి ఒక్క టియే ప్రాధాన్యమైనదా? అను సంశయము అర్జునునికి కలిగినట్లే మనందరకు కూడ



కలుగుతుంది. ఆ సందేహ నివారణముగానే భగవంతుడు 'ఎల్లప్పుడు యోగముతో కూడిన జ్ఞానియైనవాడు శ్రేష్ఠుడు. ఆ జ్ఞానికి నేను మిక్కిలిప్రియుడను. అతడు నాకు మిక్కిలి ప్రియుడు' అని భక్తుని కెంతప్రాశస్త్య మిచ్చెనో జ్ఞానియైనవానికిగూడ అంతటి ప్రాశస్త్యమిచ్చెను. కనుక ఎవ్వరేవిధముగ తన్నుపాసించిన వారి నా విధముగనే భగ వంతు డనుగ్రహించుచున్నాడు. జ్ఞాన యోగము విశదీకరించుటకై శ్రీకృష్ణుడు మొదట భగవంతుని తీరునుగూర్చి చెప్ప మొదలిడెను. ప్రకృతి అపరప్రకృతి అనియు

పరాప్రకృతి అనియు రెండు విధములు. సకలజగత్తు, చరాచర ప్రాణులు ఇవి అన్నియు అపరప్రకృతికి చెందినవి. కాని జీవస్వరూపమైనట్టిదియు, ప్రపంచమునంతయు భరించుచున్నదియునైన జీవశక్తి పరాప్రకృతిగ నెంచబడుచున్నది. ఇంకను లోకము క్షరము (సకల జడప్రకృతి) అనియు, అక్షరమనియు రెండు విధములుగ విభజింపబడియున్నది. ప్రతిప్రళయాంతమందును అక్షరప్రకృతి లేక దైవప్రకృతినుండి సమస్త జీవరాసులు అనగా జడప్రకృతి అంతయు ఉద్భవించును. పిమ్మట మరల ప్రతి కల్పాంతమందును క్షరమంతయు అక్షరములో తిరిగి లీనమగును. ఈ క్షరాక్షరప్రకృతుల కధిభూతుడైనవాడు భగవంతుడు. కనుకనే భగవంతుడు 'ఓ కుంతీపుత్రా! సాక్షిగనున్న నాయొక్క సన్నిధాన విశేషముచేత మాయయైనది స్థావరజంగములతో గూడిన ఈ ప్రపంచమును కలుగజేయుచున్నది. ఇట్టి (సన్నిధానవిశేషమనెడి) నిమిత్తముచే ప్రపంచము తిరుగుచునే యున్నది.' అని చెప్పెను.

ఈ విశదీకరణ 'చనిపోయిన వారిని గూర్చి శోకింపదగదు' అని భగవంతుడు చెప్పిన నిశ్చితాభిప్రాయము నెలాగు నిలబెట్టునో చూద్దాము. భగవంతునియొక్క అధిభూతములైనట్లుగనే జీవునికిని పర అపర ప్రకృతులు రెండును శారీరికములు. పరమాత్మ యెటుల ఆ రెంటికిని అతీతుడో, అటులనే ప్రతిజీవియందును పరమాత్మ అంశమైన జీవుడు సుస్థానమున నిశ్చలముగ నున్నాడు. చావుపుట్టుకలు, మార్పులు ఆ జీవునికి అంటనేరవు. పరమాత్మకును మనలోని జీవాత్మకును ఏ మాత్రముగాని భేదములేదు. కనుక ఈ జీవాత్మ, పరమాత్మ సంధానమునకు ప్రయత్నించు మార్గమే జ్ఞానయోగముగ నెంచబడుచున్నది.

కనుకనే 'జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే = జ్ఞానమను యజ్ఞముచే పూజించెడివారు ఈశ్వరుడైన నన్నే బ్రహ్మముగ నుపాసించుచున్నారు.' అని జ్ఞానులయొక్క లక్ష్యము చెప్పబడినది. వారికి ప్రపంచమంతయు బ్రహ్మమయమనియు, సకల జగత్తునకు మూలపురుషుడు భగవంతుడు, అను రహస్యము వెల్లడియైనది. మునులు ఈ దేహబంధమునుండి విముక్తి చెందుట అను మేలైన సిద్ధిని ఇట్టి ఉత్తమ జ్ఞానమువల్లనే బడసిరి.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని-
ర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి
భస్మసాత్కురుతే తథా॥

అగ్ని కట్టెలను దహించి భస్మముచేయు విధముగనే జ్ఞానము కర్మలను నశింపజేయుననియు, 'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।' జ్ఞానముతో సమానమైన పరిశుద్ధి చేయగలది వేరొకటిలేదనియు ప్రశంసింపబడినది. కనుకనే అట్టిజ్ఞాని చావు దేహమునకేగాని ఆత్మపరము కాదు. గనుక దుఃఖము నొందుటమానుము. అందులకే గీతాతత్త్వోపదేశ సారమంతయు సూచనగ నిమిడియుండుటచే

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ
నానుశోచన్తి పండితాః॥

అను శ్లోకము బీజాక్షరముక్రింద పరిగణించబడినది.



# అధ్యయనము  (ఏకాంక నాటిక.)

పి. హనుమంతరెడ్డి, పత్తికొండ.

[వామనదాసు ఆశ్రమము – బ్రాహ్మీ ముహూర్తము. శిష్యులు హరిచరణాదులు_ గీతాధ్యయనం. ]

హరి:_ పట్టపుఁ దేవులెనమండ్రు పదియాఱు నారు వేల ప్రియకాంతలు పైని రాధాలతాంగిఁ గూరి యస్ఖలిత బ్రహ్మచారియైన మారజనకుని నవనీతచోరు నెంతు.

ఎవఁడు కర్మేంద్రియమ్ముల నెదురుకొనియు విషయచింతలకడఁ దనర్పించుకొనునొ?
లోకమునకట్టి మూఢుఁడే శోకచక్ర వేసగాఁడును చొక్కంపు మోసగాడు.గీ.3_6

వామ:_ బలే, గీతాచార్యుడెంత నగ్నసత్యాన్ని ఘాటించాడో చూడు నాయనా! నీ సహాధ్యాయులకళ్ళే విడమఱచి చెబుతూపో.

హరి:_ అయ్యా! లోకాపవాదం, రాజదండనల్లాంటి బెడదలకు జడిసియో, లేక యితరత్రా పదవీ వ్యామోహపుటురులలో దవుల్కొనియో కర్మేంద్రియాలనేమో చిక్కబట్టి వీలుబడినపుడల్లా విషయసుఖాల చవిచూచే దాంభికాచారులకొక ఘాటైన మంచి తిరుగబోతిచ్చాడు. నిజంగా యీలాంటివాళ్లు లోకాని కుత్పాతగ్రహాలు గాకపోతే మఱేమవుతారు?

మనసుచే నింద్రియమ్ముల పని ముగించి యెవఁడనాసక్తబుద్ధి కర్మేంద్రియముల
చేత సేఁతలఁజేయునో యాతఁడొకఁడె మేటియోగ్యతఁ గలవాడు సూటిఁగనుమ.గీ.3_7
అని మనస్సుయొక్క ప్రయోజనాన్నెలా తారీఫుజేశాడో చూడు.

వామ:_ నాయనా! హరిచరణా! యిందులో బాహ్యాభ్యంతరముల కలయిక గలదు సుమా! యిదో! మనసును లోగొన్నా మానవుడు శారీరకంగా, అంటే కర్మేంద్రియాలతో నింత్రో, అంతో కర్మ సేయకుండా నిభాయించలేడు. కాని మనస్సు నదుపులో నుంచుకొన్నవాని చెవులేమో కాతరపు కూతల తెరువున కుంకింపక యీశ్వర భజనాన్నే ఆలకిస్తాయి. లోకములో భోగవిలాసాలని చెప్పేవానియం దభిరుచి సేయక యుదాత్తగుణ కీర్తనాలనే ఆదరిస్తాయి. అట్టి నరుఁడాత్మశోభ నలరారు కర్మలనే పాటిస్తాడు. అదే కర్మయోగము. నిజంగా కేవలము కర్మయొక్క బాహ్యత్యాగానికే మోక్షమబ్బేటట్లయితే సోమరితనానికే ప్రాధాన్యమిచ్చినట్లవుతుందికదా? చదువూ, నైష్కర్మ్యమంటే యేమి జెప్పాడో!

హరి:_
సేఁత మొదలిడ కొడిలోన చేతులిడిన
నరునకబ్బునె నైష్కర్మ్య మెఱుఁగుమీవె! (హోయి)
కర్మలను సన్యసించు టొక్కటను మాత్ర
మంత యగువగా సిద్ధి యమరఁగలదె 3_4

అంటూ, సన్యాసమంటే యేమిటి? త్యాగమంటే యేమిటి? అనే మాటెత్తి
ఫలము నాసించు సేఁతల మారుటేమొ? మేటి సన్యాసమనియును, సూటినెఱిఁగి
యెల్ల కర్మల ఫలము త్యజించుటేమొ! త్యాగమనియును నిగదింతురయ్య బుధులు18_2

ఇల ఫలాపేక్ష యుక్త కర్మల నొనర్చ పామరులకెంత శ్రద్ధయో? పండితులును
అంతవట్టుగ ఫలమింత యాసఁగొనక సేయవలెనర్జునా! జగచ్ఛ్రేయమునకు 3_25
అని యెంత మజాగా వ్రాసుచ్చాడో చూడు.

మధు:_ చెప్పొచ్చు కాని నన్నొక్క సందేహం బాధిస్తున్నది బాబా! అది తమ ముఖాన నివృత్తి చేసికోవాలి.

వామ:_ ఏమిటా సందేహం? యెందుకు సంకోచిస్తావు? విషాదంతో మునిగిన నరున్ని సమాధానంతో తేల్చిందే గీత, అదే భయ సందేహాలన్నిటిని తొలగిస్తుంది.

మధు:- సరే! ఫలాపేక్షారహితంగానే పనిచేయఁబూనుకుంటామనుకో, ప్రకృతి ప్రాబల్యానికి, యింద్రియాల స్వభావానికి తఱచుగా మానవుడు లొంగిపోవాలినే వస్తూందని సెలవిస్తూవచ్చాడే_అలాంటపుడు నరుడేమి చేస్తాడు? "ఆమె యాడించినట్లు నేనాడుచుందు" అన్నట్లుంటుందిగదా వ్యవహారమంతా.

డీకొనఁ దొడంగు దొడ్డ పండితునియొక్క మానసంబును సైత మమాంతముగను
బలిమిమై లాగి తప్పుత్రోవలకుఁ ద్రిప్పు దుండగములైన యింద్రియాదులు కిరీటి2_60
అని మెచ్చటిస్తూ

ఏ నొనర్పను యుద్ధమంచీవహంత సెంచేదేనియు నీ మాట చెల్లఁబోదు
ప్రకృతి నీచేత యీసేత పట్టుఁబట్టి విధిగ చేయించి వేయించు విజయభేరి 18_59
అని చెప్పినపుడిక మానవుని యత్నమేముంది గనక పట్టుకొని ప్రాకులాడుదాము. అన్నిటిని చేయించునది స్వభావమే నాయె. అపుడు భగవంతుడు తేరకాడే, భక్తుడు తేరకాడే? యీ తైతక్కలాటంతా అవిడదేగా.

శ్యామ:_ అబ్బా! యెన్నాళ్లీగా మదనపడుతున్నావోగా నాయనా! హరిచరణా! నీవును యీలాగే తటపటాయిస్తున్నావా!

హరి:_ స్వామీ! తొలుదొల్త నేనూ యీలాంటి చిక్కులో సతమతమవుతుండే వాణ్ణే.

మధు:_ ఓహో! యిపుడు బయటబడ్డావన్నమాట ఆచికంచిలోంచి.

హరి:_ మధూ! నీవూ నేనేమిటి? ఆ కిరీటిసైత మీకందరగోళములో నలుగుడుపడేగదా. "శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" (2_7) అని శరణుజొచ్చి "మయి సర్వాణి కర్మాణి సన్యస్యాధ్యాత్మచేతసా" (3_20) మొదలు "తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత" (18_ 62) వఱకు విని తెలిసికొని "నష్టో మోహః" "కరిష్యే వచనం తవ" మోహం తొలగింది, నీవు చెప్పినట్లే నడచుకొంటానన్నాడు. గాన యేమానవుడైనాసరే ముందు విషాదంలో మునిగి తేనేగాని భగవత్ప్రసాదము లభింపదు. విషాదమంటే ప్రాపంచిక జంజాటాలతోటి గోడాట కారాదు. యెంతసేపున్నా పారమార్థికాన్ని గురించిన యేడుపే కావాలి.

మధు:_ అలానే అనుకుందాము. కాని తమ్ముడూ

జ్ఞానియేనియు ప్రకృతిభావానుసార మల్లనమెలంగు, భూతమ్ము లెల్లఁగూడ
ప్రకృతినే యాశ్రయించుఁ గాబట్టి పట్టి పట్టుదల మాత్రమిక నేమి పనికివచ్చు. 3_33

అన్నపుడు యేయేడుపైతే మాత్రమేమి ఫాయిదా.

హరి:- యేయే యేడుపు కేయే ప్రయోజనముంటుంది అనేది అనుభవించినవాళ్లకే తెలుస్తుంది. నేను చెప్పే గోడులో భాషారహితమై, అనిర్వచనీయమైన మహత్తర శక్తి యేదో యొకటి డాగి హృదయతంత్రుల శ్రుతిఁజేసి రాతివంటి గుండెలనైనా నీరుగా మార్చేసే సుమధుర మోహనకళలుంటాయి. దీనికుదాహరణాలు కావలిస్తే పెక్కులున్నాయి. ప్రహ్లాదుడు, విభీషణుడు, ధ్రువుడు, అహల్య, పాంచాలి, గజరాజు, ముచుకుంద, కుచేల, కుబ్జ, సుదామాది భక్తుల యుదంతా లోకమాటు చెప్పుకు దెచ్చుకో.

వామ:- యీలాంటివి జెప్పాలనంటే యింకొక బృహద్గీతవుతుంది. మధూ! ఒక్కమాట. "యీను" అనే కామిలారోగము కనుల గ్రమ్మినపుడు కనుపడ్డవస్తువులన్నీ పచ్చగానే దోచినట్లు ఆసురస్వభావము గలవారికేవేవో మనసున దట్టుతుంటాయి. హరిచరణా! ఆసుర ప్రకృతిగుణాలేలాంటివో గుఱుతు జేయుము.

హరి:- ఏది సేయంగవలయునో? యేదివలదో? తెలియదాసురతత్వమ్ముగల నరులకు శుచియు సత్యము నడవడి సుంతయేని వారియందుండఁబోవు భీభత్సగాంచు. 16-7

ఇంకా అట్టివారలు

తనివిఁ దీఱని విషయవాసనలఁ జిక్కి క్రొవ్వి రొసరేగి జంభాల భోరులగుచు భ్రాంతిచే లేనిపోని కల్పనలఁ బెంచి సిగ్గుచెడికాని సేఁతలఁ జేయుచుంద్రు. 16-10

అట్టివారల కింకా

ఫాయిదాలేని యాశలు పనికిరాని పనులు తమ్మైన తెలివిచే భ్రష్టులగుచు ప్రకృతి మోహితచిత్తులై రాక్షసమును ఆసురములైన పనుల నేయాక శింత్రు9-12

యేనె! ధనవంతుఁడనిలకులీనుఁడనే నాకు సము (రి) డెవ్వఁడనె యజ్ఞములఁజేతుదానముల నివ్వఁగలను మోదమును గందు ననుచ యవివేకులై భ్రాంతిఁ గనుచు నుంద్రు. 16-15

తమ్ముఁదా మెచ్చికొనుచు పెద్దలను దెగడిసిరికి గర్వించి యభిమానమఱఁతఁజొక్కి దాంభికము చేతవిధిమీఱితమకమెచ్చిబిరుదులకునైన క్రతువులఁజరుపుచుంద్రు.16-17

లోక మీలాగుంటుంది గాబట్టి నరుఁడు బాగుపడాలినంటే ముఖ్యంగా మూటి నిడువాలి.

కలవు నరకాని కనుపు మార్గములు మూడు అవియనూ! ముప్పు తనకెప్పుఁడయినఁ గనుక కినుకయును కోర్కి పిసినాసితనములనెడు మూటి విడువంగవలయు కిరీటి నరుఁడు. 16-21

ఈ విధముగా కామక్రోధ లోభములను మూటివిడుచే నరు నుత్తమగతి నందింప సమర్థమని సెలవిచ్చాడు. ఇంకా ఉద్ధరణము, విషయవినివర్తత, స్థితప్రజ్ఞుడు మొదలగువాటిని గుఱించి మున్ముందు దవలోకిద్దాము. ఈ నాటికిక ముగిసింది - స్వామీ! సెలవా!

వామ:- ఆ మంచిది. ఆశ్రమకృత్యాలను చూచుకోండి.



# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము
శ్రీ. కీళాత్తూరు - శ్రీనివాసాచార్యులు.

( 1953 నవంబరు సంచిక 24 వ పేజీ తరువాయి. )

**తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।**
**సేనయో రుభయోర్మధ్యే సీదమాన మిదం వచః॥ 10**

భాష్యం:- ఏవం దేహాత్మనోః యాథాత్మ్యాజ్ఞాననిమిత్త శోకావిష్టం దేహాతిరిక్త - ఆత్మజ్ఞాననిమిత్తం చ ధర్మం భాషమాణం పరస్పరవిరుద్ధగుణాన్వితం, ఉభయోః సేనయోః యుద్ధాయ ఉద్యుక్తయోః మధ్యే, అకస్మాత్ నిరుద్యోగం పార్థం ఆలోక్య పరమపురుషః ప్రహసన్నివ - ఇదం ఉవాచ. పరిహాసవాక్యం వదన్నివ ఆత్మపరమాత్మ యాథాత్మ్య — తత్ప్రాప్త్యుపాయభూత - కర్మయోగ - జ్ఞానయోగ - భక్తియోగగోచరం "నత్వేవాహం జాతు నాసం" ఇత్యారభ్య "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" ఇత్యేతదన్తం వచనం ఉవాచ ఇత్యర్థః.



అను — ఇట్లు దేహముయొక్కయు, ఆత్మయొక్కయు యాథాత్మ్యము (స్వరూపము) తెలియమిని నిమిత్తముగాగల శోకముతో ఆవిష్టుడును, దేహాతిరిక్తమైన ఆత్మను తెలియుటను నిమిత్తముగాగల ధర్మమును మాట్లాడువాడును, పరస్పర విరుద్ధగుణములతో కూడుకొన్నవాడును, యుద్ధమునకై ఉద్యుక్తులైన రెండుసేనలమధ్య అకారణముగా నిరుద్యోగమును చెందినవాడునగు పార్థునిజూచి, పరమపురుషుడు "పరిహాసించువానివలె" ఈమాటను చెప్పెను. పరిహాసపు మాటలను చెప్పువానివలె ఆత్మ పరమాత్మ యాథాత్మ్య

తత్ప్రాప్తులకు ఉపాయభూతములగు కర్మయోగ, జ్ఞానయోగ, భక్తి యోగములను విషయములుగాగల "నత్వేవాహం" మొదలు "మోక్షయిష్యామిమాశుచః" వరకుగల మాటలను చెప్పెనని అర్థము.

విశే:— (1) "విషీద న్తమిదం వచః" అని పాఠము. "సీదమానం" అను పాఠమునే శ్రీ వేంకటనాథులు తాత్పర్యచంద్రికలో వ్యాఖ్యానించిరి.

(2) "ప్రహసన్నివ"=లోకములో, శోకమునకు కారణము "దేహామే ఆత్మ" అనెడి జ్ఞానము. 'దేహామే ఆత్మ' అను తలంచువానికి పుత్ర మిత్ర కళత్ర విత్తాది వియోగమువలన శోకము కలుగుచున్నది. ఎందుకనగా అవియన్నియు దేహామునకు సంబంధించినవి. "దేహామే ఆత్మ" అను నిశ్చయము కలవానికి జన్మాంతరముకాని, పాపపుణ్యాములుకాని, స్వర్గనరకములుకాని, హింసాహింసాది విచారములు కాని లేవు.

"దేహాముకంటె ఆత్మవేరు" అను జ్ఞానముకలవానికన్ననో, శోకమునకు ప్రమేయమే లేదు. నశ్వరస్వభావముకల దేహాదులు నశించుటనుజూచి అతనుశోకింపడు, కాని శాస్త్రనిషిద్ధమైన ప్రాణిహింసాదుల వలనకలిగెడు పుణ్యాపాపములకు, ధర్మాధర్మములకు యితను కట్టుబడి యుండును. మఱియు స్వధర్మ త్యాగమువలన అధర్మము సంభవించునని భీతిచెందును. ప్రకృతమున — అర్జునుని చూచిన, యితనికి దేహాత్మల యాథాత్మ్యము తెలిసినదా లేదా అను సంశయము కలుగుచున్నది. తెలిసినచో శోకింపనేల? తెలియనిచో స్వధర్మమును అధర్మముగా తలంపనేల? కనుక శోకము, స్వధర్మమున అధర్మబుద్ధి యివిరెండు నుండుటచే ధర్మసంకటములోనున్న అర్జుననిజూచి భగవంతునికి హాస్యము తప్పదాయెను.

(3) "ప్రహసన్నివ" పరిహాస సందర్భములో మాటలు అనాయాసముగావచ్చును. ఆ మాటలు సరసములుగాను, సులభముగా అర్థముచేసుకొనతగినవిగా నుండును. సమస్త వేదాంత శాస్త్రాదులలో నిగూఢములైన విషయములను పరమపురుషుడు పరిహాసవాక్యములను పల్కువానివలె అనాయాసముగా పల్కెనని భాష్యకారుల తాత్పర్యము.

(4) "అశోచ్యాన్ అన్వశోచ స్త్వం" అను శ్లోకము శాస్త్రారంభ వచనముగా నుండగా "నత్వేవాహం" అను శ్లోకమునే శాస్త్రారంభ వచనముగా భాష్యకారులు సాధించుట కుద్దేశ్యమేమనగా:— ఉప దేశసమయమున అవధానము అత్యావశ్యకము. అట్టి యవధానము గల్గుటకై అనేక వుపాయముల నవలంబించుట కలదు. ప్రకృతమున పరిహాసమును అవధాన సాధనముగా నవలంబించి పరమాత్ముడు పల్కిన "అశోచ్యాన్" అను శ్లోకముగూడా పరిహాసపుమాటవలె నున్నందున దానిని శాస్త్రారంభ వచనముగా చెప్పుట పొసగదు. కాన "న త్వేవాహం" అను శ్లోకమే శాస్త్రారంభవచనమని భావము.

శ్రీ భగవానువాచ:—

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచ న్తి పండితాః॥ 11

భాష్యం:- అశోచ్యాన్ ప్రతి అనుశోచసి. "పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః" ఇత్యాదికాన్ దేహాత్మస్వభావ ప్రజ్ఞానిమిత్తవాదాంశ్చ భాషసే। దేహాత్మస్వభావ జ్ఞానవతాం న అత్ర కించిత్ శోకనిమిత్త మస్తి। గతాసూన్ దేహాన్ అగతాసూన్ ఆత్మనశ్చ ప్రతి తత్స్వభావ యాథాత్మ్యవిదః న శోచన్తి। అతః త్వయి విప్రతిషిద్ధం ఇదం ఉపలభ్యతే యత్ "ఏతాన్ హనిష్యామి" ఇతి అనుశోచనం। యచ్చ దేహాతిరిక్త ఆత్మజ్ఞానకృతం ధర్మాధర్మభాషణమ్। అతః దేహస్వభావం చ న జానాసి, తదతిరిక్తం ఆత్మానం చ నిత్యం; తత్ప్రాప్త్యుపాయభూతం యుద్ధాదికం ధర్మం చ।

అను:— శోచింపదగనివారిని గూర్చి శోచించుచున్నావు. దేహాత్మ స్వభావప్రజ్ఞను నిమిత్తముగాగల "పతంతి పితరః" మొదలైన వాదములను భాషించుచున్నావు. దేహాత్మ స్వభావజ్ఞానము గలవారికి యీ విషయమున శోకమునకు నిమిత్తము లేనేలేదు. గతాసువులైన (నశ్వర స్వభావముగల) దేహములగురించియు, అగతాసువులైన (నిత్యములైన) ఆత్మలగురించియు — వాని స్వభావ స్వరూపముల నెఱింగిన (పండితులైన) వారు శోకింపరు.

కనుక 'వీరిని చంపబోవుచున్నాను (గదా)' అని శోకించుట, దేహాతిరిక్త — ఆత్మజ్ఞానమును నిమిత్తముగాగల ధర్మాధర్మ ములపల్కుట యివిరెండును నీయందు విరుద్ధముగా కన్పట్టుచున్నవి.

కాన (నీవు) దేహస్వభావమును నెఱుంగవు. దేహాతిరిక్తమైన — నిత్యమైన ఆత్మను యెరుంగవు. అట్లే వానిప్రాప్తికి ఉపాయభూతమైన యుద్ధాది ధర్మములనుకూడా యెఱుంగవు.

భాష్యం:— ఇదం చ యుద్ధం ఫలాభిసంధిరహితం ఆత్మయాథాత్మ్యావాప్త్యుపాయభూతం। ఆత్మా హి న జన్మాధీనసద్భావః న మరణాధీనవినాశశ్చ, తస్య జన్మమరణయోరభావాత్ । అతః సః న శోకస్థానమ్। దేహః తు అచేతనః పరిణామస్వభావః; తస్య ఉత్పత్తివినాశయోగః స్వాభావికః ఇతి సః అపి న శోకస్థానం ఇతి అభిప్రాయః ॥

అను:- ఫలాపేక్షలేక (చేయబడు) యీ యుద్ధమున్ను ఆత్మస్వరూపజ్ఞానమునుజెందుటకు ఉపాయభూతమైనది. ఆత్మకు జననమరణములు లేనందుచే — దాని యునికికి జననము కారణముకాదు. అట్లే (నాశము లేనందున) మరణము దాని వినాశమునకు కారణముకాదు. కనుక ఆత్మ శోకింపదగినది కాదు.

శరీరమన్ననో, అచేతనమును, పరిణామస్వభావము కలదిగానున్నది. దానికి ఉత్పత్తి — వినాశములతో సంబంధము స్వభావముగానేయున్నది. కానఅదికూడా శోకింపదగినదికాదు అనిఅభిప్రాయము.

విశే:— 'గతాసూన్—అగతాసూన్' అను పదములకు వరుసగా ప్రాణము లేనిది, ప్రాణముగలది అని అర్థము. కాని ప్రకృతమున అది పొసగదు. ఎందుకనగా కొందరు పండితులుకూడ ప్రాణసహిత — ప్రాణరహితములగూర్చి శోకించియుండుట ఇతిహాసపురాణములలో కానవచ్చుచున్నది.

మఱియు "అవ్యక్తోఽయం" మొదలగు రాగల శ్లోకములలో ఆత్మనుగురించి వర్ణించబోవుచున్నారు. కాన గతాసూన్ అనగా శరీరమనియు, అగతాసూన్ అనగా ఆత్మయనియు వ్యాఖ్యానింపబడినది.

"పండితాః" — ఇచ్చట పండితులనగా శాస్త్రజ్ఞానము కలవారనిమాత్రము అర్థముకాదు. మఱియేమనగా — "నశ్వరములైన దేహములు శోకింపదగినవికావు. అట్లే శాశ్వతములైనందున ఆత్మలు కూడా శోకింపదగినవికావు" అను ఊహాపోహ బుద్ధికలవారలే పండితులని అభిప్రాయము.

# గ్రంథస్వీకారము.

## 1. ప్రకృతిమాతృ శతకము:—

ప్రకాశకులు; ప్రకృతిమాత కార్యాలయము: పటమట పోస్టు. విజయవాడ.

పూజ్య శ్రీ సీతారామావధూతగారియొక్కయు సీరిపి ఆంజనేయులుగారియొక్కయు సంపాదకత్వమున వెలువడు 'ప్రకృతిమాత' అనెడి మాసపత్రికయందు, క్రమముగ వెలువడుచుండిన సమస్యాపూరణ పద్యములను నూరింటిని సేకరించి యీ శతకమును అచ్చొత్తించినారు. విద్వాన్ వేదము వెంకటకృష్ణశర్మగారి ప్రస్తావనతో పుస్తకము కవితాప్రియులకు యింపును కల్గించునదైయున్నది.

## 2. గీతాసాధనడైరీ. వెల రు. 1—12—0

అడ్రెసు:—సాధనగ్రంథమండలి. తెనాలి. సాధనగ్రంథమండలివారి సాహిత్యసేవ ఆంధ్రదేశానికి ఆదర్శప్రాయమైనది. గీతాసాధనడైరీని వెలువరించి యిప్పుడు వీరు గీతాభక్తులకు మహోపకార మొనర్చియున్నారు. ఇది గీతాయుగము. గీతాప్రచారము బహుముఖముల పరివ్యాప్తమై సాగిపోయెడి యీకాలమునందు గీతాడైరీని వెలువరించి వీరు గీతాప్రచారమునకు పుష్టిచేకూర్చినారు. హిందీభాషయందు గీతాప్రెస్సువారు ప్రకటించు గీతాడైరీలుతప్ప నాకు తెలిసినంతకు యీ విధమగు డైరీలులేవు. కన్నడభాషయం దొకప్పుడు వెలసియుండినవి కాని నేడు లభించుటలేదు. అపురూపమైన యీ కృషిని చేసిన సాధనమండలివారికి గీతావాణిపక్షమున మా ధన్యవాదములు. ఆ ఆదర్శసంస్థ నిరంతరాభివృద్ధి చెందునట్లు గీతాచార్యు డనుగ్రహించుగాక!

గీతాభక్తుడు ప్రతివాడును దగ్గర ఉంచుకోదగిన పుస్తకము. కార్యరూపమగు సహాయమొనర్చి ఆంధ్రజాతివారి ఉద్యమమునకు ప్రోత్సాహము కల్పింతురు గాక!

## 3. శ్రీ భగవద్గీతా అష్టోత్తరశతనామస్తోత్రం. 0—3—0

## 4. నారద పరివ్రాజకోపనిషత్. 1—4—0

ఈ రెండు గ్రంథములను శ్రీవ్యాసాశ్రమమువారు ప్రకటించియున్నారు. శ్రీ కృష్ణచరణంగారు రచించిన గీతా అష్టోత్తర శతనామస్తోత్రాన్ని మా గీతావాణియందు పునర్ముద్రించి దాని ఆవశ్యకతను చెప్పకయె నిరూపించినాము. ఈ గ్రంథము గీతాభక్తునికి ప్రతివానికిని ఉపాదేయము.

సన్యాసవిధి విధానములను సాకల్యముగ వివరించిన గ్రంథము నారద పరివ్రాజకోపనిషత్తు. ఉపనిషద్ వాఙ్మయము భారతీయులపాలిటి అమూల్యమగు నిధి. ప్రతియొక్క ఆశ్రమమునందును యీ గ్రంథము తప్పక ఉండవలెను.

## విశేష సంచికలు.

1. శాంతి పత్రిక:— శ్రీమదోంకారస్వాములవారి ఆధ్వర్యమున శ్రీ చైతన్యగారి సంపాదకత్వమున వెలువడు శాంతిపత్రిక అక్టోబరు నెల విశేషసంచిక మా కార్యాలయమునకు చేరినది. ప్రముఖ రచయితల అమూల్యవ్యాసములతో పత్రిక మిగుల రాణించినది.

2. మోక్షసాధని:— గుంటూరు శ్రీ రామనామ క్షేత్రమునుండి వెలువడు దైవిక మాసపత్రిక. భగవద్భక్తులు తెలుసుకొనదగిన అనేకాంశములతో ఒప్పారియున్నది.

## వార్తలు.

పూజ్యపాద శ్రీ శంకరానందస్వాములవారు మైసూరుస్టేటు అజ్జంపురమునందలి తమ సొంత ఆశ్రమమగు శ్రీ శివానందాశ్రమమునందు శ్రీ గీతాజయంతీ సప్తాహ మహోత్సవమును మహావైభవముగ నెరవేర్చినారు. ప్రతినిత్యమును సామూహిక గీతాపారాయణము జరిగినది. ఇరుపూటలును గీతోపన్యాసములు జరిగినవి. శ్రీ గీతానందగారి గీతాభినయముకూడ లెస్సగా నెరవేరినది. సప్తాహానంతరము శ్రీ స్వాములవారు కోయంబత్తూరుజిల్లా కొళ్ళేగాళం పోయి, హాస్పేట చేరుకొన్నారు.

శ్రీ రామకృష్ణగారు 20—12—53 నుండి 4—1—54 వరకు పాకాలయందు భాగవతోపన్యాసములు నిర్వర్తించుకొని 6 వ తేదీ నుండి 8 వ తేదీ వరకు వెంకటగిరిలోని దివ్యజీవన సంఘ పారమార్థికసభయందు పాల్గొన్నారు.

## గీతాజయంతీ మహోత్సవములు.

కళింగపట్టణం గీతామండలివారు గీతాజయంతి మహోత్సవమును వైభవోపేతముగా జరుపుకొన్నారు. సభకు ఉ॥వే॥శ్రీమాన్ తిరుమల పెద్దింటి నరసింహాచార్యులవారు అధ్యక్షత వహించారు. పుర ప్రముఖులు వుపన్యసించారు. ఆ సందర్భమున "భక్తి" అను చిన్న పుస్తకమును విరాళముగా పంచిపెట్టినారు.

కల్యాణదుర్గము ( అనంతపురము జిల్లా ) శాంతాశ్రమనివాసులగు శ్రీమహాదేవానంద స్వాములవారి అధ్యక్షత క్రింద గీతాజయంతి మహోత్సవము వైభవముగా జరిగినది. టి. యర్రప్ప ప్రభృతులు వుపన్యసించారు. బి. హనుమంతప్ప, చంద్రగిరి తిమ్మప్ప మొదలగు ఆర్యవైశ్య సంఘమువారు కార్యక్రమములో పాల్గొని సుసంపన్నమొనర్చినారు.

కడపజిల్లా పాలగిరిగ్రామము శ్రీ రామకృష్ణ సేవా మహిళా భజనసంఘంవారు స్థానిక దీనబంధు హైయ్యర్ యెలిమెంటరీ స్కూలు కరస్పాండెంటు శ్రీ మల్లంగి ఈశ్వరరెడ్డి గారి అధ్యక్షతతో గీతాజయంతి మహోత్సవము జరుపుకొన్నారు. శ్రీ ఓగూరు వెంకటసుబ్బయ్యగారు కుచేలోపాఖ్యానమును హరికథగా చెప్పినారు. శ్రీ రామకృష్ణనారాయణ గీతాసమాజము అను పేరుతో పురుషులకుకూడా స్థాపనముండునట్లు తీర్మానము చేయబడినది.

భాగేపల్లితాలూకా కొండమువారిపల్లి గీతాలాడ్జివారు గీతాజయంతిని శ్రీ ఎం. వి. భద్రయ్యగారి అధ్యక్షతతో జరిపినారు.

పాయసం రంగారెడ్డిపల్లెవారు భూమిరెడ్డిగారిలింగారెడ్డిగారి అధ్యక్షతతో గీతాజయంతీమహోత్సవాన్ని వైభవోపేతంగా జరిపినారు.

కాళహస్తి శ్రీ కైలాసాశ్రమమునందు శ్రీ శ్రీ శ్రీ నిత్యానందస్వాములవారి అధ్యక్షతతో గీతాజయంతి కార్యక్రమము మహావైభవముగ జరిగినది.

చిత్తూరు సమీపం రాజాజీ వెంగనపల్లె గ్రామం శ్రీ శివానందాశ్రమములో గీతాజయంతి మహోత్సవం పూజ్యపాద శ్రీ రామపురిస్వాములవారి అధ్యక్షతన అత్యంత వైభవోపేతంగా జరిగినది.

మిట్టూరు శ్రీ కుమారాశ్రమమువారు గీతాజయంతి మహోత్సవమును సక్రమముగా సవైభవముగా జరుపుకొన్నారు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలుగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళీవ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పేట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా. - 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం. కరీంనగర్ జిల్లా.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్ప రాజుగారు, గోసపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాట కొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని రామదాసు గారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. – 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్య గారు, చాగలమర్రి. – 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, – కోయిలకుంట్ల. –15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం.

కడపజిల్లా. 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ – 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. – 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 19. శ్రీ పెంటంశెట్టి శ్రీని వాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. – 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. – 25. శ్రీ నటుకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. – 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 30. శ్రీ ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు – 31. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకన గుర్తి. – 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తాలూకా. – 33. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డి గారు, కుందనగుర్తి. – 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. – 36. శ్రీ పెద్ద కదిరప్పగారు, కుందనగుర్తి. – 37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. – 38. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. – 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 41. శ్రీ శాకల ఆంజనేయులు

గారు, కుందనగుర్తి. – 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనారాయుడుగారు, కార్యాకురు.

మైసూర్ స్టేట్: 45. శ్రీకామబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 47. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 48. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 49. శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరే విరూపాక్షయ్యగారు, తొండేభావి, కోలారు. – 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. – 52. శ్రీ దేశముఖ్ వేసేపల్లి కొండలరావుగారు, నల్గొండ. – 53. నాగబండి విశ్వనాథంగారు, 12/38 మెట్టురోడ్డు, వరంగల్. – 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ – 55. శ్రీ గందె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ – 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్ –57. శ్రీతాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ – 58. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ – 59. శ్రీ మడూరు బసవలింగంగారు, వరంగల్ – 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ – 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ – 62. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు వరంగల్ – 63. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ – 64. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్.– 65 శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ – 66. శ్రీ సోమా నగసయ్యగారు, వరంగల్ – 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 68. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ – 69. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు, వరంగల్ – 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gullad thy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# గీతాంజలి





మూలము:- శ్రీ విశ్వకవి రవీంద్రుడు.

అనుసరణ:-

కొప్పరపు మల్లికార్జునరావు 'కళాశ్రీ'

కం॥ నీ వెటుపాడెదవో, నా
భావమునం దెలియలేను స్వామీ! నిరతం
బే వినెద నిలిచి మిన్నక
నీ విశ్వావృత నినాద నిశ్చలమతినై.

శా॥ నీ సంగీతమునందుఁ దోఁచు వెలుఁగందీభూతలోకంబు సం
భాసించుం దరణిప్రకాశమయి, జీవస్ఫారమౌ గాన వి
ద్యాసంచారము భూనభోంతరదిశావ్యాప్తంబునౌ బూతమౌ
నీ సంగీతఝరంబుఁ జొచ్చిపఱచున్ నిర్దాంతకష్టోపలన్॥

మ॥ అనయంబున్ భవదీయగానమున నైక్యంబొందుచుం బాడంగ, నా
మనముం గౌతుక మొప్ప నిచ్చఁగొను, నేమాత్రంబు వాక్చాలనం
బును గాంచం బ్రయతించు; వాకొనుటపుం బూనంగ, గానంబు రా
క, నిరాశం గడుబిట్టు కేకలిడుదుం గాంతాళచిత్తంబునన్॥

కం॥ నా మనము బందియై చనె నీమహనీయంపు గాననిర్మితమును, ని
స్సీమము, విశాలమగు, తం త్యామలమౌ వలను బద్ధమై; నాస్వామీ!

శా॥ నీ జీవాణువుతోడఁ దాకుచుయు మేనింగల్గు నా దేహ భా
గా జీవాత్మకమైనదం చెఱిఁగి ప్రాణాచారమం దెల్ల, నెం
దే జల్పంబగు దోసముల్ కనక యభ్యేష్టంబుఁగా, నిర్మలం
బౌ, జన్మంబును బుచ్చ సల్పెదఁ బ్రయత్నాళిన్ సతంబీశ్వరా!

ఉ॥ నా యెదలోన దర్కాన్వె డనంతముపు భావవలం దొకింత యెం
దేయెడ సత్యదూరమయి యేపగునట్టిది లేకయుండ, నే
చేయుదు యత్నమున్ దెలిసి చేవగు నెమ్మనమందు, నేను త
ర్కాయుతమైన వెల్గువెలయంగ నొనర్చెడు నీవె సత్యమున్॥

చ॥ జతన:    ఎప్పుడును సల్పెద, నా హృదయంబునందు నె
వ్వితః    సముం జొరక, వేవెని వోయెదున ఓటింగి, యిం
కితమగు నీదు ప్రీతమున కిల్బిషయుక్త మదీయమానసం
బతుకఁగఁజేతుఁ బ్రేమఁబ్రసవాంతరమందు మధుద్రవంబుగన్॥

కం॥ నా సేయు పనులలోనే నీసంగతిఁ దెలియఁజేయ నిరతము కృషినిం
జేసెద నీవె మహాత్మను భాసింపఁగ శక్తినిడెదు ప్రభుఁడవి యెఱుఁగన్॥



# గీతామతల్లి!

కవిరత్న, హరికథాధౌరేయ, విద్వాన్ బి. జి. రామరాజ భాగవతార్.
ఆత్మకూరు హైస్కూలు ప్రధానాంధ్ర పండితులు.



సీ॥ వైవస్వతాది మన్వంతర రాజర్షి
  తీర్థ సేవనముల వర్ధిల్లినావు
నరునుద్ధరింప రణక్షోణి నుప్పొంగ
  శౌరిముఖాబ్జమున జాలువారినావు
నాల్గుయోగముల నానాముఖంబుల దేలి
  భాష్యవీథుల దొర్లి పారినావు
కలిమలీమసముల గడుగుచు జిజ్ఞాస
  తృష్ణాకసుల దప్పిఁదీర్చినావు
గీ॥ అవ్యయానందమే మూలమగుచు ప్రకృతి
బింబరూపిణివై అజాండంబు నిండి
విశ్వమే ఏకమై నీవు వెల్గినావు
తల్లి! భువనైకవల్లి! గీతామతల్లి!

సీ॥ పాండవ కల్పితోద్దండ సేనలగాంచి
  దుర్యోధనుఁడు ధృతిఁదూలువేళ
జంకెన భీష్ముఁడుత్సాహంబుగా శంఖ
  మొత్తి సేనలకు చేయెత్తువేళ
ధంధణ ధ్వనుల ప్రత్యర్థి సేనలు ఉల్ల
  సిల్లుచు నటు తారసిల్లువేళ
రణభూమి పాండు కౌరవ్య సేనలమధ్య
  పార్థరథము నిలబడిన వేళ
గీ॥ భ్రాతృ, గురు, బంధు హత్యకు ఫల్గుణుండు
వివశుడై గాండీవము జారవిడుచువేళ
కృష్ణరూపేణ సాక్షాత్కరించినావు
తల్లి! భువనైకవల్లి! గీతామతల్లి!

మాఘ (గురు) పూర్ణిమ కానుక.

# గీతావాణి

32




[illegible] సంవత్సరము  ఎనిమిదవ సంచిక

[illegible] సాధు శ్రీ ఓంకారానంద.

## శ్రీ గీతా సాహిత్య సేవా సమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా

15 ఫిబ్రవరి 1954

# విషయసూచిక - ఫిబ్రవరి '54.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్యసేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వసందేశ మాసపత్రిక.






మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ

మేనేజర్:

స్వామి శ్రీ శివానంద.

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4-0-0. * విడి ప్రతిక 0-6-0.

15th FEBRUARY 1954.

# శ్రీ భగవద్గీతా సారము.

బాలకవి ఓ. నారాయణప్పగారు

## దశమాధ్యాయము — విభూతియోగము. 10

★

సీ॥ నీ విభూతులు నాకు నెఱిదెల్పుమన నరు
జూచి కృష్ణుండనె సురుచిరమతి
నోపార్థ! నేనౌదునొగివిష్ణు డాహరి
శశి శంక రాగ్నులు సామవేద
మవల నింద్రుండౌదు నల బృహస్పతి నేన
షణ్ముఖుండను నేన సాగరుండ
నసురుల బ్రహ్లాదుడగుదునే విద్యల
నధ్యాత్మవిద్య నేనౌదునయ్య!

గీ॥ నరుడ! నీవును నేనౌదు నరయుమయ్య!
ఏదిశుభమున కాంతిని నెసగునదియొ
యదియె నేనను హరిపల్కు లట్టిదెల్పు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!

### గీతామృత బిందువులు.

లోకంవల్ల తనకు ఏమి ఉపకారం? అని సంసారి తలస్తాడు. తనవల్ల లోకానికి ఏమి ఉపయోగం? అని కర్మయోగి విచారిస్తాడు.




సంపుటి 3 ☆ స్వస్తిశ్రీ విజయ * మాఘమ్. ★ సంచిక 8

# ఈ సంచికను గురించి

శ్రీ కృష్ణభగవంతుని అనుగ్రహముతో గీతాభక్తుల అవ్యాజ ప్రేమతో గీతావాణి పత్రిక యథాశక్తి నరనారాయణసేవకై ముందంజవేయ నుంకించుచున్నది. ఈనాటి దూషితవాయుమండలములో దుర్గంధసాహిత్యమునకే పలుకుబడియెక్కువ. ధర్మమునకు మూడుకాళ్లువిరిచి నాల్గవకాలు సైతము విరుచు ప్రయత్నమునసుండు నేటి విక్షుబ్ధవాతావరణ జనాంగములో ఆధ్యాత్మిక ప్రచారమునకై సాహసించుట నిజమునకు యేటికి యెదురీదుట. అయినా, సహజ సౌజన్య స్వభావమునకు పరిచాయకముగా గీతావాణి విశేష సంచికను గూర్చి తమ ప్రమోదభరిత ప్రశంసలను పంపి మమ్ము పథమో

త్సాహితులనుగా – కర్తవ్యోత్తేజితులనుగా నొనర్చిన సమ్మాన్యులగు ఆంధ్రప్రముఖులకు, ఆంధ్రసోదరులకు యీ పత్రికాముఖమున మా వినమ్ర కృతజ్ఞతలను అందజేయుచున్నాము.

పవిత్రమగు శ్రీగీతాతత్త్వమును అనేక విధముల ప్రచారము చేయుట శ్రీ గీతాసాహిత్య సేవాసమితివారి ఆశయము. తదాశయ సిద్ధికై, కవులు - పండితులు - రచయితలు - ప్రచారకులు - ధనికులు - భక్తులు, వారు వీరనక యావన్మందియు, యీపుణ్యయజ్ఞమున తమ అమూల్య సహాయమును ముక్తహస్తములతో ప్రసాదింపవలసి యున్నది.

పూజ్యపాదులగు శ్రీ శ్రీ శ్రీ నిర్వికల్పానందస్వాములవారిని గీతావాణి పత్రికకు వ్యాసము వ్రాసి పంపుడని లోగడ అభ్యర్థించి యుంటిమి. వారు అవ్యాజానురాగముతో యీరచనను – యీగ్రంథమును – శ్రీ గీతాసూత్రరత్నమాలను, వ్రాసిపంపి, దీనిని **గీతావాణి** యందు ప్రకటించుకొనుడని సెలవిచ్చిరి. ఈ రచన నంతయు ఒక్కే పత్రికయందు ప్రకటించుట బాగనియుకూడ సూచించిరి.

భారతీయ వాఙ్మయ చరిత్రయందు సూత్రరచనలకొక యుగమే వెలసినది. విస్తారమగు విషయమును కొద్దిమాటలలో పరిమితించి అసందిగ్ధముగ చెప్పుట సూత్రపద్ధతి. కంఠస్థముచేసికొనుటకును జ్ఞప్తిపెట్టుకొనుటకును యీ సూత్రము నెంతయొ ఉపకరించును. వైదికయుగము తర్వాత సూత్రయుగమె రాజ్యమేలినది. షట్ శాస్త్రములు – షడ్ దర్శనములు, సూత్రరూపగ్రథితములు. ధర్మసూత్రములు – భక్తిసూత్రములు, సర్వతోముఖ విశ్రుతములు.

భగవద్గీతయందు యేడువందల శ్లోకములలో నుడివిన తత్త్వమంతయు యిన్నూటనలభైఐదు సూత్రములలో పొదువబడినది.

పండిన తత్త్వవేత్తలు, ఆంధ్రతాత్త్విక సాహిత్యక్షేత్రమున అగ్ర పూజకర్హులునగు శ్రీ నిర్వికల్పానందస్వాములవారి తెలుగు సేఁతతో వెలసిన యీసూత్రగ్రంథము గీతాప్రియులకొక అపురూపమగు సరి క్రొత్తవస్తువు. స్థాయిగ పదిలపరచుకొనదగిన పవిత్రప్రసాదము.

చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమునుండి వెలువడు శ్రీ రామ కృష్ణప్రభా పత్రికకు ప్రథమ సంపాదకులుగ నుండినవారును, శ్రీధరీయ టీకావిశేషాంశములతో భగవద్గీతను వ్రాసినవారును, శ్రీ వ్యాసాశ్రమమువారిపక్షమున యోగవాసిష్ఠమును — శాండిల్య భక్తి సూత్రములను అనువదించినవారును, సాధన గ్రంథమండలివారు ప్రకటించిన భారతీయ తత్త్వశాస్త్రము మొదలగు గ్రంథములను రచించినవారును, ప్రస్తుతము సమగ్రశాంకరసాహిత్యమును ఆంధ్రీ కరించెడి మహోద్యమమున నిమగ్నులై యున్నవారును నగు శ్రీ నిర్వికల్పానందస్వాములవారిని పాఠకులకు పరిచయముచేయఁబూనుట వ్యర్థశ్రమమాత్రము. వారు స్వతః పరిచితులు.

పవిత్రమగు యీ ప్రసాదమును పరమపుణ్యమగు మాఘ పూర్ణిమా సుసందర్భమున గీతావాణి పాఠకుల కరకమలములందు సమర్పించుచు మురిసిపోవుచున్నాము. శ్రీ గీతాచార్యుఁడెల్లరను అను గ్రహించుగాక !!





# కొన్ని మాటలు.

## ( శ్రీ గీతాసూత్ర రత్నమాల. )

"భారద్వాజీయ ప్రణవబ్రహ్మజ్ఞానానంద సూత్రరత్నమాల" యను పెద్ద పేరుగల ఈ చిన్న గ్రంథమును, గీతా సూత్రములు అనదగు దానిని 1946 లో విశాఖపట్టణమున శ్రీ పి. గోపాలకృష్ణమూర్తి అను యింజనీరుగారు నాకు యిచ్చియుండిరి. అది వ్రాతప్రతి. దానికి విశేష వ్యాఖ్య తెలుగులో వ్రాసి, నేను ప్రచురించిన లోకమున కుపయోగపడు నని వారి భావము. నేటికి యీరీతిగనైనను — విశేషవ్యాఖ్య కాకుండి నను – సులభ తాత్పర్యముతోనైనను — ప్రచురింప గలుగుచున్నాను. ఈ గోపాలకృష్ణమూర్తిగారు దివంగతులు. వారి ఆత్మ ఊర్ధ్వలోకము నుండి ఈ మా ప్రయత్నమును తర్పణముగ గ్రహించి తృప్తినందునని యే నా విశ్వాసము.

ఈ సూత్రనిబంధనకర్త యెవరో తెలిసికొనుటకు వీలులేదు. ఏతత్ జాతీయగ్రంథములకుండు మాహాత్మ్యపారాయణ విధులు, ఈ సూత్రము నకుగూడ గలవు. 'నవీన' పాఠకులకు శ్రద్ధ నుద్దీపింపజేయు, అవి తోడ్పడ కుండుటచే, వానిని ముద్రించుట లేదు. ముద్రణాయంత్రాదిక రూపమగు ఆధునిక ప్రచారసౌకర్యములు లేని ప్రాచీనయుగమున గురు శిష్య ప్రశిష్య రూప వంశమున స్రోతోరూపమున నిలచియుండుటకుగాను, మనవారు మాహాత్మ్యాదివర్ణనారూపమగు ఉపాయమును అవలంబించియుండిరి. అస్తు.

ఇప్పుడు మనకు యీ గ్రంథమును సంతరించిన దెవరో తెలిసికొను మార్గము లేదు. భరద్వాజుడా ? ప్రణవానందుడా ? బ్రహ్మానందుడా ? జ్ఞానానందుడా ? లేక యీ మూడు పేర్లలో ఒకపేరు దాల్చి, భరద్వాజ గోత్రము నలంకరించిన మహనీయుడా ?

ఎవరైనను కానిండు. పత్రపల్లవ గణన మొనర్చి, కాలహరణ మొనర్పకుండ రసాలఫల భక్షణ మొనర్చి తృప్తినందుటయే మన పని. మహామేధావియగు ఈ ప్రాజ్ఞ వ్యక్తి, విమానాధిరోహణ మొనర్చి భూచక్ర మును తిరిగి రా తత్తరపడు మన బిత్తరి చిత్తములకు, ఈ కాలమున దినమునకు గంటన్నర కాలమును గీతా సప్తశతీ పారాయణమున "వ్యర్థ

పుచ్చుటకు" అవకాశముండదని గ్రహించియే కాబోలును; అల్పాక్షర సమన్వితమగు ఈ సూత్ర గ్రంథమును రచించినట్లు తోచుచున్నది.

గీతనంతటిని అహరహము చదువజాలనివారు ఈ సూత్రపంక్తుల ననుదినము అనుసంధానించిన చాలును. గీతాహృదయము తెల్లమగును.

ఈ భావముతోడనే దానికి తెలుగుమార్చి ప్రకటించుచున్నాము. ముక్కోటి ఆంధ్రులలో యే ఒక్కరికైనను, ఈ గ్రంథరత్న ముపయోగ పడిన చాలును. నా పరిశ్రమ సఫలమని హర్షింతును. దీనిని లోకమునకు అందించుచుండిన "గీతాసాహిత్య సేవాసమితి" వారిని అభినందించుచు ముగించుచున్నాను. శివమస్తు.

శ్రీరామకృష్ణమఠ్,<br>P. O. బేలూరుమఠ్,<br>వెస్ట్ బెంగాల్.

ఇట్లు,<br>శ్రీ నిర్వికల్పానందస్వామి.<br>22—1—54.

# రచయితలకు విజ్ఞప్తి.

"1. ఆంధ్రలో గీతాప్రచారము, 2. సుప్రసిద్ధులగు గీతాప్రచారకులు" అను యీ రెండు విషయములను గురించి వ్యాసములువ్రాసి పంపవలెననికోరుచున్నాము. ఆంధ్రభూమిలో గీతాప్రచారమునకు దాదాపు మొదలెప్పుడు? ఎవ్వరెవ్వరిద్వారా అది విజృంభించినది? అల్పముగనో అధికముగనో ఆ ప్రచారక్షేత్రమున పరిశ్రమించిన మహనీయులెవరెవరు? ఆంధ్రభాషలో గీతకు సంబంధించిన వాఙ్మయసూచిక; వాటిప్రాశస్త్య వివరణము. — అను అంశములు మొదటి వ్యాసమునకు సంబంధించినవి. రెండవ వ్యాసమునందు ఆయా గీతాప్రచారకుల సంక్షిప్త జీవిత విశేషములను క్రమముగవ్రాసి పంపవచ్చును.

ఇట్లు,<br>సంపాదకుడు.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ గీతాసూత్రరత్నమాల.

అనువక్త- శ్రీ నిర్వికల్పానందస్వామి,

శ్రీరామకృష్ణమఠ్, P. O. బేలూరుమఠం. (కలకత్తా)

## ప్రథమపాదము.

**1. అథాతో గురుజిజ్ఞాసా.**

అనంతరము గురువును అనగా బ్రహ్మమునుగురించి చింతింపబడుచున్నది.

**2. సత్తు తుల్యత్వాత్.**

సద్రూపవస్తువే గురువును పరబ్రహ్మమునుగూడ; అందువలననే గురుచింతనమే పరబ్రహ్మచింతనము. పరబ్రహ్మచింతనమే గురుచింతనము. ఈ సద్రూపవస్తువు కేవలము గురుబ్రహ్మము లగుటయేకాక తుల్యరూపమున సర్వత్ర నిండియున్నది.

**3. యో నివేదత్వాత్.**

ఈ బ్రహ్మమును గురించి ఇట్లే ప్రస్తావింపబడినది.

**4. అహం త్వం జాతు నాసమిత్యేవత్వాత్.**

నీవును నేనును పుట్టినదియును గిట్టినదియును లేదు - అని నుడివియుండుటవలన నీయొక్కయు నాయొక్కయు గురువుయొక్కయు శిష్యునియొక్కయు లోపల నిండి యీరీతిగ సర్వమై యేకాత్మరూపమగు బ్రహ్మమే కలదని తేలుచున్నది.

**5. కౌమారాద్యథా తథా.**

బాల్యయౌవనవార్ధక్యాదులవలె మృతికూడ శరీరమునకు సంబంధించిన మార్పే కాని జీవాత్మకు సంబంధించినది కాదు.

**6. మాత్రాస్పర్శా ఆగమాపాయిన-రతాః.**

ఇంద్రియసుఖములు అశాశ్వతములు- అవి తటస్థించినట్లే తొలగిపోవుచుండును గూడ.

**7. సమత్వాదమృతత్వమ్.**

సుఖదుఃఖాదులయెడ సమదృష్టి కలవాడు అమృతత్వమును బొందును.

**8. నాసతో విద్యతేఽభావాత్.**

అసద్వస్తువు లేనిదే యగుటవలన దానికి ఉనికి లేదు.

**9. సర్వమిదమవినాశిత్వాత్.**

ఈసర్వమును అవినాశస్వరూపమగుటవలన సద్వస్తువయగు ఆత్మయే.

**10. నిత్యత్వాదప్రమేయః.**

ఈ ఆత్మవస్తువు నిత్యస్వరూపమును ఏకస్వరూపమును అగుటవలన అప్రమేయ

ము. లౌకిక ప్రమాణములవలన దాని నెఱుంగ జాలము. అది మన ఆత్మయగుటవలన, ఆత్మయే మనమగుదుము. కాన, యెరుగునదియును యెరుగబడునదియును ఉండజాలదు.

**11. హంతారమాది న విజానీతః.**

చంపునది చంపబడునది మున్నగు విశేషములు లాత్మకుగలవని మూర్ఖుడే తలచును.

**12. న జాయతేఽజః.**

అజము అనగా జన్మము లేనిదగుటచే ఈ ఆత్మకు పుట్టుకయే లేదు.

**13. వేదాఽవినాశిత్వాత్.**

అవినాశస్వభావి యగుటవలన మృత్యువుకూడ లేదని గ్రహింపుము.

**14. జీర్ణాని యథా విహాయాపరాణి గృహ్ణాతి తథా.**

శరీరము జీర్ణవస్త్రములను త్యజించునట్లు, శరీరి జీర్ణశరీరములను విడుచుచున్నాడు.

**15. సర్వగతత్వాదచ్ఛేద్యః.**

సర్వమును నిండి ఆవరించుకొనియుండుట వలన ఆత్మ అస్త్రశస్త్రాదులవలన ఖండింపబడదు.

**16. నిరుపద్రవత్వాత్ నిత్యః.**

నిండుటయును తగ్గుటయును లేనందు వలన ఆత్మ నిత్యస్వరూపి.

**17. అవ్యక్తత్వాదచిన్త్యః.**

ప్రకృతివలె ఆవిర్భావము దీనికి లేనందువలన, ఈ ఆత్మ మనస్సుయొక్క చింతకు అతీతమై, అచింత్యమై యున్నది. (కాని యిది మనయొక్క స్వరూపమే యగుటవలన ఐక్యము సిద్ధముగ నేయున్నది.)



**18. నిత్యం జాతం మృతం వా దేహసంయోగిత్వాదచింతనీయః.**

శరీరముతో కూడినందువలన, దానికి జనన మరణములు నిత్యముగ సహజముగ నున్నవని యెందువా: అట్లగుచో దీనిని గురించి చింతింప నక్కరలేదు.

**19. జాతస్య జన్మమృత్యూ ధ్రువత్వాత్.**

ఏలయన — పుట్టుకగల జీవికి, చావును మరల పుట్టుకయును ధ్రువములు.

**20. అనాదినిధనాదవ్యక్తత్వాత్.**

**21. అగోచరత్వా దాశ్చర్యవత్ పశ్యంతి.**

అనాదికాలమునుండియు ప్రకాశించునదియును, — "ఇది స్థితి కాలము" అని నిర్ణయింపబడిన ఒకానొక కాలముననే ప్రకాశింపబడి తదితరకాలముల ప్రకాశింపబడనిది కాకపోవుటవలనను, — ఇంద్రియగోచరము కాకపోవుట (అవ్యక్తమగుట) వలనను, — లోకమున కంతకును ఆశ్చర్యమును బుట్టింపగల ఒకానొకవ్యక్తియే, దీనిని తానుగూడ విస్మితుడగుచు చూచుచున్నాడు.

**22. సర్వాత్మకత్వాదవధ్యః.**

ఇది సర్వాత్మకమై సర్వత్ర సర్వకాలముల నిండియుండుటవలన, — ఒక కాలమున ఒక జీవరూపమున ఒకచోట ప్రకాశించిన ఖండమును చంపి, చంపినామనుటకువీలులేదు. అట్లూహించుట ఆకాశమును కత్తితో నరికినామని సంతోషించుటయే. కనుక యీ ఆత్మ అవధ్యము.

**23 అవ్యవసాయినాం బుద్ధయో అనేకత్వాత్.**

ఏకాగ్రత లేనివారి బుద్ధులు చంచలమై అనేకవిధముల పరుగిడుచుండుట వలన, ఏకాత్మతత్త్వము బోధపడదు.

**24. వాదరతానాం కర్మణ ఏవ ముఖ్యత్వాత్.**

కర్మవాదులు కర్మపరులగుటవలన జ్ఞానరూపమగు ఏకాత్మతత్త్వము బోధపడదు.

**25. కామాత్మానాం జన్మకర్మఫలప్రదకర్మరతత్వాత్.**

సకాములు మరియొక జన్మమును బొందించు కర్మముల నొనర్చుచుండుటవలన జన్మరహితమగు ఏకాత్మతత్త్వము వారికి బోధపడదు.

**26. భోగాసక్తానాం బుద్ధ్యనేకత్వాత్.**

అటులనే భోగాసక్తులగు వారి బుద్ధులుకూడ అనేకవిధములుగ చాంచల్యము నందుచుండుటవలన, అచంచలమగు ఏకాత్మతత్త్వము బోధపడదు.

**27. వేదానాం గుణత్రయవిషయత్వాత్.**

గుణత్రయాధీనములగు వైదిక కర్మకాండోక్తకర్మముల నొనర్చువారుకూడ, ఈ ఆత్మ గుణాతీతమగుటవలన, దీనిని పొందజాలరు.

**28. బ్రహ్మణోఽన్య విజానతః కృతకృత్యత్వాత్.**

వైదికజ్ఞానకాండోక్తమగు ఈ బ్రహ్మము నెరిగినవాడొక్కడే కృతకృత్యుడగును.

**29. కర్మఫలాసక్తత్వాచ్ఛరీరగమనమ్,**

ఫలమును బొందు కోర్కెతో కర్మముల నొనర్చిన పుట్టుక తప్పదు.

**30. సిద్ధ్యసిద్ధిసమత్వాద్యోగః.**

ఫలాఫలములను లెక్కచేయకుండిన యోగము, అనగా యేకాగ్రత లభించును.

**31. కర్మఫలాధికారం బంధహేతుః**

క్రియాఫలములను కాంక్షించుటయే బంధహేతువు.

**32. ఉభే విద్వాన్ జహాతి.**

విద్వాంసుడు పుణ్యపాపములను రెంటిని త్యజించి, అధిగమించును. మహత్పుణ్యావశమున నే మోక్షము లభించినను మోక్షదశయందు సువర్ణ లోహ శృంఖలా సదృశములగు పుణ్యపాపములు రెండును విడిపోవును.

**33. జన్మబంధవినిర్ముక్తాః పరం గచ్ఛంతి.**

జనన మరణ రూపమగు పాశమునుండి విడివడినవారు పరమపదమునకు బోవుదురు.

**34. మోహం యదా తరిష్యతి వైరాగ్యోత్పత్తిస్తదా.**

మోహము నతిక్రమించినప్పుడే వైరాగ్యము కలుగును.

**35. శ్రుతిప్రతిపన్నాత్వాదచలా సమాధిః.**

వేదాంతవాక్యములవలన సంస్కరింపబడిన చిత్తముననే అచలమగు సమాధి సుఖము లభించును.

**36. సర్వాన్ కామాన్ యదా జహాతి, తదా జీవన్ముక్తిః.**

విషయవాసనల నన్నిటిని విడిచి నప్పుడే జీవన్ముక్తి.

**37. కూర్మోఽంగానీవేంద్రియాణి సంహరతే తస్యాఽపరోక్షసిద్ధిః.**

తాబేలు అవయవములను ముణుచుకొనునట్లు, యింద్రియనిగ్రహము నొనర్చువానికే అపరోక్షసిద్ధి.

**38. విషయాన్ ధ్యాయత శ్చిత్తేషు సంగాత్ షడ్విధక్రోధోఽభిజాయతే.**

విషయములను చింతించువారి చిత్తమున విషయసంపర్కమువలన ఆరు విధములగు క్రోధము — అనగా అరిషడ్వర్గము జన్మించుచున్నది.

**39. బ్రాహ్మీస్థితేర్బ్రహ్మనిర్వాణమృచ్ఛతి.**

పైన చెప్పబడిన "విషయస్థితి"కి వ్యతిరిక్తమగు బ్రాహ్మీస్థితివలన బ్రహ్మనిర్వాణము జీవుడు బొందును.

**40. లోకే ద్వివిధా నిష్ఠా హి.**

లోకమున నిష్ఠలు రెండే; కార్యక్రమము ద్వివిధముగనే యుండును.

**41. సకామకర్మా, నిష్కామకర్మా చ**

సకామకర్మమును నిష్కామకర్మమును.

**42. సకామాచ్చిత్తశుద్ధిః.**

సకామకర్మమువలన చిత్తశుద్ధి.

**43. నిష్కామాత్ కైవల్యమ్.**

నిష్కామకర్మమువలన కైవల్యము.

**44. యజ్ఞశిష్టాశనాత్సర్వపాపనివృత్తిః.**

యజ్ఞానంతరము మిగులు ఉచ్ఛిష్టమును, పూజానంతరము మిగులు ప్రసాదమును భక్షించుటవలన సర్వపాపములును తొలగిపోవును.

**45. తద్ధేతుత్వాదాత్మసంతుష్టిః.**

దేవతార్పణమగు భోజనమగుటవలన ఆత్మసంతుష్టిని గూర్చును.

**46. తస్య కార్యం న విద్యతే.**

ముక్తపురుషుడు ఆచరించి తీరవలసిన కార్యము - కర్తవ్యము లేదు.

**47. సర్వక్రియాః ప్రకృతేః క్రియమాణాని.**

అదియును గాక ముక్తదృష్టికి క్రియలన్నియును ప్రకృతియే నిర్వహించుచున్నట్లు తోచును.

**48. స్వధర్మాదభయమ్.**

స్వధర్మాచరణమువలన అభయప్రతిష్ఠితుడగును.

**49. గుణకర్మవిభాగత్వాన్న సజ్జతే.**

గుణములును కర్మములును యెవరెవరికి చెందినవో నిర్ణయింపబడియుండినందువలన ఈ విభాగమునకు అతీతుడగు ముక్తపురుషుడు ఆయాకర్మముల నాచరించుచుండినను నిర్లిప్తుడుగనే యుండును.

**50. అహంకారనిరసనా త్స్వరూపప్రాప్తిః.**

అహంకార[illegible]ంచిన, ఆత్మస్వరూపప్రాప్తి.

**51. జనకర్తృవేతృత్వాన్న శరీరారంభః**

పైన చెప్పిన ఏకాత్మతత్త్వనిర్ణయ రూపమగు నిత్యదృష్టిని అవలంబించుట అసాధ్యమనిపించినచో; ఈశ్వరావతార లీలాతత్త్వమును చింతించినను పునర్జన్మ రహితమగు బ్రాహ్మీస్థితి లభించును.

**52. యథైవోపాస్తే తథైవ భవతి.**

ఉపాసన ననుసరించియే సిద్ధి. ఎవ డేరీతిగ ఉపాసించునో ఆత డట్లే యగును. లీలకూడ నిత్యునిదే. కనుక, లీలాతత్త్వ చింతారతులుకూడ నిత్యునే చేరుకొందురు.

**53. కర్మణాం సిద్ధిః క్షిప్రం హి.**

కర్మఫలము నాశించి ఉపాసించినచో వెనువెంటనే సిద్ధించి, అనిత్యమగుటవలన నశించిపోవును. కాని, భక్తిజ్ఞానములు ఆలస్యముగ సిద్ధించినను నిత్యమై నిలచును.

**54. సర్వమేవ బ్రహ్మ.**

సర్వమును బ్రహ్మమే.

**55. సంశయాత్మా న సుఖం ప్రాప్నోతి**

సంశయాత్మునకు సుఖము లేదు.

**56. తత్త్వవిచ్చిద్రూపః**

తత్త్వవేత్త చిద్రూపుడగును.

**57. సంయోగారూఢః, స్థితప్రజ్ఞో, జీవన్ముక్తః, కైవల్యో, గుణాతీతః, విదేహముక్తః, సమోక్ష ఇతి సప్తధోచ్యన్తే.**

తత్త్వవేత్తలు, సంయోగారూఢుడనియు, స్థితప్రజ్ఞుడనియు, జీవన్ముక్తుడనియు, కైవల్యుడనియు, గుణాతీతుడనియు, విదేహముక్తుడనియు, సమోక్షుడనియు యేడు విధములుగ చెప్పబడుచున్నారు.

**58. తత్పరాయణా న గచ్ఛంతి.**

బ్రహ్మపరాయణులు మరల యీలోకమును బొందరు.

**59. తత్రైకాగ్రస్థితత్వాన్ముక్తిః.**

ఏకాగ్రచిత్తముతో బ్రహ్మమున నెలకొనియుండిన ముక్తి లభించును.

**60. నివాతస్థదీపవదణిమాదిసిద్ధిః.**

చిత్తమును, గాలిలేనిచోట పెట్టిన దీపపువత్తివలె నొనర్పగలిగిన అణిమాదులగు అష్టసిద్ధులు లభింపగలవు.

**61. యస్సర్వత్ర పశ్యతి స బ్రహ్మవిత్**

ఎల్లయెడల బ్రహ్మమును కాంచగల్గిన వాడే బ్రహ్మవేత్త.

**62. సర్వభూతస్థితమేకత్వమ్.**

ఒకే ఆత్మ, సర్వభూతములలోను వెలయుచున్నది.

**63. న సర్వథా వర్తమానోఽపి యోగీ.**

బ్రహ్మవేత్త సర్వదా సర్వకార్యముల నొనర్చుచుండినను యోగభ్రష్టుడు కాకుండును. అతని కర్మనిర్వహణము కర్మము కాదు; యోగమే.

**64. సర్వత్రాత్మానం పశ్యతి యోగీ**

యోగిపురుషుడు సర్వత్ర ఆత్మనే వీక్షించును.

**65. అభ్యాసేన వైరాగ్యేణ వా మనః స్థిరం భవతి.**

నిరంతరాయమానమగు దీర్ఘాభ్యాసము వలనగాని, లేక విషయవైరాగ్యమువలన గాని మనస్సు స్థిరమగును.

**66. కల్యాణకృద్దుర్గతిం న ప్రాప్నోతి**

శుభాచారి యెన్నడును దుర్గతిని బొందడు.

**67. స ఏవ యోగీ.**

శుభాచారి యనగా ఏకాగ్రతాభ్యాస పరుడగు యోగియే లోకకల్యాణకరములగు యితర కర్మముల నొనర్చువాడు కాడు.

**68. తద్యోగభ్రష్టశ్శ్రీమతాం వా యోగినాం వాఽభిజాయతే.**

ఒకవేళ మధ్యలో యోగము చెడిపోయిన, ఆ సాధకుడు శ్రీమంతుల యొక్కయో, లేక యోగులయొక్కయో, గృహములలో జన్మించును. (అచ్చటనుండి సాధనను కొనసాగించి పరిపూర్ణతను సాధించును.)

**69. యోగజిజ్ఞాసుశ్శబ్దబ్రహ్మాఽతివర్తతే.**

యోగమును గురించి చర్చించువాడు కూడ కర్మఫలములను అతిక్రమించును.

**70. తపస్విభ్యో జ్ఞానీ జ్ఞానిభ్యః కర్మి కర్మిభ్యో యోగీ శ్రేష్ఠః.**

శుష్కతపస్వికంటె శాస్త్రజ్ఞానము గల పండితుడును, ఆ పండితునికంటె శాస్త్రోక్తకర్మముల నొనర్చువాడును, ఆకర్మికంటె చిత్తఏకాగ్రతను సాధింప బూనుకొను యోగియును, యథాక్రమముగ ఒకరికంటె మరియొకరు మిన్న.

**71. సద్యోగీ భక్తః.**

భక్తుడే సద్యోగి. సత్స్వరూపమగు బ్రహ్మమున మనస్సును నిల్పి — సత్యమున నెలకొనినవాడే సత్పురుషుడు. భక్తుడనిన అతడే. ఇదియే సద్భక్తి.

**72. అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః.**

త్రికరణశుద్ధిగ అహింసావ్రతము నవలంబించి సిద్ధినందినచో అతని సాన్నిధ్యమున వైరభావము పొడచూపజాలదు. ఇది అహింసాసిద్ధి లక్షణము.

**73. సత్యప్రతిష్ఠాయాం వరశాపప్రదానాధికారో భవతి.**

సత్యమునే వచించుచు చింతించుచు ఆచరించుచు ఈ వ్రతమున సిద్ధి బొందిన యెడల వరశాపముల నొసగగల అధికారము (శక్తి) లభించును.

ఇతి శ్రీమద్భారద్వాజీయ ప్రణవబ్రహ్మానంద సూత్రేషు

అకారజ్ఞానానందపాదః ప్రథమః॥ 1 ॥

ఇది ప్రణవబ్రహ్మానంద గీతాసూత్ర రత్నమాలకు శ్రీ నిర్వికల్పానంద స్వామికృత ఆంధ్రానువాదమున

ప్రథమ పాదము. ॥౧॥

ఓమ్.

## ద్వితీయ పాదము.

1. అనలోఽనిలః ఖమాపః పృథి-
వ్యహంకారమనోబుద్ధిరష్టధా.

నిప్పు నీరు మన్ను మిన్ను గాలి యను పంచభూతములును మనోబుద్ధ్యహంకారములును కలిసి మొత్తము యెనిమిది విధములుగ ప్రకృతి రూపొందుచున్నది.

2. తస్యోంకారో వాచకః.

ఆ బ్రహ్మమునకు ఓంకారము సంజ్ఞ.

3. తత్సర్వభూతానాం బీజమ్.

అది సర్వభూతములకును మూలము.

4. తదర్థభావనాత్తజ్జపాద్వా చిత్త
లయః.

దాని అర్థమును చింతించుటవలనగాని, లేక దానిని జపించుటవలనగాని చిత్తము లీనమగును.

5. సర్వం జగచ్చ తు గుణైరా-
వృతమ్.

జగత్తంతయును గుణములచే ఆవరింపబడి యున్నది.

6. తద్విజానంత ఏతాం దైవీం తరన్తి

బ్రహ్మమును లేక యీశ్వరుని యెరిగినవారే ఈ దైవీమాయయగు గుణములను అతిక్రమింపగలరు.

7. మాయయాఽపహృతజ్ఞానా
ఆసురం ప్రపద్యన్తే.

మాయవలన జ్ఞానభ్రష్టులైన వారు ఈ రాక్షసభావమును బొందెదరు.

8. తదాత్మాన ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ
జ్ఞానీ చ చతుర్విధాః.

ఈశ్వరపరాయణులు, (1) విపద్గ్రస్తుడు, (2) ఐశ్వర్యకాంక్షి, (3) జిజ్ఞాసువు, (4) జ్ఞాని అని నాలుగు విధములుగనుందురు

9. నిత్యయుక్తనియోగీ జ్ఞానీ.

అనన్యచిత్తుడై సర్వదా చిత్తమును భగవంతునియందు నియోగించువాడే జ్ఞాని.

10. ఉదారాస్సర్వ ఏవ.

ఈ నలుగురి భావము మంచిదే. నాకు ప్రియులే.

11. తేషాం జ్ఞానీ త్వాత్మైవమతం.

కాని ఈ నలుగురిలో జ్ఞాని నాకు ఆత్మయే.

12. బహూనామన్తే జన్మని సర్వం
వాసుదేవ ఇత్యేచ్ఛలో భవతి.

ఎన్నియో జన్మములు నిరంతర సాధనలో గడచినపిమ్మట, సర్వము వాసుదేవుడే యను ప్రత్యక్షజ్ఞానములభింపనిశ్చలుడగును.

13. స మహాత్మా సుదుర్లభః.

అట్టి మహాత్ములు చాల అరుదుగ నుందురు.

14. యో యో యాంయాం తను-
మర్చితుమిచ్ఛతి సతథైవ భవతి

ఏవ డేవ దేదేవతారూపమును అర్చించునో అతడట్లే యగును.

15. దేవయజో దేవాన్యాన్తి.

దేవతలను యజించువారు ఆయాదేవ తలలోకములనే పొందెదరు. (పుణ్యభోగానంతరము మరల యీ లోకమున జన్మింతురు.)

**16. తద్భక్తాస్తత్పదం యాన్తి.**

భగవద్భక్తులు భగవల్లోకమునే పొందెదరు. (కాని మరల యీ లోకమునకు తిరిగి రారు.)

**17. సత్కర్మణాం పాపమనంతంచేద్దృఢవ్రతో భవతి.**

పుణ్యపాపములు రెంటిలో యేదియో ఒకటి తీవ్రమైనప్పుడు మానవుడు దృఢవ్రతుడగును.

**18. తత్పదాశ్రిత్య జరామరణమోక్షాయ భవంతి.**

భగవంతుని సర్వదా ఆశ్రయించుకొని యుండినచో జరామరణములనుండి ముక్తి లభించును.

**19. తత్స్మరన్తస్తద్భావం యాంత్యంత్యకాలే.**

నిరంతరము యీశ్వరస్మరణమొనర్చు చుండిన మృత్యుకాలమునకూడ ఆ భావమునే బొందును.

**20. భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య యోగబలేన తత్పదము పైత్యంత్యకాలే.**

మృత్యుకాలమున యోగబలముతో భ్రూమధ్యమున ప్రాణమును నిల్పి భగవల్లోకమును బొందును.

**21. ఓమితి వ్యాహరన్ త్యజన్ తద్యాతి.**

ఓంకారోచ్చారణ మొనర్చుచు శరీరమును వదలి భగవల్లోకమును బొందును.

**22. నిత్యయుక్తస్య యోగినః సులభః.**

ఈ మార్గము నిత్యస్మరణకల్గిన యోగికి సులభము.

**23. తత్పదముపేత్య దుఃఖాలయం నాప్నువంతి.**

భగవల్లోకమును చేరుకొనినవారు దుఃఖనిలయమగు ఈ భూలోకమున మరల పుట్టరు.

**24. ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినః.**

భూలోకమునుండి (చతుర్ముఖ) బ్రహ్మలోకమువరకుగల స్థానములన్నియును పుణ్యక్షయానంతరము మరల జన్మమును బొందించునవే.

**25. అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమ్.**

ఇంద్రియగోచరమగుచు వినాశరహితమగునదే శ్రేష్ఠగతి.

**26. అహః శుక్లోత్తరాయణమగ్నిర్జ్యోతిరిడామార్గేణ బ్రహ్మపరం గచ్ఛంతి.**

సగుణోపాసనా పరిపక్వతనందిన ముముక్షువులు శుక్లపక్ష ఉత్తరాయణ అగ్ని జ్యోతి- అను దేవతల అధికారమునకు లోబడిన మార్గము ననుసరించి (చతుర్ముఖ) బ్రహ్మలోకమును చేరుకొందురు. అటనుండి తిరిగి రారు. ఇది ఇడామార్గము.

**27. రాత్రిః కృష్ణో దక్షిణాయనం ధూమః పింగళమార్గేణ ప్రాప్య నివర్తంతే.**

రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము ధూమము — అను దేవతల అధికారమునకు లోబడిన మార్గము ననుసరించి భోగాసక్తులగు పుణ్యపురుషులు చంద్రలోకమనబడు స్వర్గము ను బొంది, పుణ్యకర్మ ఫలక్షయానంతరము మరల యీలోకమునకు తిరిగివచ్చెదరు. ఇది పింగళ మార్గము.

**28. వాయురాకాశే యథా సర్వ-భూతాని మత్ స్థానీతి.**

ఆకాశమున వాయువు ఉండునట్లు నాయందు సర్వభూతములును వెలయుచున్నవి.

**29. కల్పక్షయే దైవీం యాన్తి.**

ప్రళయకాలమున యీ భూతసృష్టి దైవీమాయయందు లీనమగును.

**30. తదాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే.**

లీనజీవకర్మానుసారము మరల సృష్టికాలము పరిణతినందినప్పుడు యీశ్వరాధికారమునకు లోబడి ప్రకృతి మరల విశ్వము ను ప్రసవించుచున్నది.

**31. ఏకత్వేన పృథక్త్వేనావ్యక్తం యాన్తి.**

అద్వైతదృష్టితోనైనను లేక ద్వైతదృష్టితోనైనను, ఉపాసన నొనర్చిన లభించెడి ఫలము బ్రహ్మలోకమే.

**32. స్వధామంత్రౌ ష ధ మా జ్య మగ్న్యాది సర్వం తదేవ.**

పితృశ్రాద్ధము, వేదమంత్రము, ఔషధము, ఆజ్యము, అగ్ని - మొదలగునవన్నియును యీశ్వరుడే.

**33. సదసచ్చ తదేవ.**

స్థూలసూక్ష్మములగు వస్తువులుకూడ భగవంతుడే.

**34. త్రయీధర్మము నుప్రపన్నా ఇహలోకం విశన్తి.**

వేదోక్త కామ్య కర్మానుష్ఠానపరులు స్వర్గమునుబొంది, ఆయాకర్మముల ఫలమును అనుభవించి, మరల యీలోకమునకు వచ్చుచున్నారు.

**35. పితృవ్రతాః పితౄన్యాంతి.**

పితృదేవతోపాసకులు పితృలోకమునే పొందెదరు.

**36. భూతేజ్యా భూతాని యాన్తి.**

గణదేవతల నుపాసించువారు ఆయా గణదేవతల లోకమునే పొందెదరు.

**37. జుహోషి కరోష్యశ్నాసి తపస్యసి దదాసి యత్తదర్పణమ్.**

కాని నీవు నీ యజ్ఞ యాగ హోమాది క్రియలను, తదితర సర్వకర్మములను, తపస్సును, దానమును శ్రీకృష్ణార్పణ పూర్వకముగ నొనర్పుము.

**38. అనన్యభాగ్భజతే స మ్య క్ సాధురేవ దురాచారోఽపి.**

ఒకప్పుడు దుర్మార్గుడైనవాడే అనన్యచిత్తముతో యీశ్వరభజన మొనర్పనారం

భించిన ఆతనిని సత్పురుషునిగనే పరిగణింప నగును.

**39. స్త్రియో శూద్రా స్తదాశ్రిత్య పరాం యాన్తి.**

వేదాధ్యయనరహితులగు స్త్రీశూద్రులు కూడ భగవద్భక్తివలన తరించగలరు.

**40. జ్ఞానసత్యాశమసుఖక్షమాహింసామోహాదుఃఖాదిసర్వం తదేవ భవతి.**

లోకమున జీవులకు తటస్థించు మంచి చెడ్డలన్నియును పూర్వకర్మఫలానుసారము యీశ్వరునివలన నే ప్రసాదింపబడుచున్నవి.

**41. నిత్యయుక్తానాం బుద్ధియోగం తద్దదాతి.**

నిత్యనిరంతరముగ ప్రీతితో భగవద్భజన మొనర్చువారికి ఆయనే తత్స్వరూప ప్రాప్తిని బొందించు జ్ఞానయోగమును ప్రసాదించును.

**42. తత్సత్పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజమిత్యాహు స్సర్వే ఋషయః.**

సద్రూపమును, పురుషశబ్దవాచ్యమును అగు ఆత్మనే-బ్రహ్మమునే, దివ్యుడనియు ఆదిదేవుడనియు అజుడనియు ఋషులందరును గీర్తించుచున్నారు.

**43. ఆదిమధ్యాంతరహితాత్మా.**

ఆయన ఆదిమధ్యాంతరహితుడు.

**44. సర్వభూతాశయస్థితాత్మా.**

ఆయన సర్వజీవహృదయస్థితుడు.

**45. ఆదిత్యానాం విష్ణుర్జ్యోతిషాం రవిర్నక్షత్రాణాం శశీ వేదానాం సామవేదో దేవానాం వాసవ ఇంద్రియాణాం మనో రుద్రాణాం శంకరో యక్షరక్షసాం విత్తేశో వసూనాం పావకశ్శిఖరిణాం మేరుః పురోధసాం బృహస్పతిః సేనానీనాం స్కందస్సరసాం సాగరో మహర్షీణాం భృగురితి సర్వం తదేవ.**

ఆయనయే ద్వాదశాదిత్యులలో విష్ణువు; జ్యోతులలో సూర్యుడు; నక్షత్రములలో చంద్రుడు; దేవతలలో యింద్రుడు; ఇంద్రియములలో మనస్సు; ఏకాదశరుద్రులలో శంకరుడు; యక్షరక్షోగణములలో కుబేరుడు; అష్టవసువులలో పావకుడు; శిఖరములుగల పర్వతములలో మేరువు; పురోహితులలో బృహస్పతి; సేనానులలో కుమారస్వామి; జలాశయములలో సముద్రము, సప్తమహర్షులలో భృగువునునై వెలయుచున్నాడు. ఈ రీతిగ సర్వశ్రేష్ఠపదార్థములును ఆయనయేయని విభూతిధ్యానమొనర్ప నగును.

**46. గిరామస్మ్యేకమక్షరం యజ్ఞానాం జపయజ్ఞ స్థావరాణాం హిమాలయో వృక్షాణామశ్వత్థో దేవర్షీణాం నారదో గంధర్వాణాం చిత్రరథస్సిద్ధానాం కపిలోఽశ్వానాముచ్చైఃశ్రవో గజేంద్రాణామైరావతో నరాణాం**

నరాధిప ఆయుధానాం వజ్రం
ధేనూనాం కామధుక్ నాగానా-
మనంతో యాదసాం వరుణః
పితౄణామర్యమా సంయమ-
వతాం యమ ఇతి సర్వం తదేవ.

శబ్దములలో ఓంకారమును; యజ్ఞములలో జపయజ్ఞమును; స్థావరములలో హిమాలయమును; వృక్షములలో అశ్వత్థమును; దేవర్షులలో నారదుడును; గంధర్వులలో చిత్రరథుడును; సిద్ధులలో కపిలుడును; అశ్వములలో ఉచ్చైశ్శ్రవమును; గజములలో ఐరావతమును; నరులలో రాజును; ఆయుధములలో వజ్రమును; ధేనువులలో కామధేనువును; నాగములలో అనంతుడును; జలదేవతలలో వరుణుడును; పితృదేవతలలో అర్యముడును; దండధరులలో యముడును అగుచు భగవంతుడే వెలయుచున్నాడు. సర్వశ్రేష్ఠ పదార్థములును ఆయనయే నని ధ్యానమొనర్పనగును.

**47. దైత్యానాం ప్రహ్లాదః కలయ-
తాం కాలో మృగాణాం
మృగేన్ద్రః పక్షిణాం వైనతేయః
స్సర్గాణామాదిరంతశ్చ మధ్య-
మం చ విద్యానామధ్యాత్మ-
విద్యా ప్రవదతాం వాదో౽క్ష-
రాణామకారో నారీణాం శ్రీ
కీర్తిశ్చవాక్చస్మృతిర్మేధాధృతిః
క్షమా ఛలయతాం ద్యూతం
తేజస్వీనాం తేజస్సత్త్వవతాం
సత్త్వం గుహ్యానాం మౌనం
భూతానాం బీజమితి సర్వం
తదేవ.**

దైత్యులలో ప్రహ్లాదుడును; వశీకరణశక్తులలో కాలమును; మృగములలో సింహమును; పక్షులలో గరుడుడును; సృష్టుల ఆదిమధ్యావసానములును; విద్యలలో ఆధ్యాత్మమును; వాదజల్పవితండములలో వాదమును; అక్షరములలో అకారమును; స్త్రీగణమున ధర్మునిభార్యలగు శ్రీకీర్తివాక్కు-స్మృతి మేధ ధృతి క్షమలును; మోసములలో జూదమును; తేజస్వి పురుషులలో తేజస్సును; సాత్త్వికులసత్త్వగుణమును; గుహ్యములలో మౌనమును; భూతసృష్టికి మూలమగు బీజమును - ఈ రీతిగ సర్వశ్రేష్ఠ పదార్థములును సర్వమును భగవంతుడేయని ధ్యానింపనగును.

**48. చరాచరమేకాంశేన స్థితో
జగత్.**

చరాచరరూపమగు యీ జగత్తంతయును యీశ్వరుని యేకాంశమువలననే స్థితిని బొంది నిలచియున్నది.

**49. సహస్రశీర్షా సహస్రాక్షః సహ-
స్రపాద్విశ్వతోముఖస్తదేవ.**

సహస్రశీర్షుడనియు సహస్రాక్షుడనియు సహస్రపాత్తనియు విశ్వతోముఖుడనియు వేదసూక్తమున వర్ణింపబడిన పురుషుడు ఈ ఈశ్వరుడే.

**50. సర్వభూతేషు నిర్వైరస్తద్రూపం
పశ్యతి.**

ఎవరితోడను శత్రుత్వములేక సర్వజీవులను సమముగ ప్రేమించువాడే ఆ

యీశ్వరరూపమును దర్శన మొనర్పగలడు. ఇదియే భక్తుని లక్షణము.

**51. అవ్యక్తాసక్తచేతసాం క్లేశో౽ధికతరా.**

నిర్గుణబ్రహ్మోపాసనమొనర్చుట అందరకును సాధ్యముకాదు. అది చాల ప్రయాసముతో కూడినది. ఇది జ్ఞానమార్గము.

**52. కర్మఫలత్యాగాచ్ఛాన్తిమాప్నోతి.**

భక్తిజ్ఞానములు రెండునుగూడ దుస్సాధ్యములనిపించిన — కర్మయోగము నాశ్రయించి ఫలమును కృష్ణార్పణ మొనర్చినచో శాంతి అనగా జ్ఞానియును భక్తుడునుపొందు మోక్షమే లభింపగలదు.

**53. శత్రౌ మిత్రే చ మానావమానయోర్యస్సమస్స జీవన్ముక్తః.**

ముక్తిలక్షణమ యెట్టిదనిన; శత్రుమిత్రాదులగు సర్వప్రాణులయెడను మానావమానరూపములగు సర్వఘటనలయెడను సమత్వదృష్టి లభించుసితి. జీవన్ముక్తుడు యిట్టి బాహ్యలక్షణములతో - పరసంవేద్యమగు లక్షణములతో ఒప్పుచుండును.

**54. శరీరం క్షేత్రం వేత్తి సః క్షేత్రజ్ఞః.**

శరీరమే క్షేత్రము. దీని నెఱుగువాడు క్షేత్రజ్ఞుడు.

**55. సర్వక్షేత్రేషు విద్ధి తదేవ జ్ఞానమ్.**

సర్వశరీరములలో వెలయునది ఆయీశ్వరుడే, అబ్రహ్మమే, యని గ్రహించుటయే జ్ఞానము.

**56. అధ్యాత్మనిత్యత్వమితి జ్ఞానమ్.**

ఆత్మజ్ఞాననిష్ఠయే జ్ఞానోపాయము.

**57. నిజస్వరూపావసానమితి జ్ఞానమ్**

స్వస్వరూపబోధతో ముగియునదే జ్ఞానము. (ఈ మూడు సూత్రములలో జ్ఞానము వెదుకవలసిన తావును,ఉపాయమును, లక్షణమును చెప్పబడినవి. ఇదియే సర్వశాస్త్రముల సారము.)

**58. సర్వభృన్నిర్గుణం తదేవసగుణం**

నామరూపకల్పనకు బ్రహ్మము ఆధారమగుటవలన సర్వభృత్తు. వ్యవహారికదశయందు అదియే సగుణబ్రహ్మము, అనగా యీశ్వరుడగుచున్నది.

**59. తద్భక్తః తద్భావాయోపపద్యతే.**

ఈశ్వరునే ఆశ్రయించుకొని భక్తినిష్ఠ నొనర్చువారుకూడ బ్రహ్మభావమునే కోరినచో పొందగలరు.

**60. ప్రకృతిం పురుషం చ విద్ధ్యనాదీ**

ఈశ్వరుడును_మాయయు, అట్లే జీవుడును ప్రకృతియు అనాది. అనగా, ఇవి ఒక కాలమున సృష్టింపబడినవి కావు. కనుక యెట్లు యెప్పుడు యీప్రపంచము సృష్టింపబడినదను ప్రశ్నకు తావు లేదు. అయినను ఆశ్చర్యమేమనిన - జ్ఞానోదయమైనతోడనే యివి అన్నియును విలీనమై పోవును.

**61. పురుష స్సుఖదుఃఖానాం హేతుః.**

కర్మబద్ధుడగు జీవుడు సుఖదుఃఖము లను భోగించుచున్నాడు.

**62. సదసద్యోనిజన్మసు ప్రకృతి-జాన్ గుణాన్ భుంక్తే.**

ఉత్తమాధమయోనులందు జన్మించి స్వకర్మానుసారము ప్రకృతిసంబంధములగు గుణములను భోగించును.

**63. భర్తా భోక్తానుమన్తా చ పర-మాత్మా.**

బద్ధదశయందు, శరీరోపాధియందు పైన (62వ సూత్రమున) చెప్పినట్లు తోచుచున్నను వాస్తవమునకు యితడే యీశ్వరుడు, చైతన్యస్వరూపి, సాక్షి, సర్వేశ్వరుడు - అని గ్రహింపనగును.

**64. గుణైః సహ వేత్తి సర్వదా వర్తమానోఽపి నాభిజాయతే.**

గుణములతో గూడిన ప్రకృతియొక్క-మిథ్యారూపమును తాను అనగా జీవుని యొక్క బ్రహ్మభావమును గ్రహించినవాడు యీలోకమున యెట్లు మెలగినను మరల జన్మింపడు.

**65. కర్మణాం అకర్తారం స పశ్యతి.**

జ్ఞానిపురుషుడు కర్మచక్రము ప్రకృతి ఖేలనమనియు, (తాను కేవలము నిమిత్త మాత్రుడననియు) అకర్తయనియు వీక్షించును

**66. శరీరస్థోఽపి న కరోతి న లిప్యతే**

అట్టి జీవన్ముక్తపురుషుడు-లేక-ఆత్మ, శరీరమును ఆశ్రయించుకొనియుండినను, కర్మాచరణముగాని ఆ శరీర కర్మములతో లిప్తతగాని, ఘటిల్లదు.

**67. ఆకాశో యథా నోపలిప్యతే తథా.**

ఇందులకు దృష్టాంతము ఆకాశమే.

**68. ఇదమాశ్రిత్య సర్గేఽపి నోప-జాయతే.**

ఈ విధమగు జ్ఞానము కలిగినచో, నూతనకల్పమునగూడ పుట్టుక యుండదు.

**69. మహద్యోనిః బీజప్రదః పితా.**

ప్రకృతి యోని. ఈశ్వరుడు బీజప్రదుడగు పిత.

**70. అప్రకాశోఽప్రవృత్తించప్రమా-దో మోహ ఏవ తమోగుణాః.**

అజ్ఞానము, సోమరితనము, పొరబాటు, మోహము - అనునవి తమోగుణలక్షణములు. (కనుక, వానిని వర్జింపుము.)

**71. సత్త్వే ప్రవృద్ధే యాత్యుత్తమ-లోకాన్.**

సత్త్వగుణము ప్రబలముగ నుండినప్పుడు మృతుడైన దేవతాజన్మ లభించును.

**72. రజసి తథా కర్మసంగిషు.**

రజోగుణము ప్రబలముగ నుండినప్పుడు మృతుడైన మానవజన్మ లభించును.

**73. తమసి మూఢయోనిషు.**

తమోగుణము ప్రబలముగ నుండినప్పుడు మృతుడైన రాక్షసజన్మమో, లేక పశుక్రిమిపతంగాదిజన్మమో లభించును.

**74. త్రిగుణానతీత్యామృతత్వ-మశ్నుతే.**

త్రిగుణాతీతుడైన యెడలనే అమృతత్వము లభించును.

**75. యోనిరేవ మహద్బ్రహ్మ.**

మహత్తనబడు ప్రకృతియే ఈ లీలకు రంగభూమి.

**76. సర్వారంభపరిత్యాగీ గుణాతీతః**

త్రిగుణాతీతుడెవ్వడనిన — ప్రకృతి సంబంధములగు సమస్తకామనలను త్యజించినవాడే.

**77. అశ్వత్థం యో వేద స వేదవిత్.**

మాయామయమగు సంసారవృక్ష స్వభావమును తెలిసికొనినవాడే వేదవేత్త.

**78. ద్వంద్వైర్విముక్తా స్తదవ్యయం గచ్ఛంతి.**

సుఖదుఃఖాదులను జయించినవారే అవ్యయమగు బ్రహ్మపదమును బొందగలరు.

**79. న సూర్యో న చంద్రో తద్భాసయతే.**

స్వయంప్రభయగు ఆ పదమును సూర్య చంద్రాగ్ని విద్యున్నక్షత్రాది భౌతికజ్యోతులు ప్రకాశింపజేయజాలవు. ఈజ్యోతులు దాని కాంతివలననే వెలుగుచున్నవి.

**80. సనాతనో జీవభూతః.**

అనాదియగు భగవదంశమే లోకమున జీవునివలె తోచుచున్నది.

**81. స ఏవ మనః షష్ఠానీంద్రియాణి కర్షతి.**

ఈ జీవుడే స్వభోగార్థము సుషుప్తి — ప్రళయములందు తమోలీనములైన మనస్సును, ఇంద్రియములను ఆకర్షించుచున్నాడు.

**82. వాయుర్గంధానివ సంయాతి.**

వాయువు పుష్పకోశమునుండి పరిమళమును గ్రహించి వెడలునట్లు, మరణ కాలమున మరల యాయింద్రియములతో సహా జీవుడు నిర్గమించును.

**83. రసాత్మకస్సోమో భూత్వా చ.**

రసమయమగు చంద్రస్వరూపమును ధరించి భగవంతుడే మన ఆహారనిమిత్తము భూమండలమునగల సస్యములను పోషించుచున్నాడు. (ఇతర గ్రహమండలములలో యివి లేవు గదా.)

**84. వైశ్వానరో భూత్వాఽన్నం పచతి.**

ఆ దయ అంతటితో నిలుచుట లేదు; ఆయనయే మానవశరీరమున జఠరాగ్ని యనబడు వైశ్వానరాగ్నిగ ప్రజ్వరిల్లి భుక్తాన్నమును జీర్ణమొనర్చి మనకు పుష్టిని గూర్చుచున్నాడు.

**85. వేదాంతకృద్వేదవిదేవ చాహ్మ్.**

వేదాంత సంప్రదాయ ప్రవర్తకుడగు జ్ఞానగురుడుకూడ భగవంతుడే. జగద్గురు రూపమున ఆయనయే ప్రకాశించుచున్నాడు.

**86. క్షరాక్షరౌ పురుషస్య.**

క్షరమనియు, అక్షరమనియు బ్రహ్మమునకు ఉపాధులు రెండు.

**87. సర్వాణి క్షరః.**

విశ్వసృష్టి అంతయును క్షరము.

**88. ప్రకృతిరక్షరః.**

మూలభూతమగు మాయాశక్తి అక్షరము.

**89. ఉత్తమపురుషః పరమాత్మా.**

సృష్టికిని సృష్టిమూలమగు మాయకును అతీతుడగుచు వెలయుచుండు పరమాత్మయే ఉత్తమపురుషుడు.

90. స ఏవ క్షరాక్షరాతీతః.

ఆయన క్షరమునకును, అక్షరమునకును అతీతుడని పైన చెప్పబడియే యున్నది.

ఇతి శ్రీమద్భారద్వాజీయ ప్రణవబ్రహ్మానంద సూత్రేషు ఉకారజ్ఞానానందపాదో ద్వితీయః ॥ 2 ॥

ఇది ప్రణవబ్రహ్మానంద గీతాసూత్ర రత్నమాలకు శ్రీ నిర్వికల్పానందస్వామి కృత ఆంధ్రానువాదమున ద్వి తీ య పా ద ము. ॥౨॥

ఓమ్.

## తృ తీ య పా ద ము.

1. సర్వభావేన యో జానాతి స సర్వవిత్.

అభిమానాహంకారములను సర్వతో భావముగ పరిత్యజించి సర్వభావములతో భగవద్భజన నొనరించెడి వ్యక్తి సర్వోత్తముడగు పురుషోత్తము నెరిగి సర్వజ్ఞుడగును.

2. దైవీసంపదమభిజాతస్య యమనియమా భవతః.

దైవీసంపదలో జన్మించినవానికి యమనియమాదులు స్వాభావికాలంకారములై యుండును.

3. ఆసురీమభిజాతస్య.

అట్లే ఆసురీసంపదలో జన్మించినవాని విషయమున అజ్ఞానక్రోధపారుష్యదంభదర్పములు వెన్నంటియుండును.

4. దైవాసురౌ ద్వౌ చ.

ప్రపంచమునగల జీవకోటియంతయును యీరెండురాసులకు చెందును.

5. దైవీసంపద్విమోక్షాయ భవతి.

దైవీసంపద మోక్షమార్గము.

6. బంధాయాసురీ మతా.

ఆసురీసంపద బంధించును.

7. తేషు న విద్యతే.

ఆసురీసంపద్యుక్తులలో అధర్మనివృత్తి ధర్మప్రవృత్తి, సత్యదయాశౌచాచారములు, కలికమునకైనను కనిపించవు.

8. కిమన్యత్కామహైతుకమిత్యాహుః.

వారు సృష్టికర్తయగు యీశ్వరుని అంగీకరింపరు. స్త్రీపురుషసంపర్కమే జగత్కారణమగును.

9. కామభోగేషు ప్రసక్తా నరకే పతంతి.

ధర్మవిరుద్ధమగు కేవలకామమునే భోగించువారు అపవిత్రనరకమున గూలుదురు.

10. క్రూరా ఆసురీ యోనిషు.

క్రూరులగువారు రాక్షస జన్మ బొందుదురు.

11. తే జన్మని జన్మని మూఢా భవంతి.

వారు జన్మజన్మాంతరములలో అజ్ఞులుగనే యుందురు.

12. ఆసురీం యోనిమాపన్నాస్త త్పదం న యాంతి.

ఆసురీజన్మ బొందినవారు పరమపదమును బొందజాలరు.

13. నరకస్య ద్వారం త్రివిధమ్.

కామ క్రోధ లోభములు మూడును నరకద్వారములు.

14. త్రిభిర్విముక్తాః పరం యాన్తి.

ఈ నరకద్వారముల మూటినుండియు అనగా సమస్తములగు అసురగుణములనుండి తప్పించుకొనినవారే పరమపదమును బొందగలరు. కనుకనే ఆసురీగుణములు ఇంతగ వర్ణింపబడినవి. అవి యేవియో తెలిసినది కాన, వానిని దరిజేరనీయకూడదు.

15. విధిముత్సృజ్య వర్తతే సుఖం నాప్నోతి.

శాస్త్రవిధిని తిరస్కరించువాడెన్నటికిని సుఖమును బొందజాలడు.

16. శ్రద్ధా త్రివిధా భవతి.

శ్రద్ధ, తామసిక రాజసిక సాత్వికములని మూడు విధములు.

17. దేవాన్ సాత్వికా యజంతే.

సాత్వికులగువారు దేవతలను పూజింతురు.

18. రాజసా యక్షరక్షాంసి.

రాజసిక స్వభావయుక్తులు యక్షరాక్షసులను సేవింతురు.

19. తామసా భూతగణాం ప్రేతాంస్తథా.

తామసికులు భూతప్రేతములను కొలుతురు.

20. రస్యా స్నిగ్ధా స్థిరా హృద్యాస్సాత్వికప్రియాహారాః.

రసవంతములును, మెత్తనివియును, పుష్టిని గూర్చునవియును, చూచుటకు యింపును గూర్చుచు మనస్సుకు తుష్టిని గూర్చునవియును, అనగా - ఉద్రేకమును కలుగజేయనివియును సాత్వికులకు యిష్టమగు ఆహారపదార్థములు.

21. త ఆయుర్బలారోగ్యసుఖప్రీతిప్రదాః.

ఈ పదార్థములు ఆయుష్షును బలమును ఆరోగ్యమును సుఖమును ప్రీతిని కలుగజేయును.

22. కట్వామ్ల లవణ తీక్ష్ణోష్ణరూక్షవిదాహినో రాజసస్యేష్టాః.

చేదు పులుపు ఉప్పు వేడి కారములతో చేయబడి, యెండి, మంటబెట్టు పదార్థములు రాజసులకు యిష్టము.

23. తద్దుఃఖశోకామయప్రదమ్.

ఈ పదార్థములు తనకు దుఃఖమును, తనతో సంబంధించినవారికి శోకమును కలిగించు రోగములను, తెచ్చిపెట్టును.

**24. గతరసం పూతి పర్యుషితం యాతయామ మమేధ్యముచ్ఛిష్టమపి తామసస్య.**

పిప్పితోగూడినవి, పాచిపోయినవి, చద్దిగమారినవి, ఇంకొక పూట వండి నిలువ జేయబడినవి, తినగూడనివి, యెంగిలిచేయ బడినవి, ఇట్టి పదార్థములనిన తామసికవ్యక్తులకు యిష్టము. (ఇట్టి, తామసిక రాజసిక పదార్థములను వర్జించి, సాత్వికాహారమునే గైకొనవలెనని భావము.)

**25. అఫలాకాంక్షిభిర్యజ్ఞో సాత్వికః.**

నిష్కామబుద్ధితో కర్తవ్యమని నిశ్చయించుకొని, శాస్త్రవిధిననుసరించి, చేయబడు యజ్ఞము సాత్వికము.

**26. ఫలాకాంక్షిభిర్యజ్ఞో రాజసః.**

ఇహలోకమున కీర్తి ప్రతిష్ఠలను, పరలోకమున సుఖభోగమును వాంఛించి, చేయబడు యజ్ఞము రాజసికము.

**27. శ్రద్ధా మంత్రవిధి దక్షిణాన్నహీనం తామసమ్.**

శాస్త్రవిధి ననుసరింపక, శ్రద్ధారహితమై మంత్రహీనమై అన్నదానమును, దక్షిణయును, కొరవడిన యజ్ఞము తామసికము.

**28. యమనియమా శారీరం తపః.**

యమనియమాదులు శారీరకతపస్సు.

**29. అహింసాఽస్తేయసత్యబ్రహ్మచర్యాఽపరిగ్రహాః యమాః.**

త్రికరణశుద్ధిపూర్వకములగు సత్యాహింస బ్రహ్మచర్యములును పరులసొత్తును గ్రహింపకుండుటయును, జీవనపోషణమునకు ఆవశ్యకములు కానిపదార్థములను స్వీకరింపకుండుటయును, — ఇవి యమము లనబడును.

**30. శౌచ తప స్సంతోష స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః**

శరీరమును మనస్సును పవిత్రముగ నుంచుకొనెడు శౌచమును, ఉపవాసాది నియమములును, సంతోష భావమును, మంత్రజపమును, భగవద్భక్తియు కలసి నియమము లనబడును.

**31. సత్యం ప్రియహితమనుద్వేగకరం వాక్యం స్వాధ్యాయశ్చ వాఙ్మయం తపః.**

సత్యమును పల్కుట; ఇతరులకు విననింపుగొల్పుచు-శుభమును గూర్చుచు-ఆందోళన కల్గించని రీతిగ సంభాషించుట; శాస్త్రాధ్యయనము; ఇది వాక్కుతో నొనర్పబడు తపస్సు.

**32. మౌనం మనఃప్రసాదస్సౌమ్యత్వం మనోనిగ్రహో భావసంశుద్ధిరితి మానసం తపః.**

మౌనము, మనశ్శాంతి, వక్రబుద్ధిలేకుండుట, మనోనిగ్రహము, నోటితో పల్కుదానినే పనిలో చేసి చూపుట,-ఇదిమానసిక తపస్సు.

**33. త్రివిధం తపస్సాత్వికం పరిచక్షతే.**

మనోవాక్ శరీరములకు సంబంధించిన యీ త్రివిధతపము సాత్వికము.

**34. దంభేన సత్కారమానపూజా-ర్థం రాజసమ్.**

లోకుల మెప్పుగోరి చేయబడు నది రాజసికతపస్సు.

**35. పరస్యోత్సాదనార్థం నాత్మనః పీడయా తత్తామసమ్.**

లోకుల ముప్పుగోరి చేయబడునది తామసికతపస్సు. అట్లే, హాతమును బూని తనకు అధికక్లేశమును గలిగించు తపస్సు కూడ తామసికమే.

**36. అనుపకారిణే దానం తత్సా-త్త్వికమ్.**

ప్రత్యుపకారమును గోరక, కాశ్యాది పుణ్యక్షేత్రములలో, గ్రహణాది పుణ్యకాలములలో, అర్హుడగు వ్యక్తికి ఒసగిబడు దానము సాత్త్వికము.

**37. ప్రత్యుపకారార్థం తద్రాజసమ్**

ప్రత్యుపకారమును ఆశించియో, లేక పుణ్యఫలమును బొందగోరియో, ఒసగబడు దానము రాజసికము.

**38. అవజ్ఞాతం తత్తామసమ్.**

అపవిత్రస్థానమున, అశౌచాది పరిస్థితులలో నుండియు, పాదప్రక్షాళన ప్రియవచనాది సత్కారముల నొనర్పక, తిరస్కారభావముతో, అయోగ్యులగు నటవిట గాయకాదుల కొనర్పబడు దానము, తామసికము.

**39. ఓమ్ తత్సదితి బ్రహ్మ త్రివిధం స్మృతమ్.**

బ్రహ్మము "ఓమ్-తత్-సత్" అని మూడు విధములుగ స్మరింపబడుచున్నది.

**40. బ్రహ్మవాదినాం యజ్ఞాదిక్రియా ఓమితి ప్రవర్తన్తే.**

వేదవేత్తల యజ్ఞాదిక్రియలు ఓంకార శబ్దోచ్చారణాపూర్వకముగ నిర్వహింపబడుచున్నవి.

**41. తదిత్యనభిసంధాయ క్రియంతే.**

నిష్కామకర్మము 'తద్' శబ్దోచ్చారణాపూర్వకముగ నిర్వహింపబడుచున్నది.

**42. సాధుభావే చ ప్రశస్తకర్మణి చ సత్ప్రయుజ్యతే.**

మంచిది యని సూచించుటకును, శుభకర్మమును పేర్కొనుటకును, సత్-శబ్దము వాడబడుచున్నది.

**43. అశ్రద్ధయా దత్తం హుతం తప్తం కృతం చాసదితి.**

దానహోమతపములు అశ్రద్ధతో నొనర్పబడిన అసత్తగుచున్నవి.

**44. తదిహా చ ప్రేత్య ఫలాయ న భవతి.**

అది, యిహ పరములలో అక్కరకు రాదు.

**45. సర్వకర్మఫలత్యాగః సన్న్యా-సః.**

కామ్యకర్మఫలముల నన్నిటిని, కృష్ణార్పణ మొనర్చుటయే సన్న్యాసము.

**46. దోషవత్కర్మ త్యాజ్యం.**

చెఱుపునుగూర్చు కర్మములను వీడదగును.

**47. యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యమ్.**

యజ్ఞదానతపఃకర్మములను, ముముక్షువ్యక్తి త్యజింపకూడదు.

**48. యజ్ఞో దానం తపశ్చైవ పావ-నాని.**

ఈ కర్మములు పవిత్రతను-చిత్తశుద్ధిని, ఒసగును.

**49. తత్ఫలానుషంగం త్యక్త్వా కర్త-వ్యాని.**

ఈకర్మములను స్వర్గసుఖపుణ్యలోభముతోగాక, కర్తవ్యబుద్ధితో ఆచరింపనగును.

**50. నియతస్య చ సన్న్యాసో నోప-పద్యతే.**

ముముక్షువుపట్ల నిత్యకర్మత్యాగమే సరిపడదు.

**51. తత్పరిత్యాగస్తామసః.**

వాటిని త్యజించుట తమోగుణలక్షణమే.

**52. కాయక్లేశభయాన్న త్యజేత్.**

ఆయా కర్మములను కాయక్లేశభయమున త్యజింపకూడదు.

**53. సంగం త్యక్త్వా క్రియతే స సాత్త్వికః.**

కర్మఫలాసక్తిని త్యజించి కర్మములనొనర్చువాడు సాత్త్వికుడు.

**54. కర్మణః ఫలం త్రివిధమ్.**

కర్మఫలము, శుభము - అశుభము, ఈ రెండును కలసినట్టిదిగను, ఉండవచ్చును.

**55. తదత్యాగినాం ప్రేత్య భవతి.**

అజ్ఞులకే, పరలోకమున యీఫలములు లభించుచున్నవి.

**56. సన్న్యాసినాం న తు క్వచిత్.**

జ్ఞాననిష్ఠులకు యీఫలము లుండవు.

**57. కారణాని పంచ.**

లోకమున యేకర్మమైనను నిర్వహింపబడుటకు, శరీరము అహంకారము యింద్రియములు పంచప్రాణములు యింద్రియాధిష్ఠాతృదేవతలు, అను అయిదు విషయములు కూడినగాని జరుగదు.

**58. ఏతే పంచ హేతవః.**

మనోవాక్కాయములతో, యేపని చేయవలసియున్నను యీ అయిదును సమకూడవలెను.

**59. తత్రైవం సతి ఆత్మానం కర్తా-రం పశ్యతి న దుర్మతిః.**

విషయమిట్లుండ, ఆత్మను కర్తగ భావించువాడు మేధారహితుడే.

**60. నాహంకృతో భావో హత్వాపి న హన్తి.**

కనుక, ఈభావము నాశ్రయించి, నిరహంకారియైనవాడు, లోకదృష్ట్యా హతమొనర్చినను హంత కాడు.

**61. ఏకం భావమీక్షతే తత్సాత్త్వి-కమ్.**

ఆబ్రహ్మస్తంబ పర్యంతముగల చరాచరవస్తుజాతమున, ఏకాత్మదర్శన మొనర్చు అద్వైతదృష్టియే మోక్షదాయకమగుటవలన సాత్త్వికము.

**62. నానాభావాన్ పృథక్త్వేన వేత్తి తద్రాజసమ్.**

కాని, వేరువేరుగ, బహు ఆత్మలను చూచు ద్వైతదర్శనము రాజసము.

**63. ఏతస్మిన్ కార్యే సక్తమహేతుకం తత్తామసమ్.**

ఆత్మ శరీరపరిమాణమాత్రమే, సర్వవ్యాపి కాదు; ఈశ్వరుడు విగ్రహమున నే యున్నాడు; బయట లేడు—అను లఘుదర్శనము తామసికము.

**64. అగ్రే విషం పరిణామేఽమృతోపమం తత్సాత్త్వికమ్.**

మొదట కష్టకరముగనుండి విషమువలె తోచినను, తుదకు అమృతోపమ మగు ఫలము నొసగు (ధ్యానాభ్యాసాదిక) విషయము సాత్త్వికసుఖ మనబడును.

**65. అగ్రేఽమృతోపమం పరిణామే విషం తద్రాజసమ్.**

మొదట అమృతమువలె నుండి, తుదకు విషమువలె బాధపెట్టునది రాజసికసుఖము (భోగసుఖములు.)

**66. అగ్రే చానుబంధే చాత్మనో మోహనం భవతి తత్తామసమ్.**

అద్యంతములలో చెరుపును గలిగించునది. (భ్రమ-ప్రమాద-మనఃకల్పనలు) తామసిక సుఖము.

**67. ప్రకృతిజైర్ముక్తం నాస్తి.**

స్వర్గమర్త్యపాతాళ లోకములలో ప్రకృతిగుణములనుండి. విడివడిన ప్రాణిగాని, వస్తువుగాని లేదు.

**68. జ్ఞానవిజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ.**

జ్ఞానవిజ్ఞానరక్షణము, వేదము, పరలోకము, ఈశ్వరుడు అనువాటియందు విశ్వాసమును నిల్పు ఆస్తిక్యమును బోధించుట—బ్రాహ్మణస్వభావమునకు అనుగుణము లగు కర్మములు.

**69 దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ**

దాతృత్వము, పరులను రక్షించుట, శాసించుట అనునవి క్షత్రియస్వభావ కర్మములు.

**70. కృషి గోసంరక్షణ వాణిజ్యం వైశ్యకర్మ.**

వ్యవసాయము, గోసంరక్షణము, వాణిజ్యము—అనునవి వైశ్యస్వభావకర్మములు.

**71. శూద్రస్యాపి పరిచర్యాత్మకమ్.**

సేవ శూద్రస్వభావకర్మము.

**72. స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి.**

స్వవర్ణమునకును ఆశ్రమమునకును, స్వభావమునకును, నియమితమైన ధర్మ (కర్మ)మును; ధృతి, క్షమా, దమ, అస్తేయ, శౌచ, ఇంద్రియనిగ్రహ, సంశయనిరాకరణ శక్తి, విద్యా, సత్య శాంతము లనబడు దశలక్షణము గు సార్వభౌమిక (విశ్వజనీన) ధర్మమును అనుష్ఠించుటవలన సిద్ధిలభించును.

**73. స్వభావనియతం కర్మ కుర్వన్ కిల్బిషం నాప్నోతి.**

తనజాతికిని ఉనికికిని సంబంధించిన కర్మమువలన పాపమంటదు.

**74. సహజం కర్మ న త్యజేత్ ; పర ధర్మో భయావహః.**

స్వధర్మనిర్దిష్టమగు కర్మమును త్యజింప గూడదు; పరుల నిమిత్తము, నిర్దిష్టమగు కర్మమును ఆచరింపకూడదు. అది విప త్కరము.

**75. భూతేషు సమో బ్రహ్మభూతః.**

బ్రహ్మాత్మైక్యబోధను బొందినవానికే సర్వభూతములయెడ సమదృష్టి లభించును.

(పైన చెప్పిన స్వధర్మరూపకర్మాచరణమును నిష్కామబుద్ధితో యీశ్వరార్పణపూర్వక ముగ నొనర్చినయెడల, చిత్తశుద్ధిద్వారమున యీదృష్టి లభ్యమగునని భావము.)

**76. హృద్దేశే ఈశ్వర స్తిష్ఠతి.**

ఈశ్వరుడు, సర్వజీవాంతర్యామియై వారిని తోలుబొమ్మలవలె (స్వకర్మాను సారము) నియమించుచున్నాడు.

ఇతి శ్రీమద్భారద్వాజీయ ప్రణవబ్రహ్మానంద సూత్రేషు స్వర్గానందపాదః తృతీయః ॥ 3 ॥

ఇది ప్రణవబ్రహ్మానంద గీతాసూత్ర రత్నమాలకు శ్రీ నిర్వికల్పా నందస్వామి కృత ఆంధ్రానువాదమున తృ తీ య పా ద ము. ॥3॥

ఓమ్.

# చ తు ర్థ పా ద ము.

**1. ధర్మాధర్మాన్పరిత్యజ్య తదేకం వ్రజ.**

ధర్మాధర్మానుష్ఠానభావనను, తదను ష్ఠానమున కలిగెడు అహంకారాభిమానము లను త్యజించి, ఏకమాత్రవస్తువగు బ్రహ్మ మునే స్థిరబుద్ధితో ఆశ్రయింపుము.

**2. సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యో వేద స బ్రహ్మవిత్.**

సచ్చిదానందస్వరూపమును ఏకస్వరూ పమును అగు బ్రహ్మమును యెరిగినవాడే బ్రహ్మవేత్త.

**3. ఏకమేవాద్వితీయం బ్రహ్మ యో వేద స బ్రహ్మవిద్వరిష్ఠో భవతి.**

అద్వితీయమును యేకస్వరూపమును అగు బ్రహ్మము నెరిగినవాడే బ్రహ్మవిద్వరి ష్ఠుడు.

**4. సర్వం ఖల్విదం బ్రహ్మ యో వేద స శివ స్స యోగీ స విష్ణు స్స పరమాత్మా భవతి.**

భ్రాంతదృష్టికి గోచరించు, యీద్వైత ప్రపంచమంతయును వాస్తవమునకు ఏకాత్మ స్వరూపమగు బ్రహ్మమే యని, గ్రహించిన

వాడే యోగి. అతడే శివుడు. అతడే విష్ణువు.

5. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ.

ప్రణవమనబడు ఓంకారమే వేదము; వేదసారము; పరబ్రహ్మము; ఉపాయము, ఉపేయముగూడ నగుచున్నది. ఇట్లు గ్రహించినవాడే పరమయోగియై శుభప్రదుడై సర్వవ్యాపకమగు బ్రహ్మతత్త్వమున నెలకొనును.

6. శ్రద్ధావాన్ శృణుయాత్ పుణ్యాకర్మణాం లోకాన్ ప్రాప్నుయాత్. అధ్యేష్యతే చ ఇమ మద్భుతం జ్ఞానయజ్ఞేన ఇష్టస్యాత్.

ఎవడైనను ఈ గీతా శాస్త్రమును తాను స్వయముగ పఠింపజాలక పోయినను, ఇతరులు పఠించుదానిని శ్రద్ధావిశ్వాసములతో వినినను పుణ్యాలోకములకు బోవును. ఇక యీ అద్భుతబ్రహ్మప్రవచనమును స్వయముగ అధ్యయన మొనర్చువాడు విధి_జప_ఉపాంశు_మానసము లనబడు నాలిగింటిలో శ్రేష్ఠమగు (మానసమగు) జ్ఞానయజ్ఞము వలన భగవంతునే అర్చించిన వాడగుచున్నాడు.

ఇతి శ్రీమద్భారద్వాజీయ ప్రణవబ్రహ్మానంద సూత్రేషు
చతుర్థోఽర్థమాత్రానందపాదః ॥ 4 ॥

సమాప్తశ్చాయం మహానిబంధః.

ఇతి శివమ్.

ఇది ప్రణవబ్రహ్మానంద గీతాసూత్రరత్నమాలకు
శ్రీ నిర్వికల్పానందస్వామి కృత ఆంధ్రాను
వాదమున చతుర్థపాదము. ॥౪॥

ఇది ఈ మహానిబంధ గ్రంథ పరిసమాప్తి.

శ్రీకృష్ణపరబ్రహ్మార్పణమస్తు
ఓమ్



# 18
# (పదునెనిమిది)

శ్రీ వేదవ్యాసులవారికి 18 అంటే యెందుకో మహాయిష్టం. ఆర్షసాహిత్యములో యీ 18 అమరస్థానాన్ని ఆక్రమించింది. ఇది యెన్నెన్నిచోట్ల తన ప్రభావాన్ని చలామణి చేసిందో, వినోదానికి కొన్ని విషయాలు ముచ్చటించుకొందాం.

పురాణాలు 18. వీటిని గూర్చి ఒక శ్లోకంకూడా వుంది:

శ్లో॥ మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం।
అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥

మకారంతో ఆరంభమయ్యే పురాణాలు రెండు. మత్స్యపురాణము - మార్కండేయ పురాణము. భకారంతో ఆరంభమయ్యే పురాణాలు రెండు. భాగవతపురాణం - భవిష్యోత్తర పురాణం. బ్రకారాదితో మూడుపురాణాలు. బ్రహ్మపురాణము - బ్రహ్మాండపురాణము - బ్రహ్మవైవర్త పురాణము. వకారంతో నాల్గు పురాణాలు. వైష్ణవ - వరాహ - వాయు - వామనపురాణాలు. "అ-నా-ప-లిం-గ-కూ-స్కా" — అగ్నిపురాణము - నారదపురాణము - పద్మపురాణము - లింగపురాణము-గరుడపురాణము-కూర్మపురాణము - స్కాందపురాణము; ఇవి యేడు. మొత్తముకలిపి పురాణాలు 18.

యజ్ఞాంగవ్యక్తులు 18 మంది. ఋత్విక్కులు పదారుమంది, యజమానుడును యజమానపత్నియుకలిసి 18 మంది యజ్ఞమునకు వుండవలెను.

మహాభారతంలోని పర్వాలు 18. మహాభారతయుద్ధము జరిగినరోజులు 18. రెండువైపులనుండు సేనలు 18 అక్షౌహిణులు. భగవద్గీతలోని అధ్యాయాలు 18. గీత రెండో అధ్యాయం సాంఖ్యయోగంలో పరిశుద్ధమగు ఆత్మస్వరూపాన్ని గురించి 18 శ్లోకాలు చెప్పబడ్డాయని పెద్దలంటారు. స్థితప్రజ్ఞుని లక్షణాలు 18 శ్లోకాలతో చెప్పబడినవి. కాబట్టే, శ్రీ వినోబాభావేగారు స్థితప్రజ్ఞదర్శనమనే తమగ్రంథాన్ని 18 ప్రకరణాలుగా రచించారు.

పురుషునికి యుక్తవయస్సు వచ్చుట 18వ యేట. దుర్గాదేవికి 18 భుజాలని ప్రసిద్ధి. అమ్మా! పద్దెనిమిదీ! నీకు నమస్కారం.

శ్రీరామకృష్ణానందస్వాములవారికి పాకాల పౌరులు సమర్పించిన

# పూ జా పు ష్ప మా ల.

శ్రీకల్యాణ గుణాత్మక! భీకరవిషయారినివహ విచ్ఛేదక! మీ
రాక పురప్రజకెంతయు ప్రాకట విజ్ఞాన దాన బంధుర మయ్యెన్॥ 1

గీతావాణీ వాహక! నీ తాత్త్విక ధర్మవాక్య నిర్ఝరిణీ సం
పాతప్రవాహములలో నాతతముగ మున్గినార మావత్సముగన్॥ 2

ఒకసారి వచియింతు వుద్ధతవై ఖరి
ప్రభుసమ్మితము వేదవాక్యమూహ!
మొకసారి చాటెదు — ఉపనిషద్ గంభీర
మంత్రభావముల సామాన్యసరణి!
ఒకసారి ఖండింతు వుగ్రాగ్ని కీలవై
నేటి వ్యవస్థలో నీతిలేమి!
ఒకసారి ప్రకటింతు ఉర్వరానై కావ
తార సందేశబోధనలు పెక్కు!
మెన్నియేండ్లుగ శ్రుతుల ననేక పావ
నాగమ శిరఃప్రసృతసార మానినావొ!
రామకృష్ణాహ్వయా! పరివ్రాట్కులావ
తంస జోగియ! అనుపమ ధర్మధుర్య॥ 3

ఒకపదునాల్గు మాసముల్ మిమ్ము ఉపదేశోద్బోధలన్ బొంది, శ్రీ
శుక సంప్రాత ముఖారవిందగళిత స్రోతస్వినీ రూప ది
వ్య కథాసారము నానినారము కృతజ్ఞాయత్తచిత్తంబులం
దిక జోహారులు పెట్టుచుంటిమి; తపస్వీ! తత్త్వవిద్యామతీ॥ 4

చిఱుత వయసున మీ దివ్యజీవనంబు
ధర్మనిష్ఠితమైన విద్వన్మనీష!
సర్వజన సంస్క్రియాచణ సత్యదృష్టి
మఱచిపోలేము, జన్మజన్మాంతరైన॥ 5

రచన:— ఆశుకవి - అష్టావధాని; పులివర్తి శరభాచార్య, B.A., B.Ed.,
స్కూల్ల డిప్టీయిన్స్పెక్టరు, చంద్రగిరి రేంజి.

# గ్రంథ సమీక్ష.

## 1. శ్రీక్రీస్తు శతకము:— వెల. 0—4—0

కవి:– శ్రీపులిపర్తి శరభాచార్యులు, B. A., B. Ed., ప్రకాశకులు:– విశ్వాజ్ఞ మండలి, తెనాలి.

కవి రసికుడు; సహృదయుడు; బహుభాషావేత్త; పండితుడు; తత్త్వమూర్తియగు శ్రీతత్త్వానందస్వామివారి అనుంగు శిష్యుడు; ఆంధ్ర వసుంధరలో యెన్నుకొనదగిన అల్పసంఖ్యాకులలో ఒక కవిరత్నము. వీరికి కవిత్వమంటే మహాపిచ్చి. ఈవరకే తన అద్భుత కవిత్వ శిల్పంతో ఆంధ్రభాషా యోషను అలంకరించి అర్చించిన భావుక మహాను భావుడు. అందమైన కందపద్యాలతో క్రీస్తుప్రభువుయొక్క ప్రాముఖ్యమైన జీవిత ఘట్టాలనూ, వారి ఉపదేశాలను సహా సేకరించి, అద్దములో పర్వతాన్నివలె యీ చిన్ని పాత్రంలో ప్రదర్శించినారు. నేను పాకాల రైలుస్టేషనులో అందుకొన్న పుస్తకాన్ని, మరుస్టేషను రాకముందే గుక్కత్రిప్పుకోకుండా చదివాను. కవితాప్రియులకు – క్రైస్తవ మతసార జిజ్ఞాసువులకు గ్రంథము తప్పక చదువదగినది.

## 2. యాత్రా మార్గదర్శి; మొదటిభాగము:— వెల. 3—8—0

రచయిత – రాగం వెంకటేశ్వర్లు. ప్రకాశకులు: శ్రీ సీతారామనామ సంకీర్తనము, శ్రీరామనామ క్షేత్రము, గుంటూరు.

క్రౌను ⅛ సైజు 28+434+60 పుటలు మ్యాపుతోసహా అందమైన జాకెట్ కవరు. మంచిబైండు. చక్కనిగ్రంథము.

ఏమరక కాపాడు ఆప్తమిత్రునివలన, బదులాడక పనిచేయు సేవకునివలన, బహుభాషావేత్తయగు పండితునివలన, అన్నివ్యవహారముల నారితేరిన అనుభవజ్ఞునివలన, నిస్స్వార్థముగ హితమొనర్చు పురోహితునివలన, తీరికవేళల కాలక్షేపము చెప్పు కథకుని వలన చేకూరెడి ప్రయోజనములన్నియు, యాత్రికునకు యీ ఒక్క గ్రంథమువలన సిద్ధించ గలవు. గ్రంథము యాత్రకు సంబంధించిన వివిధ విషయములకు ఆకరము. గ్రంథకర్తగారి బహుకాల తపఃఫలితము. శ్రీరామనామ క్షేత్రమువారి ప్రచురణములలో అద్భుతమైనది. శ్రీకాశీ కృష్ణాచారిగారన్నట్లు 'ప్రతిపత్ర రసోదయము'.

ఇది కేవలము దక్షిణభారత దేశయాత్రకు సంబంధించిన గ్రంథము. ఈ విధమున నే ఉత్తరభారత, హిమాలయ యాత్రలకు సంబంధించిన తక్కిన భాగములనుకూడ వెలువరించి శ్రీరామనామ క్షేత్రమువారు ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చగలరని ఆశించు చున్నాను.

## 3. శ్రీభగవద్గీతా అష్టోత్తరశతనామస్తోత్రం. 0—3—0

## 4. నారద పరివ్రాజకోపనిషత్. 1—4—0

ఈ రెండు గ్రంథములును, మేనేజరు, శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడు P. O. చిత్తూరుజిల్లా అని వ్రాసిన పడయగలరు.

గతసంచికలో సమీక్షించియూ చిరునామా వ్రాయకపోవుటతో ఈరీతి ప్రకటించడమైనది.

---

# వార్తలు.

3-1-54 నుండి 9-1-54 వరకు కోయంబత్తూరు జిల్లా కొళ్ళేగాలమునందు శ్రీశ్రీ శంకరానందస్వాములవారు భగవద్గీతా అష్టమాధ్యాయమునుగూర్చి ఉపన్యసించినారు. శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయమునందు సమావేశములు యేర్పరుచబడినవి.

10-1-54 తేదీ కొళ్ళేగాలమునందలి శ్రీ రామకృష్ణాశ్రమమునందు శ్రీ వారి గీతోపన్యాసము జరిగినది. ఆనాడే శ్రీవారికి ఆర్యవైశ్యసంఘమువారు ధన్యవాదపత్రము సమర్పించినారు. తర్వాత శ్రీవారు పహోస్పేట శ్రీ గీతాసేవాశ్రమము చేరుకున్నారు.

28-1-54 నుండి 8 రోజులు ఊరవకొండతాలూకా రాగులపాడు శ్రీ ప్రణవానందాశ్రమమునందు భగవద్గీత 18 వ అధ్యాయమునుగూర్చి శ్రీశంకరానందస్వామివారు ఉపన్యసించినారు. శ్రీ రామకృష్ణగారు అనువదించారు.

13-2-54 నుండి 5 రోజులు హోస్పేట శ్రీ గీతా సేవాశ్రమ వార్షికోత్సవములు జరుగగలవు.

* * *

# గీతాజయంతీ మహోత్సవములు.

ఆళ్లగడ్డ శ్రీ గీతావాణి కార్యాలయమునందు శ్రీ శివానందస్వామివారి ఆధ్వర్యముతో గీతాజయంతి మహోత్సవము నిర్వర్తింపబడినది.

విజయనామ సంవత్సర మార్గశిర శుద్ధ ఏకాదశి బుధవారం (16-12-53) అనంతపురంజిల్లా మడకశిరా గ్రామమునందు శ్రీలక్ష్మీ వేంకటేశ్వర దేవాలయములో శ్రీ గీతాజయంతీ మహోత్సవము విశేష వైభవముగ నెరవేరినది. నగరసంకీర్తనము, సహస్రనామార్చనము, గీతాపారాయణము, అఖండభజన, హరికథా, ఉపన్యాస కాలక్షేపములుజరిగినవి. శ్రీఆర్. గుండాశాస్త్రి, శ్రీ లక్ష్మీకాంతయ్య, దాసన్న, గంగయ్య, నంజయ్యగార్లు విశేషభక్తి శ్రద్ధలతో కార్యక్రమమునందు పాల్గొన్నారు.

ఖరగ్‌పూర్ శ్రీసత్యపురి తారకేశ్వర భక్తసమాజమువారు - గీతాజయంతి మహోత్సవమును వైభవోపేతముగ జరిపినారు. సమాజకార్యకర్తలగు సరస్వతుల అప్పలస్వామి నారాయణగారు యీ విషయాన్ని మాకు తెలియజేసినారు.

కర్నూలుజిల్లా చాగలమర్రి గ్రామంలో శ్రీ శివరామానందాశ్రమమునందు సాధుమాత సుబ్బలక్షుమమ్మ - లొమ్మంద్రు రామసుబ్బయ్యశ్రేష్ఠి ప్రభృతి భక్తాదులు శ్రీ గీతాజయంతి మహోత్సవాన్ని అత్యంత భక్తి శ్రద్ధలతో నెరవేర్చినారు.

మార్గశిర శుద్ధఏకాదశి (16-12-53) గీతాజయంతి మహోత్సవమును జమ్మలమడుగు తాలూకా పాపాయపల్లె శ్రీ హరిహర సేవాసంఘమువారు బ్రహ్మశ్రీ వేమశేషయ్యగారి అధ్యక్షతతో మహద్వైభవముగ జరుపుకొన్నారు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూలు జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తోమ్మంద్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమఱ్ఱి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పొలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎఱ్ఱగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెందుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం. కరీంనగర్ జిల్లా.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్ప రాజుగారు, గోసపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాట కొండు ఓబులేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని ర మదాసు గారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. – 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్య గారు, చాగలమర్రి. – 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, – కోయిలకుంట్ల. –15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం

కడపజిల్లా, 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ – 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు – 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 19. శ్రీ పెంటంశెట్టి శ్రీని వాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. – 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. – 25. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. – 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 30. శ్రీ ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు – 31. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకశిర గుర్తి. – 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తాలూకా. – 33. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డి గారు, కుందనగుర్తి. – 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. – 36. శ్రీ పెద్ద కదిరప్పగారు, కుందనగుర్తి. – 37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. – 38. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. – 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 40. శ్రీ ఈద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 41. శ్రీ శాకల ఆంజనేయులు

గారు, కుందనగుర్తి. — 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కసుపరిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనాయుడుగారు, కారుక్కారు.

మైసూర్ స్టేట్: 45. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పెట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 47. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 48. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 49. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి, కోలారు. — 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. — 52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. — 53. నాగబండి విశ్వనాథంగారు, 12/88 మెయిన్‌రోడ్డు, వరంగల్. — 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీనృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ — 55. శ్రీ గంద రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ — 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్ —57. శ్రీతాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ — 58. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ — 59. శ్రీ మడూరు బసవలింగంగారు, వరంగల్ — 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ — 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ — 62. శ్రీ గుని శెట్టి నాగలింగంగారు వరంగల్ — 63. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్కెశ్వర్ గారు, కిరాణం మర్చెంట్, వరంగల్ — 64. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. — 65 శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ — 66. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ — 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ — 68. శ్రీ చండా పుల్లయ్యగారు, జనరల్ మర్చెంటు, వరంగల్ — 69. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు, వరంగల్ — 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 71. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు—16.
2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# శ్రీ గీతా తాత్పర్య ప్రదీపము.

రచయిత:— స్వామి శ్రీ రామకృష్ణ.

ప్రకాశకులు:- శ్రీ గీతాసాహిత్య సేవాసమితి, ఆళ్లగడ్డ (కర్నూలు)



క్రౌను 1/16 సైజు 450 పేజీలు. ఫుల్ క్యాలికో బైండు. గిల్టు అక్షరాలు. శ్రీ మురళీకృష్ణుని త్రివర్ణ చిత్రంతో సహా. ప్రచారదృష్టితో మాత్రమే నిర్ణయించిన వెల రు. 1—8—0.

సాంగోపాంగముగ మూలశ్లోకాలు — వాటికి శ్రీ శంకర సిద్ధాంతానుకూలమగు తాత్పర్యము — ఉజ్జ్వలమగు భాష. ముచ్చటైన కూర్పు. గీతార్థసారసంకీర్తనము. గీతాభజనావళితో సహా.



## అభిప్రాయాలు.

1. శ్లోకాలతో పాటు తాత్పర్యాన్ని సైతం కంఠస్థం చేసికోవాలనే ఆసక్తిని కల్గిస్తూంది.

— శ్రీ భగవాన్ గిరిస్వామి.

2. మీ తాత్పర్యరచన హృదయానికి హత్తుకొనిపోయేటట్లుంది.

— స్వామి శ్రీ నిర్వికల్పానంద.

3. నూతన ఆంధ్రరాష్ట్రమునకు అపురూపమైన కానుక. ప్రతి ఆంధ్రుడు తప్పక చదువాలి.

— ఒక ఉత్సాహి భక్తుడు.



శ్లో॥ మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణీ విహారిణే।

పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥

# గీతా ప్రాభవము

గీతా,
శ్రీ గీతా,
సద్గీతా,
జయగీతా.

దేవకీతనయుండు
భావకు తనదు సు
భావచనంబుల చెప్పినది।
భూవలయమున వి
భావను పోల్చ ప్ర
భావముతో వెలుగొందునది ॥౧॥

శ్రుతి శిఖలను గో
తతి జేసి జగ
న్నుత గోపాలుడు పిదికినది।
అతులిత భాగ్యా
న్వితుడై పార్థుడు
కుతుకబంటి తా ద్రాగినది॥ ॥౨॥

వేదార్థము ప్రతి
పాదించిన శ్రీ
వేదవ్యాసుని వరవాణి।
వేదోపనిషత్
స్వాదు సౌరభము
లూదివచించు మహారాణి॥ ॥౩॥

కర్మయోగముల
మర్మము నరునకు
అర్మిలి బోధించిన తల్లి
ధర్మము కర్మము
నిర్మల జ్ఞానము
పేర్మి దెల్పు కల్పకవల్లి॥ ॥౪॥

వచ్చిన స్వర్గము
వచ్చు, గెలిచినచో
యిచ్చు వైభవ మొందగూడు।
తుచ్ఛవృత్తి, వి
వ్యాచ్ఛద! తగదిది
చచ్చెద లెమ్మని తెగమూలు॥ ॥౫॥

అమ్మా నీ పా
దమ్ములె నిరతము
నమ్మితి సకలము దిగనాడి।
కమ్మని హృదయము
గుమ్మరించి నే
మమ్మొదగూర్తుము దయతోడి॥ ॥౬॥

రంగరు బంగరు
మంగళ పదముల
కంగనలారా! మంగళము
శృంగార సము
త్తుంగ పవిత్ర త
రంగిణి, గీతకు మంగళము ॥౭॥ ।జై।
గీతా
శ్రీ గీతా
సద్గీతా।

— శ్రీరామకృష్ణ.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు 1954 కా. 1100.

# విషయసూచిక - మార్చి '54.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్యసేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.





మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ

మేనేజర్:

స్వామి శ్రీ శివానంద,

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

---

సంవత్సరచందా 4—0—0. ❋ విడి పత్రిక 0—6—0.

---

15th MARCH 1954.

# గీతా గానము.

శ్రీ డా॥ రంగా చిన్నచలమయ్యగారు, సంపాదకుడు: "దేవాలయం"

( జనవరి సంచిక 2_వ పేజి తర్వాత. )

3. ఫలాపేక్షతోగూడినకర్మలు _ అజ్ఞానులకె యాశలూ
మంచికర్మలు యితరులకొఱకై శ్రద్ధగజేయును సుజ్ఞానీ ॥క॥ (శ్లో॥ 25)

4. మంచిదారిని బోవుచుతాను _ యితరుల జ్ఞానియె నడిపించూ
తాను చేయక చేయుమన్నను _ సోమరియగును సుజ్ఞానీ ॥క॥ (శ్లో॥ 26)

5. ప్రకృతిసిద్ధమూలము చేత _ మూడుగుణములె చేయగనూ
తానే చేయుచునుండెద ననుచూ _ తలచుచునుండు అజ్ఞానీ ॥క॥ (శ్లో॥ 27)

6. నేనెసాక్షిని యేమియు తెలియదు _ అనుచును జేయును సుజ్ఞానీ
అందువల్లనే కర్మబంధము _ అతనికంటదు పార్థివా ॥క॥ (శ్లో॥ 28)

7. సుగుణముగలిగి యుండేవారలు _ చెరుపరు మూఢామానవులా
విషయసుఖంబులు వారికెయున్న _ ఉన్నతదశకె తేవలెనూ ॥క॥ (శ్లో॥ 29)

8. ఫలాపేక్షను మనసునవీడి _ యుద్ధముజేయుము పార్థివా
సర్వకర్మలను నాకేవదలి _ సాక్షిగనుండుము ఫల్గుణా ॥క॥ (శ్లో॥ 30)

9. నేనుజెప్పినమార్గమువిన్న _ కడతేరునుగ కర్మబంధమూ
అసూయభావము వదలినవారె _ ఆనందింతురునాతో ॥క॥ (శ్లో॥ 31)

10. నేనుచెప్పినమార్గమువినని _ మూర్ఖులు చెడియెపోదురూ
నిందలురెవ్వరుచేయుచున్నను _ చెడుదురువారె పార్థివా ॥క॥ (శ్లో॥ 32)

11. మూర్ఖుడుగాని జ్ఞానియుగాని _ పూర్వకర్మసంబంధముచే
ప్రకృతిసిద్ధము మాఱగలేదు _ యింద్రియవశమును గాదయ్యా ॥క॥ (శ్లో॥ 33)

12. యింద్రియబంధన విడవలెనన్న _ విడవలె రాగద్వేషం
గాఢప్రయత్నముజేసినవారికి _ వదలును రాగద్వేషం ॥క॥ (శ్లో॥ 34)

13. స్వధర్మంబుల చక్కగజేయుచు _ మరణముబొందిన మేలూ
పరులధర్మమును ఆశ్రయించుచు _ బ్రతికియుండిన భయమే ॥క॥ (శ్లో॥ 35)

అర్జునుడు:_ కృష్ణ కృష్ణ కృష్ణయ్యా _ నీవుచెప్పునీతులూ
నాకే తెలియలేదయ్యా _ నందనందనందనా ॥కృ॥

1. పాపమునందు యిష్టములేక _ బలవంతముగజేసినా
స్వధర్మభ్రష్టుడు తానెట్లగును _ చక్కగదెలుపుము నాకయ్యా ॥కృ॥ (శ్లో॥36)

కృష్ణుడు:_ 1. కామము కోరిక క్రోధము లన్నియు _ తృప్తిని జేయగజాలవూ
చేయగజాలరు వాటినివీడి _ పాపులు భువిని పార్థివా ॥క॥ (శ్లో॥ 37)

2 ధూమము అగ్గిని గప్పినయట్లు _ కామము తెలివిని దాచునూ
కామమువీడిన జ్ఞానముగలుగును _ గాఢమైన వైరాగ్యముచే ॥క॥ (శ్లో॥ 38




సంపుటి 3 ★ స్వస్తిశ్రీ విజయ * ఫాల్గుణమ్. ★ సంచిక 9

# గురుశిష్యుల జోడు.

"అర్జునా! పరమగోప్యమైన జ్ఞానాన్ని యింతవరకు బోధించాను. నాయనా! 'యథేచ్ఛసి తథా కురు'. బాగా ఆలోచించి నీకు నచ్చినట్లు నడు"— అంటూ గీతోపదేశాన్ని ముగిస్తూ శ్రీకృష్ణుడాడిన మాట. చెప్పవలసినమాటలేమోచెప్పి గురువు చివరకు శిష్యుని భావ స్వాతంత్ర్యానికి — వ్యక్తిస్వాతంత్ర్యానికి అవకాశమిచ్చాడు. నిజానికి వేదాంతం బలవంత మాఘస్నానం — నిర్బంధబ్రాహ్మణార్థం కాదు గదా! అహా! గురువెంత ఉదారుడు.

"ఇదో! నేను చెప్పింది అక్షరాలవేదం. నీకు నచ్చినా నచ్చకున్నా వినేతీరాలి. ఆఁ ఊఁ అన్నావా, గురుధిక్కారానికి గురి అవుతావు. గురుద్రోహికి రౌరవాది నరకాలే గతి. గురుశాపాన్ని హరిహరాదులు కాదనలేరు. గురుపుత్రుడవైన తర్వాత — గురుపాదం పట్టినతర్వాత—గురువుయెదుట పాలుత్రాగి ప్రమాణంచేసిన తర్వాత, నీ తను ధన మనస్సులు నీవికావు. అవి గురుసొత్తు. విన్నావా? ఖబర్దార్!"— అని శిష్యులపై సుగ్రీవాజ్ఞలు ఛలాయించే యీనాటి గురువులెక్కడ? ఇట్టిగురువులు బరువులు కాక మరేమి?

భగవంతుడు 'భక్తోఽసి మే సఖా చేతి' – (4-3) అని ఒక చోట పలికాడు. శిష్యుడు భక్తుడై వుండుటమాత్రం చాలదు. సఖుడై కూడా ఉండాలి. భక్తివలన అవిధేయత దూరమౌతుంది. చెలిమివలన భయంపోతుంది. వట్టిభక్తిలో భయం వుంటుంది. వట్టి చెలిమివలన అవిధేయత ఏర్పడ్తుంది. భయముకాని, అవిధేయతకావి దైవీగుణాలకు విరుద్ధ కక్షలోవి.

పోనీ! శిష్యుడేమి తక్కువవాడా? మొదట్లో మొదట్లో ప్రజ్ఞావాదాలను చేటలతో చెరిగిన పెద్దమనిషి – తీరా, శ్రీకృష్ణుడు 'నీ యిష్టం వచ్చినట్లు చేసుకొ'మ్మని పల్కగానే – తాను, "కరిష్యే వచనం తవ"-'నీవు చెప్పినట్లుచేస్తా'నంటాడు. అవును గదా మరి! అహంకారమనే గాండీవాన్ని మొదట్లోనే పారవేశాడు. 'నిమిత్తమాత్రం'గా ఉండవలసిన తనకు లేనిపోని యీ పెత్తనమెందుకని? చేసేవాడు వాడే; చేయించేవాడూ వాడే. "కేనాపి దేవేన హృది స్థితేన – యథా నియుక్తోఽస్మి తథా కరోమి" – గురుదేవుడు సూత్రధారి; తాను పాత్రధారి. 'నాకొక కర్తవ్య'మంటూ విగ్రవీగు టెందుకోసం? తననూ తనసామానునూ మొత్తం మోసుకొని రైలుబండి పోతూంటే, 'నా పెట్టె' అంటూ తననెత్తిన పెట్టుకొని మోసే అవివేకి ఉంటాడా? హృదయంలో 'నేను' ఉండేవరకూ గురువురాడు. గురువువచ్చినాడా 'నేను' (అహంకారం) ఎక్కడపోయిందో! వహ్వా! ఎంతటి సమర్పణభావం? అన్నీ ఇచ్చుట గొప్పకాదు. ఇచ్చేవానిని – ఇస్తూన్నాననే అహంకారవృత్తిని యిచ్చింది గొప్ప. దానమిచ్చుట గొప్ప కాదు. బలి (చక్రవర్తి) దానంవలె దాతను యిచ్చేదే గొప్ప. ఎంతటి ఆదర్శమైన శిష్యత్వం!

కాసు ఖర్చుకాకుండా, కైవల్యము ఊడి ఒడిలోపడాలని – డొలుకు గురుపుత్రులమనుకొనే యీనాటి కపట శిష్యులెక్కడ? చేసేదంతా దేహార్పణం, కళత్రార్పణం, పుత్రార్పణం చేస్తూ – ఉపచారానికి, కృష్ణార్పణం–గురువార్పణం అని జల్లిమాటలు–జొల్లుమాటలు

పలికే యీ ఆషాఢభూతులెక్కడ? గురువాజ్ఞను తాము పాలించుట కాదుగదా! ఇంగితజ్ఞుడై గురువు తమఆజ్ఞలనుపాలించాలని వీరిధూర్త భావన. గురువుకు తాము శిష్యులై ఉండాలనుకొన్నారో, గురువును తమకు శిష్యునిగా చేసికోవాలనో వీరి ఆంతర్యం. తమ కామకాంచన భోగవిలాసాలకు ఆంక్షపెట్టకుండా. ఒళ్లుఏమాత్రం నలియకుండా– డబ్బుబొత్తుగా ఖర్చుకాకుండా – అంతమట్టుకే గురువు తన అధికారాన్ని వర్తింపజేయాలి. తప్పిందా! మరుక్షణమే విశ్వాసరాహిత్యతీర్మానం – సిద్ధం. లేదా, శిష్యత్వానికి తెగదెంపు రాజీనామా ...... – గురువుల ఖర్మం కాలనూ! ఆశిష్యుల పడిపంచలనే పడి అఘోరించే దౌర్భాగ్యం – దౌర్బల్యం యెందుకు దాపరించిందో!

పూర్వకాలంలో శిష్యులు గురువులను పోషించేవారు. తెచ్చిన భిక్షాన్నాన్ని గురువునకు నివేదించి వారుతినగా మిగిలినది తిని, తాము జీవించేవారు. కాలం మార్పుకావొచ్చు – ఈనాడు గురువుగారు శిష్యులను పోషించాలి. శ్రీ వారు సంపాదించిన వస్త్రవాహనాలను – పండుఫలాలను అనుభవించేకోసం, దండగమారి – ఋణపాతకపు శిష్యులు యిపుడు వెలిశారు. ఓహో! బదనాయంగా కట్టుకొన్న ఆశ్రమాలకు గతికల్పించేకోసం యీ శిష్యనామధారులతో అవసర మేర్పడిందేమో! కలిదేవతా! నమస్కారం.

భగవద్గీతలోని గురుశిష్యులు ఆదర్శవిగ్రహాలు. అధికార మూర్తి శిష్యుడు; అవతారమూర్తి గురుడు. నరోత్తముడైన నరుడు; పురుషోత్తముడైన ప్రభుడు. (సంజయుని మాటల్లో) మహాత్ముడైన పార్థుడు; పరమాత్ముడైన కృష్ణుడు. వహవ్వా! 'న భూతో న భవిష్యతి'. ధనుర్ధరుడైన శిష్యునియొక్క, యోగేశ్వరుడైన గురునియొక్క పొందికతో గీతోపదేశము ధన్యం – ధన్యధన్యమైపోయింది.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతిర్మతిర్మమ ॥

---

# గీతాసందేశము.

శ్రీ చిదంబరస్వాములవారు, శ్రీ చిదంబరాశ్రమము,
గుబ్బి (మైసూరు).



[గుబ్బి శ్రీ చిదంబరస్వాములవారు కన్నడనాట పూజ్యప్రతిష్ఠలు కన్నవారు. "సేవాసదన" యనెడి కర్ణాటక ద్వైమాసిక పత్రికకు సంపాదకులు. వారిరచనలు భక్తి భావరసబంధురములు. భాషా సరణి గంగాప్రవాహమువలె లలిత రమణీయము. వారు అనుగ్రహించి పంపిన కన్నడ రచనకు యిది తెలుగు. — సంపాదకుడు]



భగవద్గీత హైందవ ధర్మగ్రంథములందే కాదు; విశ్వ ధర్మగ్రంథములందన్నిటను అత్యున్నతస్థానమును ఆక్రమించినది. దీనియందు యెట్టి సంకుచితభావమునకు కూడ చోటు లేదు. జగత్తునందలి విచారశీలురగు జనులెల్లరును దీని గౌరవగరిమను వేభంగుల కొండాడుచున్నారు. కౌరవ పాండవులు యుద్ధమునకై విడిసిన కురుక్షేత్ర రణభూమియందు స్వజన వ్యామోహమునకు గురియై గాండీవమును పారవైచిన అర్జునునకు కర్తవ్యకర్మమును బోధించుటయె యిచ్చటి సందర్భము. కురుక్షేత్ర సంగరరంగమందువలెనే మన అంతఃకరణమునందు సైతము నిమిష నిమిషము తుములయుద్ధము జరుగుచునే యున్నది. కౌరవ పాండవుల వలెనే ఒకే వంశమున బుట్టిన సద్గుణ దుర్గుణములకు ద్వంద్వయుద్ధము నడచునెడ తానేపక్షమును గ్రహింపనగునో తెలియక జీవుడు తికమకపడుచున్నాడు. ఈ తికమకపాటుయొక్క ఫలితమా యన్నట్లు అశాంతియు దుఃఖమును పెల్లుబుకుచున్నది. తత్పరిణామముగ పాప పుణ్యముల సుడిగుండము ప్రాప్తించినది. ఆ సుడిగుండమున నొక్కపరి చిక్కుకున్నచో నిక తప్పించుకొన తరముగాదు. జననమరణ సంసార వైతరిణియందు మునుగుచు తేలుచు వివిధ యోనిపరంపరల పుట్టుట తప్పదు. భారతమును ఆధారమొనర్చుకొని వ్యాస మహర్షులవారు ధర్మజ్ఞాన నీతులకు భండారమో యనునటుల ఆ మహాగ్రంథమును రచించియున్నారు. భారత మహాసముద్రమధ్యమందు భగవద్గీతారత్నము నెత్తిచూపి, సంసార సంకటములమధ్య శాంతియనెడి

సుఖశయ్యపై పరుండి ఆనందింప దగిన అమోఘతత్త్వమును జగత్తునకు బోధించినారు.

భగవద్గీత ఏమిచెప్పుచున్నది?— అని ఒకప్రశ్న. అంతఃకరణమందలి పాప కిల్బిషములనూడ్చివైచి పవిత్ర మగు సద్దానిని జగద్వ్యాపియగు జనార్దనుని సేవకు ఉపయుక్తమగు దానిగ నొనర్చి— అట్టి నిష్కామ సేవవలన ఆత్మశాంతిని పొంది సుఖ శాంతుల నోలలాడు వైఖరిని బోధించుచున్నదనుటయె దాని కి సదుత్తరము.

గీత మనలను దేహాభిమానము నుండి విడదీయుచున్నది. ఈదేహ మొక మట్టికుండ. దీని కొకకొన జన్మమున్నది; మరొక చివర మరణ మున్నది. ఆ రెంటిమధ్య బాల్య యౌవన వార్ధక్యావస్థలున్నవి. ఈ వికారములన్నియు దేహమునకు మాత్రము. ఇంద్రియములు వాటి విషయములతో చేరి సాగించెడి వ్యాపార పరిణామ ఫలితమగు అభిమానమే. నాకును యీదేహమునకును సంబంధము ముడివేసినది. నేను పుట్టువాడనూకాను; చచ్చువాడ నూ కాను. సర్వవ్యాపియగు అఖండ పరిపూర్ణ తేజోరాశియొక్క భాగ స్వామిని నేను. నేను ఆనంద సము ద్రుడను. ఈశరీరము దుఃఖములకు పుట్ట. కావుననే వికారమయమగు ఈ శరీరమునందలి అభిమానమును, వివేకవైరాగ్యముల సహాయమున నిర్మూలించుట నా కర్తవ్యము.

గీత చెప్పెడి దేవుడు సార్వభౌముడు. అతడు యే ఒక్కమతము నకు మాత్రమె చెందినవాడుకాడు. ఆయామతములు వారివారి దేవుండ్ల కొసగిన నామరూపములన్నియు నాతనివే. సూర్యచంద్రులందలి తేజస్సు ఆయనదే. నీటియందలి రసశక్తి ఆతనిసొత్తే. భూమిలోని గంధశక్తి ఆతనిదే. సమస్త జగత్తుకు బీజస్వరూపుడతడు. అన్నిటికి నాధారమై దేనికిని లోనుగాక ప్రవర్తించెడి మహామహిముడు.

గీతాసాధన అమోఘమైనది. కర్మమే హెచ్చని చెప్పెడి శాస్త్రములు గలవు. భక్తి సర్వోత్తమమని చాటు శాస్త్రములున్నవి. జ్ఞానము ను యెత్తిపట్టిచూపెడి శాస్త్రము లును కలవు. కాని, భక్తి జ్ఞానకర్మములకు ఐకమత్యము సాధించి అడుగడుగునను జ్ఞానముయొక్క స్వాతంత్ర్యమును, భక్తియొక్క ప్రేమను, కర్మముయొక్క సదుపయోగమును సాధకునకు ఒదిగివచ్చునట్లొనర్చి ఆతని సాధనను సర్వాంగ సుందరముగ

చేయగల్గిన శాస్త్రమిదియొక్కటె యని చెప్పుట సమంజసమె కాని, సాహసముకాదు.

ఆర్త-అనాథ-పతిత-దళిత స్త్రీ పురుషులు ప్రతియొక్కరికిని గీతను ఆశ్రయించుటకు, అభ్యసించుటకు అధికారముగలదు. తానింతవరకు చేసిన పాపకర్మముల గురించి పశ్చాత్తాపముచెంది, తన హృదయనిధానమగు ప్రేమప్రవాహముతో జగదీశ్వరుని కుంభాభిషేక మొనర్పజాలు ప్రతియొక మానవుడును గీతకు అధికారియే. సమత్వమె గీతయొక్క యోగము. "చిత్తవృత్తులను నిరోధించుటయె యోగ"మని పతంజలి చెప్పుచుండ — "సుఖదుఃఖములను సమమొనర్చి, లాభనష్టములను జయాపజయములను ఒకేరీతి తెలియు కర్మకుశలత్వమె యోగ"మని గీతాచార్యుడాడుచున్నాడు.

గీతయొక్క పక్షపాతము భావసన్న్యాసముపైని; బాహ్యసన్న్యాసము పట్లకాదు. కర్మఫలముల నపేక్షింపక తన కర్తవ్యమును నిర్వహించువాడు — వాడె యోగియు; వాడె సన్న్యాసియుకూడ నని ఒక్కెడ గీత చెప్పినది. కామ్యకర్మన్యాసమె సన్న్యాసమనియు, సర్వకర్మఫలత్యాగమె త్యాగమనియు మరొక్కచోట గీత పేర్కొన్నది. ఈచిక్కులన్నియు సాధనయొక్క బాహ్యభూమికకు చెందినవి. అఖండ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపమును, నిర్గుణనిర్వికారమునునగు ఆత్మయె తాననియు, జగత్తునందలి కార్యములన్నియు జగదీశ్వరునియొక్క — లేదా — ఆతని ప్రకృతియగు మాయయొక్క లీలానాటకమునకు చెందిన అంగములనియు తెలిసి, దేహేంద్రియ మనస్సులచే నడచు కార్యములకును తనకును యెట్టి సంబంధము లేదనియు నెఱిగి, తన దేహేంద్రియమనస్సులచేత జగద్రూపియగు జగదీశ్వరుని ఆరాధించుచున్నాననని భావించి, తానొనర్పు కర్మముల నెప్పటికప్పుడు ఈశ్వరార్పణ మొనర్చుచు నిశ్చింతుడై యుండుటయె గీత ప్రతిపాదించెడి విచిత్రయోగము.

కర్మక్షేత్రమగు మనుష్యుని దేహమె ఒక యజ్ఞశాల. యజ్ఞమునందుపలెనె యిందును పదునెన్మిది మంది ఋత్విక్కులు గలరు. కన్నులు రెండు; చెవులు రెండు; ముకు బెజ్జములు రెండు; చేతులు రెండు; కాళ్లు రెండు; చర్మేంద్రియమొకటి; మూత్రేంద్రియమొకటి; మలేంద్రియ మొకటి; ఒకనోరు; ఒకనాలుక; మనస్సొకటి; బుద్ధి ఒకటి;

అహంకారమొకటి — ఇట్లు పదునెన్మిది మంది ఋత్విక్కులతో కూడిన దేహమనెడి యజ్ఞశాలయందు యింద్రియ విషయరూపములగు వస్తువులను ఆత్మ హోమ మొనర్చుచున్నాడు. రోగరుజనాదికములు యీ యజ్ఞమునకు విఘ్నములాపాదించు దుష్టశక్తులు.

ధర్మరాజు మొదలగు సద్వ్యక్తులే న్యాయముగ మన అంతఃకరణ రాజ్యమునకు అధికారులు. దంభ దర్పక్రోధ పారుష్యములనబడు దుర్యోధనాది దుష్టులు సద్వ్యక్తుల నుండి యీరాజ్యము నపహరించి అధికారము చేయుచున్నారు. అంతఃకరణ వృత్తిరూపిణియగు ద్రౌపదిని మానభంగమొనర్ప వీరెంతెంతో పాటుపడిరి; కాని, ధర్మరాజాదులు ప్రకృతిపతియగు పరమాత్మునియెడ అనన్యపరాయణులై యుండుటబట్టి సమస్త దుఃఖ సంకటములనుండి తేలికగ గట్టెక్కిరి. ధర్మరాజు అంతఃకరణ ప్రవృత్తి. భీముడు బలప్రవృత్తి. అర్జునుడు వీర్యప్రవృత్తి. నకుల సహదేవులు భక్తిజ్ఞానప్రవృత్తులు. వీరియందు వృత్తిమధ్యముడగు అర్జునునకే పరమాత్ముడు సారథియై దుష్ట సంహారమొనర్చి ధర్మమును రక్షించినాడు.

భగవద్గీత పరమాత్ముని వాఙ్మయమూర్తి. ఇది ఉపనిషత్తులలోని పడసారము. గీతాధ్యానమున చెప్పబడియెయున్నదిగదా! పరమాత్ముడు ఉపనిషత్తుల నన్నిటినిచేర్చి ఒక్క గోవుగచేసి అర్జునుని దూడగ నిడుకొని, తానే స్వయముగ పాలు పిదుకువాడై నిలబడి గీతామృతమును లోకమునకు ధారపోయుచున్నాడు, ఇది యెంతయో నిజమైన మాట! అర్జునుడునిమిత్తమాత్రము. గీతయొక్క నిజమగు ఉపదేశము జగత్తునందలి విచారశీలురగు సాధక బృందమునకుగా చెప్పబడినదని గ్రహించవలయును. గీతాచార్యుడె గురువు. శిష్యుడు అర్జునుడు. వీరిరువురి నడుమ నడచిన సంభాషణయే ఉపదేశము. శిష్యుని అజ్ఞానాంధకారమును దూరముచేసి, సర్వవిధ అభిమానములను త్రిపుటి విలక్షణమగు సర్వాత్మునందు విలయమొనర్చి సంపూర్ణ సుఖానుభవమును పొందించుటయే యీ ఉపదేశఫలము.




[ జనవరి సంచిక 8వ పేజీ తరువాయి ]



"అర్జునా! ఇందాక ఉపదేశించిన ఈ నా మార్గమును అనుసరించి ప్రవర్తించినవారు యోగయుక్తులు నాబడి సర్వ కర్మ బంధములనుండి విముక్తి నొందుదురు."

అని ఇట్లు భగవంతుడు తనమతము సర్వమానవులకును అన్వయించునది కావున దానిని పలుభంగుల ప్రశంసించెను. భగవదర్పణ బుద్ధితో గూడిన నిష్కామకర్మముల నాచరింపవలెననెడి భగవన్మతమును త్రోసి రాజనెడి మూఢులకు మూడెడి ముప్పునుగురించి శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు.

(శ్లో॥ 32) "ఆర్జవగుణ సంపన్నుడవైన ఓ అర్జునా! నాస్తికస్వభావము కలవారై గురుశాస్త్రప్రవచనములందు శ్రద్ధలేక గుణములందు దోషముల నారోపించుచు అసూయాగ్రస్తులై పూర్వోక్తమగు నా అభిప్రాయమును తిరస్కరించెడివారిని అత్యంత భ్రష్టచిత్తులనుగా భావింపుము. స్వయంకృతమగు ఆదోషము వలన వారికి తామొనర్చు కర్మవిషయక పరిజ్ఞానము సున్నయైనది. సగుణబ్రహ్మమునకును నిర్గుణబ్రహ్మమునకును సంబంధించిన జ్ఞానము కూడ వారికి దూరమైనది. ప్రమాణ ప్రమేయ ప్రయోజనములయెడ వారు విమూఢులై ప్రవర్తించెదరు. కర్మవిషయక బ్రహ్మవిషయక జ్ఞానములు యేప్రమాణములవలన సిద్ధములగునో వాటి ప్రమేయప్రయోజన లెవ్వియో ఆమూఢులకు తెలియదు. కాబట్టి వారు సమస్త పురుషార్థములనుండి భ్రష్టులగుచున్నారు."

"సామాన్యముగ లోకమున రాజాజ్ఞనుల్లంఘించిననుకూడ భయము తప్పదు. అట్టియెడ ఈశ్వరుడవగు నీయాజ్ఞను దాటినవారికి చేటు వాటిల్లకపోవునా? ఈవిషయము

నెఱింగియు మూఢులగువారు అసూయాపరులై నీయాజ్ఞల నతిక్రమించు టెందుకు?" అను శంకకు శ్రీభగవంతుడు సమాధానమొసగుచున్నాడు.

(శ్లో॥ 33) "అర్జునా ! గతజన్మములందు చేయబడిన ధర్మాధర్మ సంస్కారములును, జ్ఞానేచ్ఛాది సంస్కారములును, ఈవర్తమాన జన్మమందు అభివ్యక్తములై యుండును. ఆ అభివ్యక్త సంస్కారరూపమును 'ప్రకృతి' అందురు. అది అన్నివిధముల బలిష్ఠమైయుండును. బలవంతమగు ఆ ప్రకృతిని బ్రహ్మజ్ఞానులు సైతము ఒప్పియున్నారు. గుణదోషముల గుట్టు గుర్తించిన బ్రహ్మవేత్తలుకూడ సంస్కారరూప ప్రకృతికి ఊడిగములు సేయుచున్నారనిన యిక అజ్ఞానమానవుల విషయము చెప్పు టెందుకు? వారు ప్రకృతిశాసనమునకు వివశులై పతితులగుచున్నారు."

'జ్ఞానవాన్' అను పదమునకు బ్రహ్మజ్ఞానియనికాని లేదా, గుణదోష వివేకముగల పండితుడనికాని అర్థము చేసుకొనవచ్చును. ఇచ్చట ఆచార్యులవారు, "పశ్వాదిభిశ్చావిశేషాత్" అని చెప్పి, భోజనపానాది వ్యవహారములందు వివేకవంతుడుకూడ పశ్వాదులకు సమానుడనియె నుడివిరి.

"ధనంజయా ! విశృంఖలమై చెలరేగు రాగప్రవృత్తిని అరికట్టుటకెట్టి శాసనములును పనికిరావు. నాయాజ్ఞనుల్లంఘించుటచే కలుగు దుష్పరిణామమును గమనించుచుకూడ పూర్వవాసనల దాడికి తాళలేక మూర్ఖమానవుడు అధోగతి పాలగుచున్నాడు."

పూర్వార్జితములగు కర్మముల యొక్క సంస్కారము – ఆ స్వభావము జ్ఞానికి నిజముగ సంబంధించి యుండునా? లేనిచో, జ్ఞానికూడ తన ప్రకృతిననుసరించియె ప్రవర్తించుననుమాట యెట్లు చెల్లును? అని శంకింతువేమో!

వినుము. వాస్తవమున జ్ఞానికెట్టి సంస్కారములతోడను సంబంధము లేదు. అంతేకాదు. వానివలన నెట్టి క్రియయు జరుగుటలేదు. అయినను ఒక్కవిషయము గ్రహింపవలసియున్నది. ఆతని అంతఃకరణమునందు పూర్వార్జితమై ప్రారబ్ధసంబంధమగు సంస్కారమున్నది. దానికి అనుకూలముగ ప్రారబ్ధము తీరువరకు వాని మనోబుద్ధీంద్రియములు ప్రవర్తించుచుండును. కర్తృత్వాభిమానములేక లోకసంగ్రహమునకు

వలయు క్రియలు నడచుచుండును. లోకవ్యవహారమున ఆక్రియా ప్రవృత్తులను జ్ఞానులయందు ఆరోపించుట కలదు. ఆ ఆరోపిత దృష్టిననుసరించి 'జ్ఞానులుకూడ తమ ప్రకృతిని అనుసరించియె ప్రవర్తింతుర'ని చెప్పబడినది. అంతే. జ్ఞానులవ్యవహారములు అకర్తృత్వబుద్ధివలన నడచుచుండును. వారియందు రాగద్వేషములు కాని, అహంకార మమకారములు గాని యుండవు."

ఈ శ్లోకమున 'చేష్టతే' అనెడి క్రియాప్రయోగము యీ విశిష్టార్థమును సూచించుచున్నది.

"ఇట్లు ప్రాణులందరున్ను తమ తమ స్వాభావప్రకృతిననుసరించి మెలగుచున్నారనిన లౌకికపురుషార్థమునకును వైదికపురుషార్థమునకును ప్రయోజనమే లేకపోవును. 'స్వర్గ కామో యజేత' అనియు, 'పర దారాన్న గచ్ఛేత్' అనియు చెప్పిన విధినిషేధవాక్యములు వ్యర్థములు కాగలవుకదా!" అనెడి శంకను నివారించుచు క్రిందిశ్లోకమును భగవానుడు నుడువుచున్నాడు.

(శ్లో॥ 34) కిరీటీ! మనోబుద్ధి చిత్తాహంకారభేదములనొప్పు అంతఃకరణమును, పంచజ్ఞానేంద్రియములును, పంచకర్మేంద్రియములును, తమకు అక్కఱ అగు విషయముల యెడ ప్రీతియు, పొసగని విషయములవంక ద్వేషమును కనబఱచును. ఇంద్రియములు విషయములందు చేరుటకును చేరకుండుటకును యీ రాగద్వేషములె కారణము. శాస్త్రజ్ఞానబలములేక కేవలము స్వభావమునకె బానిసలై యుండెడివారు యేదోనొకవిషయ మగపడినచో వలయునని దేబరించుటో, వద్దని నిరాకరించుటో జరుగుచున్నది. శాస్త్రీయసంస్కారముకలిగి తదనుకూలమగు ఆచరణము కలవారు స్వభావజన్యములై నెట్టుకొనివచ్చు రాగద్వేషములకు వశముకారాదు. ఆ రాగద్వేషములు శ్రేయోమార్గమున పయనించు సాధకునకు ద్రోహముచేయునవి.

ఈ రాగద్వేషములు సాధకుని శ్రేయోమార్గమునకు కంటకము లెట్లు కాగలవని యడిగెదవేమో; ఓ సవ్యసాచీ! చెప్పెద వినుము. ఒక యాత్రికుడు కలడు. అతడు తన గమ్యమును పడిగ చేరదలచి పయనించుచుండెను. కొందరు దొంగలు వానిని దోచుకొనదలంచి మిత్రులవలె నటించుచు తోడై మోసగించి తప్పుదారి పట్టించిరి.

(మిగత 15-వ పేజీలో)

# సానువాదశంకరభాష్యసమలంకృతము

## శ్రీమద్భగవద్గీత

అనువాదకులు

## శ్రీ స్వామి శుద్ధచైతన్య జీ.

[ 1953 నవంబరు సంచిక 15_వ పేజీ తరువాయి. ]



భా:- న శోచ్యాః అశోచ్యాః భీష్మద్రోణాదయః సద్వృత్తత్వాత్ పరమార్థరూపేణ చ నిత్యత్వాత్.

**అను:- శోకింపదగనివారు అశోచ్యులు. భీష్ముడు ద్రోణుడు మున్నగువారు అట్టివారు. ఏలన, వారు పవిత్రచరిత్రులు; వస్తుతః నిత్యులు గూడ.**

భా:- తాన్ అశోచ్యాన్ అన్వశోచః అనుశోచితవాన్ అసి "ఏతే మ్రియన్తే మన్నిమిత్తం అహం తైః వినాభూతః కిం కరిష్యామి రాజ్యసుఖాదినా" ఇతి.



**అను:- "నా మూలమున వీరు మరణింతురు; వీరు లేకుండ రాజ్యసుఖము మున్నగువానిచే నేను చేయునదేమిటి?" అని దుఃఖింపదగని యా భీష్మద్రోణాదులనుగూర్చి దుఃఖమును బొందినవాడవైతివి.**

భా:- త్వం ప్రజ్ఞావాదాన్ ప్రజ్ఞావతాం బుద్ధిమతాం వాదాన్ చ వచనాని భాషసే, తత్ ఏతత్ మౌఢ్యం పాణ్డిత్యం చ విరుద్ధం ఆత్మని దర్శయసి ఉన్మత్త ఇవ ఇతి అభిప్రాయః.

**అను:- నీవు పండితులు పలికెడి పలుకులను నయితము పలుకుచున్నావు; ఇటుల నీవు పిచ్చివానివలె పరస్పర విరుద్ధములగు భావములను (అనగా) మూఢత్వమును పాండిత్యమును నీయందు గనబఱచు చున్నావని యభిప్రాయము.**

భా:- యస్మాత్ గతాసూన్ గతప్రాణాన్ మృతాన్ అగతాసూన్ అగతప్రాణాన్ జీవతః చ న అనుశోచన్తి పణ్డితాః ఆత్మజ్ఞాః.

అను:— ఏమన, ప్రాణములు పోయినవారినిగూర్చికాని బ్రదికియున్న వారినిగూర్చికాని ఆత్మవేత్తలు దుఃఖింపరు.

భా:- పణ్డా ఆత్మవిషయా బుద్ధిః యేషాం తే హి పణ్డితాః "పాణ్డిత్యం నిర్విద్య" ఇతి శ్రుతేః

అను:— "పాణ్డిత్యం నిర్విద్య" అనెడి శ్రుతినిబట్టి పండా అనగా ఆత్మ విషయకమైనజ్ఞానము; అట్టిజ్ఞానముగలవారే పండితులని యర్థము.

భా:- పరమార్థతః తు నిత్యాన్ అశోచ్యాన్ అనుశోచసి అతః మూఢః అసి ఇతి అభిప్రాయః

అను:— ఆత్మరూపేణ నిత్యులును దుఃఖింపరానివారును నయినవారిని గుఱించి దుఃఖించితివి; కావున నీవు మూఢుఁడవని అభిప్రాయము.

భా:- కుతః తే అశోచ్యాః యతః నిత్యాః కథమ్—

అను:— ఎందువలన వారు దుఃఖింపదగియుండరు? నిత్యులు గనుక. ఎట్లు?—

న త్వేవాహం జాతునాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయమతఃపరమ్ ॥ 12

భా:- న తు ఏవ జాతు కదాచిత్ అహం న ఆసం కిన్తు ఆసం ఏవ.

అను:— నేను ఒకప్పుడును లేనను మాటలేదు. మఱేమన ఉండియే యుంటిని.

భా:- అతీతేషు దేహోత్పత్తివినాశేషు నిత్యం ఏవ అహం ఆసం ఇతి అభిప్రాయః.

అను:— కడచిన దేహములకు జననములు మరణములు సంభవించినను నేను నిత్యుఁడనుగానే యున్నానని యభిప్రాయము.

భా:- తథా న త్వం న ఆసీః కిన్తు ఆసీః ఏవ, తథా న ఇమే జనాధిపాః న ఆసన్ కిన్తు ఆసన్ ఏవ.

అను:— అటులనే నీవును లేవనెడి మాటలేదు. మఱేమన ఉండియే యున్నావు. నీవలెనే యీ రాజులును లేరనెడి మాట లేదు. ఉండియే యున్నారు.

భా:- తథా న చ ఏవ న భవిష్యామః కిన్తు భవిష్యామః ఏవ.

అను:— అటులనే ఇకముందు ఉండము అనెడి మాటలేదు. మఱేమన ఉండనే బోవుచున్నాము.

భా:- సర్వే వయం అతః దేహవినాశాత్ పరం ఉత్తరకాలే అపి త్రిషు అపి కాలేషు నిత్యాః ఆత్మస్వరూపేణ ఇతి అర్థః.

**అను:-** మనమందఱము ఈ దేహములు పడిపోయిన తరువాత గూడ (అనగా) మూడు (అన్ని) కాలముల యందును ఆత్మరూపేణ నిత్యులముగానే యుందుమని అర్థము.

భా:- దేహభేదానువృత్యా బహువచనమ్ న ఆత్మ భేదాభిప్రాయేణ.

**అను:-** "మనము" అనెడి యీ బహువచనము ఉపాధు (దేహము) ల భేదమును బట్టియే ప్రయోగింపబడినది; గాని ఆత్మలు వేఱు వేఱు* అనెడి అభిప్రాయముతో గాదు. (సశేషము)

(12-వ పేజీ తరువాయి)

అంతట అడవియందు అసహాయస్థితిలో చిక్కించుకొని ఆ బాటసారికడనుండు సామగ్రుల నపహరించి వాని నొక లోయయందు ద్రొబ్బిపోయిరి. ఆ విధముగనె పరమార్థపథమున పయనించు సాధకుని వెన్నంటి వాని నుత్పథునిచేసి వివేకశక్తినికొల్లగొట్టుటకై రాగద్వేషములు తరివేచియుండును. సాధకుడు వీటి బారి చిక్కినచో అధోగతి పాల్పడుట తప్పదు.

భగవంతు డీవిధముగ ప్రకృతికి అనుకూలమగు ధర్మమును అవశ్యముగ ఆచరించియే తీరవలెనని వివరించి, ఆ మీదట పరధర్మమునకంటె స్వధర్మము గొప్పదనియు, పరధర్మాచరణమువలన కలుగు కీడులను గూర్చియు చెప్పబోవుచున్నాడు.

---

* ఆత్మలు వేఱువేఱు అను విషయమై ఏయే హేతువులు కనబడుచున్నవో ఆ హేతువులన్నియు దేహములయందే (స్థూలసూక్ష్మ కారణ శరీరములయందే) కనబడుచున్నవిగాని ఆత్మయందు గాదు. ఆత్మయందే విధమగు భేదమును లేదు. ఆత్మయందు భేదము కలదనువారు ఆత్మనెఱుగనివారే. ఆత్మ కానిదానిని (దేనితో) ఆత్మయని భ్రమించి దాని భేదములను ఆత్మయందు ఆరోపించుచున్నారు. త్రికాలాబాధ్యమైన ఉనికిరూ ఆత్మకు స్వరూపము గా ఇట భగవంతునిచే ఉపదేశింపబడినది.

# * గీతా సముద్రము *

రచనః— పూజ్యపాద శ్రీశ్రీశ్రీస్వామి ఓంకార్ జీ.

శాంతిమిషన్, కైలాసాశ్రమం, వాల్తేరు.

## రెండవ భాగము.

(1953 నవంబరు సంచిక 20-వ పేజీ తరువాయి.)



**శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥**

"శ్రీకృష్ణార్పణమస్తు" అని భక్తితో ఒక ఆకుగాని, పువ్వుగాని, పండుగాని, నీరుగాని ఎవరు ఈశ్వరునకు అర్పించుచున్నారో, వారికి ఆయన అన్ని కష్టములను పోగొట్టి సుఖమునిచ్చును. కావున భగవంతునికి అర్పించుటకు నిర్మలమైన మన హృదయకమలముచాలును. మనము చేయుకార్యములఫలములనన్నింటిని శ్రీకృష్ణునకు అర్పించి, శ్రీకృష్ణభగవానునే సర్వమందును గాంచుచు ఆయననే తమగతిగా శరణ్యముగా, గమ్యస్థానముగా జేసుకొని మానవులందరి సేవయుం చేసి, శ్రీ భగవత్సేవగా నెంచి జీవించెడి వారి జీవితములే ధన్యవంతములు.

శ్రీ కైలాస ఆశ్రమములో "సముద్రము ప్రార్థించుచున్నది, ఓ మనుజుడా! నీ వేల ప్రార్థించవు?" అని ఒకచోట వ్రాయబడియున్నది. ప్రతి కెరటమును ఒక ప్రార్థనయే! అట్టిరీతిగా, ప్రతి ఆలోచనయు ఒక ప్రార్థనగా దైవమునకు అర్పించెడివారి జీవితములు ఆదర్శనీయములు.

ఈ మౌనపు దినములలో, గీతాసారమును, పారాయణజేయు పుస్తకములనుండి మాత్రమే గాక, నిరంతరమును, అహర్నిశములందును, సముద్రనాదమునందు అనుభవింపుచుండుట, నాకెంతయో వర్ణనాతీతమైన ఆనందము నొసంగుచుండును. గీతా సముద్రము నాకుబోధించుచున్న భావములను క్లుప్తముగా మీతో జెప్ప కోరుచున్నాను.

(1) సముద్రము అంతా ఒక్కటియేయైనను దానిని స్థలభేదములనుబట్టి అనేక నామములతో మనము పిలుచుచున్నట్లు, బ్రహ్మము ఒక్కటియేయైనను, దానినే అనేకమంది, అనేకమైన పేర్లతో పిలుచుచుందురు.

(2) అన్నినదులును సముద్రములోపలనే ప్రవేశించునట్లు, అన్ని మతములును ఒకే నిత్యమైన సత్పదార్థమును కనుగొనుటకే ప్రయత్నము చేయుచు, ఒకే గమ్యస్థానమును జేర్చుచున్నవి.

(3) సముద్రము అఖండముగా, అపారముగాయున్నను నిరంతరము దానియందు

కెరటములు లేచుచు, ఆడుచు, మరల అందే లీనమగుచున్నట్లు పరబ్రహ్మములో విశ్వము సృష్టి, స్థితి, లయములను పొందుచున్నది. ఏ కెరటమునకు ఆ కెరటము వేరుగా పుట్టుచు, ప్రకృతి ధర్మము ననుసరించి వర్తించుచు, మరల సముద్రములో లీనమగుచున్నట్లు మనుజులు వేరు వేరు వ్యక్తులుగ ఉద్భవించి, జీవించుచు, అంత్యమున పరబ్రహ్మమునందే లయమునొందుచున్నారు. ఈ అభేదజ్ఞానము అనుభవయుతముగాగల వారికే శాశ్వతశాంతి కలుగుచున్నది.

(4) కెరటములు నిరంతరము జేయుచున్న చలనమునకు, ఏ ఫలితమును కోరనట్లు మానవులు తాము చేయుచున్న విధ్యుక్త కర్మలకుగూడ ఫలితమును కోరకుండ, శ్రీకృష్ణార్పణబుద్ధితో చేయుటయే, మనోశాంతికి ముఖ్యావసరము. కెరటములు వాటి హృదయానందముకొరకే సముద్ర గర్భము నుండి ఆనందముతో వచ్చుచు, మరల అందే లీనమగుచున్నట్లు, మనము జూచుచుంటిమి. అటులనే, ఎనుబదినాలుగులక్షల జీవరాసులును, అప్రయత్నముగా దైవమునుండి వ్యక్తమై, మరల ఆ పరాత్పరునియందే లీనమగుటకు సదా ప్రయత్నమును జేయుచున్నవి. గీత అందులకు చక్కనిమార్గమును చూపుచున్నది.

(5) అన్నిటికంటెను ముఖ్యమైన విషయమేమన, అలలులేని సముద్రము సంకల్ప రహితమైన మనస్సునుబోలి నిర్వికల్పమును బోధించుచున్నది.

(6) సముద్రగర్భమున ఎంత లోతునకు పోయిన అంతఎక్కువ నాణ్యమైన ముత్యములును, రత్నములును లభించును. అటులనే సాధకుడు ప్రవృత్తినివిడచి, నివృత్తిపరుడైన కొలది ఎన్నియో అమూల్యమైన శాంతి ముత్యములను, జ్ఞానరత్నములను తన హృదయములోనె గాంచగలడు.

(7) కెరటమునకు సముద్రమే ఆధారమైనట్లు, జీవునకు పరబ్రహ్మయే ఆధారమైయున్నదనెడి సత్యమును, సూక్ష్మముగా మనముగీతాశాస్త్రమునుండిగ్రహింపవలెను.

(8) సముద్ర జలముయొక్క రుచిని గ్రహించుటకు అందలి ఒకబిందువును రుచిచూచినచాలును. అటులనే గీతారసాస్వాదనము చేయుటకు ఒక్క శ్లోకముయొక్క భావమును అనుభవముగా గ్రహించిన చాలును.

(9) సముద్రతీరమున ఎక్కువ హోరు ఉండును గాని, లోతునకు వెళ్ళిన నిశ్శబ్దముగా ఉండును. అటులనే ప్రార్థనధ్యానాదుల ప్రథమస్థితులలో మనస్సు చంచలముగాయున్నను సమాధిస్థితిని పొందునప్పుడు నిశ్చలమై గీతాసారమగు ఆనందమును గ్రోలుచుండును.

(10) మానవుని పరమావధియగు బ్రహ్మానందము వ్యక్తిగతమగు జీవనమందు గల విషయానుభవముచే చేకూరదు. బుద్బుదమందుగల నీటి బిందువులను నేకరించిన దప్పితీరదుగదా! శాశ్వతమైన బ్రహ్మానందము, అవ్యక్తబ్రహ్మమను సముద్రమునందు ఐక్యసంధానమగుటవలననే గలుగును.

(11) ఎన్నిమారులు, యెన్నిరీతులుగా జెప్పినను తనివితీరని సముద్రసందేశమేమన: కెరటము సముద్రమునుండియే యుద్భవించి

సముద్రమునందే గానవచ్చుచు, మరల ఆ సముద్రమునందే లీనమగుచున్నట్లు ఈ బ్రహ్మాండమైన సృష్టిఅంతయు అవ్యక్తమైన పరబ్రహ్మము నుండియే యుద్భవించుచు, ఆ సచ్చిదానంద స్వరూపమునందే కన్పట్టుచూ, చివరకు ఆ దివ్యతేజస్సునందే లీనమగుచున్నది.

(12) అప్పుడిప్పుడు మాత్రమేగాక, సముద్రము నిరంతము "సోఽహం సోఽహం = అదియే నేను, అదియే నేను, ఓం, ఓం, ఓం" అని అనుచు, ప్రణవగానము జేయుచున్నది. అటులనే మనుజుడు తనలో నిరంతరము, సహజముగా నున్న అజపగాయత్రిని "సోఽహం" భావమును, ఉచ్ఛ్వాస నిశ్వాసలలో అహర్నిశములు అనుభవించుట బాగుగ గ్రహించవలెను. అదియే మానవజన్మ పరమావధి. ఇదియే గీతాసారము.

ప్రియమైన గీతారహస్యాన్వేషకులారా! గీతామహాత్మ్య వర్ణనమందు, ఉపనిషత్తులన్నియు గోవులనియు, గీతామృతము క్షీరమనియు, క్షీరమును పిండెడివాడు గోపాలుడైన శ్రీకృష్ణుడనియు, ఆక్షీరమును గ్రోలెడువాడు ఆవుదూడవంటి అర్జునుడనియు జెప్పబడియున్నది. మనమందరమును ఆవుదూడవలె, అర్జునునివలె, గీతామృతమును నిరంతరము గ్రోలుచు శ్రీకృష్ణపరమాత్మలో లీనమయ్యెదముగాక!

మన మిప్పుడు భూమిపైగల మహానదులన్నింటిని లోకసంగ్రహమునకై అవతరించిన వివిధ మతగురువులకుగాని, అవతారమూర్తులకుగానిపోల్చవచ్చును. మహాసముద్రమును అవ్యక్తమైన, అఖండమైన, అవాఙ్మానసగోచరంబైన పరబ్రహ్మ స్వరూపునకు పోల్చవచ్చును. పావనమైన నదులు గంగ, యమున, సింధు, కావేరి, కృష్ణ, గోదావరి, బ్రహ్మపుత్ర వగైరాలు, పాశ్చాత్యదేశములో, నైలు, నయాగ్రా, మిసిసిపి, డేన్యూబు, అమెజాన్, థేమ్సు మొదలైన మహానదులన్నియు, భూమినంతను సారవంతము జేయుచు, పాడిపంటలను సిరిసంపదలను మానవకోటికి నొసంగుచున్నవి. ఈనదులన్నిటికి ఆధారము మహాసముద్రమే. సూర్యరశ్మిచే సముద్రజలము ఆవిరిగామారి, మేఘములై పర్వతములపై వర్షించిన నదులన్నిటికి ఆధారభూతమగుచున్నది.

సగుణోపాసకులైన భక్తులు తమతమ వివిధ ఇష్టదైవములను, వేరువేరు గురుమూర్తులను, అవతారమూర్తులను పూజించుచు, ధ్యానించుచు, నదులు సముద్రమున జేరునట్లు, ఒకే సచ్చిదానంద స్వరూపమైన అద్వితీయమైన పరమాత్మలో ఐక్యము బొందుచున్నారు. మనదేశములో అనేక ఆధ్యాత్మిక సంస్థలు, ముఖ్యముగ "గీతావాణి" చేయుచున్న బ్రహ్మాండమైన కృషిచే ఆంధ్రులందరును గీతారహస్యమును బాగుగ గ్రహించి, తమ ధర్మమును తాము బాగుగ గుర్తెరింగి, యీ పవిత్రమైన భారతీయరంగములో, ఈశ్వరానుగ్రహముచే, తాము తమ పూర్వజన్మ సుకృత విశేషముచేతను, తాము ఏ పాత్రధారుల్చవలసి వచ్చినను, దానిని లోకమునకు ఆదర్శప్రాయ

ముగ, శ్రీ కృష్ణభగవానుని అనుగ్రహము చేత, నటించగలరని పూర్తిగ విశ్వసించుచున్నాను.

గీతాసముద్రము నాకు నిరంతరము బోధించుచున్న యీ గీతాసారమును మీ అందరితో పంచుకొనుటకు సావకాశమిచ్చినందులకు ధన్యుడను.

గీతామృతము అన్ని దేశములలోను, అన్ని మతముల వారికిని, నిజమైన శాంతి పిపాసకుల కందరకును పూర్ణ శాంతిని ఎల్లప్పుడును చేకూర్చుగాక !

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు ।
ఓం సర్వేషాం శాంతిర్భవతు ।
ఓం సర్వేషాం పూర్ణం భవతు ।
ఓం సర్వేషాం మంగళం భవతు ।
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః !

— స్వామి శ్రీ ఓంకార్.

## భగవద్గీత — బైబిలు.

పూజ్యశ్రీ గాంధీగారు జీవించి ఉండిన తరుణం. వారు సేవాగ్రామంలో తన కుటీరమునందు రాట్నం వడుకుతూ కూచున్నారు. అమెరికానుండి ఒక ఫాదిరీగారు ఆశ్రమానికి అతిథిగా వచ్చివుండినారు. వారూ ఆ కుటీరంలోకి గాంధిగారి సరసకు వచ్చి కూర్చొన్నారు. గాంధీగారి చేరువలో గీత, బైబిలు రెండూ ఒకదానిపై ఒకటి పెట్టబడి ఉండినవి. గీతాగ్రంథం క్రింద ఉండింది. దానిపై బైబిలు ఉండింది. ఫాదిరీగారు చప్పున అన్నారు: "మిస్టర్ గాంధీ! మీ గీతకు పైగా మా బైబిలు ఉంది."

ఫక్కున నవ్వి గాంధీగారు అన్నారు: "మా భగవద్గీత ఆధారంతో మీ బైబిలు ఉంది."

ఫిబ్రవరి 13_వ తేది నుండి 17_వ తేదీ వరకు హాస్పేట
శ్రీ గీతాసేవాశ్రమమునందు జరిగిన చతుర్థవార్షికోత్సవ సందర్భమున
శ్రీ రామతీర్థ సేవాశ్రమాధ్యక్షులు పంపిన సందేశము.

ఓమ్.

# నా వినతి:

గీతాభక్తులారా! జీవిత సంగ్రామయోధులారా! మీ అందరిలో ప్రకాశిస్తున్న శ్రీ కృష్ణజ్యోతికి భక్తిపూర్వకంగా జోహారుచేస్తున్నాను. ఈ గీతా సేవాశ్రమ చతుర్థ వార్షికోత్సవ సందర్భమున సమావేశమైన మీ అందరూ గీతలోని సువర్ణాక్షరపంక్తులవలె ఉన్నారు. మీ అందరికీ అభివాదాలు. గీతాసేవాశ్రమం ప్రజాసేవలో ధన్యతగాంచుగాక! వర్ధిల్లుగాక!

విశ్వమానవజాతికి ఆశాతార శ్రీమద్భగవద్గీత. భగవద్గీత భగవంతుని హృదయం. భగవద్గీత పరమసత్యవ్యాఖ్యానము. గీత మామూలు గ్రంథంకాదు. భగవంతుని అధరాలే దాని అట్టలు. పరమాత్మయొక్క సహస్రజిహ్వాలే దానిలోని పేజీలు. దానిలోని అక్షరపంక్తులు సర్వేశ్వరుని మధుర వాక్కులు. ఈ విషయం మనం సర్వదా గుర్తుంచుకోవాలె. ఓంకారంలో సర్వశబ్దాలు, సర్వమూ యిమిడియున్నట్లు, గీతలో సర్వ వేద వేదాంతాలు, సర్వశాస్త్రాలు, సర్వమతప్రబోధాలు ఇమిడియున్నాయి. భగవంతుని హృదయాన్ని అర్థంచేసుకోను, గీతను అర్థంచేసుకోవలసియున్నది. పరమేశ్వర హృదయమును గ్రహించడానికి ఉన్న సాధనాల్లో భగవద్గీతే పరమోత్కృష్టసాధనం. గీతాతత్త్వమును గ్రహింపగలిగిన హిందువుడు, వేదశాస్త్రాలను సరిగా గ్రహించగలుగుతాడు. అతడు సత్యహిందువుడుగా ప్రకాశిస్తాడు. గీతా ప్రబోధమును అర్థంచేసుకున్న మహమ్మదీయుడు, ఖుర్_ఆన్_షరీఫ్‌ను సక్రమంగా ఉపయోగించుకోగలుగుతాడు. గీతను అవగాహనం చేసుకొన్న క్రైస్తవుడు బైబులును సద్వినియోగం చేసుకొంటాడు. గీతను అధ్యయనం చేసుకున్న మానవుడు, నిజమైన మతమును తెలుసుకో

గలదు. గీత సర్వమునూ సత్పథంలో పెడుతుంది. గీత దేనినీ చెడగొట్టదు. చెడిపోయినదానినిగూడా బాగుచేస్తుంది. గీతాసంజీవనితో మనం శివత్వమును విడచి శివత్వమును పొందగలుగుతాము. ఇది పరమ సత్యం.

గీత అవతరించిన తరువాతకూడా మనం కల్లోలావస్థలో గంద్రగోళపడుతూ జీవనయాత్ర — కాదు — మరణయాత్రచేయడం దురంత దురదృష్టం! సుస్పష్టమైన ఈశ్వరవాణి వినిపించిన పిదపకూడా మనం మత కలహాలతో, కులద్వేషాలతో, దురాశాతృష్ణలతో, పైశాచిక చర్యలతో కాలం గడపడం పరమనాస్తికత్వంకాక మరేమిటి? దైవవిశ్వాస రాహిత్యంకాక మరేమిటి?

జీవిత సంగ్రామరంగంలో విషయ నిర్జితులమై వణికిపోతున్న మనలను యోధులనుగా ధర్మవీరులనుగా చేయడానికే, శ్రీమద్భగవద్గీత ఉదయించింది. బొందితో కైలాసమన్నట్లు నిన్ను నిన్నుగానే, నీవున్న రంగాన్ని ఆ రంగంగానే ఉంచి, నిన్ను నారాయణునిగా, నీవున్న రంగాన్ని వైకుంఠంగా శ్రీమద్భగవద్గీత మార్చివేస్తుంది. అదే దాని అద్భుత ప్రభావం! మోక్షమును "ఇప్పుడు"గా, స్వర్గమును "ఇక్కడ"గా గీత చేస్తున్నది!

ఇట్టి గీతామరబోధనలను సక్రమవిధానంలో గ్రహించి, స్వచ్ఛ శాంతిశ్రీని అనుభవించడానికి, మనం హృత్పూర్వక ప్రయత్నాలు చేస్తాముగాక! ఈ విషాదాధ్యాయమును అతిక్రమిస్తాముగాక! నమస్తే!!

ఓం తత్సత్

31—1—54.  — శ్రీ కేశవతీర్థస్వామి.



ఓం.

శ్రీ కృష్ణాయ నమః.

# గీతకు పూర్వభూమిక

(శ్రీ వంగీపురం రంగస్వామి అయ్యంగారు, పాకాల.)



రాజసూయయాగమున నగుపడినపాండవుల వైభవమును సంపదను జూచినపుడు దుర్యోధనుని మానసక్షేత్రమున నసూయ యంకురించెను. అందుకుతోడు శకుని ప్రేరణమున దుర్యోధనుఁడు యుధిష్ఠిరుని పాచికలాడపిలిచి కపటోపాయమున ధర్మజు నోడించి యతని సర్వస్వమును గ్రహించి ద్రౌపదీ సహితులై పాండవులు పండ్రెండు వత్సరము లరణ్యావాసము చేసి పదుమూడవ యేడజ్ఞాతవాసము సలుపం జేసెను. ఈపగిది క్రమముగ వారు పదుమూడేండ్లు పలు పాట్లుపడి యొప్పందము చొప్పున తమ రాజ్యము తమకియ్యమని పాండవు లెంత వేడినను, వయోవృద్ధుఁడగు ద్రుపదుని పురోహితుని పంపియడిగినను దుర్యోధనుఁడియ్యకొనలేదు. యుద్ధము తప్పదని యిరుపక్షముల వారు సన్నాహములు గావించుచుండిరి.

దుర్యోధనుఁడు శ్రీ కృష్ణుని మూలమున సహాయము పొందనెంచి ద్వారకాపురి కేగెను. అదే సమయమున నర్జునుఁడందు నిమిత్తమచ్చటికేతెంచెను. అప్పుడు శ్రీ కృష్ణుఁడు నిద్రించుచుండగా దుర్యోధనుఁడు తనకు గౌరవహానియగునని యెంచి కృష్ణుని పాదములవద్ద నుండనొల్లక శిరమువైపున నాసీనుఁడయ్యె. భగవంతుని పాదముల నాశ్రయించిన నిహపరములు గలుగునని తలఁచి భక్తితో నంజలిగీలించి యర్జునుఁడు కృష్ణుని పాదములవద్ద నిలచెను. నిద్ర మేల్కొనగానే కృష్ణునిదృష్టి యర్జునుని మీదఁబడెను. పిదప దుర్యోధనునిఁజూచెను. అతఁడిరువుర నాదరమున నాహ్వానించి వచ్చినపనియేమని యడుగ దుర్యోధనుఁడిట్లనియె: "కృష్ణా, నీకు నాయందును అర్జునుని యందును సమానప్రేమగలదు. బాంధవ్యమునను నీకు మేము సమానులమే. కాని నేను తొలుతవచ్చితిని. కనుక నాకు సాయమొనర్చుట తొలికర్తవ్యము. ఇప్పుడు ప్రపంచమున నీవే యుత్తముఁడవు. నీవు నాకే సాయమొనర్పందగుదువు". అందుకు కృష్ణుఁడు "దుర్యోధనా! నీమాటయందిం చుక సత్యమున్నది. కాని నేను తొలుత నర్జునునిఁజూచినందున నిరువురకు సాయమొనర్తును. శాస్త్రముచొప్పున చిన్నవానికి ముందు సాయము చేయుట ధర్మము. ఈ యుద్ధమున రెండువిధముల సహాయము నావలన లభించును. నాయమోఘమగు నారాయణ సేనాబలము పొందుటయొకటి. శస్త్రము ధరింపక యుద్ధము సేయకుండు నా యొక్క నిసహాయమపేక్షించుట రెండవది. అర్జునా! యిందు నీ కేదికావలె"నన గా నర్జునుఁడు ఆదిదేవుఁడైన నారాయణుఁడే యగు శ్రీ కృష్ణుని సాయము వేడెను, దుర్యోధనుఁడు, గొప్పదగు నారాయణ

సేనాబలము గోరని యర్జునుఁడు తెలివితక్కువవాఁడనియు, దానింగోరిన తాను బుద్ధిమంతుఁడనియు భావించి వెడలిపోయెను. కృష్ణుఁడర్జునునిఁజూచి 'నీ వేల నిరాయుధుఁడను యుద్ధముచేయనని సంకల్పించుకొన్న వాడఁనగు నన్ను గోరితివి?' యని యడుగ నర్జునుఁడిట్లనెను: 'కృష్ణా! చిరకాలమునుండి నేను నీ సారథ్యముఁగోరుచుంటిని. నా వాంఛ యీ యుద్ధమున లభింపవలెనని, యిట్లడిగితిని'. కృష్ణుఁడందుకు సంతసించి యంగీకరించి 'పార్థసారథి' యనిపించుకొనెను; తన భక్తపరాధీనత్వమును జాటించెను.

దుర్యోధనుఁడు హస్తినాపురము సేరిన తర్వాత కృష్ణుఁడు స్వయముగఁ బాండవులకొఱకు దుర్యోధనునికడకు రాయబారముపోయెను. అంత దుర్యోధనుండు 'సూది మొనమోపినంత స్థలమైనను బాండవులకియ్యనని చెప్పెను. అట్టి పరిస్థితిలో తల్లియగు కుంతీదేవి యనుమతంబునను, శ్రీ కృష్ణుని ప్రోత్సాహమువలనను, న్యాయము తమ పక్షమున నుండుటచేతను పాండవులు యుద్ధము చేయ నిశ్చయించుకొనిరి.

ఇరు పక్షములవారు యుద్ధమునకు సిద్ధపడుచుండగా శ్రీ వేదవ్యాసులు ధృతరాష్ట్రునిచెంతకరిగి, 'నీ వీ ఘోరయుద్ధమును జూడగోరుదువేని నీకు దివ్యచక్షువులొసంగెద' ననగా ధృతరాష్ట్రుఁడు 'బ్రహ్మర్షే! నావారి నిర్మూలమును గన్నులారఁజూచి సహింపఁజాలను గాని దానిం గూర్చి పూర్తిగ వినఁగోరెద' ననగా వ్యాసుఁడు సంజయునికి దివ్యదృష్టియొసఁగి 'ధృతరాష్ట్రా! సంజయునివలన నీ వీ యుద్ధములో నొక్కొక్క విషయము వినఁగలుగుదువు. ఈ ధర్మయుద్ధము నాపుటకెవరును సమర్థులుగారు. దీనివలన ధర్మసంస్థాపనము గలుగు'నని చెప్పి వెడలిపోయెను.

ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించినందున సంజయుఁడు భూగోళమున భారత వర్షమెచ్చట నున్నదని వివరించి పాండవకౌరవ యుద్ధమునఁ బదియవదినము భీష్ముఁడుపడిపోయి శరతల్పుఁడై ఉత్తరాయణ మెదురుచూచుచున్నాఁడని తెలుపగా ధృతరాష్ట్రుఁడు యుద్ధమును దొలుతనుండివిపులముగవర్ణింపఁగోరుట శ్రీ భగవద్గీతయొక్క ప్రథమశ్లోకమగును. శ్రీ భగవద్గీత మహాభారతములోని భీష్మపర్వమున నిరువదియైదవ యధ్యాయమగును. ఇది ముఖ్యముగఁ గృష్ణార్జునుల సంవాదరూపమున నున్నది. ఇందు ధృతరాష్ట్రుని ప్రశ్నమే ప్రథమశ్లోకము.

శ్రీకృష్ణార్పణమస్తు.



ఫిబ్రవరి 13 నుండి 17_వ తేదీ వరకు జరిగిన హాస్పేట
గీతాసేవాశ్రమ వార్షికోత్సవ సందర్భమున
శ్రీ కాళహస్తి కైలాసాశ్రమాధిపతులు పంపిన సందేశము.



# నా సందేశము.

ఓం నమోభగవతే వాసుదేవాయ.

ఆత్మీయులగు సోదర సోదరీమణులారా! శ్రీగీతామాతయొక్క అనుంగుబిడ్డలారా!!

ఓం తత్సత్ నమస్తే!!!

శ్రీ గీతాసేవాశ్రమ సంస్థాపకులగు పరమ పూజ్యపాద శ్రీ శంకరానందగిరి స్వాములవారి కార్యదర్శిగారు హాస్పేటలోని శ్రీ గీతాసేవాశ్రమ చతుర్థ వార్షికోత్సవమునకు అవ్యాజప్రేమానురాగములతో నన్నాహ్వానించియున్నను ప్రస్తుతం నేను శ్రీకాళహస్తిలోని కైలాసాశ్రమమునందు మాఘవ్రతదీక్షా పరిస్థితులలో నేను వచ్చి మిమ్మందఱను సందర్శించి మీ మహోత్సాహమున మీ దివ్యానందమున బాల్గొను మహాభాగ్యమునకు నోచుకొననైతిని! శ్రీ గీతాసేవ యొనర్చుచు, గీతాసంఘములను నెలకొల్పుచు, కర్మ, యోగ, భక్తి, జ్ఞాన వైరాగ్య ప్రబోధాత్మకమగు ననేక గ్రంథములను వెలువరించి సనాతన వైదిక విజ్ఞానమును ప్రచారమొనర్చుచు, కనబడకుండగను వినబడకుండగను పూలగుత్తులను వికసింపజేయు మంచు చందమున శ్రీ శంకరానందగిరిస్వాములవారు చల్లగా, కమ్మగా, నిరాడంబరముగా జేయుచున్న మహాసేవలను మనఃపూర్వకముగా అభినందించుచున్నాను. ప్రత్యేక మతభేదములచేతను, జాతివైషమ్యములచేతను, కులకక్షలచేతను – నానా విధముల జీలిపోయియున్న నేటి మన వైదిక సంఘమున, అనగా హిందూసంఘమున ఐక్యసౌభ్రాతృత్వములను నెలకొల్పుటకు శ్రీ గీతాప్రచారమునకు మించిన మహాసాధనము మఱియొకటిలేదు. ఇట్టి గీతా ప్రచారమునకు శ్రీ శంకరానందగిరిస్వాములవారు నడుముగట్టుకొనియుండుట నాకు బ్రహ్మానందదాయకము.

గీతాధ్యయన తత్పరులగు సోదర సోదరీ మణులారా! స్కూల్ ఫైనల్ పరీక్షలోను త్తీర్ణులైన విద్యార్థులకు బంగారుపూత పూయబడిన యంచులతో ముద్దులుమూటగట్టుచు "నన్ను జదువు, నన్ను జదువు" మని యాకర్షించుచుండు బైబిల్ పుస్తకములు బహూమానింపబడుచున్నవిగదా! మనమేల అట్టి సమాకర్షకమగు శ్రీ భగవద్గీతా గ్రంథములను బహుమానింపరాదు? గీతా భక్తులగు మీరందఱును తలచుకొన్నచో, ఇది యవలీలగా జరుగగలదు. ప్రధాన పాఠశాలలందును, కళాశాలలందును విద్యార్థులకు వైదికమత ధర్మగ్రంథములలోని తత్త్వములను బోధింపబడకుండుటచేతనే కదా మన బాలబాలికలు స్వధర్మభ్రష్టులై చిన్ననాటినుండియు బీడి, చుట్ట, సిగరెట్, కిళ్లీ మొదలగునవి సేవించుచు, స్వమత విజ్ఞానరహితులై, పరమతావ్యామోహితులై, పాశ్చాత్య నాగరికతాదాసులై

తుదకు అనేకులు నాస్తికులై, వేదధర్మమనగా నేమి! Nonsense!' "స్వమతాచారమనగా Superstitions!" అని ఆక్షేపణము చేయుచు వ్యాసవాల్మీకాది మహర్షులను, శ్రీ రామ కృష్ణ శివ నారాయణాది దేవతలను, మతాచార సంప్రదాయములను దూషించుచున్నారు. గీతోపనిషత్తులలోని మతధర్మములు విద్యార్థుల నడుమ,యువకులనడుమ వ్యాప్తికానిదే_ ప్రబోధమొనర్పబడనిదే – సంస్కరణము, విద్యావిధానముతో ప్రారంభము కానిదే మనకు తరణోపాయము లేదు.

పావనామృతాత్మస్వరూపులారా! ఇపుడు మీరందఱును జరుపుచున్న దేమి? శ్రీ గీతాసేవాశ్రమ చతుర్థవార్షికోత్సవముకదా? యెచటని? పళ్ళొన్నేటయందలి శ్రీ గీతాసేవాశ్రమమున. ఆహా! ఎంతటి యానందకరమైనవార్త! గీతాప్రచారమునకై గీతాశ్రమము లిట్టివి మనదేశమున ఎన్ని వెలకొనియున్న, మనకును, లోకమునకును అంతటి కళ్యాణప్రదముకదా! సర్వమత సామరస్యమును, విశ్వమానవ ప్రేమానురాగములను ప్రబోధించు గ్రంథరాజము భగవద్గీతయేకదా! జగద్గురువరేణ్యులగు శ్రీ శంకరాచార్యులు మొదలుకొని ఆధునికలోకమున భారత పితయగు మహాత్మాగాంధీజీ వరకును గీతామహత్త్వము నేకదా వేనోళ్ళ ఘోషించియున్నారు? గీతాప్రతిభనుగూర్చి నావాక్కుల నాలకింపుడు! ఆరువేల సంవత్సరములకు పూర్వము స్వమతశ్రేష్ఠత్వమును ఉపపాదించుచుండిరేకాని సర్వమత సమన్వయ ప్రయత్నమును ఒనర్పరైరి. గీతాచార్యుడగు శ్రీ కృష్ణుడే సమన్వయింప ప్రథమ ప్రయత్నమొనర్చిన సమన్వయమూర్తి. నాడు వెలయుచుండిన సంప్రదాయములన్నిటి నుండియు ముఖ్యవిషయములను గ్రహించి యాతడు గీతాసూత్రమున గూర్చెను.

**శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహం।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ (అ. 4 శ్లో. 11)**

తా॥ అర్జునా! ఎవరెట్లు నన్ను, అనగా పరమాత్మనుగూర్చి భావించుచున్నారో, అట్లే నేను వారి ననుగ్రహించుచున్నాను. మానవులెల్లరీతుల నామార్గము నేకదా యనుసరించుచున్నారు. "మన కర్మము, మనప్రారబ్ధము"అని నిరాశావాదులమై, చతికిలబడియుండుటను గీతాశాస్త్రమెంతమాత్రము ఆమోదింపదు.ఆత్మవిశ్వాసముతో,భగవద్విశ్వాసముతో గూడిన పురుషప్రయత్నమే గీతాహృదయము. అప్రతిహతశక్తితో అఖండధైర్య సాహసములతో నరుడను నామాంతరముగల అర్జునునిచే మానవుడు సూచింపబడుచున్నాడు. ఇట్టి నరుడు భయాక్రాంతుడైనపుడు శ్రీ కృష్ణుడు ఆత్మసంస్థితుడై ఆతనికి భగవద్గీతోపదేశమొనర్చెను. అనంతరము ఆతడు శ్రీ కృష్ణునియందు విశ్వరూప సందర్శనమొనర్చి, ఆత్మసంస్థితుడై, జ్ఞానాగ్ని దగ్ధకర్ముడై యుద్ధమొనర్చెను.

పరమ ప్రియసోదరీ సోదరులారా! నిరంతరము భక్తిశ్రద్ధలతో గీతాధ్యయన మొనర్చుచు, సత్సాంగత్యము, సత్కర్మాచరణము, జపధ్యానములు మున్నగు ముఖ్య సాధనల నవలంబించుచు పరిపూర్ణ భగవదనుగ్రహ పాత్రులగుదురుగాక! మీకందరకును గీతాచార్యుని పరమానుగ్రహము లభించునుగాక! శ్రీ శంకరానందగిరిస్వాములవారు మిమ్ములందరను పరమ గమ్యము దెస బురోగమింపజేయుగాక! మీ గీతాసేవాశ్రమము పరమశాంతి జ్ఞానానంద మహత్తర కేంద్రమై వర్ధిల్లుగాక! ఓం తత్సత్!

— నిత్యానందస్వామి.

శ్రీ

# భగవద్గీత — సంశయములు.

లేఖకుఁడు:- "కథనకళాప్రపూర్ణ" పండిత నోముల అప్పారావు,
— కాకినాడ (ఆంధ్ర.)

ప్రపంచమునగల ఆధ్యాత్మిక గ్రంథరాజములలో నొకటిగ వెలసినది శ్రీభగవద్గీత. ఆ పవిత్రగ్రంథము భారతదేశమున జన్మించినను వివిధదేశవాసులచే సన్మానింపబడు చున్నది. అట్లు సన్మానింపబడుటకు కారణము ఆ గ్రంథమునగల విశ్వశ్రేయోదాయకము లగు నుదార భావపరంపరలే. మనుష్యజాతి హృదయమునగల యజ్ఞానమును, తజ్జనిత అహంకార మమకార కళ్మలములను, పోగొట్టుటయే ఆ గ్రంథరాజప్రయోజనము. ఆ మానవులు ప్రాచ్యులా? పాశ్చాత్యులా? ఔత్తరాహులా? లేక దాక్షిణాత్యులా? యను భేదదృష్టి కానరాకుండుటయే యా గ్రంథముయొక్క యౌత్కృష్ట్యమును చాటుచున్నది. అట్టి మహోత్తర గ్రంథరాజముదయించిన పావనమగు భారతదేశమున జన్మించిన వ్యక్తు లెల్లరు ధన్యులు. విశ్వజనీనమగు నా గ్రంథరత్నముపై మనలోఁగొందఱికి గొన్ని సంశయము లుదయించుచున్నవి. కొన్ని పూర్వముదయించియేయున్నవి. అవ్వవి సమంజసములైనను అసమంజసములైనను, సదుయుక్తికములయినను నయుక్తికములయినను, సశాస్త్రీయము లయినను నశాస్త్రీయములయినను, వానికి సమాధానమిచ్చు బాధ్యత గీతాశాస్త్రముం దభిమానముగల ప్రతివ్యక్తిపైన గలదనుట నిశ్చప్రచము.

అసంఖ్యాకములగు నా సంశయములకెల్ల సమాధానమీయఁబడునా? యనిన బహుశాఖమగు నజ్ఞానమున జనించిన సందేహములుగూడ ననంతములగనుండును. అందులో గొన్నింటికి సమాధానమును జెప్పుకొనుట యనుచితము కానేరదు. చదువరులకు సులభముగ దెలియుటకొఱకు ప్రశ్నోత్తరరూపముగ వక్కాణింపబడినది.

ప్రశ్నము:- భగవద్గీతనందఱు చదువవచ్చునా?

సమాధానము:- స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు, ప్రాచ్య పాశ్చాత్యాదులు, వీరు వారననేల, మనుష్యులందఱు చదువవచ్చును.

ప్రశ్న:- అట్లయిన నా గ్రంథముయొక్క పవిత్రతకు భంగము గలుగదా?

సమా:- ఆ గ్రంథ పవిత్రతకు భంగమురాదు సరిగదా! బహుజనములు పఠించుటవలన నా పవిత్రత హెచ్చును. బహుజనాదరణ పాత్రమగుట తత్పవిత్రతా చిహ్నమే కదా! పరమపావనియగు గంగానదిలో నానావిధ మానవానీకము స్నానమొనర్చుచుండును. అందువలన నా భాగీరథికి పవిత్రత చెడినదా? లేదు. వివేకించి పఠితా

త్ములను పావనుల నొనర్చగలదను కీర్తినిపొందుట మనకు దెలిసినవిషయమే. కావున నెల్లవారును భగవద్గీతను చదువవచ్చును.

ప్రశ్న:- గీతలో ప్రతిపాదింపబడినది బ్రహ్మవిద్యయగుటవలన దానిని కొందఱు మాత్రము చదువవలెనని కొందఱనుచుందురు. నిజమేనా ?

సమా:- భగవద్గీతలో ప్రతిపాదింపబడినది బ్రహ్మవిద్యయనుట నిజము. ఆ బ్రహ్మవిద్యను సర్వమానవజాతికి తెలుపుటకు వెడలినదే భగవద్గీత. సర్వమానవులకు వెలుగు నిచ్చుటకే సూర్యుడుదయించుచున్నట్లు, సకలదేహధారుల రోగములనున్మూలించుటకే దివ్యౌషధములు వెలసినచందమున నిఖిలమానవకోటి హృదయాంతర్గతమగు నజ్ఞానమును బోగొట్టి బ్రహ్మవిద్య నొదవించుట కుదయించినదే భగవద్గీత. సూర్యుని దర్శించుటకు నేత్రేంద్రియశుద్ధి యవసరమగునట్లు, భేషజసేవనమునకు గర్భకోశ శుద్ధి యావశ్యకమైన విధమున బ్రహ్మవిద్యకు చిత్తశుద్ధి యవసరమనుట నిశ్చయము. అట్టి చిత్తశుద్ధి భగవద్గీతా పఠనమువలన లభింపగలదు. కావుననే

శ్లో॥ య ఇమం పరమం గుహ్యం — అ॥ ౧౮. శ్లో॥ ౬౮.
,, అధ్యేష్యతే చ య ఇమం — ,, ౭౦.
,, శ్రద్ధావాననసూయశ్చ శృణుయాత్ — ,, ౭౧.

ఈ భగవద్గీత నితరులకు చెప్పినవారును, స్వయముగ జదివినవారును, వినినవారును, శుభముల నొందగలరని గీతాశాస్త్రమందు చెప్పబడినది. కావున నెల్లవారును గీతను చదువవచ్చును.

ప్రశ్న:- "భగవద్గీతాసూపనిషత్సు" అని గీత నుపనిషత్తుగా జెప్పిరి. ఉపనిషత్తులనందఱు చదువవచ్చునా ?

సమా:- ఉపనిషత్ప్రతిపాదితమగు బ్రహ్మవిద్య గీతయందుండుటచేత భగవద్గీత గీతోపనిషత్తని వర్ణింపబడినది. కాని యీ గ్రంథరాజము మహాభారతమున భీష్మపర్వాంతర్గతమనియు, కృష్ణార్జున సంవాదమనియు నక్కడనే వక్కాణింపబడినది. మహాభారతము స్త్రీ శూద్ర ద్విజ బంధుప్రముఖుల శ్రేయముకొఱకు రచింపబడినదనుట స్పష్టము.

శ్లో॥ స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా।
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భవేదిహ॥
ఇతి భారతమాఖ్యానం కృపయా మునినా కృతమ్॥
(భాగవతే స్కం. ౧ అ. ౪ శ్లో. ౨౫-౨౬)

సర్వమానవ శ్రేయస్సుకొఱకు రచింపబడిన మహాభారతమందలి భగవద్గీతను సర్వ

మానవులు పఠింపవచ్చుననుటకు సందేహింపబనిలేదు. అదియుగాక జగజ్జనకుడగు భగవంతునిచే రాజోత్తముడగు నర్జునునకుపదేశింపబడి, సంజయునిచే ధృతరాష్ట్రునకు జెప్పబడి, సూతశౌనక సంవాదరూపముగ విస్తృతిజెందిన భగవద్గీత సర్వమానవ పఠనార్హమనుట నిస్సందేహము. అట్లుగాక కొందఱుమాత్రము దానిని పఠించవచ్చును; కొందఱు పఠించరాదనుట తత్ప్రభావమును సమగ్రముగ దెలియమిని వ్యక్తపఱచును. నేడు ప్రపంచమున నానావిధ మానవానీకముచేత నేవిధముల జదువబడుచు, వివిధవ్యాఖ్యానపరంపరలచే విరాజిల్లుచు, నైకరూపముల ప్రత్యక్షమగుచుండుట గీతయొక్క గొప్పతనమును సూచించుచున్నది.

సర్వమానవాభ్యుదయమును గోరు మానవోత్తములిట్టి సందియములకు డెంపములలో దావీయకుందురు గాత.

— నోముల అప్పారావు.

# గ్రంథసమీక్ష.

**మానవ దర్శనము:-** వెల ముప్పావలా.

రచయిత:- ధనకుధరం వరదాచార్యులు గారు.

ప్రకాశకులు:- శ్రీ వైద్యవిద్యాసంస్థానము, ఆలపాడు పోస్టు, గుంటూరు జిల్లా.

గ్రంథము ఆరుప్రకరణములతోనున్నది. ప్రతిభావంతుడును విద్వాంసుడును నగు గ్రంథకర్త మానవజీవితమునకు వలయు దార్శనికరహస్యముల నీ చిన్నపాత్రమున నిమిడించినారు. మానవుడు శ్రేయఃప్రేయములను యే విధముగ బొందగలడో - సశాస్త్రీయముగ సహేతుకముగ నిరూపించిన రచయిత నిజమునకు ధన్యవాదార్హుడు. తానేమిచేయవలెనో తెలిసికొనుటకుముందు తానెవడో తానెట్లుండవలెనో తెలిసికొనుట మానవునకు విధాయకము. దుర్గంధసాహిత్యముతో మురిగిపోవు యీనాటి క్షుబ్ధవాతావరణమునకు పవిత్రత చేకూర్చుటకై యీలాటి ఉదాత్తసాహిత్య మెంతైనను అవసరము.

"సంస్కృతి వికాసములను లోకమున స్పష్టముచేయుటకై......భావమధురమైన భాషలో ప్రకటించెద" మని ఆడినమాటను ప్రకాశకులు నిలుపుకొన్నారు. భగవంతుడు వారి భావికార్యక్రమమును విజయోపేత మొనర్చుగాక!

వజ్రశకలములవంటి మాటలు. రత్నములకెనయగు భావములు. అల్పకాయమగు గ్రంథమున అనేకవిషయములను జొప్పించెడి పూన్కివలన అందందు అరక్షిష్టత యేర్పడినది. గ్రంథమున తెనుగుతనముకంటె సంస్కృత ప్రాబల్యమెక్కువ. గ్రంథకర్త గమనించునది.

# వార్తలు.

గుత్తితాలూకా రాగులపాడు శ్రీ ప్రణవాత్మానందాశ్రమమునందు జనవరి 28, 29, 30 తేదీలు శ్రీ సద్గురు ఆత్మానందస్వామి వారి ఆరాధన జరిగినది. ఆ సందర్భమున శ్రీపూజ్యపాద శంకరానందస్వాములవారు భగవద్గీత 13_వ అధ్యాయమునుగూర్చి ఉపన్యసించినారు. శ్రీరామకృష్ణగారు భాగవతోపన్యాసము జరిపినారు. కలుగోడు అశ్వత్థరావుగారు తాము రచించిన అశ్వత్థ భారతమును చదివి వినిపించినారు. శ్రీ స్వరూపానంద – శ్రీప్రకాశానంద – బాలయోగి ప్రభృతులు శ్రీశ్రీశ్రీ శంకరానంద గిరిస్వాములవారి అధ్యక్షతతో కార్యక్రమము మహావైభవముగ జరిగినది.

30_1_54 సాయంత్రము శ్రీ శంకరానందస్వాములవారు గంజికుంట ప్రణవాశ్రమము చేరుకొన్నారు. ఆ ఆశ్రమ వ్యవస్థాపకులగు వెలనాటి వెంకటప్పయ్యగారి అభ్యర్థనతో ఆ ఆశ్రమమునందు బ్రహ్మీభూతులగు శ్రీసదానందస్వామివారి ఛాయాచిత్రమును ఆవిష్కరించినారు.

31__1__54 తేదీ శ్రీస్వాములవారు హాస్పేట శ్రీ గీతాసేవాశ్రమమును చేరుకొన్నారు. శ్రీరామకృష్ణగారు హంపి చేరుకొన్నారు.

బళ్ళారిజిల్లా హాస్పేట శ్రీగీతాసేవాశ్రమ చతుర్వార్షికోత్సవములు ఫిబ్రవరి 13 తేదీ నుండి 5 రోజులు జరిగినవి. బిజాపురం జిల్లా ముధోళవాస్తవ్యులు శ్రీ మ. ని. మృత్యుంజయమహాస్వాములవారుఅధ్యక్షత వహించినారు. అధ్యక్షులవారు శ్రీ గీతాతత్త్వవిమర్శ అనెడి విషయముపై అశేష జనసమ్మోహాకరమగు అద్భుతోపన్యాసముల నొనర్చినారు. శ్రీశంకరానందస్వామి వారు విజ్ఞానయోగమునుగూర్చియు, శ్రీ రామకృష్ణగారు ఏకాదశస్కంధమును గూర్చియు ఉపన్యాసములు జరిపినారు. శ్రీగీతానందగారి గీతాభినయముతో, బిరూరు రంగదాసుగారి హరికథలతో, శ్రీ మైదూరి తిరుమలాచార్యులవారి ప్రార్థనా గానములతో సభాకార్యక్రమము సుసంపన్నమైనది. మహనీయులు పంపిన సందేశములను శ్రీ వెంకోబరావుగారు చదివినారు. బళ్ళారి వాస్తవ్యులు శ్రీ సాధు లక్ష్మీనరసింహశర్మ గారు యీ కార్యక్రమమున అనిరీక్షితముగ పాల్గొని సంస్కృతభాషా ప్రాశస్త్యమును గురించి ఉపన్యసించినారు.

శ్రీ శంకరానంద శ్రీరామకృష్ణులు ఫిబ్రవరి 20, 21, 22 తేదీలు బెంగుళూరు బ్రహ్మవిద్యాశ్రమమునందు శ్రీ కబీరునాథాశ్రమ వార్షికోత్సవములలో పాల్గొనినారు.

శ్రీ శంకరానందస్వాములవారు బెంగుళూరునుండి కడూరుజిల్లా హాగరేఖాను గిరి శ్రీ శివానందసేవాశ్రమమునకు చేరుకొన్నారు. అచ్చట శివరాత్రి సప్తాహమును ముగించుకొని 6_3_54 నాటికి కాళహస్తి కైలాసాశ్రమ సప్తాహోత్సవమున పాల్గొనుటకై వచ్చి భగవద్గీతోపన్యాసముల నెరవేర్చినారు.

శ్రీ రామకృష్ణగారు బెంగుళూరునుండి గండి క్షేత్రంవెళ్ళి అచ్చట శివరాత్రి సప్తాహ మహోత్సవములందు పాల్గొని 5 వ తేదీ ఆళ్లగడ్డ చేరినారు.

శ్రీ శంకరానంద రామకృష్ణులు మానెల్లూరు గీతాసంఘు వార్షికోత్సవమున మార్చి 9, 10, 11 తేదీలయందు పాల్గొని 12 తేదీ నుండి మిట్టకండ్రిగయందు 6 రోజులుపన్యసించి, మార్చి 19, 20, 21 తేదీలలో కాళహస్తి శ్రీశుకబ్రహ్మాశ్రమమున జరిగెడి శ్రీ సనాతన వేదాంత జ్ఞానసభా అష్టావింశత్ వార్షికోత్సవమునకు చేరగలరు. ఆ తర్వాత విజయవాడ తాలూకా పెనమలూరునకు పోగలరు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ నేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, నై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాణాపేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెందుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం శివపట్నం. కరీంనగర్ జిల్లా.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్ప రాజుగారు, గోనపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాట కొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని రామదాసు గారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కి–రెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. – 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్య గారు, చాగలమర్రి. – 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, – కోయిలకుంట్ల. –15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం.

కడపజిల్లా. 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా। – 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. – 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 19. శ్రీ పెంటంశెట్టి శ్రీని వాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. – 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. – 25. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. – 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 30. శ్రీ ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు – 31. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకసిర. – 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తాలూకా. – 33. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డి గారు, కుందనగుర్తి. – 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. – 36. శ్రీ పెద్ద కదిరప్పగారు, కుందనగుర్తి. – 37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. – 38. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. – 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 40. శ్రీ ఈద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 41. శ్రీ శాకల ఆంజనేయులు

గారు, కుందనగుర్తి. – 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనారాయుడుగారు, కార్యాకుడు.

మైసూర్ స్టేట్: 45. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 47. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 48. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 49. శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి, కోలారు. – 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. – 52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. – 53. నాగబండి విశ్వనాథం గారు, 12/88 మెక్లారోడ్డు, వరంగల్. – 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహభక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ – 55. శ్రీ గందె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ – 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్ – 57. శ్రీతాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ – 58. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ – 59. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్ – 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ – 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ – 62. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు వరంగల్ – 63. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ – 64. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్ – 65 శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ – 66. శ్రీ సోమా నరసయ్య గారు, వరంగల్ – 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 68. శ్రీ చండా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ – 69. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు, వరంగల్ – 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 71. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొల్లేగాలం.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.

2. శ్రీ గజహల్లి నాగిరెడ్డిగారు, వండపాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# గీతామతల్లి.

కవిరత్న, విద్వాన్ బి.జి. రామరాజు, ప్రధానాంధ్రపండితులు - ఆత్మకూరు.

[ శ్రీయుతులు విద్వాన్ బి. జి. రామరాజుగారు ప్రతిభాన్వితులగు యువకులు. చక్కటి వక్తృత్వ ధోరణికలవారు. సంగీత సాహిత్యములలో మంచివాసిగన్నవారు. ఉజ్జ్వలమగు కవితాధారకలవారు. మా 'గీతావాణి' యెడ వారి అభిమానము అపారము. కవిగారికి మా అభివందనములు. — సంపాదకుడు. ]

సీ॥ ప్రణవమే దివ్యాతపత్రంబు, జ్ఞాన ని
ష్కామ కర్మములు, వింజామరములు
సత్యమే రూపము, శాంతి కిరీటంబు
ఆత్మైకనిష్ఠ, సింహాసనంబు
అష్టాంగ యోగము లంగబలంబులు
ఉపనిషత్తులు మంత్రులూాడిగీంద్రదు
భరతవర్షము రాజభవనము, ద్వైతాది
మతములు సకల సామంత ప్రభులు.

గీ॥ వ్యాసుడాస్థానకవి, భగవానుడంగ
రక్షకుడు ముక్తి నీకు సామ్రాజ్యమట్టి
రాష్ట్రి మలవోక నేలెడు రాణివీవు
తల్లి! భువనైకవల్లి! గీతామతల్లి!

సీ॥ కాయమనిత్యమాగాని ఈ జీవికి
చావులేదని నొక్కి చాటినావు
దృఢబుద్ధివై సమదృష్టి భావనఁజేసి
కార్యదీక్షకు నీతిఁ గఱపినావు
ఆత్మనిత్యము సత్యమమృతమను తత్త్వ
మంచితగతుల బోధించినావు
కర్తృత్వఫలముల కాంక్షమాని స్వధర్మ
మెంచి సేయఁగ ప్రోత్సహించినావు.

గీ॥ సాక్షిమాత్రుఁడు నరుని విషాదయోగ
మాదిమూలముగా భువి కవతరించి
నరుల భవతాపములను పోనణచినావు
తల్లి! భువనైకవల్లి! గీతామతల్లి!

శ్రీ వేదవ్యాసప్రెస్, చిత్తూరు, మార్చి 1954 - కా. 1000.



# శ్రీ గీతామాత ప్రార్థన పాట.

## శంకరమంచి చెంచులక్ష్మమ్మగారు.

★

[ శ్రీమతి శంకరమంచి చెంచులక్ష్మమ్మగారు సాంప్రదాయ శుద్ధమగు చక్కటి వైదుష్యము కలవారు. నివురు కప్పిన నిప్పువలె నుండు విదుషీమణి. స్త్రీలయందు ఆధ్యాత్మిక జాగృతిని కల్గించుటకు ఆమె శాయశక్తుల పాటుపడుచున్నది. సానవేయని రత్నములవలె యీలాంటి పవిత్ర సాధ్వీమతల్లులు యెందరెందరు దేశమున అడుగున పడి ఉన్నారో! గీతాచార్యుడు వారిని ఆశీర్వదించుగాక! — సంపాదకుడు.]



( జై స్వతంత్ర భారతావనీ ఇ – ఇ పావనీ...... అను వర్ణమెట్టు )
కన్నడ రాగం – ఆదితాళం.

పల్లవి:— కరుణజూడు — గీతమాత! కామితార్థదాయినీ!! ‖క‖

అనుపల్లవి:— శరణు—శరణు—శోకనాదు—దురితములెడబాపి బ్రోవు ‖క‖

చరణం: –

1. సారహీనమైన జనన — సాగరంబుదాటగా
   సేవ నిరతమొసగినీదు — చెంతజేర్చి శ్రేయమొసగు ‖క‖
2. సాంఖ్య కర్మ యోగములను — సలుపుమర్మమెల్లను
   శంకలేక దెలిపిమమ్ము — చై విడువక జేరికావు ‖క‖
3. కర్మభక్తిజ్ఞానదాత — నిర్మల స్వరూపిణీ!
   కలుషార్తీ! భయహారిణి — కలిగింపు నీ పాదభక్తి ‖క‖
4. శ్రీహరి ముఖకమలమందు — జాల్వారిన ధన్యవు!
   పార్థుని హృత్పద్మమందు — పదిలముగను వెలుగుతల్లి ‖క‖
5. సప్తశతంబైన పద్య — జాలములను — మాలగా
   గూర్చి కంఠమణిగదాల్చి — కొమరారిన తల్లినన్ను ‖క‖
6. తత్త్వసారబోధినీ — తత్త్వార్థ సంవిధాయినీ!
   తత్త్వమస్యాది విమల — తత్త్వసంచారిణీ ‖క‖
7. పావని — నీచరితమెన్న — బ్రహ్మాదుల కలవిమే!
   వ్యాసమహర్షి — దయచే — వాసిగ నీసేవ గల్గె ‖క‖



# గీతావాణి

34





పదవ సంచిక

స్వామి శ్రీ శంకరానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 ఏప్రెల్ 1954

# విషయసూచిక - ఏప్రెల్ '54.

# " గీతావాణి "

**శ్రీ గీతాసాహిత్యసేవాసమితి పక్షమున ప్రకటింపబడు**

**గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.**





మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ



మేనేజర్:

స్వామి శ్రీనివాసానంద.

**గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.**

---

**సంవత్సరచందా 4—0—0.**  **విడి ప్రతిక 0—6—0**

---

**15th APRIL 1954.**

◆◆◆◆ కవిత ◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# శ్రీ భగవద్గీతా సారము.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆బాలకవి ఓ. నారాయణప్పగారు◆◆◆◆◆◆◆◆◆◆

## ఏకాదశాధ్యాయము – విశ్వరూపసందర్శనయోగము. 11

★

సీ॥ నీవ కారణుడవు నిఖిలభూతంబుల
సమయింప, సృజియింప, సమతబెంప
నీబోధ మోహంబు నేటిబాసెనాకీవు
విశ్వరూపము జూపువిశ్వరూప!
అను నరుగని శౌరి యర్థితో బొడజూపె
సుర, నర, ముని, చరాచరయుతమగు
విశ్వరూపంబును విస్మయంబునజూచి
నరుడొనర్చె నమస్కృతుల్ నమ్రుడగుచు.

గీ॥ శంఖచక్రాన్వితంబగు సౌమ్యరూపు
జూపుమన కృష్ణుడయ్యెను! చోద్యమొదవ!
నట్టిహరి విశ్వరూపంబు నర్థిదెల్పు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!




సంపుటి 3 ★ స్వస్తిశ్రీ జయ * చైత్రమ్. ★ సంచిక 10

# యోగః కర్మసు కౌశలమ్.

పూర్వకాలంలో ఆశ్రమవాసులైన ఋషులు దర్భలను కోసి తెచ్చేకోసం తమ శిష్యులను అడవికి పంపేవారు. అవి విశ్వామిత్ర జాతికి చెందిన దర్భలు కాడంతో, యేమరిపాటుతో కోశాడంటే వ్రేళ్ళుతెగి హస్తాలు రక్తసిక్తమౌతాయి. తెచ్చే శిష్యులు మూడు రకాలుగా వుంటారు. ఉపద్రవానికిజంకి ఉత్తచేతులతోవచ్చి గురువుతో తిట్లుతినేవారొకరకం. ఆత్రపాటుతో కోసి వ్రేళ్ళు త్రెంచుకొని అసురుసురౌతూ తెచ్చేవారు మరోరకం. మహామెలకువతో కోసి యెట్టి సంకటాల పాలుకాకుండా గురువుతో మెప్పు పొందేవారు మరొక్కరకం. కలుకైన కుశలను తాను దెబ్బతినకుండా హెచ్చరికతో కోసి తెచ్చినవాన్ని గురువులు 'వీడు కుశలుడురా' అని ప్రశంసించేవారు.

మొదటివారు తామసికులు, కర్మవల్ల కల్గే బెడదకు జడిసివారు కర్మలనే వదల్తారు. కర్తవ్య కర్మను వదలడం అదొక్క పెద్దదుష్కర్మ. "ఆరంభింపరు నీచమానవులు —" అని ఆలాంటి

వారిని నీచులుగా భర్తృహరి తెగనాడాడు. కర్మక్షేత్రమూ — కురు క్షేత్రమూనైన ప్రపంచంలో, దేహభావన — జీవభావన వుండేవరకూ మానవుడు కర్మను మానివుండే వీలేలేదు. చేసేటందుకు ప్రాలుమాలి పైపైకి కర్మశూన్యత్వాన్ని ప్రదర్శించేవారు పశుప్రవృత్తికి దిగజారిపోతారు. "అధోగచ్ఛంతి తామసాః" అని గీతావాక్కు. అట్టివారికి "కల్గదు యిహలోకం—పరలోకం".

రెండవవారు రాజసికులు. ఫలాకాంక్షతో వీరు పనిచేస్తారు. వీరికి వ్యగ్రబుద్ధిమెండు. వ్యవసాయాత్మికబుద్ధి సున్న. వీరి కర్మ, బంధహేతువైతుంది. కర్మ, గుణాత్మకం కాబట్టి కర్తను బంధిస్తుంది. కర్మవలన ఫలమూ, ఫలమువలన భోగమూ, భోగమువలన వాసనా, వాసనవలన జన్మా, మళ్ళీ — జన్మవలన కర్మా, యీ తెగతెంపులేని సుడిగుండంలోపడి మానవుడు దరి గానడు. వాడు సంసార కారాగారంలో నిత్యబద్ధుడు.

మూడోవారు సాత్త్వికులు; దైవీసంపన్నులు. తాము నిమిత్త మాత్రమై పనిచేస్తారు. తమ సాత్త్వికాహంకారాన్ని భగవదాయత్తం చేశారు. "నేనుకర్త" ననేభావం వారికిలేదు. కర్త కానివానిపై కర్మ యెట్టి ప్రభావాన్నీ చూపలేదు. తాను కర్తగాదు కాబట్టి ఫలాన్ని వాడు కోరడు. ఫలాసక్తి అనే లంకె — లింకు మొదట్లోనే తెగింది, కాబట్టి పరంపరగావచ్చే, భోగ - వాసనా - జన్మలకు వాడు లోబడడు. కర్మను చేసికూడ వాడు చేయనివాడు. అట్టివాడు కర్మపారావారంలో మునగడు; తేల్తాడు. కర్తృత్వాహంకారమనే కోరలుపెరికిన తర్వాత కర్మభుజగముపై వాడు శాంతాకారుడై శయనిస్తాడు. అదొక్క మహాయోగం; అదొక్క మహాకళ.

తామసికుడు కర్మక్షేత్రాన్ని నిరుపయోగంచేస్తాడు; రాజసికుడు దురుపయోగం చేస్తాడు; సాత్త్వికుడు సదుపయోగం చేస్తాడు. అదే వాని కౌశల్యం.

---




[మార్చి సంచిక 15_వ పేజీ తరువాయి.]

"ఓ అర్జునా! తనయొక్క ప్రకృతికి వర్ణమునకు ఆశ్రమమునకు అనుకూలించియుండు ధర్మము, అన్యమానవులధర్మమునకంటె హీనముగ గుణరహితముగ గోచరించిననుకూడ దానినెఆశ్రయింపవలెను. పరధర్మమెంత శోభాయమానముగ కన్పట్టినను దానిపై భ్రమచెందరాదు. స్వధర్మము తుచ్ఛముగను అపూర్ణముగను సలోపముగను అగపడినను అదియె శ్రేష్ఠము; అదియె ఆచరణీయము. స్వధర్మమును ఆచరించుచు మృత్యువు వాతబడినను వాడుశ్రేయస్సునె అధిగమించగలడు, పరుల ప్రకృతికి వర్ణమునకు ఆశ్రమమునకు విధాయకమై అనుకూలించెడి ధర్మము, సుఖకరముగను గుణవంతముగను గోచరించిననుకూడ పరిణామమున నది తనకు హానికరమును భయోత్పాదకమును నగుట తప్పదు. అయ్యా! అర్జునా ! నీస్వభావమునకు అనుగుణమగు స్వధర్మమునె ఆచరించుము. క్షత్రియోచితమగు యుద్ధమునకు లేలెమ్ము. పరధర్మమగు భిక్షాటనము నీకు కళంకము నాపాదించును; శ్రేయస్సును దూరమొనర్చును. అది నీకెంతయు హానికరము." అని భగవంతుడాడిన మాటలను విని పార్థుడు అవాంతర ప్రశ్న నొక్కటి యడుగుచున్నాడు.

(శ్లో॥36) "భగవంతా! ఉద్దేశ్యపూర్వకముగ పాపములను చేయవలెననెడి అభిప్రాయము లేకపోయిననుకూడ మానవుడు, యెందుకో! యేదో బలవంతమగు మహాశక్తికి లోబడి వివశుడై పాపములను చేయుచున్నాడు. పరమ పురుషార్థమునకు సాధనమగు నీవుచెప్పిన కర్మయోగమును ఆచరింపవలెనను యిష్టమున్నను పురుషుడు ఆచరింపలేక పోవుచున్నాడు. తన స్థితికి గతికి మానవుడు స్వతంత్రుడు కాడని తోచుచున్నది. పరతంత్రుడగు భటుడు ప్రభువుయొక్క ఆజ్ఞలకు లొంగి

ప్రవర్తించునట్లు ఏదో బలవంతమగు
మహాశక్తికిలోబడి మనుష్యుడు అది
ఆడించినట్లు ఆడుచున్నాడు; నీవుప
దేశించిన సన్మార్గమునకు దూరమగు
చున్నాడు. కృష్ణా! ఆమహాశక్తి
యేది? మనుష్యుని అధోగతికి మూల
కారణమగు అద్దానిని నీవలన గుర్తె
రిగి దాని నడంచుటకు యత్నించె
దను."

అని అర్జునుడడిగిన ప్రశ్నకు
సమాధానముగ భగవంతుడు శ్రుతి
స్మృతులవలన సిద్ధమైన అర్థమును
బోధించుచున్నాడు.

(శ్లో॥ 37) "అర్జునా! రజోగుణ
ము వలన కల్గిన ఈ కామమే క్రోధ
మై పరిణమించును. ఇది పెద్ద తిండి
పోతు. ఎంత తినినను తృప్తిచెందు
నదికాదు. అంతేకాదు. ఇది మహా
పాపి. దీనికంటె మించిన శత్రువు
లేదని యెరుగుము."

భగవంతుడు ఇరువదినాల్గవ
శ్లోకమునందు, "ఇంద్రియముల
యొక్కయు వాటి విషయముల
యొక్కయు వ్యాపారమునందు రాగ
ద్వేషములు అల్లుకొనియున్నవి. ఆ
రాగద్వేషములే సాధకుని వివేకము
ను కొల్లగొట్టి దోచుకొనుచున్న"
వని చెప్పియున్నాడు. ఆ రాగద్వేష
ములయొక్క స్థూలరూపములే కామ
క్రోధములని పిలువబడుచున్నవి. ఈ
భావమును ప్రకటీకరించుచు 'కామ
ఏష'—'క్రోధ ఏష' అని 'ఏషః'
శబ్దము ప్రయోగింపబడినది. అందు
రాగముయొక్క స్థూలరూపమగు
కామము ప్రధానమైనది. దీనినుండి
యె క్రోధముద్భూతమైనది. కామ
ముతో 'రజోగుణసముద్భవః' అను
విశేషణము చేర్చబడినది. ఆ విశే
షణమువలన, కామము రాగము
నుండి సంభవించుచున్నదని సూచిం
ప బడుచున్నది.

కామక్రోధములు రెండునుమను
ష్యునకు శత్రువులని ముందుచెప్పి
తదనంతరము కామము నొక్కదాని
నే పేర్కొనుటలో కారణ మేమని
శంక కల్గుచున్నది. కామముననె
క్రోధముత్పన్నమగుచున్నది. కామ
ము నశించినచో క్రోధముకూడ
నశించును. అందువలన కామ
మొక్కదానిని చెప్పినచో క్రోధము
ను ప్రత్యేకముగ చెప్ప పనిలేదని
భావించి ఆవిధముగ పేర్కొనినారు.
అయినను పాపమునకు కారణము
ఏ ఒకటిమాత్రమెకాక రెండునుచేరి
యగును కాబట్టి ముందు రెంటిని
చెప్పవలసి వచ్చినది.

కామము రజోగుణమువలన
ఉత్పన్నమగుచున్నదా? రాగము

వలన ఉత్పన్నమగుచున్నదా?

రజోగుణమువలన రాగము వృద్ధి యగుచున్నది. రాగమువలన రజో గుణము పెరుగుచున్నది. ఈవిధము గ వీటికి పరస్పర సంబంధము కలదు. కాబట్టి రెంటియొక్క స్వరూప మొక్కటిగనె భావించుట తగును. కామోత్పత్తికి రెండును కారణ ములు.

కామమును మహాశనుడని అనగా తిండిపోతని చెప్పుటలో అర్థమేమి?

భోగ్యవస్తువుల నెంతెంతగా అనుభవించినను కామమునకు తృప్తి లేదు. అది మరింత కోరుచునే యుండును. నెయ్యిపోయుకొలది కట్టెలువేయుకొలది అగ్ని మరింత మండుచుండునె కాని శాంతించదు కదా! మనుష్యుడు భోగముల నను భవించుకొలది వాని భోగతృష్ణయు పెరుగుచునేయుండును. కావుననే కామమునకు మహాశనుడని పేరిడిరి.

'మహాపాప్మా' యని 'మహా పాపి' యని కామమును పేర్కొను టకు కారణమేమి?

అన్ని అనర్థములకును కామమే కారణము. ఇష్టములేకున్నను నిర్బం ధముగ మనుష్యునితో పాపము చేయించునది ప్రారబ్ధమును కాదు; ఈశ్వరుడునుకాడు. ఈ కామమే బలాత్కారముగ మానవుని నానా ప్రకారభోగానక్తిపరునిగ నొనర్చి పాపకృత్యములందు ప్రేరేపించు చున్నది. కావుననే దీనిని మహా పాపియని చెప్పిరి.

కామమును వైరిగా గుర్తించ వలెనని చెప్పుట యెందుకు?

మనుష్యుని పరవశునిగ నొనర్చి పాపముల పాలుజేసి దుఃఖములకు గురియగునట్లొనర్చు కామమున కంటె శత్రువు వేరొక్కటిలేదు. దానిని వీలైనంత శీఘ్రముగ హత మార్చవలెను. కామములకు లొంగి మనుష్యుడు నరకగామి యగు చున్నాడు. కాబట్టి శ్రేయోమార్గ మున పయనించువానికి కామమొక భయంకర శత్రువు. ఈశ్వరుడు సర్వ భూతములయెడ దయగలవాడును, అందరికిని సుహృత్తునునై యున్నా డు. ఆయన మనుష్యులను పాపపరా యణులనుగ, నరక గాములనుగ నొనర్చుటలేదు. ప్రారబ్ధము పూర్వ కృతకర్మముల భోగరూపమైనది; కాబట్టి అదియు పాపమునందు ప్రవర్తింపజేయుటలేదు. ఇందువలన కామమే పాపప్రవృత్తికి కారణ మనుట నిష్కర్ష.

మనుష్యుని బలవంతముగ పాప మునందు త్రోయునదియు, సమస్త

మగు అనర్థములకు మూలకారణ మును, కామమేయని గత శ్లోక మున చెప్పబడినది. కామమనిన ఆసక్తియనియు కోరికయనియు అర్థ ము చెప్పవచ్చును. ఆ కామము మనుష్యుని యేవిధమున పాపము నందు ప్రవర్తింపజేయుచున్నదో, ఆ విషయమును యీ పైమూడు శ్లోకములలో భగవంతుడు తెలియ జేయుచున్నాడు.

(శ్లో॥ 38) "ఓ పార్థా! పొగ చేత కప్పబడిన అగ్ని తాను చేయ దగిన దహన ప్రకాశాది కార్యము లను చేయుటకు అసమర్థమైనట్లును, ధూళితో కూడిన అద్దము ప్రతిబింబ ప్రదర్శన కార్యమునకు చాలని యట్లును, మావితో మూయబడిన పిండము కాస్తేను కదలింప నోపనియట్లును, కామ సంకల్పముల తో ఆవరింపబడిన జ్ఞానము ఆత్మ సాక్షాత్కారమునకు అసమర్థమై యుండును. అగ్నియు అద్దమును పిండశిశువును ఆవరణ ప్రతిబంధవశ మున తాము చేయదగిన క్రియలను చేయజాలకపోయినను — వాటిశక్తి తాత్కాలికముగ నిరుద్ధమైయున్న ను, శక్తి సమూలముగ నశించి పోవుటలేదు. ఆవిధముననె కామము చే ఆవరింపబడిన జ్ఞానము సైతము తాత్కాలికముగ కుంఠితమైయున్న ను, దానిశక్తి నశించిపోవుటలేదు".

ఈశ్లోకమునందు పొగయు, ధూ ళియు, మావియు, కామమునకు దృ ష్టాంతరూపముగ చెప్పబడినవి. ఆ చెప్పుటలో ఒక విశేషార్థమున్నది. సూక్ష్మశరీరమును ఆశ్రయించుకొని వాసనారూపమున నుండెడి కామము స్థూలశరీరధారణమున నదియు స్థూలమగుచున్నది. ఆ కామము విషయచింతనమున మరింత స్థూల రూపమును ధరించుచున్నది. విష య పదార్థములను భోగించుటతో అది మరియు మరియు పెద్దదియగు చున్నది. అట్లు ఉత్తరోత్తరము కామశక్తి విస్తారమగుచున్నదని సూచించుచు, దానికి తగిన దృష్టాం తములుగ పొగయు ధూళియు మావియు చెప్పబడినవి. అందు పొగ మొదటి దృష్టాంతము. పొగ అగ్నిని ఆవరించినను అగ్నియొక్క స్వరూప ప్రభావములను బొత్తుగా తెలియ కుండ జేయజాలదు. అది అగ్ని వలననె బుట్టి అగ్నినే ఆవరించు చున్నది. రెండవ దృష్టాంతము ధూళి. ధూళి అద్దమును కప్పివేయు చున్నది. మొదటిదానికంటెయిది మరికొంత దట్టమైన ఆవరణము. అయినను యెంతగా దుమ్ముతో

కప్పబడినను అద్దము కొంతమట్టుకు తన కార్యమును నెరవేర్చగలదు. జరాయువు (మావి) మూడవ దృష్టాంతము. ఇది బలమైన ఆవరణము. మావిలో మూయబడిన పిండశిశువు కాలుసేతులు కదలించను కూడ నోపనిదియై నిర్బంధమున బడియుండును. ఇట్లే కామము తనకు తగిన అవకాశములను చిక్కించుకొని స్థూలాతి స్థూలముగ పరిణమించగలదని ఫలితార్థము.

"తథా తేనేదమావృతం" అని యింతవరకు సంక్షిప్తముగ చెప్పిన విషయమును మీాదట విస్తారముగ చెప్పబోవుచున్నారు.

(శ్లో॥ 39) "కామము (కోరిక) వివేకజ్ఞానాత్మకమగు అంతఃకరణమును ఆవరించుచున్నది; కాబట్టి అది మనుష్యునకు శత్రువువంటిదని చెప్పితిమి. కామము పరిణామమున దుఃఖమును కల్గించునది కావచ్చును గాక! సద్యఃకాలమున మాత్రము సుఖమునే కల్గించుచున్నది గదా!— అని అర్జునా! శంకింతువేమో! వినుము. సద్యఃకాలమున – విషయభోగకాలమున సుఖమును కల్గించుచున్నదని మూర్ఖుడు తలంచునె కాని వివేకి తలంచడు. కామము అనర్థకారియనెడి విషయము వివేకికి భోగకాలమున సైతము తెలియుచునెయుండును. కాబట్టి దానిని సదా దుఃఖకారిగనె యెంచుట మంచిది. లోతుగ విచారించినచో కామము మూర్ఖునికి సైతము నిత్యవైరిగనె యున్నది. కామములనునవి – కోరికలనునవి, అవి యెట్టివైననుకూడ అంత సులువుగ లభింపవు. కష్టపడియె సంపాదించవలసి యుండును. అందువలన కామసంపాదనము సాధనావస్థయందును దుఃఖకరమయ్యేయున్నది. భోగావస్థయందు కట్టెలు వేయుకొలది అగ్ని ప్రజ్వరిల్లునటుల కామము విషయానుభవమువలన మరింత ప్రజ్వరిల్లునెగాని చల్లారుననుట కల్ల. దొరికిన దానితో తృప్తివహించక ఇంతకంటె మించిన భోగసుఖము కావలెననియె కోరికలూరుచుండును. కాబట్టియె కామాశకు కడలేదు; తృప్తిలేదు. అది వివేకికిని అవివేకికిని సమానముగ శత్రువుగానే యున్నది."

కామము (ఆశ) వివేకికి నిత్యవైరియని భగవంతుడిచ్చట చెప్పుటలో నొక విశేషముకలదు. వివేకియైనవాడు కామముయొక్క గుట్టుమట్టులను గుర్తెరిగినవాడు కాబట్టి, అది తనయందు ప్రవేశించినంతనే ప్రమత్తుడు గాక, దానిబారినుండి

తన్ను కాపాడుకొనును. అవివేకి యో, అంతటి దూరదృష్టి లేని వాడు కాబట్టి మున్ముందు దాని యందు మిత్రభావన నుంచి పుర స్కారము చూపి, పరిణామమున దానిచే దెబ్బ తినిన తర్వాత "అయ్యో! చెడితినే!" యని అంగ లార్చును. ఇది అవివేకియొక్క పరి స్థితి. దూరదృష్టిగల వివేకి కామ మును నిత్యవైరిగ మొదటి నుండియె భావించును. అట్టివాడు చేయు కర్మములు వానికి బంధ కరములుగ నుండక, ముక్తిసాధన ములుగ నలరారును.

శత్రువును జయింపగోరువారు, ఆ శత్రువు వసించెడి దుర్గమును తప్పనిసరి గుర్తించవలసి యుండును. కాబట్టి కామమను శత్రువును జయించుటకై దాని ఉనికిపట్టులను గూర్చి ముందటి 40వ శ్లోకమున భగవాను డుపదేశించుచున్నాడు.

"ఫల్గునా! శత్రువును గెలువ కోరువాడు శత్రువునకు ఆశ్రయమై యుండు దుర్గమును వశమొనర్చు కొనుటకై యత్నింపవలెను. పాళె గాండ్రు దుర్గములను కోటలను ఏర్పరచుకొని, అందులో తమకు కావలసియుండు ఆహారాది సామ గ్రులను — యుద్ధపరికరములను నేక రించి పెట్టుకొని యుందురు. పరులు లోనికి రాకుండునట్లు తలవాకిలిని బిగించి లోపలనె సురక్షితముగ వసించు చుందురు. వలయునప్పుడు వెలుపలకు వచ్చిపోవుటకై దిడ్డి దారులను - క్రంతదారులను ఏర్ప రచుకొని యుందురు. అట్లే కామ మను శత్రువుకూడ యింద్రియ ద్వారము లనెడి దొంగ దారుల నైదింటి నేర్పరచుకొని మనోబుద్ధు లను తనకు నివాసస్థానములుగ చేసి కొనియున్నది. ఇంద్రియముల మూలకముగ నది మనుష్యుని విహ్వలుని చేయుచున్నది. కాబట్టి కామమును జయింపగోరువాడు తొట్టతొలుత దొంగదారులగు యింద్రియముల నిరోధించవలెను. ఆపై మనోబుద్ధులను నిగ్రహించి కామశత్రువును మట్టుపెట్టవలెను."

ఇంద్రియములను జయించిన వానికి కామజయము సులభము కాగలదని భగవంతుడు మీఁదటి శ్లోకమున బోధించుచున్నాడు.

"ధనంజయా! ఒకానొక రాజు పర్వత దుర్గాదికములను తనకు ఆటపట్టులుగ నొనర్చుకొనియుండు నటుల, ఈకామముకూడ శ్రోత్రాది యింద్రియములను అధిష్ఠానముగ జేసికొనియున్నది. కాబట్టియే నీవు

ప్రథమమున ఆ యింద్రియములను స్వాధీనపరచుకొనవలెను. ఇంద్రియములను వశము చేసికొనక కామమును జయించుట అసంభవము. ఇంద్రియములను నిగ్రహించిన తదుపరి మనోబుద్ధుల నిగ్రహించుట సులభము కాగలదు. సంకల్పరూపమగు మనస్సుకాని, నిశ్చయరూపమగు బుద్ధికాని, బాహ్యేంద్రియముల సహాయమును బొందియే బైట ప్రవర్తించి అనర్థమునకు కారణములగుచున్నవి. బాహ్యేంద్రియముల తోడులేక అవి యే కార్యములను చేయజాలవు. కావున, శ్రోత్రాది యింద్రియములను నిగ్రహించిన మీదట మనోబుద్ధుల నిగ్రహించుట కష్టముకాదు.

అర్జునా! కామవివశుడైన మానవుడు చేయని పాపము లేదు. అది లేనిచో పాపములె లేవు. ఇట్టి అన్వయవ్యతిరేకముల వలన ఈ కామము సమస్త పాపములకు మూలముగ గుర్తించుము. ఈకామమువలన జ్ఞాన విజ్ఞానములు నశించుచున్నవి. గురు శాస్త్రోపదేశముల వలన పుట్టిన ఆత్మయొక్క పరోక్షజ్ఞానమును జ్ఞానమందురు. దానికి ఫలమగు అపరోక్ష జ్ఞానమును విజ్ఞానమందురు. ఇంతటి మహాద్రోహియగు కామమును తప్పక నిర్మూలింపవలెను.

ఈవిధముగ భగవంతుడు "ఇంద్రియాణి మనోబుద్ధిః" అనెడి శ్లోకముతో, యింద్రియములను మనోబుద్ధులను ప్రత్యేకముగ జయించవలసిన అగత్యమును చెప్పి, "పాప్మానం ప్రజహి హ్యేనం" అను మాటలతో కామముయొక్క అనర్థమును నిరూపించియున్నారు. ఇచ్చట గ్రహింపవలసిన అంశ మొక్కటి కలదు. మనోనిగ్రహము సున్నితముగ చేయవలయునె గాని హఠముగ జేయరాదు. అంతే కాదు; బాహ్యవిషయములనుండి మరలించిన మనస్సును ఆత్మవిచారమున ప్రవర్తింప జేయవలెను. అప్పుడు కామము ఉదయించుటకు వీలుండదు.

కామమును జయించుటకు సులభోపాయమును భగవంతుడిప్పుడు బోధించుచున్నాడు.

"పాండునందనా! సావధానచిత్తముతో ఆలకింపుము. స్థూలమును జడమును పరిచ్ఛిన్నమును బట్టబైట నుండునదియు నగు దేహమునకంటె యింద్రియములు శ్రేష్ఠములు. — ఎందుకనిన — ఇంద్రియములు సూక్ష్మములైనవి. బయటి

పదార్థములను తెలిసికొను శక్తి గలవి. మరింత వ్యాపకమైనవి. బయటికి గోచరించునవి కావు. ఇట్టి యింద్రియములకంటె వాటికి ప్రేరకమగు మనస్సు గొప్పది. ఆమనస్సు కంటె బుద్ధియొక్క అధికారము పెద్ద. ఆ బుద్ధికంటె మేల్బంతియై, అన్నింటికి లోననుండెడి పరమాత్మ సర్వశ్రేష్ఠమైనది. కామములు — కోరికలు ఆ ఆత్మనె ఆవరించు చున్నవి. అయ్యో! కిరీటీ! వెనుక చెప్పియున్నాను. ఆమాటను జ్ఞప్తి చేసికొనుము. విషయములందలి ప్రీతి, పరమాత్ముని దర్శనానంతరముమాత్రమె నశించగలదు. అందువలన, తన ఆత్మస్వరూపమె అన్నింటికంటె శ్రేష్ఠమనెడి భావనను నిర్మలమగు మనస్సుతో నిరంతరము అనుసంధానము చేయుచు దుర్జయమగు కామమును జయింపుము.”

కామమును జయించుటకై వ్యవస్థితమగు నొకపద్ధతిని మనమాశ్రయింపవలసి యున్నది. ఇంద్రియనిగ్రహము మొట్టమొదట సాధించదగిన పని. ఆయింద్రియములకు ప్రేరకమై వాటికంటె సూక్ష్మమై యుండునది మనస్సు. మనస్సును జయింపనిచో యింద్రియములను జయించుటకు సాధ్యము కాదు. సంకల్పాత్మకమగు మనస్సుకంటెను నిశ్చయాత్మకమగు బుద్ధి సూక్ష్మమును వ్యాపకమునునై యున్నది. బుద్ధిని స్వాధీనమొనర్చుకొనినవానికి యింద్రియములును మనస్సును స్వాధీనములు కాగలవు. పెద్దది యగు యంత్రము నడచుటకు మూలమగు కీలును గుర్తెరిగి, ఆ (ప్రేరక) సాధనమును వశమొనర్చుకొన్నచో మొత్తము యంత్రమును వశమొనర్చుకొనినట్లు కాగలదు. కామము యింద్రియములందు గోచరించుచున్నను నిజమునకది మనోబుద్ధుల నాశ్రయించియున్నది. ఈమూడింటి యొక్క వ్యాపారములను విభజించి చక్కగ తెలిసికొనినచో కామమును గెలుచుటకు వీలు కలుగును. విషయములు సాక్షాత్కారమైనంతనే యింద్రియములందొక ప్రతిక్రియ యేర్పడుచున్నది. ఆ ప్రతిక్రియ మూలమున శబ్దస్పర్శ రూపరస గంధములనెడి వికల్పములు మనస్సున నేర్పడుచున్నవి. ఆవికల్పములను నొక్కటిగ కూర్చి “ఇది యిట్టివస్తు” వనెడి జ్ఞానమును కల్గించి, బుద్ధి జీవునికి అభిలాషను అంటగట్టుచున్నది. అనంతరము తాను వెనుక అనుభవించిన విషయ

ముల యొక్క వాసనాప్రాబల్య మున, మరియు ననుభవింపవలెనను గోరిక గలవాడై, తదనుగుణముగ జీవుడు యింద్రియములను ప్రేరేపించుచున్నాడు. అప్పుడు యింద్రియములు తమ తమ వ్యాపారములను నెరవేర్చి జీవునకు విషయోపభోగముల నొడగూర్చి అంతఃకరణ క్షేత్రమున కామబీజముల నాటుచున్నవి. ఇట్లు విషయముల సంసర్గమును కామవాసనయు ప్రాప్తించుచున్నది. కామవాసన ఒక్క పట్టున తెగునది కాదు. విషయ సంగమువలన కామవాసనయు, దానివలన భోగప్రవృత్తియు, అంతట కర్మముల చేయుటయు, తదుపరి విషయానుభవమును, అనుభవమువలన వాసనయు, వాసనాయుక్తమగు అంతఃకరణము భోగపరాయణమగుటయు, నిట్లు యెడతెరిపిలేక వెంటవెంట చక్రభ్రమణమువలె కామవిలాసము ప్రవర్తించుచునె యుండును.

వివేకవంతుడు యేసమయమున ఇంద్రియాదుల సంబంధమును విడిపించుకొని, అన్నింటికి అతీతమై యుండు ఆత్మతత్త్వమును దర్శించగల్గునో, వానిపై కామశత్రువు దాడిచేయలేదు. ఆత్మజ్ఞాని సమస్త కామములను కడజనిపోగలడు. పరమార్థమున ఆత్మతప్ప మరేవస్తువును లేదు. జీవులు అజ్ఞానముతో తమ యందులేని సంసార దుఃఖమును కల్పించుకొని అనుభవించుచున్నారు. కావుననే శ్రుతియందు ఈఅధ్యారోపమును నిరసించుటకై అధ్యాత్మయోగము చెప్పబడినది. మున్ముందు వాక్కు మొదలగు యింద్రియములను మనస్సునందు లయమొనర్చవలెను. మనోవృత్తుల కంటె ప్రత్యేకముగ యింద్రియ వ్యాపారములె లేవని తెలిసి, అంతయు మనోమాత్రమని నిశ్చయించుకొనవలెను. ఆ మనస్సును నిశ్చయాత్మకమగు బుద్ధియందు లయమొనర్చవలెను. విషయములను వికల్పించుటయందు గల దోషమును గుర్తించి మనశ్చాంచల్యమును అరికట్టి నిశ్చయాత్మిక బుద్ధిని నెలకొల్పవలెను. ఆబుద్ధికి సాక్షియై యుండెడి ఆత్మస్వరూపమును గుర్తించి అనాత్మ సంబంధమును త్రోసిపుచ్చవలెను. ఇట్లు ఇంద్రియ మనోబుద్ధులకు నావల నుండు శుద్ధాత్మస్వరూపమును గుర్తించిన వానికి కామమను శత్రువుయొక్క ఉపద్రవము నితాంతము నశించుచున్నది.

భగవంతుని బోధ యెంతవరకు వచ్చినదను విషయమును గూర్చి యిచ్చట కొంతసేపాగి విచారించు కొని యీకర్మయోగప్రకరణమును ఉపసంహారింతును. ముముక్షువైన వాడు ఫలాభిలాషను వదలి సంగము లేక కర్మయోగమును ఆచరింపవలె ననిన కామము ప్రతిబంధమై యున్నది. ఆకామమే క్రోధాది రూపములను దాల్చి సాధకుని అధో గతి పాలు చేయుచున్నది; కాబట్టి దానిని నివారించు కొనుటకు యత్నించుట మంచిది. ఇంద్రియ ములును మనస్సును బుద్ధియు కామమునకు ఆశ్రయములై యుం డుట బట్టి మొట్టమొదట వాటిని వశపరచుకొనవలెను. ఇట్లు చేసి నపుడే కర్మయోగము దక్కుచు న్నది; జ్ఞానము సిద్ధించుచున్నది. ఒక్కసారి జ్ఞానము సిద్ధించినచో తదుపరి ఇంద్రియ మనోబుద్ధులు ఆత్మకంటె అన్యముగ కాన్పించవు. కావున బుద్ధిని దాటి సాక్షియగు ఆత్మను తెలిసికొనినవానికి సహజ ముగ యింద్రియములు వశములై పోవును; కామవాసనలు మటు మాయమై పోవును. అజ్ఞానమును పొందువరకు ముముక్షువు హెచ్చ రికతో కర్మయోగమునను ష్ఠించుచు తన లక్ష్యమును మరువక సాధనా మార్గమున కామవాసనలు యెదు ర్కొనినచో పరమేశ్వరభక్తి పూర్వ కముగ వాటిని తూలబుచ్చవలెను. ఇట్టి కర్మయోగతత్పరుడు తన లక్ష్య మగు ఆత్మజ్ఞానసిద్ధిని బడయగలడు.

ఇందిరాన

---

## సమదర్శనం — సమవర్తనం.

శిష్యుడు:- స్వామీ! భగవద్గీత "పండితాస్సమదర్శినః" - జ్ఞానులు సమదర్శనాన్ని కల్గి ఉండాలని చెప్పింది. అట్లయిన - బ్రాహ్మణుని, చండాలుని, కుక్కను, గోవును ఒకేమాదిరిచూడాలిగదా! ఒకే మర్యాద చూపాలికదా! అది సమంజసమేనా?" అని ఒకభక్తుడు, ప్రసిద్ధుడగు హుబ్బళి సిద్ధారూఢస్వాములవారిని ప్రశ్నించాడు. స్వామివారు యిట్లనిరి:

"నాయనా! భగవద్గీత సమదర్శనాన్ని చెప్పింది కాని, సమవర్తనాన్ని కాదుగదా"

# భగవద్గీతపై నా సమన్వయ దృష్టికోణము.

## శ్రీ దోమా వెంకటస్వామి గుప్తగారు.



[ శ్రీ కవిచక్రవర్తి, శతావధాని, విద్వాన్ దోమా వెంకటస్వామి గుప్తగారు ఆంధ్రలోకమున బహుముఖముల ప్రసిద్ధులు. గద్యపద్యములయందు ధురంధర రచయితలు. ఆధ్యాత్మిక తత్త్వప్రియులు. అట్టి పండిత ప్రవరుని అభిమానరచయితగా పొంది మా గీతా సాహిత్య సేవాసమితి ధన్యమైనది.

ఈ నాడు సమన్వయ యుగము. మతసమన్వయమును - ధర్మ సమన్వయమును సాధించుట ఈనాటి ప్రవక్తలకు అవసర కర్తవ్యము. మన రచయితకుగల ఆ దృష్టికోణమును పాఠకులు గ్రహింతురుగాక. — సంపాదకుడు. ]



గీతాచార్యుఁడు శ్రీకృష్ణపరమాత్ముఁడు. అతఁడు జగద్గురువు, కావున నతని యాదేశమయిన శ్రీభగవద్గీతలోని యంశములు జగత్తంతటికిని వర్తింపవలయునుగాని కేవల మొక్క భరతఖండమునకే కాదు: అనెడి అభిప్రాయమును పెద్దలవలన నా చిన్నప్పటినుండి యాలకింపుచు ఇతరమతములలోని యభిప్రాయములతో నిందలి యభిప్రాయములను బోల్చిచూడఁగా ఎన్నో చోట్లయందు సామ్యము గన్పట్టుచున్నది. తగుపరిశీలన చేసినచో గీతలోని యంశములు జగత్తంతటికిని వర్తించునని తెలియఁగలదనెడి విశ్వాసము బలపడుచున్నది. ప్రకృతము ఒక యుదాహరణము జ్ఞానయోగము నుండి మనవిచేయుచున్నాను.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తంతే
మనుష్యాః పార్థ! సర్వశః॥౧౧

తా॥ ఎవరు ఏరీతిగా నన్ను సేవింతురో దానికి ఆనుగుణ్యమయిన ఫలమును నేనొసంగెదను. ఎల్లరీతులను మానవులు నన్ననుసరించుచున్నారు.



పరిశీలనము:- "ఫలాపేక్షయున్నచో ఫలమును, అది లేనివారికి మోక్షమును ఒసంగి నన్ను సేవించువారిని తృప్తి పఱచెదను" అని భగవదభిప్రాయముగదా! ఇందలి

'యథా' శబ్దమునకు 'ఏరీతిగా' అనుటలో ఏ రీతిగానైనను ఏ మతమునందుండినను – అనెడి భావము తోఁచుటకు వీలున్నది. ఏ రూపుతో ధ్యానము గావించిన ఆ రూపమును సందర్శించుట. ఏ మతము నవలంబించి యున్నచో తదనుగుణమయిన ఫలితము నొసఁగుట, ఆ ఫలితము సేవలను బట్టియైనను మతమునుబట్టియయినను కాదు అని యూహా కల్గెడిది. భగవంతుఁడు సర్వమతసముఁడు, మతము లన్నిటనతఁడు ప్రతిపాదింపఁబడును గదా! భంగ్యంతరములుండును గాక. కాబట్టి మతమును మార్చుకొనుటవల్ల భగవదనుగ్రహమునకెట్టి వృద్ధికరమయిన మార్పును గల్గదని విశ్వసింపవలసియున్నది.

ద్వారకనాథుఁడనెడి శ్రీమంతుఁడు న్యాయవాదులలో సుప్రసిద్ధుఁడును వంగ భాషాకవీశ్వరుఁడును అయిన మధుసూదన దత్తుగారిని కలకత్తానుండి దక్షిణేశ్వరమునకు రప్పించెను. ఆ న్యాయవాది శ్రీ రామకృష్ణ పరమహంస వృత్తాంతమునువిని వారిని సందర్శింపఁగోరెను. శ్రీ పరమహంసగారు నారాయణ పండితులవారితో దత్తుగారి కడకు వచ్చినారు. శాస్త్రిగారితో దత్తుగారి సంస్కృతభాషా సంభాషణమయినతరువాత శాస్త్రిగారు దత్తుగారు క్రైస్తవమతావలంబనము గావించుటకుఁ గారణమడిగిరి. అందులకుఁ గారణముగా క్రైస్తవులయిన యున్నతోద్యోగులకడ అనుగ్రహ లాభము నొందుటకై తాము క్రైస్తవ మతము నవలంబించినట్లుగాఁ దెల్పిరి. అప్పుడు శాస్త్రిగారు "మనకు నుండు ఐహికమయిన స్వల్పాయుర్దాయ పరిమితిలో కల్గవలసిన కొద్దిపాటు ఫలితముకొఱకు మతములను మార్చుకోవలయునా? ఎంతటి కష్టము కల్గినను మతమును మార్చుకొనరాదు. అందువల్లనే గౌరవము" అనఁగా – దత్తుగారు శ్రీ పరమహంసగారిని తనకుతగు సలహానిండని ప్రార్థించిరి. అప్పుడు శ్రీపరమహంసగారు తననోట ప్రత్యుత్తరము నెవరికో రానిచ్చుట లేదని వచియించిరి. అప్పుడు దత్తు మరల ప్రార్థించెను. అందులకుఁ బరమహంసగారు తాను చెప్పఁదలంచి యున్నను తనకది సాధ్యపడుటలేదనఁగా దత్తు సిగ్గును విచారమును జెందెను. పిదప పరమహంస కొంతసేపట్లేయుండి కొన్ని పాటలను గానము చేయఁగా దత్తునకుఁ గావలసిన యంశము లందుమూలమున నవగతమయినవి. అప్పుడు నారాయణశాస్త్రి శ్రీ పరమహంసగారి గోడలపయిన "ఎవరి మతమును వారవలంబించుచుండవలెను. మతము మార్చుకొనుట చాల హేయమయిన పని. దానికన్న నీచకార్యము లేదు" అని లిఖించెను. పొట్టకొఱకై మతమును మార్చుకొనుట ఇంకను లజ్జాకరవిషయము. ఆ వ్రాఁత నక్కడికి వెళ్లువారు కాంతురు.

శ్రీ వివేకానందులవారి పూర్వాశ్రమ నామధేయము నరేంద్రుఁడు. అతఁడు భగవద్గీతను చక్కఁగాఁ జదివి గౌరవించుచుండెను. అతఁడు మతములన్నిటిని సగౌరవముగాఁ జూచుచుండెను. ఒకనాఁడు కలకత్తా పురవీధిలో నొకట ఒక క్రీస్తు పాదిరీ నిల్చుండి క్రైస్తవమత ప్రచారార్థమను పేరితో మాటాడుచుండెను. అనేక హిందువులటుఁ జేరియుండిరి. అప్పుడతఁడు

హిందువులను దేశించి "మీరు విగ్రహములను రాలు - కర్ర - లోహము మొదలయినవాని తోఁ జేయఁబడినవానిని పూజింతురు. అవి జీవము లేనివి. నేను వానిని నాచేతికఱ్ఱతో గొట్టినచో నవి యేమియుఁ జేయఁజాలవు గదా!" అనఁగా అక్కడివారందు కేమియు జవాబు చెప్పఁజాలకుండిరి. ఆ ప్పుడు అక్కడనుండిన నరేంద్రుఁడు "అయ్యా! మీ దేవుని నేను తిట్టినచో ఆ తఁడు నన్నేమిచేయును?" అని ప్రశ్నించెను. అతఁడు "మా దేవుని నీవు దూషించినచో అతఁడు నీ మరణానంతరము నిన్ను నరక మునఁ బడవైచి కాల్చును". అనఁగా నరేంద్రుఁడు "మా దేవతా విగ్రహములను నీవిప్పుడు కొట్టినచో నీ మరణానంతరము అవి నిన్ను నరకములోఁబడవేసి ఇనుప ముండ్లతోఁ బొడిచి శిక్షించును." అని పలికి యక్కడఁ జేరినవారిని నవ్వించెను.

ఆ నరేంద్రుఁడు వివేకానంద నామధేయమును చెందకముందు శ్రీ రామకృష్ణుల వారి యెదుట నప్పుడప్పు డుపన్యసింపుచుండెను. అప్పటిలో అతనికి మనస్సున అంతర్వాహినిగా కొన్ని మతములయందు ప్రేమయును కొన్ని మతములయందు వైముఖ్యమును ఉండెడిది. ఈ యంశమును పరమహంస గారు గమనించి యతనితో ప్రశాంతముగా "నాయనా! ప్రతియింటికిని వీధి వాఁకిలి పెరటి తలుపు ఉన్నట్లుగా, ప్రతి మతము నవలంబించుటకు ప్రకటము అంతరంగికము అని రెండు పద్ధతులుండును. కొందఱు క్రైస్తవులగు పాదిరీలు (విద్యాధికులు గూడ) హైందవయువకులను క్రైస్తవ యువతులయందు ప్రేమగల్గించి - ఆ మిష తో క్రీస్తుమతమునందుఁ గలుపుకొందురు. బందరుపురమునఁ గాబోలు "రామచంద్రరావు" అనెడి విద్యార్థి విషయమున నిట్టి రీతి జరిగినది.

శ్రీ పరమశివుఁడు శివగీతయందు శ్రీరామచంద్రునితో

> "యేనాకారేణ యే మర్త్యా
> మామేవైకముపాసతే।
> తేనాకారేణ తేభ్యోఽహం
> ప్రసన్నో వాంఛితం దదే॥
> విధినాఽవిధినా భక్త్యా
> యే మర్త్యామాముపాసతే।
> తేభ్యః ఫలం ప్రయచ్ఛామి
> ప్రసన్నోఽహం న సంశయః॥"

తా॥ ఏ యాకారము గలవానినిగా నన్ను సేవించినను వారికి ఆ యాకారముతో ఫలము నొసంగెదను. శాస్త్రోక్త ప్రకారమయినను కాకున్నను భక్తితో నన్ను నుపాసించువారికి తప్పక కోర్కుల నిచ్చెదను.

ఇట్లున్నప్పుడు శైవ వైష్ణవాదులకు, మఱియు నితరమతములవారికి బద్ధ విరోధము లేల? అందులకు కారణము బహుశః ఈ మతావేశము నొందింపఁబడిన శిష్యులు మా యాచార్యులని చెప్పుకొను చుండెడి, మతాంతరంగ మెఱుంగని గురునామధారుల బోధలే కాఁబోలు.

> " గోడకుఁబట్టెలుంచినటు గొప్పగ
> నామము వేసినంతనే వాఁడొక
> విష్ణుభక్తుఁడౌనా "

"గోడకు వెల్లవేసినటు గొప్పగ
బూదిని బూసికోఁగనే వాఁడొక
శంభుభక్తుఁడౌనొకో?"

అని కొందఱు కవీశ్వరులు వాకొని యున్నారుగదా!

ఒక పండితుఁడు విష్ణ్వాలయమున శ్రీ భగవద్గీత నుపన్యసించునప్పుడు అతనిని గౌరవించిన వైష్ణవ మతాభిమానులు ఆ పండితుఁడే ఆ యుపన్యాసములనే శివాలయమునఁ గావించినప్పుడక్కడ ఉపన్యసింపరాదని యాక్షేపింపఁగా అతఁడు "అయ్యా! సర్వాంతర్యామియయిన శ్రీ మహావిష్ణువు శివాలయములో లేఁడా? 'శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః' అందురే" అనగా వారు నిరుత్తరులయిరి. కాని తృప్తి పడినట్లులేదు. ఇందులకు కారణము గురువులమని పేర్లు పెట్టుకొని మతావేశము రెచ్చగొట్టించుచు, దండములు కోదండములు పెట్టించుకొనుచు పాదపూజలు చేయించుకొనెడి ఆచార్యనామములే నేమో?

ఈ యంశమునుగూర్చి "కొరాన్" లో

8 వ భా. 2 వ అ. 34వ వి.

ఏమతమనెడు ప్రశ్న లేదు. ఎందయినను మంచి చెడ్డ అనెడు త్రోవలు తేటగా నుండును. మాయను నమ్మక పరమాత్ముని నమ్మినవాఁడే తగిన యాధారము నాశ్రయించినవాఁడగును.

6 వ భా. 5 వ అ. 7 వ వి.

పరమాత్ముఁ డొక్కొక్కరి కొక్కొక్క త్రోవ నేర్పాటు చేసియుండును. అతఁడెల్లరికి నొకత్రోవ నేర్పరుపక, వారి వారిని పరీక్షించుటకై భిన్నమార్గముల నేర్పఱచినాఁడు. కావున మార్గములన్నియును భగవానుని చేర్చును.

9 వ భా. 8 వ అ. 5వ వి.

మతములన్నియును పరమాత్ముని చెందుటకై అతనిచే నేర్పాటు చేయఁబడిన మార్గములు. మనము వానిని సరిగా ననుసరించుచుండుట నతఁడు చూచుచుండును.

11వ భా. 10వ అ. 10వ వి.

ఒకరి నొక మతమునుండి యింకొక మతములోఁ చేరుటకై బలాత్కరింపరాదు. ఏ మతముచేనయినను ఒకానొక సమయమునఁ బరమాత్ముని చెందవీలగును.

15 వ భా. 17 వ అ. 12వ వి.

పరమాత్ముని నేపేరుతో నయినను పిల్వవచ్చును. అతఁడు రహిమాన్ — అనఁగా దయాసాగరుఁడు. అతని నామధేయము లన్నియును శక్తిగలవే. మామూలు స్వరముతో మీ ప్రార్థనలు చేయుఁడు. కేకలు వేయవద్దు. గుసకొట్టవద్దు.

17 వ భా. 22 వ అ. 9 వవి.

జాతులన్నిటికి భక్తిమార్గ మేర్పఱుపఁబడినది. కలహింపక వారాయా మార్గముల ననుసరింపనగును. మాచే అన్ని త్రోవలు మంచివిగానే యేర్పఱుపఁబడినవి.

ఇందువలన సర్వమత సమత్వము ప్రతిపాదింపఁబడుచున్నదిగదా! కనుక ఎల్లరికి నమృతము లభించు మార్గము గలదు గదా!

మరొక్క ఉదాహరణము:- శ్రీ భగవద్గీత – విజ్ఞానయోగము (అ. 7) శ్లో॥ 14.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే
మాయామేతాం తరంతి తే॥

తా॥ గుణత్రయముతోఁగూడి దేవతా సంబంధము గల్గిన నామాయను దాటు వీలు గాదు. అని శ్రీకృష్ణపరమాత్మ్రుఁడనఁగా— అర్జునుండు "ఈ మాయదాఁటు నుపాయ మున్నచోఁ దెల్పవలయు"నని ప్రార్థించెను. అప్పుడు శ్రీకృష్ణులవారు తననే శరణుఁ జొచ్చువారు మాత్రము ఆ మాయను దాఁటఁ గలరని సెలవిచ్చిరి.

ఏ మతమునందయినను అవతారమూర్తు లైనను మతప్రవక్తలయినను "మామేవ" అనియే యందురు. ఏయే మతముల యందలి వారు, ఆయా మతప్రకారముగానే వర్తింపుచు, ఇతరులయిన మత ప్రవక్తలను అవతార మూర్తులను విరోధింపక, తమ యిష్ట దేవతలనువలెనే అన్యమతస్థుల యిష్టదైవతములను ప్రేమతో ఆరాధించుటయే మేలని యిందుమూలమున నూహింపనగును. తన నేరూపమునఁ బూజించిన ఆ రూపముననే కటాక్షించెదనని పరమాత్మ్రుఁడు వచియించి నాఁడుగదా! అట్లయినప్పుడిది యేమతమున కును విరుద్ధమెట్లగును?

"నన్నే" అనుటలోని భావము పరమాత్మ సంబంధమయిన యాత్మ స్వరూపమును గమ్యస్థానముగా నెంచవలెననియును, ఏ యవతారమూర్తినయినను నెంచవచ్చునని యును, భావించవచ్చునని యూహ నుడివియున్నారు. ఇందులో దేనినయినను అంగీకరింపవచ్చును. ఆత్మతత్త్వమునే యనుచోఁ- ఆత్మసాక్షిత్వము నంగీకరించి, అంతటివి ప్రకృతి నడపుచున్నదని నిత్య విచారణము గావింపుచు, సంసారబంధ విమోచనము నొందవచ్చును. శ్రీకృష్ణుఁడు, శ్రీరామచంద్రుఁడు, శ్రీశంకరుఁడు లేక శ్రీజగన్మాత- వీరిలో నెవ్వరినయినను (లేక మరేనామ రూపములతో నయినను) ఎంచు సగుణోపాసకులును, మత్రియును సమస్తమును తమ యిష్ట దైవతమనియే భావించువారును బాగుపడ వీలగును. ఆ శ్రీకృష్ణుల యొక్క యుపాధు లంతరించినవిగదాయని వారిని తలంచిన నేమిలాభమని పల్కెడి వారుందురు. అవతార మూర్తుల యొక్క యుపాధులు మనకుఁ గనుపడక యున్నను అది సదా యున్నట్లే భావింపనగును. ఈ నాఁడును శ్రీరామనామ స్మరణము భక్తితో గావించువారికి శ్రీరాముఁడు దర్శన మొసంగుచున్నాఁడు. అట్లే శ్రీకృష్ణుఁడును ఇతర దేవతామూర్తులును ఏసుక్రీస్తును దర్శన మొసంగుచున్నారు. సగుణ నిర్గుణ ధ్యానములలో దేనికయినను ఫలమొకటియేయగును. "మామేవ" అనుటలోని సారస్యము అల్ప ఫలముల నొసంగెడి క్షుద్రదేవతలను శరణు పొందరాదనుట. "ప్రపద్యంతే" యనుటలో ఇతర మార్గములనుగాక ప్రపత్తినే యవలంబింపవలయుననుట. ఎల్లకర్మలయొక్క ఫలాపేక్షను వదలవలెను. సర్వకార్యములను శ్రీకృష్ణార్పణమస్తు అనెడిబుద్ధితోఁ జేయ నగును. ఎల్లయవస్థలలోను త్రికరణశుద్ధిగా పరమాత్మ నామస్మరణము గావించి - యతని నిని చెందవచ్చును.

శివమాయనుగూర్చి శ్రీ శివగీత యందు శ్రీ అగస్త్యులవారు

శ్లో॥ దుర్జయా శాంభవీమాయా
తయా సమ్మోహ్యతే జగత్।
మాయాం తు ప్రకృతిం విద్ధి
మాయినం తు మహేశ్వరమ్॥

తా॥ శాంకరమాయ నెఱుంగ నెవరికిని సులభము గాదు. ఈ జగము దానిచే మోహము నొందును. ఆ మాయయే ప్రకృతి. తన్మాయామయుఁడు మహేశ్వరుండు. దీనిని దాఁటుటకు శైవులు శివునాశ్రయింపవలెను.

"ముముక్షుహితచర్యలో" శ్రీవాఁసుదాసుగారు "ప్రభువు వేసిన సంకెలల్ ప్రభుని యాజ్ఞఁ దొలఁగవలెఁగాక-యెవ్వరు దొలఁగఁద్రోయ నిపుణులు?" అని పరమాత్మనియెడఁ బ్రసన్నుఁడు గావలయుననిరి.

నారదభక్తి సూత్రములలో

తస్య జ్ఞానమేవ సాధనమిత్తి యేకే — అందులకు జ్ఞానమే సాధనమని కొందఱును, అన్యోన్యాశ్రయత్వ మిత్యన్యే - భక్తి జ్ఞానములు పరస్పరాధార భావమును నొందవలెనని కొందఱును అనుచున్నారు.

"స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః రాజగృహభోజనాదిషు తథైవ దృష్టత్వాత్ న తేన రాజపరితోషః క్షుచ్ఛాంతిర్వా.

తా॥ భక్తియే ముక్తినిచ్చును, రాజునింట రుచ్యభోజన వస్తువులున్నవన్న తెల్వి చేతనే తృప్తి గల్గదు. భగవంతుఁడొ కేవలాత్మయో కలఁడన్న తెల్విచేతనే తృప్తి కాదు. భక్తిచేతనే ముక్తిని పొందనగును.

పరమాత్మని నేనామముతోనైనను స్మరింపనగునని కొందఱును - ఏదో యొక పేరుతోనే యొకానొక మూర్తినే స్మరించి సేవింపవలెననియు భిన్న నామరూపములను సేవించువారి భక్తి వ్యభిచరించినట్లగునని కొందఱును వచింతురు.

శ్రీతొండరడిప్పొడి యాళ్వారొక శ్రీరంగనాథునినే సేవించి స్మరించి తరించెను. మఱియును "మామేవ ప్రపద్యంతే" యనుచో పరమాత్మనిని శరణుఁజొచ్చి-యతనిని తెల్పెడి పుస్తకములే చదువుట, వ్రాయుట జరపువారు - ఉదాహరణముగ శ్రీ బమ్మెరపోతనామాత్యుని యొక్క-
"పలికెడిది భాగవతమట పలికించెడి
వాఁడు రామభద్రుండట నేబలికిన
భవహరమగునట"

ఇందు కర్తృత్వమును ఫలాపేక్షయును ఇతర చరిత్రలును వదలఁబడినవి.

ఇంతటికి నితాంతము "సంపూర్ణ విశ్వాసమయిన ప్రపత్తియే మాయను దాఁటించి ముక్తిని గూర్చును" అనుట.

ఈ యంశమే బైబిలులో

"మీకు విశ్వాసము లేదు. దైవముపయిన మీకు ఏ కొంచము విశ్వాసముండినను, కొండను తొలఁగుమన్నను అది కదలిపో గలదు. దేవునిని నమ్మినచో మీ కేది యు నసాధ్యము గాదు. దైవధ్యానమును ఉపవాసమును అనెడి రెంటిచేతనే మీరు దేవునిని చేరవీలగును.

కొరాన్ 1భా. 1అ. 4చ. "నిన్నే సేవించి నీసాయమునే ఆసింతుము"

"దేవుఁడు తప్ప మరన్యుని సేవింపవద్దు. తల్లిదండ్రులు బంధువులు దిక్కులేనివారు మొదలయిన యవసరములో నున్నవారికి సాయము చేయుఁడు. (భా. 1 అ 2. వి 10. చ 83).

"భక్తులారా! మీరు సంపూర్ణముగా పరమాత్మునికి ఆత్మను అర్పింపుఁడు. మాయకు లోఁబడవద్దు. అది మిమ్ములను పగటి దోపిడీ చేయును."

భా 2. అ 2 వి 25. చ 208.

మీకుఁ గష్టము కల్గిన, అది కల్గించిన దేవుఁడే దానిని బాపవలెను. ఇతరులా పనిని చేయలేరు. అతనికి నెల్లశక్తులుగలవు. కాఁబట్టి యతనిని ధ్యానింపుఁడు. మీకు మేలు గల్గును" భా 7. అ6. వి2. చ. 17

"మాయవల్ల మీరు చెడిపోవుచున్నచో, దేవునినిశరణుఁజొఱుఁడు. అతఁడు మిమ్ములను రక్షించును. భా.9 అ.7 వి.24 చ.200

"పరమాత్ముఁడొకఁడే. అతఁడనే నేను. నాయొక్కనిగూర్చిరే మీరు భయమొందుఁడు. భా. 14 అ. 16 వి. 7 చ. 51

"భక్తులారా! నేను సర్వాధికారిని. నన్ను మాత్రమే సేవింపుడు. భా.26 అ. 29 వి. 6 చ. 56

ఈ రీతిగానే శ్రీ భగవద్గీత యెల్లమతములతో సమన్వయించునని పరిశీలించిన పెద్దలు వక్కాణించుచున్నారు.

— దోమా వెంకటసామిగుప్త.

# ప్రయాగకుంభమేళలో గీతాప్రాముఖ్యము.

### శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారు.



భారతదేశమునందు జరిగిన ఆధ్యాత్మిక సమావేశములలో ప్రయాగకుంభమేళ చెప్పుకొనదగినది. నూరు సంవత్సరములనుండి భారత దేశమునందిట్టి సమావేశము జరిగియుండలేదని యనేకులు చెప్పుచున్నారు. కొన్నిలక్షల సామాన్య ప్రజలు, కొన్ని వేలమంది సాధువులు వచ్చినారు. ఏ ప్రదేశమునందు చూచినను ఆధ్యాత్మికప్రసంగములే జరుగుచుండెడివి. అన్ని స్థలముల యందును లౌడ్సుస్పీకర్లు గలవు. ఆధ్యాత్మికోపన్యాసములు ప్రత్యేకముగా నొకచోకూర్చుండి వినవలసిన యవసరముండదు. ఏవైపునకు పోయినను, ఏదోయొక యాధ్యాత్మిక ప్రసంగము వినబడుచుండెడిది. అందులో ప్రతిప్రసంగము గీతాశ్లోకములనుదాహరించుచు విషయ నిరూపణ చేయుచుండెడివారు. మఱియుకొన్ని స్థలములలో ఉదయం 18 అధ్యాయములు పారాయణ చేయుచుండెడివారు. ఈపారాయణ సర్వులకు వినబడగలందులకు శబ్దగ్రాహణయంత్రములు పెట్టియుండెడివి. నిత్యము మండలేశ్వరులొక్కొకరు సంన్యాసులకు సమష్టి భిక్షల జరుపుచుండెడివారు. ఆ భోజనసమయమున దక్షిణలు వస్త్రముల నిచ్చుటయేగాక భగవద్గీతలనుకూడ పంచిపెట్టెడి వారు. కొన్నిచోట్ల భగవద్గీతా ప్రచారసంఘములు నెలకొలుపబడియున్నవి. ఈదృశ్యమును వీక్షించగా గీతయొక్క గొప్పతనము విస్పష్టముగా వ్యక్తమాచుండెడిది. కావున సర్వులు గీతామహిమ నిప్పుడైననుగుర్తించి శ్రద్ధాభక్తులతో పఠించి యందలి సద్భావముల హృద్గత మొనర్చుకొని నిత్య జీవితమున నాచరించుచు ధన్యులయ్యెదరుగాక!





# ★ గీతాతత్త్వము. ★

## రచయిత: శ్రీ దివాన్‌చంద్ M. A., Ph. D.

## అనువాదకులు: శ్రీ చారాల నరసింహమూర్తిగారు.

(1953 నవంబరు సంచిక 18వ పేజి తరువాయి.)

భగవద్గీత ననుసరించి 'కార్య ఫలము' విషయ మెటులున్నను మానవుని కర్మ నిమగ్నునిగ నొనర్చునవి అభిమానవాంఛలు, ఇష్టానిష్టములునున్నూ. 18 వ అధ్యాయమగు 'మోక్షసన్న్యాసయోగమున' శ్రీ కృష్ణపరమాత్మ సన్న్యాసము, త్యాగముల రెంటిని వివరముగ వచించి 14, 15 శ్లోకములందు కర్మకు కారణమగు హేతుపంచకమును వివరించును. కర్మచోదనము, కర్మ సంగ్రహముల వివరించి మూడు విధములగు జ్ఞాన, కర్మ, కర్త, బుద్ధి, ధృతి, సుఖములను సవివరముగ నిర్వచించి 50 వ శ్లోకమునుండి 57 వ శ్లోకమువరకు సర్వకర్మ లొనర్పదగిన సన్మార్గమును ప్రబోధించెను.

నైతికయభివృద్ధి:—నైతికమార్గమున నడచు వారలు అభివృద్ధి జెందుదురు. అభివృద్ధియన ముందుకు నడచుట. అనగా గమ్యస్థానమును చేరుటకు ముందుకు సాగెదరు. నైతిక యభివృద్ధియను పదమునకర్థము నీతికభివృద్ధి యనియా లేక నీతియందభివృద్ధియనియా? అవినీతిస్థితినుండి నీతిపదమునకు పురోగమన మనియా? లేక తక్కువ నైతిక స్థితినుండి ఉత్తమస్థాయికి చేరుటనియా? పరిణామ నైతిక సిద్ధాంతము (Evolutionary Ethics) ననుసరించి నీతిరహిత స్థితినుండి నైతికస్థితినందుకొనుట నైతిక పురోభివృద్ధి యని యర్థము. ఈ పరిణామ నైతికసిద్ధాంతము ననుసరించి నైతిక పరిణామ క్రమమున పశుప్రవృత్తి ప్రథమసోపానము. నైతిక పరిణామమున అజ్ఞానస్థితి తొలిఘట్టమని జర్మన్ వేదాంతి హీగెలు (Hegel) యొక్క యుద్దేశ్యము.

పై యభిప్రాయములకు వ్యతిరేకముగ నైతికయభివృద్ధియన నీతియందభివృద్ధియని కొందరనెదరు. మానవుడెపుడు పశుప్రాయుడు కాడనియు న్యాయాన్యాయములు, నీతి నియమములు, ధర్మాధర్మముల గుర్తించగల విమర్శనాబుద్ధి మానవునకు కలదని వీరియభిప్రాయము.

భగవద్గీతా శాస్త్రము నైతిక పరిణామ సిద్ధాంతమును భౌతిక పరిణామ సిద్ధాంతముతో జోడించును. భౌతిక పరిణామ క్రమమును వివరించునపుడు భగవద్గీత సాంఖ్యసూత్రముల ననుసరించును. ఆరంభ దశయందలి ప్రకృతి సత్వరజస్తమోగుణములకు ప్రాసువంటిది. బరువు భేదముచే త్రిగుణములందు సంయోగక్రియ ఆరంభమై పదార్థములు పుట్టును. ఈ పదార్థము లొకటితో నొకటి తిరిగి సంయోగము చెందును. మానవులు మానసిక భౌతిక అంగ నిర్మాణ విశి

ష్టత గల ప్రాణులు. మానవులు, మానవ కర్మలు త్రిగుణములవలన మార్పునకు లోనవ్వుదురు. మానవుడు ఏ గుణముచే ఆక్రమింపబడియుండునో ఆ గుణముయొక్క నైజప్రకృతి వానియందు మూర్తీభవించును. త్రిగుణములు మానవ నైతిక ప్రవర్తన, శీల సాంప్రదాయముల నెటులరూపొందించునో 14 వ అధ్యాయమగు 'గుణత్రయ విభాగ యోగమున' 11 మొదలు 13 శ్లోకములవరకు శ్రీ కృష్ణపరమాత్మ వర్ణించెను. మానవుడు విజ్ఞానవంతుడైనపుడు వానియందు సత్వ గుణము వృద్ధి జెందెనని గ్రహింపవలయును. రజోగుణము ప్రధానముగ గలవాడు దురాశ, దుర్బుద్ధి, కర్మ ప్రారంభము, కామముల కలవాడగును. తమోగుణమువృద్ధి జెందినవానియందు జ్ఞానశూన్యత, మానసిక ఆందోళన, భయమోహ శోకములు పుట్టి పెనవేసికొనును తమోపూరితుడై యున్న మానవుడు స్ఫుటమైన భావ గాంభీర్యమును కలిగియుండడు. రజోగుణపూరితుడు వ్యక్తిత్వమును ప్రకటించుచు, అహంకార పూరితుడై చరించుచుండును. అంతఃకరణ మనసునకు మార్గదర్శిగనున్నను సంకుచితభావమునే పురిగొల్పును. సాత్వికదశనందుకొనినవాడు విచక్షణ బుద్ధిగలిగి స్వీయలాభమునకుగూడ లెక్కచేయక లోకులకొఱకై న్యాయమునకు కట్టుబడియుండును. తన సుఖములతోపాటు సర్వజనుల సుఖసంతోషములను సాత్వికుడు కాంక్షించుచుండును.

భగవద్గీతా శాస్త్రము ననుసరించి నైతిక యభివృద్ధియన నీతియందభివృద్ధి. అనగా తామసిక దశనుండి అత్యుత్తమస్థానమైన సాత్విక స్థితిని పరిణామక్రమమున పొందుట. ఈ పరిణామక్రమ మార్గమున మానవుడు రజోగుణదశనుగూడ పాటవలయును. ఈ దశయందు మానవునకు జీవిత భారము, బాధలు మిక్కుటముగనుండును. తామస పూరితుడు పశుస్థితికన్న కొంచెమెక్కువ. సాత్వికుడు దేవతలకన్న కొంచముతక్కువ. ఈ రెండు దశలకును రాజసము వంతెన వంటిది. రజోగుణ పూరితుడు స్వార్థమధికముకాగా దురాశ, దుర్బుద్ధి, కాంక్ష, క్రూరత్వము, నిరంతరశ్రమలకులోనై ప్రపంచముతో సంఘర్షణ పడుచుండును. త్రిగుణముల కతీతుడైనవాడు పరమశాంత హృదయుడగును. నిశ్చల భక్తియోగము నవలంబించి సృష్టికర్త నారాధించిన జీవించుయుండగనే మానవుడు త్రిగుణముల నధిగమించి బ్రహ్మత్వపదవి కర్హుడగునని 14 వ అధ్యాయమగు 'గుణత్రయ విభాగయోగము' నందలి 26 వ శ్లోకమున పార్థసారథి ప్రపంచమునకు నొక్కి చెప్పెను.

## 6. వ్యక్తి నిర్మాణము.

భగవద్గీత మానవ వ్యక్తిత్వమునకును, సంఘ జీవనమునకును ఎక్కువ ప్రాధాన్యమిచ్చినది. మానవ వ్యక్తి సామాజిక న్యాయ సూత్రములకు బద్ధుడై అజ్ఞానము, అహంభావము, స్వార్థములకు లొంగక వ్యక్తిత్వమును ప్రకటించి సమ్యగ్జ్ఞానియై సమత్వ భావముపూని వర్గరహిత సామాజిక సభ్యుడగును. (Classless Social Being).

మానవులందరు వ్యక్తులు. అసంఖ్యాకములయిన మానవ వ్యక్తులందు భౌతికముగను, మానసికముగను భిన్నత్వముకలదు. భౌతికమయిన శారీరక అవయవ నిర్మాణము విషయమున మానవులందరు ఒకటే. ఇటులే మానసికముగను ఇట్టి పోలికల మూలముననే విభిన్నమయిన మానవసముదాయమున ఏకత్వముపొడసూపినది. అయినప్పటికిని మానవ విగ్రహములన్నియు నొకే తీరున నుండవు. మానవులందలి పెక్కు విపరీత లక్షణముల వలన వ్యక్తిత్వ మేర్పడినది. వ్యక్తి తామస, రాజసములదాటి సాత్విక మనస్కుడయినపుడు వ్యక్తులందలి అసాధారణ లక్షణములింకను విపరీతమగును. సత్వముయొక్క తారతమ్యమునుబట్టి వ్యక్తులందు భక్తి లేక శ్రద్ధ ఏర్పడునని 17వ అధ్యాయముగు 'శ్రద్ధాత్రయ విభాగయోగము' 3వ శ్లోకమున కలదు. వ్యక్తి ఎటువంటివాడో తెలుసుకొనుటకు మనసునందలి భావమును గ్రహింపవలయును. ఆదర్శము ననుసరించి వ్యక్తి భౌతిక జీవితము నడచును.

మానవులందు భిన్నత్వమెటుల సహజమో ఏకత్వముగూడ అటులనే సహజము. కొన్ని సహజ చిహ్నముల ననుసరించి వ్యక్తులను సముదాయములుగ నిర్మింపవచ్చును. 'జంగ్' (Jung) అను ఆధునిక మానసిక తత్వవేత్త మానవులను మానసికవ్యవహారులుగను (Introverts), భౌతిక వ్యవహారులుగను (Extroverts) విభజించెను. మానసిక వ్యవహారుడు (Introvert) మానసిక ప్రపంచమును దాటి బాహ్య ప్రపంచమునకు రాడు. భౌతికవ్యవహారుడు (Extrovert) భౌతికమయిన ప్రాపంచిక జీవనమెునర్చును. వీరినే భగవద్గీత ధ్యానయోగులుగను కర్మయోగులుగను పరిగణించెను. భగవద్గీత మానవుల నింకను మూడుతెగలుగ విభజించెను. క్షణికమయిన ఇంద్రియోద్రేకమునకు లోనయ్యెడివారు. వీరు సహజ నైజ ప్రకృతి ప్రేరితులై చరించుచుందురు. రెండవ తెగవారియందు స్వార్థము ఆవహించియుండును. వీరు త్రికాలములందలి గుణ దోషముల నవలోకించుచు స్వార్థమునకు నష్టము కలుగకుండ సంచరించెదరు. మూడవ తెగవారు భూగోళమునే తమ గృహముగ నెంచుకొని లోకులకొఱకయి జీవించుచుందురు. మూడు తెగలవారైన తామసిక, రాజసిక, సాత్వికులనుగూర్చి గీతాచార్యులు 14 అధ్యాయముగు 'గుణత్రయ విభాగయోగము'న వివరించెను.

మానవవ్యక్తి పసితనమందు తనకొఱకై పరితపించుచుండును. 'స్వీయానంద సూత్రమునకు' (Pleasure Principle) కట్టుబడి యుండును. స్వీయానంద అవస్థయందుండెడు పసివాడు సమిష్టి జీవనమున కలవాటు పడుటకుగాను తలిదండ్రులు, గురువు, సమాజము ప్రయత్నించును. పసివాడు పెరిగి పెద్దవాడగుచు తోటివారితో కలసి సామాజిక కష్టనష్టములను సహించుచు 'వాస్తవిక సూత్రమునకు'(Reality Principle) లోనగును. ఇట్టి సామాజికవ్యక్తియే మానవుడగును. ఇట్టి మానవుడు భగవద్గీతా శాస్త్రము ననుసరించి పరిపూర్ణ సమ్యగ్జ్ఞాన వ్యక్తిత్వమునకు ప్రయత్నింపవలయును. ఈ ప్రయత్నమే దుర్ఘటమగు

ఎడ తెఱిపిలేని కృషి. ఈ కృషినే భగవద్గీత క్రమశిక్షణ లేక 'అభ్యాసము' అనెను. మనము జన్మించినంతనే గుణవంతులము కాము. మనము సజ్జనులము కావలయును. అందులకు ఇంద్రియ చాపల్యమునకు స్వస్తి చెప్పవలయును. దీనిని వైరాగ్యమందురు. 6 వ అధ్యాయమగు 'ఆత్మ సంయమ యోగ ము' 35 వ శ్లోకమున మనోలయమునకు భగవద్గీత 'అభ్యాస, వైరాగ్యములు' నాదేశించెను.

మానవునందలి భావస్రవంతి నిరంతరము పారు ఏరు వంటిది. మనసునందు పుట్టెడు భావములు మానవుని ఎడతెగని ఉద్యోగమున నియమించును. ఇట్టి భావైక్య జీవితమునకు మార్గకారణము అంతఃకరణ. కర్మేంద్రియములు సాధనములు. ఇట్టి నియమమునకు కట్టుబడు మానవుడు క్షణమయిన కర్మ యొనర్పక నుండలేడని 3వ అధ్యాయమగు కర్మయోగము 5 వ శ్లోకమున గీతాచార్యులు వచించెను. అంతఃకరణ సర్వస్వతంత్ర పదార్థమని కొందరనెడి విషయమేమని ప్రశ్న రావచ్చును. సమాధానమునకు మానసిక తత్త్వశాస్త్రమును (Metaphysics) సందర్శించవలయును. ఈ శాస్త్రము మూడు రకములైన సమాధానములిచ్చును. (1) మానవ కర్మలతోసహా ప్రతికార్యము సహజమగు ఒకానొక శాశ్వతధర్మము ననుసరించి జరుగుచుండును. ఈ సిద్ధాంతమును 'నియతి వాద (Determinism) మందురు.' రెండవ సిద్ధాంతమున ఆత్మస్వతంత్రపదార్థమనియు కర్మ కలాపమును తన ఇచ్ఛ వచ్చినటు లొనర్చుననియును దీనిని అనిర్ణయ వాద (Indeterminism) మందురు' మూడవదయిన 'స్వయం నిర్ణయ సిద్ధాంతము' (Self Determinism) మధ్యేమార్గమవలంబించును. ఈ వాదము మానవ కర్మలన్నియు ఒక శాశ్వత నియమమునకు లోబడియే యుండుననును. ఆ శాశ్వతనియమమే మానవ ప్రకృతి. ప్రతివ్యక్తి యొనర్చెడి కర్మలు నిర్దిష్టమైన వ్యక్తి సహజ ప్రకృతి ననుసరించి యుండును. ఈ సహజ ప్రకృతి ప్రేరణయే మానవ కర్మల కాధారమనువాదమే భగవద్గీతావాదమున్నూ. తమ తమ ప్రకృతి ప్రేరితులై చేసెడి కర్మలను నిగ్రహముగూడ ఆపలేదని 3 వ అధ్యాయమగు 'కర్మ యోగము' 33 వ శ్లోకమున గీతాచార్యుని వాక్యము కలదు.

వారి వారి సహజ ప్రకృతి ననుసరించెడు వ్యక్తులు ఏకాంత మానసిక జీవనమున జ్ఞాననిష్ఠను బొంది సామాజిక జీవన మలవరచుకొని సద్గుణశీల సాంప్రదాయములను దిద్దుకొనెదరు. మానవసమాజము యోగి పురుషులను, వీరాధివీరులను, మహానాయకులను సృష్టించుచుండును. ఇట్టి ఆదర్శపురుషులెట్టి కర్మ లొనర్చెదరో వానినే సామాన్యులు గూడ అనుకరించెదరని శ్రీ కృష్ణపరమాత్మ వచించి,మానవసంఘనాయకులు ఆదర్శయుతమైన సత్కర్మలనే యొనర్పవలయునని భవిష్యద్వర్తమానములకుగూడ వర్తించునటుల 3 వ అధ్యాయమగు 'కర్మయోగము' 21 శ్లోకమున గీతాచార్యులు ప్రజానాయకులకు సూచించెను. (సశేషము)

# వార్తలు.

శ్రీ శంకరానందస్వామి గారు బెంగుళూరు నుండియు, శ్రీరామకృష్ణగారు ఆళ్లగడ్డనుండియు బయలుదేరి 7-3-54 నాటికి కాళహస్తికి లాస్యాశ్రమము చేరుకొనినారు. అచ్చటి శివరాత్రి సప్తాహ కార్యక్రమ పూర్ణాహుతి సందర్భమున ఉపన్యసించినారు. మార్చి 8 వ తేది సాయంకాలమునకు చెంగల్పట్టుజిల్లా పొన్నేరితాలూకా మాదరపాకం మానెల్లూరు చేరుకొన్నారు.

మానెల్లూరు సాధు వీరయ్యస్వామివారి మఠములో శ్రీగీతాసంఘమువారి ద్వితీయ వార్షికోత్సవము మార్చినెల 9, 10, 11 తేదీలయందు జరిగినది. శ్రీశ్రీశ్రీ నిత్యానందస్వామివారు అధ్యక్షత వహించినారు. శ్రీ శంకరానందరామకృష్ణుల భగవద్గీతోపన్యాసములు జరిగినవి. శ్రీరామకృష్ణమాచార్యులవారి కార్యనిర్వాహకత్వముతో సభలు జయప్రదముగ జరిగినవి. శ్రీగీతానందగారు గీతాభినయ ప్రదర్శనము చేసినారు.

మార్చినెల 12, 13, 14 తేదీలయందు పొన్నేరి తాలూకా ఆరణి గ్రామమునందు బ్రహ్మజ్ఞాన సమాజమువారి ప్రథమ వార్షికోత్సవమున శ్రీనిత్యానంద, శ్రీశంకరానంద, శ్రీరామకృష్ణ, శ్రీగీతానందగారి ఉపన్యాసములు జరిగినవి.

మార్చి 15, 16, 17 తేదీలయందు పల్లిపట్టు తాలూకా మిట్టకండ్రిగ వీరమాత్మ భగవద్గీతా సేవాశ్రమమున జరిగిన సభలయందు శ్రీనిత్యానంద, శ్రీశంకరానంద, శ్రీరామకృష్ణ, శ్రీ గీతానంద ప్రభృతులు పాల్గొనినారు.

18 తేదీ సాయంత్రమునకు కాళహస్తి చేరుకొన్నారు. మార్చి 19, 20, 21 తేదీలు శ్రీశ్రీశ్రీ మలయాళస్వాములవారి సనాతన వేదాంతజ్ఞానసభా అష్టవింశ వార్షికోత్సవము కాళహస్తి శ్రీ శుకబ్రహ్మాశ్రమము నందు మహద్వైభవముగ జరిగినది. శ్రీ శ్రీ శ్రీ రాజేశ్వరానందస్వాములవారు అధ్యక్షత వహించినారు. శ్రీ శంకరానందస్వాములవారు ఆ సభయందు ఉపన్యసించి చిత్తూరు వెళ్ళినారు. శ్రీరామకృష్ణగారు సూళూరుపేట పోయినారు.

22, 23 తేదీలు సూళూరుపేట శ్రీ దివ్యజీవనసంఘశాఖా కార్యాలయమునందు శ్రీరామకృష్ణగారి భాగవతోపన్యాసములును, శ్రీ గీతానందగారి గీతాభినయమును జరిగినది. శ్రీయుతులు లవిశెట్టి రాజగోపాలు శెట్టిగారు వారికి ఆతిథ్యమొసంగినారు.

విజయవాడ తాలూకా పెనమలూరు శ్రీ పరమాత్మానందాశ్రమమునందు మార్చి 26, 27, 28 తేదీలు మాతృశ్రీ సాధు సీతారామమ్మగారి స్మారకమహోత్సవము జరిగినది. శ్రీనిత్యానంద, శ్రీశంకరానంద, శ్రీరామకృష్ణులు 25 తేదీ రాత్రి విజయవాడయందు సూపరింటెండింగ్ ఇంజనీరు గారగు శ్రీ జి. ఎ. నరసింహారావునాయుడు బి. ఇ., ఎ. ఎం. ఐ. ఇ. గారి యింట ఆతిథ్యమును స్వీకరించి పరమాత్మానందాశ్రమము చేరుకొన్నారు. శ్రీవార్లకు బావినేని రామకోటయ్యచౌదరిగారి నూతనభవనమున బస కల్పించినారు. భగవద్గీతలోని స్థితప్రజ్ఞ లక్షణములపై ఉపన్యాసములు జరిగినవి.

28 వ తేది సాయంకాలం ఈడ్పుగల్లు లోని స్వర్గీయ శ్రీ ముక్కామల సీతయ్య గారి గీతాభవనములో ఉపాహారము స్వీకరించి ఉపన్యాసమొనర్చినారు. అప్పటినుండి విజయవాడచేరి సూపరింటెండింగ్ యింజనీరు గారి బంగళాలో కర్మయోగమును గూర్చి ½ గంట ఉపన్యసించి, శ్రీ నిత్యానందస్వాములవారు నెల్లూరునకును, శ్రీ శంకరానంద రామకృష్ణులు అళ్లగడ్డకును ప్రయాణమైపోయినారు.

30_3_54 తేది ఫాల్గుణ బ ౧౧ లు శ్రీశంకరానందస్వాములవారు ప్రొద్దుటూరు మహిళాభజన సంఘమువారి వార్షికోత్సవమున పాల్గొని బెంగుళూరు వెళ్లినారు.

శ్రీ శంకరానందస్వామివారు 7_4_54 నుండి 13_4_54 వరకు పొరింగుపేట శ్రీ మాధవశాలయందు జరుగు శ్రీరామకోటి సప్తాహములందు పాల్గొని 16_4_54 నాటికి అళ్ళగడ్డమీదుగా కర్నూలు చేర్తారు. కర్నూలునందు ఎస్. రాజయ్యర్ గారి ఏర్పాటుతో గీతోపన్యాసములు నెరవేర్చబడును.

శ్రీరామకృష్ణగారు 6_4_54 నుండి 11_4_54 వరకు నంద్యాల తాలూకా రేవునూరునందు భాగవతోపన్యాసములు జరిపి 12 వ తేదికి పాకాల చేరినారు.

---

# గ్రంథ సమీక్ష.

## శ్రీరామమంత్రానుష్ఠానము. వెల 2_8_0, బైండు 3_0_0

గ్రంథకర్త:- శ్రీరామశరణ్; కుందుర్తి వెంకటనరసయ్యగారు.

ప్రకటన:- శ్రీరామశరణ మందిరము, బుద్దాం, యాజలి పోస్టు, గుంటూరుజిల్లా. మరియు శ్రీరామనామక్షేత్రము, గుంటూరునందుకూడ పుస్తకములు దొరకగలవు.

శ్రీరామమంత్ర మహిమను చెప్పుటకు మాటలుచాలవు. అనుభవమే కావలెను. అట్లే శ్రీరామమంత్రానుష్ఠానమహిమను చెప్పుటకుకూడ మాటలు చాలవు. అనుభవమే కావలెను. మంత్రశాస్త్రమునకు కావలసిన పదునారు అంగములును సవిస్తరముగ నిందు చర్చింపబడినవి. కొన్నిప్రకరణములు ఆవశ్యకతను మించి పెరిగినవేమో అనికూడతోచును. మొత్తమునకు ఓపికతో చదువవలసిన గ్రంథము. ఏమైనను సాధకునకు, మరీమించి రామమంత్రసాధకునకు తప్పక సేకరించవలసిన ఉద్గ్రంథము. కాగితములును అచ్చును ఒక మాదిరిగ నున్నవి. పరమభక్తుడగు రచయితయొక్క అంతరంగ అనుభవముల ప్రతిరూపము గు యీ గ్రంథమును ఆంధ్రలోకము ఆదరించుగాక!

హాస్పేట శ్రీ గీతాసేవాశ్రమ వార్షికోత్సవ సందర్భములో

బళ్లారి సాధు లక్ష్మీనృసింహశర్మగారు

శ్రీ శ్రీ శ్రీ శంకరానంద స్వాములవారికి సమర్పించిన

# పంచరత్నమాలిక.

సత్యశివసుందర శ్రీ। శాంకరమానందమాత్మగతం
అనుభావయంతమీడే। సజ్జనకామార్య శంకరానందమ్॥ 1

ఆత్మానందగిరీంద్రజ। గీతాతత్త్వార్థతీర్థదానేన।
పావయసి పామరానపి। పండితబృందం సమున్నయసి॥ 2

బ్రహ్మేవ సృజసి శ్రద్ధాం। ఉత్పన్నజ్ఞానమవసి విష్ణురివ।
ఉన్మూలయసి మహేశ్వర। ఇవ చిత్తే వైరివర్గమాత్మగురో॥ 3

భక్తిశ్రద్ధానిర్మల। చిత్తదృశావేక్ష్య దివ్యగీతార్థం।
సకలానర్థనివర్తక। మాత్మీయానాం సదైవ దర్శయసి॥ 4

జయతు జయతు నానావేదవేదాంతసారా
జయతు జయతు వేదవ్యాసదృష్టాంతరంగా।
జయతు జయతు గీతాసర్వలోకైకమాతా
జయతు జయతు గీతానంతవిశ్రాంతచిత్తా॥ 4



## రైల్వేశతాబ్ది — ఎగ్జిబిషన్ రైలుబండిరాక!

రైల్వేశతాబ్ది ఎగ్జిబిషను రైలుబండి 1954 సం॥రం ఏప్రెల్ నెలలో రాగలదు. అది పాకాలలో 3 రోజులున్ను, తిరుపతిలో 2 రోజులున్ను ఆగును. కాన ప్రజలందరు దానిని చూడవచ్చునని చిత్తూరుజిల్లా కలెక్టరువారు ప్రకటించుచున్నారు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూలు జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుల్లదుర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ కా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటీ.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం. కరీంనగర్ జిల్లా.

32 గ్రంథె నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్పరాజుగారు, గోసపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 6. శ్రీ బైసాని రమదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. — 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. — 10. శ్రీ మదల్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్య శ్రేష్ఠి & గరుడయ్య శ్రేష్ఠిగారలు, చాగలమర్రి. — 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, — కోయిలకుంట్ల. —15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం.

కడపజిల్లా. 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా। — 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. — 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 19. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. — 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. — 25. శ్రీ నటుకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 30. శ్రీ ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు — 31. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మడకసగుర్తి. — 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తాలూకా. — 33. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 36. శ్రీ పెద్ద కదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 41. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనాయుడుగారు, కార్కూరు.

మైసూర్ స్టేట్: 45. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హూస్పేట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 47. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 48. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 49. శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి, కోలారు. — 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. — 52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావు గారు, నల్గొండ. — 53. నాగబండి విశ్వనాథం గారు, 12/38 మెజ్జరోడ్డు, వరంగల్. — 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ — 55. శ్రీ గంటె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ — 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్ — 57. శ్రీతాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ — 58. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ — 59. శ్రీ మదూరు బసవలింగం గారు, వరంగల్ — 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ — 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ — 62. శ్రీ గుని శెట్టి నాగలింగంగారు వరంగల్ — 63. శ్రీ తోట జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ — 64. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. — 65 శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసం గారు, బట్టలదుకాణం, వరంగల్ — 66. శ్రీ సోమా నరసయ్య గారు, వరంగల్ — 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ — 68. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ — 69. శ్రీ చిదిరాల రాజశేఖరం గారు వరంగల్ — 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 71. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొల్లేగాలం.

కృష్ణాజిల్లా: — 72. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమ నాగరత్నమ్మగారు, ఈడుపుగల్లు. 73. శ్రీబావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనము, పెనమలూరు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు — 16.
2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వందవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkunth
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-Presiden
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# గీతాంజలి.

## మూలము:— విశ్వకవి రవీంద్రుడు.

## అనువాదము:— కొప్పరపు మల్లికార్జునరావు 'కళాశ్రీ'

తే॥ గీ॥ ఒక్క క్షణకాలమైన నీయొద్దఁ గూరు
చుండఁ గుతుకంబుఁ గొనెదను; మెందుకొన్న
చేతిపనులొప్పఁ దఱువాతఁ జేసి, యున్ని
ముగియఁ బొనరిచెదను మనస్ఫూర్తి మెఱయ॥

తే॥ గీ॥ నీ మొకమునుండి చూపుల గోముమందు
నిలకవేరైన మనము నెవ్వలన శాంతి
విశ్రమముఁ గాంచదీకఁ బని, వేలలేని
యెడతెగనిపని సంద్ర మట్లైతలంతు॥

ఉ॥ ఈడిన మేగుడెంచె మిడిరెండలతోడను, గూడులోనికిన్
నాదమునిండి, నేల పడినన్ సుడిగాలులు ప్రోయునట్టులు
న్మాదముచేతఁ దుమ్మెదలు మానితగాయకులట్లఁ బుష్పగు
చ్ఛాదరణీయకుంజమున జక్కని కొల్పునన్న తీరునన్॥

ఉ॥ మిన్నక మూకగాఁ దగుటమేలగు నిప్పుడు నీముఖానికిన్
సన్నిధిఁ గూరుచుండి, మదుసారముగా రచియించి పాటలన్
విన్నను వొప్ప జీవితము వేడుకనప్పనసేయ, నీ విరా
మోన్నతవేళఁ గ్రమ్ముకొనియుండెరపించన మొప్ప పట్టునన్॥

తే॥ గీ॥ ఈ చిఱుతపూవుఁ ద్రెంచి ధరింపు మీవ
యాలసింపక; నాకు భయంబుగదిరె;
నిద్ద తెగిపడి క్రింద, లయించు నేమొ
నేలదుమ్మున నణువుగా నిలుచునంచు॥

ఉ॥ ఏ మెడఁ దాల్పు దామమున నిల్వఁగఁ దావెసఁగంగకున్న, నీ
ప్రేమను జేతితాకుడున వేవితనందిన ముట్టిత్రెంచుకొ
మ్మా! మఱి నేనజాగృతిని మగ్నతనందకమున్నె; ప్రొద్దుతా
నా మెయి దాటిపోవునొ ప్రయత్నముతోఁ బ్రణుతించుకాలమున్॥

తే॥ గీ॥ అమరకుండిన బూరెమ్మయందు దట్ట
మయిన కాంతిని దగువన్నె, నందు నున్ని
తంపు వాసనయున్న, నీ దరిని సేవ
నీ సుమముఁ గోసికొమ్ము పీవెసఁగునప్పె॥

(సశేషము.)

ఓం

# శ్రీ శంకరజయంతి

## సప్తాహ మహోత్సవాహ్వాన పత్రము.

★

శ్లో॥ శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్ ॥

కర్నూలుజిల్లా ఆళ్లగడ్డ శ్రీశంకరానందాశ్రమంలో మే 7-వ తేది నుండి వారమురోజులు శ్రీ శంకరజయంతీ సప్తాహ మహోత్సవము జరుపబడును.

శ్రీశ్రీశ్రీ నిత్యానందస్వామి, శ్రీ శుద్ధచైతన్యస్వామి, శ్రీ రామకృష్ణానందస్వామి, శ్రీ అశేషానందస్వామి, బ్రహ్మశ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, బ్రహ్మశ్రీ కె. మల్లికార్జునశాస్త్రి, బ్రహ్మశ్రీ సాధు లక్ష్మీనృసింహశర్మ, మాతృశ్రీ చిన్నమ్మ, శ్రీ గీతానంద (రుద్రారెడ్డి)గారు ఉపన్యాసములలో పాల్గొందురు.

ఈ ఏడురోజులు అఖండనామ సంకీర్తనము, ఉపనిషత్ప్రవచనము, గీతాపారాయణము, గీతాప్రవచనము, గీతాభినయము, నగర సంకీర్తనము, ఆధ్యాత్మికోపన్యాసములు జరుగును.

ఈ ప్రకటననే ప్రత్యేక ఆహ్వానముగ భావించి అందరు విచ్చేసి పాల్గొని శ్రీ ఆదిశంకరుల అనుగ్రహమునకు పాత్రులు కాగల్గుదురని ప్రార్థించుచున్నాము.

ఉపన్యాస వేదికవద్ద సంపూర్ణ కార్యక్రమ వివరములు మే నాటికానాడు ప్రకటింపబడును.

ఇట్లు,

15-4-54. ఆహ్వానసంఘము.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, 1954 జనవరి కా. 1000.

# గీతావాణి

35





## శ్రీగీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 మే 1954

# విషయసూచిక - మే '54.







## రచయితలకు—

★ జూలై నెలలో ప్రకటించబోవు గీతావాణి చతుర్థ వర్షారంభ పత్రిక కవితా సంచికగ ప్రకటింపబడును. కవిపుంగవులు గీతాతత్త్వ సందేశములను తమ అమూల్య కవితల ద్వారా అందజేయవలెనని సవినయముగ విజ్ఞప్తిచేయుచున్నాము.


ఆళ్ళగడ్డ P. O.
కర్నూలు.

సంపాదకుడు,
'గీతావాణి'

# " గీతావాణి "

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.




మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ

మేనేజర్:

స్వామి శ్రీ శివానంద.

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా



సంవత్సరచందా 4—0—0. * విడి ప్రతిక 0—6—0

15th MAY 1954.

# గీతా గానము.

శ్రీ డా॥ రంగా చిన్నచలమయ్యగారు, సంపాదకుడు: "దేవాలయం"

3. అగ్గిలోకట్టెలు వేయుచున్నను - తృప్తినిబొందదు జ్వాలా
స్వేచ్ఛారూపముబొందిన కామము - నిత్యవిరోధి జ్ఞానికి ॥క॥ (శ్లో॥ 39)

4. బుద్ధీంద్రియమానసమందున - కామము ఆశ్రయమొందూ
దేహధారిని కామముచేతనె - మోహముజెందును పార్థివా ॥క॥ (శ్లో॥ 40)

5. అందువల్లనె ముందుగనీవు - ఇంద్రియబంధనజేయూ
జ్ఞానమునంతయు నాశముచేయు - కామునువదలుము పార్థివా ॥క॥ (శ్లో॥ 41)

6. పంచయింద్రియాలన్నిటికంటెను - పెద్దదిమనసే పార్థా
దానికంటెను బుద్ధియెపెద్దది - దానికిమించిన దాత్మ ॥క॥ (శ్లో॥ 42)

7. బుద్ధిచేతనే ఆత్మనుదెలియుచు - మనసునుగట్టుము పార్థా
కామరూపమైవెలుగు విరోధిని - కాటికిబంపుము కౌంతేయా ॥క॥ (శ్లో॥ 43)

## 4. జ్ఞానయోగము.

("ప్రియమైనరాణీ మోహినీ" అను వరుస)

కృష్ణుడు:- పాండవమధ్యా! ఫల్గుణా! జ్ఞానాయోగమే దెల్పెదా!
జ్ఞానయోగమే తెలిసిననూ - వారేధన్యులు పార్థివా
నీకెనేనూ తెల్పెదన్ - నాశనరహితాయోగమూ
సూర్యునకె యీ యోగము - దెలిపితి నేనూ పూర్వమూ ॥జ్ఞా॥ (శ్లో॥ 1)

1. సూర్యుడు మనువుకుచెప్పెను, మనువుబోధించె యిక్ష్వాకుమహారాజుకు,
ఆదియుగురుపరంపరముగ రాజఋషులుదెలిసికొనిరి ఫల్గుణా......
కాలముగడిచేకొలదినీ - తలచుటలేమీ దానిని
నష్టముబొందె ఫల్గుణా - నీకెనేనూ దెల్పెదన్ ॥జ్ఞా॥ (శ్లో॥ 1, 2)

2. పూర్వపుజ్ఞానాయోగమె - రహస్యమైనాయోగమె
బ్రహ్మఋషులాయోగమె - భక్తాజనులాయోగమె
నీవెనాకూ భక్తుడా - నేనెనీకూ మిత్రుడన్ ॥జ్ఞా॥ (శ్లో॥ 3)

అర్జునుడు:- అనాదినుండియూ సూర్యుడే - నీదేజన్మా యిప్పుడే
సూర్యునకెట్లూ జెప్పెదవు - నమ్మగలేను నీమాటె
చక్కగనాకూ దెల్పుమా - మక్కువతోడా మ్రొక్కెదా
కృష్ణా కృష్ణా ముకుందా - కేశవ మాధవ గోవిందా ॥కృ॥ (శ్లో॥ 4)

కృష్ణుడు:- నీకూనాకూ భేదమె - తెలిపెదనీకూ మర్మమె
ఇదియెన్నోసారి జన్మమె - జ్ఞానాయోగాకర్మమె
తెలిసియునీవూ నటించిన - తెలియును నీకూ ఫల్గుణా
మనకూయెన్నో జన్మలూ - తెలియవునీకు పార్థివా ॥జ్ఞా॥ (శ్లో॥ 5)

(సశేషం)



సంపుటి 6 ★ స్వస్తిశ్రీ జయ * వైశాఖము ★ సంచిక 11

# "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"

భగవద్గీత సాక్షాత్తు భగవంతుని మాట; భగవంతునిపాట. కృష్ణుడు కేవలం వసుదేవదేవకుల గర్భజనితుడగు ఒక మహనీయ వ్యక్తియని మాత్రం మీరు భావింపరాదు. అట్లు తలంచినచో, భగవద్గీత అని కాక కృష్ణగీత అని అనవలసి ఉంటుంది. కృష్ణగీత అంటే ఏమిటా అని యోచిస్తాము. భగవద్గీత అనుటే గట్టిగా పరిచితమై ఉంది. కృష్ణగీత అనుట వ్యాసునకుకూడ యిష్టముకాదు. కాబట్టి అన్నియెడలను 'శ్రీభగవానువాచ' అని ప్రయోగింపబడిందే కాని 'శ్రీకృష్ణ ఉవాచ' అనిలేదు. శ్రీకృష్ణుని భగవంతుడని తలంచినపుడే – భగవద్వాక్యమను భావనతో పఠించినపుడే భగవద్గీత యొక్క ఫలమును పూర్ణముగ పడయగల్గుదుము.

సాక్షాద్భగవంతుని ఉపదేశమౌటచే భగవద్గీత స్వతః ప్రమాణము. దానికి వేరొక ప్రమాణముయొక్క ఆసరాతో పనిలేదు. అది పరతః ప్రమాణపోషకముకాదు. మీకు తెలియక పోయినను — మీబుద్ధికి — తర్కమునకు అందకపోయినను భగవద్వాక్యమని నిర్భ్రాంతసత్యమని — నూటికి నూరుపాళ్లు నిజమని విశ్వాసముంచాలి. మీ మామూలు లౌకిక వ్యవహారములనే అవలోకించండి. నేడు పున్నమ అని — ఏకాదశి అని వ్యవహరిస్తాము. వాటిని యెవరు చూచారు? మనబోటి మానవుడు — ఒక సిద్ధాంతి, వ్రాసిన వ్రాతపై మనము నమ్మకముంచినాము. నిత్యవ్యవహారములో ఉత్తర ప్రత్యుత్తరాలను నమ్మకపోతే మనపనే సాగదు. సామాన్య మానవ మాత్రుల మాటలయందే మనకట్టి విశ్వాసమున్నపుడు భగవంతుని పల్కులపై విశ్వాస మెందుకుంచరాదు? అచ్చట విశ్వాసము కలగక పోడం మన ఘోరభయంకర దౌర్భాగ్యమే. భగవంతుడు తన శ్రీముఖంద్వారా "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" — శ్రద్ధగలవాడే జ్ఞానం పొందగల్గుతాడనియు, "సంశయాత్మా వినశ్యతి" — సంశయగ్రస్తుడు నశిస్తాడనియు హెచ్చరించి యున్నాడు. భగవద్గీతలోని యీ రెండు వాక్యాలను అష్టాక్షరీమహామంత్రాలుగ భావించి జపము చేయాలి.

శాస్త్రము శబ్దప్రమాణము. శబ్దప్రమాణములో సంశయ ముంచరాదు. లౌకిక శబ్దములందుకూడ సంశయముంచినచో వ్యవహారము సాగనపుడు, భగవంతునియొక్క పరమఋషులయొక్క పల్కులయందు నమ్మకములేనిచో మనకు ఉద్ధారకము లేదు. ప్రత్యక్షప్రమాణము అనుమాన ప్రమాణము దుర్బలములై పని చేయలేనిచోట శబ్దప్రమాణము వర్తిస్తుంది. సఫలమౌతుంది.

నేను ఈ వూరికి క్రొత్తగ వచ్చాను. ఇచ్చటినుండి పొరుగూరికి పోవలెను. మార్గము విచారించుకొని కొంతదూరము పోతిని. అచ్చట దారిచీలి రెండుమార్గములేర్పడినవి. ఏ దారిని పోవలెనో అని సందిగ్ధమేర్పడినది. ప్రత్యక్షముగ కళ్లతోమార్గమును చూస్తూనే ఉన్నాను. బహుశా యిదేదారి కావొచ్చునని ఉహిస్తూనూ ఉన్నాను. కానీ ప్రయాణం ఆగిపోయింది. అంతలో గ్రామీణుడైన ఒక ముసలివాడా మార్గాన వచ్చినాడు. ఆతన్నిఅడిగితిని. వాడు 'ఆదారిన పొమ్మని నాకుజవాబిచ్చినాడు. వెంటనేబయలుదేరి గబగబా వెళ్లాను.

చూచారా! శబ్దప్రమాణ ప్రభావం. ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలు నిష్ఫలమైనచోట శబ్దప్రమాణము సఫలమైంది. సామాన్యమైన లౌకిక శబ్దప్రమాణంలో మనకంతటి విశ్వాసమున్నపుడు భగవద్వాక్యమునందు విశ్వాస ముంచకపోడ మేలాగ? ఇంద్రియాలకు గోచరించని — బుద్ధికి అందని విషయాలను శబ్దప్రమాణము యెరుకపరుస్తుంది. అందుచేత ప్రమాణములలో శబ్దప్రమాణానికి ప్రాధాన్యత ఉంది. భగవద్వాణిలో — భగవద్గీతయందు మనం విశ్వాసం ఉంచాలి. ఉంచితీరాలి. సంశయపరులమైనామా సర్వనాశనం తప్పదు. సంశయము మనస్సుకు క్షయరోగం.

"సంశయాత్మా వినశ్యతి"



---

స్వజనులు — సుజనులు.

అర్జునుడు స్వజనులపై చూపిన జాలి మంచిది కాదా?

స్వజనులు సుజనులై యున్నపుడు మంచిదికాని, కుజనులై యున్నపుడు మంచిది కాదు.




(గతసంచిక 14-వ పేజీ తరువాయి)

మూడవ అధ్యాయమునందు కర్మమునె చేయవలెననుటనుగూర్చి అనేక కారణములు నిరూపింపబడినవి. పరమేశ్వర ప్రీత్యర్థముగ యజ్ఞభావనతో చేసిన కర్మము సంసార విముక్తికి సాధనము కాగలదనియు చెప్పబడినది. ఈ ప్రకారమగు కర్మమునె కర్మయోగమందురు. కర్మయోగమునందు సంగత్యాగమును ఫలత్యాగమును ముఖ్యమై యుండవలయునని యీవఱకే చెప్పబడియున్నది. ఆ త్యాగమునకు కాయము (అనగా శరీరము) ఆతంకమైయున్నది. రజోగుణమువలన కలిగిన కామము క్రోధాదిరూపములను ధరించి, ముముక్షువును పెడదారులయందు ప్రవర్తింప చేయుచున్నది. అందువలన మొట్టమొదట దానిని తన అధీనమునందుంచుకొనవలయును. కామము యింద్రియ మనోబుద్ధులను ఆశ్రయించి ప్రబలమగుచున్నది. కావున వాటిని ఒక్కొటొక్కటిగా వశపరచుకొని సంస్కరింపబడిన అంతఃకరణముతో, తన్ను తాను జయించి, బుద్ధికి అవలయుండు పరమాత్ముని లక్ష్యమునందు పెట్టుకొని కర్మయోగాచరణ తత్పరుడు కావలయును. దీనివలన జ్ఞాననిష్ఠ యేర్పడి సకలదోషములు పూర్తిగా నివర్తించి యోగయుక్తుడు కాగలడని గతవిషయము వుపసంహరింపబడినది.

పరమాత్మజ్ఞానమే శోకమోహములను దాటించెడి సాంఖ్యదృష్టి; అదియే జ్ఞానయోగము. ఆ జ్ఞానయోగమునకు వుపాయమైనది కర్మయోగము. ఈశ్వరార్పణ బుద్ధితో చేసెడి కర్మమునే కర్మయోగమందురు. యిదియే గీతయొక్క తాత్పర్యము. అందువలన శ్రీ భగవంతుడు తన వుపదేశమును ముగిసినదిగా నిశ్చయించి తాను చెప్పిన కర్మయోగమునకు ప్రాశ్య

మగు జ్ఞానయోగమును అభ్యాసము చేసికొన్న ఆచార్య పరంపరను తెలియజేయుచు ప్రకరణమును ఉపసంహరించుచున్నారు. "ఓ అర్జునా! సాంఖ్యయోగము, కర్మయోగమనెడు ఈ రెండు అధ్యాయములతో వర్ణింపబడిన జ్ఞాననిష్ఠయనెడి జ్ఞానయోగమును అనగా కర్మనిష్ఠయనెడి కర్మయోగముద్వారా పొందబడెడిజ్ఞానయోగమును జగత్ పాలకుడను వాసుదేవుడనునగు నేను సృష్టియొక్క ఆదికాలమునందు సూర్యునికి బోధించితిని. ఈ సూర్యుడే క్షత్రియవంశమునకు బీజరూపుడని తెలిసికొనుము. మరియు ప్రత్యక్షముగానుండు సూర్యనారాయణునివలన విశ్వప్రపంచమునకు అపారమగుఉపకారము జరుగుచున్నది. అయినను అతడు యత్కించిత్తు గర్వించడు; విశ్రాంతిని కోరడు; కర్తృత్వాభిమానము లేదు. కావుననే కర్మయోగులందు అతడు సర్వశ్రేష్ఠుడగు ఆచార్యుడని చెప్పనొప్పును. అంతటి గొప్పశక్తి ఆతనికి కలిగియున్నదనిన భగవంతుడనగు నా ఉపదేశఫలితమేనని గ్రహింపుము. సూర్యునికి ఉపదేశించుటలోగల అభిప్రాయమేమనిన, ఆ జ్ఞానయోగము పరంపరగ రాజలోకమునకు సంప్రాప్తించి వారికి జగత్ పాలన శక్తిని కలిగించుటకొఱకే.

అర్జునా! ఈ యోగము అవ్యయమైనదనుటకు రెండు కారణములు గలవు. మొదటికారణమేమనిన — ఈ యోగమునకు వేదమే ఆదియై యుండుటవలనను, ఆ వేదములు అవ్యయములై యుండుటబట్టియు నిదియుకూడ అవ్యయము. రెండవ కారణమేమనిన, ఈయోగఫలమగు మోక్షము అవ్యయ మగుటవలన దీనినిసహా అవ్యయ మనుటయందెట్టి సందియమును లేదు. ఇట్లు వేదములు మూలముగ మోక్షము ఫలముగకల్గి నాశరహితమగు ఈ జ్ఞానయోగము నాశ్రయించి రాజర్షులు ధర్మపరిపాలన దక్షతను సహజముగ పొందగల్గిరి.

అనంతరమో, కిరీటీ! నా ప్రథమ శిష్యుడగు సూర్యుడు ఆ విద్యను తన కుమారుడగు వైవస్వతునికి బోధించెను. అతడు తన కొడుకగు ఇక్ష్వాకునకుపదేశించెను. ఆ జ్ఞానయోగముయొక్క ఉపదేశమును పొందిన ఇక్ష్వాకువే రాజకులమున కంతటికిని ఆదిపురుషుడై వెలసెను."

ఇట్లు పరంపరగా బయలుదేరి వచ్చినదియు అవ్యయమైనదియు నగు యోగము నష్టప్రాయమగుటకు కలకారణమును భగవంతుడు రాబోవు శ్లోకమున నిరూపించుచున్నాడు.

(శ్లో. 2) ఈ శ్లోకము నందు భగవంతుడు "ఇమం" అను పదమును ఉపయోగించియున్నాడు. ఈ పదము జ్ఞానయోగ కర్మయోగములలో యే ఒక్కదానినో చెప్పియుండును; కాని రెంటిని చేర్చి చెప్పియున్న దనుట సమంజసము కాదని సంశయముపొడమవచ్చును. దీనికి సమాధానమేమనిన — జ్ఞాన యోగ కర్మయోగములు దేనికది స్వతంత్రముగ నుండునవికావు. కర్మయోగము జ్ఞానయోగమునకు అంగమై యుండుటవలన ఈ రెండును ఒక్కటేయనెడి దృష్టి చేత "ఇమం" అనెడి పదమునకు జ్ఞానయోగమను అర్థము చెప్పదగినది. ఈ అభిప్రాయమును పుష్టీకరించుచు మూడవ అధ్యాయమందలి మూడవశ్లోకమున జ్ఞాన కర్మములరెంటిని ఉద్దేశించి "నిష్ఠా" యనెడి యేకవచన ప్రయోగము చేయబడినది. అట్లే ఐదవ అధ్యాయముయొక్క నాల్గవ శ్లోక భావముకూడ దీనికే అనుకూలమైయున్నది.

"ఓ అర్జునా! ఈ విధమున సూర్యుడాదిగ గురుశిష్య పరంపర వలన ప్రాప్తమైయుండు యీ జ్ఞాన యోగమును రాజర్షులెరింగి కృతార్థులైరి. ఈ యోగము నీకొరకుగా యిప్పుడు క్రొత్తగ చెప్పునదికాదు. ఇది అనాదియైనది. నాశములేనిది. గురుశిష్య పరంపరతో అనాదినుండి ప్రవర్తించుచు వచ్చునది.

ఇట్టి మహాప్రయోజనముగల ఈ జ్ఞానయోగము కాలక్రమమున క్షీణించినది. చిరకాలము గడచుటతో ధర్మహీనులును దుర్బలులును అజితేంద్రియులునునగు అనధికారపురుషుల పాలబడి ఈ యోగము తన నిర్మలత్వమును కోల్పోయి క్షీణదశ బొందినది. అంతట ఆ పవిత్ర సంప్రదాయము విచ్ఛిన్నమైనది."

ప్రథమ శ్లోకమునందు "యోగం" అనెడి పదముతో "అవ్యయం" అనెడి విశేషణము జోడింపబడినది. అవ్యయం — అనిన నశింపనిది అని అర్థము. అట్టియెడ "నష్టం" నశించినది అని వెంటనే పరస్పర విరుద్ధముగ చెప్పుటలో అర్థమేమి?

పరమాత్మప్రాప్తికి ముఖ్యసాధనమగు జ్ఞానము నిత్యవస్తువే. అది నిశ్చయము. పరమాత్మ నిత్యుడై నప్పుడు ఆతని పొందుటకు ఉపాయమైనట్టియు, ఆతని వలన ఉత్పన్నమైనట్టియు జ్ఞానయోగము నిత్యము కాక తప్పదు. జగత్తు ఆవిర్భవించినప్పుడెల్లయు, భగవంతుని యొక్క సమస్త నియమములును దానివెంటనె ఆవిర్భవించుచున్నవి. ప్రళయ సమయమున ఆనియమములన్నియు తిరోహితములగుచున్నవి. అంతేకాని అవి నశించుటలేదు. ఈ జ్ఞానయోగముయొక్క అనాదిత్వమును సిద్ధాంతము జేయుటకై ముందటి శ్లోకమున 'అవ్యయ' మనెడి పదము ప్రయోగింపబడినది. ఈ శ్లోకమునందు ఆ యోగము నష్టమైనదని చెప్పబడినది. సద్వస్తువునకు అభావమెక్కడిది? వెనుక చెప్పినట్లు సృష్ట్యాది యందు భగవంతుని వలన నిది ప్రాదుర్భావము నొంది మధ్య కొన్ని కారణములవలన మరుగుపడిపోయి తిరిగి వెల్లడియై ప్రవర్తించుచున్నది. వాస్తవముగ నిది అవినాశి.

(శ్లో॥ 3 ) ఈ శ్లోకము నందు "స ఏవ" అనియు "పురాతనః" అనియు ఈ పదములను ప్రయోగించుటవలన ఈ యోగముయొక్క అనాదిత్వము సిద్ధమగుచున్నది. "తే" అనెడి పదము అర్జునుని యొక్క అధికారత్వమును నిరూపించుచున్నది. "అద్య" యనెడి పదము ఈ యోగమును ఉపదేశించుటకుగల ఆవశ్యకతను నొక్కి చెప్పుచున్నది. ఈ శ్లోక తాత్పర్యమేమనిన- అనాదికాలమునుండియు పరంపరా పూర్వకముగ ప్రవర్తించుచు వచ్చునదియు, నేను సూర్యునకు తొట్టతొలుత నుపదేశించినదియు నగు ఆ పురాతన యోగమును ఈ యుద్ధక్షేత్రము నందు అత్యంత వ్యాకులితుడవును శరణాగతుడవును నగు నీకు అత్యంత దుఃఖనివృత్తియు, పరమానంద ప్రాప్తియుకోరి ఉపదేశించుచున్నాను. శరణాగతి యనిన మనుష్యుని అంతస్థలమందు వ్యాకులతతో కల్గెడి జిజ్ఞాస. దానిచే మనుష్యుడు అధికారి కాగలడు. ఆ అధికారి లక్షణము నీయందు ప్రత్యక్షముగ గోచరించుచుండుట వలనను, నీవు నాకు భక్తుడవును ప్రియుడవును అయి యుండుటవలనను ఈ రహస్యమగు యోగమును నీకు బోధించితిని".

[signature]

ఓం

# ★ గీతా తత్త్వము. ★

రచయిత: శ్రీ దివాన్‌చంద్ M. A., Ph. D.
అనువాదకులు: శ్రీ చారాల నరసింహామూర్తిగారు.

[గత సంచిక 26_వ పేజి తరువాయి.]



## 7. సమాజ నిర్మాణము.

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతి ర్మతిర్మమ॥

తా॥ ఎందు యోగీశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడుండునో ఎందు ధనుర్ధారియగు ధనంజయుడుండునో అందు లక్ష్మి, విజయ, ఐశ్వర్య, నీతులు శాశ్వతముగనుండగలవని నా యభిమతము. (గీత 18_వ అధ్యాయము. 78 శ్లో.)

ఈ శ్లోకము భగవద్గీతయందలి అంత్య శ్లోకము. ఈ ఉపసంహార శ్లోకము భరత వాక్యమువంటిది. ఈ శ్లోకమున సంజయుడు ధృతరాష్ట్రునితో మాటలాడెను. కాని యథార్థముగ మరుగుననున్న కవి పాఠకు నుద్దేశించి యీ భరతవాక్యము పలికెను. 'ధృతరాష్ట్ర ఉవాచ' యని వ్యాసమహర్షి భగవద్గీతను ప్రారంభించెను. ఉపసంహార శ్లోకమున సంజయముఖమున కవి దివ్యమయిన అంత్యసందేశ మొసంగెను. ఈ శ్లోకార్థము మెటాఫిజిక్సుగాని, మానసికశాస్త్రముగాని, నీతిశాస్త్రముగాని కాదు. నిగూఢమైన సాంఘిక, రాజకీయన్యాయము ఈ శ్లోకమున అంతర్గర్భితమైయున్నది. గీతా ప్రబోధము పూర్తియయినది కాని భారత యుద్ధమింకను ప్రారంభము కాలేదు. ధర్మక్షేత్రమున జరుగబోవు యుద్ధ భవిష్యత్ఫలమునుగూర్చి కవి ముందుగ వక్కాణించెను. సుస్థిర రాజకీయ, సాంఘిక పురోభివృద్ధి కవసరమగు సామగ్రినిగూర్చి గూడ ఇందు కలదు.

ప్రశాంత రాజకీయ సామాజిక జీవనమున కవసరమగు వాతావరణ మెట్టిది?

వ్యక్తి జీవనమున కవసరమయినది స్వయంపోషకత్వము. జీవనమునకు లోటు లేకుండ ఉపాధియుండవలయును. దారిద్ర్య పీడితుడు ఎట్టిపాపములకైన ఒడిగట్టును. సమాజమును ఛిన్నాభిన్న మొనర్చునది దారిద్ర్యము. సామాన్యవ్యక్తి ఆర్థికస్థాయి నభివృద్ధి పరచవలయునని ప్రపంచమునందలి రాజకీయవాదులందరు ఎలుగెత్తి అరచెదరు. సమాజము పటిష్టమగుటకు తినతిండి, కట్టగుడ్డ, నివసించుటకు గృహావసతి వ్యక్తుల కత్యవసరములు. వినియోగమున కవసరమగు

ధనమును ఆర్జింపవలయును. దురదృష్టవశాత్తు ఉత్పత్తిచేయువారొకరు. అనుభవించువారింకొకరు. సామ్రాజ్యతృష్ణ, స్వార్థవినియోగములీనాడు ప్రపంచమునందలి బలవత్తర జాతులన్నిటిని ఆవేశించెను. ఈ సామ్రాజ్య స్వార్థతత్వములను రూపుమాపవలయుననిన బలహీనజాతులను దిగమ్రింగుటకాక జాతి బలహీనతను వెడలగ్రక్కించ వలయును. పటిష్టమైన సాంఘిక సుస్థిరత్వమే రాజకీయ స్వాతంత్ర్యమున కాయుధపట్టు. వర్తమానకాలపు రాజకీయ సమాజములన్నియు సైనికబలము నభివృద్ధి పరచుకొనుచు తమ స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుచున్నవి. జాతీయ ధర్మనిరతి, అచంచల దేశభక్తి జాతిస్వాతంత్ర్యమును సంరక్షించును కాని పశుతుల్యమైన సైనికబలము కాదు.

మోక్షసన్న్యాస యోగమందలి 78_వ శ్లోకముననుసరించి ధర్మబుద్ధి, ధర్మబలముల సాయమున శత్రుదాడులనుండి జాతి స్వాతంత్ర్యమును కాపాడుకొని పటిష్టమైన సాంఘిక వ్యవస్థను నిర్మించుకొనవలయును. సంఘపటిష్టత కవసరమగు ఉపాంగములు 'లక్ష్మీ, విజయ, ఐశ్వర్య, నీతులు'. అనగా లక్ష్మీసంపన్నత (Economic Security) విజయము (Military Strength), ఐశ్వర్యము (High standard of life), నీతి (Culture) మొదలగునవి. జాతి బలమునకు విజయము, నీతి రెండును రెండుభుజములవంటివి. విజయమన ధర్మబద్ధమైన సైనికబలము. నీతి మేధాసంపత్తిని సూచించును. సుస్థిరమై శాంతియుతమగు రాజకీయ సాంఘిక స్వాతంత్ర్యమునకు బుద్ధిబలము, దేహబలము లవసరములు. బుద్ధిబలమునకు జ్ఞానయోగియయిన శ్రీకృష్ణభగవానుడు, దేహబలమునకు కర్మయోగియగు పార్థుడును చిహ్నప్రాయులు. అనగా శ్రీకృష్ణార్జునులు బ్రహ్మక్షత్రియులను సూచించెదరు. "నీతి, విజయ" పదములు బ్రహ్మ, క్షత్రియ పరమున వాడబడెను 'లక్ష్మీ, ఐశ్వర్య' పదములు వైశ్య, శూద్రపరమున వాడబడెను. జాతి ఐశ్వర్యమున కర్థము వ్యావసాయిక, పారిశ్రామిక పురోభివృద్ధి.

వర్ణాశ్రమ ధర్మబద్ధమైన బ్రాహ్మణ, క్షాత్రవ, వైశ్య, శూద్ర వృత్తులు భారతజాతి సౌధరాజమునకు మూలస్తంభములు. చాతుర్వర్ణ్య వ్యవస్థ అతి సనాతనమయినది. దోషరహితమైనది గూడ. చాతుర్వర్ణ్యభౌతిక జీవనమునకు ఆధ్యాత్మికము మేళవింపబడినది. 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' అనగా పరిపూర్ణ పరబ్రహ్మమును చాతుర్వర్ణ్య ధర్మములయిన స్వీయకర్మలచే భజించినమానవుడు సిద్ధిబొందునని 18 అధ్యాయమగు మోక్షసన్న్యాస యోగము 46 శ్లోకమున శ్రీకృష్ణపరమాత్మ వచించెను. లోపమేమాత్రములేని అత్యుత్తమమగుచాతుర్వర్ణ్య వ్యవస్థను వ్రేలుపెట్టిచూపరానిది. కనుకనే 4 అధ్యాయమగు 'జ్ఞానయోగము' 13 శ్లోకమున 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం' అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయందు ఉద్ఘాటించెను. చతుర్ధర్మములు ప్రకృతియందే ఇమిడియున్నవి. మానవుడు వర్ణాశ్రమ ధర్మముపై విప్లవమొనర్చినను విప్లవకారులకు తెలియకుండగనే ప్రకృతినడుమ వంగునటులొనర్చి మానవునిచే విధిగ చతు

ధర్మముల నాచరింపజేయును. విప్లవకారులు మొండి పట్టుపట్టినను ప్రకృతి వెన్నంటి వర్ణధర్మ మాచరింపజేయునని గీతాచార్యులు 'మోక్షసన్న్యాసయోగము' 59-వ శ్లోకమున 'వ్యవసాయ స్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి' అని వచించెను. వర్ణనిర్మాణమువలన మానవ సమాజమున తరతమ భేదములు కల్పింపబడ లేదా యని ప్రశ్నింపవచ్చును? 'న మే ద్వేష్యోస్తి న ప్రియః' అనగా నాకుప్రియుడు కాని అప్రియుడుకాని లేడని 9-వ అధ్యాయ మగు 'రాజవిద్యా రాజగుహ్య యోగము' 29-వ శ్లోకమున పరమాత్మ ఉద్ఘాటించెను. భేదరాహిత్యమైన సమానత్వమును (Equality) సృష్టికర్తయే సృష్టించినపుడు తరతమ భేదములకెచట ఆస్కారముకలదు? చాతుర్వర్ణ ధర్మమందు వృత్తివిభజన, వృత్తి గౌరవములను సూత్రములు(Division of Labour and Dignity of Labour) సాధింపబడెను. సంపూర్ణ సంతుష్టితో మానవులు చతుర్ధర్మముల నాచరించి లౌకిక జీవనమునల్పి సమాజమును పటిష్టమొనర్చెదరు. వృత్తి విభజనవలన మానవులందు పోటి (Competition) ఉండదు. పుష్కలముగ భౌతిక జీవనము నల్పుచు మానవులు పుష్టి, సంతుష్టిగలిగి. గీతయందు ప్రబోధింపబడిన కర్మ, జ్ఞాన, భక్తి, యోగమార్గము లవలంబించి సిద్ధులైసమ్యగ్ జ్ఞానముబొంది రాగద్వేషముల కతీతులై వర్గరాహిత్య సామాజికు లగుదురు (Classless Social Beings). ఇదియే చాతుర్వర్ణ ధర్మపరమావధి. అయితే ఇట్టి వర్గరాహిత్య సమాజస్థాయిని భారత జాతి ఎప్పుడయిన అందుకొనినదా యని ఎవరయిన ప్రశ్నింపవచ్చును.

రామరాజ్యమున భారతీయులు వర్గరహిత సమాజస్థాయి నందుకొనిరి. రామరాజ్యాంగ మండలి ప్రజల మనోవృత్తులను వర్ణించుచు '......రామభూతం జగదభూద్రామే రాజ్యం ప్రశాసతి' అన ప్రజలందరు రామరూపులయిరి. ప్రజలు జగమునందంతయు రామరూపమునే గాంచుచుండిరి. అందువలన రామరాజ్యము ప్రశాంతముగ నుండెనని రామాయణము, యుద్ధకాండ 131-వ సర్గ, 97 శ్లోకమున వాల్మీకిమహర్షి వచించెను. అనగా రామరాజ్యమందలి భారతసమాజము ఈర్ష్య అసూయలు, క్రోధ ద్వేషములకతీతమైనసమ్యగ్ జ్ఞానమునుబడసి వర్గరాహిత్య స్థాయినందుకొనెను. రామరాజ్య మీ కారణమున ఆదర్శప్రాయమై నందున మహాత్మాగాంధిగూడ రామరాజ్యావతరణకు కలలుగనెను. తిరిగి భారతయుద్ధానంతరము ధర్మరాజు కాలమున భారతజాతి సమ్యగ్ జ్ఞత్వమును పొంది వర్గరహిత సమాజమేర్పరచుకొనెను.

చాతుర్వర్ణ వ్యవస్థ పరమాదర్శమైనందున ప్రాచీన గ్రీకులుగూడ వర్ణాశ్రమ ధర్మమును పాటించిరి. వైశ్య, శూద్ర వృత్తులవలంబించువారికి గ్రీకులు 'కార్మికుల'ను (Workers) నామమిడి, బ్రహ్మ, క్షత్రియ వృత్తులవలంబించువారిని గార్డియన్స్, ఆక్సిలరీసులని (Guardians and Auxiliaries) పిలచిరి.

అత్యుత్తమమైన శిల్పకళ హంపీక్షేత్రమున జీర్ణావస్థయందున్నటుల వర్తమానకాలపు చాతుర్వర్ణ వ్యవస్థ జీర్ణించినది. సమానత్వ,సమ్యగ్ జ్ఞత్వములంతరించికుల భేదములు

పాతుకుపోయినవి. "లక్ష్మీ,విజయ, ఐశ్వర్య, నీతులకు" బదులుగ దారిద్ర్యము, పాశ్చాత్య భావదాస్యము, అవినీతి, అపమరతలు స్వైరవిహార మొనర్చుచున్నవి. జాతిదుర్బలత్వమున "పొరుగింటి పుల్లకూర రుచి" యన్నటుల సాంఘిక పునర్నిర్మాణమునకు సోషలిజము, కమ్యూనిజము, కాపిటలిజముల (Socialism, Communism, Capitalism) వంక నోరుచప్పరించుచు, గ్రుడ్లు మిటకరించుకొనుచు చూచుచుంటిమి.

పాశ్చాత్య రాజకీయ వాదములు మానవ జాతినివారణహోమములకు బలిపెట్టుటతప్ప వర్గరహిత సమాజము నెప్పుడు నిర్మింపలేవు. నిర్మింపబోవు, నిర్మింపజాలవు. ఆధ్యాత్మికము మిళితముకాని కేవల భౌతికమైన రాజకీయ, సాంఘికవాదము లెట్టివయినను కుక్కగొడుగులవలె పుట్టి అంతరించును. కాని మానవసమాజమున సుస్థిరశాంతిని నెలకొల్పజాలవు.

వర్తమానకాలపు భారతరాజకీయ, సాంఘికవాదులు తర్కపూర్వకముగ విమర్శించి యథార్థమును గ్రహించి పాశ్చాత్య రాజకీయసాంఘిక వాదములను కృష్ణార్పణమొనర్చి యథార్థమైన గీతాతత్త్వమును గ్రహించి భారతసమాజమును పునర్నిర్మించి శాంతిని స్థాపించి చాతుర్వర్ణ ధర్మమను సాంఘిక సిద్ధాంత దివ్యసందేశమును ఖండఖండాంతరములకు గొనిపోయి, యథార్థమైన మానవ సేవ యొనర్చెదరుగాక యని ప్రార్థన.

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహ
మిష్టస్స్యామి మే మతిః ॥
(18 అ. 70 శ్లో.)

తా॥ ధర్మము తప్పని కృష్ణార్జునుల సంవాదమను గీతాతత్త్వము నెవరు పఠించెదరో వారు జ్ఞానయజ్ఞమున నన్ను పూజ చేసినట్లేయని నా ప్రధానాభిప్రాయము.

"లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు"

ఓం తత్ సత్.

---

## విజ్ఞప్తి.

ఆళ్లగడ్డ శ్రీ శంకరానందాశ్రమమునందు మేనెల 7_వ తేదీ నుండి 13_వ తేదీ వరకు శ్రీ శంకరజయంతీ సప్తాహము జరిగినది. అప్పటి వార్తలను వివరముగ జూన్ నెల పత్రికలో ప్రకటించెదము.

కార్యదర్శి,
'గీతావాణి' ఆళ్లగడ్డ.

# సానువాద శంకర భాష్య సమలంకృతము
## శ్రీమద్భగవద్గీత
అనువాదకులు
## శ్రీ స్వామి శుద్ధచైతన్య జీ.

[ మార్చి సంచిక 15_వ పేజి తరువాయి. ]

భా:_ తత్ర కథమివ నిత్య ఆత్మా ఇతి దృష్టాంతమాహ —

అను:_ దీనిపై ఆత్మ యేరీతిని నిత్యంబయియున్నదో దృష్టాంతంబు దెలుపుచున్నాడు. —

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి॥ 13

భా._ దేహః అస్య అస్తి ఇతి దేహీ తస్య దేహినః దేహవదాత్మనః అస్మిన్ వర్తమానే దేహే యథా యేన ప్రకారేణ కౌమారం కుమారభావః బాల్యావస్థా యౌవనం యూనః భావః మధ్యమావస్థా జరా వయోహానిః జీర్ణావస్థా ఇతి ఏతాః తిస్రః అవస్థాః అన్యోన్యవిలక్షణాః.

అను:_ దేహంబుగలవాడు గావున ఆత్మ దేహీ యనంబడును; అట్టి దేహికి (ఆత్మకు) ఈ దేహంబున నే ప్రకారంబుగా కౌమారము — కుమారభారము — బాల్యావస్థ, యౌవనము — మధ్యమావస్థ, జర_వయోహాని — జీర్ణావస్థ (వార్ధక్యము), అను నీ మూడవస్థలు పరస్పర భేదముగలవియై యేర్పడుచున్నవో (అట్లే దేహాంతర ప్రాప్తియు).

భా:_ తాసాం ప్రథమావస్థానాశే న నాశః ద్వితీయావస్థోపజననే న ఉపజననం ఆత్మనః. కిం తర్హి అవిక్రియస్య ఏవ ద్వితీయ తృతీయావస్థాప్రాప్తిః ఆత్మనః దృష్టా.

అను:_ వీనియందు మొదటియవస్థ (బాల్యము) నశింప ఆత్మకు నాశంబు గలుగుటలేదు. రెండవ యవస్థ (యౌవనము) కలుగగా ఆత్మ పుట్టుటలేదు. మరేమన, * నిర్వికారంబుగనేయున్న ఆత్మకు రెండవ మూడవ యవస్థలు (యౌవన వార్ధక్యములు) ప్రాప్తించుట కానంబడుచున్నది.

---

* ఎట్టిమార్పును లేనిది, అన్నిమార్పులను చూచుచుండునట్టిది.

భా:- తథా తద్వత్ ఏవ దేహాత్ అన్యః దేహాన్తరం తస్య ప్రాప్తిః దేహాన్తర ప్రాప్తిః అవిక్రియస్య ఏవ ఆత్మనః ఇత్యర్థః.

అను:- అట్లే నిర్వికారంబుగనే యున్న ఆత్మకు మఱియొక దేహము ప్రాప్తించుచున్నదని యర్థము.

భా:- ధీరః ధీమాన్ తత్ర ఏవం సతి న ముహ్యతి న మోహం ఆపద్యతే.

అను:- ఇట్లుకాగా *ధీరుడు — బుద్ధిమంతుఁడు ఈ విషయమై మోహంబు నొందడు (దేహము జన్మింప ఆత్మ జన్మించుననికాని, దేహము బాల్యము కలదికాగా ఆత్మ బాల్యముగలది యగుచున్నదనికాని, దేహము యౌవనము కలదికాగా ఆత్మ యౌవనము గలదియగుచున్నదనికాని, దేహము వార్ధక్యము గలదికాగా ఆత్మ వార్ధక్యము గలదియగుచున్నదని కాని, దేహము మరణింపగా ఆత్మ మరణించుననికాని భ్రాంతిని బొందడు).

భా:- యద్యపి ఆత్మవినాశనిమిత్తః మోహః న సంభవతి నిత్యః ఆత్మా ఇతి విజానతః తథాపి శీతోష్ణసుఖదుఃఖప్రాప్తినిమిత్తః మోహః లౌకికః దృశ్యతే సుఖవియోగనిమిత్తః దుఃఖసంయోగనిమిత్తః చ శోకః ఇతి ఏతత్ అర్జునస్య వచనం ఆశఙ్క్య ఆహ —

అను:- ఆత్మ నిత్యంబని యెఱింగినవానికి ఆత్మవినాశనిమిత్తకంబైన మోహంబు సంభవింపకపోయినను శీతోష్ణ సుఖదుఃఖ ప్రాప్తి నిమిత్తకంబైన మోహంబు లౌకికం (వ్యావహారికం) బుగా గోచరంబగుచున్నదిగదా? సుఖవియోగనిమిత్తకంబును దుఃఖ సంయోగనిమిత్తకంబునగు శోకంబును కనబడుచున్నదిగదాయనెడి యర్జునుని వచనంబు నాశంకించి (పురస్కరించుకొని) చెప్పుచున్నాడు —

> మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
> ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత॥ 14

భా:- మాత్రాః ఆభిః మీయన్తే శబ్దాదయః ఇతి శ్రోత్రాదీని ఇన్ద్రియాణి మాత్రాణాం స్పర్శాః శబ్దాదిభిః సంయోగాః తే శీతోష్ణసుఖదుఃఖదాః శీతం ఉష్ణం సుఖం దుఃఖం చ ప్రయచ్ఛన్తి ఇతి.

---

*బుద్ధిని విషయంబులనుండి కాపాడువాడు లేక బుద్ధిని ప్రేరేపించువాడు (నియమించువాడు) జ్ఞాని.

అను:— వీనిచేత శబ్దాది విషయంబులు గ్రహింపబడుచున్నవి; కావున శ్రోత్రంబు (చెవి) మున్నగు నింద్రియంబులు మాత్ర లనం బడును. మాత్రాస్పర్శలు — శబ్దాది విషయంబులతోడి సంయోగంబులు, శీతంబును, ఉష్ణంబును, సుఖంబును, దుఃఖం బును గలిగించునవగుచున్నవి.

భా:- అథవా స్పృశ్యన్త ఇతి స్పర్శాః విషయాః శబ్దాదయః మాత్రాః చ స్పర్శాః చ శీతోష్ణసుఖదుఃఖదాః.

అను:— అథవా స్పృశింపబడునవి గావున శబ్దాది విషయంబులు స్పర్శ లనంబడును. మాత్రలును, స్పర్శలును శీతోష్ణసుఖదుఃఖంబుల గలిగించునవియయి యున్నవి.

భా:- శీతం కదాచిత్ సుఖం కదాచిత్ దుఃఖం తథా ఉష్ణం అపి అనియతరూపం సుఖదుఃఖే పునః నియతరూపే యతః న వ్యభిచరతః అతః తాభ్యాం పృథక్ శీతోష్ణయోః గ్రహణమ్.

అను:— శీతం (చలి) బొకప్పుడు (ఉష్ణకాలమున) సుఖంబును నొకప్పుడు (శీతకాలమున) దుఃఖంబును గలిగించునదయియుండును. అట్లే ఉష్ణంబు (వేడి) గూడ నిశ్చితంబైన రూపంబుగలది గాకయున్నది. సుఖదుఃఖంబులో నిశ్చితంబైన రూపంబు గలిగియున్నవి. ఏలన, ఇవి వ్యత్యాసంబు నొందుటలేదు. అందువలన శీతోష్ణంబులు సుఖదుఃఖంబులకంటె వేఱుగా గ్రహింపబడినవి.

భా:- యస్మాత్ తే మాత్రాస్పర్శాదయః ఆగమాపాయినః ఆగమాపాయశీలాః తస్మాత్ అనిత్యాః అతః తాన్ శీతోష్ణాదీన్ తితిక్షస్వ ప్రసహస్వ తేషు హర్షం విషాదం చ మాకార్షీః ఇత్యర్థః.

అను:— అట్టి మాత్రాస్పర్శాదులు రాకపోకలు స్వభావంబుగ గలవియయి యున్నందున అనిత్యంబులయియున్నవి. అందువలన నో యర్జునా! శీతోష్ణాదులను సహించుకొనుము. వీనివల్ల హర్షవిషాదంబుల నొందకుమని యర్థము. (సశేషము.)



# ★ భగవద్గీత ప్రాధాన్యత ★

[డాక్టర్ టి. యం. పి. మహాదేవన్ గారి ఆంగ్ల ఉపన్యాసంలో కొంతభాగానికి శ్రీమతి సౌభాగ్యవతి పార్వతీదేవిగారు గావించిన ఆంధ్రానువాదం. — సం.]



భగవద్గీత హిందూదేశమున కంతకును సర్వసాధారణా, సర్వోత్కృష్ట గ్రంథముగ పరిగణింపబడి యున్నది. ప్రజాస్వామిక హక్కులకై పోరాడు ఈ కాలమున ఈ గ్రంథరాజమున ప్రదర్శింపబడు లక్ష్యమున కన్న వేరేదియు మించినదిలేదు. భగవంతుడు అనిన ప్రత్యేకధనరాశివలెగాని, లేక అందరి మీద హుకుము చెలాయించు పోలీసు అధికారివలెగాని లేక తన ఆజ్ఞయే పరమావధి యనెడు ఉన్నతోపాధ్యాయుని (Head-master) వలెగాని భగవద్గీత విశదీకరించలేదు. కాని యిచ్చట మానవ పరమాత్మల కొకస్నేహ సంబంధము కనబడుచున్నది. నర నారాయణులగు కృష్ణార్జునుల బాంధవ్యము పరమాత్మలో ఆత్మ యొక్క బాంధవ్యమును వెల్లడి పఱచుచున్నది. మహాభారత కథా భాగమగు భగవద్గీత విచిత్రగాథలలో పేరెన్నికగన్న భారతవీరులనే ఆధారము గలదై యుండుటచేత అందరి భారతీయుల హృదయము లందును ముఖ్యస్థానము పొంది యున్నది. అందువల్లనే భగవద్గీత మహా పవిత్రమగు గంగాజలముతో పోల్చబడి యున్నది. అందుకే "గీతాభ్యాసం పునః కృత్వాలభతే ముక్తిముత్తమామ్" అని ప్రస్తుతించబడినది.

భగవద్గీత జన్మస్థానము మన హిందూదేశమేయైనను దాని ఉద్బోధ సర్వవ్యాపకమైనది. శ్రీ కృష్ణపరమాత్మ తనబోధ కేవలము హైందవులకనిగాని, అందులోను ప్రత్యేకించి వైష్ణవులకని గాని స్పష్టీకరించలేదు. భగవద్గీత ఒక జాతికి సంబంధించినది కాదు. ఇది అన్ని లక్ష్యములలో నిమిడి ప్రపంచమున కంతకును ఉద్బోధయై యున్నది. గీతాధ్యయనము ఆచరణయుక్తమైన దానిఫలితము ఎట్టివానికైన సమానమే. మహాపాతకముల చేసిన వాడైనను హృదయశుద్ధిపొంది మనోనిశ్చలత అలవఱచుకొనిన జన్మరాహిత్యుడగునని శ్రీ కృష్ణ

పరమాత్మయే వెల్లడించి యున్నా డు. అంతేకాదు మహాత్ములగు పుణ్యపురుషులందరి గమ్యస్థానము చివరికొక్కటియే యైయున్నది. గీత యొక్క ఉద్ఘాటన ఎల్లర కందు బాటులోనిదేకాక సులభమైనది; స్థిరమైనదికూడ. గాంధిమహాత్ముని వంటివారలకు తీరని సమస్యలచే వారు చుట్టబడిన సమయములందు గీత ఒక దైవిక ఉద్ఘాటనవలె పని చేసెడిది. వాస్తవముగా ఎవ్వరికైనను వారి విషమపరిస్థితులందు వారు గీతను ఆశ్రయించిన వారి సమస్యలు తీరుననుటకు సందేహము లేదు. భారతయుద్ధ ప్రథమ దినమున అర్జునుని ఆందోళనస్థితియే మానవుని మనశ్చంచలతకు గొప్ప ఉపమానము. మన హృదయము లందు ఎల్లప్పుడు చెలరేగు ఆధ్యాత్మిక పోరాటములో భయమొంది మోహపరవశులమై ఏదారి తెన్ను తెలియని స్థితియందున్న మనము అర్జునునివంటివారలము. అట్టి భ్రాంతి మోహములనుండి మనలను దరి జేర్చజాలినది భగవంతునిచేయూత ఒక్కటియే. ఆయన ఆదేశమే మనలో క్రొత్త ఉత్సాహము పుట్టించి నవజీవితమును కల్పించి మన ముందరి ప్రయాణము సాగించును. భగవద్గీతయే అట్టి ప్రజ్వలమైన పవిత్ర ఆదేశము.

భగవద్గీత శ్రీకృష్ణునిచే అర్జునుని మహాభారతయుద్ధ మొనర్చునటుల జేయుటకై మాత్రమే చెప్పబడినదనియు, కనుక క్రూరత్వమే దాని ఉద్బోధ అనియు తలచుట గొప్ప పొరబాటు. గీతాయుద్ధమునకై యే ప్రత్యేకించి చెప్పబడిన యెడల అన్ని కాలములందును అన్ని రకములవారిని చుక్కాని నడపసామర్థ్యముగలదిగ నుండెడిదికాదు. ఇంతకు అర్జునుడేమి యుద్ధమే చెయ్యనను సత్యాగ్రహము చేయువాడుకాదు. తన స్వజనముతో మాత్రము వైరము ఇష్టపడలేదు. శ్రీకృష్ణుడు దీనినే మమకారమని ఉద్బోధించెను. తనవారని, పరులని భేదభావము కనపఱచు లోకములో జరుగు అన్యాయములన్నిటికిని మూలము; ఇదియే ఆత్మను మోహపాశ బద్ధునిగ జేయుచున్నది. సంసారదుఃఖములన్నిటికి పునాదియైనట్టి ఈ మోహమును పోద్రోలుటయే గీత సాధించు మార్గము. అందుకే భగవద్గీత యుద్ధసమయమందు చెప్పబడినదనుటచేత యుద్ధమే పరమావధిగ గలదనుట పొరబాటు.

( మిగత 21_వ పుటలో )

# గీత సన్న్యాసమును బోధించునా?

కాశీపాండురంగశర్మ, జడ్చర్ల (నైజాం).

★

కౌరవ పాండవుల మధ్య యుద్ధారంభమునకు పూర్వము పార్థుడు సమరాఙ్గణమునందు తన అన్నలను, తమ్ములను, బంధుగులను, పితామహులను, పూజ్యులగు గురువులను జూచి 'అయ్యో! ఈ రణరంగమునందు నేను నా బంధుమిత్రాదులనే చంపుట కుద్యుక్తుడనైతినిగదా! పూజార్హులైన భీష్మద్రోణాదులు యుద్ధము జేయు గోర్కెగలవారలై నా సమక్షముననే నిలువబడియున్నారు. వీరితో యుద్ధము జేసి, వీరిని చంపి నేనేభోగభాగ్యముల ననుభవించగలను? ఈ భోగభాగ్యములకన్న భైక్ష్యవృత్తియే అన్నివిధముల శ్రేయస్కర'మని విచారించి విరక్తిభావమును పొందినవాడై గాణ్డీవమును బారవైచి కూర్చుండెను. ఆ సమయమునందతని సారథియైన శ్రీకృష్ణుడు అర్జునుని కర్తవ్యబద్ధుని జేయుటకుగాను అనుదినము భారతీయులచేతనేగాక ప్రపంచమందలి ప్రతినాగరికునిచేతను సభక్తిపురస్సరముగ పఠింపబడు గీతను ఉపదేశించెను. భగవద్గీత యోగశాస్త్రములలోకెల్ల యోగశాస్త్రమును, బ్రహ్మవిద్యలలోకెల్ల బ్రహ్మవిద్యయును, ఉపనిషత్తులలోకెల్ల నుపనిషత్తును అయియున్నది. ఇట్టి గీతను వేదవ్యాసమహర్షి మహాభారతమునందు వ్రాసెను. అట్లు వ్రాయుటవలననే మనము నేటివరకును గీతను చదువగలుగుచున్నాము. ఆ మహర్షిపుంగవునికి స్వస్తియగుగాక!

గీత ఆబాల్య వృద్ధపర్యంతము పఠనీయమైన యుత్కృష్ట గ్రన్థరాజము. కాని దీనిని గురించి లౌకికులు దుర్నివారమైన యపవాదమును గల్గియున్నారు. గీతను జదువు తమ బాలుడు ఎప్పుడు తమను విడిచి, ఎక్కడికి పారిపోవునో యనియు, ఎచ్చటికిపోయి సన్న్యాసాశ్రమమును స్వీకరించునో యను నీలాంటి భావములు వారి హృదయముల నెల్లప్పుడు వేధించుచుండును. అందువలన వారు తమ బాలుని గీతాపఠనము జేయనీయక పలువిధముల నడ్డుపెట్టుచుందురు. ఈ విధములైన వారి భావములు మూర్ఖత్వయుక్తములనియు, జాడ్యాన్వితములనియు మదీయ విశ్వాసము.

గీత సన్న్యాసాశ్రమమును స్వీకరించుడని ఎప్పుడును బోధించదు. ఏ యడవియందో జపమాలికను త్రిప్పుచు నుండుడని కదాచిత్తైనను బోధించదు. అర్జునునకు కాషాయవస్త్రముల గట్టించి, అతనిని విభూతి భస్మాదులచే నలంకరింపజేసి సన్న్యాసము నిప్పించుటకని గీత బోధింప బడలేదు. అర్జునుని కర్తవ్యబద్ధునిజేసి తత్సమయమున నవశ్యాచరణీయ మైన యుద్ధమును జేయించుటకే యుపదేశింపబడినది. ఇట్లు కానిచో పార్థుఁ డుపరినిర్దిష్ట లౌకికాపవాదముల ననుసరించి ధనుర్బాణముల రాజభూషణాద్యలంకారముల విసర్జించి తన బంధుగుల నందరిని త్యజించి ఏదేని నొక యరణ్యమున తపస్సు చేయుచు నుండెడివాడు. అదేకారణ ముగా ధార్తరాష్ట్రులు జయించినవారలగుచుండెడివారు. పునః పాండ వులు ఏ వనములయందో తిరుగుచు నుండెడివారు. అంతేగాక 'స్వయం తీర్ణః పరాంస్తారయేత్' అనగా, తాను తరించినవాడై ఇతరుల తరింప జేయువలయు ననునీతి ననుసరించి శ్రీకృష్ణభగవానుడు స్వయముగ తొలుదొల్త సన్న్యాసియై అనంతరము అర్జునుని సన్న్యాసిని జేసియుండు వాడు. కాని యతడట్లుగాక స్వయముగ నాచరించుచు 'సతతం కార్యం కర్మ సమాచర' 'కర్మకర్తు మిహార్హసి' అనగా 'ఎల్లప్పుడును కార్యము చేయుము. నీవు ఇచ్చట కర్మచేయుటకే తగుదువు' అని బోధించెను.

గీతను జదువు ప్రతివాడును అచ్చటచ్చట భగవానుడు గీతయందు సన్న్యాసమును గూడ ప్రశంసించి యున్నాడని తెలుసుకొనును. ఇది నిజమే. భగవానుడు ఒక్క సన్న్యాసమునేగాదు యోగము జ్ఞానము మొదలగువాని నెన్నిటినో ప్రశంసించినాడు. కాని ఎప్పుడర్జునుడు 'కృష్ణా! నీవే యొకప్పుడు కర్మశ్రేష్ఠమైనదనియు, మఱొకప్పుడు సన్న్యాసమే శ్రేష్ఠమైనదనియు చెప్పుచున్నావు. వీటన్నిటిలో యెయ్యది శ్రేయస్కరమో నిశ్చయించి బోధింపు'మని యడిగెనో అప్పుడు శ్రీకృష్ణుడు పలికెను;

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. (v — 2)

అనగా — సన్న్యాసము, కర్మయోగము, ఇవి రెండును శ్రేయస్కరములే కాని ఈ రెంటియందు కర్మసన్న్యాసము కన్న కర్మయోగమే విశిష్ట తర మైనది.

న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. (III — 5)

అనగా — కర్మజేయక క్షణమాత్రము నుండజాలడు. ఏలనన ప్రతివాడును ప్రకృతికి లోబడియుండుటచే ప్రకృతి వానిచే కర్మ నవశ్యముగ జేయించి తీరును.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః (XVIII — 11)

అనగా — దేహధారి కర్మల నశేషముగ ద్యజించుట కశక్తుడనియు బోధించుచు కర్మప్రాశస్త్యమును జాటెను. 'అర్జునా! నీవు కర్మయోగివి కమ్ము' అని పార్థునకుపదేశించెను.

కావున గీత కాషాయవస్త్రధారణాదివిధ సన్న్యాసమును బోధించుననియు, దానిని జదువు తమబాలుడు ఏఅరణ్యమునకో బోవునను మూర్ఖత్వమును విడిచి అనుదినము తమతమ బాలుర గీతాపఠనాసక్తుల జేసి వారిని గీతారహస్యముల దెలిసికొన నుద్బోధింతురని యాశించుచున్నాను. ఏలనన బాల్యమునందే ఇట్టి నదభ్యాసము లనాయాసముగ నలవడునుకదా! ఇతి శమ్.

---

( 18-వ పుట తరువాయి. )

గీత అన్ని కాలములందును అందరి మహాపురుషులవల్ల కొనియాడ బడినది. శ్రీశంకరాచార్యుల వారు గీతను జ్ఞానమునకు నిధిగ పోల్చిరి. ఉపనిషత్తులు ధేనువుగాను అర్జునుడు వాటి దూడగను శ్రీకృష్ణుడు పాలవానిగను,

శ్లో॥ సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనందనః।
పార్థో వత్సస్సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్ ॥

ఈ శ్లోకమే ఉదాహరించుచున్నది. ప్రపంచమంతటిని గీత అను పాలు పరితృప్తుల పావనుల జేయుచున్నది.

— ఐ. పార్వతీనారాయణమూర్తి.



గీతలోని —

# లోకోత్తరపురుషుడు స్థితప్రజ్ఞుడు.

మూలం: ఆచార్య వినోబా. అనుకరణ: శ్రీరామకృష్ణ.



శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

స్థితప్రజ్ఞుని అలౌకికమూ విలక్షణమూ నైన జీవనస్థితిని స్పష్టీకరిస్తూ భగవద్గీతలో యీశ్లోకం చెప్పబడింది. "సమస్తజీవులు నిద్రించే పరిస్థితిలో స్థితప్రజ్ఞుడు మేల్కొని యుంటాడు. జీవులందరూ మేల్కొనే అవస్థలో స్థితప్రజ్ఞుడు గాఢంగానిద్రిస్తాడు" — అని యీ శ్లోకానికి తాత్పర్యం. ఈ చోట అక్షరార్థాన్ని గ్రహించుట మాని లక్షణార్థాన్ని గ్రహించవలసి ఉంటుంది. ఈ శ్లోకంలో కేవలం అక్షరార్థాన్నే గ్రహిస్తే విషయం తప్పుదారిలో పడుంది. లోకంలో అందరూ నిద్రబోయే రాత్రి వేళల్లో, దొంగలూ — గూఢచారులూ — పారాజవాన్‌లూ — స్టేషన్‌మాస్టర్లు, మేల్కొని ఉంటారు. వారికి యీ శ్లోకాన్ని అన్వయించవలసి ఉంటుంది. వారూ స్థితప్రజ్ఞులు కావలసిందేనా?

గాంధీగారు ఈ శ్లోకానికి వ్యాఖ్యానం వ్రాస్తూ కాస్త అక్షరార్థంపైపే మొగ్గారు. "సామాన్యజనులు విలాసచేష్టలలో రాత్రివేళలను గడపి ప్రొద్దెక్కినపిమ్మట గూడ నిద్రిస్తారు. సంయమిపురుషులు రాత్రి సమయంలో వేళకు తగినట్లు నిద్రించి వేకువనె లేచి మననచింతన ధ్యానాలు చేస్తారు" — అని శ్రీ గాంధీగారు అక్షరార్థాన్ని వదలకుండి ఉపయోగకరమైన ఒక అర్థాన్ని బైటికి లాగినారు. ఇదీ కొంత మట్టుకు స్వారస్యమే. అయినా వారి అభిప్రాయంలోకూడా అక్షరార్థానికి ప్రాముఖ్యం లేదు. దీనికంటె సూక్ష్మమైన లాక్షణికార్థాన్ని గ్రహించుట మరింతా మంచిదంటూ వారూ ఒప్పుకొన్నారు. మీదట ఆపద్ధతిని వారు కొంతకొంత అనుసరించారు గూడ.

స్థితప్రజ్ఞుని జీవనదృష్టిని యీ శ్లోకం రూపకభాషలో వివరించింది. స్థితప్రజ్ఞుని జీవనదృష్టికి — అజ్ఞానమానవుని జీవనదృష్టికి యెంతో తేడా ఉంది. రెండు సమానాంతర రేఖలు ఎప్పుడూ ఎక్కడా కలుసుకోవు. అట్లే పై యిద్దరి జీవనదృష్టి బిందువులు కూడా దేనికది విడివిడి. స్థితప్రజ్ఞుని దృష్టి తలక్రిందులు — విరుద్ధమై ఉంటుంది "ఉలట భాయి! మేరే నయనకీ" — నా చూపులు విరుద్ధంగా తిరిగాయి, అంటూ మీరాబాయి చెప్పింది. నిజానికి వారిదృష్టి విరుద్ధంగా లేదు. సమాజంగానే ఉంది. ప్రపంచజనుల దృష్టిమాత్రమే విరుద్ధమై ఉంది. అయినా అది బహుసంఖ్యాక (మెజార్టీ)

పక్షం కాదంతో, విరుద్ధమైనాసరి అనే ఉపచారానికి చెప్పబడింది. పదిమందిని తప్పు బట్టుటకంటె తప్పును తనమీదనే వేసికొనుట మంచిదని సాధుహృదయ మీరాబాయి తనచూపులు విరుద్ధంగా తిరిగాయి అని చెప్పింది. మొదట్లో — జీవన దృష్టియందే భేదమున్నపుడు వారుచేసే క్రియలన్నిటియందూ భేద ముండితీరుతుంది. ఒక విషయం. ఆహారాన్ని ఉదాహరణగా తీసికొందాం. శరీరధారణకు ఆహారం ఆవశ్యకమై ఉంది. సామాన్యమానవులు అన్నాన్ని తింటారు; స్థితప్రజ్ఞుడు తినడనే మాటలేదు. స్థితప్రజ్ఞుడూ భుజిస్తాడు. పైటి క్రియలూ, ప్రవృత్తులూ యిద్దరిపీ సమానంగానే ఉంటవి. దేహధారణకోసం స్థితప్రజ్ఞుడు తటస్థభావంతో చేసే భోజన క్రియ సైతం ఒక యజ్ఞమే. ఔషధంగా భావించి ఆహారాన్ని తినుమంటూ ఉపనిషత్తులు చెబుతాయి; శ్రీ శంకరాచార్యుల వారూ అట్లే చెప్పారు. అన్నము తినుట అద్దెయింటికి బాడుగ చెల్లించుట వంటిదని శ్రీగాంధీగారు అన్నారు. యంత్రం పని చేయాలంటే దానికి నూనె — పెట్రోలు వేయాలె. శరీరం పదిలంగా నిలిచి పని చెయాలంటే దానికి ఆహారాన్ని సప్లై చేయాలి. ఈ దృష్టిగలవాని ఆహారపరిగ్రహణంలో భోగలోలతగాని — జిహ్వాచాపల్యంగాని ఉండదు. తక్కినవారు భోగాసక్తితో — రుచికోసం భుజిస్తారు. అట్టి భోజనప్రియులు కాలాన్ని — బుద్ధిని వృథాగా దుర్వినియోగం చేస్తారు. అదే ఆర్భాటంతో ప్రచండమైన తెలివితేటలను ప్రయోగించి పెద్దయెత్తున ఘనమైన ఉద్యమాలను ప్రారంభిస్తారు. మానవసమాజంలో సగభాగం — అంతే స్త్రీ సమూహమంతా యీ పాకయోగంలోనే ఊపిరాడక సతమతమాతూంది. ప్రపంచమందంతటా యీ ఉదరదేవతా పూజలు కొల్లకొల్లలుగా కోలాహల సంరంభంతో హెచ్చుపెరిగిపోయాయి. స్థితప్రజ్ఞుని భోజనం శాస్త్రీయమైంది. దానివెనుక అత్యంత గంభీరమైన అభిప్రాయం ఉంది. తక్కినవారి ఉద్దేశ్యం భోగమయమూ బాలిశమూ.

నిద్ర విషయంకూడా అంతే. ప్రాణికోట్లకు ఆహారంవలె నిద్రకూడా జీవనధారణకు ఆవశ్యకమైన క్రియ. సర్వసామాన్యంగా జీవులందరూ నిద్రావస్థలో తమోగుణాన్ని బొంది స్తబ్ధమైపోతారు. కలల్లో భ్రమిస్తారు; జ్ఞానాన్ని మరుస్తారు. రాత్రిరాత్రికీ వారిజ్ఞానం క్షయిస్తూంది. కానీ స్థితప్రజ్ఞుని నిద్ర నిర్దోషమైంది. కలలూ కలతలూలేవు. ఒక్కసారి నిద్రనుండి లేచేసరికి ఆతని విచారశక్తి వెల్లడిగా తేటగా ప్రకాశిస్తుంది. విత్తనము భూమిలో మరుగుపడి ఉంటుంది. అయినా అదివికసిస్తూనేఉంది, బయటికి వచ్చినపుడు గోచరమైంది. అట్లే క్రొత్తక్రొత్త విచారాలు స్థితప్రజ్ఞుని నిద్రలో పుష్టిని బొందుతూ మొలుగెత్తుతూంటాయి. ఇతరుల నిద్రకూ స్థితప్రజ్ఞునినిద్రకూ ఉండే తేడా యిది. తమోగుణం కరుడుగట్టిన మొద్దునిద్రలో తక్కినవారు సోలిపోతారు. స్థితప్రజ్ఞుని నిద్రలో మూడు గుణాలూ సామ్యస్థితిని పొందుతాయి: మూలప్రకృతి చేర్తాయి. పైకి రెండూ ఒకే

పోలికగా ఉన్నా యథార్థానికి వాటిలో ఆకాశ పాతాళ భేదం ఉంది.

మామూలు వ్యవహారాల్లో - పనిపాటల్లోగూడా యింతే. సామాన్యంగా సాంఘిక నీతిశాస్త్రాలు, కీర్తి అపకీర్తులను ఆధారం చేసికొని రచింపబడ్డాయి. సామాజిక సభ్యమానవుని జీవితానికి కీర్తిని గడించుటే పరమలక్ష్యం. అపకీర్తి వానికి తీరనిఓటమి. కాని స్థితప్రజ్ఞుని విషయం దీనికి తీరా విరుద్ధం. వానికి కీర్తి అపకీర్తులొక లెక్కలోవి గావు. సామాన్య మనుష్యుడు వెల్లడిగా 'ఖుల్లా'గా మాయమర్మాలు లేకుండా యెక్కడగూడా ప్రవర్తించుటలేదు. కృత్రిమత్వం వానికి విడువని ఉపాధి అయింది. సభల్లో సమాజాల్లో ఎక్కడైనాసరే వాడు డంబాన్ని ఆశ్రయించని చోటేలేదు. ధర్మమని ఆచారమనీ పేరుపెట్టుకొన్నా, ఆ చోటగూడా కృత్రిమదంభమే పనిచేస్తూంది. మానవుని ప్రతివ్యవహారంలో, ఒక్కొక్కచోట ఒక్కొక్క వేషంతో డంబమే తైతక్కలాడుతుంది. స్థితప్రజ్ఞుని స్వభావం నిజాయితీ అయింది. కల్లకపటాలులేని సరళస్వభావంతో సహజంగా అన్నివిషయాల్లో వాడు ప్రవర్తిస్తాడు. చిల్లరమల్లర వ్యవహారాలల్లోసైతం అతనిప్రవర్తన తక్కినవారికి వ్యతిరేకంగా ఉంటుంది.

రూపకాలంకార భాషద్వారా తోచిన అర్థాన్ని యింతవరకూ మనం విచారించాం. అయితే భగవద్గీత స్వయంగా సూచించే అర్థమేది? అది కేవలరూపకభాషను చెప్పి ఊరుకోటంలేదు. దాని అంతర్యం మరింత లోతుగా ఉంది.

భగవద్గీతలోని రెండో అధ్యాయాన్ని సాంఖ్యయోగమంటారు. ఆ అధ్యాయంలో చెప్పిన విషయాలే మీదటి భగవద్గీత మొత్తంలో విస్తారంగా చెప్పబడ్డవి. అనగా - మొత్తం గీతలోని తాత్పర్యమంతా సూత్రప్రాయంగా రెండో అధ్యాయమైన సాంఖ్యయోగంలో చెప్పబడిందన్నమాట. దాంతో సూత్రప్రాయంగా గీత మొత్తం ముగిసినట్లే. ఆ రెండో అధ్యాయంలో మొట్టమొదట నిర్గుణసాంఖ్యబుద్ధి చెప్పబడింది. తర్వాత దానికి ఉపకారక సాధనంగా ఉండే సగుణయోగబుద్ధి చెప్పబడింది. చివరికి యీ రెంటిపరిణామప్రయోజనమైన స్థితప్రజ్ఞుని లక్షణాలు చెప్పబడ్డవి. (1) సాంఖ్యబుద్ధి, (2) యోగబుద్ధి, (3) స్థితప్రజ్ఞుడు - అనే యీ మూడువిషయాలనే ఉటంకించి ఈ ఒక్కశ్లోకంలో రూపక భాషలో భగవద్గీత పాడగుర్తులతో క్లుప్తంగా చెబుతూఉంది. ఆ మూడు విషయాలను గూర్చి వివరంగా ముందు తెలుసుకొందాం.

(1) సామాన్య మానవులబుద్ధి దేహబుద్ధి. స్థితప్రజ్ఞునిబుద్ధి సాంఖ్యబుద్ధి. సాంఖ్యబుద్ధి అనగా ఆత్మస్వరూపజ్ఞానం. ఈ జ్ఞానాన్ని భగవద్గీత మొదట్లోనే చెప్పింది. మొదట్లోనే చెప్పవలసిన అగత్యమేమి? వినుడు. ఆత్మను తెలిసికోడమంటే తనకు సంబంధించని దేన్నో - పరాయివస్తువును తెలిసికోడం గాదు. ఆత్మ అనగా తానే. తన స్వరూపాన్ని తెలుసుకోడమే ఆత్మస్వరూపజ్ఞానం. మొట్టమొదట తన్ను తెలిసికోటం అతి అగత్యమైనపని. ఆత్మస్వరూపజ్ఞానానికి మించి అత్యవసర విధాయక కర్తవ్యం

మరొక్కటిలేదు. ఆత్మ చావదు; చంపదు; చంపించదు; అని భగవద్గీత చెబుతుంది. మానవుడు, కర్తరి – కర్మణి – ప్రేరణార్థమనే మూడువిధాలైన క్రియలతో సంబంధాన్ని పెనవేసుకొన్నాడు. శుద్ధమైన ఆత్మకు యీమూడింటితో సంబంధంలేదు. ఆత్మ, క్రియకు కర్తాగాదు; కర్మాగాదు; ప్రేరకమూ గాదు. భగవద్గీతలో "చచ్చుట" అనే క్రియ, క్రియలన్నింటికీ ఉపలక్షణంగా – ఉదాహరణంగా వాడబడింది. 'ఎట్టిక్రియ్యకూ యే విధంగా కూడా ఆత్మ సంబంధించదు' అనేది ఆమాటలోని ఆంతర్యం. ఆత్మయొక్క యీ అకర్తృత్వస్థితి శాంకరభాష్యంలో, అద్దంలోవలె వెల్లడిగా వివరింపబడింది. ఆత్మ అకర్త అనే స్వరూపజ్ఞానం పగలువంటిది. దానికి విరుద్ధంగా, ఆత్మకర్త అనితలంచుట రాత్రివంటిది. ఈ రాత్రిలో – యీ చీకటిలో భ్రమిస్తూ సమస్తజీవులూ తమ జీవితాన్ని అధ్వాన్నం చేసుకొన్నారు. స్థితప్రజ్ఞుని జీవితం ఆత్మప్రకాశ తేజంతో ధగధగ లాడ్తూంటుంది. ఈ శ్లోకానికి యిది మొదటిరకమైన అర్థం. తాను చేసే కర్మలు ఉత్తమమైనవనీ – ఆ కర్మలకు తాను కర్తననీ – ఫలానా కులగోత్రాలు తనవనీ – తనభోగభాగ్యాలు యింతింతవనీ, మానవజీవి నానాకర్మభావనలను తనపై – తనచుట్టూ పెనవేసుకొని నుడివడుతూన్నాడు. ఇవన్నీ తనకు సంబంధించనవిగా స్థితప్రజ్ఞుడు తెలిసికొని స్వరూపస్థితినే తన స్వధర్మంగా గమనించి నిలిచి ఉంటాడు. సామాన్య మానవులయొక్క – స్థితప్రజ్ఞుని యొక్క జీవితాలల్లో యీ విధమైన వ్యత్యాసం ఉంది. ఈ పరిస్థితులను చీకటివెలుగులని – రాత్రింబగళ్ళని వర్ణించుట సముచితం కాకపోదు.

(2) రెండోవిషయం. సామాన్య మానవులది ఫలబుద్ధి. స్థితప్రజ్ఞునిది యోగబుద్ధి.

ఆత్మ అకర్తగదాయని దేహంతో పనిపాటలను చేయక – కర్మశూన్యుడవై కూచుంటే నీవు శుద్ధం తమోగుణంలో కూలిపోతావు. కర్మలనుచేస్తే రజోగుణం మీదికెక్కుతుంది. ఈ ఉభయసంకటస్థితిలో భగవద్గీత ఒక సదుపాయాన్ని కనిపెట్టి బోధించింది. ఫలాసక్తి అనే కుదురుపైన కర్తృత్వభావన నిలబడి ఉంటుంది. కర్తృత్వానికి ఆయువుపట్టు ఫలాసక్తియే – ఫలాసక్తి ఉందంటే ఆచోట కర్తృత్వం జరూరుగా ఉంటుంది. "నేను పనిచేశాను, కాబట్టి దానిఫలం – దానికూలి నాకు కావాలి" – అని ఫలవిషయంలో అపేక్ష ఉంటే ఆచోట కర్తృత్వాధికారం విజృంభించి ఉంటుంది. కాబట్టి ఫలంమీది అధికారాన్ని – అపేక్షను వదిలితే కర్తృత్వాన్ని వదలినట్లే.

"ఆత్మ అకర్త అనేమాటను ఒప్పుకొన్నావుగదా! నీవు ఆత్మవు. కర్మమే నీది కానపుడు ఫలముతో నీకు సంబంధమెక్కడిది?" – అని గీత అడుగుతుంది. "నేను దేహానికంటె భిన్నమైన అకర్తను" – అనే అభ్యాసం కర్మలను వదిత్తేరాదు. ఫలాన్ని వదలడంతోనే సిద్ధిస్తుంది. ఆత్మ అకర్త అనే అనుభవాన్ని ఆర్జించేటందుకు కర్మత్యాగం సాధనం కాదు. ఫలత్యాగమే సాధనం. ఈ విధంగా తేలికసరణిలో

అకర్తృత్వాన్ని అభ్యసించేటందుకై భగవద్గీత పాఠం బోధిస్తూంది. ఫలంమీది అధికారాన్ని వదులు. కర్మను వదలవలసిన అగత్యంలేదు. సాంఘిక నీతిశాస్త్రాల దృష్టినిబట్టి చెబితే_ నీకు ఫలంమీద గూడా అధికారం ఉంది. అయినా నీవు గీతకు భక్తుడవు. ఆ తల్లికి బిడ్డవయ్యేభాగ్యం నీకు అబ్బింది. అట్టి నీకు ఫలత్యాగమే తగిన యోగ్యత; తగిన గౌరవం.

ఇక్కడ ఆనుషంగికంగా ఒకవిషయం చర్చించవలసి ఉంది. భగవద్గీతలో ఫలత్యాగాన్ని బోధించే వాక్యాలల్లో "కర్మణ్యేవాధికారస్తే – మా ఫలేషు కదాచన" – అనేవాక్యం పెద్దగా ప్రసిద్ధిపొందింది. "నీకు కర్మవిషయంలో అధికారం ఉంది. ఫలవిషయంలోలేదు." – అని పై వాక్యానికి అర్థాన్ని చెప్పుట అంతటావరిపాటి అయిఉంది. కానీ ఆ అర్థం సరిగాదు. "కర్మను చేసేదానికి అధికారమున్నపుడు ఫలాన్ని పొందేదానికి అధికారమెందుకు లేదు?"_ అని ప్రశ్నిస్తే వారు చెప్పే సమాధానం ఒకటి. "ఫలము కేవలం మనుష్యుని అధీనంలోలేదు. అనేక బాహ్యపరిస్థితులపై ఆధారపడి ఉంటుంది" – అని వారిసమాధానం. దీనినే దైవవాదమంటారు. ఈ మాట సత్యదూరమని మేమనము. అయినా ఆ అర్థం ప్రస్తుత ప్రకరణవిషయాన్ని పోషించేది గాదు. ఫలం మనుష్యుని వశంలో లేదని చెబితే – ఒకదృష్టినిబట్టి కర్మకూడా మానవుని అధీనంలో లేదనే చెప్పొచ్చు. రెంటికీ కారణమొకటే. రెండూకూడా బాహ్యపరిస్థితులను కొంతకొంత మట్టుకు అవలంబించి ఉన్నాయి. రెంటియందలి స్థితిఒకటే. కర్మవిషయంలో అధికారముంటే – కాస్తో కూస్తో ఫలవిషయంలో కూడా అధికారముంటుంది. కొద్దిగాని గొప్పగాని అంతు ఉందన్నమాట. ఫలవిషయంలో అధికారం లేదంటే కర్మవిషయంలో గూడా లేదనే మాటే.

అటులయిన పై వాక్యానికి సరైన అర్థమేది? – సమాధానాన్ని కాస్త నెమ్మదిగా విచారిస్తాం. ఈచోట సంస్కృతవ్యాకరణమర్యాదను కొంత గమనించవలసి ఉంది. "మా ఫలేషు" అనివాక్యంలోని ప్రయోగం. "న ఫలేషు" అని గాదు. వ్యాకరణ నియమాన్నిబట్టి 'మా' శబ్దానికి వెంబడీ 'అస్తి' లేదా 'భవతి' అనే వర్తమానక్రియాపదం రాజాలదు. 'అస్తు' అని లేదా 'భవతు' అనే క్రియాపదమే రావాలి. అప్పుడు 'కర్మణి ఏవ తే అధికారః అస్తు; ఫలేషు మా అస్తు' – అనెడి పూర్తివాక్యం సిద్ధిస్తుంది. "నీ హక్కు కర్మ విషయంలో ఉండనిమ్ము. ఫలవిషయంలో ఉంచవద్దు" – అని దాని అర్థం. ఇంతగా లోతుకుదిగి వ్యాకరణనియమానుసారం పరిశోధన చేయడంతో తేలిన స్వారస్యాన్ని – పై వాక్యంయొక్క తాత్పర్యాన్ని, ధారాళంగా వివరించుకొందాం. విను. "నీకు కర్మయందు అధికారం ఉంది. కాబట్టి ఫలమునందూ ఉంది. అయినా కర్మమీది అధికారాన్ని మాత్రం పెట్టుకో. ఫలముమీది అధికారాన్ని వదలిపెట్టు ఎందుకంటావా? 'నేను కర్తను గాదు

అనే సిద్ధాంతాన్ని నీ తత్త్వజ్ఞానమే ప్రతిపాదించింది. ఆ సిద్ధాంతాన్ని సార్థకం చెయ్యాలంటే - నీవు నీ అకర్తృత్వాన్ని అనుభవించాలంటే ఫలముమీది అధికారాన్ని తప్పనిసరి వదలిపెట్టవలసిఉంది. తెలిసిందా!"

ఈ విషయంలో సిద్ధప్రజ్ఞుని అంతస్సుకూ తక్కినవారి అంతస్సుకూ ఫాసలా చాలా దూరం. "చేయవలసివస్తే ఫలాన్ని కోరే చేస్తాను. కాదంటే కర్మనే వదులాను. తీసికోవలసివస్తే ఫలాన్ని సహా కలిపి తీసికొంటాను. విడువమంటే కర్మను సహా విడుస్తాను" - అనే అభిప్రాయం సామాన్య జనుల అంతస్సులోది. ఇంతమట్టుకు నిలిచినా కొంత నయమే. చాలామంది ఘనులు మరీ రెండడుగులు ముందుకు పోతారు. "కర్మను చేయకనే ఫలం లభిస్తే మరింతా మంచిది. అది సాధ్యంగాక అనివార్యావశ్యంగా చేయవలసివస్తే కర్మను చేస్తాం. ఫలాన్ని మాత్రం ఎప్పుడూ వదలం." - ఇది వారి భావన. ఈ హీనవృత్తిని భగవద్గీత ఆసురీ సంపదక్రింద లెక్కించింది.

భగవద్గీతలో చెప్పిన యోగబుద్ధి వీటిన్నిటికంటె పైది. కొందరికి నీరసంగా నిరుపయోగంగా అది తోస్తే తోచనీగాక! అయినా దాని లోతేమిటో తెలుసుకోవాలి. "కర్తృత్వాభిమానంనుండి విముక్తి చెందాలంటే ఫలాన్ని భగవంతునికి అర్పించు. లేదా సంఘానికి ధారపొయ్, అది యేదైనాపోనీ. నీవు మాత్రం తీసుకోవద్దు. ఈమాటను యెవరో చెబుతున్నారని గాదు. నీ తత్త్వజ్ఞానమే నిర్బంధించి నీకు చెబుతూంది. ఆత్మకు యెట్టి క్రియతోనూ సంబంధంలేదని నీ తత్త్వజ్ఞానము చెప్పే నిష్కర్ష గదా! క్రియయొక్క సంబంధం ఆత్మకు అంటరాదంటే తప్పనిసరి ఫలత్యాగమనే ఉపాయాన్ని ఆశ్రయించితీరాలి" - అని భగవద్గీత బోధిస్తూంది. ఈ తత్త్వజ్ఞానమే గీతలో చెప్పిన నిష్కామకర్మయోగానికి పునాదిరాయి. ఈయథార్థాన్ని కొందరు గ్రహించలేరు. "భగవద్గీతకు మొట్టమొదటే యీ తత్త్వజ్ఞాన ఘట్టం నిష్కారణంగా - అనవసరంగా వచ్చింది. మొట్టమొదట కర్మయోగాన్ని చేర్చిఉంటే భేషగ్గా ఉండేది" - అని కొంతమంది అభిప్రాయం. కాని ఆ అభిప్రాయంలో దూరదృష్టిలేదు. గీతలోని కర్మయోగం ఆత్మజ్ఞానమనే ఆధారంపై నిలబడింది. కర్మను వదలాలని అది చెప్పదు. ఫలాన్ని విడువుమంటుంది. ఆత్మజ్ఞానంతో తప్ప ఫలత్యాగవిధికి సహేతుకమైన తత్త్వరహస్యాన్ని వేరేవిధంగా చెప్పే వీల్లేదు. ఫలత్యాగతత్త్వానికి ఆత్మజ్ఞానమే కుదురు. నేను ఆత్మస్వరూపుణ్ణి అయినాకూడా ప్రస్తుతం దేహంలో బద్ధుడనై ఉన్నాను. కాబట్టి తుదముట్టా కర్మను వదలే వీల్లేదు. అంతేకాని, ఫలంతో కలిపి కర్మను గ్రహించుట భావ్యంకాదు. "నేను అకర్తను" అనేభావం దృఢమై ఉందిగదా! దేహము ఉంది కాబట్టి కర్మ విడిచేదిగాదు. ఫలముతోగూడిన కర్మము మనతత్త్వజ్ఞానానికి సరిపోదు. ఈ ఉభయసందిగ్ధాన్ని తప్పించే కోసం భగవద్గీత ఫలత్యాగ పూర్వకమైన కర్మయోగమనే ఉపాయాన్ని వెదకి

పెట్టింది. తర్కశుద్ధమైన ఫలత్యాగ సిద్ధాంతానికి, ఆత్మయొక్క అకర్తృత్వ వాదమే మూలము. ఆత్మ అకర్త అనే ప్రమాణం నుండి ఫలత్యాగ సిద్ధాంతం బయలుదేరింది. ఈ కర్మయోగధోరణిలో "యా నిశా సర్వభూతానాం" అనే శ్లోకానికి అర్థం చెప్పుకొందాం. "తక్కిన జనులు ఫలవిషయంలో మేల్కొని ఉంటారు. కర్తవ్యవిషయంలో నిద్రబోతారు. స్థితప్రజ్ఞుడు ఫలవిషయంలో నిద్రిస్తాడు. కర్తవ్య విషయంలో మేల్కొంటాడు." — ఈ శ్లోకం సూచించే రెండో విషయం — రెండో అర్థం యిదే.

(౩) మూడో విషయం. స్థితప్రజ్ఞుడు ఆత్మారాముడు. తక్కినవారు యింద్రియారాములు; వారు చంచలప్రజ్ఞులు. ఇంద్రియ నిరోధం స్థితప్రజ్ఞుని లక్షణం. ఇంద్రియ లోలత్వం గతప్రజ్ఞుని లక్షణం. భోగవాదం వల్ల బుద్ధి నశిస్తుంది. బుద్ధి స్థిరం కావాలంటే సంయమం అవసరం.

"స్థితప్రజ్ఞుడు భోగవిషయంలో నిద్రిస్తాడు. సంయమ పద్ధతిలో మేల్కొని ఉంటాడు. సామాన్యమానవులు యితని పద్ధతికి విరుద్ధంగా ఉంటారు" అని ప్రస్తుతానికి యోగ్యమైన మూడో అర్థం. ఈ మూడురకాలైన అర్థాలు "యా నిశా సర్వభూతానాం" అని రూపకభాషలో చెప్పిన పై శ్లోకమునందు సూచింపబడి ఉన్నాయి. ఈ మూడు అర్థాలను సూచించే కోసం యీ శ్లోకంలో "పశ్యత్ — ముని — సంయమి" అనే మూడు పదాలు వాడబడ్డాయి. ఈ మూడు పదాలు ఆ మూడు విషయాల్ని సూచించే గుర్తులు. 'పశ్యత్' శబ్దముతో సాంఖ్యనిష్ఠగల ఆత్మజ్ఞాని సూచింపబడ్డాడు. 'ముని' శబ్దమువలన యోగనిష్ఠుడగు కర్మయోగి సూచింపబడినాడు. 'సంయమి' శబ్దము సాంఖ్యబుద్ధి — యోగ బుద్ధులు రెంటిలో నిష్ణాతుడైన వాడును, యీ ప్రకరణంలో వర్ణింపబడ్డ వాడునగు స్థితప్రజ్ఞున్ని సూచించింది. ఇట్లు యీ మూడు విషయాలు యీ ఒక్క శ్లోకంలో లోతున ముడివేయబడ్డాయి. పైపైచూపుకు యీ శ్లోకం ముచ్చటగా సరళంగా ఉంది. ఇంతకూ, స్థితప్రజ్ఞుని జీవనస్థితికీ, సామాన్య జనుల జీవనస్థితికీ ఉత్తరదక్షిణ ధ్రువాలకున్నంత తేడా ఉంది; యిది సామాన్యమైన అర్థం. ఇంతమట్టుకు గ్రహించినా చాలు. ఈ సూత్రాన్ని సమస్త జీవనవ్యాపిగా అనుసంధిస్తే చాలు. ముందు చెప్పిన విశేషార్థాలను మూడింటిని గ్రహించగలిగితే "అధికస్య అధికం ఫలం"—



# వార్తలు.

శ్రీ శంకరానందస్వామివారు బంగారుపేట శ్రీరామకోటి సప్తాహసందర్భమున 7-4-54 నుండి 14-4-54 వరకు శ్రీమాధవ ధర్మశాలయందు భగవద్గీతా ద్వాదశాధ్యాయమును గురించి ఉపన్యసించినారు. శ్రీ సేగు వేణుగోపాల గుప్తగారు అనువదించారు.

ఆ సందర్భమున 8, 9, 10 తేదీలయందు శ్రీ మలయాళస్వాములవారి సభలు కూడ జరిగినవి. శ్రీ మలయాళస్వాములవారు బంగారుపేటనుండి కోలారు బంగారుగనుల (K. G. F.) ప్రాంతమునకు వెళ్ళినారు.

శ్రీ శంకరానందస్వాములవారు బంగారుపేటనుండి కర్నూలు పోయినారు. కర్నూలు శ్రీ గీతాసమాజమువారు అభ్యర్థించుటతో శ్రీస్వామివారు 16-4-54 నుండి 22-4-54 వరకు కోట ఆంజనేయస్వామి ఆలయమునందు 'గీతాసందేశము' అను విషయముపై ఉపన్యసించినారు. బ్రహ్మశ్రీ వెంకటకృష్ణ శర్మగారు అనువదించారు.

శ్రీవారు కర్నూలునుండి నంద్యాలచేరి ఆళ్లగడ్డకు చేరుకొందురు.

శ్రీ రామకృష్ణగారు 26-4-54 వరకు పాకాలలో శ్రీ రామాయణోపన్యాసములు జరిపి చిత్తూరు మీదుగ గండిక్షేత్రము చేరినారు. ఆళ్ళగడ్డలో మే నెల 7 వ తేదినుండి ఆరంభింపబడిన శ్రీ శంకరజయంతి సప్తాహములందు పాల్గొనిరి.

శ్రీ శంకరజయంతికి తర్వాత శ్రీశంకరానంద రామకృష్ణులు, 19-5-54 నుండి వారందినములు వాయల్పాడు తాలూకా చట్టివారిపాళెం నందును, 6-6-54 నుండి వారంరోజులు హిందూపురమునందునుగీతోపన్యాసకార్యక్రమములు నెరవేర్చి 16-6-5 తేదీకి తూర్పు గోదావరిజిల్లా పాలకొల్లు చేరగలరు. ఆ ప్రాంతమున దాదాపు ఒక్క నెల ఉండగల్గుదురు.



## గీతామృత బిందువు.

"మానవులు రెండువిధాలు. (1) ఆత్మారాములు, (2) యింద్రియారాములు. ఇంద్రియారాముని జీవితం వ్యర్థం. ఆత్మారాముని జీవితం కృతార్థం."



# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదుర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోతేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదనపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్ఘనానంద మహర్షులవారు, శ్రీ భవానీ ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా. - 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ వడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం. కరీంనగర్ జిల్లా.

32 గ్రంథె నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్పరాజుగారు, గోనపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. – 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. – 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. – 10. శ్రీ మదల్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, – కోయిలకుంట్ల. –15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం

కడపజిల్లా. 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ – 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. – 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 19. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. – 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. – 21. శ్రీ ఉమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. – 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. – 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. – 25. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. – 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 30. శ్రీ ఆముదాల వెంకటరెడ్డిగారు, రాగలపాడు – 31. శ్రీ కె. చాడయ్యగారు, జమీందార్, మడకసిర. – 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తాలూకా. – 33. శ్రీపటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. – 36. శ్రీ పెద్ద కదిరప్పగారు, కుందనగుర్తి. – 37. శ్రీ చిన్న కదిరప్పగారు, కుందనగుర్తి. – 38. శ్రీ సాధు శివలింగప్ప గారు, కుందనగుర్తి. – 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 41. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. – 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనాయుడుగారు, కార్యాూరు.

మైసూర్ స్టేట్: 45. శ్రీకాకుబాళ్ల అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 47. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 48. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట — 49. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. కోలారు. — 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. — 52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. — 53. నాగబండి విశ్వనాథంగారు, 12/88 మైక్రారోడ్డు, వరంగల్. — 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ — 55. శ్రీ గందె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ — 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్ —57. శ్రీతాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ — 58. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ — 59. శ్రీ మడూరు బసవలింగంగారు, వరంగల్ — 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ — 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ — 62. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు వరంగల్ — 63. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ — 64. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. — 65 శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ — 66. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ — 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ — 68. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ — 69. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు, వరంగల్ — 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 71. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం.

కృష్ణాజిల్లా:— 72. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. 73. శ్రీబావినేని రామకోటయ్యచౌదరి, పరమానంద్రాశ్రమము, గీతాభవనము, పెనమలూరు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు—18.
2. శ్రీ గజహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# గీతామతల్లి!

బి. జి. రామరాజుగారు,
ప్రధానాంధ్ర పండితులు, ఆత్మకూరు బోర్డుహైస్కూలు.

సీ॥ పార్థుండు గృహమేధి, బ్రహ్మజిజ్ఞాసకు
తగునైన బ్రహ్మవిద్యాధికారి
సంజయుండు మనఃప్రసన్నుండౌ శూద్రుండు
ధృతరాష్ట్రప్రభున కుద్దిష్టగురుండు
భూదేవి జ్ఞానప్రపూత, నీమాహాత్మ్య
మాలకించెదు మహిళాలలామ
రణభూమి రాజుల రంగధామము, బ్రహ్మ
తత్త్వబోధకు ముఖ్యతావలంబు

గీ॥ [illegible]! ఏమి చెప్పు, నీ పాత్రచయము
పగటుచున్నవి నీకొన్ని భావగతులు
సత్యమిదమిత్థమని వేఱు చాటనేల!
తల్లి భువనైకవల్లి గీతామతల్లి!

సీ॥ ఆత్మబోధకు గేస్తుండధికారి యనుటకు
శరణాగతుండు ధనంజయుండు సాక్షి
ఆత్మనిష్ఠకు శూద్రుడర్హుండౌ ననుటకు
ఉపాదకుండు సంజయుండుసాక్షి
తత్త్వసిద్ధికి స్త్రీలు తగుదురనుటకు నీ ప్ర
భావము వినిన భూదేవిసాక్షి
జ్ఞానము సర్వత్ర గమనార్హమనుటకు
బోధకెలవగు యుద్ధభూమిసాక్షి

గీ॥ చెప్పకమెతోచు గీతావిశిష్టగుణము
లాత్మశుద్ధికి సాటిలేదన్నమనెడు
సత్యమెల్లెడ నీలో సాక్షాత్కరించు
తల్లి! భువనైకవల్లి! గీతామతల్లి!

## స్థితప్రజ్ఞ లక్షణములు.

( దూబగుంట్ల లక్ష్మణార్యులు. )

తే॥ గీ॥ ఆత్మయగు బ్రహ్మమందు దానాత్మచేత
నతిశయంబగు నానంద మందుచుండి।
మదిని కామమ్ములెల్లను వదలు వాని
నార్యులవనిన్ స్థితప్రజ్ఞుడండ్రు పార్థ॥

తే॥ గీ॥ కలుగు దుఃఖమ్ములకు మది గలగకుండ
బొందు సుఖములకును మది బొంగకుండ।
కోపరాగభయమ్ముల గొనని మునిని
ఆర్యులవనిన్ స్థితప్రజ్ఞుడండ్రు పార్థ॥

తే॥ గీ॥ ధరణి నన్నిట దాదటస్థముగ నుండి
శుభము కల్గిన బ్రీతిని జూపకుండి।
అశుభమబ్బిన ద్వేషమ్ము నందకుండు
నతనిప్రజ్ఞనే సుస్థితమండ్రు పార్థ॥

తే॥ గీ॥ అన్నివైపుల బర్వెన యంగములను
నీడ్చుకొను కూర్మమునుబోలె నింద్రియముల।
నెల్లవిషయంబు లందుండి యీడ్చుకొనెడి
అతనిప్రజ్ఞనె సుస్థితమండ్రు పార్థ॥



శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, మే 1954 కా. 1000.

# గీతావాణి

36



మూడవ సంవత్సరము  పండ్రెండవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 జూన్ 1954

# విషయసూచిక - జూన్ '54.



## విజ్ఞప్తి.

★ చాలామంది చందాలు ఈ సంచికతో ముగియగలవు. సంచిక వెంట మనిఆర్డరు ఫారం పంపబడింది. చందాలు ముగిసినవారు మనిఆర్డరు ఫారమును భర్తీచేసి పంప ప్రార్థితులు. కోరినవారికి మాత్రమే వి. పి. గా పత్రిక పంపబడును. పత్రికపై అభిమానముంచి తమ చందాలను వెంటనే పంపగలరని ఆశిస్తున్నాము.

ఆళ్లగడ్డ,
కర్నూలుజిల్లా.

మేనేజరు,
గీతావాణి ఆఫీసు.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.





మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ

మేనేజర్:

స్వామి శ్రీ శివానంద,
గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా

సంవత్సరచందా 4-0-0. * విడి పత్రిక 0-6-0

15th JUNE 1954.

# శ్రీ భగవద్గీతా సారము.

బాలకవి ఓ. నారాయణప్పగారు

## ద్వాదశాధ్యాయము — భక్తియోగము.

సీ॥ నిన్నాత్మనెదనెంచు సన్నుతాంగులు భువి
యోగివిత్తము లెవ్వరో వచింపు
మనకిరీటికి శౌరియనె పార్థ! వినుమాత్మ
నౌపాసనము జేయు టధికకష్ట
మందు కర్మలనెల్ల నర్పణంబని నాకు
జేసినన్ సద్భక్తి జింతజేయు
వారి సంసారంబు వారించి నాయందు
నైక్యంబు జేయుదు నట్టివారి

గీ॥ గాన ద్వంద్వంబులున్ బాసిమానకెదను
నన్ను జింతింపు భక్తిమై సన్నుతాంగ!
అనెడి మాధవు పల్కుల నర్థిదెలుపు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!

---

### గీతలోని చిట్కా.

ఇతరులతో సేవనుపొంది, ఇతరుల లాభాన్ని తిని — పరులకు సేవచేయక — పరులకు మేలు చేయనివాడు దొంగ.




సంపుటి 3 ★ స్వస్తిశ్రీ జయ * జ్యేష్ఠమ్. ★ సంచిక 12

# శ్రీ శంకర జయంతి

శ్రీ శంకరజయంతీ సప్తాహ మహోత్సవాలు శ్రీ గీతావాణి కార్యాలయము ఆళ్ళగడ్డయందు మహద్వైభవముగ జరిగిపోయినవి. ఆ కార్యక్రమ వార్తలను యీ సంచికలో అన్యత్ర ప్రకటించినాము.

"శంకరశ్శంకరస్సాక్షాత్" అనే ఆర్యోక్తి సర్వత్ర సుప్రసిద్ధమై ఉంది. ముప్పైరెండేండ్ల అల్పవయస్సులో అలౌకిక కార్యాలను సాధించి స్వశక్తితో జగద్గురు పీఠాన్ని అధిష్ఠించిన శ్రీ శంకరాచార్యులవారిని సాక్షాత్తు శంకరావతారమని చెప్పుటలో అతిశయోక్తి ఆవంతాలేదు.

దేశవిదేశాలల్లో యీనాటికి సైతం భారతభూమియొక్క ఉజ్జ్వల గౌరవం మిరుమిట్లు గొల్పుతూందంటే – ఆ భాగ్యానికి

కారణం, తత్త్వవేత్తలైన మహాజ్ఞానులు దయాధర్మమేనంటూ నిరాటంకంగా చెప్పొచ్చు. ఏనాటికైనా భారతమాతయొక్క కీర్తి ధ్వజాన్ని గౌరీశంకర శిఖరాలకు మరింతపైగా యెగురవేయాలంటే ఆ హక్కు — ఆ అధికారం, రాజులకు — రారాజులకు లేదు. అధికార గర్వాంధులు — ఐశ్వర్యమదోన్మత్తులగు మహారాజులకు అసలే లేదు. ఆ అధికారం త్యాగవీరులకు — మహర్షి పుంగవులకు మాత్రమే చెల్లింది.

ఈ నాడు ప్రపంచమంతా అశాంతి విక్షోభాలు అంటురోగాల వలె వ్యాపించి పోతున్నాయి. శాంతికోసం లోకనాయకులు వాచిపోతూన్నారు. విమానాలతో పరుగెత్తినాకూడా శాంతి అనేది క్షితిజ రేఖవలె మరింతా దూరమే అయిపోతూంది. శ్రీ కృష్ణుడు కాలయవనున్నివలె యీ భౌతికవాదుల శాంతియాత్ర వీరిని యే కూపంలో త్రోస్తుందో తెలదు. తత్త్వజ్ఞులైన భారతఋషులు యెలుగు మార్చి మార్చి అద్వైత సందేశాన్ని ఉద్ఘోషిస్తూన్నారు. అదే అద్వైతప్రబోధం — అద్వైతవాదం — అభేదభావన.

ఈనాటి భేదవాద — జడవాద కలుషవాతావరణానికి యీ సిద్ధాంతమే రామబాణ చికిత్స. భేదదృష్టికి మించిన దోషంలేదు; అభేదదృష్టికి మించిన గుణంలేదు. ఈ సిద్ధాంతానికి నియమబద్ధమైన ప్రణాలిక నేర్పరచి శాస్త్రీయమైన స్వరూపాన్ని నిరూపించిన మహానుభావుడు శ్రీ ఆచార్య శంకరభగవత్పాదులవారు. ఖండఖండాంతరాల్లో వేదాంతమంటేనే శ్రీశంకరులవారు జ్ఞప్తికి వస్తారు. వేదాంతమే శంకరుడు. శంకరుడే వేదాంతం. పాశ్చాత్యదేశాలల్లో శాంకరవేదాంతానికుండే పలుకుబడి తదితర వేదాంతాలకు లేదు.

శ్రీ ఆచార్యులవారి జన్మకాలానికి భారతధర్మ మొక విపరీత సంధికి గురియైయుండింది. మహానుభావుడగు బుద్ధుడు నెలకొల్పిన బౌద్ధమతము వెఱ్ఱితలలు వేసింది. జైనధర్మం వికృతమూర్తులతో వ్రాకిపోతూంది. శైవవైష్ణవ వివాదాలు పెచ్చుపెరిగాయి. గొడ్డు కర్మవాదం బలిసిపోయింది. ఆ తరుణంలో భగవత్పాదులవారు అవతరించి ఉపనిషద్గుహ్యమైన జ్ఞానవాదాన్ని ప్రకటించారు. భారతదేశానికి నల్గడల అద్వైత సిద్ధాంతానికి కోటలవలె మఠాలను స్థాపించారు. సర్వసమన్వయమూ ఉదాత్తమూనైన తన అద్వైత సిద్ధాంతానికి అనుకూలంగా ప్రస్థానత్రయంపై లలితగంభీరాలైన భాష్యాలు వ్రాశారు. శైవవైష్ణవ శాక్తసౌరగాణాపత్యాది వివిధపంథలను ఆయన అద్వైతసూత్రం ఒక్కకొలికికి తెచ్చింది.

శంకరుని ప్రజ్ఞ సర్వతోముఖమైందని మహామహులందరికీ తెలుసు. ఆతడు యుగపురుషుడు; పండితుడు; ప్రవక్త; సంస్కర్త; ఋషి. జ్ఞాని; భక్తుడు; ఆతని జన్మదినమైన వైశాఖ శుద్ధ పంచమిని మహాపర్వదినంగా గణించి యావద్భారతము తన కృతజ్ఞతలను చెల్లించింది. ఈ సుసందర్భమున కాశ్మీరం మొదలు కన్యాకుమారి వరకూ, సింధు మొదలుకొని బ్రహ్మపుత్ర వరకూ ఆ జ్ఞానదాత యొక్క కీర్తి గంగాప్రవాహం పొంగిపొర్లి పారింది. ఈ సప్తాహ సందర్భములందు యెడదెరిపిలేక ఆ మహనీయ పురుషుని గుణగానాన్ని సంకీర్తించి ఆతని సిద్ధాంతాలను ప్రజాబాహుళ్యంలో ప్రచారం చేసి మా గీతావాణి కార్యాలయము తన కనీసపు ధర్మాన్ని నిర్వర్తించుకొంది.

అద్వైత సిద్ధాంతానికి జై!

ఆచార్య శంకర భగవత్పాదులకు జై!!



(గతసంచిక 9-వ పేజీ తరువాయి)

ఈ యోగము ఉత్తమరహస్య మైనదని యీ శ్లోకమునందు చెప్ప బడినది. దాని అభిప్రాయమేమనిన- ఈ యోగము అన్ని విధములగు దుఃఖములనుండియు బంధనముల నుండియు విడిపించి పరమానంద స్వరూపుడగు పరమాత్మని సుల భ్యముగ నొనర్చుచున్నది. అందు వలన మిగుల నుత్తమమైనదియు గోపనీయమైనదియునై యున్నది. కాబట్టి అధికారులు కానివారికి దీనిని బోధింపరాదని భావము.

ఈ విధముగ చెప్పిన మాటల వలన సామాన్యముగ ప్రతివానికిని నొక శంక కల్గవచ్చును. శ్రీ కృష్ణుడు ద్వాపరయుగాంతమున పుట్టినవాడు. సూర్యుడును మన్వా దులును మిగుల ప్రాచీనకాలము నాటివారు. అట్టియెడ ఈ శ్రీ కృష్ణుడు ఆ సూర్యాదులకీ యోగము నుపదేశించియున్నాడనుట యెట్లు పొసగును? - అని సందియము పొడమవచ్చును. అట్టి సందేహమును నిరసించుకొరకును, అవతారతత్త్వ సిద్ధాంతమును నిరూపించుకొరకును ముందటి శ్లోక మారంభమగుచున్నది. నాల్గవ శ్లోకమున అర్జునుడు భగవంతుడగు శ్రీకృష్ణునిట్లు ప్రశ్నించుచున్నాడు.

"కృష్ణా! నీవు ఈ యోగమును మొట్టమొదట సూర్యునికి బోధిం చితినని చెప్పితివి. అయ్యా! ఈ దేహమును ధరించిన తర్వాత బోధించితివో! వేరొక్క దేహ ముతో బోధించియున్నావో! చెప్పు ము. ఈ దేహముతోనే బోధించి యున్నానని చెప్పెదవో - ఆ మాట పొసగదు. ఈ నీదేహము వసుదేవ దేవకులకు మొన్న మొన్న పుట్టినది. సూర్యుడు నీకంటె ఎంతో ముందు నుండియె ఉన్నాడు. ఆ సూర్యుడు నీతో ఉపదేశము బొందియున్నా డనుట యెట్లు సమంజసము? అటు కాదు. ఈ దేహముతో ఉపదేశించి

ఉండలేదు. ఈ విషయ మీ జన్మ ములో జరిగినది కాదు. గతించిన జన్మములలో వేరేదేహములో ఉప దేశించినానని చెప్పెదవేమో! వాసు దేవా! ఆ మాటకూడ నాకు ఒప్ప రానిదియై తోచుచున్నది. ఒక జన్మమందు చేసిన పనులు మరొక్క జన్మమునకు జ్ఞాపకముండగలవా? ఉండగలవన్నచో నీకువలె నాకు కూడ గతించిన జన్మములందు జరి గిన విషయములెందుకు జ్ఞప్తిలేవు? యోగసిద్ధులగు దివ్యపురుషులకు జన్మాంతర విషయములు జ్ఞప్తి యుండగలవని శాస్త్రములు నుడు వుచున్నవి. నిజమే! పోనీ — నీవు దివ్యపురుషుడవా? సూర్యుడు స్వయముగ దివ్యపురుషుడు. ఇరు వురును సమానముగ దివ్యపురు షులెయైనచో, సరిసమానులమధ్య గురుశిష్యసంబంధ మెట్లు పొసగ గలదు? గురువుయొక్క అంతస్తు శిష్యుని అంతస్తుకంటె గొప్పదై యుండవలెను. కావున, దివ్య పురు షుడగు సూర్యునకు బోధించిన నీవును దివ్యపురుషుడవేనని చెప్పుట యొప్పదు. అటుకాదేని — మరి నీవుభగవంతుడవా? భగవంతుడవే యైనచో, కర్మ పరతంత్రులగు జీవ కోట్లవలె జననమరణాది క్లేశములకు లోబడుట యెట్లు పొసగును? కేశవా! ఎంతెంత విచారించినను నీ భావమేమో స్పష్టము కాలేదు. నాపై దయయుంచి ఈ సంశయ మును తీర్చి నన్నుద్ధరింపుము."

అని యిట్లు దేహాత్మబుద్ధి కల వారి దృష్టిననుసరించి అర్జునుడు అడిగిన ప్రశ్న నాలకించి తన అవ తార తత్త్వమును ప్రబోధించుచు భగవంతుడు నుడువుచున్నాడు.

"అర్జునా! సూర్యుడు పుట్టినా డనుమాట లోకజనుల దృష్టియందె గాని, సూర్యుని దృష్టియందెట్లు రిత్తయో, అట్లే జన్మరహితుడనై కూడ సామాన్యుల దృష్టి ననుస రించి, నేను అనేక దేహములను జన్మములను ధరించినవాడుగ నగ పడుచుందును. ఆ విధముగ నా కేర్పడు అనేక జన్మములందలి సంగ తులన్నింటిని, సర్వజ్ఞుడను సర్వశక్తు డను యీశ్వరుడను నగుటంబట్టి నేను తెలుసుకొనగల్గుదును. అంతే కాదు; నీకును నానాజీవులకును కలి గిన వివిధజన్మములందలి సమాచార ములను సైతము నేను గుర్తింపగల్గు దును. పార్థా! నీ జ్ఞానశక్తి అజ్ఞా నముచే ఆవరింపబడియుండుటచేత నీవు వాటిని తెలియజాలవు. నీ విష యములనె నీవు గ్రహింపనేర

వన్నచో తదితరజీవుల జన్మాంతర విషయముల నెట్లు తెలియజాలుదువు?”

ఈ చోట నొక శంక గల్గుటకు అవకాశమున్నది; కాబట్టి అర్జునుడు అడుగుచున్నాడు.

“కృష్ణా! జన్మాంతరములందలి విషయములను తెలిసికొనుట మాత్రముతో ముఖ్య సర్వజ్ఞత్వము సిద్ధింపదు. ముఖ్య సర్వజ్ఞత్వము యీశ్వరునియందే ఉండగలదు. పూర్వకాలమున వామదేవుడను ఋషి తల్లి కడుపునందున్నప్పుడే తనకు గతించిన జన్మములందలి విషయములను యిట్లు స్మరించెనట. ‘నేను పూర్వము మనువునై యుంటిని. సూర్యుడనై యుంటిని, ఋషియునై యుంటిని’ అని యిట్లు గతజన్మవృత్తాంతములను గర్భస్థితుడయ్యె వామదేవుడు తలపోయువాడట. ఇట్లు జన్మాంతర విషయములను జ్ఞప్తి చేసుకొన్న మాత్రమున ముఖ్య సర్వజ్ఞత్వము సిద్ధింపజాలదు. ముఖ్య సర్వజ్ఞత్వము జీవులందుండదు. వ్యష్టి ఉపాధిగలవారికె జీవుడనిపేరు. జీవుడు పరిచ్ఛిన్నుడు. పరిచ్ఛిన్నుడగు జీవునికి భూత భవిష్యద్వర్తమానములలోని సమస్త పదార్థములతో సార్వత్రిక సంబంధము సంభవింప నేరదు. సంబంధము. లేక వాటిజ్ఞానమును పొందుటకు వీలుండదు. ఇది జీవునిగురించిన విషయము. మరియు సమష్టిస్థూల అభిమానియగు విరాట్టును, సమష్టి సూక్ష్మ ఉపాధిగల హిరణ్యగర్భుడును సైతము సమస్తపదార్థముల తోడి సంబంధమును పొందియుండరు; కాబట్టి సర్వజ్ఞత్వముకూడ వారికి సంభవింపజాలదు. ఎందుకనిన – సమష్టి స్థూలోపాధి కల్గిన విరాట్టునకు స్థూలభూత కార్యములకు సంబంధించిన విషయజ్ఞానమె సంభవించును. కాని, సూక్ష్మభూత విషయజ్ఞానముకాని, సమస్తమునకును మూలకారణమగు మాయయొక్క పరిణామ విషయక జ్ఞానముకాని కల్గనేరదు. ఈ విధముగనె సమష్టి సూక్ష్మోపాధిగల హిరణ్యగర్భునకును, స్థూలభూతపరిణామవిషయక జ్ఞానమును, సూక్ష్మభూత పరిణామ విషయకజ్ఞానమును మాత్రమె కల్గనేర్చునె; కాని, ఆ స్థూల సూక్ష్మ భూతములకు కారణమైయుండు మాయయొక్క పరిణామ విషయక జ్ఞానము కల్గనేరదు. కావుననే విరాట్టునందును హిరణ్యగర్భునందును

ముఖ్యసర్వజ్ఞత్వ ముండజాలదు. అట్టియెడ, వ్యష్టి ఉపాధిగల జీవునందు ముఖ్యసర్వజ్ఞత్వమెట్లు సంభవింప గల్గును? అందువలన మాయ యనెడి కారణోపాధి గలవాడును, భూతభవిష్యద్వర్తమాన పదార్థ విషయకజ్ఞానము గలవాడుననగు యీశ్వరునందే ముఖ్యసర్వజ్ఞత్వము సిద్ధింపగలదు. అయినను, జన్మ మరణరహితుడును నిత్యసర్వజ్ఞుడుననగు ఈశ్వరునందు పుణ్యాపాపకర్మములు ప్రవర్తింపజాలవు; కాబట్టి ఆయనకు జన్మమేపొసగదు. జన్మమేలేనివానికి జన్మాంతరవిషయముల జ్ఞప్తితో పనేమి? కృష్ణా! నీవు యీశ్వరుడవైనచో జన్మమెట్లు కల్గగలదు? జీవుడవైనచో సర్వజ్ఞత్వ ముండదుగదా! ఈ సందేహమును బాపు''మని అర్జును డాడినమాటకు ముందటి శ్లోకమున భగవంతుడు సమాధాన మొసగ వలసియున్నది.

జన్మమరణములననేమి? ముందింతవరకులేని దేహేంద్రియాదులను ధరించుట జన్మమందురు. ఉండెడి దేహేంద్రియాదుల నెడబాయుట మరణమందురు. ఈ జన్మమరణముల రెంటికిని, నైయాయిక మతమునందు ప్రేత్యభావమని పేరు. వీటినిగూర్చి గడచిన రెండవ అధ్యాయమున "జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ" యని చెప్పబడినది. ఈ జన్మమరణములు జీవునికి ధర్మాధర్మవశమున ప్రాప్తించినవి. దేహాభిమానముగల అజ్ఞానజీవులయందె ధర్మాధర్మములు ప్రవర్తింపగలవు; కారణ మేమనిన — కర్మములయందు అధికారము వారికే విధింపబడినది కాబట్టి.

దేహధారణరూపమగు జన్మము సర్వజ్ఞుడగు యీశ్వరునకు సంభవింపబోదు. ఈశ్వరుని శరీరము స్థూలభూతకార్యమై వ్యష్టిరూపమై యున్నచో, జాగ్రదవస్థాభిమాని యగు విశ్వనామక జీవునివంటివాడు కావలసివచ్చును. వ్యష్టిరూపుడు గాక, సమష్టిరూపుడైనచో విరాట్టు నాబడును. అటుగాక, ఈశ్వరుని శరీరము సూక్ష్మభూతకార్యమై వ్యష్టిరూపమైనచో స్వప్నాభిమాని యగు తైజసనామక జీవునకు సమానుడు కావలసియుండును. వ్యష్టి రూపుడుగాక సమష్టి సూక్ష్మరూపుడైనచో హిరణ్యగర్భునకు సముడు కాగలడు.

పై కారణముల నూహించి భగవంతుడు "అజోఽపి స

న్నవ్యయాత్మా భూతానామీశ్వ రోఽపి సన్"అని నుడివియున్నాడు. దేహగ్రహణమనెడి జన్మమును, దేహవియోగమనెడి మరణమును లేక, బ్రహ్మాది స్తంబపర్యంత చరాచర భూతములకు యీశ్వరుడై తానున్నానని చెప్పుటవలన భగవంతుని దేహము ధర్మాధర్మవశమై యుండుటలేదనుట తెల్లము. జన్మమరణములు కలిగి పరాధీనుడగు జీవుడే ఆ ధర్మాధర్మములకు వివశుడై యుండును; కాని స్వతంత్రుడగు యీశ్వరుడు వశపడడు.

జన్మమరణాది వికారములులేక స్వతంత్రుడగు యీశ్వరునకు దేహధారణ మెట్లు సంభవించుననెడి మాటకు సమాధానముగ "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామి" అని భగవంతుడు నుడివియున్నాడు.

"అర్జునా! భగవంతుడనగు నేను జన్మమరణాది వికారములు లేనివాడనయ్యు, నాకు ఉపాధిరూపమై యుండునదియు — విచిత్రశక్తి సమన్వితమైనదియు, అఘటన ఘటనాఘటీయసి యనబడునదియునగు సత్వరజస్తమో రూపమైనదియ నగు మాయాప్రకృతిని తన చిదాభాస మార్గమున వశమొనర్చుకొని దానియొక్క పరిణామ విశేషముల వలన దేహధారినివలె జన్మమెత్తిన వాడనువలె గోచరించుదును.

ఉత్పత్తిలేనిది కాబట్టియే అనాది యనబడెడి మాయయే పరమాత్ముడనగు నాకు ఉపాధియై యున్నది. ఆమాయయందు వ్యావహారికసత్తా ఉండుట బట్టి నిత్యమనిపించుకొన్నది. ఈ మాయవలననే పరమాత్ముడనగు నాకు జగత్కారణత్వ మేర్పడినది. ఈ మాయాశక్తి స్వతంత్రముకాదు. నా ఇచ్ఛవలన ప్రవర్తించుచున్నది. ఈ మాయయే విశుద్ధ సత్వరూపమువలన నాకు ఉపాధియైనది. ఆ మాయోపాధితో కూడిన నేను సర్వభూతములకు యీశ్వరుడనై ప్రవర్తించుచున్నాను. అట్టి శుద్ధసత్వ ప్రధానమాయ యనెడి నిత్యదేహమువలన పరమాత్ముడనగు నేను సృష్టియొక్క ఆదికాలమునందు సూర్యునకును, ప్రస్తుత వర్తమానకాలమున అర్జునుడవగు నీకును ఈ జ్ఞానయోగమును ఉపదేశించి యున్నాను."

భగవంతుడు చెప్పిన యీ విషయమును శ్రుతికూడ "ఆకాశ శరీరం బ్రహ్మ" అని బలపరచినది. ఆకాశ మనబడెడి అవ్యాకృతమే శరీరమై యున్నదని అర్థము. దీని వలన బ్రహ్మమునకు మాయతో

శరీరమని తెలియవచ్చుచున్నది.

భగవంతునకు భౌతికశరీరమే లేనిచో — మాయయే అతనికి శరీరమని చెప్పినచో, భౌతిక శరీర ధారి యగు మానవునకుగల మనుష్యత్వాది ధర్మము లాతనియందు తోచుటకు కారణమేమని శంకింపవచ్చును. అందుకు సమాధానముగ "ఆత్మమాయయా" అని భగవంతుడు నుడివియున్నాడు. ఆతని యందగపడు మనుష్యత్వాది ధర్మములు వాస్తవములు కావనియు మాయా ప్రభావమున ప్రపంచ దృష్టికి గోచరించునవి మాత్రమె యనియు గ్రహించవలెను. ఇదే విషయము మోక్షధర్మము నందును—

శ్లో॥ "మాయా హ్యేషా మయా సృష్టా
యన్మాం పశ్యసి నారద।
సర్వభూతగుణైర్యుక్తం
న తు మాం ద్రష్టుమర్హసి॥"

అని చెప్పబడినది. "ఓ నారదా! నీ చర్మనేత్రములకు గోచరించెడి ఈ శరీరమును నేను మాయా వలన నిర్మించి యున్నాను. నా మూల స్వరూపము నీ చర్మనేత్రములకు గోచరించునది కాదు."

మరియు భగవంతుడగు భాష్యకారుడు సైతము, నానాశక్తులతో గూడియుండునదగు మాయ యనెడి నిత్యకారణోపాధియె పరమేశ్వరుని దేహమని నిరూపించి యున్నారు.

ఇట్లు అనేక ప్రమాణముల మూలమున పరమాత్మ్మడు వాస్తవముగ జన్మమరణాది వికారములు లేనివాడయ్యు సర్వజగత్ప్రకాశకుడయ్యు, మాయకు అధిష్ఠాన భూతుడై ఈశ్వరుడనబడు చున్నాడు. 'స్వాం ప్రకృతిం'— అనగా తన స్వరూప భూతమైన, సచ్చిదానంద ఘనమైన ఏకరసమైన స్వభావమనెడి ప్రకృతిని, 'అధిష్ఠాయ' అనగా ఆశ్రయించి, తన స్వరూపమును పరిత్యజింపకయే— 'సంభవామి' అనగా, దేహదేహిభావము లేకున్నను లోక ప్రసిద్ధమగు జీవుల వలె 'ఈ పరమేశ్వరుడు దేహమును కల్గియున్నాడు' అనెడి లోకవ్యవహారమునకు గురియగుచున్నాడు.

[signature]

~~~~~~
~~~~~~

# శ్రీ ఆదిశంకరుల అమరసందేశం.

సౌభాగ్యవతి పార్వతీదేవిగారు.

★

శాస్త్ర పరిజ్ఞానమే ప్రాధాన్య ముగగల నవయుగమున శ్రీ ఆది శంకరుని గూర్చి విమర్శించి అర్థము చేసికొనుట అవసరము. ఇటుల చేయుట — ఆయన హైందవమత సంస్కర్త యనెడి అభిమానము మాత్రమువల్లనె కాదు. శ్రీ శంకరులు మానవ హృదయము నాకక్షింప సత్యమును ప్రకాశముగ వెల్లడించి జేయగల్గుట వలన, అందువలననే శంకరాచార్యులు విశాల ప్రతిభావంతులని ప్రపంచమున చిరస్థాయిగ నెన్నిక గాంచిరి. ఆయన తన యొక్క వ్యాఖ్యానములందు ఆనాటి హైందవ సంప్రదాయముల వలన హిందూమతమునకు సంక్రమించిన దురాచారముల మాపి హైందవ మతమును రాణింప జేయుటకు మహాత్ప్రయత్న మొనర్చెను. ఆ బ్రహ్మాండ కృషిని సాధించుటకై తానంతటి ప్రతిభావంతుడైనను, ఆయన సామాన్య మానవుని నైతిక పరిణామములకు అనుకూలముగ బోధించెను. అట్టివారె కదా ప్రజ్ఞానిధులు!

శంకరాచార్యుని అపూర్వప్రజ్ఞ, యేమన, తన పరిసరములనుండి, వానియందలి మంచిని గ్రహించి అలవరచుకొనుట. ఈ అపూర్వ ప్రజ్ఞ మహనీయులగు హైందవ పుణ్యపురుషులకు నైజస్వభావమే కాబోలు. అందువలననే వారు వేదములను ఆదర్శ ప్రమాణముగ నెంచుకొనిరేగాని, బైబిలుయొక్క అనుచరులవలెగాని, ఖొరాన్ అనుచరులవలెగాని మూఢాగ్రహము తో వారి శాస్త్రములో గీచిన గీతను దాటరాదనెడి నిబంధనను కల్గియుండలేదు. అందువలననే వారు వేదములను విధి, విధిశేష (అర్థవాద) ములని రెండుగ విభజించిరి. కొందరు వాటి ఉపయోగము నెఱుగలేక తప్పుత్రోవల బడిపోయిరి. అట్టి వారిలో ప్రసిద్ధుడగు జైమిని మహర్షి యొకడు. ఆయన వేద కాండములగు మంత్రములను — ఉపనిషత్తులను కూడ విధిశేషముల క్రింద పరిగణించెను. ఈ అపార్థము ఆయనను సత్యార్థమునకు దూరము చేసినది; మానవుని జీవితముపై వేదములకు గల శక్తిని గ్రహింప నిచ్చినది కాదు.

శ్రీ శంకరులు కూడ ఆచార్య జైమిని ప్రవేశపెట్టిన మార్పుల

కొన్నిటి నంగీకరించినను ఆయన భావములు మాత్రము వేరై యుండెను. వేదములు సత్యమును వెల్లడించి మానవుని జీవితమును సత్యపథమున నడుపజేయుననిగ శంకరుని ఉద్దేశ్యమైయుండ జైమిని యొక్క ఉద్దేశ్యమందు వేదములు ఆజ్ఞాపూర్వకములై అనుకరణ పూర్వకములు కానివని యుండెను. కనుకనే జైమినియొక్క ఉద్దేశ్యమందు కర్మకాండ ముముక్షుత్వమునకు కామధేనువు వంటిదని. శంకరుడు కర్మకాండకంటే జ్ఞానకాండకే ప్రాధాన్యమొసగెను. కర్మకాండ ఆత్మజ్ఞానమునకు తొలి పలుకు వంటిది. అటుపిమ్మట సాధన అత్యావసరము.

శ్రీ శంకరాచార్యుల భావములు గ్రుడ్డి నమ్మకములకు ఆస్కారమిచ్చునవి కావు. అవి ప్రత్యక్ష ప్రమాణమునకు నిలబడజాలునవి. శాస్త్ర ప్రపంచముయొక్క అభిలాష బాహ్య ప్రకృతియొక్క నిజ రహస్యములను వెల్లడించుటై యుండ ఆత్మజ్ఞాన వేత్తలయొక్క అభిలాష, దానికన్నను అద్భుతములగు మానవుని గుప్తరహస్యముల వెల్లడించుటై యున్నది. నవయుగమున శాస్త్రజ్ఞానము సర్వోత్కృష్టమైన స్థితియందున్నది. మానవుని స్పర్శ, దృష్టికి అతీతమైనట్టి అణువు (Atom) ను సాధించగల్గినది. ఇటులనే మహాత్ములగు ఋషులును అత్యుత్కృష్టమగు ఆత్మరహస్యములను సాధించిరి. వేదములు వెల్లడించిన సత్యములను వారు ప్రత్యక్షముగ తేటపఱచుకొనిరి. కనుకనే శాస్త్రవేత్తలయొక్క అణుశక్తి కన్నను, మహాత్ములయొక్క ఆత్మశక్తి ఘనమైనదని తెలియజేయుచు మొన్న మొన్నటి గాంధీమహాత్ముని జీవితము మనకు నిరూపించినది.

శ్రీ శంకరులను మనము ఆత్మవిజ్ఞానమునగొప్ప శాస్త్రవేత్తలక్రింద పరిగణించవచ్చును. శాస్త్ర ఫలితము పునర్విమర్శింపజాలినదియు, సర్వత్ర ఒక్కటియై యుండునదియు గనుక అటులనే శంకరుని ఉద్దేశ్యమున బ్రహ్మజ్ఞానముకూడ ప్రత్యక్షముగ అనుభవింప జాలినదియు నిజమైనదియు నై యున్నది. కాని ఆ బ్రహ్మానందమనుభవించు మహాత్ములు శ్రీ రామకృష్ణ పరమహంస బోంట్లు లేకొద్ది మందిరయి యున్నారు.

ప్రకృతి శాస్త్రప్రమాణ మెటుల అంతటను ఒకటే నిదర్శన మైనను

[ మిగత 15-వ పుటలో ]

ఓమ్.

# గీతారహస్యము.

లేఖకుడు:-'కథన కళాప్రపూర్ణ' పండిత నోములఅప్పారావు, కాకినాడ (ఆంధ్ర)

★

భగవద్గీతలో "రహస్యము చెప్పబడుచున్నది." "ఇది మిక్కిలి గుహ్యమైనది." మొదలగు వాక్యములు పలుచోట్ల కనబడుచుండును. అందు రాజవిద్యా రాజగుహ్యయోగమను తొమ్మిదవ యధ్యాయమున నొకవాక్యమును చెప్పుచు నిది మిక్కిలి రహస్యమని చాలగ వర్ణింపబడియున్నది. అంతియకాదు. ఆ వాక్యమందలి యర్థము ననుసరించినవారు జననమరణరూప సంసారమునుండి విముక్తులగుదురనియు, అనుసరించనివారట్టి లాభమును బొందలేరనియు జెప్పబడుటచేత నదియే గీతారహస్యమని నిర్ణయింపవచ్చును. శ్రీకృష్ణభగవానులు మిక్కిలి రహస్యమని చెప్పిన వాక్యమెద్దియన

"మయా తతమిదం సర్వం
జగదవ్యక్తమూర్తినా"

(నేను వ్యక్తముగాని రూపముతో జగమంతయు వ్యాపించియున్నాను.)

(భ. గీ. అ. ౯ శ్లో. ౪.)

ఉపనిషత్తులలో మొదటిదగు నీశావాస్యోపనిషత్తున మొదటిమంత్రమీ వాక్యార్థమునే "ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్" అని పదముల భేదమున జెప్పుచున్నది. గీతాశాస్త్రముపనిషత్సారమే కావున నిదియే గీతారహస్యమనుట నిశ్చయము.

అయితే గీతలో చెప్పబడిన ప్రకారము జగమంతయు భగవానునిచే నిండియుండి నట్లయిన నాతడు కనబడడేమి? యను ప్రశ్నము వచ్చును. దానికి సమాధానముగ "అవ్యక్తమూర్తినా" కనబడని (వ్యక్తము కాని) రూపముగనున్నట్లు చెప్పబడిన వాక్యమును జెప్పుకొనవచ్చును. అనగా నవ్యక్తరూపముగ భగవంతుడు సర్వదా సర్వత్ర విరాజిల్లుచున్నాడని గీతాసందేశము. కనులకు గనబడని వాయువును వీవనచే విసరుకొని త్వగింద్రియము ద్వారా తెలిసికొనుచున్నట్లు, నీటిలో గలిసి కనులకు గోచరించని చక్కెరను నోటిలో వేసికొని నాలుకతో గ్రహించ గలుగుచున్న విధమున, దివ్యచక్షువగు సాధకుడు నేత్రాదీంద్రియములకు గోచరముగాని భగవంతుని సాధనముల ద్వారా సందర్శింపగలడు. భగవత్సాక్షాత్కారము దుర్ఘటము మాత్రము కాదని గీతాశాస్త్రము పరోక్షముగ బోధించుచున్నది. అంతియ కాదు. ఆ జగన్నిలయుండగు దేవుని సాక్షాత్కరించుకొనుటకు సాధనము లక్కడక్కడ వివరించినది. "ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా" ......... మొదలగు శ్లోకములట్టి సాధన ప్రదర్శకములే.

భగవత్సాక్షాత్కారమునకు సాధనములనేకములున్నను, "లక్ష్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" అనునుపనిషద్వాక్యము ననుసరించి బుద్ధీంద్రియ నైర్మల్యమునది ముఖ్యమని గోచరించుచున్నది. అట్టిబుద్ధి నిర్మలత్వమును సంపాదింపక కేవల వాగ్వివాదంబునను వాదోపవాదములతో, తార్కికబలమున

శాస్త్రపాండిత్యమున లక్ష్యసిద్ధినిసంపాదింప
బూనుట సాహసమే యగును. కావున చిత్త
మున గుణకర్మ సంయోగమున జేర్పడిన
మలములను బోగొట్టుకొనుటకు తగు సాధన
ముల నొనర్చుచు, చిత్తవిక్షేపకరములగు
దేహాత్మభావన, విషయానురక్తి, ఇంద్రియ
లోలత్వము, దుస్సాంగత్యము, గ్రామ్య
కథావివశత్వము, అసత్యభాషణము, అసహ
నము, బహుభాషిత్వము, హింసాభిరుచి
మొదలగువానిని విడనాడవలసియుండును.
వివేకమును రేకెత్తించు సత్యభాషణము,
ఇంద్రియనిగ్రహము, వైరాగ్యము, విషయ
వైముఖ్యము, నియమప్రవర్తనము, విధే
యత, గురుశుశ్రూష, అమానిత్వము, నిష్క
పటము, సహనము, అక్రోధము మొదలగు
సద్గుణముల నవలంబింపవలయును. గీతా
రహస్యమగు సర్వత్రాత్మేశ్వరాన్వేక్షదురా
చారవిరమణమువలనను, సదాచారావలం
బనమువలనను ప్రాప్తించగలదనియు, పర
మేశ్వరుని సాక్షాత్కరించుకొని నిరవధిక
మగు తదీయానందమున నోలలాడుటయే
మానవజీవిత లక్ష్యమనియు, నీ తత్త్వమును
పరోక్షముగ నెఱిగించుటయే గీతారహస్య
మనియు ప్రాజ్ఞులు తెలిసికొందురుగాత. అట్టి
విజ్ఞానసహనములా ఈశ్వరునిచే ననుగ్రహిం
పబడి మానవులు కృతార్థులయ్యెదరుగాత.

"యర్హ్యబ్జనాభచరణేషణయోరుభక్త్యా
చేతోమలాని విధమేద్గుణకర్మజాని।
తస్మిన్విశుద్ధ ఉపలభ్యత ఆత్మతత్త్వం
సాక్షాద్యథామలదృశోః సవితృప్రకాశః॥

[ 13_వ పేజీ తరువాయి ]

ఏకైకమైనది కానటుల మహాత్ముల
విశేషములును పలుమారు సంభ
వించునవి కాని ఏకైకములు కావని
శంకరుని ఉద్దేశ్యము. అమెరికాలో
సాధించినదియు, రష్యాలో సాధించి
నదియునగు అణుశక్తియెటుల ఒకటే
గాని వేరుకాదో, అట్లే యూరపులో
జన్మించిన క్రీస్తుయొక్కయు, మధ్య
ఆసియాలో జన్మించిన మహమ్మదు
యొక్కయు ఆత్మశక్తిఒక్కటే కాని
వేరుకాదు. శంకరాచార్యుని
ఉద్దేశ్యమున యిట్టి పుణ్యపురుషులు
పలుమారు మానవులందు కల్గుచుం
దురే; కాని, ఏకైక విధానమగు
పరంధామముగ నెన్నబడరాదు.

శ్రీ శంకరాచార్యుల ఉద్దేశ్య
ములు నవయుగమున కనుగుణ్య
ముగ నున్నవి. ఆయనయొక్క భావ
ములు ఆ మధ్యయుగమునకు అంద
రానివై యుండెను. అదియు గాక
శంకరాచార్యులవారి వ్యాఖ్యాన
ములు వానియందలి భాష గొప్ప
సంస్కృత పండితులకే కాని సామా
న్యులకు అతీతమైనది. అటులని
మన మిప్పుడుకూడ యింకను శంక
రునిగూర్చి అంధకారములో నుండు
ట భావ్యముకాదు. ఆయనయొక్క
భావములను సులభశైలిలో లోక
మునకు అందజేసినచో గొప్పసేవ
చేసినవార మగుదుము.

# సానువాదశంకరభాష్యసమలంకృతము
## శ్రీమద్భగవద్గీత
అనువాదకులు
## శ్రీ స్వామి శుద్ధచైతన్య జీ.

( గత సంచిక 16 వ పేజి తరువాత )

★

భా:- శీతోష్ణాదీన్ సహతః కిం స్యాత్ ఇతి శృణు —

అను:- శీతోష్ణాదులను సహించుకొనువానికేమి ఫలంబు గలుగుననిన వినుము—

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ 15

భా:- యం హి పురుషం సమదుఃఖసుఖం సమే దుఃఖసుఖే యస్య తం సమదుఃఖసుఖం సుఖదుఃఖప్రాప్తౌ హర్షవిషాదరహితం ధీరం ధీమన్తం న వ్యథయన్తి న చాలయన్తి నిత్యాత్మదర్శనాత్ ఏతే యథోక్తాః శీతోష్ణాదయః సః నిత్యాత్మదర్శననిష్ఠః ద్వన్ద్వసహిష్ణుః అమృతత్వాయ అమృతభావాయ మోక్షాయ కల్పతే సమర్థః భవతి.

అను:- సుఖదుఃఖంబులయెడ సముండగు — సుఖదుఃఖంబులు గలుగ హర్షవిషాదంబులజెందని — ధీరుండగు (బుద్ధిమంతుండగు) నేపురుషుని వెనుక దెలిపిన లక్షణంబులుగల యీ శీతోష్ణాదులు నిత్యంబయిన యాత్మయొక్క దృష్టినుండి కదల్పజాలవో, అట్టి నిత్యంబయిన ఆత్మధర్మంబున నిలుకడనొందినవాఁడై శీతోష్ణాది ద్వంద్వంబుల సహించుకొనగలిగినట్టివాడు అమృతభావంబు కొఱకు — మోక్షంబుకొఱకు — సమర్థుఁడగుచున్నాడు. (శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములను ఆత్మయందధ్యసించుకొనని జ్ఞాని ముక్తిం జెందును.)

భా:- ఇతః చ శోకమోహౌ అకృత్వా శీతోష్ణాదిసహనం యుక్తం యస్మాత్.

అను:- ఇందువలనగూడ శోకమోహముల నొందక శీతోష్ణాదులను (సుఖము దుఃఖము మున్నగువానిని)సహించుట యుక్తము.ఎందువలననిన—

నాసతో విద్యతేఽభావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ 16

భా:- నాసతః అవిద్యమానస్య శీతోష్ణాదేః సకారణస్య న విద్యతే నాస్తి భావః భవనమస్తితా. న హి శీతోష్ణాది సకారణం ప్రమాణైః నిరూప్యమాణం వస్తు సంభవతి.

అను:- అసత్తు (అసత్యము)లగు శీతోష్ణాదులకుగాని, వానికి కారణమైన దానికి (ప్రకృతికి)గాని భావము (ఉనికి) లేదు. శీతోష్ణాదులను గాని, వానికి కారణమైనదానినిగాని (ప్రత్యక్షాది) ప్రమాణములచే బరిశీలించిచూడ వస్తువు (సత్యము)గా ఉండుటయే సంభవింపదు.

భా:- వికారో హి సః వికారశ్చ వ్యభిచరతి యథా ఘటాది సంస్థానం చక్షుషా నిరూప్యమాణం మృద్వ్యతిరేకేణ అనుపలబ్ధేః అసత్ తథా సర్వో వికారః కారణవ్యతిరేకేణ అనుపలబ్ధేః అసన్.

అను:- ఎట్లన అవి వికారము (కార్యము)లయి యున్నవి. వికారములు వ్యభిచారము* గలవి. ఎట్లన, ఘటాద్యాకార సంనివేశమును నేత్రముతో బరిశీలించిచూడ మృత్తికకంటె వేఱుగా సత్తగలది యయియుండుటలేదు. ఇట్లే కార్యమైనదేదియును కారణమైన దానికంటె వేఱుగానుండుటలేదు. అందువలన అసత్యమైయున్నది.

భా:- న నీలోత్పలవత్ సన్ ఘటః సన్ పటః సన్ హస్తీ ఇతి ఏవం సర్వత్ర.

అను:- నీలోత్పలము (నీలమువంటి వన్నెగల కలువ) వలె కాదు. మఱెట్లన, ఘటము (కుండ) ఉన్నది, పటము (వస్త్రము) ఉన్నది, గజము (ఏనుగు) ఉన్నది అని యిట్లే సర్వత్ర (రెండు బుద్ధులు గోచరమగుచున్నవి).

భా:- తయోః బుద్ధ్యోః ఘటాదిబుద్ధిః వ్యభిచరతి తథా చ దర్శితమ్. న తు సద్బుద్ధిః.

అను:- ఈ రెండుబుద్ధులలో ఘటము మున్నగువాని (ని గోచరింప జేసి కొనెడి) బుద్ధి వ్యభిచారముగలది యగుచున్నది. ఈ విషయము ను తెలిపితిమిగూడ. సద్బుద్ధియో (ఉన్నది అనెడి బుద్ధియో) అట్టిదిగా లేదు.

* కార్యమైనది కారణమైనదానికంటె వేఱుగా సత్త (ఉనికి) లేనిదిగా నుండుట.

భా:- తస్మాత్ ఘటాదిబుద్ధివిషయః అసన్ వ్యభిచారాత్. న తు సద్బుద్ధివిషయః అవ్యభిచారాత్.

**అను:—** అందువలన ఘటాదిబుద్ధికి విషయమగునది (ఘటము మొదలైనది) వ్యభిచరించుటవలన అసత్యమైనదియగును. సద్బుద్ధికి విషయమగునదియో (ఉన్నది ఉన్నది అనెడి ఆ యునికియో) వ్యభిచరించుటలేదు♦ కాన అసత్యమగునది కాదు.

భా:- ఘటే వినష్టే ఘటబుద్ధౌ వ్యభిచరన్త్యాం సద్బుద్ధిః అపి వ్యభిచరతి ఇతి చేత్.

**అను:—** ఘటమునశింప ఘటబుద్ధియు నశించినదికాగా సద్బుద్ధియు నశించునదే యగునుగదాయనిన.

భా:- న పటాదౌ అపి సద్బుద్ధి దర్శనాత్. విశేషణవిషయా ఏవ సా సద్బుద్ధిః.

**అను:—** అటులకాదు. ఏలన, పటాదుల (వస్త్రము మొదలైనవాని) యందు సయితము సద్బుద్ధి కనబడుచునేయున్నది. ఆ సద్బుద్ధి కేవలము విశేషణమునే గోచరింప జేసికొనునదియయియున్నది.

భా:- సద్బుద్ధివత్ ఘటబుద్ధిః అపి ఘటాన్తరే దృశ్యతే ఇతి చేత్.

**అను:—** (అట్లైన) సద్బుద్ధివలెనే ఘటబుద్ధియు (ఒకఘటము నశింప) మఱొకఘటమునందు కనబడుచున్నదిగదాయనిన.

భా:- న పటాదౌ అదర్శనాత్.

**అను:—** అటులకాదు. (ఘటబుద్ధి) పటము మున్నగువానియందు* కనబడుటలేదు.

భా:- సద్బుద్ధిః అపి నష్టే ఘటే న దృశ్యతే ఇతి చేత్.

**అను:—** సద్బుద్ధియు ఘటము నశింపగా కనబడుటలేదుగదాయనిన.

భా:- న విశేష్యాభావాత్. సద్బుద్ధిః విశేషణవిషయాసతీ విశేష్యాభావే విశేషణానుపపత్తౌ కిం విషయా స్యాత్ న తు పునః సద్బుద్ధేః విషయాభావాత్.

**అను:—** అటులకాదు. ఏలన, (అచట) ఘటరూపమైన విశేష్యము లేకపోయినది యగుచున్నది. సద్బుద్ధి విశేషణమును గోచరము చేసుకొనునదిగానున్నది. (ఘటరూపమైన) విశేష్యములేక విశే

---

♦ సదా సర్వత్ర ఏకరూపముగలదిగా యుండుచున్నదని యర్థము.

* 'ఘటము' అనెడి బుద్ధి పటమునందులేదు. 'పటము' అనెడి బుద్ధి ఘటమునందు లేదు. 'ఉన్నది' అనెడి బుద్ధియో ఘటమునందును కలదు. పటమునందును కలదు.

షణము సంభవింపదు; కావున అయ్యది (సద్బుద్ధి) దేనిని విష యముగా చేసికొనునది యగును? విషయము లేనందువలన సద్బుద్ధికిమాత్రము లేమి సంభవింపదు. (అపుడది నిర్విషయ ముగా◆ ఉండిపోవునది యగుచున్నది.)

భా:- జన్మప్రధ్వంసాభ్యాం ప్రాక్ ఊర్ధ్వం చ అనుపలబ్ధేః.

అను:- జన్మించుటకుముందును నశించిన పిమ్మటను (కార్యమైనది) కనబడుటలేదు; కావున అసత్యమయినదని భావము.

భా:- మృదాదికారణస్య తత్కారణస్య చ తత్కారణవ్యతిరేకేణ అనుపలబ్ధేః అస త్త్వమ్. తదసత్త్వే చ సర్వాభావప్రసఙ్గః ఇతి చేత్.

అను:- మృత్తిక మున్నగుదానికి కారణమైనదిగాని, ఆ కారణమునకును కారణమైనదిగాని దానికి కారణముగా నుండుదానికంటె వ్యతి రేకముగా కనబడనందున అసత్యమయియున్నది. ఇట్లు దానికిని ఏది కారణముగానుండునో అదియును లేకపోగా సమస్తము లేక పోవుట (సర్వశూన్యమగుట) సంభవించునుగదా యనిన.

భా:- న సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధేః సద్బుద్ధిః అసద్బుద్ధిః ఇతి.

అను:- అటులకాదు. ఏమన, సర్వత్ర సద్బుద్ధి (ఉన్నది అనెడిబుద్ధి), అసద్బుద్ధి (లేదనెడిబుద్ధి) అని యిట్లు రెండుబుద్ధులు కనబడు చున్నవి.

భా:- యద్విషయా బుద్ధిః న వ్యభిచరతి తత్ సత్ యద్విషయా బుద్ధిః వ్యభిచరతి తత్ అసత్ ఇతి సదసద్విభాగే బుద్ధితన్త్రే స్థితే (సతి).

అను:- దేనిని గోచరింపజేసికొనెడి బుద్ధి* వ్యభిచారముగలది కాదో అట్టివస్తువు సత్యమైనదియగును. దేనిని గోచరింపజేసికొనెడి బుద్ధి

◆ సువర్ణాభరణమును కరగింప అపుడచట ఏ యాభరణబుద్ధి కలుగును? ఇది ఫలానా ఆభరణము అనెడిబుద్ధి నశించినను సువర్ణముమాత్రము నిర్విశేషముగా ఉండియే యున్నది. అటులనే ఘటపటాదులు నశించినను 'ఉన్నది' అనెడి బుద్ధి నిర్విశేషముగా ఉండిపోవుచున్నదని భావము. ఎట్లన సర్వకార్యము 'ఉనికి'యందే కల్పితమయి యున్నది.

* వృత్తిజ్ఞానము.

వ్యభిచారము♦ గలది యగునో, అట్టివస్తువు అసత్యమైనది యగును. ఇట్లు సదసద్విభాగము బుద్ధికధీనమయి యున్నది; కాఁగా.

భా:- సర్వత్ర ద్వే బుద్ధీ సర్వైః ఉపలభ్యేతే సమానాధికరణే.

అను:- (ఇట్లు) సర్వత్ర సర్వులకు రెండుబుద్ధులు † ఒకే యధికరణము (విషయము)న కాఁబడుచున్నవి.



# సమదర్శనము. 

 మూలం:- స్వామి శ్రీ శివానందజీ, హృషీకేశం.
అనువాదం:- శ్రీ ఆర్. రాధాకృష్ణయ్య.

సమదర్శనావస్థ చాల అపార్థము చేయఁబడినది. సమదృష్టి, సకల జీవులలో నొక్కటిగనే యున్న చైతన్యమునకు, అనగా ఆత్మకు సంబంధించినది. వరాహములకు సీమరేగుపండ్లను, లేక ద్రాక్ష ఫలములను ఇచ్చుట సమదృష్టిగాదు. అవి వానిని ఇచ్ఛగింపవు అవి వానికి రుచికరమైన ఆహారమునే కోరును. సమదృష్టిఁగల జీవన్ముక్తుఁడు 'నాకు స్త్రీపురుషులలో సమదృష్టి గలద'ని చెప్పుచు స్త్రీల నందఱను ఆశ్లేషింపఁడు. 'నాకు అన్నమందును, అమేధ్యమందును సమదృష్టి కలద'ని పలుకుచు అతఁడు మలపదార్థమును తినఁడు. 'నాకు నోటి యందును, ముడ్డి యందును సమదృష్టి కలద'ని వచించుచు అతఁడు గుదము గుండ భుజింపఁడు.

---

♦ నాశమునొందుట, లేక వ్యత్యాసమునొందుట, లేక నియతమైన రూపము యొక్క లేమి.

† 'ఘటము ఉన్నది' అనినపుడు 'ఘట'మనెడి బుద్ధియొకటి, 'ఉన్నది' అనెడి బుద్ధి యొకటి.

దేహము, ఆత్మగ నపార్థము చేయఁబడినది. వైదాంతిక సమ దృష్టి పేరున, అల్పమేధస్కులగువారిచే పోకిరితనము చేయఁబడు చున్నది.

శ్రుతి ఇట్లు ఘోషించు చున్నది—

శ్లో॥ యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః ॥ ఈశా॥ 7.

శ్లో॥ యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥ ఈశా॥ 6.

ఆత్మయందు సర్వప్రాణులను, సర్వజీవులయందు ఆత్మను చూచు నతఁడు ఎద్దానికిని రుఝడియుఁడు.

సర్వ భూతములలో పరమాత్మను చూచువానికి మోహముగాని శోకముగాని ఎట్లుండఁ గలదు? ఎద్దానిని గూర్చియైన నెట్లు భయపడును?

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ గీత॥ VI-29.

శ్లో॥ విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ గీత॥ V-18

యోగ యుక్తాత్ముఁడు సర్వజీవులందు ఆత్మను, ఆత్మయందు సర్వజీవులను చూచును. సర్వత్ర ఒకదానినే చూచును.

విద్యావినయ సంపన్నుఁడగు బ్రాహ్మణుని యందును, ఆవు నందును, ఏనుగు నందును, కుక్క యందును, చండాలుని యందును ప్రాజ్ఞులు ఒకే యాత్మను చూచి, సమదృష్టిని గలిగియుండురు

సర్వ ప్రాణులయందును ఒకే యాత్మను కనుము. ఇది సమదృష్టి.

నీవు భావనాద్వైతముఁ గలిగియుండఁగలవు. నీవు క్రియాద్వైతముఁ గలిగియుండలేవు. మూడుసేరుల పాలుండి, ఒక ఆశ్రమములో ఇరువదిమంది ఆశ్రమవాసు లున్నచో, ఆమూడుసేరుల క్షీరమును ఆఱుగురు రోగులకే ఈయవలెను.



# ★ యజ్ఞము ★

సింహాద్రి శత్రుఘ్నులుశ్రేష్ఠి, హీరమండలం, శ్రీకాకుళం జిల్లా.

★

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్. 3:13

యజ్ఞ శేషమును భుజించు సత్పురుషులు సర్వపాపముల నుండి విముక్తులగుచున్నారు. ఏ పాపాత్ములు స్వభుక్తమునకై వండుకొనుచున్నారో, వారు పాపము లనుభవించుచున్నారు గీతాచార్యుడైన శ్రీ కృష్ణపరమాత్మ యీలా చెప్పుటకు గల కారణము మానవుడు ప్రతినిత్యము సంపాదించెడి సంపాదనయం దేదైన యొక దోషముండియే తీరును. తాను చేసెడి ప్రతిపనియందును యేదోయొక విధమగు హింస కూడ జతకూడియున్నది. మరియు, 1. దంచుట, 2. నూరుట, 3. నిప్పంటించుట, 4 జలముపయోగపరచుట, 5. తుడుచుట యీయైదు పనులొనర్చునపు డప్రయత్నముగ కొన్ని జీవులు మడియుచున్నవి. యీ పంచవిధ పాపము లనివార్యములు. అడుగడుగునను మానవుడు పాపము నాచరించుచునే యున్నాడు. ఇవి స్వల్పదోషములని యుపేక్షించక ప్రతినిత్యము బ్రహ్మ, పితృ, దేవ, భూత, అతిథి అను పంచవిధ యజ్ఞము లొనర్చి యజ్ఞ శేషము భుజించిన సర్వదోష నివర్తియు చిత్తశుద్ధియు కలిగి విజ్ఞాన మొదవును. ఇంతియేకాదు. పై యజ్ఞములు చేయనివారి యశప్రజ్ఞాధనములు క్షీణించును.

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్. 3:10

సృష్టికాలమున ప్రజాపతియైన బ్రహ్మదేవుడు యజ్ఞములతో గూడినవారిగా ప్రజలను సృష్టించి యీ యజ్ఞములచేత వృద్ధి జెందుడు, యీ యజ్ఞములే మీ కోరిక లిచ్చునవి యని ఆదేశించి యున్నాడు. యజ్ఞమువల్లనే సర్వసస్యములకు జీవనాధారమైన వర్ష

రూపమగు మేఘ ముత్పన్న మగుచున్నది. భగవదారాధన చేయక భుజించువారు పాపులు, చోరులు గాన భగవత్ప్రీతిగా యజ్ఞము లాచరించుట మానవుల ధర్మమైయున్నది.

కొందరు మూఢులు బలియనుపేర శక్తి నారాధించెదరు. హింసాత్మకమైన యజ్ఞములు చేయకూడదు. ప్రేమస్వరూపిణియగు జగన్మాత తన సంతానమును హింసించుట సహించుననుట సత్యముకాదు. సర్వజీవులు సర్వేశ్వర సంతానమని తెలియక సహజన్ముల హింసించుట వివేకశూన్యము. గీత నాల్గవ అధ్యాయమైన జ్ఞానయోగమందు శ్లో॥ 25 నుండి శ్లో 30 వరకు పదునాలుగు విధములగు యజ్ఞములు భగవానుడే తెలిపియున్నాడు. అందొక్కటియు హింసాకరమైనది కానరాలేదు. పై యజ్ఞములను నిష్కామబుద్ధితోను పరమేశ్వరార్పిత భావముతో నొనర్చినయెడల పాపక్షయము మనోనిర్మలముకలిగి క్రమముగా ముక్తి పొందుదురు.

అపార కరుణామూర్తియగు గీతాచార్యుడు బీదభక్తులయెడ దయగలవాడై "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" (10:25) యజ్ఞము లన్నిటిలో నాత్మధ్యాన పరమగు జపయజ్ఞము సర్వోత్కృష్టమని తెలిపియున్నాడు. ఇయ్యది సర్వులు చేయదగిన మహాయజ్ఞము.

శ్లో॥ యే పాకయజ్ఞాశ్చత్వారో విధియజ్ఞసమన్వితాః
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం.

పాక యజ్ఞములను అగ్నిష్టోమాదులైన నిత్యనైమిత్తిక యజ్ఞములు, యితరములగు విధియజ్ఞములున్ను యీ యాత్మయజ్ఞ పరమగు జపయజ్ఞముయొక్క పదునారవ భాగములో నొక భాగమునకు సరివడవు. (అని మనుస్మృతి.)

కావున సర్వమానవులున్ను నిత్యమావశ్యకముగ ప్రణవోపాసన యను జపయజ్ఞము నాచరించవలెను.

ఓం తత్ సత్.

——o——

# ఆళ్లగడ్డ శ్రీ శంకరానందాశ్రమ

# శ్రీ శంకరజయంతి సంగ్రహ వార్తలు.



"బ్రహ్మ ముహూర్తము వేళాయె గురుదేవ-బ్రహ్మానందముతోడ మేలుకో"- అంటూ సాధుమాత సుబ్బలక్ష్మమ్మగారి నాయకత్వమున మహిళా సంఘమువారి ప్రభాతభేరితో వైశాఖ శుద్ధ పంచమీ 7-5-54 బ్రహ్మముహూర్తము నం॥ శ్రీ శంకరజయంతీ మహోత్సవాలు ప్రారంభింపబడ్డాయి. కలశస్థాపన - చంద్రమౌళీశ్వర శంకర భగవత్పాదాచార్యపూజ - అఖండ హరినామసంకీర్తన - ఉపనిషత్ పారాయణాది కార్యక్రమాలు ఆరంభింపబడిన తర్వాత శ్రీ రామకృష్ణానంద స్వామివారు సామూహిక గీతాపారాయణమును ప్రారంభించినారు. 8 గంటలకు ఉపన్యాస కార్యక్రమాలు ఆరంభింపబడ్డాయి. కాళహస్తి కైలాసాశ్రమాధిపతులు - శ్రీ గీతాప్రబోధ సంఘాధ్యక్షులు నగు శ్రీ శ్రీ శ్రీ పూజ్యపాద నిత్యానందస్వాములవారు గతసంవత్సరము వలెనే సభాధ్యక్షపదవి నలంకరించినారు. ఆశ్రమాధ్యక్షులు పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శంకరానంద స్వాములవారు స్వాగతోపన్యాసాన్ని ప్రారంభిస్తూ, తాము శ్రీశంకర జయంతీ మహోత్సవాలను నిర్వర్తించే పరమోద్దేశ్యం జగద్గురుని అద్వైత సిద్ధాంతాన్ని లోకంలో ప్రచారం చేయుటే యనియు, ప్రపంచానికి శాంతి లభించాలంటే అద్వైత సిద్ధాంతమే శరణ్యము యనియు ప్రబోధించారు. అధ్యక్షులగు శ్రీ నిత్యానందస్వాములవారు తమ ప్రారంభోపన్యాసాన్ని యీ విధంగా ఆరంభించినారు.

"ఆది శంకరాచార్యులవారి జన్మ కాలమును గూర్చి భిన్నభిన్న అభిప్రాయాలు కలవు. క్రీస్తుపూర్వమే జన్మించారని కొందరి తీర్మానం. 8-వ శతాబ్దములో శంకరులు జన్మించినారని మద్రాసు విశ్వవిద్యాలయము వారి నిశ్చయము. క్రీ॥ శ॥ 789 వ సంవత్సరమున ఆ ది శ ం క రు లు జన్మించినట్లు శ ం క ర వి జ య గ్రంథకర్త నిరూపించినారు. ఎవరెట్లు చెప్పినా 1066 సంవత్సరాలక్రితమే కేరళదేశమున కాలడి అనే అగ్రహారంలో శ్రీ శంకరాచార్యులవారు జన్మించినారు. 7 వ సంవత్సరంలో సర్వశాస్త్రపారంగతులై 9 వ సంవత్సరమున గీతోపనిషత్తులకు భాష్యాలు వ్రాసి 12 వ సంవత్సరమున బ్రహ్మసూత్రాలకు శారీరక భాష్యాన్ని విపులంగా వ్రాసి 16 వ సంవత్సరమున భారతదేశమంతా తిరిగి అద్వైతమత స్థాపనచేసిన శ్రీ శంకరులవారిని గూర్చి యెంత చెప్పినా తక్కువే."

అధ్యక్షులవారి తొలిపలుకులు ముగిసిన తర్వాత 8½ గంటలనుండి 10 గంటలవరకు శ్రీరామకృష్ణానందులవారు భాగవతమునందు "పరీక్షిత్తుని విరక్తి" అనే శీర్షికపై అద్భుతముగ ఉపన్యసించారు. తదనంతరము ఉపనిషత్ గీతాధ్యాయి - ఏకసంధాగ్రాహి

యున గు శ్రీ అశేషానందస్వామివారు ఈశావాస్యోపనిషత్తు నందలి ప్రథమ మంత్రమునుగూర్చి విపులముగ ప్రబోధించిరి. శ్రీ శంకరానంద స్వామివారి మాటలతో ఆ పూట కార్యక్రమము ముగిసింది.

సాయంకాలము 4 గంటలనుండి సాధు శివారెడ్డిగారు జ్ఞానయోగమునుగూర్చి అర్ధ గంటసేపు ప్రసంగించారు. బ్రహ్మశ్రీ మల్లికార్జునశాస్త్రిగారు వేదములయొక్క ప్రభావాన్ని గూర్చి ఉపన్యసించారు. పిదప శ్రీ గీతానందగారు అర్జునవిషాదయోగాన్ని అభినయ పూర్వకంగా ప్రదర్శించినారు. బ్రహ్మశ్రీ కామినేనిపల్లె పుల్లయ్యగారి నామసంకీర్తనతో ఆ రోజు కార్యక్రమం ముగిసింది.

8—5—54 బ్రహ్మముహూర్తంలో యథాప్రకారం నగర సంకీర్తనము జరిగిన తర్వాత శ్రీ అశేషానందస్వామివారు సామూహిక గీతాపారాయణాన్ని ఆరంభించారు. చివరి రోజువరకు గీతాపారాయణము వారివల్లనే జరుపబడింది. 8 గంటల నుండి ఉపన్యాసాలు ఆరంభమైనాయి. అధ్యక్షులవారు శ్రీ శంకర జగద్గురు దిగ్విజయమునుగురించి ప్రారంభోపన్యాసంచేశారు. అనంతరం శ్రీ రామకృష్ణులు 'భాగవత పరంపర' అనే విషయముపై గంటసేపు మాట్లాడినారు. శ్రీ అశేషానందస్వామివారి ఉపనిషత్ ప్రవచనముతో శ్రీమతి కమలాక్షమ్మ (శ్రీ కృష్ణగీతాశ్రమం—ప్రొద్దటూరు) గారి పతివ్రతామాహాత్మ్యమనే ప్రసంగముతో ఆ పూట కార్యక్రమం ముగిసింది.

సాయంకాలము పూజ్యపాద శ్రీ శుద్ధ చైతన్య స్వామివారు ఆత్మానందమును గూర్చియు, బళ్ళారి సాధు లక్ష్మీనరసింహ శర్మగారు గీతా సందేశాన్ని గూర్చియు మాట్లాడినారు. గీతానందగారి గీతాభినయముజరిగింది. అధ్యక్షులగు శ్రీ నిత్యానంద స్వామిగారు మాట్లాడ్తూ నవీనకాలములో గీతను ప్రచారము చేయుటకు తగిన అద్భుత సాధనము గీతాభినయమనియు, పూర్వాచార పరాయణులకు యిది గిట్టకపోయినను ఫరవాలేదనియు ప్రబోధించారు.

9—5—54 ప్రాతఃకాలమందు నగర సంకీర్తనము — గీతాపారాయణము యెప్పటివలె జరిగింది. 8 గంటలనుండి ఉపన్యాసాలు ఆరంభమైనాయి. శ్రీ రామకృష్ణస్వామివారు 'శుకబోధ' అనే విషయంపై అత్యద్భుతంగా ప్రసంగించారు. శ్రీ శుద్ధచైతన్య స్వామివారు ఆత్మైకత్వమును గూర్చి అపూర్వోపన్యాసం జరిపారు. మాతృశ్రీ చిన్నమ్మగారి ఉపన్యాసంతో అధ్యక్షుని మాటలతో సభముగిసింది.

సాయంకాలం, శ్రీ అశేషానందస్వామివారు ఉపనిషత్తునందలి నిష్కామ కర్మయోగాన్ని ప్రవచించినారు. శ్రీసాధు లక్ష్మీనరసింహశర్మగారు గీతాసందేశాన్ని ప్రబోధించినారు. శ్రీ శంకరానందస్వాములవారు గీతామహిమను ముచ్చటించారు. గీతానందగారి గీతాభినయముతో అధ్యక్షులవారి ప్రసంగముతో సభాకార్యక్రమం ముగిసింది.

10—5—54 ఉదయం శ్రీ రామకృష్ణగారికి అస్వస్థత యేర్పడుటతో భాగవతమందలి ధ్రువోపాఖ్యానమును శ్రీసాధు లక్ష్మీ

నరసింహాశర్మగారు మృదుమధుర మంజులముగ ఉపన్యసించినారు. తర్వాత శ్రీ అశేషానందస్వామివారు కేనోపనిషత్ ప్రవచనము కావించారు.

సాయంకాలం సాధుమాత సుబ్బలక్షుమ్మగారి సంకీర్తనముతో కార్యక్రమం ఆరంభమైంది. సాధు శివారెడ్డిగారు జ్ఞానయోగాన్ని గూర్చియు, సుబ్బలక్షుమ్మగారు భక్తియోగాన్ని గూర్చియు, సాధు లక్ష్మీనరసింహాశర్మగారు సర్వమత సమన్వయాన్ని గూర్చియు, ఉపన్యసించినారు. శ్రీగీతానంద గారి గీతాభినయంతో, శ్రీ కుమారి లక్ష్మీదేవి గారి గీతాహారతితో కార్యక్రమంముగిసింది.

11-5-54 ప్రాతఃకాలము గీతాపారాయణానంతరము శ్రీ శంకరానందస్వామివారు విశ్వరూప సందర్శనాధ్యాయమందలి తత్త్వరహస్యాలను గూర్చి అద్భుతముగ ఉపన్యసించినారు.

8 గంటల నుండి సాధు లక్ష్మీనరసింహశర్మగారి భాగవత కాలక్షేపమును, శ్రీఅశేషానంద గారి ఉపనిషత్ ప్రవచనమును, శ్రీ శంకరానందులవారి గీతోపన్యాసమును జరిగినవి.

సాయంకాలం కుమారి లక్ష్మీదేవమ్మ గారి గీతాగానంతో కార్యక్రమం ఆరంభమైంది. ధర్మవరం హఠయోగాశ్రమాధిపతులు రాప్తాడు సుబ్బదాసుగారు శ్రీ శంకరవిజయమును గూర్చియు, సాధు లక్ష్మీనృసింహాశర్మగారు గీతా సందేశమును గూర్చియు, శ్రీ శంకరానంద స్వామివారు ఆత్మజ్ఞాన నిరూపణమును గూర్చియు మాట్లాడినారు. గీతానందగారి అభినయముతో అధ్యక్షుని చివరి మాటలతో నామసంకీర్తనముతో సభ ముగిసింది.

12-5-54 తేది భాగవతమందలి గోపికా తత్త్వాన్ని గూర్చి శ్రీరామకృష్ణానందస్వామిగారు ఉపన్యసించినారు. శ్రీ అశేషానంద గారు కృష్ణోపనిషత్తును ప్రవచించారు. శ్రీ శంకరానందస్వామివారు సాంఖ్యయోగములోని ఆత్మజ్ఞాన నిరూపణమును గూర్చి ఉపన్యాసం జరిపినారు.

సాయంకాలం సాధు లక్ష్మీనృసింహశర్మగారి శ్రీశంకరానంద స్వామివారి ఉపన్యాసాలు జరిగినవి. అధ్యక్షుని అంత్యోపన్యాసంతో కార్యక్రమం ముగిసింది.

13-5-54 ప్రభాతకాలంలో నగర సంకీర్తన - గీతాపారాయణముల అనంతరం ఉపన్యాసాలు ఆరంభింపబడ్డాయి. శ్రీ రామకృష్ణగారు ఉద్ధవగీతను ప్రవచించారు. శ్రీ శంకరానందస్వామివారు గీతోపన్యాసం జరిపారు. సభాధ్యక్షులు అంత్యోపన్యాసమును మహోద్భటంగా నెరవేర్చి సభను ముగించారు. చివరికి శ్రీ శంకరానందస్వామివారి ధన్యవాదసమర్పణంతో నామసంకీర్తనముతో మంగళహారతితో ప్రసాదవినియోగంతో సప్తాహ కార్యక్రమం ముగిసింది.



# శ్రీ భగవద్గీతా సారము.

రచన: శ్రీ బి. వేంకటకవిగారు, కాకినాడ.

★

[ భాగవతుల యాజిగారిచే రచింపబడి సుప్రసిద్ధమైయుండు గీతార్థసార సంకీర్తనమునకు అనుకరణమై ఉంది. — సంపాదకుడు.]

శంకరాభరణ రాగము — ఆటతాళము

## ప్రథమాధ్యాయము - అర్జున విషాదయోగము.

1. భగవద్గీతార్థమువినుము । జీవ । భగవత్కారుణ్యముగనుము ।
జగములో కృష్ణుండు । తగపార్థునకు గీత ॥ సొగసుగదెల్పిన ॥
విగతవైరమునెంచి॥ మి॥ మిగులపాపము జ్ఞాతివధచే ।
నగునుగావున యుద్ధమునునే। పగిదినైనను జేయననుచు ।
పగవిడిచి ఫల్గుణుడుపల్కెను ॥భగ॥

## ద్వితీయాధ్యాయము — సాంఖ్యయోగము

2. యుద్ధమొనునిల్చిపార్థుడు ।మంచి। బుద్ధియోచించె
సమర్థుడు॥ సద్ధర్మపరులు ప్రసిద్ధసమర్థులు। నుద్ధరించెడు
నట్టిపెద్దపిన్నలునెన్న ॥మి॥ బుద్ధిమంతులు। ధీయుతులు
పరి । శుద్ధులను సిద్ధులనునిప్పుడు। యుద్ధమునకడతేర్చ ।
ననిరొయెడు । పద్ధతినిధనువిడిచెపార్థుడు ॥భగ॥

## తృతీయాధ్యాయము — కర్మయోగము.

3. తనువునుండదు భూమినెప్పుడు ।జీవ। మునునాశమొందద
దెాకప్పుడు॥ వినునిజాసనయోగమునను గూర్చుని ముక్కు
కొనను గురినిల్పియు। మనసునేకాగ్రము ॥మి॥ ననువుపర
చియునాశరహితము। ఘనముగను సమమై విశారము ।
దునిమికోర్కెలు గడచిబొందుము। జనన మరణము ।
మనము రహితము ॥భగ॥

## చతుర్థాధ్యాయము — జ్ఞానయోగము

4. కర్మవలన బుట్టెజీవుడు ।భువిని। కర్మకుడు పగజేయు
దేవుడు ॥ కర్మవిడుచుటవశము। గాదునెవరికైన ।

కర్మయే సుఖదుఃఖకారణంబై యుండు ॥మి॥ నిర్మమత నిర్మోహనిష్క్రియ। నిర్మల జ్ఞానంబునిల్పి। మర్మకర్మం బులనుమరచిన। కర్మరహితంబగునుఫల్గుణ ॥భ గ॥

పంచమాధ్యాయము — కర్మసన్యాసయోగము.

5. నేనునీవను తెలివి సర్జునా ।కర్మ। జ్ఞానముల ఫలవిసర్జనా మానకవిధియైన। తాను జేసెడికర్మ। పూనికసద్గురు, జ్ఞానికిసర్పించి ॥మి॥ లేనివన్నియు నున్నవనియ। జ్ఞాన కల్పితమయ్యెగావున। హీనఘనమును। హీంససుఖమును మానము అవమానమొకటని ॥భ గ॥

షష్ఠాధ్యాయము — ఆత్మసంయమయోగము.

6. త్యాగయోగమె ముక్తిమార్గము ।రాజ। యోగమెమోతు సన్మార్గము॥ రాగద్వేషాదులు రాహిత్యమొనరించి। యోగ బలముచేత। వాగాదింద్రియములు ॥మి॥ ఆగివిషయము లందునసం। భోగకర్మల భోక్తగాకను॥ యోగప్రాణా మానసముసం। యోగమున బ్రహ్మమును బొందుము.

సప్తమాధ్యాయము — జ్ఞానవిజ్ఞానయోగము.

7. మనసు నిర్మలమున నుంచుము ।పార్థ। ఘనజ్ఞానదీక్ష వహించుము ॥ వినుము సిద్ధాసనమున యోగమందుండి। అనువై నభ్రాంతులు। పనిగొనిపట్టుగ ॥మి॥ దునిమిసంక ల్పములువిడిచి। మనసు పవనముచూపు గుఱియును। నెనసియేకము జేసినంతనె। ఇనునిరీతిగ గనుముతేజము।

అష్టమాధ్యాయము — అక్షర పరబ్రహ్మయోగము,
లేక తారకయోగము.

8. అన్నితానను అజ్ఞానము ।చూడ। వన్నియుబ్రహ్మ విజ్ఞానము ॥ యున్నదిలేనిది। కన్నదివిన్నది। అన్నియియా జగమున। వన్నెచిన్నెలుమిన్ను ॥మి॥ అన్ని పూసలమధ్య దారము। నున్నరీతిని నుండినంతట। నన్నునమ్మి నుతిం చువారల నెన్నివిధములనన్ను జేర్చెద ॥భ గ॥

నవమాధ్యాయము — రాజవిద్యా, రాజగుహ్యాయోగము.

9. యోగిజీవము విడుచునప్పుడు ।ధ్యాన। యోగము ప్రణవ
మెల్లప్పుడు। బాగుగజీవాత్మ పరమాత్మలోనిల్పి ।
త్యాగియై విషయవి। రాగియై భూమధ్య ।మి। లోగతిని
సహస్రారబిలమను। రాగమునభేదించి యంతట। వేగమే
బ్రహ్మమును బొందును। లోగురిని తను మాయగడచి ।భగ।



(సశేషం.)

# వార్తలు.

— గీతాగాన ప్రదర్శనము —

దేవాలయ పత్రికా సంపాదకులు - గీతాగాన రచయితలు రంగా చిన్నచలమయ్యగారును, వారి కుమార్తె చిరంజీవి కుమారి లక్ష్మీదేవమ్మగారును, అనంతపురం జిల్లా తాడిపత్రి పట్టణమునందు శ్రీకన్యకాపరమేశ్వరీ దేవస్థానములో ఏప్రెల్ 4, 5, 6 తేదీలు రాత్రి 8-30 నుండి 10-30 వరకు గీతాగాన ప్రదర్శనము జరిపినారు. ప్రదర్శనము జయప్రదముగ జరిగినది.

ఆళ్ళగడ్డ శ్రీ శంకరజయంతి సప్తాహ మహోత్సవములు ముగిసిన తర్వాత శ్రీ శంకరానంద స్వామివారును, శ్రీ స్వామి రామకృష్ణగారును 15-5-54 తేది బళ్లారి చేరినారు. బళ్లారి శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానమునందు శ్రీ గీతాప్రచారక సంఘమువారి ప్రథమ వార్షికోత్సవములు 13-5-54 నుండి 17-5-54 వరకు శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందస్వామివారి అధ్యక్షతతో జరిగినవి. 15, 16, 17 తేదీలలో శ్రీ శంకరానంద రామకృష్ణులు పాల్గొని చిత్తూరు జిల్లా చట్టివారిపల్లె చేరినారు.

19-5-54 నుండి 25-5-54 వరకు చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకా చట్టివారిపాళెం శ్రీపోలిరెడ్డిగారి మఠమునందు గీతాసప్తాహము జరిగినది. పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శాంతానందస్వామివారు అధ్యక్షత వహించినారు. శ్రీశంకరానందస్వామిగారి హిందీ ఉపన్యాసాన్ని శ్రీరామకృష్ణగారు అనువదించినారు.

5-6-54 నుండి 12-6-54 వరకు హిందూపురమునందు నూతన ఆశ్రమ ప్రారంభోత్సవ సప్తాహము జరిగినది. శ్రీ శంకరానందస్వామిగారు బెంగుళూరు నుండియు శ్రీ రామకృష్ణస్వామిగారు ప్రొద్దుటూరునుండియువచ్చి చేరుకున్నారు.

హిందూపురమునందలి కార్యక్రమము ముగిసినంతట శ్రీ శంకరానందరామకృష్ణులు 16-6-54 తేదికి పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లు చేరుకొంటారు. ఆ ప్రాంతంలో 8-7-54 వరకు ఉండగలరు.

★

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ నేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తోమంద్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10 డాక్టర్ రత్నంగారు, ఆళ్లగడ్డ. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీ బొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్ఘనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్ పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాధంరెడ్డిగారు, కాటుకానూరు, కణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెందుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పెట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెర. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటీ.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం. కరీంనగర్ జిల్లా.

32 గ్రంధె నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

